శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## కాకినాడ

రెండు నెలల కొకసారి ప్రకటింపబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము ౩౮. | వికృతి. చైత్ర-భాద్రపదములు | సంచిక ౧-౩.



కాకినాడ

[illegible] గ్రంథాలయమున ప్రకటింపబడినది.

చందా, పోస్టుఖర్చులతో సంవత్సరమునకు రు ౩-౦-౦.

19౫0-51.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## కాకినాడ

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

సంపుటము ౩౯.

వికృతి.

చైత్ర-భాద్రపదములు

సంచిక ౧-౩.



కాకినాడ

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు ౩-౧-౦.

1950-51.

# వికృతి సంవత్సరము.

# 1950—51

# చైత్ర-భాద్రపదములు

## విషయసూచిక.

# స్వవిషయము.

ఈ సంచికయందు నిశ్శంకు కొమ్మన విరచితమగు శివలీలా విలాసము ద్వితీయాశ్వాసాంతము వఱకు ముద్రింపఁబడినది. అవతారికాభాగము మాకు లభించి యుండలేదు. భాషాభిమానులు అవతారికను మిగిలిన గ్రంథభాగమును మాకు బంపఁగలిగినచో దానిని సాదరముగ స్వీకరించి ప్రకటింతుము. అసంపూర్ణమైనను దొరకిన గ్రంథభాగమును పాఠకుల కందఁజేయు నుద్దేశముతో దీని బ్రకటించితిమి.

ఈ సంచిక వెలువడుట గొన్ని కారణములచే నాలస్యమైనది. అందులకు సహృదయులైన పాఠకులు క్షమింతురుగాక.

# గ్రంథ స్వీకారము.

1. అధ్యాత్మ సంకీర్తనలు (2, శ్రీ అన్నమాచార్యోత్సవక్రమము. శ్రీ తిరుపతి వెంకటేశ్వర ఓరియంటల్ ఇన్‌స్టిట్యూట్ వారిచేఁ బ్రకటితములు. శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులు క్రీ. శ పదునైదవ శతాబ్దిలో తిరుపతిలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి సన్నిధిని నివసించి యుండి దినమున కొక్కటిగ గావించిన సంకీర్తనలు రాగిరేకులపైఁ జెక్కింపఁబడినవి. వానిని కీ. శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిశోధించి శ్రీ తాళ్ళపాకవారి సంకీర్తనల యోగ్యతను లోకము గుర్తించునట్లు సంపుటములుగ ముద్రించియున్నారు. అట్టి సంపుటములలో నిది మొదవది. భక్తిశృంగారరసములు ప్రధానములుగ నీ కీర్తనలను రచియించి గానముచేసి తరియించిన అన్నమాచార్యుని ప్రాశస్త్యము లోకమునకు వెల్లడియగుటకును, ఆయా కీర్తనలను వ్యాప్తిలోనికిఁ గొనివచ్చుటకును, నుద్దేశించి 1949 సం॥రము ఏప్రిల్ 2,3, 4 తేదీలలో శ్రీ అన్నమాచార్యోత్సవము ప్రప్రథమముగఁ జరుపబడినది. చెన్నపట్టణము హైకోర్టు ప్రధానన్యాయమూర్తులు,

శ్రీ పి. వి. రాజమన్నారుగారి యాధ్యక్షతమున జరిగిన యీ యుత్సవముల క్రమము ఇంకలి రెండవ పుస్తకమున వివరింపఁబడినది. ఇందనుబంధముగ శ్రీ అన్నమాచార్యుల జీవితగాథావిశేషములు చేర్పఁబడినవి. అపూర్వములైన యిట్టి పూర్వగేయరచనలను బరిశోధించి నిర్దుష్టముగ ముద్రించిన శ్రీ తిరుపతి ప్రాచ్యపరిశోధనశాఖవారెంతయుఁ బ్రశంసనీయులు.

3. The Idea of God

4. Report of the Summer school of Hindu Religion 1949 Session at Tirumalai.

ఇందు మొదటి గ్రంథము శ్రీతిరుపతి వేంకటేశ్వర కాలేజిలో వేదాంతశాస్త్రాధ్యాపకులు డా. కె సి. వరదాచారి ఎం ఏ పి. హెచ్. డి. గారిచే రచింపఁబడినది. భగవంతునందలి యాస్తిక్యభావన వేదవేదాంతములలోను, రామానుజాదుల భాష్యములలోను నెటులున్వయించి పరిణామమందినదో వివరించుచు నాంగ్లమున నీగ్రంథము వ్రాయఁబడినది. ఆయాసందర్భములలోఁ బాశ్చాత్యవేదాంతుల యభిప్రాయములును విపులముగాఁ బరామర్శింపఁబడినవి. భగవంతుని విషయములో ప్రాచ్యపాశ్చాత్య భావములకు నిటీవల శ్రీ అరవిందయోగి మొదలగువారు వ్యాఖ్యానించిన సమన్వయపథములును నిందు విపులముగాఁ జర్చింపఁబడినవి.

ఇందు రెండవపుస్తకము శ్రీతిరుపతి ప్రాచ్యపరిశోధనాలయము యాజమాన్యమున నడుపఁబడిన "సమ్మర్ స్కూల్ ఆఫ్ హిందూ రెలిజెన్" యొక్క వార్షికనివేదిక. మదరాసు విశ్వవిద్యాలయమున సంస్కృత భాషాధ్యక్షులగు శ్రీ సి. కణ్ణన్ రాజాగారి యుద్దేశానుసారము ముఖ్యముగ చిత్తూరుజిల్లాయందును మదరాసునందును గల విద్యాలయ పండితులకు హిందూమతసిద్ధాంతముల బోధపడుటకై యీ శాస్త్రక్రమము 1949 సంవత్సరమున నెలకొల్పఁబడినది. పెక్కుపండితులచే సుమారు 75 యుపన్యాసము లిప్పింపఁబడినవి. శ్రీ వేంకటేశ్వర

ప్రాచ్యపరిశోధనాలయాధ్యక్షులగు శ్రీపరవస్తు రామానుజస్వామి గారు తమ నివేదికలో దెలిపినటుల యుపన్యాసకులు ప్రాచీనాధునాతనపద్ధతులనుగూడ గమనించి తమతమ యుపన్యాసముల గావించిరి. ఇట్టి సంస్థలను శ్రీమదరాసు దొరతనమువారు గాని యితరవిద్యాసంస్థలుగాని తమతమ జిల్లాలయందు నెలకొల్పినచో ప్రాచీనహిందూసంస్కృతి పునరుజ్జీవింపఁబడుననుట నిస్సందేహము.

5. అలంకారసంగ్రహము. అమృతానందయోగి విరచితము. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యగ్రంథమాలయందు 19 వ కుసుమము వెల రు 3-4-0.

ఇమ్మడి సంప్రదాయాలంకార గ్రంథజిజ్ఞాసువుల కత్యంతోపయోగ్యము. క్రీ శ 1887 సంవత్సరమున కలకత్తాలో నీగ్రంథమున గొంతభాగము మాత్రమే ముద్రింపఁబడినది. ప్రాచ్యగ్రంథమాలా పరిశోధకులు పెక్కుభాండాగారముల గల వ్రాతప్రతులను సంగ్రహించి పాఠాంతరములతో 11 పరిచ్ఛేదములవఱకు గ్రంథమును ముద్రింపఁగలిగిరి. ఇందలి యాపరిచ్ఛేదముల (1) వర్ణగణవిచారము (2) శబ్దార్థనిర్ణయము (3) రసనిర్ణయము (4) నేతృభేదవిచారము (5) అలంకారనిర్ణయము (6) దోషనిర్ణయము (7) సంధ్యంగనిరూపణము (8) వృత్తినిరూపణము (9) రూపకనిరూపణము (10) నాట్యాలంకార నిరూపణము (11) చాటుప్రబంధలక్షణములు గలవు. అమృతానందయోగి క్రీ శ 13 వ శతాబ్దమువాఁడని శ్రీ ఎం. కృష్ణమాచార్యులుగారు తమ సంస్కృతవాఙ్మయ చరిత్రమునందు వ్రాసియుండిరి. పీఠికాకారులును వివిధయుపపత్తులచే నాప్రాతిమ వాఁడనియే నిర్ధారణ మొనర్చియున్నారు ప్రబంధదీపికయను నామాంతరముగల లక్షణదీపికయందు పదునైదవ శతాబ్దము వాఁడగు గౌరన యీగ్రంథము నుదహరించెను. మఱియు నీగ్రంథమున దశరూపకము, నాట్యశాస్త్రము, ధ్వన్యాలోకము మొదలగు గ్రంథము లుదహరింపఁబడుటవలన

నాకాలమువాఁడనియే యూహింపఁబడినది. ఇందు రూపకోపరూపకముల వివరణసందర్భమున పెక్కు ప్రాచీన గ్రంథములు మారీచవంచనము, వాలివధ, నలవిజయము, దేవీపరిణయము మొదలగునవి పేర్కొనఁబడినవి. అవి మన కలభ్యములు. గ్రంథము మన్వ్యభూపుని యాజ్ఞానుసారము రచింపఁబడినవని తెలుపఁబడినది. ఇతను భక్తిభూపుని కొమారుఁడు ఇతని దేశకాలములు విమర్శనీయములు.

ఈగ్రంథము సాహిత్యదర్పణ, ప్రతాపరుద్రీయములవలె దృశ్యశ్రవ్యకావ్యములకు రెండిటికి నుపయోగకరములగు లక్షణముల నిర్వచింపుచున్నది గ్రంథాంతమున నుదాహృతశ్లోకసూచియు, తెలిసినంతవఱకవి యేయేగ్రంథముల గలవో వివరింపఁబడినది. ద్వితీయ పరిచ్ఛేదమున కవులు సప్తవిధములుగ దెలుపఁబడి, వారివారి లక్షణము వివరింపఁబడినది (1) శాబ్దిక (౨) వాచిక (౩) ఆర్థిక (౪) శిల్పిక (5) మార్గానుగ (6) వివేకి (7) భూషణార్థులు.

మూఁడవ పరిచ్ఛేదమున రసవిషయమును నిరూపించుచు కవి రుద్రటాదులవలె శ్రవ్యకావ్యములగూడ రసావిర్భావము కలదని నిర్వదించెను.

శ్రావ్యమాణైర్విభావాద్యైః కావ్యేషు రససంభవః దృశ్యమానైః
సదస్యానాం నాటకేషు రసోదయః.

(పరి-శ్లో 6,7)

ఈ పరిచ్ఛేదమున నానందవర్ధనాచార్యుల ధ్వని ప్రశంస లేదు. అందువలన నలంకార విషయముల ధ్వనివాద మంకురింపక పూర్వమీగ్రంథము రచింపఁబడి యుండునని తోఁచెడిని, ఇంక నాయాపరిచ్ఛేదముల పెక్కు విషయములు వివరింపఁబడినవి అలంకారశాస్త్రజిజ్ఞాసువు లీగ్రంథమును సవిమర్శముగ లభ్యములగు నలంకారగ్రంథములతో బరిశీలించి వివిధవిషయముల గ్రహింతురుగాక.

# ఛందోదర్పణ విశేషములు



వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు

విద్యకు, విమర్శనాబుద్ధి వృద్ధినొసఁగు
నాంధ్రగీర్వాణ విద్యాలయమ్ము కేము
జన్మజన్మలకైనను సలుప సేవ
ఋణముదీరునె? తీరదు రేణువైన ॥

మేము "ఛందోదర్పణమును బరిశీలనాదృష్టితోఁ బఠించు సరికి గోచరమయినవిశేషముల నీ క్రిందఁ బొందుపఱచుచున్నాము- అందు మొదటిది ప్ర॥ ఆ॥ లోని 3 వ పద్యము- అయ్యదియిది-

అలఘు చతుస్సంధ్యక్షర
ములలో నై యాలుదక్క మొదలిటి రెంటన్
దెలుఁగునను హ్రస్వదీర్ఘము
లొలయును "నెఏలనంగ నోఓలనఁగన్ ॥

సరిగా ముద్రణపద్యమిట్లే యున్నయది- ఇందుఁ జివరిపాదమొక్కటియే చర్చనీయము- అందు "వక్రములు" పై పద్యభావమునకుఁ దగినరీతిని హ్రస్వములుగను దీర్ఘములుగను "నెఏలనంగ నోఓలనఁగన్" అని చూపఁబడినవి-కాని యీ నాల్గవపాదమిట్లే యున్న గణభంగము తప్పక గల్గును- ఆపాద మీక్రిందిరీతినున్న సరిపోవునని మా యాశయము-

"ఒలయును నే ఏలనంగ నోఓలనఁగన్"

ఏ ఏలు, ఓ ఓలు, అని మనము వాడుకలో మొదటిదానికి హ్రస్వోచ్చారణ నీయక దీర్ఘోచ్చారణమే యిత్తుము- ఇట్టియెడలఁ

గావ్యములందును హ్రస్వాక్షరములు దీర్ఘములుగా నుపయోగింపం దగును- ఇవ్విషయముననే శ్రీ బహుజనపల్లి సీతారామాచార్యుల వారు తమ ప్రౌఢ వ్యాకరణ సంజ్ఞాపరిచ్ఛేదమునఁ "గారేఫప్రత్యయములు రానప్పుఁడు హ్రస్వములు దీర్ఘములగును" అనుచుఁ దెల్పినారు. కారప్రత్యయము వచ్చునెడ "అకారమున కుకారగము వచ్చు" అనియుండు- కారప్రత్యయము రానితరి "ఆకూవచ్చు" అనియుండును పైపద్యములోఁ గారప్రత్యయ ముపయోగింపఁబడి "ఎకార మేకారములనఁగ నొకార మోకారములనఁగ" ననునట్లు లేమిగావున "నే ఏలనంగ నోఓలనఁగన్" అని యుండవలయుననియు నప్పుఁడు గణభంగ మొదవదనియు మాయాశయము- ఇంతియకాక యిట్టి పద్యమ్మెుండు "కవిజనాశ్రయ" మ్మందును నున్నయది-

ఆఆలై ఔలకు మఱి
ఈఈలు ఋకారసహిత మేఏలకునో
ఊఊ ల్తమలో నొడఁబడి
ఓ ఓలకు వళ్లగు న్నయోన్నతచరితా ॥

సంజ్ఞాధికారము-

ఇందును విషమపాదాద్యక్షరములు వాస్తవమునకు హ్రస్వములే యైనను బైన నిరూపించినవిధమునం దీర్ఘములైనవి- లేనియెడల గణభంగ మొదవెడిది- ఈకవిజనాశ్రయమును జూచియే యనంతుండును నట్లు పైనవ్రాసెనని మాయాశయము- "అనంతుఁడు కవిజనాశ్రయము నెఱింగినట్లు దోఁచదన్న శ్రీ గిడుగు సీతాపతిగారి ఛందోదర్పణోపోద్ఘాత భావముతో నేకీభవింపఁజాలము, ఇప్పుఁడు మేము చర్చించిన యీ చిన్నివిషయము అనంతుఁడు కవిజనాశ్రయము చదివి దాని ననుకరించెనని ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో నిరూ

పించుచున్న శ్రీ రావూరు దొరసామి శర్మగారికిఁ గించిత్సాహాయ్యకారిగాఁ గలదు-

పై పద్యమ్ము వంటిదే "ఛందోదర్పణము" న మఱియొకటున్నది- చతుర్థాశ్వాసము- 109 వ పద్యము-

తనరఁగ అ ఆ ఇ ఈ
లనఁగా ఉ ఊ లునాఁగ నంబుజదళలో
చన ఋఋూలన ఓ ఔ
లనఁగ నజంతాహ్వయంబులగు నీ పదియున్॥

ముద్రణప్రతిలో నిట్లే యున్నదిగాని పై పద్యములనుంబలె హ్రస్వాచ్చులు దీర్ఘాచ్చులు గావలెను- లేనియెడ గణభంగ మొదవుననుటలో సందియము లేదు.

"తనరఁగ అ ఆ ఈ ఈ
లనఁగా ఊ ఊలు నాఁగ నంబుజదళలో
చన ౠ ౠ లన ఓ ఔ
లనఁగ"- నని యుండవలెను-

కవిజనాశ్రయపద్యముక్రింద "ఈ పద్యంబున అఆ-ఇఈ-ఉఊ-ఎఏ-ఒఓ-అనుచోట్ల ద్వితీయాక్షరంబులు ద్విత్వాక్షరంబులవలె నుచ్చరింపఁబడును గావున వానిముందున్న హ్రస్వములు గురువులగునని శ్రీజయంతి రామయ్యగారు వ్రాసిరి గాని సరికాదని మనవి-

రెండవది సంయుక్తయతిలోని బహుయతినియతి విషయమైనచర్చ- అనంతుండు బహుయతినియతిని దన గ్రంథమున నిట్లు దెల్పియున్నాఁడు-

క॥ ఒక్కెడుగున విశ్రాంతులు
పెక్కగుచో సంయుతములు పెనుపకమును జ
డ్డక్కరమునఁ దానెత్తిన
యక్కరమేయునుపవలయు నన్నిటఁ గృష్ణా!

క॥ వడి నెలవులలోఁ జేరువ
యెడనొక సంయుతము నొలయెడ నొకటినిఁ దా
రిడి రేని కవులుతప్పట
యొడఁబడదు పృథగ్యతి ప్రయోగములహరీ!

ఛందో...ప్ర॥ ఆ॥ 108–109.

మూఁడునాలుగు యతులుండు పద్యములలో విరామస్థానమ్మున సంయుక్తమువచ్చిన నొకట నొకటియు మఱియొకటనొకటియు నిడ రాదని భావము- పై పద్యములో ననంతుండు సంయుక్తములకే యీ నియమముం బెట్టినాఁడు- ఉదాహరణములు గూడ 110–111 పద్యములలో సంయుక్తములకే యిచ్చినాఁడు- పరిశీలింపఁగా రెండు యతులను వేయుటకు వీలైన "అనంత- నాయక- నృ" మొదలగు వాని కీనిషేధ మాతఁడు చెప్పలేదనియే తోఁచెడి- అనంతలో నకార మునకును (అచ్చు) నకారమునకుమ (హల్లు) యతులు వేయవచ్చును. ఇట్లే నాకాదులు- అప్పకవి చెప్పిన యుభయవళులన్నింటికిని ననంతుని మతమున నజ్ఝల్లులలో దేనికైనను జెందవచ్చును- నృ ఇత్యాదులలో ఋకారమునకును యతి వేయవచ్చును వ్యంజనమునకును వేయవచ్చును- ఈ "నాక–నృ" మొదలగువానికి సంయుక్తములకుఁ బెట్టిన నియమము పెట్టలేదు సరికదా తాను బ్రయోగించియుఁ జూపినాఁడు- తిలకింపుఁడు–

జయభద్రరగడ:—

శ్రీకినొడయుండనఁగఁ జిత్తజుని గురుఁడనఁగ
శేష శయనుండనఁగఁ జెలువుగఁ జతుర్భుజుఁడు
నా కౌకసుల నేలునముచిసూదను పూజ
నతఁడు దాఁగైకొన్న నందగోపాత్మజుఁడు ॥

ఛందో॥ ద॥ తృ॥ ఆ॥ 57.

రెండవపాదమునఁ గల నాల్గు యతులలోను మొదట 'నాక' లోని నకారమునకును, "నముచి" లోని నకారమునకును దరువాత (పూజన్) "అతఁడు" లోని అకారమునకును "నాక" లోని (న+అక) అకారమ్మునకును, దరువాత "నాక" లోని నకారమ్ము నకును "నంద" లోని నకారమునకును యతులున్నయవి- ఇందొక్క- యెడ నజ్విరామము మిగిలినయెడల వ్యంజనవిరామములు నున్న యవి- మఱియొక్క-టి-

మంగళ మహాశ్రీయను వృత్తము:—

చిత్తములఁ జూపులను జిత్తజుని తంత్రిపయిఁ
జెంది గజదంతి యతులొందన్
నృత్తములతోడఁ దరుణీమణులు గాన రుచు
లింపుగను మంగళమహాశ్రీ

ఛందో॥ ద॥ ద్వి॥ ఆ॥ 115.

ఇందు రెండవపాదమున "నృ—ణీ" అని వ్యంజనయతియుఁ దరువాత "నృ—ఇం (పు)" అని స్వరయతియు నున్నయవి- వీనినిఁ బట్టియు లక్షణమ్ముంబట్టియు ననంతుండు "నృ—నాకాదులకు" బహు

యతుల నిషేధింప లేదని నిర్ణయించుచున్నాము- ఇవ్విషయమున నప్పకవి సంయుక్తములను మాత్రమే లక్ష్యములుగా నిచ్చియున్నను "నృ—నాకాదులకును" లక్షణమున నిషేధించినట్లే తోఁచుచున్న యది- ఈ క్రిందిపద్యముం బరికింపుఁడు:—

క॥ ఏకపదంబున విరతుల
నేకంబులు గల్గియుండు నేని పదాదిం
జేకొన్న లిపియె యన్నిటఁ
బ్రాకటముగ నిలుచు నీసపదములఁ దక్కన్॥

అప్ప॥ తృ॥ ఆ॥ 110.

ఈ పద్యమున సంయుక్తమని యేమియు నెత్తకుండ సామాన్యముగాఁ జెప్పినాఁడు- 111 వ పద్యములో మాత్రము సంయుక్తముల నెత్తినాఁడు- పైపద్యమువలననే "నృ" "నాక" మొదలగు వానికి నిషేధము గల్గునని తోఁచుచున్నది- నిక్కముగ నీయప్పకవ్యాదుల ''బహుయతి నియతిని'' "ఒప్పం- జరదృష్టిన్ వైరిపక్షేక్షణము సచివముఖ్య స్వపక్షేక్షణంబున్" మొదలైన ఆముక్తమాల్యదాది (4 ఆ॥ 238) గ్రంథము లతిక్రమించినట్లు నిత్యాది ప్రయోగము లుండుటం జేసి మన మంగీకరింపరాదు- అని మాయాశయము-

3 వ విషయము:—

క॥ మొదల సభంబులు రెండును
గదిసిన విభవంబు తభసగణ సంగతి రెం
ప్పదురయముల నధిక శుభం
బొదవును భయములను హానిహొందు నృసింహా!

ఛందో॥ ప్ర॥ ఆ॥ 27.

ఈపద్యము చివరిపాదమున యతి తప్పినది- "హానివొందు" ననుతరి "బొందు" పూర్వముద్రణపాఠముగాఁ (వొందుకు మారుగా) గ్రిందిభాగమున వ్రాసినారు- ఆద్యక్షరము (శుభంబు) 'ఒదవు' అని అజాదిపదముగాని (శుభం) "బొదవు" అని హలాదికాదు- అట్టియెడ "హానివొందు" అనుచో (పకారమున కాదేశమైన) 'వొ' కారమ్మునకును "ఒదవు" లోని "ఒ" కారమునకును యతి పొసఁగదు- ఇయ్యది సంస్కరణకర్తల ప్రమాదమే అనుటలో సందియ మిసుమంతయు లేదు- "హానివొందు" అనుటకుమాఱుగా "హానినొందు" అన్న సరిపోవం గలదని మాయాశయము-

4 వ విషయము:—

ఉపజాతి వృత్తము:-

పినాకికోదండము బిట్టు ద్రుంచెన్
జానొప్ప గెల్చెన్ జమదగ్ని సూనున్
అనంతసత్వుండితఁడంచు మెచ్చన్
జానైన వృత్తంబుపజాతియయ్యెన్॥

ఛందో॥ ద్వి॥ ఆ॥ 35.

ఇయ్యుపజాతి ఇంద్రవజ్ర ఉపేంద్రవజ్రల కలయికవలన నేర్పడినది- 1-3 ఉపేంద్రవజ్ర లక్షణముగల పాదములు- 2-4 ఇంద్రవజ్ర లక్షణముగల పాదములు- రెండింటికిని యతి సప్తాక్షరములమీఁదనే పైయుపజాతిలో 1-3-4 పాదములలో "పి-బి॥ అ-అం॥ జా-జా" క్రమముగా యతు లున్నవి- కాని రెండవపాదమున నెన్మిదవ యక్షరము 'ద' యైనది- మొదటియక్షరము "జా" యైనది- ఈయతి యెట్లు చెల్లును? "జా" కు జమదగ్నిలోని జకారమునకును యతియని సంస్కర్తలు భ్రమించియుందురు- ఇయ్యుపజాతియే అప్పకవీయ

ద్వితీయాశ్వాసమ్మున గ్రహించినాఁ డప్పకవి- (చూ- 131) అందును బైరీతినే యున్నయది- శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారును సంస్కరింపకపోవుట విచారణీయము- మాకీమధ్య లభించిన "అప్ప కవీయ తాళప్రతిలోమాత్రము "జానొప్పగెల్చెన్ జమదగ్ని" అను టకు మాఱుగాఁ "దానొప్పగెల్చెన్ జమదగ్ని" అనియున్నది- "దాకి" జమదగ్నిలోనిదాకి యతి సరిపడినది-అఖండవడిగాని-ఉభయ యతిగాని యగును- తాళపత్రప్రతిపాఠమే గ్రాహ్యము-

5 వ విషయము:—

అఱయనంగనుబోవుట కర్థమైన
సంధినిత్యసమాసోక్తి జరుగురెంట
నసుర వీరులనెల్ల నుక్కఱ వధించె
భానుకులుఁడు రావణుని నేపఱిచెననఁగ॥

ఛందో॥ ప్ర॥ ఆ॥ 100.

ఈపద్య మప్పకవీయమందుఁ దృతీయాశ్వాసమున నున్నపద్యము గ్రహించినామని క్రింద వ్రాయఁబడియున్నది- అప్పకవీయ వివరణ కర్తలు "అఱయనంగను" నను నెడ "అఱనసంగను" నని యుండ వలయు ననియు నిక్కముగ కీయ్యది "అఱు" ధాతువనియు దానికి నన్నంతరూపములోని (ఉక్కఱన్ లోని) "అఱన్" అనుదానిని గ్రహించి వ్రాసిన "అఱనసంగ" ననియే యుండవలెననియు "అఱ యనంగ" నని గిడుగువారి ప్రతిలో యడాగమముగా నుండుట తగనిదనియు నాక్షేపించి "అఱయనంగ" ననియే దిద్దివైచిరి- మిక్కిలి పరిశీలింపఁగా నీ రెండుపాఠములును సరియైనవి కావని తోఁచుచున్నది- "గిడుగువారి యడాగమయుత రూపము మొదటనే తగనిదిగదా!" "ఇంక నప్పకవీయ వివరణ" కర్తలపాఠముఁ బరిశీ లింతము - వారు రచియించిన పాఠమిది-

"అజ ననంగను బోవుట కర్థమైన"—అని —నిజముగాన నంతయుం డీపాఠము వ్రాసియుండడని మా యాశయము- ఏలయన నందర్భదోషము పూర్తిగా నున్నయది- "అజన్ - పోగా" అను నర్థముగల అన్నంతరూపమున కాతఁడు "పోవుట" అని భావార్థముం జెప్పఁడని మాపనతి- "అజన్" అనుదానికిఁ "బోగా" అని కాని, "పోవునట్లు" అనికాని, షష్ఠ్యర్థముం గాని చెప్పుట యుక్తము. కాని అన్నంతమునకు ధాతుభావార్థముం జెప్పుట తగనిది- దీనినిఁ బట్టి "అప్పకవీయవివరణకర్తలు" గిడుగువారిని దిద్దఁబోయి తా నొనర్చిన సవరణ నిస్సారము దోషభూయిష్ఠమునై యున్నయది యని మాయాశయము- ఇంకనట మాకుఁదోచినపాఠముం జూపుదుము- అట "అజుఅనంగను బోవుటకర్థమైన-" అని యుండవలయు నని మాయాశయము- అట ధాతువును విశేషముగా నిర్దేశించి అర్థముం జెప్పుచున్నాఁడు గాన సంధిచేయకపోయినను దోష మిసు మంతయు నుండదని మావినతి- అచట "సంధిర్నా చోద్యానతః" అనుదానిచే నిత్యసంధి చేయవలసియుండ "విశేషముగా నిర్దేశించుటం జేసి సంధిలేదు- కాని యడాగమముమాత్రము పెట్టరాదు- అది విధిగాఁ జేయవలసిన సంధినిఁ జేయలేదుగాన యడాగమ మిడరా దనుట- ఈవిషయమునకుఁ గించిత్ప్రోద్బలముగా నప్పకవీయములో నొకపద్యముం జూపుదుము.—

అప్ప అయ్య అన్న అరుసవ్వ అమ్మక్క
ఆయి యనుపదంబులదుకు సంధు
లుభయమునకుఁ జెల్లుచుండు నామాఖండ
వళులనంగనూఁదఁ బడకనైన ॥

అప్పక॥ తృ॥ ఆ॥ 221.

ఇందప్పకవియు 'అప్ప+అయ్య+అన్న+అరుసవ్వ' అను నెడ 'నార్యాంబాద్యరముల కచ్చు పరంబగుచో సంధి నిత్యమైనను విశేషముగా శబ్దనిర్దేశముం జేయుట కతనసంధి చేయలేదని మాయా శయము- ఇవ్విషయమ్మునఁ బండితవిమర్శకు లెల్లరు విషయసత్య గ్రహణ మొనర్పఁ బ్రార్థితులు- ఇట్లే యనంతుండును- అటు అనంగ'' ననియే వ్రాసియుండుననియు నయ్యాదివిసంధిదోషముగా నెంచి యజ్ఞులు దిద్దివైచియుందురనియు మాయాశయము-

6 వ విషయము:—

అనంతునిమతమున ''మాట'' లో నరసున్న యున్నదను విషయము- ఈతఁ డర్ధబిందు ప్రాసవిషయమునం జెప్పిన పద్యమందు "ట" కారమున కుదాహరణముగా

''మాటలేఁటికి మేటితాఁ బేటికనఁగ''

అనుపాద మిచ్చియున్నాఁడు- ఇందు "అనంతుఁడు" (తాఁ) ''బేటి" సంబిందుకమ్ముగను ''మాట'' నిర్బిందుకముగను నిచ్చెనని కొందఱు విమర్శకు లెంచి "ఆమహాకవికి నొపవిభక్తికటివర్ణకము అరసున్నపూర్వకమై వచ్చునని యెంచెనా ?" అనుదోషముం జూపు చున్నారు- కాని అనంతునిమతమున ''మాట'' లో నరసున్న యున్నదని మాకు గోచర మగుచున్నయది- "వీఁపు మూపులు మఱి తలమోపులయ్యె- మాఁటలేఁటికి మేటితాఁ బేటికనఁగ'' అను మాఁడునాలుగు పాదములలో ముందు సార్ధబిందుకమును దదుపరి నిర్బిందుకమును నిచ్చెననియే యెంచుచున్నాము-

ఆ॥ వె॥ అర్ధబిందుసహితమగు వర్ణమునకుఁ బ్రా
సాదియరయనిదుద యక్కరంబు
నేఁడుమనకుఁ గల్గినాఁడు లక్ష్మీనాథుఁ
డేఁటికింక నేఁడు మాఁటలనఁగ ॥

ఛందో... ప్ర॥ ఆ॥ ౩౩.

ఇందు "డ, ట" ల కనంతుఁ డుదహరించెను- డకారమునకు "నేఁడు–నాఁడు" అనునవియు "ట" కారమునకు "ఏఁటి (కి)- మాఁట" అను వాని నిచ్చెను–"ఏమి" అని మొదటిరూపము–ద్వితీయాదులం దొదవు నొపవిభక్తికతోఁ దిక దోవర్ణముంగూడ కలుపుక వాడుకలో "ఏమిటి" అను రూపము వచ్చినది- ఇదియే క్రమముగా "ఏంటి" అని యైనది–గ్రాంథికమున "ఏఁటికి" (షష్ఠ్యంతము) అనునది "ఏమిటికి" మారుగా వాడుకయున్నది–"ఏమిటికి" అనుతరి 'మి' యను నక్కరమున కరసున్న వచ్చి (దనుక-దాఁక=వెంట-వేఁటల వలె) (ఉముక-ఊఁకవలె) "ఏఁటి" కైనది-ముద్రణప్రతిలోఁగూడ ప్ర॥ఆ॥ 33 వ పద్యమునఁగల "ఏఁటికింక" అనునప్పుఁడును "మాట లేఁటికి మేటితాఁబేటికనఁగ" ననుతరి నున్న "ఏఁటి" కి లోను నరసున్న నిడినారు-ఇదియు మాయభిప్రాయమును బలపఱచుచున్నయది-పై "అర్ధబిందుసహిత" ఇత్యాది పద్యమున నరసున్న యుతములైన (టకారమున కుదాహరణముగా) "ఏఁటికి"–మాఁట" అను పదముల నిచ్చెనని మాయాశయము–అనంతుండు అర్ధబిందు సహితమైన ప్రాసాద్యక్షరము దీర్ఘాక్షరమై యుండుటకు డకార టకారములు గల పదము లిచ్చెననియు, వానిలో నరసున్న లున్నవనియు నవియే "నేఁడునాఁడు"= (3 పాదం) "ఏఁటి (కి)–మాఁట (లు)" (4 పాదం) అను పదములనియు నెంచుచున్నాము-ఏతద్విమర్శనము వలన నర్ధబిందుప్రాస కుదాహరణముగా నిచ్చిన "మాఁటలేఁటికి మేటి తాఁబేటి కనఁగ" ననుచో "మాఁట"లో నరసున్న లేదనియు (తాఁ) "బేఁటి" లో ననంతుని మతమున నున్నదనియు నని యెంచు వారి వాదము దూరాపాస్తము గాఁజాలదా? పండిత విమర్శకులు సెలవిండు–

అనంతుని ఛందము-

# మహాఁడు ముచ్చట్లు

వద్దమూడి-గోపాలకృష్ణయ్య

అనంతుండు తన ఛందోదర్పణమునఁ బ్రాసమైత్రి విషయమున

గీ॥ ళళలు రెండును నొండొంటఁగలసివచ్చు
నమరునన్యోన్యమును ఋయుతాయుతములు
బిందుపూర్వమై తమలోనఁబొందుబమలు
ప్రాసమైత్రికినిది స్వరూపంబుదెలియ॥

ప్ర॥ఆ-40

ఆ॥ వె॥ నీలవర్ణ గర్భగోళంబునందు లో
కంబులెల్లనుండు నెమ్మితోడ
శ్రీకినొడయఁ డుజ్వలాకృతి యితఁడన్నఁ
బ్రాసమైత్రియిట్లు పరఁగుఁగృష్ణ॥

ప్ర॥ఆ॥-41

అని పద్యద్వయముం జెప్పియున్నాఁడు-ఇందొక్క విషయము మిక్కిలి పరిశీలింపవలెను-ఇందు మొదటిపద్యము లక్షణమును, రెండవపద్యము లక్ష్యము నగుచున్నది-లక్షణమున మొదటిపాదమున "ల ళ" లకును, రెండవ పాదమున "ఋయుతాయుతమ్ములైన వ్యంజనములకును" మూఁడవపాదమున "బిందుపూర్వకమైన బమల" కును యతి చెల్లునని లక్షణము చెప్పఁబడినది-పైలక్షణములకుఁ గ్రమముగా రెండవ పద్యములో నున్న యొకటి, మూఁడు, రెండు, పాదములు లక్ష్యములు-"బిందుపూర్వకమై తమలోనఁ బొందుబమలు" అన్న లక్షణమును (లో)"కంబులెల్లనుండు నెమ్మితోడ"అను లక్ష్యమును బరిశీలింపవలెను-లక్షణ లక్ష్యములు విరుద్ధములు-ఇది యనంతుని "భ్రమ" అనకతప్పదు-ద్విత్వ మకారమును నెఱసున్న

పూర్వమునను న్న "బ"కారమును బ్రాసమైత్రి చెల్లునని చెప్పవలసి యుండ "బిందుపూర్వమై తమలోనఁ బొందుబమలు" అని చెప్పుట తగనిది-లక్ష్యము "కంబులెల్లనుండు నెమ్మిమ్మత్రోడ" నని "ంబు-మ్మి" అనియే యున్నది-జమిలి మావిషయము ననంతుఁడు లక్షణమున నెత్తనేలేదు-పూర్వము తాళపత్ర ప్రతులలో "కన్నియ, వన్నియ" ఇత్యాదులకు "కంనియ, వంనియ"యనియు నిట్లే 'వృక్షమ్ము, నెమ్మి' ఇత్యాదులకు "వృక్షంము, నెంమి" యనియు లేఖనావిషయ వైశే ష్యముగలదను విషయము తాళపత్రగ్రంథ పరిశోధకులకుం దెలియని విషయముగాదు-ఇట్టి వ్రాతనుగాంచియే యనంతుఁడు "బిందుపూ ర్వమై తమలోనఁ బొందు బమలు" అనిచెప్పి "కంబులెల్లనుండు (నెంమి) నెమ్మిమ్మత్రోడ" నను లక్ష్యమిచ్చెననుట విచక్షణులకుఁ దోపకపోదు-అది ప్రమాదమనక తప్పదు- ఈ ప్రాసవిషయమున నప్పకవి చెప్పిన పద్యము మిక్కిలి యుక్తమైయున్నది-అదియిది-

తే॥గీ॥ గట్టిబిందువుమీఁది బకారమునకు
జమిలిమూప్రాసమైత్రినా జరుగుచుండుఁ
గమ్మతావులవెదచల్లు నంబుజములు
శంబరారాతిచేతి వాలమ్ములనఁగ

అప్ప-క-తృ-ఆ-343

—ఛందోదర్పణ ద్వితీయముద్రణ పీఠికఁ—

తత్పరామర్శనము

ఛందోదర్పణ ద్వితీయముద్రణ పీఠికలో ననంతుని ఛందముం గుఱించి శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు వ్రాసిన కొన్నివిషయ ములతో నే నేకీభవింపఁజాలకున్నాను-వానిం దెలియఁ జేతు-

"ప్రాచీన లేఖన క్రమపద్ధతి" అను శీర్షికతో వ్రాసిన దానిలో:

"దీర్ఘములమీఁది యుచ్చారణ గుఱించియు నిట్లు చెప్పి యున్నాఁడు

ఆ॥వె॥ అర్ధబిందుసహితమగు వర్ణమునకుఁ బ్రా
సాదియరయనిడుద యక్కరంబు
నేఁడుమనకుఁగల్గినాఁడు లక్ష్మీనాథుఁ
డేఁటికింక నేఁడుమాటలనఁగ॥ 1–33

హ్రస్వములపై నిండుసున్నలనూది పలికినపుఁడు తేల్చిపలికిన పుఁడు గణభంగమగును గాని దీర్ఘములమీఁద గణభంగము కాదు కాఁబట్టియే క్రమక్రమముగా దీర్ఘములపై నిండుసున్న యుచ్చారణ లోపించి, లోపించిన నిండుసున్న యుచ్చారణచిహ్నముగ నరసున్న వెలసినది-

ఆ॥వె॥ అర్ధబిందు సహితమగు
నేండ్డుమనకు గల్గినాండ్డు లక్ష్మీనాథుం
డేంట్టికింక నేండ్డు మాటలనంగ॥ 11-

(ఈపద్యమున శ్రీ వేంకటరావుగారు "మనకుంగల్గినాండ్డు" అని వ్రాయక "మనకుగల్గినాండ్డు" అనివ్రాసిరి-ప్రమాదము-)

అనంతుని కాలమునకు పైరీతి లిపి క్రమము వెలయుటచేత "ఏంట్టి" మొదలగు శబ్దములలో నిండుసున్న యుచ్చారణమే పూర్తిగ నశించినదనియు "ఏఁట్టికి" అని యున్నను 'ట్టి' ద్విత్వమైనను లఘువే యగుటచే 'మాటలు' అను నిండుసున్నలేని శబ్దముతో ప్రాస సరిపోయినదనియు గ్రహింపనగును-

దీని ననుసరించియే "సార్ధబిందుక నిర్బిందుక ప్రాసము ననంతుఁడు తెలుఁగు లాక్షణికులలోఁ దొలుత తెలిపినాఁడు-" అని వ్రాసియున్నారు-

ఇందు శ్రీ వేంకటరావుగారు "ఏఁటికింక నేఁడు మాటలనఁగ" అనునది సార్ధబిందుక నిర్బిందుక ప్రాసముగా "ఏఁటికి మాటకు" సరి

పోయినదనుట తగదు- ఈపద్యముల సందర్భమున సార్థబిందుక నిర్బిం దుకముల కిసుమంతయుఁ దావులేదు-"ఏఁటి" లో నరసున్న యున్న దని యంగీకరించిరి-మాఁటలోఁగూడ ననంతుని మతమున నరసున్న యున్నదనవలెను-

ఆ॥ వె॥ కుఱుచమీఁదనున్న మఱి నేల వ్రాయంబ్రా
సద్వయాది నిట్లుజరుగు నచ్యు
తుండు సమస్తవల్లభుండునాఁగ నయ్యచ్యు
తుండ్డు సకలవల్లభుండ్డనంగ్గ-

అనుదానిలో చివరి రెండుపాదములును నున్నగల పదములకే యుదాహరణలుగా నిచ్చియున్నాఁడు-ఇట్లే దానిక్రింది పద్యమైన "అర్థబిందుసహితము గు" నిత్యాది పద్యమున-

"నేండుమనకుంగల్గినాఁడు లక్ష్మీనాథుం
డేంటికింక నేండు మాంటలనఁగ"

అని రెండును బిందువు లున్నవానికే యిచ్చెననవలెంగాని చివరిపాదమున సబిందు నిర్బిందుప్రాస మనుట అసంగతము- నేను పూర్వము నుడివినట్లు మాటలో నరసున్న యుండవలె-"మాఁట లేఁటికి మేటితాఁ బేటి కనఁగ" ననునదియు నీ మాయభిప్రాయము వలన నిటనే ఏవిభక్తికి టి వర్ణ మరసున్న పూర్వకమా? అను శంకను దూరాపాస్త మ్మొనర్చుచున్నది-

"అర్థబిందుప్రాసము"ను శీర్షికతో వ్రాసినదానిలో (57-58) మఱియు ననంతుఁడు పటలకుమాత్రమే చెప్పఁగా నప్పకవి 'నిడుపులు నరసున్నలు"-అప్ప-3 ఆ-302 ప-

అని క, చ, త, లనుఁగూడ చేర్చి వానికిఁ దిక్కనాది మహా కవుల ప్రయోగముల నిచ్చియున్నాఁడు-" అనివ్రాసిరి-అనంతుఁడు

ప, ట లకు మాత్రమే సబిందు నిర్బిందు ప్రాసను విధించినను నితర ములకు నాత డుపయోగించెను-

క॥ తగుహ్రస్వంబులు దీర్ఘము
లగు అ ఇ ఉ ఋ ౠ లును వెండిహ్రస్వాభావం
బగు ఏ ఐ ఓ ఔ లునె
సఁగు (ఎసంగు) అంఅః యనఁగ షోడశస్వరములగున్-
ఛం-ద-4ఆ-124-

రువడి విషయమున (శ్రీ)వెంకటరావుగారి దిద్దుబాట్లు మిక్కిలి దోషభూయిష్ఠములు-అదియొక పెద్దవ్యాస మగుంగాన మఱియొకపరి వివరింతును-

తరువోజలోయతి విషయమున (శ్రీ) వేంకటరావుగారి యభి ప్రాయము సంగతముగాదనియు "ఒగినుండగిరియతి" అనుచో 'ఒగి నుండఁగరయతి' అని యుండవలెననియు 1950-జూన్ 28 ఆంధ్ర ప్రభలోఁ దెలియఁజేసితిని-ఈ నాయభిప్రాయముతో (శ్రీ) విద్వా న్రావూరి దొరస్వామిశర్మగారు నేకీభవించిరి-

- ఇందు (శ్రీ) వేంకటరావుగారు మఱియు సంస్కృతము తెనుఁగైన తత్సమపదంబు "అని తత్సమమును సరిగా నిర్వచనము గావించినవాఁ డనంతుఁడు-" అని వ్రాసిరి- కాని అనంతునికి మిక్కి లిపూర్వుండైన "కేతన" తన "ఆంధ్రభాషాభూషణము"న

క॥ "మును సంస్కృతపదములపైఁ
దెనుఁగువిభక్తులు ఘటించి తేటపడఁగఁ జె
ప్పినవది తత్సమమనఁజను"
ఆం-భూ-19 ప-

అని మఱింతగా స్పష్టపఱచి వచించినాఁడు- అనంత కేతన లలో నెవరు తత్సమపదమునకు సరిగా నిర్వచనముం జెప్పిరో విచక్షు ణులు గ్రహింపుఁడు-

"బాలకి"—ఇదియు నపశబ్దమని పండితుల యభిప్రాయము- అనంతుఁడు-

చ......వడంకుచుఁ బారెనొక్క బా
లకి తనబోఁటితోడ నబలా యిది కాటుకతీగ"-

అని భోజరాజీయము (3-175) లో నుపయోగించినాఁడు...
... అని వ్రాసి శ్రీ వెంకటరావుగారు "ఇతరకవులుకూడ మఱి కొన్ని యెడల "బాలకి" శబ్ద ముపయోగించి రనియు వానిని దిద్ది వైచిరనియు, ననంతుని ప్రయోగము యతిస్థానమున నున్నదిగాన దిద్ద లేదనియు వ్రాసియున్నారు-కాని

"చ......వడంకుచుఁ బారె నొక్క బా
లిక తనబోఁటితోడ నబలీ యిది కాటుకతీగ"

అని దిద్ది వేయవచ్చునుగదా! ఇందు పెద్దబాధయేమి?-

మఱియు శ్రీ వేంకటరావుగారు "అనంతుఁడు భోజరాజీయము (5 ఆ-89) లో "సఖునకు" అనురూపము నుపయోగించె ననియు నద్దానిని శాబ్దికు లపశబ్దమని యందురనియు, వ్రాసియున్నారు- (చూ-64 పుట) కాని "అహోబలపండితీయమున" దద్గ్రంథకర్త "ఇతాంజసఃకిశ్చ" అను సూత్రమును వ్యాఖ్యానించుచు నందుఁ దిక్కనగారి "సఖుఁడు సంబంధిశిష్యుఁడు సవ్యసాచి" అన్న ప్రయోగమును జర్చించుచుఁ జివరకు =సహ ఖేనవర్తత ఇతిసఖః ఇతి అకారాంతత్వా న్నిర్వాహః" అని సఖుఁ డనురూపము న్సాధించినాఁడు- అట్టియెడ "సఖునకు" అనురూపము సాధ్యముగాదా? శాబ్దికులెల్లరు నంగీకరింపలేదనుట తగునా?-

షట్ఛోక్క-విషయము- అనంతుని ఛందమందలి ప్రథమాశ్వాసములోని 21, 22 పద్యములను శ్రీ రావూరి దొరస్వామిశర్మగారు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపుటము 38-సంచిక 1-3 లో విమర్శించియున్నారుగాని యది యసంపూర్ణము-ఇంక వివరింతు-

1947 ముద్రణ ప్రతిలో-

క॥ జగణము నలమగు గగములు
భగణములగు గలము నగణభావంబుఁ గనున్
సగమున గణవగణములగుఁ
దగణముభలమగును సంయుతముఁదీర్చిన చోన్-

క॥ మొగిళులు నలమగు నిటులన్
నగణము సగణమగు నిటు లనంగుని తండ్రీ!
తగణము పాళులనంగా
భగణము వాకిళ్ళు భలము వాకిళులనఁగన్॥

అని యున్నవి-ఈపద్యములు సరియైనవి కావనుచు శ్రీ దొరస్వామిశర్మగారు ఈక్రింది పద్యద్వయ మిచ్చిరి-

క॥ జగణమునలమగు, గ (ల) గములు
భ (వ) గణములగు, గలమునగణభావంబుఁ గనున్
గగము భగణసగణములగుఁ
దగణము స (భ) లమగును సంయుతముఁదీర్చిన-చోన్॥

క॥ మొగిళులునలమగు, నిటులన
నగణము, హగణమగు నిట్లునా, హనగణముల్,
భగణము లిట్లనఁదండ్రీ!
భగణము వాకిలి భలంబు వాకిళులనఁగన్॥

ఈ సవరణను జేయునెడ శ్రీ దొరస్వామిశర్మగారు "అనంతుం డుపయోగించిన "సంయుతముఁ దీర్చినచోన్" అన్న పదము

లను దృష్టియం దిడుకొన్నట్లే కానరాదు- "భగణమువాకిలి" అని యివ్విధమున నా యా గణము లెట్లుండునో యుదాహరణపూర్వకముగా నిచ్చినయెడల నియ్యవి యనవసరము లే యగుంగదా! ఏల యన అట్టి యుదాహరణమ్ము లనంతుఁడు ప్ర॥ఆ. లో ౧౩, ౧౪, ౧౬, ౧౭- పద్యములలోఁ జూపియేయున్నాఁడు-తిరిగి యూరక 'భగణము వాకిలి' విశిష్టత లేక యుదహరించుట తగదు-

అనంతుండు మొదటిపద్యమున "సంయుతముఁ దీర్చినచోన్" అనుదాని నుపయోగించినాఁడు- ఈ వాక్యమువల్ల సంయుక్తములై యున్న కొన్నిపదములలో నట్టి సంయుక్తమును దీసిన నేమేమిగణములుగా మారఁగలవో యాతఁడు చెప్పినట్లు తోఁచుచున్నది- మొగిళ్ళు-అను సంయుక్తరూపము (జగణము) తత్సంయుక్తమును "మొగిళులు" అని తీసిన (నలము) నేమిగణమగునో యను విషయముం దెల్పినాఁడని నాయాశయము- శ్రీ రావూరి దొరస్వామిశర్మ గారీ విషయము నెంచరైరి-ఆ పై రెండుపద్యములు మూలమందును దోషపూరితము లగుటను శ్రీ దొరస్వామిశర్మగారి పద్యములును సరియైనవి కానివగుటను నీక్రింది పద్యముల రచించుచున్నాఁడను-

క॥ జగణము నలమగు, గలములు
భగణములగు, గలము నగణభావంబుఁగనున్,
జగణములు జలములగునిల,
తగణము భలమగును సంయుతముఁ దీర్చినచోన్॥

క॥ మొగిళులు నలమగు, నిటులన
నగణ, మరంటులనజల, మనంగుని తండ్రీ!
తగుహరి! పాళులనంగా

భగణము, వాకిళ్ళు భలము వాకిళులనఁగన్॥

అన్వయము- జగణములోని సంయుతముఁదీర్చిన నలమగును- ఉ- మొగిళ్లు (జ) మొగిళులు (నల)-గలములోని సంయుతముం దీర్చిన భగణమగును- ఉ పాళ్ళు (గల) పాళులు (భ) గలములోని సంయుతముఁ దీర్చిన నగణమగును-ఉదా-ఇట్లు (గల) ఇటు ఌ (న) జగణములోని సంయుతముఁ దీర్చిన జలమగును-ఉదా-అరంట్లు-(జ) అరంటులు-(జల)-తగణములోని సంయుతముఁ దీర్చిన భలమగును- ఉదా:-వాకిళ్ళు (త) వాకిళులు (భల)-రెండవపద్యమున "అనంగుని తండ్రీ!=కృష్ణా!" అని యర్థ మెఱుంగవలెను- ఇవ్విధమ్ముగనఁ బై పద్యములూహింపంబడియెను- ఊరక దొరస్వామిశర్మగా రన్నట్లుగా (సంయుతముఁ దీర్చినచోన్ అనుదానిం దృష్టినిడుకొనక) నుదాహరణలే చూపిన నవియుఁ బూర్వోక్తములే యగుటను వ్యర్థములే యగుంగదా!-

మఱికొన్ని విషయములు దోషములుగా నెంచి పరిష్కర్తల యొక్కయో! లేక ముద్రాపకుల యొక్కయో! లోపమ్ములనియు నెంచి యవి వ్రాయుచున్నాఁడను-

1- క॥ మొదలను క ఖ జ లు చ ఛ డ లు
దధ లు నుభయ శ క్ష ష స లు తగ దుపవర్ణా
స్పదములు గాకుండిన మే
లొదవించును- ప్ర॥ఆ॥-26-ప-

ఇందు "తగ దుపవర్ణా" అనుటకు "తగదు సవర్ణా" అనియుఁ "గాకుండిన" అనుటకుఁ "గానుండిన" అనియు నుండవలెను-

2- "వైసాదృశ్యంబులు, పరిహార"—ప్ర-ఆ-32 ప॥-
"వైసాదృశ్యంబు లపరిహార"—అని యుండవలెను-

౩- "అత్రి విక్రముఁడభయ"—ప్ర-ఆ-౪౯ ప॥-
"ఆ త్రివిక్రముఁడభయ"-అని యుండవలెను-
"క్లుప్తిలేదు-ప్ర-ఆ-౮౯-ప॥-
క్ష్ముప్తిలేదు—అని యుండవలెను.
"పరాజ లిపురువది"—ప్ర-ఆ-౬౨-ప॥
"పరాజపు లిరువది"—అనియే యుండవలెను.
"కడరుఁగాకుస్వరంబు పరమసహస్ర"—ప్ర-ఆ-౯౬-ప॥
కమరుఁగాకుస్వరంబు—అనియే యుండవలెను.
లేనియెడల యతి తప్పును.
"రోక్తి రెండుఁజెల్లు"—ప్ర-ఆ-౯౫ ప॥
రోక్తి రెంటఁజెల్లు—అని యుండవలెను.
"తలకొని గచటతపంబులు—ప్ర-ఆ-౧౦౪-ప॥
తనకొనిక.........—అనియే యుండవలెను.
"తానిడిరేని"—ప్ర-ఆ-౧౦౬॥
తారిడిరేని—అని యుండవలెను.
కరుల నన్నమ్మ"—ప్ర-ఆ-౧౧౮-ప॥
"ఒరుల నన్నమ్మ"—అని యుండవలెను.
"వితల్ప" "విరతి"—ప్ర-ఆ-౧౨౪-ప॥
వికల్ప విరతి—అని యుండవలెను.
పాపాలికి—ద్వి-ఆ-౧౮.
నాపాలికి—అని యుండవలెను.
ఇంపార—ద్వి-ఆ-౪౮
పెంపార—లేనియెడల యతి భంగము.
గుణంబుల్—ద్వి-ఆ-౫౫ ప॥
గణంబుల్—ఇద్దియే యొప్పు.

న, భ, జ,—ద్వి-ఆ-౭౨ ప॥

న, జ, భ—అని యుండనగు.

ద్వి-ఆ-౭౬ పద్యమునకు శీర్షిక లేదు. "చంద్రశ్రీయను వృత్తము" అని యుండవలెను.

దుగ్వీరతిన్—తప్పు—ద్వి-ఆ-౮౧ ప॥

దిగ్వీరతిన్—

పారయుఁగ—తప్పు—ద్వి-ఆ-౮౬-ప॥

వారయుఁగ—ఒప్పు—యతి తప్పను లేనియెడల—

రమానాథున్ యదుకుల—తప్పు—ద్వి-ఆ-౬౧-ప॥

రమానాథున్ గృష్ణున్ యదుకుల-అనియుండనోపు లేనిచో గణభంగము.

చూడవె—శూరుఁడితని—ద్వి. ఆ. ౬౨. ప. 1. 2. పాదాలు.

చూడవే—శూరుఁడీతని—అని యుండనగు.

నదీప్రఘోషన్—ద్వి. ఆ. ౧౨౮.

నదీప్రఘోషమున్—ఇట్లుండకున్న గణభంగము.

వేణుధర భవనభసవిశ్రుత—ద్వి. ఆ. ౧౨౭. ప. లక్ష్మ లక్ష్యభంగము.

వేణుధర భనన జనగశ్రుత—అని యుండవలెను.

నవరించి—ద్వి. ఆ. ౧౨౬. ప. 3 పాదము.

సవరించి—ఒప్పు.

నల నగభజ—తృ. ఆ. ౨ వ. కందలక్షణమున "నగ" ముండనోపదు.

నల గగ భజ—అనియే యుండనగును.

నని మహోక్కరం—తృ-ఆ-౮౦ ప-
ననియు మహోక్కరం—అని యుండనగు.
ఇంద్రులిద్దఱు నొక్క—తృ-ఆ-౮౩-ప॥
ఇంద్రులిద్దఱునొక్క--ఇట్లుండనియెడల గణభంగమగు.
బలికిరేని నియతిభంగ—చ-ఆ-౫-ప॥
బలికిరే నది యతిభంగ—అనియుండు.
ఆదిజఞణనమములు—చ-ఆ-౬౦-
ఆదిజఞణనమల—అనియేయుండు.
వాఛ్ఛంతి—చ-ఆ-౬౩-ప॥
వాకాఛ్ఛంతి—అనియగు.
తీర్ఘము—చ-ఆ-౭౮॥
దీర్ఘము—అనియే.
నిఋతియన—చ-ఆ-౮౧-ప॥
నిరృతియన—ఒప్పు.
బునర్వతు—చ-ఆ-౮౨
బునర్వృతు—తగు నిదియ.

శ్రమయనక నాకుఁ బొడగట్టిన తప్పుల నన్నింటిని లిఖించితిని ముద్రారాక్షసము లైనను గొన్ని పరిష్కర్తల లోపమనక తప్పదు-వీని విశేషములను దప్పొప్పులను విచక్షణులు గుర్తింతురుగాక.

సమాప్తము.

---

సీ. తొలిదొలి శేఖరస్థలమున కలవడి
మవ్వంబు మిగిలిన పువ్వులగుచు
నంత లోపలను గర్ణావతంసములకుఁ
బ్రకటవినూత్న వజ్రంబులగుచుఁ
దదనంతరంబ ప్రదేశమునకు
దీపితహారమౌక్తికములగుచు
మఱి యాక్షణమ కటిమహితమేఖలకు ని
మ్ములరచించిన వెండిమువ్వలగుచు
నిట్లు నక్షత్రములు చిత్ర మెసఁక మెసఁగ
క్రమముదప్పక నిజకపర్దములు దలఁప
నుగ్రమాహేశ్వరుండున్న యునికిఁదోఁన
నిగిడి బ్రహ్మాండమండలి నిండఁ బెరిగి.

ఆ. వె. పెరిగి గంగ యంత పెరిగినఁ దగ్గక
యంతకంటె శతగుణాధికముగ
నాహరుండు వెంచె నాత్మకపర్దంబుఁ
జూచు సురగణంబు చోద్యమంద.

మ. భువనవ్రాతభయేష్ణకారణవిధంబుం జల్పఁగా దానయు
ద్భవ మారంభజియించి భూరికలధౌతప్రౌఢదండంబునం
బ్రవిభాసిల్లుచునున్న నిర్మలసువర్ణచ్ఛత్రముంబోలె న
ద్దివి నీశాంగమునం గపర్దము ఘనశ్వేతప్రభల్పర్వఁగన్.

వ. ఇట్లు నిరాఘాట విజృంభణంబున నమ్మహనీయ జటామండలంబు గనుపట్టుచు గంగాప్రవాహపరంపర నాకట్టుకొని యేవంకకుం జననీక కుంటుపఱచి లోనుజేసిన నదియును, విగత వేగంబును వీతతరంగ యోగంబును, విద్ధరూపంబును విరళఘోషంబునువిచ్చి

న్న పరిపోషంబును గాఁ బరిశ్రాంతయుంబోలె నక్కడక్కడ నిలు
వఁబడియు నభ్రాంతయుంబోలె నూరక సుడివడియు, మాయాన్వి
తయుంబోలె చూచిచూడకుండఁ బొడవడంగియు, నిందాన్విత
యుఁబోలెఁ దలయెత్తక క్రుగ్గిమణంగియు, మఱియు వివిధరీతి
లీనదశకువచ్చి యనంతర సమయంబున

ఉ. నీరజకేసరాంతిమున నిల్చినయట్టి నితాంతసూక్ష్మనీ
హారకణంబునట్లు నిటలాక్షుని యేకజటాగ్రకంబున
న్దారకతోఁచె దేవనది దాశమమంతయు దారతారక
ద్వారపటీరహారరుచిపూరశుభాకపటప్రకారమై.

ఆ. వె. భవజటాకపర్దబంధబద్ధమృగాంక
ఖండ మమ్మహాపగాప్రతీర
తలముఁ గదిసియొప్పె నలఘువిలాసమా
గతమరాళశాబకంబనంగ.

వ. ఇవ్విధంబున నవ్విభుండు జగద్రక్షణార్థంబుగా సకలాశాపరిపూ
ర్ణంబగు గంగాప్రవాహంబు నిజమూర్ధభాగంబున ధరించిన నన
శ్వరాటోపంబున వెలయు విశ్వరూపంబునఁ దేజరిల్లు సమయం
బున ననిమిష మునిపుంగవులును భగీరథుండును విస్మయతిలకితు
లును నానందపులకితులునగుచు నీశ్వరుపాదంబులకుఁ బ్రణామం
బు లాచరించి యిట్లని స్తుతియించిరి.

క. జయ విశ్వనాథ విశ్వా
భయదానకళాసనాథ భయ యభవ నిరా
మయ సంతతోన్నతోదక
మయ సదయాలోకపూర్ణమహిమాలోకా.

చ. ధరణి పదంబు లంబుదవితానము జంఘలు జాను లూరువుల్
సరసిజశాత్రవుండు కటిచక్రము సప్తమునీంద్రమండలం
బురముధ్రువుండుకంఠమటయూర్ధ్వముమూర్ధమువిశ్వరూపవి
స్ఫురణఁదలిర్చునీకు నహిపుంగవభూషణ భక్తిపోషణా!

మ. లయకాలంబునఁ బొంగు నంబునిధిలీలం బర్వియుగ్రక్రియ
న్వియదాశావలి నిండి వెల్లియగుచుం బెల్లుద్ధతి న్వచ్చు దు
ర్జయగంగాజలపూరము న్భవనరక్షాదక్షతంబేల్చఁద
ద్భయముం బాపను నీకెచెల్లును సుధాధామార్ధచూడామణీ

మ. తలఁపం దల్లియుఁ దండ్రియుం బ్రభుఁడు నర్థంబున్సహాయంబునా
ప్తులు భ్రాతాదులు నీవ యట్లగుటఁ దన్నార్తు ల్డాయకుండగ సా
మ్ముల నీభక్తుల నీదుకింకరుల మమ్మంగావఁ బ్రారంభము
ల్సలుపంగాఁ దగు నేటిభంగి సదయాసంసంగ గంగాధరా!

వ. అనుచు బహుభంగులం బ్రస్తుతించుచుండ గంగాధరుండు నాద్య ప్రకారం బుడిగి సముచితాకారంబున నిలిచి సగరసుతరక్షణార్థంబు భగీరథునకు నొక్క గంగాప్రవాహంబు కరుణించి యభీప్సిత విహారపరుండై యుండె నంత నిక్కడ.

చ. ఇలకు భగీరథాహ్వయనృపాలుని వెంట నభస్తలాపగా
తిలకము వచ్చెఁ గంటె గణుతింపఁగఁ జిత్రము తత్సమాగమం
బ్బుల పడిరండు చూతమను చక్కడ నక్కడఁగల్గు సంయమీం
ద్రులు మనుజేంద్రులాదిగ నరు ల్సనుదెంచిరి కౌతుకంబునన్

మహాస్రగ్ధర:—
కనిరింపారంగరంబున్ దినచరక్రౌంచచక్రాంగ నంహో
ఘనరంహోభంగ కూలంకషజలకణసిక్తక్షమారంగహృద్య
ధ్వనదుద్యద్భంగ భూ....శుభకరానందా పరిష్వంగపద్మా
ఘనయూపాత్సంగతఝణరంగద్భ్రమద్భృంగ గంగన్.

వ. కని హార్షించి యందఱు నిట్లని ప్రశంసించిరి.

మ. జనవిక్లేశవిరోధరోధములఁ జంచచ్చక్రచక్రంబులం
జననీమోదవిశాలశాలముల నోజప్రోతపాత్రంబులన్
ఘనలీలాజితపంకపంకముల సత్కంజాతజాతంబులన్
దనరన్నీదు ప్రవాహము ల్మహి జగత్కల్యాణి భాగీరథీ!

చ. కలమధురాళిశాలిశనకైరవమైన మృణాలపంకపే
శలతరగండతుండమదసారససారసమై వినమ్రరా
జిలసదమంగమంగళవశీకరశీకరమై భవ
జ్జలజలనీరు నిన్నుఁగనుంగొని యాడగనొప్పు జాహ్నవీ!

వ. అని యిట్లు సంస్తూయమానయగుచు గంగ యేడునూరు ముఖం
బుల నిజసాగరంబులం గలసి రసాతలంబున భస్మీభవించిన సగర
శ్రేణికి నాకగమననిశ్రేణియయ్యె; భగీరథుండును ప్రతిజ్ఞఁ దీర్చి
పేర్చిన యశంబు ముజ్జగంబుల నిండఁ బూజ్యసామ్రాజ్యంబున
నుల్లసిల్లె.

శా. గంగాధారణనామకంబున జగత్కల్యాణదానవ్రతా
భంగారంభతఁ జాలఁ జెన్నలరు నాఘాలాక్షు లీలంగడు
న్సాంగారస్తరతిం బఠింప విన నిష్టార్థంబులు భ్రాజితా
రంగానంతయశంబునుం జనులకుం బ్రాపించు దీపించుచున్.

ఆ. వె. వినుఁడు సముచితముగ వివరింతు నిటమీఁద
నభవుఁ డవధరించినట్టి లీల
నంతకదహనాఖ్య నలవొందు నీ జగ
త్పూజనీయమహిమపూర్ణ యగుచు.

క. శ్వేతుఁ డనా నొకఁడు గుణా
శ్వేతుఁడు విలసిల్లు సత్త్వహితవాక్యవిధా
పేతుండు నృపపరమశా
స్ఫీతుండు నియమప్రసన్నచరితుఁడు ధరణిన్.

స. ఫాలలోచను పాదపంకజ యుగ్మంబు
నెలమిఁ బాయక భజియింపఁ దలఁపు
శాంభవీవల్లభ సన్మంత్రరాజంబు
నెలమిఁ బాయక పఠియింపఁ దలఁపు
భూతనాయక మహాద్భుత గుణ స్తోత్రంబు
నెలమిఁ బాయక జపియింపఁ దలఁపు

కాని యెన్నఁడు మఱియిట్లు గాని తలఁపు
తలఁప దెరువఁడు మఱునందు దాంతిరూఢి
సకలసత్పురుషస్తుతాచరణ (రీతి)
పోషకుండు తన్మునినాథ విభూషణుండు.

చ. విను ననయంబు నైజజయవిశ్రుతరారుషశర్వసత్కథల్
సనుఁ గడుదప్పునైన నఘసంఘవినాశనరుద్రతీర్థముల్
కనుఁ బ్రమదంబుమై సకలకర్మహరవ్రతశంభుభక్తులన్
ఘనుఁ డగు శ్వేతనామ మునిగణ్యుఁడు పుణ్యచరిత్రసంపదన్.

వ. ఇట్లు కేవలమహాదేవపరతంత్రంబున జననమరణదుర్వార సంసారభ్రమణనివర్తనవిచిత్రంబును శమదమప్రధానప్రథమాన గుణమాత్రంబును నగు చరిత్రంబునం గడమవడని కీర్తివిస్ఫూర్తి వడసి దుష్కరంబుగాఁ దపంబు జరుపుచున్న యంత.

సీ. పిడుగు తునుకల నాఁగఁ గడు నుగ్రగతి నూఁపు
కటుకని కింకరుల్ గలుగు వాఁడు
కాటుకకొండతోఁ జాటి సేయఁగ వచ్చు
చిక్కని మహిషంబు నెక్కువాఁడు
వడి నాలుకలు కలువ న్నింపుటకుఁ జాలు
పరుసని పాశము ల్పట్టువాఁడు
తఱుచు మంటలచేత జురచుర వొడమించు
పెల్చని దండంబు దాల్చువాఁడు
చనియె నా శ్వేత శివభక్తుఁ దనకు వశుఁ
గా నొనర్పుఁదు నంచును గదలు మాత్ర
సకలజీవభయప్రదాయకనిసర్గ
రౌద్రతాధామరూపవిభ్రముఁడు జముఁడు.

ఉ. ఆతనిరాక దూరమున నా మునినాథుఁడు గాంచి మిక్కిలిం
భీతమనస్కత న్హరఁబు నీవె మహేశ్వర రక్ష నీవె ఫా
లాతతనేత్ర నీవగతి యారయ శంకర నీవె దిక్కు వి
జ్ఞానమహాత్మ యంచరిగి చయ్యనఁ జొచ్చె గిరీశగేహమున్.

క. చొచ్చి శివదివ్యలింగము
గ్రుచ్చి బిగియనంటఁ బొదవుకొని తనవెంట
న్వచ్చు జముఁదలి తాలిమి
గచ్చు వడంగ నతఁడు భీతగతి నిట్లనియెన్.

ఉ. ఓ పరమేశ! యో విమలయోగిమనఃకమలప్రకాశ! యో
పాపవినాశ! సతతపాణివిరాజహుతాశ! యో జగ
ద్గోపనధీసకాశ యిదె క్రూరతఁ గాలుఁడు వచ్చుచున్న వాఁ
డాపదఁ బాపు నాకుఁ బ్రియమారఁగ నో పరమేశ యోహరా!

శా. ఓ స ర్వేశ్వర యో న రేశ్వర శివా! యో దుష్టసంహారకా!
యోసద్ధిస్మయ యో నిరామయ శివా యో భ క్తసంరక్షణా
యో స్వత్వాభవ యో యనుద్భవ యమ ప్రోద్దండదండాహతిన్
త్రాసంబొందక యుండఁ గావునను నో దాక్షాయణీ వల్లభా!

వ. అనుచుఁ బూర్ణదయార్ద్రభావుండును నగు మహాదేవుని దెచ్చి చిత్తారవిందకర్ణికావితర్కిక విడియించుకొని తదీయ స్మరణంబు దనకు నితరదుస్సాధవితరణంబుగా నిర్భయాంతఃకరణంబున నుండు సమయంబునఁ బ్రచండమూర్తియగు సమవర్తి రయస్ఫూర్తిఁతోడ నాతని పజ్జంగూడం జని యాశ్వరాగారంబున బహిర్ద్వారంబునఁ బరివారంబుల నునిచి లోనికిం జొచ్చి పెచ్చుపెరుగున లుకం జిచ్చులుమియు చూపుల నతనిం జూచుచు నిట్లనియె.

క. ఏరా తాపస యీ విటు
నేరాఁగా నీవువచ్చి యిలుసొచ్చితి విం
కారయ మత్కరదండ
క్రూరహతుల నిచటఁ దొలఁగఁ ద్రోవఁగ వశమే.

చ. అనిన మహేశుప్రాపు హృదయంబున మిక్కిలి నమ్మియున్కి న మ్మునిపతి భీతినొందక సముద్ధతిఁ జూచు కృతాంతుతోడ ని ట్లనియె విమూఢ తం దగిలి యాడితి గా కిటు దండహస్త యెం దును బరమేశ్వరార్చకుల దొట్టునె నీదు వినింద్యకృత్యముల్.

సీ. కర్మ సంగతమను కంధిపూరమునకు
నౌర్వ గర్వంబు ఫాలాక్షుభక్తి
యాజవంజవమను నంబువాహమునకు
వాయుదర్పంబు సర్వజ్ఞుభక్తి

రమణవేదనమను నురగపాతమునకు
గరుడజృంభణ శూలధరునిభక్తి
జన్మసంకటమను సామజౌఘమునకు
హరిచపేటము శూలధరుని భక్తి

వినుము దత్కారణమునన విశ్వనాథు
జేల నీదండమున మెత్తు రెఱుంగ వీవు
భావ సంక్రాంత దుర్మదభ్రాంతిఁ జేసి
సాధ్యము నసాధ్యము నెఱుంగవు శ్రాద్ధదేవ!

క. నావిని మోమునఁ జిఱునగ
వావిర్భవ మందఁ గాలుఁ డా మునిపాలుం
డా విరసపుఁ జూపుల గీ
లావీసరము దర్పనిశ్చలత నిట్లనియెన్.

సీ. సింహావళులనైనఁ జెండాడు శరభంబు
చిఱుమేకంబులఁ జంప వెఱచునేని
కులమహాద్రులనైనఁ గూల్చువాతూలంబు
చిఱుగొండ లురులింప వెఱచునేని
ఘోరాటవులనైనఁ గొనియేర్చు దహనుండు
చిఱుగసవులు గాల్ప వెఱచునేని
యేడువారిధులనైన నింకించు భానుండు
చిఱువెచ్చల గురింప వెఱచునేని

సర్వజగదంత కారణాఖర్వదండ
చండబాహార్గళుండగు జముఁడు నిపుడు
గిట్టి మీఁ బోటి బడుగులఁ బట్టి కట్ట
నరక యాతనార్పులఁ బెరయ వెఱచుఁ గాత.

వ. అనిన విని దరహాసిత వదన కంజాతుం డగుచు శ్వేతుం డంతకుఁ గనుంగొని.

సీ. వెగ డనుచీకటి బిట్టు పర్విన చోట
నర్కు తేజంబు వృషాంక సేవ
అళు కను వేసవి యదరి పేర్చినచోట
సాంద్రాతపత్త్రంబు శర్వసేవ
వెఱ పనుజలరాశి వెల్లివచ్చినచోట
పటుయానపాత్రంబు భర్గసేవ
తలఁ కను కాలాగ్ని దరిమి చుట్టినవేళ
గాఢవర్షంబు శ్రీకంఠసేవ

తే. వివిధ భయ మనుతాపంబు గవిసినప్పు
డమృతపానంబు దలపోయ నభవుసేవ
గానఁ దత్సేవకులమీఁదఁ గదియుటెట్లు
బిక్కలగు నీదు చేతులఁ బ్రేతరాజ!

మ. అనినం గాలుఁడు గారులాడ కిట మూఢా రమ్ము నేఁడింక నె
ట్టన నే వచ్చినవాఁడఁ గట్టవె యకాండప్రాప్తసంవర్తసం
జనితాగ్నిజ్వాల దర్చిఖర......ఛాయోద్యతాస్మద్భుజా
ఘనపాశంబుల నంచుఁ బల్కెను నహంకారంబు బీరంబుగన్.

చ. పలికిన నవ్వి యాం గిరిశభావకుఁ డాతనితోడ మూఢ నీ
తలుగులఁ ద్రాళ్ల నీశ్వరునిదాసులు చిక్కుదురే మహోమదా
వలములు పద్మసూత్రముల వారక బంధన మొందు నే కుమా
ర్గులు నినుబోఁటివార లిటు క్రొవ్వులు పల్కుదు రందఁజాలమిన్

క. అనవరతము శంకరపద
వనజయుగస్మరణ మెపుడు వదలకునికి నా
కనువుపడ నభయసంపద
విను మింతయు నీకు నేను వెఱవఁ గృతాంతా!

వ. అని పలికి యదిసాలించి మనంబున నీశానధ్యానంబు సేవించి తత్పరుండగుచు నిట్లనియె.

క. కాలాహీనయవాసా
కాలాత్మా యాత్మ కాలకర్త వికర్తా
గాలాంతకా యనంతక
కాల మహాకాళ నన్నుఁ గరుణించు దయన్.

క. భూతభయ భూతభావన
భూతావనదక్ష భూత పూర్వార్ధ లిహా
భూతవినాశనభూతా
భూతావర నాకు నభయముగ నిమ్మ దయన్.

క. సర్వాహార సర్వరక్షక
సర్వప్రద సర్వశూన్య సర్వాంతస్థా
సర్వబహిర్గత సర్వా
సర్వజ్ఞా నన్నుఁ గావఁజను దెమ్ము దయన్

వ. అనుచు నవ్విధంబున నవ్విమలభక్తిభాసురుండును, మహేశ్వరు చరణస్మరణసుధారసపూరసతతపిపాసుండును, తత్ప్రసాదసంపాదనత్వరాయాసుండును నగుచుండుతఱి జముండు నుగ్రతరాగ్రహ సంభ్రముండై

సీ. కట్టెద నిదె పట్టి గాఢపాశంబులఁ
గరుణించుఁ గావుత హరుఁడు నిన్నుఁ
గొట్టెద నిదె కట్టి క్రూరదండంబున
బ్రతికించుఁ గావుత భవుఁడు నిన్నుఁ
గూల్చెద నిదె యేచి ఘోరరౌరవమున
నరయుఁ గావుత మహేశ్వరుఁడు నిన్నుఁ
గాల్చెద నిదె వైచి గాఢపావకమున
మనుచుఁ గావుతఁ ద్రిలోచనుఁడు నిన్నుఁ
జిత్తమున నన్యమెఱుఁగవు శివుఁడు దక్కఁ
గదలు మిప్పుడు లింగంబుఁ బొదవికొనుట
యేల మాటలపని యింక నెఱుఁగ నగును
నతనిశక్తియు నీభక్తి యతిశయమును.

చ. అని బొమముళ్ళు క్రోధవితతాంబుధి మించు కడళ్ళువోలె సం
జననము నొంద హుమ్మనుచు జంకెలు బింకెలు గింకదెల్పఁ దే
ల్చిన క్రియ నంతకుం డడరి శాంభవమందిర మారఁ జొచ్చి లో
చనముల నిప్పులం గురియ సంయమిపుంగవుఁ డాఁగె నుద్ధతిన్.

ఉ. తొలఁగక తాపసుండు శివదో శివదో శివదో యటంచు జం
చలమతిఁ గూయఁగా నతని శంకరలింగనిషిక్తహస్తముం
బలువిడి విప్ప దండి నిజపాశములం బెడకేలు గాఁగ న
చ్చలమున గట్టి వెల్వలికిఁ జక్కన నీడిచి తెచ్చె నత్తఱిన్.

సీ. కడఁకఁ దలఁకి యక్కడ నున్న ప్రియభీత
భావమనాప్త సంభావనముగ
నెఱుఁగ మెన్నఁడు నిట్టి వివి యేమొకో యని
యంతఃపురంబెల్ల నాకులముగ

భృంగి ముందటఁ దెచ్చిపెట్టిన నవరత్న
పాదుకాయుగము సనాదృతముగ
సంభ్రమంబున నంది చనుదెంచి దండ యి
చ్చినకరాంబుజము సస్వీకృతముగ

వేదనివహాశృంగార మావేళ నొదువ
నున్న వృషభేంద్రు (మీఁద) సంపన్న వేగ
హేలఁ గారాద్రి యందుండి యేఁగుదెంచె
భక్తరక్షణపరతతత్పరుఁడు హరుఁడు.

వ. తదనంతరంబ.

శా. ఓరీ పాతకి మత్పదాబ్జయుగచేతోల్లాసునిం దాసునిం
దూరీభూతభయుండవై యమ! భయార్తుం జేయుచున్నాఁడ వీ
క్రూరత్వంబునకు న్ఫలంబు దగ నెక్కోఁ గందుగా కంచు వి
స్మేరత్ప్రక్రియ నాపినాకి నిటలాక్షి న్విచ్చి వీక్షించినన్.

శా. ప్రోద్యూఖతాద్భుతభుగ్నదారుణనముద్భామీవియద్వీథిఖే
లద్ధూమస్ఫుటవిస్ఫులింగపటలాలంకారదుర్వారమై
తద్భగ్నావళి దృష్టిఁబేర్చె నొక దుర్దాంతాగ్ని యట్లే చి సా
టౌద్భస్మంబుగఁజేసె నప్పుడ జమున్ గర్వస్ఫురత్సంభ్రమున్.

వ. ఇట్లు కృతాంతుఁ గృతాంతుఁగా నలవరించి, యాశ్వేతమునీశు ముక్తకాలపాశుం గావించి, యతనికి నజరామరత్వంబు గావించి తన దుష్టశిక్షణశిష్టరక్షణపరిణతిం దేల్చి శంకరుండు కన్నులపండువగుచున్నయెడ, నక్కడ హరివిరించులు సనుదెంచి జయవాద ప్రణామపూర్వకంబుగాఁ గరంబులు మొగిడించి యిట్లని వినుతించిరి.

చ. ఒక మఱియేని భక్తిరసమొప్పఁగఁ దావకనామ మాత్మ నూ
రక తలపోసి రేనియు జరామరణాదులు దూలునేయుం
బ్రకటముగాఁగ సంపదలు వాయక యింపుల నించు నన్న సే
వకులకు నిన్నుఁబోలఁగలవా యితరాశ్రయముల్ సదాశివా !

మ. సరసప్రౌఢి నమశ్శివాయ యను యుష్మన్మంత్రరాజంబు న
క్షరము ల్వర్గచతుష్కదానగతి వెన్కంబ్రోపుకాకున్న నే
నరచింతు న్మది నేన కూర్తు ననుచు న్సాంగాడలీలం బర
స్పరసంవాదము సేయుచుండుఁ గరమాకృత్యంబుగా శంకరా !

ఉ. వాసిగ మేలికృత్యములు వర్ణన సేయఁగ నేల నీసము
ద్భాసిత నామసంస్మరణప్రాపున యిప్పుడ కాదె యంతకున్
వాసితుఁ జేసె శ్వేతుఁ డిల సద్గుణజాతుఁ డితండు సొంపుగాఁ
జేసిన భాగ్య మెవ్వరును జేసిరె మున్ను దలంప నీశ్వరా!

వ. అని మఱియు విరచనంబుల వెలయు సంస్తుతివచనంబుల ఖండపరశుం బ్రసాదపరవశుంగాఁ జేసి పునఃపునఃప్రణామంబు లాచరించి, దేవా ! జగంబులు సమవర్తి లేకున్న వర్తిల్ల నేరవు తదీయాపరాధంబు దివ్యచిత్తంబున మఱచి యతనిం గ్రమ్మఱఁ గలిగింప వేయని విన్నవింప శివుండును నంతకుం బుట్టించి యెప్పటి యట్ల నిజభవహితంబుగా నపరస్థలంబులఁ జనవు మెఱయ నియోగించి, హరిప్రభృతుల వీడుకొలిపి, శ్వేతముఖగణపతులు గొలిచిరా నక్కడఁ గదలి రజతాచలంబునకు విజయంచేసి, యిష్టవిహారణంబుల విలసిల్లుచుండె.

క. అంతకదహన మనంగా
నెంతయు విలసిల్లు నమ్మహేశ్వరులీలన్
సంతతము వినినఁ జదివిన
నంతకభయ ముడుగు మిగుల నాయువు పొదవున్

ఆ. వె. వినుఁడు సముచితముగ వివరింతు నిటమీఁద
నభవుఁ డవధరించినట్టి లీల
నెందుఁ బొగడ నొప్పు నిది జలంధరవరా
హ్వయముతోడ నిధిసమగ్రమగుచు

సీ. అభ్రంలిహజ్వాల విభ్రమ క్షయకాల
దహనుని యపరావతార మనఁగ
విశ్వతాపనశూర విలయావసరఘోర
తపనుని యితర సందర్భ మనఁగ
గర్వసముద్దండకల్పాంతచరదండ
హస్తుని రెండవయంగ మనఁగ
సంక్షుభితస్వాంత సంవర్తదుర్దాంత
రుద్రుని మాఱటరూప మనఁగ

నఖిలదేవసంఘములకు నాత్మ లడల
నురక జలమండలస్థలినుద్భవించె
దనుజలోకదృగుజ్జ్వలదత్తభాను
లక్షణధురంధరుండు జలంధరుండు.

చ. అతఁ డుదయంబు నొందుటయు యాదిగఁ బంకజసూతిఁ గూర్చి సం
యతపగమార్జవుండును శమాంతమనస్కుఁడు పద్మకాసన
స్థితదృఢవిగ్రహుండును వశిత్వసమర్థుఁడు పర్ణనీరభూ
రుతకఠినాశనుండు నయి గాఢతపం బొనరించుచుండఁగన్.

వ. అమ్మహాత్ముని యతుల నిష్ఠాగరిష్ఠతకు విరించి యలరి ప్రత్యక్షం
బుగాఁ దలంచి,

చ. దివిజులు రెండు ప్రక్కల నుదీర్ణత గొల్వఁగ నందివాహవం
బవిరళరీతులం గతులయందము చూపఁగఁ గేల నక్షసూ
త్రవలయముం గమండలము దండము పుస్తకముం దలిర్ప దా
నవవిభుమ్రోల నిల్చెఁ గరుణం జని కంజభవుండు భాస్వలిన్.

వ. ఇట్లు నిల్చి, జలంధరా ! భవదీయ తపంబునకు మెచ్చితిని; కోరిక
వేఁడు మనవుడుఁ గరం బలరి యద్దానవుండు కమలసంభవు పాదం
బులకుఁ బ్రణామంబు సలిపి కేలు మొగిచి పెక్కు తెఱంగులం
బ్రణుతించి యిట్లనియె.

ఉ. ఎవ్వరు తన్నుఁ దాకుదు రహీనబలంబుల నాజులందు వా
రవ్వల నెట్టి రేనియును నందఱుఁ గ్రిందగుచుండునట్లుగా
నెవ్వరు వైచు హేతులను నే భయమందక యుండునట్లుగా
నివ్వర మిమ్ము నాకు నిది యెంతయు నిష్టము భారతీశ్వరా !

క. అనుటయు నట్ల యగుం గా
కనుచు సపరివారముగ వియద్గతిఁ గమలా
సనుఁ డరిగె నిట జలంధరుఁ
డును దద్వరదానమునఁ గడు న్మదమొసఁగన్.

ఉ. ధీరులుఁ జండదండధరధిక్కరణప్రకటప్రతాపసం
భారులు నగ్రజాగ్రదతిమాత్రపరాక్రమలబ్ధగర్వదు
ర్వారులు నాఁగ నెన్నఁదగు రాక్షసవీరులు గొల్వఁగా జయ
స్ఫారుఁడు దాల్చెఁ దత్సురసాధ్వసదానవసార్వభౌమతన్.

వ. ఇట్లు ప్రమదంబున సమ్రాట్పదంబుగా బహుకాలం బపూర్వ రాజ్యసుఖంబులం బొదలి యొక్కనాఁడా జలంధరుండు, అపహాత విమత మనోరథంబులగు రథంబులును, గండస్థలాఖండ గళన్మదపాథోబంధురంబులగు సింధురంబులును బ్రభూతరయ పరిభూత వినస్వదశ్వంబులగు నశ్వంబులును, నవక్రపరాక్రమ సముద్భటులగు భటులను సమకూర్చుకొని సహస్రక్షోణులగు నక్షౌహిణులతోడ జగజ్జైత్రయాత్ర సని క్రమంబున రసాతల మహీతలంబులు నిజాజ్ఞావశగతంబు చేసి దివంబున కేఁగి తత్ప్రదేశంబున

మహాస్రగ్ధర:-
సలిలక్రీడార్థ మా రాక్షసవిభుఁడు సముత్సాహ సన్నాహ భావం
బలర న్మందాకినీగాహనము సలిపి దీర్ఘాచలాకారబాహా
ర్గళముల్దీర్య క్రియం డగ్గఱ నిలిపె నడంగ న్వ్యమధ్య ద్రయంబా
కులకంపచ్చండ సత్త్వాక్రమము గని కడుం గంపమందన్సుపర్వుల్.

చ. తదసురహస్తరోధమునఁ దక్కక వేగమడంగి పొంగి యా
త్రిదశనదీప్రవాహము ప్రతీపగతిం జనఁజొచ్చె విస్మయ
ప్రదముగ నట్టివెల్లి నగరంబులు ముంచిన ముంచు నాత్మలం
దలఁకిరి లోకపాలురును దామరపాకున నీరు చాడ్పునన్ ?

సీ. శాతమన్యవరత్న చషకప్రదత్తాకరం
దనభారమున నాభివనజ మలర
సాంద్రతమాలవృక్షసమక్షచరమధు
వ్రతవిభ్రమమున శ్రీవత్స మమర
నంజనగిరితటీయాతబాలార్కసం
స్తుతవిజృంభమునఁ గౌస్తుభము వెలుఁగ
వర్షానవోర్వరావ్యాసక్తశంభత్తటి
త్ప్రవికాశమున రమాభామ నిలువ

గీ. దుగ్ధసాగరాకారబంధురఫణీంద్ర
శయనమున యోగనిద్రావసానలీల
భువనరక్షణ (చేసెడి) పొలుపు మిగుల
దనుజకులమర్దనుని జనార్దనునిఁ గనిరి.

గీ. కని మహీస్థలి సర్వాంగకములు సోఁక
నెరఁగి శిరములఁ గరములు నెరయ మొగిచి
యాత్మఁ గడుభక్తి దిలకింప నభినుతించి,
విన్నవించిరి యిట్లని విబుధవిభులు.

క. దేవా జలంధరుం డనఁ
గావలుఁడు గడుం గలండు కఱకుటసుర వా
ణీవర దత్తవరంబున
దేవతతులకంటెఁ దా నుదీర్ణబలుండై.

చ. పలువురుదుష్టరాక్షసులు ప్రాపుగఁ దెచ్చి యతండుమిక్కిలిం
బలువుగ మత్సరంబులకు బాధ లొనర్పఁగ నక్కడక్కడ
నిలిచివియన్నదీజలము నెట్టనపారక యుండియాత్మ బా
హులవశి యాఁగి వెల్లి దివి నొక్కట పర్వఁగఁ జేసె దేవరా!

గీ. పలుకులేల యింకఁ బలుమాఱు వాత్రువ్వ
నా జలంధరుని మహాత్ప్రతాప
మది సహింపలేక బెదరి నీయడుగులు
చేరి బ్రతుకవచ్చినార మీశ!

వ. అని విన్నవించుపలుకు లాకర్ణించి శార్ఙ్గధరుండు వారలతో నా రాక్షసభర్త మీకసాధ్యుం డట్లయ్యును భవదర్థంబరుగు దెంచెద; శాత్రవుతోడ రణం బొనరించెద; మీరు ముందటం జని, యతనిఁ దాఁకుం డని పనిచిన సమరసమూహంబులు సమరసన్నాహంబులం బొదలి నడిచి; గంతమున్న జలంధరుఁడును గేలి సాలించి, సైనికులం బోరికి నియోగించి, తానును గట్టాయతపడియుండె నా సమయంబున,

ఉ. ఈవల నొక్కయుమ్మడి ననేక విధాస్త్రవిపాటనంబులన్
దేవనిశాటసంఘములు దీప్తభుజాబలమొప్పఁ బోరఁగా
నావల వచ్చి యుద్ధతి నిజాతత సేనలతోడ దాఁకె ల
వరుఁడుం జలంధరుని జిత్రకరక్రమవిక్రమంబునన్.

క. కడువడి సురసంఘము లి
క్కడ నక్కడ నొక్కపెట్టు కవియుటను బె
ల్లడకొత్తు నడుమ నిరుకఁగఁ
బడుపోకయపోలె దనుజబల మది వగిలెన్.

చ. పగిలినఁ జూచి తద్విభుఁడు భావమునం బలముం దలిర్పఁగాఁ
దగిలి సుపర్వవాహినులఁ దాఁకినఁ దత్కరచాప నిర్గతా
శుగహతిఁ దూలె నన్నియును జోద్యము సంక్షయకాలసంభవా
శుగహతి గోత్రసంఘములు సొంపఱి తూలినమాడ్కినత్తఱిన్.

చ. అసురగణాధిపాగ్ని శమనాస్త్రపవార్ధిప వాయుయక్షరా
క్షసుఁ డనువార లుగ్రకులిశాద్భుతశక్తులు చండదండఖ
డ్గసురులు పాశహేతులుఁ బ్రగాఢముగానున శూలముల్ సమం
త్రములుగఁ బూనివైచిరి ధరించిదనందఱు నా జలంధరున్.

మ. అవియు న్మంటలు మింటఁబర్వఁగ యుగాంతాయాతమార్తాండసం
ఘవిధంబాత్మలఁ దోఁప నా దనుజలోకగ్రామణిం బ్రహ్మద
త్తవరప్రాప్తఖరప్రతాపనిధి దుర్దాంతక్రియం దాఁకి ది
గ్ధవయూథంబునతోన పోలు వివిధత్వంబున్ విచిత్రంబునన్.

ఉ. అప్పుడు శార్ఙ్గముక్త నిశితాంబకవర్షమునన్ దిశాతతుల్
గప్పుచు నాజలంధరుని గర్వముఁ దీర్పుదునంచు విక్రమం
బొప్పఁగఁ బంకజాక్షుఁడు మహోగ్రపు గర్జల నంబరంబొగిం
జప్పుడు సేర్చి నెట్టిపడఁ జండగతిం జనుదెంచె నత్తఱిన్.

క. ఆరజనిచరవిభుండును
గ్రూరాస్త్రము లొక్కపెట్ట గురియుడువడిన
స్నీరధిశయనునితోఁడం
బోరాటకుఁ గవిసి గర్వమున నిట్లనియెన్.

చ. చలము దలిర్ప మున్ను బలిసద్మ ధరాతలముల్ గ్రమంబునం
గెలిచితి నింక నాకమును గెల్వఁగఁ బొల్పడి తండ యింద్రునిం
దొలుత జయించి యాపిదపఁ దోడిదిగీశుల గెల్తు నంచు నేఁ
దలఁపగ వార లిక్కడికి వచ్చిరి మెచ్చిరి నొచ్చిరందఱున్.

క. అవియంత నిన్ను నొడువన్
హృదయంబున దెలుపవచ్చి తీవును నిటకుం
వెదకలఁబడుత దనంతన
పదములఁ బెనఁగొనినయట్లు పంకజనాభా!

వ. అనిన విని కైటభాంతకుం డంతటవాఁడవయ్యేదు, గాంత గలవా యటంచు దనుజనాయకుం గదిసె; నిట్లిరువురు పరస్పర జయ స్పర్ధావర్ధమాన కోపంబుల నాటోపంబుగాఁ దలపడి, గంధకరులు వోలెఁ బెనంగుట గలిగి, యతిక్రాంత మర్యాదరూపంబుల వెల యుచు సమాహుతహుతాశనులువోలె మండుటంగలిగి, దుస్సహప్రతాపంబులు వెలయుచుఁ దగిలి, కలిమిమిగుల బాణం బులు కృపాణంబులు భిండివాలంబులు మొదలుగా నానాస్త్ర శస్త్ర పరంపరలం గొంతతడవు దెరలక మరలక పోరి, కలుషి తాంతఃకరణంబుల నడరి, మల్లరణంబునకుం దొడరి, సవ్యాప సవ్యమండలభ్రమణంబులను, బాహాదృఢగ్రహణంబులను, మధ్యగళనిపీడనంబులను, వక్షస్థలమస్తకఘట్టనంబులవలనను మఱియుఁ దగినంత దత్తత్క్రమంబులను బరాక్రమంబు దనర రెండు దళంబులకుం గొండొకప్రొద్దు కన్నులపండు వగుచుం బెనంగి రట్టియెడ,

చ. ఒడిచి విహంగమధ్వజుని నొక్కయుపాయమునం జలంధరుం
డడరఁగఁ బట్టియెత్తి తనయంగమునంగల సత్త్వమెల్లఁ బె
ల్లడరి భుజార్గళద్వయమునందుఁ దలిర్పఁగఁ బూనివైచినన్
సుడివడి తూలిచోద్యపడుచున్ శతయోజనదూర మాతఁడున్

ఆ. వె. శార్ఙ్గపాణియిట్లు చలమఱి తూలి తా
నదియెపోకగాఁగ నాత్మపురికిఁ
జనియె నచట నిలువఁ జంచలపడి వాస
వాదిసురలు బఱచి రార్తితోడ.

క. మొగతిరిగి పికాపికలుగ
దిగధీశులు విరిగి యిట్లు దెఱలుట గని వా
రగపడిరి నాకు ననుచును
నగుఁ బలుకుల నానిశాట నాథుఁడుపలికెన్.

చ. పఱవకుమింద్ర! దండధర! బంటుతనంబు దలంపు మేల యు
క్కఱ జలధీశ! నిల్వఁదగు నర్థప! యక్కట యోహుతాశ! నీ
చుఱచుఱ చూపఁగాఁదగదె? త్రుక్కకు రాక్షస! గంధవాహ! క్ర
మ్మఱుము త్రిశూలహస్త! మఱమాటలు వల్కకు మింక నెన్నఁడున్.

వ. అని మదలించుచు, నింపునం గూడముట్టియొక్కని బాడుదలవట్టి యీడిచి తెచ్చి నందఱచరణంబులు నాముక్తనిగళంబులు గావించి, తదంతఃపుర కాంతలఁ జెఱలువెట్టను దత్సంపదలు గొల్ల వెట్టను నాజ్ఞాపించి, దిశానగరంబులకు వీరభటులం బంచి, కృతకృత్యభృత్యసహితుండగుచు, నఖండజయం బమర నిజస్థానంబున కరిగి, యేకాతపత్త్రంబుగా నేలి, తద్దయుఁ బ్రావాలి యొక్కనాఁ డాత్మగతంబున.

మ. జ్వలితస్వాంతత జంభభిత్ప్రముఖదిక్చక్రప్రభుల్ సంగర
స్థలినస్మన్నిశితాశిపత్త్రిఁ గని లజ్జం బాసి యూథప్రియా
వలి దాసీతతిఁ జేసి యిచ్చిరిటు సర్వస్వమ్ములుం దారు సం
గలితాంఘ్రిద్వయి నొంద నేమియన నింకం దన్మహాభాగ్యముల్.

క. కడిఁదితపంబునఁ బద్మజు
నొడిచితి రణవీథి శార్ఙ్గి నుడిపి మడిపితిన్
మృడుఁడొకఁడ యిపుడు నాకగ
పడువారల లోనఁ గడమ పడ్డాఁ డరయన్.

ఉ. కావున నేఁడ యేఁ జని యఖర్వవిజృంభణ మొప్ప నమ్మహా
దేవు రణంబునం గదిసి తెంపుఁదనం బుడిగించి భూరిచి
త్రావహలీలఁ దద్గణసహస్రతదాత్మజతద్వధూతదా
సావలి ముస్సుగా నురక యాతనిఁ బట్టెదఁ గట్టవెట్టెదన్.

వ. అనుచుఁ దలపోసి వాసిగలవారిఁ గొనుచు నసురవిభుండు గండు-మిగిలి, కండ్లబలుపున నేములనిలుపున, నాబద్ధచిత్రచర్మంబుల పొలుపునఁ జూపరకు భయదంబులు ప్రియదంబులు నగు రథవ్యూహంబులు మహోగ్రాహంబులును, సెలయేరుల కొమరుమిగులుచుం దొరఁగు మదధారలకుం గవియు తేంట్ల దాఁట్ల తొలంగఁ జడియు చలత్కర్ణంబులు సుదీర్ఘశుండాలంబులు సపక్షక్షితికులంబులును, సమున్నతగతుల మిన్నులతోడను దాఁటుచు, మీఁదుమిగిలియు, తతజాగ్రత్వంబులగు తురంగంబులును, ఝళిపించిన తళి మించి తళుకు తళుక్కున మెఱయు నసిలతలు తటిల్లతలగతినుండు నీలమణిబంధవర్మాంశువులగు సుభటజాతంబుల జలగ్రహణాగతజీమూతంబులును, తత్పదసముత్పతదపూర్వసర్వంసహారజఃప్రసారాంబుపయఃపూరంబును, గోమలసుధాధామ కిరణంబుల కనుకరణంబును దారముక్తాహారచ్ఛాయకుం బ్రతిచ్ఛాయయునగు చామరవితానంబుల ఫేనంబును, మంధరగంధగంధవాహధూతసమీచీనచేలంబులును, దుగ్ధతరబాడబకీలంబులును శతచ్ఛత్రకజాతంబులును, క్రీడాగతరాజమరాళంబులునుగా నిభృతగుణవినిద్రంబగు నిజసేనాసముద్రం బతిక్రాంతమర్యాదంబుగా వెల్లివిరియించి గొనిచని, రజతాచలపాదంబులవిడిసె; నంతకమున్న యక్కడ

శా. సంధ్యావందనభక్తి నబ్ధి కరిగెన్ జంద్రాశ్రయాశార్క సం
బంధ్యాంశునిరీక్షణుండు గనకాపూనప్రభావజ్జటా
సంధ్యాబద్ధభుజంగమేశ్వరుఁడు శశ్వల్లోక సంరక్షణా
సంధ్యారంభవిజృంభమాణుఁడగు సర్వజ్ఞుండు లీలాగతిన్.

క. అట నా జలంధరుఁడు ను
త్కట రభసము మెఱయునట్లు తారావనిభృ
త్తటి విడిసియుండి సంగర
పటిమం దదనంతరంబ బలదుస్సహుఁడై.

చ. అరుదగు సిద్ధయానమున నంజనపర్వత మీశ్వరాచల
స్ఫురణకు నోర్వలేక మదిఁబూనిన పూనిక దాడిగాఁగఁ బై
కరిగెడు నాగకృష్ణభయదాంగకుఁ డాతఁడు తన్మహాద్రిభా
స్వరగతి నెక్కియార్చెఁ బురవప్రముఖస్థలి నుండి చండిమన్.

శా. తేలెన్ ఝల్లునఁ జుక్కలెల్లఁ బెలుచన్ బృథ్వీస్థలం బంతయున్
వ్రీలెన్ భగ్గున నక్కడక్కడఁ గులోర్వీభృన్మహాకూటముల్
గూలెన్ దెబ్బున నుద్భవద్భయదకక్షౌఘంబునం దిక్కరుల్
వ్రాలెన్ గొబ్బున నా జలంధరుని జాగ్రత్సింహనాదంబునన్.

ఉ. తత్పరుషారవంబు విని తారగిరీంద్ర నివాసు లందఱున్
హృత్పరిపూర్ణసంభ్రమత నెవ్వరికిం బడి నిప్పుడంచు న
త్యుత్పరదంష్ట్రులై కరసముద్యత భీషణశస్త్రులై వివ
స్వత్పటుతీవ్రతేజముల వచ్చిరి నిర్జరవైరియొద్దకున్.

శా. వారిం జూచి జలంధరుం డనియె ధట్టంబైక వాక్యంబునన్
మీ రిట్లేఁటికి సంభ్రమింపఁగ సమున్మీల న్మదాహానల
స్ఫారాస్త్రార్చులు రుద్రుఁ డన్విరసకక్షవ్రాతముం దక్కనొం
డారంగాల్చవు పిల్వుఁడిప్పుడ ప్రభావాఖర్వునా శర్వునిన్.

వ. అనిన విని కైలాసనివాసులు ప్రహాసభాసురులగుచు, మూఢా! దానవ! జగత్కంటక! సంహారదక్షుండగు ఫాలాక్షుం డభిమత విహారంబులు సలుపుచు, సముద్రతీరంబున నున్నవాఁడు; భవాదృశులా మహేశ్వరుం దొడరుట మిడుతలు దవహుతాశనుం

దొడరుట యగు నింతియ; నీమాత్రంబునకు మామాత్రంబు చాలుఁ జక్కఁ గమ్మనుటయు, దనుజపతి పకపక నగి, యీ జిలుగు ప్రజ నిప్పుడు బిలుకుమార్పనేల? మీఁదటం జూత మనుచు, మరలి రభసంబున కైలావనంబునకుం జని,

శా. ఆరక్షోవిభుఁ డక్కడం గనియె బాహాలగ్నభుగ్న శ్రమా
గారార్చిర్గణ శత్రులోక భయశంకాదాన హుంకార సం
స్కారాయత్త మహత్తరజ్వలన జాగ్రత్వాదిశూలింజటా
భారావస్థిత బాలశీతకర శుంభ స్మృదుని రుద్రునిన్.

మ. కని మాయాపరు నాహరున్విగతశంకం జేరి దేవారి యి
ట్లనియెం గొండొకవిందునిన్నుఁ (గొని) కాయాపూర్వవిద్యాత్మకుం
డనుచు న్మాటలు తేటతెల్లముగ నీవాజిం బలభ్రాజివై
చనుదెమ్మా నను మార్కొనంగ నిపుడీశానా! మహోద్దామతన్.

క. అనుటయుఁ ద్రిశూలధరుఁడా
దనుజాధిపుఁ జూచి మూఢ తద్దయుఁ గూడం
జనుదెంచినాఁడ వాజిన్
నను దొడరఁగ వశమె నీకు నావుడు వాఁడున్.

చ. కఱకుఁదనంబు మీఱఁ ద్రిజగంబులు గెల్వఁగఁ జాలు విక్రమం
బొఱపుగ నున్నవాఁడు నిను నొక్కని నిప్పుడు పోరమార్కొనన్
వెఱచునె బాలురం బలుకు నేర్పునఁ బల్కితి; వేమి చెప్ప? ము
న్నెఱుఁగవుగా జలంధరు నహీనజయార్థవిధాధురంధరున్.

వ. అనిన విని, యాజగత్కర్త సముద్రతీరంబు నలయాకారంబుగా కాలిపెనువ్రేలిపుటంబున లిఖించిన నందు నుదంచితమహిమంబున,

మ. జననం బొందఁగఁ జేసెఁ జక్రము దశాశాచ్ఛాదనాచ్ఛప్రభా
ఘనతామ్రస్ఫుట విస్ఫులింగచయలోకత్రాణ సంపాదన
ధ్వనమజ్జ్వాల సముజ్జ్వలజ్జ్వలన దుర్వారక్రమాఘోర ని
ర్ధ్వంసఘాటంబు జనూనావకర్షణదారాగర్వనిర్వక్రముల్.

వ. ఇట్లు వదలి దుస్సహంబై యరుగుచున్న సుదర్శనం బతనికిఁ జూపి, జలంధర! కదనంబునకు నీమనంబునఁ బూనిక గలదేని దీనిని నెత్తుము పిదప నభిమతంబు లిత్తు ననిన వాఁడు మండుచు ధూర్జటి దుర్జయ మదీయసారంబు లేఖామాత్రాధారంబునఁ దేటపడఁ గానంబడు నని యిట్లనియె.

సీ. పిన్న ప్రాయమునాఁడు భీమతపంబున
నలువఁ గింకరునిగా మెలపినాఁడ
హస్తార్గళంబున నాఁగి మందాకినీ
జలవేగ మంతయు నిలిపినాఁడ
నూరక విష్ణుని నూరుయోజనములు
చిక్కని లావునఁ జిమ్మినాఁడ
నాకాధిపుల నెల్ల నాశమాలిచి తెచ్చి
కారాగృహంబులఁ గ్రమ్మినాఁడ
వారియాండ్ర నింట వరువుళ్ళుగా నేలి
కొలఁది లేనికీర్తి కెలదినాఁడ
యింకఁ గడమ నీవ యీశాన! నిన్నిటఁ
బట్టి గెలిచి చెఱను బెట్టి యలఁతు.

ఉ. నావుడుఁ బిన్ననవ్వు వదనంబునఁ గొండొక దోఁప శంకరుం
డావిబుధారిఁ జూచి, యగు నంతటివాఁడవ యట్లు చాలవా
నీవు సహింపు దద్రణవినిద్ర బలక్రమ విక్రమ స్వదు
ర్భావికరాళకీల పటుబాలదృగుత్పదవీ ధృతాంగులన్.

చ. అనునెడ నాజలంధరుని యానతి దానవసేన లెల్ల ను
క్కన హలచర్మచక్ర శరకుంతపరశ్వధ ఖడ్గతోమరా
ద్యనితరధార లక్షవిధదీప్తమహాస్త్రము లొక్కపెట్ట యు
గ్రునిపయిఁ బెల్లుగాఁ గుఱిసెఁ గోయని దారుణభంగి నార్చుచున్.

మహాస్రగ్ధర:—
హరుఁడా రక్షశ్చమూపవ్యవసిత మనమున్ వ్యక్తలాలాటభాగ
స్ఫురదాలోకంబుకోపంబునఁ బెనఁచినఁ బ్రోద్భూతభుద్భుట్ప్రణాద
స్వరుసాహస్రప్రజాగ్రచ్ఛటఛట దహనజ్వాల జాజ్వల్యమానాం
బరమున్ శుంభజ్జపారంభమును నగుచు మనఃపావకంబుద్భవించెన్

వ. ఇట్లు పేర్చి యాసప్తార్చి సహస్రాక్షౌహిణులగు తదీయవాహినుల నొక్కమాత్రాన ఘనచమత్కారంబు గావించి మగుడఁ దన్నయనంబు ప్రవేశించినఁ, దత్కారణంబున నంతఃకరణంబున విస్మయంబులు దలసూప నాపినాకధారి యోరాక్షస! సమరంబునకు రేఖోద్ధరణంబు దగులుగా వాక్రుచ్చినవాఁడవు గావున వచ్చి యింక నేనియు నిది యెత్తుము; మఱి ననికి వత్తు ననినఁ దనంతరంబ.

ఉ. కొంకక యిప్పు డీవు జిలుగుం బ్రజఁ గొంత వధించి దీనికిన్
శంకర! యుల్లసింపకు మనంబున నీసమయంబు దీర్చి నా
వంకల గట్టి చేవయును వాఁడియుఁ జూపుదు నీకు నంచు ని
శ్శంకతఁ జక్రమెత్తి రజనీప్రభుఁ డంసము మీఁదఁ బెట్టినన్.

మ. అది సంవర్తరవిప్రకారముగ దీప్తాకారముం బూని యా
త్రిదశావాసవిరోధి యంసఘనవీథిం గాడి తద్గాత్రమున్
విదళించె న్వడి రెండువ్రయ్యలుగ నుర్విం గూలె వాఁ డమ్మహా
భిదురాపాతరయ ప్రభిన్నకులభూభృచ్ఛంక పుట్టించుచున్.

వ. ఇవ్విధంబున నవ్విభుండు గిరిశారిగతి జగదసాధారణబాధాకరుం జలంధరుం గీటడంచుటయు, హరివిరించులు విశ్వశివంకరుండగు శంకరుమీఁద హర్షంబునఁ గుసుమవర్షంబును గురియించి, యనిమిషమునిసహితం బచటి కేఁగుదెంచి, భయభక్తివిశ్వాసంబులతో దళితశారదారవింద విలాసంబులగు తదీయచరణంబులకు నమస్కారంబు లాచరించి యిట్లని విన్నవించిరి.

క. ఊరీకృత శరణాగత!
హారీకృత భుజగనాథ యాతతలీలా!
దూరీకృతాఘ! జగదా
ధారీకృతచరణ! జయసుధాకరభరణా!

చ. శరణము మాకు నీదుపదసారసయుగ్మము యింక నెప్పుడుం
దరణము మాకు నీదుపదసారసయుగ్మము మాటిమాటికిన్
శరణము మాకు సీదుపదసారసయుగ్మము యింతదక్క నొం
డెఱుఁగము గాన నీకు మము నారయు భారము విశ్వనాయకా!

ఉ. ప్రాలిన యీజలంధర దవజ్వలనంబుల నెల్లలోకముల్
వేలిమిఁబుచ్చ నున్నతఱి వేగ భవజ్జలదంబు సత్కృపా
పాల ఘనప్రభావమయవర్షము చేతఁ దదీయసర్వమున్
లీల దలిర్ప నార్పవె వినిద్ర దయాస్పద! యోమహేశ్వరా!

వ. అని యభినందించి, దేవా! యింద్రాదులు నిగళపాదులగుచు జలంధరుపురంబునఁ గారాగారంబుననున్నవారు; తద్బంధమోక్షంబుఁ గృపసేయుమనుచు విన్నవించుటయుఁ, గాలరుద్రునిం బనిచి, వారలనిరోధంబులం దొలఁగించి, తత్తత్పదంబులఁ బ్రతిష్ఠించి యప్పటియట్ల కైలాసంబునకు వచ్చి, యథోచితవిహారంబులు సలుపుచుండె.

క. వరుస జలంధరవధ మనఁ
బరగిన యాయభవులీల పటుభక్తిరస
స్ఫురణం జదివిన వినినం
బురసంపద లబ్బు బంధములుఁ బెడఁబాయున్.

శా. పంచారామ పురాప్సరోన్నయ లసత్పద్మాసనాసంచయో
దంచద్రాజమహేంద్రనామ నగరప్రావిష్టవీటీసము
త్పంచారామ సరోధవీరరస తత్కర్పూర రేణు స్నాట
త్పంచాస్త్రాయత కీర్తి వార్ధిసుమహార్ణా! సంతతక్రీడితా!

క. ఈడితయమమదభంజన
ఘోడియరాయాంకభీమ గురువర్యకృపా
ప్రేడితసౌభాగ్యయశో
వ్రీడితపరిపంథిగర్వారివరనికరా!

చామరము:—

స్మరాతిశాయిరూప విభ్రమా! యనాగతభ్రమా
వరాస్త్రసుప్రయోగరాజవాయహస్తలాఘవా!
నరావరప్రదా! జనార్దనా యనమ్రమర్దనా
ధరామరప్రపోషణాంచితామహాత్వసంచితా!

గద్య

ఇది శ్రీ మదష్టభాషాకవితాప్రవీణ నయవిబుధ
స్తుత్య నిశ్శంక కొమ్మనామాత్యప్రణీతంబైన
శివలీలావిలాసంబునందు
ద్వితీయాశ్వాసము.
శ్రీ సాంబశివార్పణమస్తు.
శ్రీ. శ్రీ. శ్రీ.

శ్రీ ర స్తు

# సీతారామచరిత్రము

## ద్వితీయాశ్వాసము

కం. శ్రీలస ద్వృషభతురంగా,
బాల మృగాంకోత్తమాంగ, పాపవిభంగా,
లాలితగుణసంగా, ధృత
లీలాసారంగ, భీమలింగ, శుభాంగా.

వ. దేవా, యవధరింపుము : కమలసంభవుండగు నారదుండు వల్మీక సంభవున కిట్లని చెప్పదొడంగె "నట్లు సకల విశ్వంభరా సామ్రాజ్య దురంధరుండైన దశరథేశ్వరుం, డొక్కనాఁడు వసిష్ఠ వామదేవాది పురోహితులను, సుమంత్రాది మంత్రులను, బంధుర గుణసింధువులగు బంధు మహీపతులను, గవిగాయక వందిమాగధ వైతాళికాది సకలజనంబులుం గొల్వఁ, గొలువుండి యందఱి డెందంబుల కమందానందంబుఁ గూర్పందగు మృదుమధుర వచనంబుల నిట్లనియె.

కం. వితతములగు భోగంబులు
సతతంబును గంటి సకల జన సన్నుతులన్
సుతులను గంటిని ధర్మ
స్థితి ధర నేలితిని ప్రజను సేమముగాఁగన్.

ఉత్సాహ॥ ధరణిపాలనంబు సేయఁదనివితీఱెఁ గావునన్
వరగుణాభిరాము ధవళపారిజాత లోచనున్,
గురుకృపాయుతాత్ముఁ బెద్దకొమరు మేరుధీరునిన్,
పరమతేజు రాము నింకఁ బట్టభద్రుఁ జేసెదన్.

కం. శత్రువులగెల్చి రక్షిత
మిత్రుండై, ధాత్రి నేలి మెఱయుచునుండన్
బాత్రము, పుత్రులలోపల
గోత్రాజాతాకశత్రకుం డరయంగన్.

వ. అనిపలికిన రాజపరమేశ్వరునకు సభ్యులిట్లనిరి.

కం. మిత్రకులవర్ధనుండును,
మిత్రకులావనుఁడు, నపరిమితవీర్యుండున్
ధాత్రీభరణార్హుఁడు, నీ
పుత్రుఁడు రాముండు, రాజపుంగవ, యనినన్.

ఉ. సంతసమొప్ప రాము జనసంఘనుతుం బిలిపించి యద్ధరా
కాంతుఁడు భవ్యపీఠమునఁ గన్గనఁ బుత్రకునుంచి పల్కెని
న్నింతటనుండి సర్వమహి నేలఁగఁ బంచెదనామనోరథం
బంతయుఁదీరఁ బార్థివచయంబులు మెచ్చఁగ ధాత్రినేలుమీ.

కం. మానితసంపదలందితిఁ
బూనితిఁ బెక్కేండ్లు సకలభూభారంబున్
సూనులఁగాంచితినల్వుర
దానము లఖిలాధ్వరములు దగఁ జేసితిఁగా.

వ. నాకు నేమియుం గొఱంత లేదు. కావున, రాజ్యభోగంబుల విర
క్తుండనైతినని చెప్పి యిట్లనియె.

కం. తమ్ములు నీవును గడునె
య్యమ్మెనయఁగ మెలఁగుచుండ నఖిలోర్వీచ
క్రమ్మేలు నిన్నుఁ జూడఁగ
నెమ్మదిలోఁగోరినాఁడ నీతివిధిజ్ఞా

కం. జగతీజనులు నుతింపఁగ
సుగుణంబులవాసిఁగాంచి సూనుఁడవగుటన్,
దగనిను బట్టము గట్టెద;
నగణితభుజవీర్య, మందరాంచితధైర్యా.

వ. ఎల్లి నీకుఁ బట్టాభిషేకం బొనర్పందగిన ముహూర్తంబు నిశ్చయించితిం; గావున నీవు సీతాసమేతంబుగా నుపవాసాదినియమంబు లనుష్ఠింప నేగు; మనిన నల్లెయని రామచంద్రుండు సంతోషించి తన మందిరమ్మునకరిగి కళత్రసహితుండై యథోచితాచారప్రవర్తకుండయ్యె; నప్పుం డప్పురజనులా వృత్తాంతంబు విని యత్యంతకుతూహలాయత్తచిత్తులై ఘనసారచందన కస్తూరికాకుంకుమపంకసంకలిత హిమజలంబుల కలయంపిఁజల్లువారును; గృహాంగణంబుల ముక్తామణిగణంబుల రంగవల్లికల దీర్చువారును; రాజమార్గంబులఁ జూతాశ్వత్థపల్లవకమలకైరవ కల్హారచంపకాదికుసుమదామంబుల తోరణంబులు గట్టువారును విచిత్రాంబరాభరణపుష్పమాలికాదులఁ గరితురగశతాంగంబు లలంకరించువారును; భేరీకాహళపణవమర్దలప్రముఖ వాద్యగంభీరనాదంబు లెసఁగించువారును; కనకమణిమయ భూషణాలంకృతులై రామవిజయాంకగీతంబులువాడుచు నృత్యంబులు సేయువారును; సౌధోపరిభాగంబుల శాతకుంభకుంభంబుల నూతనచిత్రాంశుకవిరచితకేతనంబులు నిలుపువారును; వేశ్యాజనంబుల యనూనంబులగు గానంబులు విని మేనులుమఱచి యప్పుడ తెలివినొందిన డెందంబుల శిరఃకంపంబు లాచరించి యానందించువారును; మఱియు ననేకు లనేకవిధంబు లొనర్చువారునై యుండ; నక్కలకలం బాకర్ణించి చూచి కైకేయిపరిచారికయగు మందర తనడెందంబున నిట్లని వితర్కించె.

సీ. శ్రీరామ రాజ్యాభిషేకోత్సవంబగు
నిది; గాన, బురజను, లిట్టిపనులు
సేయుచునున్నారు చెలఁగుచు; దీనికి
నంతరాయంబు చేయింతునిపుడు;
మున్ను, నాపదభంగమును జేసె రాముండు;
నాఁటివైరము, నామనంబునందు
నాటియున్నదిగదా నేఁటికి; నదిగాన,
జలము సాధించుట సముచితం; బ

తే. గీ. టంచు నూహించి దుర్నీతినాశ్రయించి
ప్రజలు నిందింతురనియెడు భయమువిడిచి
కైకవసియించియున్న యగారమునకు
నెలమి నేతెంచి కైకతోఁబలికె నిట్లు.

ఉ. ఏమనివిన్నవింతు, శరదిందునిభానన. భూవరుండు, దా
రాముని సర్వధారుణికి, రాజుగఁ జేయఁదలంచె నెల్లి; యో
భామిని, విన్మ సీసవతిపట్టికిఁ బ్రాభవమబ్బె నేని, ని
బ్భామిని నీసుతున్ భరతుఁ బూజ్యునిగాఁ గనుఁగొందు రే? జనుల్

గీ. రాముఁబట్టాభిషిక్తుఁగా, రాజుచేయఁ
దలఁచుమాత్రన, కౌసల్య, తనదుమదినిఁ
బతికి మిక్కిలికూర్మి నాపై నటంచు
గర్వమందె; నిజంబట్లు కాదె? తలఁప.

కం. నీపై నెక్కువమక్కువ
నీపతికింగలిగె నేని; నీసుతు సకలో
ర్వీపాలుఁ జేయఁదలఁపడె?
యోపంకజనేత్ర, యూత్మనూహింపు తగన్.

ఆ. వె. సవతితల్లికొడుకు జలనిధి వేష్టిత
మేదినీశుఁడగుచు మెలఁగుచున్న;
నీ సుతుండు వానిదాసుఁడై తిరుగుచు
గడుపుఁ బ్రోచుకొనుచు మిడుకుచుండు.

కం. కావున నీ తనయుఁడు వసు
ధా వరుఁడై వెలయ వేఁడు దశరథునిఁక ; నీ
పై వరునకు దయగల్గిన;
గావించును నీతలంపుఁ గంజాతముఖీ.

ఉ. అనవుడుఁ, గైక యిట్లను : జనాధిపు నాత్మజులందు నగ్రసం
దనుఁడు, గుణాభిరాముఁడును, దల్లుల ముగ్వుర నొక్కరీతిగా,
గనుఁగొను నీతిశాలి, ఘనకాండవిఖండితశాత్రవుండు, స
జ్జననుతుఁ, డాశ్రితాది...పాలము, రాముఁడు; పూజ్యుఁ, డన్నిటన్

వ. అది గావున

ఆ. వె. రాముఁడేలఁ దగినరాజ్యంబు భరతున
కిచ్చునే? నృపాలుఁడేను వేఁడ;
గాక జగతి నెట్టిఘనులకు నేనియు,
మందరా, దురాపమందరాదు.

కం. ఐనను, భరతుఁడు రాజ్య
శ్రీ నొందఁగఁదగిన బుద్ధిసెప్పుము; నే నా
భూనాథు వేఁడికొనియెద
మానుగ నాపలుకుసేయ మందర యనినన్.

మత్తకోకిల॥ కైక మాటకుఁబొంగి మందర గారవంబునఁ బల్కె ని
క్ష్వాకువంశవరుండు తొల్లిట శంబరాసురు గెల్వఁగా
లేక స్రుక్కి భవన్మనోజ్జ్వలలీల వాని జయించి తా
నీకు రెండువరంబులీయడె? నీరజాతవిలోచనా.

కం. ఆరెండువరము లిప్పుడు
నీ రమణుని వేఁడుకొనుము నిక్కముగాఁగన్
భూరమణుఁడు, నీపైఁగడుఁ
గూరిమికలవాఁడు గానఁ గోమలి యొసఁగున్.

కం. కొడుకునకు రాజ్యమబ్బఁగ
నడుగు మొకవరంబు; రాముఁ డటుపదునాల్గేం
డ్లడవులవెంబడిఁ దిరుగఁగ
నడుగుము రెండవవరంబు; నంబుజగంధీ.

కం. అనిపల్కిన సంతోషము
మనమునఁ బెనఁగొనఁగఁ, గైక, మందరకును దా
వినయమున, ధన మొసంగుచు
ననిపి యమర్షంబుఁ జెందునటు లొకచోటన్.

కం. మాసినచీరముసుంగిడి
దాసీజన మాత్మలోనఁ దల్లడపడఁగా
నాసతి నేలఁబరుండఁగ
నాసమయంబున నృపాలుఁ డటనే తెంచెన్.

తే. గీ. వచ్చి కైకేయి శయనించు వరుసఁజూచి
యేలొకో, కోపమొందుచు, నీలతాంగి
నేలఁబవళించియున్నది నేఁడు చూడఁ,
గారణం బిట్టులుంటకుఁ గానరాదు.

ఉ. అనిమది నెంచి పంక్తిరథుఁ డంగనకుందరిఁజేరి కైక, యి
ట్లునికికిఁ గారణంబెరుఁగ నొప్పుగఁజెప్పుము; నిన్ను నెవ్వరై
నను గఠినోక్తులాడిరె? జనంబు లకారణనింద సేసిరే?
నను మొగమెత్తిచూడ విది, నాయమెనీకుఁ దలోదరీమణీ?

కం. నీయెడ నే యపరాధముఁ
జేయుదుగా ; కోపమేల! చెప్పుము నాతో
జాయామణి కైకేయీ
కాయము నొవ్వన్ బరుండఁగా నేల ధరన్

కం. మదనాశుగ వేదనచే
మది కందఁగఁ దాళలేక మక్కువతో నీ
సదనంబు సేరినాఁడను
హృదయేశ్వరి నన్నుఁ గరుణ నీక్షింపఁగ దే.

చ. అని బహుభంగులం బ్రియములాడుచునున్న నృపాలుఁగాంచి య
వ్వనిత మనంబులో ముదము వర్తిల నాత్మవిభుండు మీన కే
తనశరవిద్ధుఁడౌ టెఱిఁగి తప్పక యిప్పుడె చెప్పనొప్పునా
మనసున నాఁటిమాట యని మానవనాథునితోడ నిట్లనున్.

చ. తొలుతను శంబరాసురునితోడను నీ వనిసేయువేళ నా
వలనను మేలుఁగాంచి జనవల్లభ రెండువరంబు లిచ్చితీ
విలవిబుధుల్ నుతింప; నిపు డీవలెనవ్వరయుగ్మమన్న ; రా
ట్కులవరుఁడిచ్చినాఁడ; నీకఁగోపముమాను లతాంగి నీమదిన్.

వ. అనినఁ గైకేయి యిట్లనియె.

కం. జనవర భరతుఁడు రాజ్యము
గనఁ జేయుము రామచంద్రుఁ గౌసల్యానం
దనుఁ బదునాల్గబ్దంబులు
వనవాసిం జేయు మివియ వరములు నాకున్.

తే. గీ. అనిన గుండియలదర నయ్యవనివిభుఁడు
కొంతతడ వూరకుండి యక్కాంతఁ గనుచుఁ
గర్ణశూలంబులైన వాక్యమ్ము లిట్లు
పలుకఁ జెల్లునె నాతోడఁ బడఁతి నీకు!

కం॰ రాముండు సకలజగదభి
రాముండు కృపాయుతుండు రాజితశౌర్యో
ద్దాముండు సోదరోన్నతి
కాముండుఁ బయోనిధానగంభీరుండున్.

కం. జననీజనకులతోఁ గడు
వినయంబున మెలఁగుచుండి వేడుక నిత్యం
బును జేయు రాము నడవికిఁ
బనిచిన సుఖమానె? కుటిలభామిని నీకున్.

ఆ. వె. సవతితల్లు లాత్మజననియు సరిగాఁగ
లోనెంచు సుతులలోనఁ బెద్ద
రాముఁ డట్టివాని రాజుగాఁ జేయక
యడవి కేగమందునా? దురాత్మ.

కం. అక్కట చక్కని కుబ్జని
నక్కటికంబింత తక్క యడవికిఁ బనుపన్
జక్కఁగ వేఁడెదు నిక్కఁపు
రక్కసివే కాక నీవు రాజాంగనవే?

ఉ. కాన కుబుద్ధి నీకు నసుఖప్రదమై జనియించె నింకిటన్
మానుము క్రూరవాక్యములు మాటికి నేటికిఁజాలు రామునిం
గానకుఁ బంపఁజాల విను కైక మతెద్దియు వేఁడ నిచ్చెదన్
గాని యటన్న నప్పలుకు కర్ణయుగంబున సోఁకునంతలోన్.

వ. కైకేయి కోపించి యిట్లనియె.

తరల. అవనినాయక భానువంశము నందుఁబుట్టిన రాజు లే
యవసరంబులనైన నీవలె నాడిరే యనృతంబు? లా
ర్జవముతోడుత నేను గోరువరంబు లీయకయుండినన్
భువననిందవహించు నీ కిఁకఁ బుణ్యలోకము లబ్బునే?.

| | | |
|---|---|---|
| 5. | సర్వేశ్వరశతకము-యథావాక్కుల అన్నమయ్య | 0- 3 |
| 6. | అకారాద్యముద్రితగ్రంథసూచిక | 0- 8 |
| 7. | ప్రాకృతభాషోత్పత్తి, శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | 0-12 |
| 8. | శివతత్త్వసారము-మల్లికార్జునపండితారాధ్యులు | 0-12 |
| 9. | చంద్రభానుచరిత్రము-తరిగొప్పుల మల్లన్నకవి | 1- 0 |
| 10. | శివరాత్రిమాహాత్మ్యము-శ్రీనాథమహాకవి | 0-12 |
| 11. | ఆర్యభాషావిభాగము- శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | 0- 8 |
| 12. | హ్రస్వరంగములు- క్రొత్తపల్లి సూర్యారావుగారు ... | 0- 8 |
| 13. | మన్నారుదాసవిలాసనాటకము-రంగాజమ్మ ... | 0- 8 |
| 14. | కాళిందీకన్యాపరిణయము(ప్రథమభాగము)అహోబలపతి | 1- 0 |
| 15. | కాళిందీకన్యాపరిణయము (ద్వితీయభాగము) ,, ... | 0- 8 |
| 16. | రెడ్లనాఁటి రెండుశాసనములు ... | 0- 4 |
| 17. | ఆంధ్రధాతుమాల ... | 0-12 |
| 18. | శాసనపద్యమంజరి-జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ. బి. ఎల్. ... | 0-12 |
| 19. | శాసనపద్యమంజరి (ద్వితీయభాగము) ,, ... | 0- 4 |
| 20. | శతకసముచ్చయము (ద్వితీయభాగము) ... | 0-10 |
| 21. | పరిషత్పుస్తకభాండాగారము (ద్వితీయభాగము) ... | 0- 8 |
| 22. | సూత్రాంధ్రవ్యాకరణము-చిన్నయసూరి .... | 0- 8 |
| 23. | రసాభరణము-అనంతకవి ... | 0- 8 |
| 24. | షోడశకుమారచరిత్రము-వెన్నెలకంటి అన్నయ్య ... | 0- 8 |
| 25. | హంససందేశము-(తెనుఁగుపద్యములు) కల్లూరి వేంకటరామశాస్త్రిగారు ... | 0- 2 |
| 26. | రాయవాచకము-విశ్వనాథరాయని స్థానాపతి ... | 0- 8 |
| 27. | సింహాసనద్వాత్రింశిక- (ప్రథమభాగము) కొఱవి గోపరాజకవి ... | 0-12 |
| 28. | సింహాసనద్వాత్రింశిక- (ద్వితీయభాగము) కొఱవి గోపరాజకవి ... | 0-12 |

| | |
|---|---|
| 29. నిఘంటుచరిత్రము- శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులు | 0- 6 |
| 30. ఆంధ్రకౌముది-గణపవరపు వేంకటపతికవి | 0- 8 |
| 31. బాలభారతము-(అగస్త్యకృతమునకుఁ దెనుగుఁ) క్రొత్తపల్లి సూర్యరావుగారు | 0-12 |
| 32. Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ. బి. ఎల్. | 0- 4 |
| 33. Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు ,, | 0- 8 |
| 34. చాటుధారాచమత్కారసారః-(సంస్కృతము) | 0- 8 |
| 35. సాంబోపాఖ్యానము-రామరాజు రంగప్పరాజు | 1- 0 |
| 36. రసార్ణవాలంకారము-ప్రకాశవర్షకవి | 0- 8 |
| 37. కవిజనోజ్జీవని-సమస్యలు- శ్రీకోటి రఘునాథ తొండమాన్ మహీపాలుఁడు | 0- 4 |
| 38. రఘునాథరామాయణము (ప్రథమభాగము) రఘునాథభూపాలుఁడు | 0- 8 |
| 39. రజతోత్సవసంపుటము (ఆంధ్రసాహిత్యపరిషత్తు) | 1- 0 |
| 40. అఱవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము- అక్కిరాజు ఉమాకాంతముగారు | 0- 4 |
| 41. లౌకికన్యాయవివరణము- శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | 0- 8 |
| 42. ఉత్తరరామచరిత్రము- జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ బి. ఎల్. | 1- 0 |
| 43. అమరుకము-సాంధ్రము- జయంతి రామయ్యపంతులుగారు ,, | 1- 0 |
| 44. చంపూరామాయణము-(ఆంధ్రము) జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ. బి ఎల్. | 1- 0 |
| 45. ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి- జయంతి రామయ్యపంతులుగారు ,, | 1- 0 |

46. ఉన్మాదసహస్రము, (వేయిపద్యములు) వెఱ్ఱికి వేయివిధములు క్రొ. సూర్యరావుగారు 0-12

47. నీతిభవనము, క్రొత్తపల్లి సూర్యరావుగారు 0- 4

48. నమస్కారములు 0- 3

49. సీతారామచరిత్రము- బాలకాండము మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి 0- 8

50. లక్షణసారసంగ్రహము ... 0- 8

51. కావ్యాలంకారచూడామణి పాఠభేదములు ... 0- 8

52. పరిషత్పుస్తకభాండాగారము III. భాగము ... 0- 8

—♦ పిఠాపురము మహారాజావారి ప్రచురణములు ♦.

1. ఆంధ్రసూత్రభాష్యము 4 సంపుటములు పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు ... 8- 0
2. ధర్మఖండము-ఈదులపల్లి భవానీశకవి (రెండుభాగములు) ... 2- 8
3. విష్ణుమాయావిలాసము-చింతలపూడి యెల్లనార్యుఁడు 1- 8
4. పరమయోగివిలాసము- (ద్విపద) తాళ్లపాక తిరువేంగళనాథుఁడు 1- 4
5. కళాపూర్ణోదయము-పింగళి సూర్యనార్యుఁడు శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారిచే బరిష్కరింపఁబడినది. ... 2- 8
6. యతిరాజవిజయము-దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి..
7. రామచంద్రోపాఖ్యానము-వారణాశి వేంకటేశ్వరకవి
8. భద్రాపరిణయము-అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి ...
9. శ్రీపీఠికాపురసంస్థానచరిత్రము-శ్రీరామ్ వీరబ్రహ్మకవి...
10. రామరాయవిలాసము- దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి
11. మహేంద్రవిజయము- ,, ,, ..
12. Life of Pingali Surana- Tekumalla Achutarao 2-0

మాస్టర్ మన్ ముద్రాశాల, కాకినాడ.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారు పిఠాపురము మహారాజావారు, పరిషదధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, ఉయ్యూరు జమీందారువారు.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ., (కోశాధ్యక్షులు.)

## కార్యనిర్వాహక సభాసభ్యులు.

శ్రీ కోటా శివనాథశాస్త్రిగారు

" కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుఁడుగారు, బి. ఏ.

" పిల్లారిశెట్టి రంగబ్రహ్మరావునాయుఁడుగారు.

" వెంపటి రామబ్రహ్మముగారు.

" నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

" ఏలేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.

" ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

" కందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

" కేశవరపు కామరాజుగారు.

" వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ. (ఆనర్సు)

" వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు

" యి. వి. వీరరాఘవాచార్యులుగారు,

" చతుర్వేదుల సత్యనారాయణశాస్త్రిగారు.

# శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు.

## చతుర్థ సంపుటము.

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమ సంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 980 పుటలుగల మూఁడవసంపుటమును, 950 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాదియందుఁగల సంస్కృతాంధ్రశబ్దములన్నియుఁగలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'జ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'తృ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' మొదలు 'న్ర'వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమమయినది. ఈ పుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు ననుతలంపుతో నీ క్రింది వెలలు నిర్ణయింపఁబడినవి. ప్రథమసంపుటము వెల రు 5 లు, ద్వితీయ సంపుటము రు 4 లు, తృతీయసంపుటము రు 4 లు, చతుర్థ సంపుటము రు 4 లు

---

Printed by N. Achutaramayya at the Cocanada Printing Works Cocanada and Published by K. Raghavacharyulu, Secretary Telugu Academy, Cocanada.

శ్రీ

# ధ్రసాహిత్యపరిషత్

## కాకినాడ

రెండునెలలకొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

సంపుటము ౩౯. { వికృతి. ఆశ్వయుజ-ఫాల్గుణములు } సంచిక ౪-౬



కాకినాడ

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోస్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-౦-౦.

**1950—51.**

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## కాకినాడ

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

## (Journal of the Telugu Academy.)

సంపుటము. ౩౯. { వికృతి. ఆశ్వయుజ-ఫాల్గుణములు. } సంచిక ౪-౬.



కాకినాడ

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు ౩-౦-౦.

1950—51.

# వికృతి సంవత్సరము

# 1950–51

## ఆశ్వయుజ–ఫాల్గుణములు

## విషయసూచిక.

## కీ. శే. శ్రీ శ్రీ విక్రమదేవ ప్రభువర్యుల — నిర్యాణము

జయపురాధీశ్వరులగు శ్రీ శ్రీ విక్రమదేవవర్మ ప్రభువర్యుల నిర్యాణముచే నాంధ్రసారస్వతప్రపంచమున కొకతీరని లోటు వాటిల్లినది. వీ రాంధ్రవిశ్వవిద్యాలయమున సహాధ్యక్షులగుటయే (Pro. Chancellor) గాక మహాద్వితరణమొనర్చి విశ్వవిద్యాలయమున వైజ్ఞానిక శాఖ నేర్పరచియున్నారు. నిరంతర సాహిత్యగోష్ఠినుండి కవిపండిత బృందముచే గీర్తింపబడుచు వారికి దగు సహాయమొనర్చుచు నాంధ్రవాఙ్మయాభివృద్ధికై తమ జీవితమును గడపిన ధన్యమూర్తులు-మహాదాతలు. ఆంధ్రసాహిత్యపరిషత్తునకు వీరు పోషకులై ప్రతివత్సరము జరుగు సభల నలంకరింపుచు వాదోపవాదములందు పాల్గొనుచు దమయుపన్యాసములచే శ్రోతల రంజింపజేయుచుండిరి. కాకినాడలో జరిగిన పరిషద్రజతోత్సవమునకు నితరసభలయందు నగ్రాసనాధిపతులుగనుండిరి. మఱియు పరిషత్తునందలి యాదరముచే శ్రమయనక బరిణతవయస్కులయ్యు జయపురమునుండి విచ్చేసి పరిషద్భవనమును దెఱచి జయప్రదముగ సభాకార్యక్రమమును నిర్వర్తించిరి. ప్రథమమునుండియు నాంధ్రభాషాసాహిత్యమునందలి యాదరముచే వీరు పరిషత్కార్యముల బాల్గొనుచు కార్యనిర్వాహకవర్గము వారికి జేయూత నొసంగియున్నారు.

వీరు స్వయముగ సంస్కృతాంధ్రోత్కళాదిభాషల పండితులై కవులై పెక్కుగ్రంథముల రచించిరి. వీరిచే రచింపబడిన "శ్రీనివాస కల్యాణము, మానవతీ చరిత్రము, బాలగోపాల శతకము, నీతిగీతిశతి" మున్నగు గ్రంథము లాంధ్రలోకమునకు దెలిసినవే. ఉత్కళాంధ్రసారస్వతాభివృద్ధికిని పెక్కుధార్మికసంస్థలకును వీరొసంగిన మహాద్విరాళములకు లెక్కలేదు. కవిపండితవర్యులవలన పెక్కుగ్రంథముల కృతినొంది వారిని బహూకరించియున్నారు. వీరుత్కళభాషయందు కవీశ్వరు

లనియు, పెక్కుగ్రంథముల రచించి యున్నవగాంచిరనియు దెలియుచున్నది. కొన్ని యుపనిషత్తులను కళాపూర్ణోదయాది యపూర్వప్రబంధములను వీరుత్కళభాషలోని కనువదించిరి. కళాప్రపూర్ణేతి బిరుదాంకితులు. బాల్యమునుండియు నిరాడంబరజీవితులై సుప్రసన్నవీక్షణములచే గవిమిత్రుల నాదరింపుచు ప్రజాదరమునుబొంది రాజ్యపాలన మొనర్చుచు సకలాంధ్రలోక గౌరవాదరములకు బాత్రులైన వీరిజీవిత మాంధ్రలోకమునకు మార్గదర్శకమగుగాక !

భగవంతుడు వీరి యాత్మకు శాంతిని జేకూర్చుగాత !

# అరుంధతీవసిష్ఠము

శ్రీ బులుసు వేంకటేశ్వరులు బి. ఏ.,

## పీఠిక

శ్రీమహనీయరూపుఁడు వశీకృతచిత్తుఁడు నిర్జితేంద్రియ
గ్రాముఁడు సిద్ధసాధనుఁడు కర్మరహస్యవిదుండు జ్ఞానతే
జోమయుఁ డార్యపూజితుఁడు సూనృతవాఙ్మ మహేశసన్నిభ
శ్రీమహితుండు సద్గురువిశిష్టపదంబుల నాశ్రయించెదన్. ౧

చ. కొలిచినవారి కెల్లరకుఁ గోరిక లిచ్చెడుకల్పవృక్షమై
తలఁచినవారి నెల్లరను ధన్యులఁ జేసెడు యోగమూర్తియై
తెలచెడువారి నెల్లరను దివ్యులఁ జేసెడు జ్ఞానరాశియై
విలసిలుసద్గురూత్తముని విశ్రుతపాదము లాశ్రయించెదన్. ౨

శా. నిష్కామప్రభుతాత్ముఁడై వెలయుచున్ నిత్యోత్సవశ్రీమహా
విష్కారంబున నెల్లవారలను దృప్తింబొందఁగాఁ జేయుచున్
నిష్కామక్రియమాణ సంతత మహానిర్ణిద్ర సంచారియై
దుష్కామాంతకుఁడైన సద్గురుని గొల్తున్ సర్వసంసిద్ధికిన్. ౩

మ. గురుసంపూజన మాచరింపఁ గలభక్తుండౌను శక్తుండు మో
క్షరమన్ జేకొన గుర్వనుగ్రహమె యాఁ గామ్యార్థసంసిద్ధిస
త్వరమార్గంబు, గురుండనంగ శివుఁడే తథ్యంబు కానన్ మహే
శ్వరుఁ డౌసద్గురుదేవుపాదముల నద్వైతస్థితిన్ గొల్చెదన్. ౪

చ. గురుకృప మున్నుఁ గావ్యములఁ గూర్చితిఁ జేర్చితిఁ దత్పవిత్రస
చ్చరణపయోజమూలమున జన్మము ధన్యము గాఁగ నింకనొం
డరసి రచించి కావ్యముఁ గృపాంబుధి నాతనిఁ బూజ చేయఁగాఁ
దొరఁగితి; దైవపూజకును దోయజసంతతి కెక్కుడున్నదే? ౫

సీ. కావ్యంబు పరమార్థకారణం బనియును
నది గురూత్తమునకు నంకిత మని
గురుదేవ సంసేవ పరమౌషధం బగు
భవరోగముల కన్న భావమునను
బుద్ధివికారముల్ పోడమకుండుటకు స
త్కాలవ్యయంబె మార్గం బనియును
సరసపారస్వత పరివస్య యనియును
మిత్రవాంఛను దీర్ప మేలగు నని

గీ. బాహ్యహేతువు లిన్నిటిఁ బాటిఁద్రోలు
గురుకటాక్షము నాపైని బరగి యిట్లు
లీసపర్యను గొనఁగ విలాస మనియుఁ
గావ్యము రచింపఁ దొరఁకొంటి నవ్యముగను. ౬

గీ. సర్వగీర్వాణకవుల కంజలి ఘటించి
నన్నయను దిక్కనను గొల్చి యున్నపెక్క
రాంధ్రకవివర్యులకు జోహారు లొసఁగి
వాక్పవిత్రతఁ బడసి కావ్యం బొసర్తు. ౭

మ. కవితావస్తు వరుంధతీ ఘటజలోక శ్రేష్ఠవృత్తాంతమై
చవు లూరించుఁ బఠింబఠిం జదువ; శక్త్యుత్పన్యాసంవర్ధకం
బవు విన్నన్ దలపోయ మెచ్చు; నిఁక భాగ్యంబున్న వెటొండు స
త్కవికావ్యంబుఁ బఠించుకంటె నని విఖ్యాతిన్ జనం బెంచుతన్.

మ. చిరకాలంబు ధనాధికారిజనులన్ సేవించి సేవించి త
త్పరతన్; స్వల్పధనాధికారములు సంప్రాప్తింప జీవించి; యీ
ధరపైఁ బేరును బెంపుఁ గాని జనికిన్ ధన్యత్వముం గాని మో
క్షరమన్ గైకొనుబుద్ధిఁ గాని కనమిన్ జన్మంబు వ్యర్థంబగున్. ౯

చ. జననపరంపరాంబుధిని జక్కఁ దరింపఁగ నుద్యమించి సా
ధనఘనసిద్ధిఁ గాంచుట ముదంబొ వ్యథామయమోహవాగురన్
జెనఁగొని స్రుక్కుటల్ సుఖమొ నిక్క మెఱుంగరు మూఢమా
నవుల్;
వినుతవివేకు లెంతయును లెస్స గడింతురు జ్ఞానసంపదన్. ౧౦

శా. ప్రాచీనార్యఋషీశ్వరుల్ మును బరబ్రహ్మంబుఁ బ్రాపించి యు
ర్వ్యాచీనప్రజకున్ మహోపకృతిగాఁ బ్రజ్ఞానతత్త్వంబులన్
సూచింపంగఁ దదీయసచ్చరితముల్ సూక్ష్మంబుగాఁ జూచినన్
బ్రాచుర్యం బగు జ్ఞానతత్త్వమని సంభావింతు రేతత్కథల్. ౧౧

మ. తలపోయం దరమే వసిష్ఠునిమహత్త్వం బేరికైనన్!; దదం
ఘ్రులు సేవించి మహాపతివ్రత యనన్ లోకంబులన్ దివ్యకీ
ర్తుల వెల్గొందు నరుంధతీసతి నహా! స్తోత్రింపఁగా శక్యమే?
పలుకుల్ వేయును నేల వారిస్మృతియే భాగ్యంబు లోకాళికిన్.

చ. గురుకృపకల్మి వారి నిటు కోరి స్మరించెడుభాగ్య మబ్బె మ
ద్గురుకృప కీడు లేదు; పరితోషము కల్గదు వేఱొకంట; త
ద్గురువరుపూర్ణసత్కృపకు దోయిలిపట్టెద భక్తితో నిరం
తరమును; దాన నీఁగెద వ్యథల్ చరితార్థతఁ గాంచజన్మమున్.

మ. కవితాకన్య వరించియుండు టొకభాగ్యం; బెన్న నాపైని యీ
కవితాకన్యక నుత్తమర్షిజనసద్గాథా ప్రకారంబులన్
వివులన్ దన్పుట భాగ్య; మాతరుణి నున్మేషంబునన్ సద్గురు
ప్రవరశ్రీపదసేవ నిల్పుట మహాభాగ్యంబు నిక్కంబుగన్. ౧౪

చ. కవి యయి సత్కథాగణముఖంబునఁ దత్త్వదధిన్ మథించి యిం
పవునవనీతమున్ బ్రజల కందఱి కందఁగఁ జేసి జన్మమృ
త్యువుల జయింప నెల్లరకుఁ దోడ్పడఁగావలెఁ గాని యాజవం
జవమునఁ గూల్చి కాల్చువిరసం బగుగాథల వ్రాయఁ జెల్లునే?

చ. గసికులు వారె సర్వగుణరక్తులు వారె విరక్తచిత్తులై
యెసఁగినపుణ్యమూర్తులును నెన్నఁగ వారె విరాగరాగులై
విసమునసే మహామృతము పిండినవారును వారె యట్టితాపస
రసికావతంసులను భక్తిఁ దలంచెద జ్ఞానభిక్షుకై. ౧౬

క. ముక్తిసతీనవయౌవన, రక్తుని జ్ఞానప్రకాశరమశృంగారా
సక్తర్షిప్రవరు యథా, శక్తిని స్మరియింతుగురుని షష్ఠ్యంతములన్.

క. కమనీయాద్భుతరూపున. కమలప్రజ్ఞానచక్షుఁ డౌపుణ్యునకున్
కమలాసనకమలప్రియు, కమనీయకపాలవాణికారుణ్యునకున్. ౧౮

క. ఆత్మేంద్రియనిగ్రహున, ర్వాత్మునకుఁ గామకామహార్యత్మునకున
ఆత్మీయశిష్యగణపర, మాత్మునకున్ సతతపరమహార్ణాంబుధికిన్.

క. కరుణాకరపరమాదర, సరసాలాపప్రకార సర్వజ్ఞునకున్
నరనారాయణపరమే, శ్వరిమూర్తికిఁ బ్రాపు ప్రోపు భగవం
తునకున్. ౨౦

క. శిష్యశ్రీశైలమహా, ఋష్యాయణగిరికి స్పర్శముఖవేదికి సం
పోష్యబహుశిష్యయుతునకు, ఋష్యగ్రణి కఖిలవిబుధఋషభంబు
నకున్. ౨౧

క. జ్ఞానాబ్ధిశీతకిరణున, కానందసుధాప్రవర్షకాంబుదమునకున్
నానాగమసారామృత, పానంబున విజ్ఞుఁ గుబ్రహ్మణ్యునకున్. ౨౨

క. పట్టంబగ్గము లేకయె, నట్టడవిని నింగి వేల్పునగరులలోనన్
ముట్టక యుంటక చను జగ, జెట్టికిఁ బుట్టువుల నీఁగుసిరిమంతు
నకున్. ౨౩

క. తెలువుల మేటికిఁ బలికిన, పలుకులఁ దేనియలు జాలువాఱించెడి ని
చ్చలపుందబిసికొలంబున, బలుప్రోడగఁ బుట్టుగొన్నబమ్మరుసికిసిన్.

వ. అంకితంబుగా మదభ్యుదయ పరంపరాభివృద్ధి నిమిత్తంబుగా
నే నొనర్పంబూనిన "అరుంధతీవసిష్ఠము"నకుఁ గథాక్రమ
మెట్టి దనిన. ౨౪

—: కథా ప్రారంభము :—

శ్రీకమలాసనుండు నిజసృష్టిసువర్ధన మాచరింప న
స్తోకముదంబునన్ హృదయతోయరుహంబున నుండి బ్రహ్మతే
జోఽకుటిలాత్మవిగ్రహుల సుస్థిరచిత్తులఁ బావనాత్మసు
శ్లోకుల సృష్టిచేసె నవసుందర దేహుల బ్రహ్మనిష్ఠులన్. ౨౬

ఉ. యోగసమాధియుక్తము మహోజ్జ్వల మైనతపోవిశేషమున్
త్యాగవిరక్తియుక్తమును ధన్యము నౌనిజదేహ మిచ్చి నా
నాగమవిజ్ఞతాబల మనంతముగాఁగ ననుగ్రహించి తే
జోగరిమం బొసంగి కృపఁజూచెను వారల నవ్విరించియున్. ౨౭

ఉ. వారలలోన నెన్న సరివారలె లేని తపోమహత్త్వవి
స్ఫారుఁడు రూపమన్మథుఁడు పంకజనాభుననుంగునై జగ
ద్భారము సృష్టిభారమును దాల్చి ప్రజాపతి నాఁగ ఖ్యాతిఁ బెం
పారినసత్తపోధనుఁడు భవ్యుఁడు కర్దమనాని యొప్పెడున్. ౨౮

చ. అతఁడు సరస్వతీతటమునందలి దివ్యవనప్రదేశ సం
స్థితి బహువత్సరంబులు విశేషతపం బొనరించె; నంత నం
చితముగ విష్ణుమూర్తి కృప చేసెను దర్శన మిచ్చి దుర్దమ
వ్రతతనుమర్దన ప్రబలవర్ధన విజ్ఞుని కర్దమర్షినిన్. ౨౯

క. ఆపరమాత్మకటాక్షము,ప్రాపింపఁగ భక్తియుక్తి భయసాధ్వసశో
భాపరవశుఁడై పలికెను,గాపట్య మొకింత లేనిఘనభక్తిహృదిన్.

సీ. "పరమేశ ! నీకృపఁ బడయఁగఁగలెడివాఁడె
బ్రతుకుఫలంబును బడయువాఁడు
పుండరీకాక్ష ! నీపాత్పెఱింగెడివాఁడె
బ్రహ్మప్రబోధంబుఁ బడయువాఁడు

ల ్మీశ ! ని న్నుపలక్షింపఁగలవాఁడె
పరమేశ్వరుం డయి పరగువాఁడు
పద్మప్రియా ! నిన్ను భావింపఁగలవాఁడె
తాఁ బరబ్రహ్మమై తనరువాఁడు
గీ. ఆదిపూరుష ! నిన్ను నే నరయఁగంటి
భక్తవత్సల! నిన్ను నేఁ బడయఁగంటి
ధన్యమయ్యెను మజ్జని తావకీన
దివ్యదర్శనభాగ్య సందీప్తి కతన. ౩౧
క. శరణంబం దెదఁ ద్వత్పద,సరసీరుహయుగళిఁ జేరి సమ్యక్కృప న
న్నరయుము నీవానిగ నో,పరమాత్మా! జీవ దేవ!భవభయదూరా!
సీ. ఏయుగమ్మునసైన నిందిరారమణ ! నిన్
దలపోయుటే ఘోరతపము కాదె?
అంబుజోదర ! నిన్నె యర్చించుటే కదా
యోగఫలంబును త్యాగఫలము
కమలదళాక్ష ! సంయమిలోకసామ్రాజ్య
పట్టభద్రత భవద్వందనంబు
లోకేశ ! ని న్నుపశ్లోకించుటే బ్రహ్మ
నిర్వాణపద మగు నిశ్చయంబు
గీ. గరుడవాహన ! కౌస్తుభాభరణ ! శంఖ
చక్రధారణ ! నిన్గని సఫలమయ్యె
మామకీనభవంబు ; రమ్యత్వదీయ
రూపదర్శన మొసఁగు సారూప్యఫలము." ౩౩
క. అని పెక్కుగతులనాతఁడు,వినుతింపఁగ విష్ణుమూర్తి ప్రియమునవత్సా!
వనుఁ దలఁచినకార్యం బే,"మని యడిగినఁ గర్దమర్షి యను
భక్తి మెయిన్. ౩౪

గీ. "దేవ దేవ! యెఱుంగవె నీవు సర్వ;
మేను బలుకంగ వినుట నీ కిచ్చయయ్యె
నేని బలుకుదు బలికింప నీవు తండ్రి!
అవ్యయానంద సంధాయకాగ్రగణ్య! ౩౫

గీ. నలువ సృష్టించి యాత్మనందనుల; వారి
జీవసంతతి సృష్టింపఁ జేసె నాజ్ఞ;
అని యోగిజనంబు లధ్యాత్మచింత
మునిఁగియుండంగఁ గోపించి యని యె నలువ. ౩౬

గీ. 'ఈనియోగిజనంబులు నా నియోగ
మేమఱిరి; సృష్టికార్య మిం కేమిగాను?
పరమపాపులు పట్టినిర్భాగ్యులైరి
గోముఖవ్యాఘ్రము' లటంచుఁ గోపపడఁగ. ౩౭

గీ. వార లాతనిశాపంబు బారిఁ బడఁగ
నిచ్చగింపక పెండ్లాడి సృష్టికార్య
నిర్వాహణులైరి; మఱి నేను నీరజాక్ష!
నీయభిమతంబుఁ దెలియంగ నిశ్చయించి. ౩౮

క. తప మొనరించితి దేవా!, కృపచూపితి వీవు నన్నుఁ గించిజ్ఞుని నీ
సుపదంబు లాశ్రయించిన, కృపణుని న న్ననికరించి యిమ్మాత్మజ్ఞ
ప్రభూ! ౩౯

మ. నలపారం బగుసంసృతిం బడి యనంతా! కామలోభాదికం
బులచేతన్ హతులై నశింతురుగదా! పుణ్యాత్ములుంగూడ నీ
విలసత్పాదము లాశ్రయించియె మహావిజ్ఞానపుంబల్మి నేఁ
జలుపం జూచెద జీవయాత్రను సరోజాక్షా! యకామ్యాత్మతన్",

క. అని విన్నవించు కర్దముఁ
గనుఁగొని "మునిచంద్రమా ! యఘకల్మష
ఘనచిత్తవృత్తి యెఱుఁగుదుఁ
బనిగొనుమా బ్రహ్మయాజ్ఞ భద్రంబు లగున్. ౮౧

క. స్వాయంభువమనుపుత్త్రిక
నీయందనురాగ మూని నెగడును దానిన్
జాయంగాఁ గైకొను మది
శ్రేయం బగు నీకు మౌనిశేఖర ! మఱియున్.

సీ. సౌందర్యసౌజన్యసౌభాగ్యసంపదా
స్పద లౌచు నుత్తమచరిత లగుచు
త్రిభువనఖ్యాతలై దివ్యర్షిచంద్రమ
పాణిగృహీతులై భవ్య లగుచు
పరమపతివ్రతాతరుణీ లలామలై
యుత్తమబహుపుత్త్రయోగ్య లగుచు
అన్వయాలంకారలై సాధువర్తన
లోకకల్యాణసుశ్లోక లగుచు
గీ. వెలయఁ గలయట్టి తొమ్మండ్రు లలన లుద్భ
వింపఁగలరు భవద్వీర్యవిలసిత యగు
ధర్మపత్నికిఁ, బిదప నుత్తమమునీంద్ర !
నేన జన్మింతు సుతుఁడనై నిక్కువముగ. ౮౩

[illegible]ందె మనసు నిల్పుము
నాయం దర్పింపు మఖిలనాథుఁడ ననుచున్
నీయజ్ఞఫలాదికమును
మాయాతిమిరంబుఁ [illegible] ! ౮౪

# సాంఖ్యదర్శనము

(ఆంధ్రీకృతసాంఖ్యతత్త్వకౌముది)

శ్రీ ఎం. వి. వి. కె. రంగాచార్యులుగారు

ఈ గ్రంథమును సటిప్పణముగా రచించిన యాంధ్రవిశ్వకళా పరిషదధ్యాపకులగు శ్రీకొల్లూరి సోమశేఖరశాస్త్రి, శ్రీ శైలేశ్వరసేన గారలాంధ్రవాఙ్మయమున కపూర్వసేవ నొనర్చిరనుట నిశ్చయము. విశ్వకళాపరిషత్తున కిదియొక నూతనవికాసమును గలిగించి మార్గదర్శి కాగలదని యాశింపదగును. దర్శనవిధానములలో సాంఖ్యము పునాది. "సంఖ్యాం ప్రకుర్వతే యస్మాత్" ఇత్యాది ప్రవచనములలోని భావము దిగినకొలది లోతు హెచ్చును. "యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే। ఏకంసాంఖ్యంచ యోగంచ యః పశ్యతి సపశ్యతి" (భగవద్గీత 5 అ. 5 శ్లో) యన్నచో భిన్నదర్శన సాంప్రదాయములను గమ్యస్థానమందే గాక దాని ననుగమించు విధానమందును సమన్వయపఱచు కృషి యావశ్యకమని స్ఫురించును. 'సాంఖ్యయోగాపృథక్ బాలాః ప్రవదన్తి న పండితాః' (గీ 5-4) సాంఖ్యమును యోగమునుండి వేఱుగ నిర్వచించువా రల్పజ్ఞులు (బాలురు) గాని పండితులుకారు. సాంఖ్యము గీతాశాస్త్రమునందు ప్రాముఖ్యస్థానము పొందినది. ప్రథమమున విషాదము సహజము. జ్ఞానవిజ్ఞాన పరత్వము సాంఖ్యము. "ఏషా తేఽభిహితా సాంఖ్యే" (గీ 2-39) అని నిర్వచించి వ్యవసాయాత్మికా బుద్ధి యేకాగ్రత గలదని విధించుటచే (గీ 2-41) పృథగ్భానము నిరసింపఁబడుచున్నది. అయినను "ఏవముక్త్వార్జునః సంఖ్యే" (గీ 1-47) అని యర్జునునిగురించి యుద్ధములోను మఱల "కథం భీష్మమహం సంఖ్యే" (గీ 2-4) యని యర్జునుడే యుద్ధమును గుఱించియు రెట్టించి యుండుటచే నీ సాంఖ్యమునకును యుద్ధమునకును గల యనువాదన పరిశీలించదగియున్నది "ప్రకృతింపురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి" (గీ 13-20) నిశ్చిత

ద్వైతభేదమున ప్రారంభించి యష్టప్రకృతులు (భూమిరాపోఽనలో వాయుః ఖంమనోబుద్ధిరేవచ అహంకార ఇతీయంమే భిన్నా ప్రకృతి రష్టధా) (గీ 7-4) త్రిగుణాత్మకము (గీ 14-5) పంచవింశతి వికారములు పైగా లెక్కించిన జిజ్ఞాసువులు సాంఖ్యు లనఁబడుట విచిత్రము గాదు. ప్రారంభమున "చతుర్వింశతి తత్వాని" యని యుండినను పరిణామమున నీసంఖ్యయు వృద్ధినొందినది. సేశ్వరసాంఖ్యమున నటు పెంచబడిన వనుటకును నాధారము కానబడును.

సంఖ్యాత్మకము సాంఖ్యమైనచో నేకేశ్వరత్వమున సాంఖ్యమునకు తావు గన్పడదు. "ఏకమేవ" "అద్వితీయం" అన్నచో పరిణామమునకును వీలుండదు. ఆవశ్యకతయు నుండనోపదు. 'శాశ్వతం పదమవ్యయం' గలిగినచో మార్పులేల? ఎట్లు గలిగినవి? 'బహుస్యాం ప్రజాయేత' అన్నను బహుత్వ ముత్తర ప్రయోజనమగుట పూర్వోక్త మగు నేకత్వమునకు భిన్నమా, కాదా? కార్యమునకును కారణమునకును గల సంబంధ మెట్టిది యను పెక్కు సందేహము లుద్భవించును. వేలకొలది దర్శనకారు లిట్టి ప్రశ్నల నెన్నిటినో పలుశతాబ్దముల నుండియు నెదుర్కొనుచుండిరి.

ప్రసిద్ధమగు కపిలసాంఖ్యము పరిణామ సిద్ధాంతమున కునికిపట్టు. బౌద్ధ సాంప్రదాయము నందు నీ పరిణామవాదమే గుర్తించబడెను. సత్కార్య వాదమున నీ రెండిటికిని పోలిక గలదు. వైశేషికము కంటె సాంఖ్యమే బౌద్ధమతమునం దాదరింపఁబడె ననుట సత్యదూరముగాదు. కాణాదుని యణుప్రమాణము లంతకుపూర్వమే పూర్వపక్షము చేయబడనోపును. త్ర్యణుకపరిశీలన మిటీవలి ప్రకృతిశక్తిశోధనలలో (Atomic Research) ననుకరింపఁబడుచున్నదనుకొనిన " అణోరణీయాన్ మహతోమహీయాన్ "

యన్నట్లు వైశేషికులును తమ యారంభవాద దర్శనమున నాశక్తికి సహేతుక మగు నాధారము సూచించినట్లు కనుపించదు. ఇంక నణుత్వము మించి ప్రకృతి వికారములమార్గము పట్టినతోడనే పరిణామ సూత్రములకు తావు గలుగును. ఇప్పటికిని గూఢముగానుండిన ఖగోళాంతర కిరణములు (Cosmic Rays) కొంతవఱకు మానవవేద్యములయిన స్వయంప్రకాశాకర్షణ తరంగములు (Radio-magnetic waves) మొదలు జీవచరిత్ర గల స్థావరజంగమము లుద్భవించు విధాన మంతయు బరిణామ సిద్ధాంతము ననుసరించునదే.

కాని పరిణామ విధాన మేకముఖముగ నెల్లప్పుడు ముందుకు సాగినట్లును తోచదు. అగ్నిపర్వతములు హఠాత్తుగా లేచి గ్రామముల నాశన మొనరించు చున్నవి. నదు లాకస్మికముగ బొంగి జంతుజననష్టము కల్గింపుచున్నవి. ఆకాశమం దొకచోట గోళ మొకటి ఛిద్రమై ధూళిధూసర మగును. వేరొకచో నీ ధూళియే క్రమముగా గోళాకారము నొందుచు రాను రాను గట్టిపడి లోకనివాస యోగ్యమగుచుండు నగుపించును. సృష్టి స్థితి లయము లన్నియు నెల్లెడలను సర్వకాలములందును, గలుగుచునే యున్నవి. ఈ మార్పునే పరిణామముగా స్థూలదృష్టిని గ్రహించవచ్చును గాని, పరిణామ మనిన పెరుగుటయే యన్నచో ననుభవ వైరుధ్యము వాటిల్లును. సృష్టిలయముల యుద్ధమే సాంఖ్యము కాబోలు. స్థితి యనునది వీటితో బరస్పర సంబంధము గలది. స్థితి ఎన్నటికి నొకేరీతి నుండజాలదు. మార్పు జెందక తీరదు. ద్వంద్వములు పరిణామమందును వేఱగుచుం .డును ఈనాడు గల జంతుజాలములకు నేబదివేల సంవత్సరముల క్రిందటి జీవములకును భూగోళముపైని యాత్రయందే విశేష భేద ముండినటుల ననుభవవేద్యము. ఇక గోళాంతర ప్రవృత్తియం దర్బుదములు మించిన కాలప్రవాహమున మార్పు లెన్ని గలిగినవో

నిర్వచింప నలవికాదు. అయినను గీతయునకు దాశేమువలె నొక కట్టు బాటు మాత్రము సూచితమగుచున్నది.

ప్రతిపరిస్థితికి నొక ప్రత్యర్థి యుండకపోదు. "అవును" అని యనిన వెంటనే "కాదు" అని యేల ననరాదని శంక యంకు రించును. వీని సమన్వయ మావశ్యక మగును, మానవ విజ్ఞానము పరస్పరవైరుధ్యమున కోర్వజాలదు. పూర్వపక్షము వెనుక సిద్ధాంత మావశ్యకము "ద్వంద్వః సామాసికస్యచ" (గీ 10-౩౩) యని ఎటు లనో రెండు పక్షములకు విరోధము నిర్మూలించినగాని సమగ్రత సాధింపఁ బడదు. దీనినే పాశ్చాత్యులు హేతువాదభావకమగు అవిరోధవిధాన మందురు. (Dialectical movement) ఇందు ప్రాతిపదికము (ప్రతిపాదకము) (Thesis) పూర్వపక్షము (Anti-thesis) సిద్ధాంతము సమన్వయము. (Synthesis) అను త్రిస్థాయిని తార్కికబుద్ధి మెలగును. వీనిలో నారదముని ప్రేరితమగు వికల్పము ప్రముఖము. పూర్వపక్షము లేనిచో యడుగు ముందునకు నడువదు. స్తబ్దత జెంది నిర్జీవవంతమగు ప్రమాదము వాటిల్లును. తార్కికశక్తిని సానబెట్టునది వికల్పమే. బ్రహ్మమానసపుత్రుని, నీ మహావ్యతిరే కిగా నెఱింగినవారు బుద్ధియోగమున నుత్తీర్ణులగుదురు. వారే విజ్ఞానమార్గమున వికసించి "ఏకంసాంఖ్యంచ యోగంచ యః పశ్యతి సపశ్యతి" యనినట్లు తత్వము నెఱింగినవా రగుదురు. ఇట్టి మానసిక యుద్ధమున కాటపట్టయి యున్న మనోవైకల్యములను (Mental Conflicts) నిరోధించు మార్గమును దర్శింపఁ జేయగలుగుటచేతనే నిద్దానికి సాంఖ్యశాస్త్రమను రూఢినామ మేర్పడుచున్నది. ఇది పఠించి మననము చేసిన బెక్కుసంశయములు మంచువలె కరంగు నట నున్నిందేహము. ఈకృషి యంతయు ప్రకృతిజన్య సంక్షోభ ములను వైరుధ్యములను (Conflicts) సార్థకముగ గ్రహించి యన్వ

యించి తుద కభిగమింప (Overcome, Resolve, assimilate) గలుగు జ్ఞానసంపాదనకొఱ కని వేఱ జెప్పనక్కఱలేదు. అటుపైన "జ్ఞానం విజ్ఞానసహితం యద్‌జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్" యన్నటుల నిశ్చలజ్ఞానజనితభక్తిసిద్ధించును. నారద భక్తిసూత్రములకును పరిణామ సాంఖ్యమునకును సాన్నిధ్యము గ్రాహ్యము.

సాంఖ్యదర్శనమును నవయుగమున నాంధ్రలోకమునకు జారిత్రాత్మిక పరిశోధనల సమకూర్చి యీయఁగలుగుట ప్రశంసనీయము. సాంఖ్యములోని తత్త్వములు, ఉపనిషత్తులందును వినబడుచున్నను నీని సంజ్ఞార్థములలో భేదముండును. కాలానుగుణముగ నొకేపదమునకు సాంకేతికము మార్పుజెందును. ఇదియు శబ్దవిజ్ఞాన పరిణామకృతము. ఇవి క్లుప్తముగా ముఖబంధమున (పు 4 to 7) సూచితములు. ఇంతకుమించి ముఖబంధమున మూడవభాగ (పు 7 to 10) మితర దర్శనముల సామ్యవైషమ్యముల నొకించుక విరళముగా జర్చించిన బాగుండు నని తోఁచెడిది. ఇందు ముఖ్యముగా 1 మొదలు 12 ప్రశ్నలను గుఱించి స్వల్పముగా పర్యవసానము లుదహరింపఁబడినవి. గాని యందులకు గారణ ప్రసంగముగాని తత్త్వతః యెట్లెందులకు గావలసెనో పూర్వసంబంధ నిరూపణముగాని (Context) వాని కాధారముగ దీసికొనఁబడిన సాధికారవాక్యములుగాని తెలుపఁబడలేదు ఉదాహరణమునకు 12 ప్రశ్నలో "కాపిలదర్శనమునకు నిరీశ్వరసాంఖ్యమనియు పాతంజల దర్శనమునకు సేశ్వర సాంఖ్యమనియు వ్యవహారము" అని వ్రాయబడినది. గాని మాక్సుమూలరు దొరవారన్నటుల (Maxmuller) నీ వ్యత్యాసము సర్వతోముఖము కాదు. సేశ్వరసాంఖ్యులు కపిలాచార్యానుయాయులందును గలరని ప్రతీతి. "సిద్ధానాం కపిలోమునిః" అని గీత (1-26) నిరీశ్వర వాదిని చేర్చియుండదు. లేదా, లౌకికముగా బౌద్ధాచార్యుని

విష్ణువున కవతారమని నటుల (బుద్ధః కలికి రేవచ) కపిలమునికిని సిద్ధత్వము సిద్ధింపజేయగలిగినచో సేశ్వరనిరీశ్వర సాంప్రదాయనులకు భేదమే లుప్తమగును. "చాతుర్వర్ణ్యం మయాసృష్టం" (గీ 4-13) అని బోధించి వర్ణాశ్రమధర్మముల నిరూపించి "శ్రేయాన్ స్వధర్మోవిగుణః" (గీ 3-35) అని శాసించి "ఏవం ప్రవర్తితంచక్రం నానువర్తయతీహ యః" (గీ. 3-16) దీనికి వారి జన్మము వ్యతిరేకించినచో వృథా యని నిందించి తుదకు "సర్వధర్మాన్ పరిత్యజ్య" అని సాహసముతో ప్రబోధము చేయగలిగినంత తార్కిక వైషమ్య సమన్వయశక్తి భగవద్గీతకు జెల్లినదిగాని యందులకు పునాది బెడ్డలలో నిమిడియున్న సాంఖ్య తత్వముల కైకైక దృష్టి చాలకపోయి యుండవచ్చును. సాంఖ్యతత్త్వ కౌముది వంటి వెన్నెల వెలుగులు వృద్ధియగుటవలననే సంపూర్ణసమన్వయవిధానము గీతాముఖమున గల్గిన యావశ్యకత యని రూఢమగుచున్నది.

కపిలసాంఖ్యులందఱు నిరీశ్వరవాదులు కాకపోవచ్చును. పాతంజలీయులలోను గొందరు నిరీశ్వరయోగు లుండవచ్చును. సామాన్య సూత్రముల కెల్లప్పుడును భిన్నోదాహరణము లుండుట సహజము. మీమాంసకులు కర్మబద్ధులయి జైమినిసిద్ధాంతము ననుసరించి యపూర్వఫలము నొందుటతో నీశ్వరాపేక్ష వర్జింపగలుగుదురు. విరక్తవాద మవలంబించిన వేదాంతులలోను, భక్తాగ్రేసరు లుండుట యరుదుగాదు. ప్రాథమికసంగ్రహగ్రంథములలో (Elementary text books) సూచింపఁబడు విధులు సర్వతోముఖముగ వర్తిల్లునటుల గనుపించును. దీనికి వైషమ్యము లుగ్గడించుట పూర్ణవిజ్ఞానమున కవసరము. సృష్టివైచిత్ర్యములలో నేకత్వమెట్లు పరిఢవిల్లునో మనుజ మానసిక వికాసములోను బహుత్వపరిణామము తప్పదు. తారతమ్యములు గణించు మార్గము సాంఖ్య

ములో ముఖ్యమయినను విభేదములు మాత్ర మసంఖ్యాకము లని మఱువరాదు. వీని పరస్పర సంబంధములును వైరుధ్యములును సాంఖ్యులు తత్త్వభేదముల సాధనముతో గ్రహింతురు. వేదాంతులు సాంఖ్యతత్త్వముల నతిరేకించి వివర్తవాద సహాయముతో నద్వైత సిద్ధికొఱకు బాటుపడుదురు. యోగులు పాతంజల కైవల్యము నొందుటకును సాధన సల్పుదురు. ఈ విధాన మిశ్రమములచే పెక్కు మతము లేర్పడినవి. ఇందుకు భేదశ్రుతులు అభేద శ్రుతులు భేదాభేదశ్రుతులు వ్యాఖ్యానము లెన్నియో బయలు దేరినవి. సాంఖ్యకారికలును నీ మిశ్రమ వ్యవసాయమునకు దూరముగా వు. యజ్ఞాదికములు హింసాయుతములని యంతకంటె శ్రేష్ఠతర సాధనమని చెప్పుటచే (2వ కారిక) పూర్వమీమాంసాదర్శనము ఖండితమగును. ప్రధానవికార పురుష భేద వివేకము అమృతభావము. మానసికవృత్తి భేదములు నాయా కారణ కార్యసంబంధములను పాశ్చాత్యతత్త్వ పరిశీలన యుగమునకు జాలకాలము క్రిందట, కపిలసాంఖ్య దర్శనమున నిరూపింపఁబడినవి. ప్రకృతిజన్య పరిణామసూత్ర మవలంబించిన మతములు సాంఖ్య దర్శన ప్రాప్తము లనుటలో బొఅపాటుండదు. గ్రంథమునం దాంధ్రీకరించబడిన కారికాస్వరూపము ప్రాచీనమనుటలో సందేహములేదు. 72 కారికలు నీయాకారమున సాంప్రదాయ సిద్ధముగ 1500 సంవత్సరములను బూర్వమునుండి వాడుకలో నుండినటుల నాధారములు గలవు. వీని ననువదించుటలోను టిప్పణములందును విశేష పరిశ్రమ చేసి మిక్కిలి సూక్ష్మవిషయములను గూడ విపులముగను గ్రాహ్యము లగునటులను ప్రబోధము సల్పిన గ్రంథకర్త లాంధ్రలోకమున కపూర్వ విజ్ఞానదాన మొసంగి రనుట యతిశయోక్తి కాదు. ఇందుల కెల్లరు కృతజ్ఞులు.

ఆధార గ్రంథముల పట్టికలో 1810, 1822, 1856, 1887 మున్నగు ప్రాచీన ప్రచురణములు సూచింపబడినవి. సామాన్య

ముగా సూత్రయుగము దర్శనప్రతిష్ఠయైన కొలది కాలమునకు సంఘ టించిన దనినచో ననుభవ విరుద్ధము కాదు. శ్రుతి మంత్ర బ్రాహ్మణ ఆరణ్యక, ఉపనిషత్, సూత్ర కాలముల కొంతవఱకు వేఱుజేయుటకు వీలుండును. సూత్రానంతరము కారికలు స్మృతివిశేషములు చందో బద్ధ శ్లోకపూర్వకములై యుండును. గీతయందలి యనుష్టుప్ఛందము వంటి సులభ మనోహర గమనిక కారికలందు గన్పింపదు. అయినను సూత్రప్రమాణము కారికలలో లేదనుకొనుటయు సరికాదు. వృత్త పరిపూర్ణత లేకున్నను స్మృతి సౌకర్య చిహ్నముగా నీ వాక్యములు చర్చింప వీలుగల్గినది,

శ్లో॥ వత్సవివృద్ధినిమిత్తం క్షీరస్య ప్రవృత్తిరజ్ఞస్య।
పురుషవిమోక్షనిమిత్తం తథా ప్రవృత్తిః ప్రధానస్య ॥57॥

క్షీరమువంటి యాచేతన ప్రవృత్తి దూడ యను పరప్రయోజ నకర మెట్లగుచున్నదో యట్లే ప్రకృతియును, పురుష మోక్షసాధ నము కావచ్చును. ఇందిమిడియున్న వాదప్రతివాదములు గ్రాహ్య ములు. క్షీరప్రవృత్తియు, ప్రధాన ప్రవర్తనమును నీశ్వరాధిష్టితము లనకూడదా యనిన నా యీశ్వరేచ్ఛను స్వార్థముగాని కారుణ్యము కాని మూలము కావలెను. నిష్కాముడగు పరమేశ్వరునకు స్వార్థము దూరము, కరుణయా యనిన చో, సృష్టికిపూర్వము శరీరేంద్రియ సంబంధము లేనప్పుడు దుఃఖమేది? మోక్షమెందులకు? లేక కృప యాసృష్టి: 'సృష్ట్వా దుఃఖం తన్నివారణార్థం కృపఇతి పరస్పరా శ్రయదోషం, మరియు సృష్టిలో దుఃఖము లేకుండ నెందులకు జేయ లేదు? వారివారి కర్మ కారణమందురా? ఈ కర్మల నీశ్వరు డధిష్టిం చెనా, లేదా? ఈశ్వరాధిష్టానము లేని దే యచేతనమగు కర్మచే సహజప్రవృత్తి గలుగ నేరదు. శరీరాదు లుద్భవించనిది దుఃఖస్థా

నము లేదు. కాగా కర్మల నధిష్ఠించి శరీరాదుల సృజించి జీవులకు దుఃఖమును గల్పించి పిమ్మట దయచే నా దుఃఖముల దొలగించుట కన్న మొదటనే కర్మ నధిష్ఠింపకుండుట యుక్తముగదా? (pp 111 – 112) ఇట్లీశ్వరార్థ్యమును నిరోధించి యచేతనమగు ప్రకృతి ప్రవర్తించుననుపక్షమున స్వార్థముగాని కారుణ్యముగాని యవసరము లేదు. అచేతన ప్రవృత్తికి పరోపకారమే ఫలము. కాన నది యుపపన్నము గావచ్చును కావున వత్సవివృద్ధికి క్షీరమువలె పురుషవిమోచనము కొఱకు ప్రకృతి ప్రవర్తింపవచ్చునని నిరూపింపఁబడినది. కాని యిందులకు భిన్నమగు బంధకారణమును ప్రకృతియే యని మఱువరాదు. తార్కిక మూలసూత్రమునుబట్టి విరుద్ధము శంకించుచుండవలయును. ఇఁక ప్రసిద్ధ సాంఖ్యోపమాలంకారము మాత్ర ముదహరించెదను.

సా॥ రంగస్య దర్శయిత్వానివర్తతే యథా నర్తకీ నృత్యాత్।
పురుషస్యతథాఽత్మానం ప్రకాశ్యనివర్తతే ప్రకృతిః॥59॥

సభ్యుల యెదుట నృత్యము చేసిన వేశ్యవలె ప్రకృతి పురుషునికి తాదాత్మ్యము ప్రదర్శించి వెడలిపోవును. ఫలసిద్ధియైన వెనుక నివృత్తి గలుగును. ఇట్లనేకానుభవవేద్యము లగు నిదర్శనములతో విరాజిల్లుచుండిన కపిలసాంఖ్య దర్శనము సులభశైలిలో దెలుఁగున ప్రచురింప గలుగుట ముదావహము.

టిప్పణమునం దచ్చటచ్చట నాధారగ్రంథసూచన లుండినను నేయే ప్రసంగ సందర్భమున కేయాధారము మనస్సులో నుంచుకొని యుండిరో విపులముగా సూచింపలేదు. ఉ॥ అచేతనములకు సప్రయోజన ప్రవృత్తి కలదను విషయము పాశ్చాత్య దర్శనములందును

(Schopenhaur, Hordemann) మున్నగు వారిచేతను సమర్థించ బడినవి" (p 191) ఇట్టి సాధారణ భావములకు గ్రంథము పుటసహితముగా నచ్చటచ్చటనే యిచ్చినచో బరిశీలనకృషికి సాహాయ్య మొనర్చును.

షడ్దర్శనములలో బునాది యనదగు కపిల సాంఖ్యమునకు, తదాః [illegible] నగు పరిణామసిద్ధాంతము నకు పాశ్చాత్య నూతనభావ సమర్థనమున కుపకరించు తత్వకౌము దిచే భావిప్రపంచ సమస్యలు శాంతియుతముగ సమర్థించుట కవకాశము గలుగునా యని యూహింపుచు గ్రంథసహాయముచే నఖిల మానవ సౌభ్రాతృత్వమును తార్కిక మానవత్వమును (Dialectical Humanism) నూతన దర్శనముపై నాధారపడునట్లు కృషి సలుపుట కాంధ్రులు స్నాతకదీక్ష వహించగలరని నమ్ముచున్నాను.

# విస్మృత-కవికావ్య-చింతామణి



(ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు, యం. ఏ.)

— కాకినాడ —

సారస్వతక్షేత్రమునఁ గృషిచేయుకర్షకుల యశ్రద్ధవలన సంస్కృతవాఙ్మయమున విస్మృతములు, ఉత్సన్నములు, నామమాత్రజ్ఞాతములు నగుకృతికల్పకములు వందలకొలఁది కలవని సాహిత్యగవేషణనిరతుల వ్యాసంగములనుబట్టి తెలియుచున్నది. విస్మృతులు, నామమాత్రజ్ఞాతులు నగు నుత్తమసంస్కృతకవులుకూడఁ బరశ్శతముగా నున్నారు. మఱుఁగుపడిన యట్టికావ్యములను, కవులను గూర్చిన విషయములు రసికవినోదమునకై యిట నివేదింపఁబడును.

౧. సభ్యకంఠాభరణము :—

కవినామరహితమగు పైగ్రంథము సుభాషితకోశమని తోఁచెడిని. ఉత్సన్నకల్పమగు నీకృతినుండి యీయొక్క శ్లోకముమాత్రము హరిభాస్కరుని "పద్యామృతతరంగిణి" లోఁ లభించుచున్నది.

1. నింబాన్యోక్తి :—

'యది చన్దనచమ్పకామ్రవల్లీ-
వనజన్మా సహభూశ్చ కేతకానామ్,
అమృతోపచితస్తథాపి మాత
ర్నహి నిమ్బో (నిజ) నిమ్బతాం జహాతి.'

—(పద్యా. త. IV. ౨౮౧ ప. — 'సభ్యకణ్ఠాభరణాత్')

పైపద్యమున కనురూపమగు నీక్రిందిశ్లోకమును గనఁదగును:

రేణ నిమ్బవృక్ష ఉపార్జితః,
పయసా సిఞ్చితస్యాపి న నిమ్బో మధురాయతే.'

సూక్తిసుందరమున నీక్రింది నాలుగుశ్లోకములును సభ్యాలంకారాభరణమునుండి యుదాహరింపఁబడినవి:—

2. రాజమిళనవర్ణనము:—

శా. 'క్షుత్క్షామార్భక సమ్భ్రమోక్తినిగడైః
క్షిరితా నర్మత్రో
స్త్రకీలితహృదో
గర్వాద్గురుత్వం గతాః,
ప్రభ్రష్టాః పదతః కదాపి న హి యే
తేఽద్య త్వదీయై ర్గుణై
రాకృష్టా విదుషాం వరా వయ మహో!
త్వాం ద్రష్టు మభ్యాగతాః.'
—(సుభాషితరత్నభాణ్డాగారమ్, III. 105 పు. ౧ ప.)

3. శా. 'కల్యాణం భవతాం, యశః ప్రసరతాం,
ధర్మః సదా వర్ధతాం,
సంపత్తిః ప్రథతాం, ప్రజా ప్రణమతాం,
శత్రుక్షయో జాయతామ్,
వాక్యం సంవదతాం, వపుః ప్రభవతాం,
లక్ష్మీపతిః ప్రీయతాం,
ఆయుస్తే శరదాం శతం విజయతాం
దానాయ దీర్ఘాయుషే.'
—(సు. ర. భా. III. 116 పు. ౨౬౩ ప.)

4. శా. 'దృష్ట్వైవాఙ్కుశముద్రయా నిగడితో
దారిద్ర్యదన్తావలో
వాచా సున్దరయార్చ్చయా మమ కృతో
గఙ్గావగాహోత్సవః,
అభ్యుత్థానసమస్క్రియార్ఘఘటనై
ర్మానోఽపి దానోత్తరో
లీలేయం భవతో వయన్తు విదుషాం
మూర్ధానమధ్యాసితాః',

—(సు. ర. భా. III. 116 పు. ౨౬౮ ప.)

5. శా. 'పద్మా సద్మని కేశవస్య గహనే
రత్నాని రత్నాకరే,
హేమాద్రిర్హిమసానునా వ్యవహితః
స్వర్గే సురాణాం తరుః,
జమ్బూద్వీపధరాసు భూమిపతయో
జామ్బూనదైర్దుర్మదా
స్త్వం తావత్ సకలాస్త్వయేఽపి సులభో
భాగ్యైర్ద్విజానాం మహ.'

(—సు. ర. భా. III. 116 పు. ౨౬౫ ప.)
(సూ. ను. 1-2 పు. ౧-౮ ప- 'ఏతే సభ్యకణ్ఠాభరణస్య')

సభ్యకంఠాభరణకర్తనామము తెలియదు. పై పద్యము లైదును సభ్యకంఠాభరణకర్తయే రచించెనో, లేక యితరకవుల పద్యముల నీతఁడు తనకోశమున నుదాహరించుకొనెనో తె

౨. అన్యోక్తికంఠాభరణము: చంద్రచూడరచితము :—

చంద్రచూడుఁడు పైసూక్తికోశమును సంధాన మొనర్చెనో, లేక స్వయముగా నిర్మించెనో తెలియదు. భట్టపురుషోత్తముఁ డీతని జనకుఁడు. పైకృతినే కాక చంద్రచూడుఁడు † 'ప్రస్తావచింతామణి' యను సుభాషితకోశమును, 'కార్తవీర్యోదయము, ‡ చంద్రశేఖర వివాహము' * నను కావ్యములను గూడ రచించెను.

---

† నామసామ్యము గలయీ క్రింది గ్రంథకర్తలకంటె మనచంద్రచూడుఁడు భిన్నుఁడని యెఱుఁగవలెను. (1) ఆచారసారము (ఆ. రత్నము)ను రచించిన చంద్రమౌళి. (2) చన్ద్రశేఖరుఁడు: ధర్మవివేకకర్త. (3) చంద్రశేఖరుఁడు: పుంశ్చగణదీపికా కర్త. (4) మహామహోపాధ్యాయ, చంద్రశేఖరుఁడు: స్మృతిప్రదీపకర్త. (5) చంద్రశేఖర వాచస్పతి: విద్యాభూషణునితనయుఁడును, ద్వైతనిర్ణయ (=నిర్ణయ సంగ్రహ) ధర్మదీపికా (=స్మృతిదీపికా) స్మృతిసారసంగ్రహములకుఁ గర్త. (6) చంద్రశేఖరశర్మ: దుర్గభంజన (=సంకల్పస్మృతిదుర్గభంజన) ము. (7) చంద్రచూడభట్టు (=చంద్రశేఖరశర్మ): ఉమాపతికి (ఉమణభట్టునకు) తనయుఁడు; ధర్మేశ్వరునికి (=ధర్మభట్టపౌరాణికునకు) పౌత్రుఁడునగు నీతని కాలము క్రీ. 1575-1650 ఈతనికృతులు – కాలదివాకరము; కాలసిద్ధాంతనిర్ణయము; గృహవాస్తునిర్ణయము; పాకయజ్ఞ నిర్ణయము, పిండపితృయజ్ఞప్రయోగము, శ్రాద్ధ నిర్ణయము, సంస్కార-నిర్ణయము (=చన్ద్రచూడీయము)

‡ దీని మాతృక బికనేర్ మహారాజభవనమునందలి గ్రంథాలయమునఁ గలదు.

(R. L. Mitra : 'Catalogue of Skt. Mss in the Library of H. H. the Maharaja of Bikaner' - No. 296. Calcutta. 1880.

Also 'Kavya Volume' of the Catalogue of Skt. Mss of the Calcutta Skt. College - 1904. Ref. No. 13).

* 'List of Mss. of Fort William' - Asiatic Society of Bengal, Calcutta.

"ప్రస్తావచింతామణి" వ్రాఁతప్రతి జర్మనీ దేశమున బెర్లిన్ నగరము నందలి ప్రాచ్యగ్రంథనిలయమునఁ గలదు. ఆ గ్రంథమును గూర్చిన విశేషములు డాక్టర్ వేబర్ (Dr. Weber) కూర్చిన లిఖితగ్రంథ వర్ణనాత్మకసూచికయందుఁ గలవు.

కవీంద్రవచనసముచ్చయము, సదుక్తికర్ణామృతము, సూక్తిముక్తావళి, శార్ఙ్గధరపద్ధతి, సుభాషితావళి, అనుప్రాప్తసుభాషిత కోశములందు చంద్రచూడునిశ్లోకము లెవ్వియు నుల్లేఖింపఁబడ లేదు. ఈకవిరచనలుగా సూక్తిసుందరమున నేడును, పద్యవేణిలో రెండును, రసికజీవనమున నొకటియు, సుభాషితసారసముచ్చయమున నొకటియు, పద్యామృతతరంగిణియందు రెండును పద్యములుదాహరింపఁ బడినవి. మఱియు, చంద్రచూడునిసుభాషితకోశములు రెంటినుండియు నాల్గుశ్లోకములు పద్యామృతతరంగిణియం దుల్లేఖింపఁ బడినవి. పద్యామృతతరంగిణిరచనాకాలము క్రీ. 1673 అగుటచే చంద్రచూడుఁ డింతకంటెఁ బూర్వుఁడని నిర్ణయింపఁ దగును; కాని యెంతపూర్వుఁడో, అనఁగా నాతనికాలమునకుఁ బూర్వావధి యేదియో నిర్ణయింప నాధారములు లేవు.

చంద్రశేఖరకవిశ్లోక మొక్కటి పద్యామృతతరంగిణి (11 ప.) యందును, పద్యవేణి (24 ప.) యందును నుదాహరింపఁబడినది. ఈతఁడును, పై చంద్రచూడుఁడు నభిన్నులే కావచ్చును; కాని, దీనిని నిర్ణయించుటకుఁ బ్రమాణమేదియు లేదు.

అన్యోక్తికంఠాభరణమునుండి కవిపేరెత్తక, పద్యామృతతరంగిణియం దీక్రిందిపద్యములు రెండు నుదాహరింపఁ బడినవి:—

6. పనసవృక్షముపై నన్యోక్తి (దుర్జననింద):

"ఆమన్త్రణా సురభిణా మరుతా కృతా దా,
దత్తం ఫలం చ పురతః కటు కణ్టకాఖ్య (ఢ్య) మ్;
భగ్నం ముఖం విముఖతా చ తతః శుకానాం,
రాజ్ఞాం పురః పనస! కీర్తిరియం తవైవ."

—(పద్యా. త. 56 పు. ౨౩౭ ప. — 'అన్యోక్తికణ్ఠాభరణాత్')

7. పలాశము (మోదుగుచెట్టు)పై నన్యాపదేశము:

(మహాపదవియందున్నను అల్పుఁడు ఘనకార్యములను చేయలేఁడు.)

"గుచ్ఛాన్ పౌష్పా నచ్ఛమాణిక్యశోభాన్,
స్వర్ణాళిభిర్వ్యక్ష్య సమ్యఙ్పరీతః,
ఇన్ద్రోద్యానే స్థాపితో రత్నవేద్యాం
కామాన్ దుగ్ధే కుత్ర ముగ్ధే పలాశః?"

—(పద్యా. త. 58 పు. ౨౩౯ ప. — 'అన్యోక్తికణ్ఠాభరణాత్.')

3. ప్రస్తావచింతామణి: చంద్రచూడుఁడు:—

పై సుభాషితకోశమునఁ గవి ప్రస్తావోచితములగు పద్యరత్నములను స్వకీయపరకీయకావ్యములనుండి సంధానము చేసియుండును. లేక వేదాంతదేశికులసుభాషితనీవి, వేంకటాధ్వరికృతసుభాషితకౌస్తుభములయందువలెఁ బై సూక్తికోశమునందును చంద్రచూడుని వే వివిధాంశములపై రచింపఁబడిన ప్రాస్తావికశ్లోకములు సంగ్రహింపఁబడి యుండును. ఈకోశమునుండి యీక్రింది రెండుపద్యములు మాత్రము కవినామరహితములుగా పద్యామృతతరంగిణిలో నుదాహృతములై యున్నవి:

8. రోమావళీవర్ణనము:—

"గమ్భీరనాభీసరసో గృహీతా,
రోమాలిశైవాలలతోపభోక్తుమ్,
ఉరోజచక్రాఙ్గయుగేన మన్యే,
ముఖేన్దుమాలోక్య తథైవ ముక్తా."
—పద్యా. త. 39 పు. ౧౫౫ ప. —('ప్రస్తావచిన్తామణేః')

9. సమర్థుఁడగు రాజపుంగవుని పరిపాలనము :—

"సాజ్యార్యం హ స్త జాతేర్న భవతి, విషయో —
పస్థితి స్త్వాదిపూర్ణాం,
హేత్వాభాసాః ప్రమర్థే వ్యధికరణతయా—
వస్థితిః కాననేషు,
ధూమాదత్రానుమానం ప్రసరతి పురతః
పర్వతే వహ్నిరస్తీ-
త్యాశ్వస్యోద్యత్కుతర్కా వ్యభిచరతి మతిః
సాధనవ్యాప్త్యపాధా."
—(పద్యా. త. 16 పు. ౪౯ ప. —'ప్రస్తావచిన్తామణేః')

పై పద్యమునందలి తర్కపరిభాషాపదను లచమత్కారమును గమనింపఁదగును. ఇంకను సుభాషితకోశములం దుదాహరింపఁబడిన చంద్రచూడునికవితాశకలము లిట నుల్లేఖింపఁబడును:

10. ప్రతాపవర్ణనము:—

శా. "కాన్తాతే జలనృత్తవైరిణి ముహు
స్త్వద్వైరివామభ్రువో,
బాలై రాకులలోచనైః ప్రతిపదం
రుద్ధక్రమాశ్చజ్ఞ్రిమే,

పృథ్వీచక్రారుచే పటచ్చరదశా-
సంఘట్టదీప్తప్రభం,
సిఞ్చన్త్యఞ్జలిసఞ్చితాశ్రుభిరలం
యుష్మత్ప్రతాపానలమ్.' *

11. "కాష్ఠానుషఙ్గాత్ పరివర్ధమానే,
జాగ్రత్ ప్రతాపజ్వలనే త్వదీయే,
శ్రీ కార్తవీర్య! ప్రసభం పతన్తి
ప్రత్యర్థిపృథ్వీపతయః పతఙ్గాః." *
—'చన్ద్రచూడస్యైతౌ' (సూక్తిసుందరము – 25 పు. ౯౩–౯౪ ప.)

12. ప్రభుకీర్తి, శత్రురాజమహిషులు:—
(అ) శా. 'త్వత్తేజఃప్రతిభాభయాదపసృతాః
ప్రత్యర్థిభూభృత్ స్త్రియః,
కాన్తారే ఘనకణ్టకిద్రుమవన-
వ్యాస్తప్రయుక్తామ్బరాః,
ఆర్యాణాం పురతస్త్రపాపరవశా
గచ్ఛేయురేతాః కథం,
క్షౌమాకారతయా న చేత్ పరిణమేత్
తత్రావకీనం యశః" * —(సూ. సు. 22 పు. ౭౯ ప.)

(భావము:— మహాప్రభూ, దుర్నిరీక్ష్య మగునీ తేజఃపుంజమునకు దిగ్భ్రమనొంది నీశత్రురాజస్త్రీ లడవులపాలైరి. సాంద్రారణ్యములలో దట్టముగానున్న కంటకవృక్షములవలన వారివస్త్రములు తొలఁగఁగా, ధవళమగు నీకీర్తి యను పట్టువస్త్రమే వారికి మానసంరక్షకము కానిచో వివస్త్రలగువారు పెద్దలకంటఁ బడుటెట్లు?)

* పై 10_12 పద్యములు మూఁడును 'కార్తవీర్యవిజయము' నందలివి కావచ్చును.

13. (అ) శా. 'చన్ద్రశ్చన్దనమిన్దు రిన్దురమణం
పీయూష మీశాదయో,
తావసేన మహాతా
ధృత్వా,
ఏతద్ యత్ర న విద్యతే త్రిభువనే
న స్థానమేవం విధం,
జానే జహ్నుపారిజాతసగుణం
బ్రహ్మైవ పూర్ణం యశః'

-(సూ. సు. 22 పు. ౯౦ ప.)

14. (ఇ) శా. 'చన్ద్రాద్ రూప్యకమణ్డలోః సముదయద్
గౌరాంశుగఙ్గాజలైః,
జ్యోత్స్నాచన్దనచర్చనై ర్వికసితై-
స్తారాప్రసూనై రపి,
ఏతద్విష్ణుపదం కిమిచ్ఛతి భవత్-
కీర్తిర్మహాయోగినీ,
పూజాపూర్తివిధాయిలక్ష్మితులసీ-
దామ్నా కదాఽన్విష్యతిః'

-(సూ. సు. 22 పు. ౯౧ ప.)

15. (ఈ) శా. 'గఙ్గాసాగరసఙ్గమే కృతశత-
స్నానా బదర్యాశ్రమే,
స్థిత్వాసౌ పరిధాయ తద్గుణమయం
శ్వేతం దుకూలం పునః,
బ్రాహ్మం వైష్ణవ మైన్ద్ర మైశ్వరమపి
స్థానం స్పృశ న్తీ ముహుః,

కాన్తిస్తే పతిజీవతా యుగశతం
దీర్ఘాయురాకాఙ్క్షతి.'
—'ఏతే చన్ద్రచూడస్య' (సూ. ము. ౯౩ ప.)

16. ఖడ్గవర్ణనము:—
స్రగ్ధరా. 'చూడాపీడాభిరామః స్ఫురదురుమణిభి
ర్ముద్రికా కల్పసూత్రై-
ర్దోర్దణ్డః కుణ్డలీన్ద్రస్తవ జయతి జగ-
న్మణ్డలాధార ఏషః,
క్షీరబ్రాన్త్యారికీర్తిం సపది సముదితాం
పాతుకామః ప్రసర్ప-
జ్జిహ్వాముచ్చైః కిమేనాం చపలయతి చమత్-
కారిణీం ఖడ్గధారామ్.'
—(సూ. ము. 36 పు. ౧౩౯ ప. — 'చన్ద్రచూడస్య.')

ఈక్రిందిపద్యములు రెండును చంద్రచూడరచితములుగా 'పద్యవేణి' లో లభించుచున్నవి:

17. కావ్యప్రశంస:—
'చిత్రేణ వర్ణనిచయేన విరోచమానం,
శుద్ధోజ్జ్వలైరపిగుణైః కృతగాఢబన్ధమ్,
సహాయముత్కాృవ (వ్య?) విధేః (?) ప్రథితం నిదానం (?)
కావ్యం వితానమివ కస్య న తాపశాన్త్యై'
(ప. వే. 224 పు. ౭౨౦ ప. — 'చన్ద్రచూడస్య')

18. చంద్రునిలోనియంకము:
శా. 'సూర్యేఽస్తం సముపాగతే సఖి కరైః
పశ్యేద ముగ్ధేన్దుమ్భుత్వం,

నీచై రమ్బుజమాననం విదధతీ
మిత్రప్రియా మ్లాయతి,
పూర్ణస్యాపి కుముద్వతీపరిచిత-
స్యాప్యస్య శీతద్యుతే-
ర్యత్తస్యాం స్వకరార్పణం తదధునా
లగ్నో ముఖే కాలిమా.'

—(ప. వే. 169 పు. ౫౮౦ ప. – 'చన్ద్రచూడస్య'; సుభాషిత
సారసముచ్చయము, ౨౫౭ ప.)

గదాధరుని 'రసికజీవనము' న నుల్లేఖింపఁబడిన చంద్రచూడుని
పద్య మొక్కటియు నిట నొసఁగఁ బడును:—

19. సూర్యకిరణవర్ణనము:—

స్ర. 'సిన్దూరాణీవ సీదత్కృపణకులవధూ-
మూర్ధ్ని యే సంచరన్తః,
ప్రేక్ష్యన్తే దిక్షు శైలాః శిఖరభువి లస-
త్పద్మరాగాఙ్కురా యైః,
ధున్వన్తే ధ్వాన్తధారాః సహదురితచయై-
ర్దూరదృశ్యాః సుదృశ్యాః,
పాన్తు త్వాం పద్మబన్ధోరకరణకిరణాః
పూరణాః పద్మబన్ధోః.'

—(ర. జీ. I. 4 పు. ౫౩ ప. – 'చన్ద్రచూడస్య';
సు. ర. భా. I. 29 పు. ౧౮ ప.)

ఇఁక, పద్యామృతతరంగిణిలో చంద్రచూడునిరచనములుగాఁ
జేర్కొనఁబడిన రెండుశ్లోకము లీక్రింద నుదాహరింపఁబడును.

20. యమునానదీమహిమ:—

స్ర. 'యత్ర స్నాతః ప్రమత్తో జననపతితమపి

తస్యావశ్యం వయస్యా భవతి సురపతేః
స్వఃస్థలే కిం న వశ్యా,
పాపధ్వంసాయ హాలాహలమమృతమిదం
పుణ్యసంవర్ధనార్థం,
హన్యాదన్యాయమూలం భగవతి యమునే!
వారి కూలఙ్కషం తే.'

—(పద్యా. త. 12 పు. ౮౮ ప. — 'చన్ద్రచూడస్య')

21. కీర్తనరూపభక్తి:—

'హరినామ హేమ సులభం
సుప్రేమోత్తమతమం రత్నమ్,
సులభో మానసశిల్పీ
కణ్ఠాభరణం కుతో న కురుషే తత్.'

—(పద్యా. త. 65 పు. ౨౬౭ ప. — "చన్ద్రచూడస్య")

౮. చంద్రశేఖరకవి:—

చంద్రశేఖరనామకు లగుసంస్కృతకవు లెందఱో కలరు. అందు పద్యామృతతరంగిణిలో నుదాహరింపఁబడిన కవియొక్కవ్యక్తిత్వ విశేషముల నిర్ణయింప నాధారములు లేవు. ప్రమాణమును జూప లేము కాని యీతఁడును బూర్వోక్తచంద్రచూడుఁడు నొక్కఁడే కావచ్చును. ఈతనిరచనగా లభించినపద్య మొక్కటియు నిట నుదాహరింపఁబడును:

22. శివతాండవవర్ణనము :—

పృథ్వీ. 'తృతీయనయనోదరస్ఫుటకృపీటజన్మోద్భట-
స్ఫులిఙ్గపటలీమిషాన్నభసి కీర్ణపుష్పాంజలిః,
జటాపటకుటీతటీసురసరి
శుభాయ నటనార్భటీ భవతు ధూర్జటీ జన్మనః'
—(పద్యా. త. ౧౧ ప. – పద్యవేణి. ౬౮ ప. 'చన్ద్రశేఖరస్య')

౨౩ సూక్తిరత్నాకరము:– సంధానకర్త?

పైసూక్తిరత్నాకరమును గూర్చినకవిపేరు గాని, కాలము గాని తెలియుటలేదు. ఈ కోశమునుండి నాల్గు శ్లోకములుమాత్రము కవినామరహితములుగా 'సూక్తిముక్తావళి' లోఁ గ్రోడీకరింపఁబడినవి. సూక్తిముక్తావళి క్రీ. శ. 1258 (=శక. 1179) వ వత్సరమున, పింగళవత్సర చైత్రప్రతిపత్తిథి, ఆదివారమునాఁడు పూర్తి చేయఁబడిన ట్లీక్రిందిపద్యమును బట్టి తెలియుచున్నది:

"శాకేఽఙ్కాద్రీశ్వరపరిమితే, వత్సరే పిఙ్గళాఖ్యే,
చైత్రే మాసే, ప్రతిపది తిథౌ, వాసరే సప్తసప్తేః,
పృథ్వీం శాసత్యతులమహసా యాదవే కృష్ణరాజే,
జల్హాస్యార్థే వ్యరచి-భిషజా భానునా సేయమిష్టా."
—(సూక్తిముక్తావళి, 463 పు.)

దేవగిరినుండి రాజ్యపాలనమొనర్చిన యాదవవంశమునకుఁ జెందినకృష్ణరాజుకాలమున (క్రీ. 1247–50) పైసూక్తిముక్తావళి సంధానము చేయఁబడినది. సంధానకర్త వైద్యభానుఁ డనుకవిశేఖరుఁడు; ఈతఁ డారోహకభగదత్తజల్హణునికృతిగా దీనిని గూర్చెనఁట. ఇం దుదాహరింపఁబడుటచే సూక్తిరత్నాకరము క్రీ. 13 వ శతాబ్దమునకుఁ బరము కాదని నిర్ణయింపఁజనును; 13 వ శతాబ్దిలో, తత్పూర్వశతాబ్దులలో యిది చెందియుండు ననుట సంభావ్యము.

సూక్తిరత్నాకర మత్యన్నప్రాయ మగుప్రాక్తనసుభాషిత సుధానిధి. ఇది యంతరించుటవలన వాఙ్మయమునకుగొప్పకొఱంత కల్గిన దనఁదగును. దీనిలో మనము కని విని యెఱుఁగని కవిచంద్రుల నామములు, వారికృతిభూషణములనుండి యేర్చి కూర్చినపద్య రత్నములు నెన్ని యుదాహృతములో? ఇవన్నియు నష్టప్రాయము లైనవి.

నష్టశేషము లగుసూక్తిరత్నాకరము నందలిపద్యములు నాలుగు నీక్రింద నుల్లేఖింపఁ బడును:

(అ) అభిసారికావర్ణనము:–

23. 'అగ్రే ధను శ్శరకరః స్వయమస్తి కామః
పశ్చాత్ త్వరా శశధరోదయసంశయోత్థా,
ధ్వాన్తం దినాన్తవికసద్విభవం సమన్తాత్,
కిం కేవలా పథి వధూ ర్దయితాభిసారే.'

–(సూ. ము. 258 పు. ౧౧ ప., 'సూక్తిరత్నాకరాత్')

(ఆ) గ్రీష్మవర్ణనము:–

24. 'క్వాపి క్వాపి దిగన్తే, కుశధవళః కోఽపి కోఽపి ఘనలేశః,
తిగ్మద్యుతిదగ్ధానాం, తారాణాం భస్మవద్భాతి.'

—(సూ. ము. 213 పు. ౪ ప.)

25. 'తతః ప్రావిరభూద్గ్రీష్మ స్తప న్వసుమతీమిమామ్,
సపిణ్డః కాలకూటస్య, సప్తజిహ్వస్య సోదరః.'

–(సూ. ము. 213 పు. ౨ ప)

26. 'తపనం బిభ్రదాకాశో జగత్ క్వాథవిశృఙ్ఖలమ్,
స్ఫురల్లలాటనయనం హరం నాటయతి స్ఫుటమ్.'

–(సూ. ము. 213 పు. 3 ప.)

పైమూఁడుపద్యములకుఁ జివర 'సూక్తిరత్నాకరాదేతే' అని యాకరసూచన కలదు.

౬. ద్రావిడ- గోపాలభట్టు (=గోపాలభట్ట-ద్రావిడ్)

గోపాలభట్టు హరివంశభట్టద్రావిడునితనయుఁడు; క్రిందఁ బేర్కొనఁబడు కేశవభట్టద్రావిడునిసోదరుఁడు, శుద్ధాద్వైతమత సిద్ధాంతస్థాపనాచార్యు లగువల్లభాచార్యునిసోదరుఁ డగువిఠ్ఠలేశ్వర కవియే కేశవభట్టునకు గురువు. కావున సోదరులగు గోపాల - కేశవ భట్టు లిరువురును క్రీ. శ. 1550–1600 ప్రాంతములకుఁ జెందిన విఠ్ఠలేశ్వరునికి సమకాలికు లగుటచే, వీరును క్రీ. 16 వ శతాబ్దమున నుత్తరార్ధమున జీవించియుండి రనఁదగును.

గోపాలభట్టు రచనలు:

(i) రసికరంజని (=భానుకరునిరసమంజరిపై వ్యాఖ్య)

(ii) రుద్రటునిశృంగారతిలకముపై వ్యాఖ్య.

(iii) మమ్మటునికావ్యప్రకాశమునకు వ్యాఖ్యను రచించిన గోపాలభట్టును రసికరంజనీకర్తయు నభిన్నులుగానే తోఁచును. *

పై వ్యాఖ్య లేవియు ముద్రణభాగ్యము నందినట్లు తెలియదు.

౭. ద్రావిడకేశవభట్టు: రసికసంజీవని:—

పూర్వోదాహృత ద్రావిడ- గోపాలభట్టునకు సోదరుఁడు, ద్రావిడహరివంశభట్టునకుఁ గుమారుఁడు నగు కేశవభట్టు విఠ్ఠలేశ్వరునిశిష్యుఁ డనియు, క్రీ. 16 వ శతకమున నుత్తరార్ధమున జీవించి యుండు ననియుఁ బూర్వప్రకరణమునఁ జెప్పఁబడియే యుండెను.

రసికసంజీవని యను మూఁడువిలాసములు గలసాహిత్య గ్రంథము నీతఁడు రచించెను. ఇందు మొదటివిలాసమున నవతరణి

* ఈయనరచనము లింకను Catalogus Catalogorum, Iవ భాగమునఁ బేర్కొనఁబడెను

కాంశములు, రెండవదానిలో నాయికాచర్య, మూఁడవదానిలో మాన, ప్రణయ, రాగ, శృంగారాదివిషయములు వివరింపఁబడెను. ఈగ్రంథమింకను సూర్యాలోకభాగ్యము నందలేదు.

౮. విఠ్ఠలేశ్వరకవి (=విఠ్ఠలదీక్షితులు)

పై కేశభట్టునకు గురువు విఠ్ఠలేశ్వరకవి. ఈయన బాలంభట్టునకుఁ బ్రపౌత్త్రుఁడు, లక్ష్మణభట్టునకుఁ బౌత్త్రుఁడు, శుద్ధాద్వైతమతస్థాపనాచార్యులగు వల్లభాచార్యునకు (క్రీ. 1478-1530) తనయుఁడు, గోపీనాథపండితున కనుఁజుఁడు. వల్లభాచార్యుల కనుజుఁడు, మహావిద్వత్కవియగు అయోధ్యరామచంద్రభట్టు (జన్మ. క్రీ. 1484 ప్రాంతము). విఠ్ఠలేశ్వరునిజననకాలము క్రీ. 1515. ఈయనకు 'అగ్నికుమారుఁడు' అను నామాంతరము. † ఈయనకు గిరిధరుఁడు, రఘునాథుఁడు మొద లగుతనయు లేడుగురు.

వీ రందఱు నాంధ్రులనియు, వీరివాసస్థానము నేఁటి పశ్చిమగోదావరీమండలమునందలికవినుండితా వాసమగు 'కాకఅపట్టు' అనియు, ఇంటిపేరు కంభంపాటివా రనియుఁ దెలియుచున్నది.

జనకునివలెనే విఠ్ఠలేశ్వరుఁడును మహావిద్వాంసుఁడై కాక బహుగ్రంథనిర్మాణనిపుణుఁడై ఖ్యాతినందెను. ఈయనకృతులలో ముఖ్యములు :

(అ) కృష్ణప్రేమామృతము (కావ్యము)
(ఆ) యమునాష్టపది (లఘుకావ్యము)
(ఇ) రససర్వస్వము (సాహిత్యగ్రంథము)
(ఈ) రీతివృత్తిలక్షణము (సాహిత్యగ్రంథము)
(ఉ) శృంగారరసమండనము (భండార్కర్ ప్రాచ్యగవేషణాలయమునఁ గలదు)

---

† పదమంజరి మొదలగుగ్రంథముల రచించినహరదత్తున కగ్రజుఁడగుద్రుద్ర కుమారునితనయుఁడు అగ్నికుమారుఁ డీతనికంటె భిన్నుఁడని యెఱుఁగునది.

(ఊ) జయదేవునిగీతగోవిందమునకు వ్యాఖ్య.

విఠ్ఠలునితనయు లగుగిరిధరరఘునాథులు (శ్రీ)కృష్ణస్తోత్రములు రచించిరి. పద్యవేణిలో నుల్లేఖింపఁబడినవిఠ్ఠలేశ్వరునిపద్యము లైదిట నుదాహరింపఁబడును. యోషిదవయవసౌష్ఠవవర్ణనాత్మకము లగునీశ్లోకములు బహుశః శృంగారరసమండనము నందలివి కానోపు.

27. -(చిబుకవర్ణనము):
'కిం వర్ణయామి తస్యా, శ్చిబుకగతశ్యామబిన్దుసౌన్దర్యమ్,
మన్యే రసికశిరోమణి, మాధవమన ఏవ సంలగ్నమ్.'
28. 'అధికావ్యా దధరసుధా, స్ఖలేదితి ప్రాప్తశఙ్కయా విధినా,
రచితం సేతుపట్టమ్యే, చిబుకం పాటీరమాదధతా.'
-(ప. వే. 71 పు. ౨౩౩—౩౪ ప; 'విఠ్ఠలేశ్వరస్య')
29. (పాదాఙ్గుళీభూషణముద్రావర్ణనము):
'చరణాఙ్గుల్యాభరణా, న్యతిరురుచురమన్దకాన్తికాన్తాని,
విషమానఙ్గభుజఙ్గమ, ఫణమణయ ఏణశాబాక్ష్యాః.
-(ప. వే. 61 పు. ౧౯౩ ప.— 'విఠ్ఠలేశ్వరస్య.')
30. (నీవీగ్రన్థివర్ణనము):
'వివిధమణిజటిలకనక, ప్రసూనలసదసితపట్టగుచ్ఛాభ్యామ్,
సతతాతిపీతదామ్నా, శుశుభే గ్రన్థిః ప్రియానీవ్యాః.
-(ప. వే. 63 పు. ౨౦౧ ప. —'విఠ్ఠలేశ్వరస్య'
31. (కంఠవర్ణనము):
'మణివరహీరకహాటక, ఘటితం ముక్తావలీప్రాయమ్,
ప్రకట ఇవ భాగ్యనిచయో, భూషణమస్యా బభౌ కణ్ఠే.'
-(ప. వే. 68 పు. ౨౨౧ ప.— 'విఠ్ఠలేశ్వరస్య')

౯. సదాశివకవి:

కవిలోకరంజన మొనరించినసదాశివకవిచరిత్ర గాని, కాలముగాని తెలియుటలేదు, పద్యవేణి, పద్యామృతతరంగిణి, రసికజీవనము,

విద్యాకరసహస్రకము, సుభాషితరత్నభాండాగారము, సుభాషిత సారసముచ్చయము, సుభాషితహారావళి, అనుసుభాషితకోశములలో నీతనిశ్లోకములు కొన్ని యుల్లేఖింపఁబడెను. పద్యామృతతరంగిణిలో నుదాహరింపఁబడినయీతనిశ్లోక మొక్కటియుఁ బద్యవేణియందును, సుభాషితహారావళియందును గన్పట్టుచున్నది. సుభాషితసార సముచ్చయమున నుదాహరింపఁబడిననాలుగుపద్యములలో నొక్కటి మాత్ర మేయితరకోశములందుఁ గానరాదు. పద్యవేణిలో నీతనిశ్లోకములు పదునొకండు లభించుచున్నవి. ఇం దెనిమిదిపద్యము లేయితరకోశములందును గానవచ్చుటలేదు.

సదాశివకవిపద్యముల నుదాహరించుకొనినసుభాషితకోశము లెవ్వియును క్రీ. 16 వ శతకమునకు (అనఁగా క్రీ. 1500 కు) ప్రాక్తనములు కాకపోవుటచే నీకవి తత్కాలమునకుఁ గాని, అంతకించుక పూర్వకాలమునకుఁ గాని చెందియుండనోపు.

మన కుపలబ్ధము లగుసదాశివునిపద్యములలో వర్ణితము లగు విషయములు: కవివర్ణనము, యోషిదవయవసౌష్ఠవము, ప్రణయము, చంద్రసూర్యులు, అరణ్యము, ఋతువులు, క్రీడలు-మొదలగునవి.

సదాశివకవికవితాశకలము లిఁక నుదాహరింపఁబడును:

32. (ఆశీస్సు) – మన్దాక్రాన్తా వృత్తము –

'బృ (వృ) న్దారణ్యే తపనతనయాతీరవానీరకుఞ్జే,
గుఞ్జన్మఞ్జుభ్రమరపటలీకాకలీకేలిభాజి,
ఆభీరాణాం మధురమురళీనాదసంమోహితానాం,
మధ్యే క్రీడన్నవతు నియతం నన్దగోపాలబాలః' ౧

—(రసికజీవనమ్, 1. ౬౪ ప., 'సదాశివస్య';
సు. ర. భా. 24 పు. ౧౩౪ ప.)

33. (ఆశీస్సు) :

'త్వాం పాతు నీలనలినీదళదామకాన్తేః,
కృష్ణస్య పాణిసరసీరుహకోశబన్ధః,
రాధాకపోలమకరీలిఖనేషు యోఽయం,
కర్ణావతంసకమలం విప్లీచకార.' ౭

—(ర. జీ 1. ౭౦ ప., 'సదాశివస్య'; సు. ర. భా 23 ప్ర. ౧౨౮ ప.)

34. (సూర్యప్రణామము) :

'ఆనన్దయన్తమరవిన్దవనాని ఘర్మై-
రుద్వేజయన్తమసకృన్నవకైరవాణి,
ప్రక్షాళయన్త మభితో భువనాని ధామ్నా,
భాస్వన్తమన్తక మహం విపదాం భజామి.' ౩

—(ప. వే. ౫౦ ప. 'సదాశివస్య')

35. (కీర్తివర్ణనము) :

స్ర. 'బీజం చే దిన్ద్రిదన్తి-
స్ఫుటకరటతటీముక్తముక్తామణిః స్యా-
చ్చన్ద్రిశ్చే దాలవాలం
యది భవతి సుధా వారిసే (సి) క్తేన్దుమాళిః,
తత్రోత్పన్నా లతా చా-
ప్యమృతకరనిభం చేత్ప్రసూనం ప్రసూతే,
మాన్యే తత్ స్యాత్తదానీ-
మవనిధవ! భవత్కీర్తిలేశోపమార్థమ్.' ౮

—(ర. జీ. ౧౬౮ ప., 'సదాశివస్య;' సు. ర. భా. 144 పు. ౨౫ ప.)

పై పద్యమునఁ బేర్కొనఁ బడిన 'అవనిధవు'ఁ డెవరో తెలియుట లేదు.

36. (ప్రతాపవర్ణనము) :

'ఉదితేఽపి తవావనీన్ద్ర! తేజ-
స్తపనే స్ఫారగభస్తిభారభాజి,

తవవైరినృపాయశాంసి,
స్ఫురదుజ్జృమ్భిత మాచరన్తి చిత్రమ్.' ౫
(ర. జీ. 2. ౧౩౦ ప. 'సదాశివస్య;' సు. ర. భా. 139 పు. ౭ ప.)

35–37 శ్లోకములలోఁ బ్రశంసింపఁ బడినభూపాలుఁ డెవరో తెలిసిన చో సదాశివకవికాలము తెలిసియుండెడిది.

37. (రాజవర్ణనము):

శా. 'కల్పక్షోణిరుహోఽయ మిత్యనుదినం
భూమీసురై ర్భావ్యసే,
కామోఽసావితి కామినీభిరభిత-
శ్చిత్తే చిరం చిన్త్యసే,
శ్రీనారాయణ ఏవ కేవలమితి
ప్రేమ్ణా శ్రియా ధ్యాయసే,
త్వం కాలోఽయమితి ప్రతిక్షితిధరై-
రేకోఽప్యనేకాత్మభృత్.' ౬
–(ర. జీ. ౧౨౧ ప. –'సదాశివస్య'; సు. ర. భా. 117 పు. ౨౯౫ ప.)

38. (కవితాప్రశంస):–స్రగ్ధర–

'మాధ్వీ మాధుర్యధారా-
మధరయతి, సుధాసాధుతాం వ్యాధునీతే,
వైదగ్ధ్యం దుగ్ధరాశే-
ర్విధురయతి, విధోర్దీధితీర్ధిక్కరోతి,
ముగ్ధాముగ్ధాధరాన్తం
తిరయతి, మధుపధ్వానధూతిం విధత్తే,
మధ్యోద్ధత్యావఘాతం
రచయతి, సరసో యస్య వాచాం ప్రపఞ్చః'. ౭
–(ప. వే. ౭౯౦ ప. –'సదాశివస్య.')

39. (ఉద్యానవర్ణనము):

శా. 'క్రీడత్కిన్నరకన్యకాకరతలా-
క్రాన్తక్వణద్వల్లకీ-
క్వాణోత్క్రామితకామకార్ముకకల-
క్రేంకారకోలాహలమ్,
ఉన్నిద్రేన్దుకళాదరిద్రకుముద-
వ్యామోదముగ్ధాధ్వని,
ధ్వాంక్షర్వాన్ మధుపేన్ద్రిమన్ద్రినదై-
రుద్యానముద్ద్యోతతే.' ౮
—(ప. వే. ౬౬౨ ప. —'సదాశివస్య')

పైపద్యమునఁ బూర్వార్ధమున కకారానుప్రాసచమత్కారమును, ఉత్తరార్ధమున దకారధకారానుప్రాసమును గుర్తింపఁదగును.

40. (అ) (కోకిలాన్యోక్తి):

ఆ. 'తావత్కోకిల! విరసాన్,
యాపయ దివసాన్ వనాన్తరే నివసన్,
యావన్మిళదళిమాలః
కోఽపి రసాలః సముల్లసతి.' *

*—(రసగంగాధరము, 330 పు; భామినీవిలాసము, I. ౭ ప; వ్రజనాథుని పద్యతరంగిణి, X. ౮౯ ప; ర. జీ. ౫౭౩ ప. —'సదాశివస్య' సు. ర. భా. 235 పు. ౧౨౭ ప. — పైపద్యము జగన్నాథునిరసగంగాధరమునఁనే కాక, తత్కృతభామినీవిలాసమునఁగూడ నుండుటచే నీశ్లోకము జగన్నాథుని దగుట నిశ్చయము. రసికజీవనకర్త యీపద్యమును సదాశివునిదిగాఁ బేర్కొనుట ప్రమాదము. రసికజీవనము – కలకత్తాప్రతిలోనే స్ఖాలిత్యమున్నదిగాని, బొంబాయి ప్రచురణమున నీపద్యము– III. 59 పు. ౧౮ ప. – 'జగన్నాథరాయస్య' అని సరిగానే యున్నది.)

40. (ఆ) (వసంతశోభ) :

'రాగారుణైః కిసలయైర్వ్యశిఖై రిదానీ-
మాసజ్య కార్ముకలతాముదియాయ కామః,
కిఞ్చాధునా సురసరోజముఖీవిముక్తా
తల్లాజసృష్టిరివ చఞ్చతి చన్ద్రికాపి.' ౯

—(ప. వే. ౬౦౪ 'సదాశివస్య'; సు. సా. స. ౨౭౬ ప.)

41. (హిన్దోలక్రీడ) :

'స్నిగ్ధేన్ద్రనీలమణిదామసమానసూత్ర-
•న్దోలికావలయలోలశరీరయష్టిః,
ఏషాభినన్దయతి మాం ద్వైరదేన్ద్రశుణ్డా-
పర్యాకులా కనకచమ్పకమాలికేవ.' ౧౦

—(ప. వే. ౫౩౬ ప.— 'సదాశివస్య'; సు. సా. స. ౧౧౦ ప.)

42. (పుష్పావచయము) :

'తుఙ్గస్తనస్తబకచుమ్బితవల్లకీభి-
రుల్లోలనీలలలితాలకవల్లరీభిః,
ఏతాభిరున్నతపయోధరమన్థరాభి-
రుద్భ్రామ్యతే కరసరోజగతం సరోజమ్.' ౧౧

—(ప. వే. ౫౭౪ ప.— 'సదాశివస్య'; సు. సా. స. ౯౦ ప.)

43. (కుచవర్ణనము): —శిఖరిణి—

'కుచావస్యాః కామద్విపకలభకుమ్భావితి పరే
వదన్త్యన్యే వక్షస్సరసి కమలే, కాఞ్చనఘటౌ,
అసౌ మే సిద్ధాన్తః స్ఫురతి మదనేన త్రిజగతీం,
వినిర్జిత్య న్యుబ్జీకృతమివ నిజం దున్దుభియుగమ్. ౧౨'

—(ప. వే. ౩౧౧ ప. —'సదాశివస్య'; సుభాషితహారా, ౧౬౬౧౪;
పద్యామృతతరంగిణి, ౧౪౯ ప. — 'సదాశివస్య.' ర.జీ. ౬౯౭
ప. —'సదాశివస్య'; విద్యాకరసహస్రకము, ౯౭౩ ప; సు. ర. భా.
278 పు. ౩౯౧ ప.)

44. (శరత్కాలసరోవరము):

ఆ. 'సురభిసమీరసమాహత-
వీచి (?) పరివర్తితాని పద్మాని,
షట్పదపటలసమాహత-
ముద్భుని రేణుం కిరన్తిహ.' ౧౩

—(ప. వే. ౬౪౭ ప. —'సదాశివస్య.')

45. (వియోగినీవిప్రలాపము): —స్రగ్ధర—

'వార్యన్తాం మన్దమన్దం
మధుకరనికరప్రౌఢఝుంకారధారాః,
క్షిప్యన్తాం యత్ర కుత్ర
ప్రతిదిశమధునా భూరిభారాశ్చ హారాః,
దహ్యన్తాం సర్వపతే
కమలదళయుతాః కించ హా పుష్పహారాః,
తారా నారాచధారా
వికిరతి హృదయే మన్మథోఽయం హతాశః'. ౧౪

—(ర. జీ. ౯౭౨ ప.—'సదాశివస్య'; సు. ర. భా. 298 పు ౪౧ ప.)

46. (ప్రియావిప్రలంభము)—ప్రాకృతభాషాగాథ—

'పిఅసహి కస్స కహిజ్జం,
కో ఉణ జాణాది పరస్స వేఅణం గరుఅం,

మమ ఉః తుహిణమరీచి
దఇఅ-విఓవేణ దూసహో హోఇ.' ౧౫
—(ప. వే. ౫౭౭ ప.– 'సదాశివస్య')

47. (చంద్రోదయము) -స్రగ్ధర-

'కర్పూరీయన్తి భూమౌ,
సరసి సరభసం కైరవీయన్తి, గఙ్గా-
కల్లోలీయన్తి నాకే,
దిశి దిశి పరితః కేతకీయన్తి కిఞ్చ,
హంసీయన్త్యన్తరిక్షే,
కమలదళదృశాం మౌక్తికీయన్తి కణ్ఠే,
శుక్తీయన్త్యమ్బురాశౌ,
విశదబిసరుచో రశ్మయః శీతరశ్మేః.' ౧౬
—(ప. వే. ౫౭౮ ప.– 'సదాశివస్య'; సు. సా. స. ౨౦౦ ప.

పైశ్లోకమునందలి నామధాతుప్రయోగచమత్కారమునకు భావనావిలాసమునకు సాదృశ్యము గలపద్యరత్నములు కావ్యరత్నాకరమునుండి యిట నుదాహరింపఁబడును:

I. (చన్ద్రోదయము) :

శా. 'ఏమ స్వర్గతరఙ్గిణీజలమిల-
ద్దిగ్దన్తిదన్తద్యుతి-
ర్భశ్యద్రాజతకుమ్భవిభ్రమధరః
శీతాంశు రభ్యుద్యతః,
హంసీయ-త్యమలామ్బుజీయతి లస-
డ్డిణ్డీరపిణ్డీయతి,

స్ఫారస్ఫాటికకుణ్డలీయతి దిశా-
మానన్దకన్దీయతి.'
—(సు. ర. భా. 315 పు. ౯౮ ప.– 'శఙ్ఖధరస్య.')

II. (కీర్తివర్ణనము)

శా. 'కర్పూరంతకి కేతకంతకి, శరద్-
రాకాశశాఙ్కన్తకి,
శ్రీచన్ద్రన్తకి, చన్దనన్తకి, సుధా-
సారాచ్ఛపూరన్తకి,
కైలాసన్తకి, దుగ్ధసాగరలసద్-
స్వచ్ఛాచ్ఛదుగ్ధన్తకి,
శ్రీశమ్భున్తకి (?) కీర్తయ స్తవ విభో
దర్వీకరేన్ద్రన్తకి '
-(సూక్తిసున్దరము, ౭౧ ప. –'భట్టాభట్టస్య')

III. (యశోవర్ణనము)

శా. 'కర్పూరన్తి, సునాౙ్రదవన్తి, కమలా-
హాసన్తి, హంసన్తి చ,
ప్రాలేయన్తి హిమాలయన్తి, కరకా-
సారన్తి, హారన్తి చ,
త్రైలోక్యాఙ్గనరఙ్గలఙ్ఘిమగతి-
ప్రాగల్భ్యసంభావితాః,
శీతాంశోః కిరణచ్ఛటా ఇవ జయ
న్త్యేతర్హి తత్కీర్తయః.'
—(సు. ర. భా. 142 పు. ౪౯ ప).

IV. (కీర్తిప్రశంస) -ఆర్యావృత్తము-

'మచకలశే ష్వబలానా-
మలకానా మథ పయోనిధేః కలినే,
క్షితిపాల! కీర్త్యయ స్తే
హర న్తి, హరన్తి, హరన్తి.' -(సు. ర. భా. 140 పు. 3 ప)

V. (యశఃప్రశంస)

శా. 'కైలాసీయతి, కేతకీయతి, హసత్-
కున్దీయతి, ప్రోచ్ఛలత్-
క్షీరోదీయతి, చన్ద్రసీయతి, లసత్-
కర్పూరపూరీయతి,
పీయూషీయతి, శర్కరీయతి, శర-
చ్చన్ద్రీయతి, క్ష్మాపతే!
స్వర్గఙ్గీయతి, శంకరీయతి, భవత్-
కీర్తిః కరీన్ద్రీయతి' —(సు. ర. భా. 143 పు. 20 ప.)

VI. (కీర్తివర్ణనము)

శా. 'కైలాసీయతి, కైరవీయతి, లసత్-
కర్పూరపుఞ్జీయతి,
క్షీరోదీయతి, మౌక్తికీయతి, నభో-
గఙ్గాతరఙ్గీయతి,
హంసౌఘీయతి, మానసీయతి, శర-
న్మేఘీయతి, క్షోణిభృ-

న్నాకీయత్యమృతీయతి, క్షితితలే
దేవ! త్వదీయం యశః'.

—(సు. ర. భా. 142 ప. ౫౩ ప.)

VII. (యశోవర్ణనము) —స్రగ్ధర—

'క్షీరోదీయన్తి సద్యః సకలజలధయో,
వాసుకీయన్తి నాగాః,
కైలాసీయన్తి శైలా, దివి చ దివిషదః
శఙ్కరీయన్తి సర్వే,
యాష్మాకీణే సమన్తాత్ ప్రసరతి నితరాం
దిక్షు కీర్తిర్వితానే, *
మద్యోషా కాచభూషాః కిమితి న సహసా
మౌక్తికీయన్తి భోజ'. (భూప-పాఠా.)

—(పద్యా. త. ౩౭ ప- ఇందు 'భూప' అని పద్యాంతిమపదము; ర. జీ. ౧౬౧ ప. బొంబాయి ప్రతిలో 'భోజ'- అని శ్లోకాంతపదము; ఇది సరియగు పాఠమే యగుచో భోజునకు సమకాలికుఁడు, ఆశ్రితుఁడు నగునేకవియో యీ పద్యమును రచించెనని నుడువనగును. సూ. ము. ౫౭ ప. ఇందు 'రూపమ్'- అని పద్యాంతపదము. సు. ర. భాం. 143 ప. ౭౫ ప. ఇందు 'దేవ' అని శ్లోకాంత శబ్దము.)

VIII (కీర్తిప్రశంస):

శా. 'గఙ్గీయత్యసితాపగా; ఫణిగణం
శేషీయతి; శ్రీపతిః,
శ్రీకణ్ఠీయతి; కైరవీయతి కులం
నీలోత్పలానాం వనే;
కర్పూరీయతి కజ్జలం; పికకులం
లీలామరాళీయతి;

* (చారు క్రీడితతానే-పాఠా.)

స్వః కుమ్భాయతి కుమ్భినామపి ఘటా
త్వత్కీర్తిసంఘట్టితః'.
—(సు. ర. భా. 142 పు. ౫౮ ప.)

IX (ప్రతాపవర్ణనము) :

శా. 'తాటఙ్కాన్తికి, చమ్పకన్తకి, సహా
ప్రాంశున్తకి (?) ప్రస్ఫురద్-
గోమేదన్తకి, వీతిహోత్ర విచల-
జ్వాలాజటాలన్తకి,
తాలాద్రిన్తకి (?) కేశవామ్బరమహత్-
కాన్తిన్తకిహ (?) ప్రభో,
విద్యుద్దీప్తిగణన్తకి ప్రతిదినం
భూమా ప్రతాపాన్తవ'.
—(సూ. ను. ౧౦౦ ప- కవిపేరు లేదు)

X. (దానప్రశంస)

ఆ. 'త్వయి వితరతి కనకాచల-
కుచపాళిర్ఘటతి సమ్పుటతి,
శ్రీఫలతి, కనకముకుళతి,
బదరతి సఙ్గ్రామశాహా! వసుధాయాః.'
-(రసపారిజాతీ II. ౩౨ ప. 13 పు.)

XI, (మహావరాహస్తుతి)

శా. 'భూయాదేష సతాం హితాయ భగవాన్
కోలావతారో హరిః,
సిన్ధోః క్లేశమపాస్య యస్య దశన-
ప్రాన్తే నటన్త్యా భువః,

తారా హారతి, వారిద స్తిలకతి
స్వర్వాహినీ మాల్యతి
క్రీడాదర్పణతి క్షపాపతి, రహ-
ర్దేవశ్చ తాటఙ్కతి.' ('భానుకరస్య')

—(ర. పా. I. ౭ ప. 2 పు; రసతరంగిణి, 47 పు; సు. హారా. ౪౭ ప;
ర. జీ. ౯౩ ప; ప. వే. ౭౫౩ ప; పద్యరచన ౧౦ ప, 2 పు.
సు. ర. భాం. 19 పు. ౩౭ ప.)

XII. (జ్యోత్స్నావర్ణనము):
శా. 'యః శ్రీఖణ్డతమాలపత్త్రతి దిశః
ప్రాచ్యా స్స్మరత్యాతపతేః,
పాణ్డుచ్ఛత్త్రతి దన్తపత్త్రతి వియ-
ల్లక్ష్మీస్మరజ్జీదృశః,
కేళిశ్వేతసహస్రపత్త్రతి రతేః
కిం చ క్షపాయోషితః,
క్రీడారాజతసీధుపాత్రతి శశీ
సోఽయం జగన్నేత్రతి.'

—(సు. ర. భా. 316 పు. ౧౦౪ ప.)

48. (ప్రియునిప్రణయాలాపము): —మందాక్రాంత—
'త్వం సర్వస్వం కమలనయనే! జీవితం త్వం మదీయం,
దీర్ఘాపాఙ్గి! త్వమసి హృదయం మామకీనం ద్వితీయమ్,
త్వం ముగ్ధాక్షి! ప్రణయసరసోఽభ్యన్తరః స్నేహపాశ
స్త్వం ప్రాణానాం పరతరమసి, త్వంమమాఙ్గేసుధాఽసి.' ౧౭

—(ప. వే. ౨౭౭ ప.)

49 (ప్రియునిదృఢప్రణయోక్తి): -వసన్తతిలక-

'నిద్దను సుందరి! జనా గురవో హసను,
భిద్దన్తు మర్మవిశిఖా మమ మన్మథస్య,
విద్దన్తు నామ మహిమానమమూః స్త్రియో మా,
మన్మానసస్తు భవతీం న జహాతి కశ్చిత్.' ౧౮

-(ప. వే. ౨౩౮ ప. -సదాశివస్యైతౌ.)

సదాశివకవికవితావిలాసములు:

పైనుదాహరించిన 46 వ పద్యమునుబట్టి సదాశివకవి ప్రాకృత కవితానిర్మాణనిపుణుఁ డనియు, తక్కినశ్లోకములనుబట్టి గీర్వాణ భాషయందు మనోహరభావనావిలాసములు గలకవితారచనమున నిష్ణాతుఁ డనియు, నెన్నియో ప్రసిద్ధసూక్తికోశము లీతనికవితా శకలములను భద్రపఱచుటవలనఁ గవికావ్యప్రపంచమునఁ బ్రఖ్యాతుఁ డనియుఁ జెప్పవచ్చును. ఈతఁ డేకావ్యము నైనను రచించె నేమో కాని, మన కేదియు లభింపలేదు.

సదాశివుని కవితామంజరి విశిష్టమనోహరభావనాసురభిళమై యొప్పుచుండును. చంద్రకిరణప్రసారమును వర్ణించునెడ నీతనిభావనా పటిమ మహోన్నతస్థానము నందుకొన్నది:

స్వచ్ఛబిసకాంతిగలచంద్రిక భూమండలమునఁ గర్పూరమో యనెను, సరోవరములయందుఁ గలువలను బోలియు, ఆకాశమునందు గంగాతరంగముల కరణిని, వివిధదిక్కులయందు మొగిలిపూవుల శోభతోడను, అంతరిక్షమున హంసలకాంతితోడను, కమలదళ

నేత్రలకంఠములయందు ముత్యాలపేరువలెను, సాగరమున ముత్తెపుఁ జిప్పలకరణి నొప్పుచున్నఁదట. ( 47 ప.)

నిగనిగలాడు నింద్రనీలమణిహారమును బోలినట్రాడుగల యూయెలయందు నూఁగుమనోహరశరీరముగలనారీరత్నము మత్తేభ హస్తముచే నిటునటు నూపఁబడుచామీకరచంపకహారమువలె నానందమును గూర్చుచున్నది. ( 41 ప.)

తరుణీమణికుచద్వితయ మితరులు వర్ణించినరీతి నేనుఁగుగున్న కుంభస్థలములు గావు, సరోవరమునందలి తామరమొగ్గలజంటయుఁ గాదు, స్వర్ణకలశములును గావు; కాని, త్రిలోకవిజయమునందిన మన్మథుఁ డధోముఖముగా నుంచినదుందుభిద్వయ మని నే నుద్ఘోషించుచున్నాను. ( 43 ప )

౧౦. నందనకవి: 'ప్రసన్నసాహిత్యరత్నాకరము—'

పాణినీయవ్యాకరణమునను, సాహిత్యవిద్యయందును నిష్ణాత యైననందనకవి పై సుభాషితకోశమును సంధానము చేసెను. గ్రంథారంభమున స్వకీయకృతులనుగూర్చి విపులముగా నుద్ఘాటించు కొనినయీతనియితరరచనలు లుప్తప్రాయములుగాఁ దోఁచును. ఈతఁడు సదాచారనిష్ఠాపరుఁడై, 'శివప్రజ్య' యనుశీర్షికతో గ్రంథము నుపక్రమించెను. ఇందు 1000 శ్లోకములు, 6 ఉల్లాసములుగా సంకలన మొనర్పఁబడెను. ఇందలి శ్లోకములలోఁ జాలవఱకు దీర్ఘవృత్త ములే, పేర్కొనఁబడినకవులసంఖ్య యించుమించుగా 200. ఈ కవిమండలిలో 'ఉమాపతి' యే నవీనుఁడుగాఁ గన్పట్టును. వంగదేశ

మున క్రీ. 11 వ శతాబ్దమున రాజ్యపాలన మొనరించినకవిరాజు, రాజకవియు నగులక్ష్మణసేననియాస్థానవిద్వత్కవులలో రత్న పంచకము- జయదేవుఁడు, ఉమాపతిధరుఁడు, గోవర్ధనాచార్యుఁడు, శరణుఁడు, ధోయీకవిచక్రవర్తియు ననుమహామహులు విశేష విఖ్యాతి నందిరి. అందు గీతగోవిందకర్తయగుజయదేవకవి చంద్రునిచే

'వాచః పల్లవయ త్యుమాపతిధరః'-

అని ప్రశంసింపఁబడినకవిశేఖరుఁడే పైయుమాపతి. కావున నందనకవి సంధానించినసుభాషితకోశము క్రీ. 11 వ శతకము కంటె నవీనము కాదనఁ దగును. కవీంద్రవచనసముచ్చయమును, ప్రసన్నరసాహిత్యరత్నాకరమును ప్రాచీనసూక్తికోశము లన్నిటి కంటెను ప్రాక్తనములు. నందనకవిగ్రంథమున కింకను సూర్యా లోకభాగ్యము పట్టలేదు. దీనివ్రాఁతప్రతి యొకటి నేపాళమహా రాజగ్రంథాలయమునను, మఱియొకటి ప్రయాగవిశ్వవిద్యాలయ మున గీర్వాణాచార్యులలో నన్యతములగు డాక్టర్, మహామహో పాధ్యాయ కావ్యతీర్థ- ఉమేశమిశ్రులయొద్దను గలవు. ఇది వెలువడి నచో మన మిదివఱకు విని యెఱుఁగనికవితల్లజులనామములు, వారి వారిరచనలు నెన్ని బయలుపడునో!

'కతి కవయః, కతి కృతయః, కతి లుప్తాః, కతి చరన్తి, కతి శిథిలాః'-

అని మహావిద్వత్కవి నీలకంఠదీక్షితు లుద్ఘోషించినట్లు, ఎందఱు కవులు విలసిల్లిరో, అం దెందఱు విస్మృతులో, ఎన్నికృతు లుదయించినవో, అం దెన్ని పాత్రప్రవచనమున జీవించి సంచరించు చున్నవో, యెన్ని జీర్ణప్రాయములై విస్మృతి నందినవో, యెన్ని యుత్సన్నములైనవో యెవరు చెప్పఁగలరు? తెలియవచ్చినకృతుల తోడను, కృతికర్తలతోడను మనము తృప్తి నందవలెను.

# గ్రంథస్వీకారము

## (1) హమారీ ఆదిమజాతియా (హిందీగ్రంథము)

ఈగ్రంథము మన దేశపు ఆదివాసులనబడు ఆదిమజాతి జనుల గూర్చినది; దీని రచయిత హిందీలో జాల జాతీయ గ్రంథముల రచించి ప్రసిద్ధిజెందిన శ్రీ భగవాన్‌దాస్ కేలా. ఇట్టి గ్రంథము మన దేశభాషలలో వ్రాయుట కిదియే మొదలు. శ్రీ అఖిలవినయ యను విద్వాంసు లీ రచనలో దోడ్పడియున్నారు. ఈ ఆదిమజాతి జను లడవులలో గొండలలో వసింతురు. పూర్వ మొకప్పుడు అనగా నర జాతి కాదికాలమందు వీరు మైదానములలోనుండి యార్యద్రావిడాది నాకరికుల దాడికి దాళలేక గిరిగహనముల శరణుజొచ్చిరని కొందరి యూహ. ఈ మన్యపు జనులు నేటికిని కేవల మజ్ఞానులు, అనాగరి కులు, నిరక్షరులు, కడుబీదలుగ నున్నారు. మన యాంధ్రప్రాంతములో విశాఖజిల్లాలో సవరలు, గోదావరులలో కోయలు, రాయలసీమ హైదరాబాదులలో చెంచులు లంబాడీలును ఆదిమజాతివారే. ఇట్లే హిమాలయప్రాంతపు పహాడీలు, ఉత్తరమధ్య దేశపు గాండు, ఖాండు, కోయలు, గుజరాతు రాజస్థానపు భిల్లులు, ఓఢ్రప్రాంతపు సవర కోయలు, అసాంలో నాగఖాసీకచారీలు, దక్షిణపు ఇరుళర్‌తోడా మలయర్ ఇత్యాదులు నీ కొండజాతుల శాఖలే. ఇప్పుడు మన దేశపు మొత్తముమీద వీరి జనసంఖ్య $2\frac{1}{2}$ కోట్లు. అజ్ఞానదైన్యములలో, సవర్ణహిందువుల నుండి విడియుండుటలో, దగుమతజ్ఞానము లేక గ్రామ లోష్టములను క్షుద్రదేవతలను బూజించుటలో వీరలకు వెల్లడిప్రాం తపు హరిజనులతో బోలికకలదు. కాని కొన్నిటిలో వీరు హరిజనుల కన్నను గడు హీనస్థితిలో నున్నారు. ముఖ్యముగా మన జాతీయ జనకు డగు గాంధీమహాత్ముని నేతృత్వమువలన హరిజనుల యుద్ధరణమునకై

మంచియుద్యమము సాగుచు, వారి పరిస్థితి కొంత బాగుపడుచున్నది. కాని మన్యపుజను లింకను యధోగతిలోనే యున్నారు. ఈ గిరిపరిసరములు చూచుటకు ప్రకృతిసంపదతో సుందరముగ నుండును. అవి దుర్గమములు. లోగడ, క్రైస్తవ మిషనరీలు మాత్ర మీ మన్యములలో గొన్ని బడులు ఆసుపత్రులు నడిపిరి. వారి ముఖ్యాశయము క్రీస్తు మతవ్యాప్తి. ఇటీవల నాదివాసిసేవను హిందువులు కొందరు చేయుచున్నారు. నిజమే కాని, యాదివాసుల యుద్ధరణము దేశవ్యాప్తమగు మహాసమస్య. ఈకృషిలో మనప్రభుత్వమునకు ప్రజాసామాన్యపు సహాయ మెంతయో కావలెను. ఇందును గూర్చి జనులకు దగు పరిజ్ఞానమును ప్రోత్సాహము నిచ్చుట కీగ్రంథము అత్యంతోపకారి.

ప్రస్తుతపు హిందీగ్రంథమున మొదట వీరల వేషభాషలు, ఆహార విహారములు, ఆర్థిక, సాంఘిక, మతపరిస్థితులు, కొంత జాతుల సామాన్యలక్షణములను దెలిపి, పిమ్మట నాయాప్రాంతములలోని ప్రత్యేకవిశేషములు వివరింపబడినవి. అంశములన్నియు సుబోధముగ సులభశైలిలో వ్రాయబడినవి. ప్రాచీనకాలపు యార్యేతర జనుల విచిత్రాచారములు సంప్రదాయములు నీ యాదిమజాతులలో నేటికిని నిలిచియున్నటుల స్పష్టపడియున్నది. వీరలజనగీతములు, సమిష్టినృత్యములు వేషాలంకారములు, పండుగలు యుత్సవములును హృద్యముగ వర్ణింపబడినవి. ఈ మన్యపు జనులలో నాయాప్రాంతములందు 200 వఱకు విడివిడి భాషలు కలవు. ఇవి మైదానపు (సాహిత్య) భాషలకన్న భిన్నములు. ఆదిమభాషలలో వేనికిని లిపి సాహిత్యములుకూడలేవు. కొందరు సంస్కర్తలిందుకై చేసినకృషియు నంతగా ఫలింపలేదు. ఈ వన్యజనులకు వారి స్వభాషలోనే ప్రారంభవిద్య నేర్పవలెను; కనుక నట్లు నేర్పుటకు వారల మాతృభాష నుపా

ధ్యాయులు ముందుగ నేర్చుకొనవలెను; క్రమముగా నాయా ప్రాంతీయమగు ఆంధ్రము హిందీ మున్నగు సాహిత్యభాషల ద్వారలో గొండజనులకు నేర్పవలసి యుండును. లేనియెడల ప్రాంతీయసంస్కృతి వీరిలో వ్యాపించదు. మఱియు భాషాసమస్య యింకను క్లిష్టమై విభేదములు పెరుగునను గ్రంథకర్తయాశయము స్పష్టమేయగుచున్నను ఇట్లే యాదిమజాతుల కితర రంగములలో నుద్ధరణ జేయుటలో జాల సమస్య లేర్పడుట సహజము. ఆరోగ్యము, మతబోధ, సాంఘికోన్నతి, విద్య, ఆర్థికదశ, ఇట్టి రంగములలో గలుగు సమస్యల నీ గ్రంథములో జక్కగ వివరించి వాని పరిష్కార పద్ధతులను దెలిపి, యాసందర్భములో సంస్కర్త లోరిమిని, నిదానమును, జాగ్రత్తను వహించవలె నని శ్రీ కేలాగారు దూరదృష్టితో సూచించిరి.

ఆదిమజాతి నుద్ధరింపువారి దృక్పథములు రెండువిధముల నున్నవి–ఎల్విను మహాశయుని బోలిన కొందఱు నృతత్వ విజ్ఞానులు; త్రాగుడు, మన్యపు జ్వరములు, నిరక్షరత, యిట్టిదోషములను తొలగించుట యాదిమజనోద్ధరణ కావశ్యకమని యందఱు నంగీకరింతురు. కాని వీరి ప్రత్యేక వేషభాషలు, అభాసాచారములు, నృత్యవిహారాది పద్ధతులు యిత్యాదు లిప్పుడున్న రీతిని వీరిలో నికముందును మాఱక నిల్చియుండుట నృతత్వ విజ్ఞానుల యభీప్సితము. ప్రకృతిలో మైదానములు నగరములతోడ గిరిగహనాదులు యడవులు వన్యమృగములు నిలిచియుండి, వానిని జిత్రవస్తు ప్రదర్శన శాలలందు చూపబడునటుల, నరజాతి ప్రాథమికస్థితిని మన్యపుజనుల సంస్కృతి వైచిత్రిని, భాషా వివిధతను చూచి యానందించుట కిప్పటి వన్యజనుల పరిస్థితులు మారకుండ నిల్పియుంచవలెనందురు. అందువలన మన కొకరీతి యానందమును నృతత్వవిజ్ఞానులకు శాస్త్రీయ తృప్తియు గల్గినను, యాదిమజాతుల భవిష్యత్తు ముందుతరములలోను

ప్రగతి లేకుండ వీరల మూఢత్వాదులును దురాచారములు నశ్లే
స్థిరపడి, యాదిమజాతులను హీనదశలోనే యుంచును. మఱియు భార
తీయసంస్కృతివృద్ధికి సమన్వయమునకు గూడ నాదిమజాతుల హీన
సంస్కృతిని మార్చి వారలకు మైదానపు జనులతో సామరస్యమును
సాహచర్యమును హెచ్చించు టావశ్యకము. అట్టి యాశయము
తో నాదిమజాతి సేవకసంఘము మున్నగు కొన్ని జాతీయసంస్థ
లేర్పడి యా ప్రాంతములలో నాయా తెగలలో పరిణామము గల్గించి
యున్నత సంస్కృతిని వ్యాపింపజేయుటకు దృఢముగా కృషిచేయు
చున్నవి. ఆయా జాతులలో గల యువకవివాహము స్త్రీ స్వాతం
త్ర్యము యిట్టివానికి భంగము లేకుండ వారలలో సంస్కరణమును
జరిగింపవలెను.

విశాలజాతీయవాది యగు కేలాగారును తమ యభిమతమును
గ్రంథమందిటులనే తెలిపి. యాదిమజాతుల యుద్ధారకులలో ప్రము
ఖులయిన శ్రీ అమృతలాల్ ఠక్కర్ మున్నగు మహనీయుల జీవిత
చర్యలను వారి సేవనుగూడ గ్రంథమున వివరించియున్నారు. మరియు
నగ్రగణ్యులగు (ఇటీవల కీర్తిశేషులయిన) శ్రీ ఠక్కర్ బాపాగారికీ
గ్రంథరాజ మంకితమగుట యుచితముగ నున్నది. 1941 సం॥
జనాభా లెక్కలనుండి యాయామన్యపు శాఖలు ఉపశాఖలు వీని జన
సంఖ్య ఇత్యాదులు పరిశిష్టముగ నీయబడినవి. ఈ గ్రంథము సం
స్కృతిసాహిత్యమునకును దీనోద్ధరణకృషికిని, భారతీయైక్యసాధనకును
తోడ్పడును కనుక విద్యావంతు లందఱు చదువదగినది. సుమారు
350 పుటలుగలవు వెల రు 3-8-0. దీని ప్రాప్తిస్థానము, 'భారతీయ
గ్రంథమాలా, దారాగంజ్, ప్రయాగ, ఉత్తరప్రదేశ్'.

## हमारी आदिमजतियाँ (हिंदी पुस्तक)

यह पुस्तक हमारे देश के आदिम जातियों के बारे में है, जो आदिवासी भी कहलाती हैं। इसके रचयिता हैं हिंदी के ख्यातनामा और अनेक राष्ट्रीयग्रंथों के रचयिता श्री भगवानदास केला। हमारी देशीय भाषाओं में अबतक एसाग्रंथ यही पहला है। विद्वान श्री अखिल विनय ने भी सहायता दी। ये आदिम जाती लोग जंगल और पहाडों में बसते हैं। कोई समझते हैं कि ये लोग पहले (नरजाति के आरंभ-काल में) शायद मैदान में ही रहते थे लेकिन आर्य द्राविड जैसे उन्नत जातियों के हमले को रोक न सके और इन्हे गिरिगहन को शरण लेना पडा। अभी ये जंगली लोग अज्ञानी, असंस्कृत, निरक्षर और निरे गरीब हैं। हमारे आंध्र प्रांत में विशाखजिला वाले 'सवर', गोदावरी जिले के कोया, रायलसीमा और हैदराबाद प्रांत के 'चेंचु' और 'लंबाडी' भी आदिम जातिवाले ही हैं। हिमालय प्रांत के पहाड़ी जन, उत्तर प्रदेश और मध्यप्रदेश के खाँड और कोद, गुजरात और राजस्थान के भिल्ललोग, उडिया के सवर और कोद, असाम के नाग, खासी और कचारी, और दक्खिन के इरुलर, तोडा और मलयर जैसे भी ऐसे पहाडी ही हैं। सारे देश में उन लोगों की जनसंख्या अब अढाई करोड है। अनजानी, दीनता, सवर्ण लोग से अलग रहना, धार्मिकता के बदले काष्टलोव्ट और क्षुद्रदेवता पूजना ऐसे विषयों में उन लोग को मैदान प्रांत के हरिजन लोग से सादृश्य है। लेकिन, कई और विषयों में वे हरिजन

लोगों से भी और गिरे हैं। खासकर महात्मा गांधी के नेतृत्व से हरिजनोद्धार का उद्यम ठीक जारी रहा है और हरिजनों की हालत में कुछ सुधार हो रही है। मगर, जंगली लोग अभी अधोगति में ही रहते। देखने को और प्रकृति की संपदा में वन और गिरि परिसर बहुत सुंदर है, लेकिन दुर्गम हैं। पहले इसाई मिषनरी लोग आदिवासियों के बीच मदरसे और हास्पिटाल चलाते थे, मगर मिशनरियों का मुख्याशय तो इसाई धर्मका फैलाव है। आजकल कई हिंदू भी आदिमवासियों की सेवा कर रहे हैं। लेकिन उनके उद्धार की समस्या बहुत बडी है। इस काम में हमारी सरकार को प्रजा संस्थाओं से भी काफी मदद होनी चाहिये। इसलिये उनके बारे में इस पुस्तक ठीक परिज्ञान और प्रोत्साह देनेको उपयोगी है।

इस किताब में, पहले आदिमजाति वालों की वेषभाषाएँ, रहनसहन, आहार विहार, अर्थिक सामाजिक और धार्मिक परिस्थितियों का सामान्यलक्षण बताने के बाद, हरएक प्रांत के प्रत्येक विषयों पर भी रोशनी डाली। रचना सुबोध और सुलभशैली में है। प्राचीन कालके आर्येतर लोग के बहु तेरे रीति रिवाजें अबतक उन जंगली जातियों में अबतक टिके रहे हैं। ये, उन के लोकगीत, संयुक्तनृत्य, वेषभूषाएँ, त्योहार और उत्सव भी इस पुस्तक में हृद्यरूप से समझाये गये हैं।

उन पहाडी लोग में कोई दो सौ अलग बोलियाँ प्रचलित हैं। वे मैदान प्रांत की भाषाओं से भिन्न हैं। आदिम लोग की उन बोलियों को लिपि या साहित्य कुछ भी नही। इस के लिये की

गयी को शिश वेकाम होगयी। आदिम जाति लोग को प्रारंभिक शिक्षा देने वाले पहले उनकी बोलियाँ सीखना चाहिये। लेकिन, बाद उन को हिंदी तेलुगु जैसी प्रांतीय साहित्यिक भाषाओं को भी सिखाना होगा, नही तो, प्रांतीय संस्कृति जंगली लोग में नही फैलायगी और देश की भाषा समस्या भी बहुत जटिल हो जायगा, भाषा विभेद ज्यादह होगा, मान्य लेखक का यह आशय ठीक ही है। अन्यरंगों में भी आदिम जाति वालों के उद्वार के काम में बहुत समस्याए फैलते हैं। स्वास्थ्य, धर्मवोध, समाज सुधार, शिक्षा, आर्थिकोन्नति एसी समस्याओं का विवरण, और उनकी सुलझनकी सूचनाए इस किताब में बताई गयीं। इस सिल-सिले में सहन, धीरता और सावधानी से ही समाज सेवक को काम करना चाहिये। दूरदर्शिता से ये सब इस पुस्तक में श्री केलाजी ने ठीक बतादिया। येसुधारक दो प्रकार के होते हैं। एल्विन जैसे नृतत्व विज्ञानी आदिम लोग के मद्यपान, जंगली बुखार, निरक्षरता जैसे नुकसानों को निकालकर सुधार करना आवस्यक मानते हैं, लेकिन वे समझते हैं कि उन के वेषभाषा आचार व्यवहार नृत्य विहार रहन-सहन आदि अबकी जैसे ही होने चाहिये। जैसा प्रकृति में मैदान गाँव और शहर के साथ गिरिगहन रहते हैं और वन्यजंतु भी रहते हैं और अजायबघर में भी रखी जाती हैं, एसा लोक-संस्कृति की विचित्रता देख आनंदपाने के लिये आदिम जाति लोग की वेषभाषा और रहन-सहन आदि नरजाति की आरंभिक दशा को दिखाने के लिये बेबदल रखना चाहिये, यद्यपि इस इति से नृतत्व विज्ञानियों को संतोष होता, आदिम जाति लोग की

प्रगति अगली पीढ़ियों में भी ऐसा ही स्थगित रहेगी; भारतीय संस्कृति की समन्वय, अभिवृद्धि और परिशुद्धि के लिये भी, जंगली लोग और मैदानवाले लोग के बीच फरक निकालकर साहचर्य और समन्वय बढाना चाहिये। ऐसे आशयों से प्रेरित होकर आदिम जाति सेवकसंघ जैसी राष्ट्रीय संस्थाएँ भिन्न-भिन्न प्रांतों में उनजातियों को उन्नति मिलवाने के लिये दृढरूप से कोशिश कर रहे हैं। युवक विवाह, स्त्री स्वातंत्र्य जैसे उनकी अच्छी रीति रिवाजों को रख कर ही उन में सुधार करना होगा

कुशल राष्ट्रवादी श्री केलाजी भी इसी आशय को समर्थन करते हैं। आदिमजाति के प्रमुख सेवकों का वृत्तांत भी यहाँ दिया है। यह बहुत समुचित है कि यह पुस्तक ऐसे सेवकों के अग्रणी श्री थक्करबापा को ही अंकित की है जो हाल में स्वर्गवासी हो गये।

मिलने का पता:
भारतीय ग्रंथमाला, दारागंज,
प्रयाग, उत्तरप्रदेश. [कीमत रू ३-८-०.



# 2. వేణీసంహార నాటకము

ఆంధ్రానువాదము :

శ్రీ బులుసు వేంకటేశ్వరులు బి. ఏ. గారిచే రచింపఁబడినది.

---

సంస్కృతనాటక వాఙ్మయమున సుప్రసిద్ధమగు భట్టనారాయణుని వేణీసంహారనాటక మిదివఱలో బ్రహ్మశ్రీ వడ్డాది సుబ్బరాయ కవిగారిచే ననువదింపఁబడి యాంధ్రలోకమున బ్రచారము నందినది. గ్రంథకర్త లీ నాటకమును దిరుగ ననువదింప నవసరము గన్పట్టుటచే, నట్లొనర్చితిమని వ్రాసియున్నారు. కవి, నాటక విశేషములు ననువాదములు మున్నగువానిని గూర్చి పీఠిక యందు శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు విమర్శించి, గ్రంథకర్తల యనువాదమును పలువిధముల బ్రశంసించిరి. గ్రంథకర్త లిదివఱలో దిఙ్నాగుని కుందమాలను, భాసుని యభిషేకనాటకము ననువదించి యున్నారు. వీరి కవిత్వము సులభగ్రాహ్యమై లలితముగ నున్నది.

మూలగ్రంథము భీముని ప్రతిజ్ఞానిర్వహణము దుశ్శాసన వధ మొదలగు నితివృత్తమును గలిగి వీరరౌద్ర భీభత్సరసముల కాకరమై యుండును. చంచద్భుజ భ్రమితచండగదాభిఘాత సంచూర్ణితోరు యుగళస్య సుయోధనస్య, చత్వారోవయమృత్విజః, యత్సత్యవ్రత భంగభీరుమనసా మున్నగు శ్లోకములు వాఙ్మయ ప్రపంచమున సుప్రసిద్ధములైనవి. అట్టి భట్టనారాయణుని కృతి నన్యభాషానువర్తన మొనర్చుట దుష్కరము. అయినను రసానుగుణ్యముగ నాంధ్రీకరణ మొనర్ప యత్నించిన గ్రంథకర్తల యాశయము సర్వదా ప్రశంసనీయము. మచ్చున కొండు రెండు పద్యములు.

చ॥ నలువుర మేము ఋత్విజులనన్; హరియే యుపదేష్ట ధర్మజుం
డలరను సోమయాజియయి; యాదవు నీవును సోమిదమ్మవున్
ఖలులగు కౌరవుల్ పసులు; శాంతపరాభవదుఃఖశాంతియే
ఫలము, నరాధిపాళి బిలువంగను మ్రోఁగెడుఁ గీర్తిదుందుభుల్
(1-23)

మ॥ మును సత్యవ్రతభంగభీతమయి యొప్పంగాంచియున్ మందమై
ఘనవంశస్థిరశాంతిఁగోరి యెటులో కన్పట్టి లేనట్టి వే
యన ద్యూతారణిద్రౌపదీవసన కేశాకర్షణన్ బుట్టి రాఁ
జిన కౌంతేయక్రుధాగ్నియే కురువనశ్రీఁ గాల్ప జృంభించెడిన్.
(1-24)

# కళాపూర్ణోదయము
## ఆంధ్రగీర్వాణ భాషాశ్లేష విచిత్ర పద్యద్వయము

శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రి గారు

మహాకవి పింగళి సూరనార్యుఁడు రాఘవ పాండవీయము నందుఁ జూపిన నానావిధశ్లేషఘటనాపటిమను మించి యపూర్వపద్ధతిని రెండుపద్యములు కళాపూర్ణోదయమున రచించినాఁడు. అట్టి రచన "న భూతో న భవిష్యతి" యని ఘంటాఘోషముగాఁ జెప్పఁదగును. రెండును దెనుఁగు భాషలోని కందములు. మొదటిది యారోహక్రమమునఁ బదవిభాగభేదముచే నాంధ్ర మొకమాఱును సంస్కృత మొకమాఱు నగును. ఆరెం డర్థములును బ్రకృతకథలో జక్కఁగా నడుచుకొనును. రెండవది యారోహమునందుఁ దెలుఁగును అవరోహమున సంస్కృతమునై కథ కుపస్కారక మగుచున్నది. ఈవిషయము ప్రాజ్ఞలోకమునకు విదితమే.

ఆరెండు పద్యములకు వ్యాఖ్యానముగా రచింపఁబడిన రెండు సీసపద్యముల సాహాయ్యమున మొదటఁ బదవిభాగము చేసి, కవి యిచ్చిన వ్యాఖ్యానపదముల సరిపుచ్చిన మహనీయులు బ్రహ్మశ్రీ ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రులు వారనియుఁ దెలుఁగర్థము చెప్పిన మహామహులు బ్రహ్మశ్రీ దేవులపల్లి నరసింహశాస్త్రుల వారనియు సరస్వతీముద్రితప్రతి పీఠిక యందుఁ గలదు. సూరనార్యుని నామముతోపాటు వారి పవిత్రనామములును మనకు స్మర్తవ్యములు. తరువాత వావిళ్లవారి ప్రతియందుఁ జిన్న చిన్నమార్పులతోఁ బైవ్యాఖ్యయే యనుసరింపఁ బడెను. మూఁడవది బ్ర. శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రులవారి వ్యాఖ్య ఇందుఁ బైవ్యాఖ్యయు మెఱుఁగు

పెట్టఁబడినది. ఇన్ని వ్యాఖ్యానము లున్నవి కావుననే యిప్పు డీ వ్యాసమునకై నా యత్నము. "సతి కుడ్యే చిత్రమ్" అని కదా యభియుక్తోక్తి.

ఈరెండు పద్యముల పూర్వోత్తరము ఇంచుక ముందుగా తెలిసికొనవలసి యున్నది. ధర్మపురియందు మదాశయుం డను నొక రాజు గలఁడు. ఆతని పురమున నజ్ఞాతవాస మొనర్చుచున్న నలుగురు విప్రపతివ్రతలకుఁ నాలుగు వేదములును బుత్రులై పుట్టినవి. వారికి ప్రథమ, ద్వితీయ, తృతీయ, తుర్యాగము లను నామములే కాక వేద వేదాంగాది సకలవిద్యలును, గవిత్వపాటవమును బాల్యముననే లభించినవి. పసితనముననే రాజును దర్శింప నెంచిరి. రాజునకు యాగేచ్ఛ గలదనియుఁ బండితులు యాగమునకై ప్రేరింతురనియు నాయాగము నడపించు శక్తి లేని యీ రాజపురోహితుఁడు పండితుల కెవ్వరికి రాజదర్శనము లేకుండఁ జేయుచున్నాఁడనియు విని యానలువురు బాలురు పండ్లమ్మికొనువారి వేషముతోఁ బండ్ల పుటికలు తలఁదాల్చి కోటలోనికిఁ బోయి రాజసన్నిధిని బండ్లగంపలు దించి భయపడుచు నిలిచి యుండ, రాజు వారిని గాంచి యాదరముతో "మీకు సంతోషమా, ఏచింతయు లేదు గదా" యని యడిగెను. వారిలోఁ బ్రథమాగముఁడు రాజు నెదుటికి వచ్చి

క॥ మాయ మ్మాన సునీవే రాయలవై కావ దేవరా జే జే జే!
మాయాతుమ లానినయది పాయక సంతోస మున్నపల మిలసామీ

కళా ౬.౧౬౧.

అని పలికెను. "ఓప్రభువా! నీకు ముమ్మాటికి జయము. నీవు రాజవై ప్రోచుటచే మామనస్సులను సంతోషము విడువక యంటి యున్నది. ఇది మాకు సిద్ధించిన ఫలము. మా అమ్మతోఁడు సుమా' అని పామరులవలె వచ్చు తెనుఁగున దన ప్రశ్నకుత్తర మగునట్లు

చదివిన పద్యమును విని రాజు సంస్కృతముగా నాపద్యమునే పద విభాగము చేయఁగా యజ్ఞము చేయుమని తన్నుఁ బురికొల్పు నర్థముగూడఁ గలదని గ్రహించి, వారిని బూజించి, తెల్లఁబోయి చూచుచున్న సభ్యులతో వీరి వాక్చాతురి మీకుఁ దెలియలేదా వినుండని

సీ॥ ఆయంబు సరకు సేయకుము శోభన మూలధనుఁడ ధనం బచ్ఛి
దంబు ముఖ్యమైనయట్టిది తన్పునదియు జేని కజు యజించువా
నికి లక్ష్మి చేరుఁ బాత, కములు చేరవు రక్షకా! కోవిదులు క
ల్గిరా యనమోదుఁడవై యరుగకు, సమ్మిశ్రభావంబు సలుపుమా
యా లక్ష్మి కోవిదు లనియెడు దేవభాష, వరుసఁ బదవిభాగ
విరచనతో నర్థ మరయఁ దోఁచుచున్నయది కరంబు, తెలియఁ
జూడుఁ డేతదీయాంధ్ర వచన సం, దర్భమునను శబ్దచిత్రవిదులు
కళా. ౬. ౧౬౬.

అని సంస్కృతభాషాపరముగాఁ బదార్థ మెఱుకచేసి సభ్యులసన్నుతులతో నానలువురు బాలురను బురోహితులుగా స్వీకరించెను. ఆ కందపద్యమునకు మూఁడు వ్యాఖ్యలలోఁ గల విశేషములను దెలిసికొందము.

పదవిభాగము:—మా, ఆయమ్, మాన, సునీవే, రాః, అలవా, ఏకా, అవత్ + ఏవ, రాజే, అజేజే, మా, ఆయాతు, మలాని, న, యది, పాయక, సంతః, అసముత్, పల, మిల, సా, అమీ అని 3 వ్యాఖ్యలందు సమము.

I వ్యాఖ్య:—సునీవే=శోభనమూలధనుఁడా, ఆయమ్=లాభమును, మా మాన=సరకుచేయకుము (గణింపకుము) రాః=ధనము అలవా=అచ్ఛిదము, ఏకా=ముఖ్యమైనదియు, అవదేవ=తన్పునదియు, అజంయజతీతి అజేట్, అజేజే = అజుని బూజించు,

రాజకోటను, మా=లక్ష్మి, ఆయాతు=చేర్చును, మలాని=పాపములు, న=చేరవు. పాయక=ఓరక్షకా! సంతః=కోవిదులు (పండితులు) (సంతి) యది=కల్గిరా, కల్గినచో, అసయుత్=సంతోషసహితుఁడవు గాక, నపల=(వారిని) చేరకుము, మిల=కూడుము, అమీః=యీపండితులు, సా=ఆలక్ష్మి అని వ్యాసమూర్తి శాస్త్రుల వారు వ్యాఖ్యానించినట్లు సరస్వతీ ముద్రణము.

II వ్యాఖ్య :—పై వాక్యానుసారమంతయు గలదు. కాని ఆయమ్=వచ్చుబడిని, అవత్+ఏవ, అవదేవ (తన్ను రక్షించునట్టి వారిని) రక్షించునది అనియుఁ జిన్న మార్పుతో వావిళ్ళవారి ప్రతి.

III వ్యాఖ్య :—మొదటివ్యాఖ్యానుసారమే కాని యీక్రింది పదముల వివరణమున విశేషించినది. అలవా=భిన్నభిన్నముకానట్టి రాశి=ధనము, ఏకైవ=ఒకటియే, అవత్=కష్టసమయములందు రక్షించునదగును. కావున మూలధనము వెచ్చింపరాదనుట. రై శబ్దము పుంలింగము. విశేషణములు స్త్రీలింగ నపుంసక లింగములు. శ్లిష్టశ్లేష కావున లింగవిపరిణామదోషము లేదు. అజేజే (అజాన్ యజతీతి వా, అజేన యజతీతి వా) బ్రహ్మవిష్ణు మహేశ్వరుల నారాధించునట్టి, లేక ఛాగపశువుచే యజ్ఞము చేయునట్టి. సంతః= సత్పురుషులు కోవిదులగుసత్పురుషులకు వేదమే లక్ష్మి యనియు, వారినోట లక్ష్మి నివసించు ననియు శ్రుతి చెప్పుచున్నది. కావున అట్టివారి కాశ్రయ మిచ్చి యజ్ఞము లాచరించి యింకను లక్ష్మి కాశ్రయుఁడవు కమ్మని భావము, అని బ్ర. శ్రీ. మల్లాది సూర్యనారాయణ శాస్త్రులవారిచే సంస్కరింపఁబడిన ప్రతి.

I వ్యాఖ్యలోఁ గవి యిచ్చినపద్యములోని దండాన్వయము లోని పదములు చక్కగా నన్నియు సరిపుచ్చఁబడినవి. కాని 'నపల అను పదమునకు వారిని జేరకుము" అని వ్యాఖ్యానించుటకంటె

మూలమందున్న "అరుగకుము" అని కాని 2, 3 వ్యాఖ్యలలో నున్నట్లు 'తొలఁగకుము' అని కాని యుండిన సమంజసముగా నుండును.

II వ వ్యాఖ్యలో అవత్ + ఏవ = కాపాడునదియ యని యర్థము గలదు. 'ఆవత్ = తన్నునదియ' అని మొదటి వ్యాఖ్యలో నుండ రెండవదానిలో నిట్లుండుట వింతగా నున్నది. 'ఆవత్' అనుటకు 'అవత్' అనుటయు, తన్నును అనుటకు రక్షించును అనుటయుఁ బ్రమాద మనుకొనవలెను. ఏమన :— లోకమున 'అవరక్షణే' అనుకొనుట పండితసామాన్యమున గలదు. కాని ధాతుపాఠమున "అవ రక్షణ, గతి, కాంతి, ప్రీతి, తృప్త్యవగమ, శ్రవణ, సామర్థ్య, యాచన క్రి, యేచ్ఛా, దీ, ప్త్యవా. ప్త్యాలింగన, హింసా, దాన, భాగ, వృద్ధిషు," అని యిన్ని యర్థములందుఁ గలదు. కవి యిచ్చిన తృప్త్యర్థకమే 'తన్నునదియ' యనునది. కావునఁ గాపాడునది యనట స్థూలదృష్టిని వ్రాయఁబడిన దని తెలియ నగును. ఇఁక "ఆవత్" అనునది (తిఙన్తము) క్రియాపదము గాని విధేయవిశేషణము కాదు. అవధాతువునకు లఙంతరూపము. ఆడాగమము రాఁగా "ఆవత్" అని యగును. భూతార్థమున విహిత మగు లఙునకు వర్తమానార్థక మెట్లనినచో :— "ఛందసి లుఙ్ లఙ్ లిటః 3.౪.౬. ధాత్వర్థానాం సంబంధే సర్వకాలేషు ఏతే వా స్యుః. పక్షే యథాస్వం ప్రత్యయాః స్యుః అని కౌముది వైదికప్రక్రియ ౪వ పాదము. వేదమున సర్వకాలములందును లుఙ్ లఙ్ లిట్టులు వికల్పముగా వచ్చునని యుండుటచే లడర్థమున వచ్చిన లఙ్ప్రత్యయము కాన సాధువు. కావ్యములందు వేదభాషకుఁ బ్రయోగము తగునా? అని యిట శంకింపఁ బనిలేదు. ఈపద్యము చెప్పిన ప్రథమాగమాదులు నరాకృతి నున్న వేదములని స్ఫురించుటకే యిట్టి వైదికప్రయోగము ప్రదర్శింపఁ బడినది. వ్యాఖ్యాన పద్యమున "శబ్దతంత్రవిదులు" తెలియఁ జూడుఁ డనుటయు

నీభావమునకు స్ఫోరకము. మఱియు "రై" శబ్దము "అర్థ రై వి భవా అపి" అనుకోశమును బట్టి లోకమునఁ బుంలింగమై యుండ స్త్రీలింగవిశేషణములగు "అలవా, ఏకా" అనువానితో నన్వయ మెట్లన్నచో:—ఇదియును వైదిక ప్రయోగ మనుకొనిన సాధు వగును. రై శబ్దము వేదమున స్త్రీలింగముగాఁ గలదు. శ్రు. సచంత యేదుషసః సూర్యేణ చిత్రా మస్య కేతవో రా మవిందన్ అని ఋగ్వేదము. "చిత్రాం నానావర్ణాం, రాం రాయం-లక్ష్మీం, అవిందన్ - అలభంత అని సాయణభాష్యము. రాం అనువిశేష్యమునకు చిత్రాం అను స్త్రీలింగవిశేషణము పై ఋక్కునందుఁ గలదు. కావున నే ప్రథమాంగమునినోట స్త్రీలింగముగా రైశబ్దమును జెప్పించిన సూరనార్యుని యౌచిత్యము నుత్యముగదా !

ఇట్లు వైదిక శబ్దమాత్ర ప్రయోగమే కాదు. పై పద్యము నుత్తరార్ధమందలి యర్థమును వైదికమే. శ్రు. సక్తుమివ తితఉనా పునంతో, యత్ర ధీరా మనసా వాచ మక్రత. అత్రా సఖాయః సఖ్యాని జానతే, భద్రైషాం లక్ష్మీ ర్నిహి తాధివాచి. (ఋగ్వేదము) "ధీరాః ధ్యానవంతః, మనసా ప్రజ్ఞానేన, వాచం శబ్దమయీం శ్రియం అక్రత అకృషత, అత్ర సఖాయః సమానఖ్యాతిమంతః సఖ్యాని సాయుజ్యాని (ఇతి కైయటః) జానతే, ఏషా లక్ష్మీ దధివాచి నిహితా లక్షణాత్ భాసనాత్ పరివృఢా భవతీతి అని పాతంజలమహాభాష్యము. పండితులు ప్రజ్ఞానముచే వాగ్రూప యగు లక్ష్మిని బడసి తత్స్వరూపు లగుచున్నారు. వారి వాక్కులందు మంగళప్రద యగులక్ష్మి నివసించి యుండును. అని గలదు. ఈభావమును నుత్తరరామచరితమున భవభూతియుఁ జెప్పియున్నాఁడు.

శ్లో॥ "ఆవిర్భూతజ్యోతిషాం బ్రాహ్మణానాం యే వ్యాహారా స్తేషు మ్మాసంశయోఽభూత్ భద్రా హ్యేషాం వాచి లక్ష్మీ ర్నిషక్తా, నైతే వాచం విప్లుతార్థా వదంతి."—

గీ॥ భూరి తేజస్సమేత్య తాభూమిసురుల
పలుకులం దెప్డ సందేహపడుట దగదుఁ
భద్రయూ లక్ష్మి సివసించు వారినోటఁ
గల్ల యగుమాట వారికిఁ గలుగ దెపుడు.

జయంతి రామయ్యపంతులుగారి యాంధ్రీకరణము.

ఓరాజా! మూలధనము దాచుకొనుచు లోకులను దృష్టి పఱుప రాబడిని వెచ్చించుకొనుము. అవిచ్ఛిన్నముగా ధనము నీ యక తృప్తి కలుగదుగదా! అధన మెట్లు వచ్చు నందువా పరమే శ్వర ప్రీతిగా యజ్ఞము లొనర్చిన జాతవేదుని దయవలన పాపములు పోయి లక్ష్మి లభించును. అయాగము నెట్లు చేయుదు నందువా వేదవిధిజ్ఞు లగు పండితుల నారాధింపుము. వారినోట లక్ష్మి వసించి యుండును. కావున వారు (లక్ష్మీ)స్వరూపు లని తెలిసి, అట్టివారు వచ్చి రని తెలియఁగానే తొలఁగిపోక వారిని గలసికొని పూజిం పుము" అని యుపదేశము.

యజ్ఞస్వరూపుఁ డగుజాతవేదుఁడు లక్ష్మీప్రదాత యని శ్రీ సూక్తమున "హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజాం,చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ" ఇత్యాది వాక్యములు చాలఁ గలవు. కావున యజ్ఞము లక్ష్మీప్రద మనుటకును, పండితులు శ్రీస్వరూపు లనుటకును, వేదసూక్తులే యాధారమని గ్రహించుకోఁ దగు నని పై పద్యముయొక్క భావము.

పైని జూపినయర్థములకై శబ్దములుగూడ వేదములోని వని తెలిసికొనుటకు శబ్దతంత్రవిదులు దూరదృష్టి నుపయోగింపఁ డని హెచ్చరించుచున్న సూరనార్యుని చమత్కారమునకు జోహారు సేయుట దక్క నట్టె ట్టన శక్యమా!

పురోహితునకుఁ బంగ్లమ్మునొసఁగువారిమాటలవలెఁ బామరోక్తులా? రాజునకు యజనోపదేశమా? ఆయుపదేశ మంతయు వేదోదితమును వైదికభాషయునా? అందును వేదపండితులకు నగ్రస్థానమా? భాషాద్వయసంశ్లేషమా? ఆహా! రెండర్థములును బ్రకృతమున కెంత సొగసు గూర్చినవి! ఇఁక రెండవపద్యము నరయుదము.

II అవరోహణమున సంస్కృతముగల కందము.

మదాళయుని సభలో "మాయమ్మా్మన" అనుపైపద్యము చెప్పినప్రథమాగమాదులు నలువురును మదాళయుఁడును గూడఁ గళాపూర్ణునిసభయందుండ మణిహారప్రభావమున బాలిక యగు మధురలాలస చూచినట్లు వెనుకటికథ నంతను జెప్పెను. కళాపూర్ణుఁ డా భాషాశ్లేషవైచిత్రి కబ్బురపడుచు, నెదుట నున్న ప్రథమాగమాదుల నరసి "అట్టి కవితాపాటవము మీ కిప్పుడును గలదా" అని వినోదముగా నడుగ ప్రథమాగముఁడు తత్ప్రశ్న కుత్తరముగా కందపద్యమున్నో.

కII తా వినువారికి సరవిగ భావనతో నాను నతివిభావి సుతేజా!
దేవర గౌరవమహిమన మావలసినకవిత మరిగి మాకు నధీశా

(మిక్కిలి ప్రకాశించు పరాక్రమముగల ఓరాజా! మీ రొసఁగిన గౌరవాతిశయము చేతనే వినువారికి యుక్తమగునట్లు మాకుఁ గావలసిన కవిత్వము స్వయముగా మావశమై యుండును.) అని పలుకగా విద్యాపూర్ణుఁ డగు కళాపూర్ణుఁడు "బళిరా నాప్రశ్న కిచ్చినసమాధానము విచిత్ర మగుపద్య మయ్యెనే" అనెను "అట్లు అని కవీంద్రుఁడు నవ్వెను. రాజు "తిరుగఁ బఠింపుమా" అనఁగా విప్రుడు ప్రభుని బుద్ధికుశలత మెచ్చుకొనెను. ఇట్లు వా రిద్దఱు పరిపుచ్చుకొనఁగా, నందలివైచిత్రి తెలియక తెల్లఁబోయి చూచుసభ్యులం

గాంచి కళాపూర్ణుఁడు "తిరుగఁ బఠింపుమా" యనఁగా మరలఁ జదువు మని యంటి ననుకొనుచున్నారు కాఁబోలును అట్లుగాదు వినుఁ డని

సీ॥ ఏలు మోనాయక యిలగిరు లెంతకాల మ్మంతకాల మోసమ్మతుండ
మిగుల శోభిల్లెదు లవకుమారసమాన, మానుఁడ మహిమవసమానమైన
గౌరవం బొసఁగుచక్రవిప్రభు విల్లు గల్గఁగ నోయి! పురుషుఁ డీ
గౌరవమున
నభినవతేజస్కుఁడై వాణి రసములు గులికెడునట్టిది గలుగఁగఁగాను
గీ॥ వినుతి సేయుచివాఁడె యంచును మహార్థ
మున్నయది సంస్కృతంబునఁ జెప్పమీాఁఱ,
వరుసఁ దుది నుండి మొదలికిఁ దిరుగఁ జదువ
నా తెనుఁగుపద్యమున బుధు లరసికొనుఁడు.

కళా. ౬. ౧౨౬

అని పలికి సభ్యుల నానందింపఁజేసి ప్రథమాగమాదులను గౌరవించెను. తరువాత నింకను నేఁతయో కథ గలదు. అది యటులుండు గాక! ఇఁక నీపద్యమునందలి విశేషములుఁ గూడఁ దెలియఁ దగిన వగుటచే వెనుకటిమూఁడు వ్యాఖ్యలను ముందు తెలియుదము. మూఁడువ్యాఖ్యలు నర్థనిర్ణయమున నొక్కటియే. మాటలలో నీప ద్భేద ముండినను వేఱు కాదు.

పదవిభాగము :—శాధి, ఇన, క్షమ్, ఆగిరి, మత, వికనసి, లవమాన, మహిమవరగౌరవదే, జాతే, సువిభా, ఇతి, నను, నా అతః, నవభాః, గవి, రసకిరి, వా, నువితా.

వ్యాఖ్య :-ఇన=రాజా, ఆగిరి=పర్వతము లున్నంతకాలము, క్షమ్=భూమిని, శాధి=శాసింపుము, మత=సమ్మతుఁడా, వికనసి=మిగుల శోభిల్లుచున్నావు, లవమాన=రామపుత్త్రుఁడగులవునియొక్క

మానము (చిత్తసమున్నతి) వంటి మానము గలవాఁడా నను = ఓ రాజా! మహిమ+వర+గౌరవ+దే=గొప్పతనముచే శ్రేష్ఠ మగు గౌరవ మిచ్చునట్టి, సువిభా=చక్రవర్తిప్రభువు, ఇతి=ఇట్లు, జాతే=కలుగుచుండఁగా, నా=పురుషుడు, అతః=ఈగౌరవమువలన, నవభాః=క్రొత్త తేజము గలవాఁడై, రసకిరి=ఆనందమును గులుకునట్టి, గవి=భాషయందు, అనువితా వా=స్తుతింపనివాఁడా" అని.

పరికింపఁగా ఇందలి 'నువితా' అనునది 'నవితా' అనియుండఁదగును. "ణు స్తుతౌ" అనుధాతువునకు లృట్ప్రథమపురుషైకవచన రూపము గాని తృచ్ప్రత్యయాంతరూపము గాని కావలెను. రెండు రూపములందును ఉవజ్ఞునకు బాధకముగా గుణము వచ్చి "నవితా" అని సిద్ధించుచున్నది. ఇదియును వైదిక మనుకొనినఁ జక్కఁగాఁ గుదురును. "ఛందసి బహుళం" అని కలదు గదా! ఈ పద్యమున "నవితా" అనియే యంగీకరింత మనిన అనులోమమునఁ దెనుఁగై నప్పుడు "వినువారికి" అనుటకు "వినవారికి" అను రూపవైకల్యము కలుగును. తదనురోధమున "నువితా" కవిహృదయమునకు తీఱదు. అప్పు డీపదమునకు లౌకికముగానో వైదికముగానో సాధుత్వము చెప్పవలయును. లౌకికముగా నెట్లును గాదు. ఇఁక వైదికముగా ఋగ్వేదమున నున్నట్లు మోనియరువిల్యమ్సునిఘంటువున "నువితా" శబ్దము చూపఁబడినది. లక్ష్యమీయఁ బడలేదు. "ఛందసిబహుళం" అనుసూత్రమున వైదికముగా సాధించుకొనినఁ బ్రకృతమున నెంతయు నుచితముగా నుండును. దానిరూపనిష్పత్తికై విజ్ఞులు యత్నింతురు గాక!

ఈనాఁటి కున్న వ్యాఖ్య లన్నియు పైని జూపిన రీతిఁ బదవిభాగ ప్రతిపదార్థ బోధకములుగా నున్నవి, వారందఱు నేలకో "తిరుగఁ బఠింపుమా" అని కవి మున్మా అనిపించినను తిరుఁగఁ

బఠించి యుండలేదు. తిరిగి పఠించినచో ఈరెండవపద్యము సంస్కృతమున నార్యాభేదములలో నొకటి యగుచున్నది. మహాశయుని వలె విద్యాహీనుఁడు గాక, సకలకలాపూర్ణుఁ డగుట దెలుపుటకు గలాపూర్ణునివద్దఁ దలక్రిందుగాఁ జదివిన సంస్కృతభాషయే కాక పద్యమును గూడ నగునట్లు పలికించిన సూరన కల్పనాచాతురికి సాటి యున్నదె? తలక్రిందుగాఁ జదువుచో

శ్లో॥ శాధీనకుమాగిరిమత, వికనసి లవమానమహిమవరగౌరవదే
జాతే సువిభా వితి నను నాత్రో నవభాగవి రసకిరి వానువితా॥

అని చక్కనిసంస్కృతపద్య మగుచున్నది కూడను. మొదటి పద్యము వ్యాఖ్యానమున "దేవభాషవలెనె బదవిభాగరచనతో నర్థ మరయఁ దోఁచుచున్నది" అని పదవిభాగము, నర్థమును దెలిసి కొనుఁ డని చెప్పినట్లు గాక "తుదినుండి మొదలికిఁ దిరుగఁ జదువ" అని పద్యముగాఁ జదివి, సంస్కృతమున నర్థము గ్రహింపుఁ డని సూచించినాఁడు, మహాశయుఁడు విద్యాపూర్ణుఁడు గాఁ డని యంత మాత్రమే చెప్పినాఁడు. గ్రహించునేర్పరి కావునఁ గళాపూర్ణు నొద్ద విలోమముగా సంస్కృతము, అందు ఛందోబంధము, అంతే కాదు. రాజున కాశీర్వచనపూర్వకముగా, విద్యావివేక సంపద గలిగి కవులను బండితులను బోషింపవలె నని శాసనమును జేసి రాజుగౌరవమును గవిగౌరవమును బోషించి విడిచినాఁడు.

క॥ తమవిద్య నెవ్వరేమా, త్రము గనఁజాలుదురు వారిదండను దన్మా
త్రమ ప్రకటింతురు బుధు లుత్తములమహిమ నీరుకోలఁది

తామర సుమ్మీ.

కళా ౨. ౮౮.

అనులక్షణమునకు లక్ష్యము చూపినాఁడు. ఇట్లు ధ్వనిపరంపరానిదానమై, యౌచిత్యపూర్ణమై, యుభయభాషావశంవదమై రసభరితమై,

యెన్నెన్నియో భావముల కాటపట్టై యొప్పారెడియీపద్యమువంటి దేభాషయందైన నెన్నఁడైన నుండెనా? ఉండునా? "యేన అస్మిన్నతివిచిత్రకవిపరంపరావాహిని సంసారే కాళిదాసప్రభృతయో ద్విత్రాః పంచషా వా మహాకవయ ఇతి గణ్యంతే" అనుధ్వన్యాలోకమునకు లక్ష్యమైన మహాకవులలో సూరనార్యుఁ డొకఁ డని యీయొక్కపద్యమే ఘంటాఘోషముగాఁ జాటుచున్నది. ఇట్టి చిత్రము లాపద్యమం దింక నెన్ని యున్నవో యనిపించుచున్నది. శబ్దశాస్త్రవేత్తలను సూక్ష్మముగాఁ బరిశీలింపు మనుచున్నాఁడు. అది మనసున నుంచుకొని విమర్శించిన నింకను వైచిత్రి కనవచ్చును గాఁబోలును! బుద్ధిమంతు లగు శబ్దశాస్త్రవిదు లింకను, సూక్ష్మేక్షిక నరయుదురు గాక!

ఈరెండు పద్యములభావమును వరుసగాఁ బరికించినయెడలఁ బండితులవలననే రాజునకు లక్ష్మి కలుగు ననియు, వారిపోషణము రాజున కావశ్యక మనియును రాజాశ్రయము గలిగినచో నేమాత్రము విజ్ఞానము గల నరమాత్రుఁడైనను రసవంత మగు వాఙ్మయముఁ గలకవి యగు ననియు, నట్టియుపయోగ్యుఁడు రాజును వర్ణించి లోకమున నజరామరకీర్తి గలవాఁడు నౌవచ్చుననియు "కవినాచ విభుః విభునాచ కవిః కవినా విభునాచ విభాతిసభా" అని కవికిని విభునకు నన్యోన్యాశ్రయ మావశ్యక మనియుఁ దెలియవచ్చుచున్నది. ఇన్ని భావధ్వనులతో వింతశబ్దవైచిత్రితో నలరారునీపద్యద్వయము కళాపూర్ణోదయమునకే కాదు, సకలకావ్యసారస్వతమునకును రత్నదీపకలిక యనఁ దగు దని మనవిచేయుచు, నిం దేదేని గుణ మున్న గ్రహించి, నాలోపము లేవేని దోఁచిన మన్నింప విజ్ఞులను గోరుచు, నీనావ్యాసరచనకు మార్గములు వేసి, ప్రాజ్ఞజనాదరమునఁ బడసినపండితత్రయమునకు శిష్యుఁడనై నమస్కరించుచు, నింతతో విరమించుచున్నాను.

శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయమువారి నూతన ప్రకటనములు - శ్రీ వేంకటేశ్వర స్తుతి రత్నమాల

క్రీ. శే. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే సమకూర్పఁబడి తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయమువారిచే ప్రకటింపఁబడినది. వెల రు 1-2-0. శ్రీ శాస్త్రిగారు ఆంధ్రవాఙ్మయమున ప్రబంధశతకాదులలో గల శ్రీ వేంకటేశ్వరస్వామి స్తుతుల సేకరించి యొక యపూర్వ పద్యగ్రంథముగ ప్రకటనమునకు సిద్ధము గావించిరి, కాని ప్రకటితము గాకపూర్వమే వారు కీర్తిశేషులయిరి. వారు సమకూర్చిన గ్రంథమును పాఠకులు భక్తిశ్రద్ధలతో బఠించిన యానందమును బొందుదురనుట నిర్వివాదాంశము. ప్రాచీన ప్రౌఢ ప్రబంధములు మొదలు యాధునిక గ్రంథములవఱకు పదునాఱు గ్రంథభాగములిందు గలవు. భక్తుల కీ గ్రంథము తంగేటిజున్నువంటిది. అతిమనోహరమైన యీ పద్యకావ్య మెల్లరకు నిరంతర పఠనీయము కాగలదనుట నిస్సందేహము. (4) Reports of the Summer School of Hindu Religion at Tirumalai for Years 1949 & 1950 శ్రీ తిరుపతి దేవస్థానమువారిచే నడుపబడుచున్న హిందూ మతోపన్యాసముల వివరించు 1949, 1950 సంవత్సరముల నివేదికలు. 1949 సంవత్సరమున శ్రీ సి. కణ్ణన్ రాజావారిచే ప్రారంభింబఁడి వివిధమతధర్మముల బోధించుటకై ప్రతి సంవత్సర మీయుపన్యాసములు పలువురు పండితులచే నిప్పింప బడుచున్నవి. ఇది ముఖ్యముగ దేవస్థానము యజమాన్యమున నడుపబడెడి విద్యాలయోపాధ్యాయులకొరకు ప్రథమమున నేర్పడినను, జన సామాన్యమునకు గూడ మిక్కిలి యుపయోగకరమని వేఱ జెప్పనక్కరలేదు. ఈ నివేదికలయందు దెలుపఁబడిన యుపన్యాసముల పట్టికను గాంచినచో నవి వేద ధర్మశాస్త్రేతిహాసములకును, వివిధ మత సిద్ధాంతములకును

ప్రాచ్య హిందూ సంస్కృతికిని సంబంధించినవగుట స్పష్టము. 1950 సంవత్సర ని వేదికయందు ముఖ్యమగు యుపన్యాసముల సంగ్రహము గూడ జేర్పంబడినవి. ఇంకను విపులముగ నున్నచో నాయా పండితుల పరిశోధనా ఫలితములు పాఠకులకు లభింపగలవు. ఆంగ్ల, ద్రవిడాంధ్రభాషల నీ యుపన్యాసము లిప్పింపబడుట, వీని ప్రాశస్త్యమును, దేవస్థానమువారి సమత్వభావము నెఱుకపఱచుచున్నవి. ఇట్టి యుపన్యాసములు శ్రీ దేవస్థానమువారు ప్రతి సంవత్సరమునందును నిర్విఘ్నముగ నిత్యోఽధికముగ జరుపుదురు గాక యని యాశింపుచున్నాము.





# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

## వికృతిసంవత్సర కార్యనివేదిక.

(1950—51)

వికృతిసంవత్సరముతో బరిషత్తునకు ముప్పదితొమ్మిది సంవత్సరములు గడచినవి. పత్రికాముద్రణ గ్రంథప్రకటనములకు గొన్ని యార్థికాది విషయములగు నడ్డంకులు కలుగుచున్నవి. భాషాభిమానులందఱును బరిషత్తునందభిమానమును వహించి నూతనమార్గముల దీనిని నడపుటకు యత్నింపవలసియున్నది. పూర్వముద్రిత గ్రంథములు పునర్ముద్రణము నొనర్పవలసి యున్నది. నూతన గ్రంథములు ప్రకటనార్హములగువానిని వెంటనే ప్రకటింపవలసియున్నది.

నూతన పరిషద్భవన నిర్మాణకార్యమున స్థలము సంపాదించుటకు, భవనప్రవేశమహోత్సవమునకు, భాండాగారము నమర్చుటకును గార్యనిర్వాహకవర్గమువారు లోకులకు ఋణపడవలసివచ్చినది. వానిని దీర్చి పరిషత్తునకు మూలధనము సమకూర్చుటకై పరిషత్సభ్యులందఱును తమ శక్తికొలంది ప్రయత్నింపవలసి యున్నది.

పరిషద్భాండాగారమున ముద్రితగ్రంథములు సుమారు 6000 ను, తాళపత్రగ్రంథములు 4678 ను గలవు. తాళపత్ర గ్రంథములు శిథిలములుగాకుండ వానికి బ్రతులను వ్రాయింపవలసియున్నది.

ఈ సంవత్సరమున బద్దెన నీతిశాస్త్రముక్తావళియు, ప్రగడపువారి కందములు, ఉదాహరణపద్యములను గ్రంథమున గొంత భాగమును బ్రకటించియుంటిమి. శివలీలావిలాసమున రెండాశ్వాసములు (అవతారికాభాగము కాక) ప్రకటింపబడినవి. మిగిలినగ్రంథ మెచ్చటనైన నున్నచో భాషాభిమానులు దాని నొసంగి గ్రంథమును బూర్తిచేయ సహాయపడుదురని కోరుచున్నాము.

పుస్తకభాండాగారమునుపేర బ్రథమమునుండియు తాళపత్ర గ్రంథవివరణము ప్రకటింపబడుచున్నది. అది ప్రబంధ, వచన, లక్షణాది గ్రంథములు మొదలగు విభాగముల ననుసరించి మొదట బ్రక

టింపఁబడి యుండలేదు. అందువలన లక్షణగ్రంథవివరణమును బ్రత్యేకముగ మూఁడవభాగముగ బ్రకటించియుంటిమి. మిగిలిన భాగముల నచిరకాలముననే ముద్రించుటకై యత్నమొనర్చుచున్నాము. ఇందులకును పరిషత్కార్య నిర్వహణమునకు గేవలము ధనసహాయమే కాక, భాషాభిమానుల కార్యదీక్షయు, సహాయమును గావలసి యున్నవి. వికృతిసంవత్సర ఆయవ్యయపట్టిక ననుబంధముగ జేర్చితిమి. గ్రంథ ప్రకటనములవలన గవర్నమెంటు పత్రముల వడ్డివలన మాత్రము పరిషత్కార్యముల నిర్వహించుట దుష్కరముగనున్నది. ఆంధ్రదేశమున భాషాభిమానులకు కొట్టికొలఁతయు లేదు. వారందఱును సభ్యులుగ జేరి పరిషత్కార్య నిర్వహణమునకు సహాయమొనర్తురని యాశించుచున్నాము.

శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువున నాలుగు భాగములు (అ మొదలు న వఱకు) బ్రకటింపఁబడినవి. మిగిలిన భాగములను గూడ శ్రీ శ్రీ పీఠికాపుర ప్రభువర్యులచిరకాలముననే ప్రకటింపనై యున్నారు

ఈ సంవత్సరమున కవి పండిత పోషకులు, కళాప్రపూర్ణేతి బిరుదాంకితులు శ్రీ . జయపురాధీశ్వర విక్రమదేవ ప్రభువర్యులు నిర్యాణమొందిరి. వీరి మరణమువలన నాంధ్రలోకమునకు తీరనిలోటు వాటిల్లినది. భగవంతుడు వీరియాత్మకు శాంతినొసగుగాక.

పరిషత్కార్య నిర్వహణమున నిరంతరము మాకు దోడ్పడుచున్న కార్యనిర్వాహక వర్గమువారికిని తదితర భాషాభిమానులకును మా వందనములు.

ఇట్లు విధేయులు
కిడాంబి రాఘవాచార్యులు,
వింజమూరి వేంకటప్ప,
కార్యదర్శులు.

కాకినాడ,
13-9-51.

## ఆదాయము.

| | | | |
|---|---|---|---|
| 1. | సంవత్సరాది నిలువ | | 606-0-11 |
| 2. | బ్యాంకి వడ్డి | | 700-2-0 |
| | శ్రీ వేంకటగిరి మహారాజావారి గవర్నమెంటు పత్రిముమీద 12 నెలలకు వచ్చిన వడ్డి | 300-0-0 | |
| | శ్రీ బొబ్బిలి మహారాజావారి వార్ బాండ్ మీద 12 నెలలకు వచ్చినవడ్డి | 400-0-0 | |
| | సేవింగ్సు బ్యాంకి వడ్డి | 0-2-0 | |
| 3. | పత్రికా చందాలు | | 42-0-0 |
| 4. | బదుళ్ళు | | 150-0-0 |
| 5. | పుస్తకముల విక్రయము | | 1747-14-9 |
| | | మొత్తము | 3246-1-8 |

## వ్యయము.

| | | |
|---|---|---|
| 1. | బ్యాంకి వ్యయము | 2-6-0 |
| 2. | బదుళ్లు తీర్చినవి | 200-0-0 |
| 3. | పోస్టు వ్యయములు | 36-1-8 |
| 4. | ఉద్యోగుల జీతములు | 1185-8-0 |
| 5. | ఉద్యోగుల ప్రయాణపు వ్యయములు | 8-12-0 |
| 6. | పత్రికకు కాగితము, ముద్రణము | 686-2-0 |
| 7. | చిల్లర బైండింగు | 107-4-0 |
| 8. | నిఘంటువు బైండింగు | 518-6-0 |
| 9. | పత్రికలకు చందాలు: కొనిన పుస్తకములు | 104-6-0 |
| 10. | సాదరు | 55-2-6 |
| | | 2908-15-9 |
| | సంవత్సరాంతమున నిలువ | 387-1-11 |
| | మొత్తము | 3246-1-8 |

కిడాంబి రాఘవాచార్యులు, వింజమూరి వేంకటప్ప, కార్యదర్శులు.

## — పుస్తకవిక్రయము

| నం | వివరము | మొత్తము |
|---|---|---|
| 1 | జైమినీ భారతము | 93-14-0 |
| 2 | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 16- 2-6 |
| 3 | జ్యోతిశ్శాస్త్రసారము | 2- 0-0 |
| 4 | జ్ఞానప్రసూనాంబికా శతకము | 0- 2-0 |
| 5 | సర్వేశ్వర శతకము | 1-14-9 |
| 6 | ఆకారాద్యముద్రితగ్రంథసూచిక | 0- 8-0 |
| 7 | చంద్రభానుచరిత్రము | 6- 2-0 |
| 8 | శివరాత్రి మాహాత్మ్యము | 14-14-3 |
| 9 | ఆర్యభాషావిభాగము | 2- 7-9 |
| 10 | హ్రస్వరంగములు | 1- 6-0 |
| 11 | ప్రాకృత భాషోత్పత్తి | 3- 0-3 |
| 12 | శివతత్త్వసారము | 6- 2-9 |
| 13 | నారసింహపురాణము | 1-0-0 |
| 14 | మన్నారుదాసవిలాస నాటకము | 3-14-0 |
| 15 | కాళిందీ కన్యాపరిణయము మొదటిభాగము | 5- 5-9 |
| 16 | డిటో రెండవభాగము | 2-10-0 |
| 16 | రెడ్లనాటి రెండు శాసనములు | 0-15-0 |
| 18 | ఆంధ్రధాతుమాల | 4-3-0 |
| 19 | శాసన పద్యమంజరి మొదటిభాగము | 33- 1-6 |
| 20 | డిటో రెండవభాగము | 1- 0-3 |
| 21 | శతకసముచ్చయము రెండవభాగము | 0-10-0 |
| 22 | సూత్రాంధ్ర వ్యాకరణము | 4- 7-0 |
| 23 | రసాభరణము | 3-12-0 |
| 24 | షోడశకుమారచరిత్రము | 2- 0-3 |
| 25 | హంస సందేశము | 0- 7-3 |
| | మొత్తము | 212-5-3 |

| | | |
|---|---|---|
| | | రూ॥ 212-5-3 |
| 26 | రాయవాచకము | 3- 4-3 |
| 27 | సింహాసన ద్వాత్రింశిక I వ భాగము | 3- 6-0 |
| 28 | డిటో II వ భాగము | 9- 2-0 |
| 29 | నిఘంటు చరిత్రము | 1- 2-0 |
| 30 | ఆంధ్రకౌముది | 1- 0-0 |
| 31 | శాంభాంతము | 0- 2-0 |
| 32 | Dravidian Lexicography | 0- 4-0 |
| 33 | Defence of Literary Telugu | 1- 0-0 |
| 34 | చాటుధారా చమత్కారసారః | 3- 2-3 |
| 35 | సాంబోపాఖ్యానము | 6- 2-0 |
| 36 | రసార్ణవాలంకారము | 0- 8-0 |
| 37 | కవిజనోజ్జీవని సమస్యలు | 1- 6-0 |
| 38 | రఘునాథరామాయణము | 3-12-3 |
| 39 | రజతోత్సవ సంపుటము | 5- 0-3 |
| 40 | అరవదేశమండలి ఆంధ్రవాఙ్మయము | 0-14-0 |
| 41 | లక్షణసారసంగ్రహము | 2- 8-3 |
| 42 | లౌకికన్యాయవివరణము | 1-12-3 |
| 43 | సీతారామచరిత్రము | 1- 6-0 |
| 44 | విడిసంచికల విక్రయము | 14-10-6 |
| 45 | ఉత్తరరామచరితము | 1- 0-0 |
| 46 | అమరుకము | 2- 0-3 |
| 47 | ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి | 5-12-0 |
| 49 | శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు 1 వ భాగము | 423- 8-0 |
| 49 | డిటో 2 వ భాగము | 385-0-0 |
| 50 | డిటో 3 వ భాగము | 338- 0-0 |
| 51 | డిటో 4 వ భాగము | 338- 8-0 |
| 52 | శ్రీ పిఠాపురము మహారాజావారు పంపినపుస్తకములు | 28-10-0 |
| 53 | శ్రీ కొత్తపల్లి సూర్యారావుగారి గ్రంథములు | 2- 4-3 |
| | మొత్తము | 1747-14-9 |

# ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారు
పిఠాపురము మహారాజావారు, పరిషద్రక్షకాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, ఉయ్యూరు జమీందారువారు.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

ంజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ., (కోశాధ్యక్షులు.)

## కార్యనిర్వాహక సభాసభ్యులు.

శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు

,, కొమ్మిరెడ్డి కేశవరామమూర్తినాయుడుగారు, బి. ఏ.

,, పిల్లారిశెట్టి రంగబ్రహ్మరావునాయుడుగారు.

,, వెంపటి రామబ్రహ్మముగారు.

,, నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

,, వీశేశ్వరపు వెంకటరమణసుబ్బారావుగారు, బి. ఏ., బి. ఎల్.

,, ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

,, కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

,, కేశవరపు కామరాజుగారు.

,, వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ. (ఆనర్సు)

,, వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు

,, యి. వి. వీరరాఘవాచార్యులుగారు,

,, చతుర్వేదుల సత్యనారాయణశాస్త్రిగారు.

# శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు.

## చతుర్థసంపుటము.

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమసంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 980 పుటలుగల మూఁడవసంపుటమును, 950 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాదియందుఁగల సంస్కృతాంధ్రశబ్దములన్నియుఁగలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'ఙ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'తృ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' మొదలు 'న' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమమయినది. ఈ పుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయునను తలంపుతో నీ క్రింది వెలలు నిర్ణయింపఁబడినవి. ప్రథమసంపుటము వెల రు 5 లు, ద్వితీయసంపుటము రు 4 లు, తృతీయసంపుటము రు 4 లు, చతుర్థసంపుటము రు 4 లు

---

Printed by N. Achutaramayya at the Cocanada Printing Works Cocanada and Published by K. Raghavacharyulu, Secretary Telugu Academy, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

కాకినాడ



| | |
|---|---|
| సంపుటము | సంచిక |
| ౪౦ | ౧-3 |

# సంపాదక వర్గము.

ప్రధానసంపాదకుఁడు :

శ్రీ కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ, బి. యల్.

సహాయ సంపాదకులు :

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు ఎం. ఏ.

శ్రీ విద్వాన్ వేదుల రామచంద్రకీర్తిగారు ఎం.ఏ., ఆనర్సు, బి.ఓ.ఎల్.

శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారు, బి. ఏ.

సాహిత్యవిద్యా-భాషాప్రవీణ. శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

శ్రీ ఖాండారు శర్మయ్యగారు

Printed by N. Achutaramayya at the CocanadaPrintingWorks
Cocanada and Published by K. Raghavacharyulu, Secretary
Telugu Academy, Cocanada.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కాకినాడ

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయిలు.

సంపుటము ౪౦. { ఖర. చైత్ర-భాద్రపదములు. } సంచిక ౧-౩.

## విషయసూచిక.

# సంపాదకీయము.

ఆంధ్ర సాహిత్య పరిషత్తున కీసంవత్సరమునకు నలువదియేండ్లు నిండినవి. ఈ మహాకాలములో నెన్ని యంతరాయములు గల్గినను పరమేశ్వరానుగ్రహమువలన నిలువఁదొక్కుకొనఁ గల్గెను. ఈ నలువది వత్సరములనుండి కొనసాగించుచున్న నిరంతర భాషాసేవచేఁ బూర్వకవికృతములగు నపూర్వగ్రంథముల నలువదికిఁ బైఁగా ముద్రింపఁగల్గెను. ఈ సందర్భమునఁ బరిషత్తు శ్రీశ్రీశ్రీ పిఠాపుర మహారాజులుంగారికిఁ దనకృతజ్ఞతఁ దెలుపుకొనవలసి యున్నది.

శ్రీశ్రీశ్రీ పిఠాపుర మహారాజులుంగారీ పరిషత్తునకు ప్రతిష్ఠాపకులు. శ్రీ వేంకటగిరి జమీందారుగారు, శ్రీ బొబ్బిలి జమీందారు గార్లతోపాటు తామును బరిషత్తునకుఁ బదివేల రూపాయిల నొసంగుటయేగాక పరిష దాశయములలోఁ బ్రధానమైన నిఘంటు నిర్మాణమునకు నిప్పటికి లక్ష రూపాయిలకు పైఁగా వెచ్చించిరి. వారి యౌదార్యమువలన సూర్యరాయాంధ్ర నిఘంటువు నందిప్పటికి నాల్గుభాగములు ముద్రితములైనవి. ఐదవభాగము ముద్రణమున నున్నది. మిగిలిన భాగములుకూడ నచిరకాలముననే ముద్రితములు కాఁగలవు

పరిషత్తు పుస్తక భాండాగారమున నింకను తాళపత్ర గ్రంథములలో నముద్రిత గ్రంథము లెన్నియో కలవు. అందుండి యేఁబది గ్రంథములకుఁ బైఁగా పరిచూచి వ్రాయఁబడి ముద్రణమునకు సిద్ధముగా నున్నవి. క్రమ క్రమముగా నివి యీ పత్రికాముఖమున వెలువడఁగలవు.

పరిషత్కార్య నిర్వహణమున నింతవఱకు నెట్టిలోపము గలుగ కుండ నుదార హృదయులగు జమీందారులును, ధనాధిపతులును, భాషాభిమానులును కావలసిన ధన సాహాయ్యము గావించుచుండిరి.

కలుగువఱకు దానిని శ్రీ జయంతి రామయ్యపంతులుగారు రెండవ కంటికిఁ దెలియకుండఁ దామే భరించుచు వచ్చిరి. ఈ మధ్యకాలములో దేశమునందలి స్థితిగతులు తాఱుమాఱైనవి. పరిషదార్థిక స్థితికూడ తాఱుమాఱైనది.

ఇది యిట్లుండఁగా 1946 సంవత్సరమున శ్రీ ప్రభల వెంకట సుబ్బమ్మగారి యౌదార్యముచే నీ పరిషత్తునకొక భవననిర్మాణము జరిగెను. ఈ నిర్మాణ సందర్భమున శ్రీ వెంకట సుబ్బమ్మగారొసంగిన భూరి విరాళముగాక దాదాపు ఎనిమిదివేల రూప్యములు అప్పు చేయవలసి వచ్చినది. అందుచేఁ బరిషత్తునకు వచ్చు నాదాయము చాలక 1946 సంవత్సరమునుండి నేఁటివఱకును బరిషద్వ్యవహారములు జరుగవలసినంత చురుకుగా జరుగుటలేదు. పరిషత్ పత్రికయు సంవత్సరమున నాలుసంచికలు రావలసినది రెండు సంచికలతోనే ముగింపవలసి వచ్చుచున్నది. ఈ ఖరసంవత్సరమునకుఁ గూడ నిట్లే రెండు సంచికలు మాత్రమే వెలువడఁగలవు. రాఁబోవు నందన సంవత్సరమునుండి యథావిధిగా రెండునెలల కొకసారి పత్రికను బంపఁగలమని మా చందాదారులకు విన్నవించుట కెంతయు సంతసించుచున్నాము.

పరిషత్తునకు నేఁడున్న యప్పులు తీర్చి మరలఁ బూర్వరీతిని పరిషత్ప్రచారము గావించి భాషాసేవ చేయుటకు ఈ సంవత్సరారంభమునఁ గ్రొత్తగా పరిషత్కార్యనిర్వాహకవర్గ మెన్నుకోఁబడెను. ధనసంపాదనమునకై సంగీత నృత్యసభలను నాటక ప్రదర్శనములను గావించుటకును, చందాదారులను యావజ్జీవ సభ్యులను, పోషకులను జేర్చుటకును తీవ్ర ప్రయత్నములను జేయవలసినట్లుగా తీర్మానము జరిగెను.

ప్రప్రథమమున కాకినాడ నగరముననే 2—2—1952 తేదీ పరిషత్తు ఈ ధన సాహాయ్యమునకై యొక సంగీత నృత్యసభ జరుపఁబడెను. ఇందు శ్రీమతి వక్కలంక సరళాదేవిగారు పరిషత్తుయందు తమకుఁ గల యాదరాభిమానములచే మా యాహ్వానము నంగీకరించి వచ్చి తమ మృదుమధురగానమహిమచే సహృదయ సామాజిక హృదయముల నానందాబ్ధి నోలలాడించిరి. అట్లే శ్రీ కుమారి సూర్యకళ శాస్త్రియమగు భరతనాట్య ప్రదర్శనము గావించి సామాజికుల యపారామోదమునకుఁ బాత్రురాలయ్యెను. ఇంకను మహోదార చిత్తులగు నటుల గాయకుల నర్థించి వారి సాయమునఁ బరిషత్తునకుఁ గల యప్పుదీర్చి పూర్వోన్నత్యమును నెలకొల్పుటకుఁ బ్రయత్నములు సాగుచున్నవి.

నేఁడు ప్రభుత్వము ప్రజాధీనమైనది. అచిరకాలముననే ప్రత్యేక రాష్ట్రము కూడ లభింపఁగలదని యాంధ్ర మహాజనులెల్లరు నువ్విళ్ళూరుచున్నారు. దైవానుగ్రహమువలన ప్రత్యేకరాష్ట్రమే మనకు ప్రాప్తించిన నాఁడు రాష్ట్రముతో పాటు రాష్ట్రమునకు జీవగఱ్ఱయగు భాషకుఁగూడ ప్రత్యేకత సిద్ధింపఁగలదు. ఆ ప్రత్యేకతను—తెలుఁగు తేటఁదనమును, తియ్యఁదనమును—సాధించుకోవలసిన భారమాంధ్ర భాషావిదులపైనున్నది. ఆంధ్రభాషా కోవిదులును, భాషాభిమానులు నగు వారు దానికొఱకు నేఁటినుండియుఁ బ్రయత్నములు సలుపవలసి యున్నది. ఎంత ప్రతిభాశాలియగు కవియైనను, ఎంత వ్యుత్పన్నుఁడగు పండితుఁడైనను దనకుఁదానొంటరిగా నేకార్యము దలపెట్టినను కొన సాగుట కష్టము. "సంఘే శక్తిః కలౌయుగే" యన్నట్లు సంఘీభావముతో నెంతటి కార్యమైనను సుకరముగా సాధింపవచ్చును. కావున నాంధ్ర భాషావిదులును, భాషాభిమానులు నగు మహాశయు లందఱును చిరకాలమునుండి మనభాషాభ్యున్నతికై కృషిచేయుచున్న మాపరిషత్తుతోఁ గలిసి యేకముఖముగా నాంధ్ర భాషాసేవ గావింపఁ బ్రార్థించుచున్నాము.

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

—:o:—

శ్రీ పిఠాపురం మహారాజావారి ధనసాహాయ్యముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువు. నాలుగుసంపుటములు ముద్రితమై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు, అకారము మొదలు నకారము వఱకునుగల సంస్కృతాంధ్రశబ్దము లన్నియుఁ గలవు. ఈ నిఘంటువునందు సంస్కృతశబ్దములు పూర్వనిఘంటువు లన్నిటియందుకంటె మిక్కిలి యధికముగా నీయఁబడినవి కావున సంస్కృతవిద్యార్థులకు గూడ మిక్కిలి యుపయోగకరముగా నుండును. ఇది యున్నచో సంస్కృతనిఘంటువుల యపేక్షయుండదు. అచ్ఛికపదములకుఁగల యర్థభేదములఁ గనఁబఱిచి వానికిఁ బ్రమాణవాక్యములు పూర్వగ్రంథముల నుండి విపులముగా నీయఁబడినవి. లభ్యమైనంతవఱకుఁ దెనుఁగుశబ్దములకు సంస్కృత ప్రాకృత ద్రావిడాది భాషలయందుఁగల సజాతీయపదములు చూపఁబడినవి. కేవలము విడిశబ్దములేగాక సందర్భానుసారముగ సమస్తపదములు (Phrases) ను వానికిఁగల యర్థములును బ్రయోగములునుగూడ నీయఁబడినవి. జనకశబ్దములక్రింద జన్యశబ్దములు చూపఁబడినవి. ఈ పుస్తకమును రచించుటకు, ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయునను తలంపుతోఁ దక్కువవెల నిర్ణయింపఁబడినది.

| | |
|---|---|
| మొదటిసంపుటము | రు. 5-0-0 |
| మిగిలినవి సంపుటమునకు | 4-0-0 |

# భాద్రపదము

శ్రీ బులుసు వేంకటేశ్వరులు బి.ఏ.

స్వార్థపరతా పిశాచ పీడావృతంబు
తుచ్ఛవాంఛోపహతము నత్తుంగధర్మ
పథవివర్జితము జగంబు పరిణతిఁగన
భద్రము లొసంగుఁగావుత! భాద్రపదము. ౧

శుద్ధజీవిత కాసార శోషణంబు
జీవ జీవన వితతిచే నిగ్గుపఱచి
నిండుదనము నొసంగి యున్నిద్రసుఖముఁ
దగ నొసంగుత! భాద్రిపదంబు కృపను. ౨

సింహనాదార్భటిం బోలు చెలువు చూపి
జగము ద్రిమ్మంగంగఁ బొంగు నిమ్నగల కొసఁగు
వర్షపీయూష జలమున భాద్రపదము
భద్రములొసంగుఁ గావుత! భరతజగతి. ౩

క్షణమునను వాన యామబుక్షణమునందు
నెండ క్షణమున రెండును నుండనొకట
భరతతత్త్వముఁ దెలిపెడి భాద్రపదము
భద్రము లొసంగుఁ గావుత! పరమకృపను. ౪

గ్రీష్మతాపంబు హేమంతఋతువు చలియు
రెండిటికి దూరమై సుఖం బొండొసంగి
భారతర్షుల యెడఁదకోపమునుబోలు
భాద్రపదమొసంగుత! జగద్భద్రముఁ గృప. ౫



# — మార్గదేశికవితలు —

శ్రీ బండారు తమ్మయ్య

భారతదేశమున మార్గదేశివిభేదము సంగీతసాహిత్య నృత్యాది కళలయందుఁ జిరకాలమునుండి నెలకొనినట్లు కానవగును. సంగీతము నందు నృత్యమునందుఁగల దేశి విధాన స్వరూపము కొంతవఱకు సంగీత రత్నాకరము, భరతుని నాట్యశాస్త్రము మున్నగు తచ్ఛాస్త్రగ్రంథ ములందు నిర్వచింపఁబడియున్నది. శ్రీనాథుఁడు కాశీఖండములో అగ స్త్యుని దక్షారామక్షేత్ర సందర్శన సందర్భమునఁ జెప్పిన

"మునిచూడామణి యెల్ల సత్కళలకున్ మూర్ధాభిషిక్తుండుగా
వున జారీకరణాంగహారముల తా వుల్మెచ్చి కీర్తించుచున్
శనివారోత్సవమాచరించి కనెనా స్థానంబునన్ రాజనం
దనయుం దానును దేశిమార్గముల గంధర్వాప్సరోనృత్తముల్."

అనుపద్యమువలనఁగూడ నృత్యకళయందలి దేశిమార్గ విభేదము చాలఁ బ్రాచీనకాలమునుండియు నున్నట్లు స్పష్టమగును. కాని సాహిత్యము (కవిత్వము) నకు సంబంధించిన మార్గదేశివిభేదమిదమిత్థమని మనలక్షణ గ్రంథములందు విశదముగ వివరింపఁబడినట్లు కానరాదు. ఆంధ్రవాఙ్మ యమున నింతవఱకుపలబ్ధములయిన గ్రంథములలో మొదటి కావ్యమని పలువురు పండితులు తలంచెడి నన్నయభట్టారకుని యాంధ్రమహాభార తము నవతారికలో నాతఁడు మార్గదేశి కవితల గొడవతెడవియుండలేదు కాని నన్నయ భారతముకన్నఁ బ్రాచీనమని కొందఱు సమకాలీనమని కొందఱు అర్వాచీనమని మఱికొందఱుతలంచెడి నన్నెచోడునికుమార సంభవములో నా కవివరుఁడు మార్గదేశికవితల ప్రసంశనీక్రిందిపద్యమున గొంతకావించియున్నాఁడు.

"మును మార్గకవిత దేశం । బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గునిలిపిరంధ్రవిషయమున । జనసత్యాశ్రయునిదొట్టి చాళుక్యనృపుల్.
(తెనుంగును నిలిపిరంధ్రవిషయంబున జనఁజాళుక్యరాజు మొదలుగఁ
బలువుర్" అని పాఠాంతరము)

ఈపద్యమునకు ముందాతఁడు వరుసగా శివుఁడు, విష్ణువు, బ్రహ్మ రవి, గణపతి, షణ్ముఖుఁడు, మన్మథుఁడు, పార్వతి, భారతియను దేవతల స్తుతించి యటుతరువాతఁ దనగురువు, కృతిపతియునగు జంగమమల్లికార్జునయోగిని సన్నుతించి, "వ" అని యిష్టదేవతా నమస్కారమ్ము చేసినమస్తదేవతా స్వరూపంబయిన మదీయ గురుచరణారవిందంబు లభినుతించి" అనిబ్రాసి యావెనువెంటనే సంస్కృతకవిస్తుతి నుపక్రమించి యా గీర్వాణకవులలోఁ గ్రమంబుగ వాల్మీకి, వ్యాసుఁడు, కాళిదాసు, భారవి, ఉద్భటుఁడు, బాణుఁడు అను వారిని మాత్రము స్తుతించియున్నాఁడు. అటు తరువాతనే పైనిజెప్పిన "మునుకవిత......" అను పద్యమును వ్రాసిదానివెనుక

"సురవరులం గ్రమంబున వచోమణి సంహతిఁబూజచేసి, మ
ద్గురు చరణారవిందములకుం దగ సమ్మతిఁజేసిమ్రొక్కి, వి
స్తరమతులం బురాణకవి సంఘము నుత్తమమార్గసత్కవీ
శ్వరులను దేశిసత్కవుల సంస్తుతిచేసి మనోముదంబునన్."

అను పద్యమునువ్రాసియున్నాఁడు. పర్యాలోచించిచూచిన నీపద్యము నన్నెచోడుఁడంతకు ముందుగావించినవర్ణన క్రమమునకు (దేవతాస్తుతి, గురుస్తుతి, గీర్వాణకవిస్తుతి, మార్గదేశికవిప్రశంస) అనుగుణముగానే రచింపఁబడినదని విస్పష్టముగ గోచరించును. "మునుమార్గకవిత..."అను పద్యములో నాతఁడు మార్గదేశికవి ప్రశంసను సాముదాయికముగఁ గావించెనేగాని యాముందుగాని వెనుకఁగాని గీర్వాణకవులవలె మార్గకవులఁగాని దేశికవులఁగాని యెవరిని నామతః వేర్వేఱనిస్తుతించియుండ లేదు. కుమారసంభవమును 1909 సంవత్సరములో మొదటఁ బ్రకటించిన శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు పైనిబేర్కొనిన "మునుమార్గ

కవిత..." అను 23 పద్యమునకు అధోజ్ఞాపికలో "మార్గకవిత=సంస్కృత కవిత; దేశికవిత=భాషాకవిత్వము, ద్రవిడాంధ్రకర్ణాటాదికవిత" అనివివరించినారు. కవిగారు గావించిన యీ వివరణము నన్నెచోడమతానుసరణముగాఁ గాన్పింపదని నాయభిప్రాయము. మార్గకవితయనఁగేవల సంస్కృత కవితయేనా? ఆంధ్ర దేశమునఁ జాళుక్యరాజులపాలనమునకుఁ బూర్వము కేవలము సంస్కృతభాషలోనే గాని దేశభాషయగు నాంధ్రములో నెట్టికృతులును రచింపఁబడనేలేదా యనువిషయము విచారణీయము. నన్నియ నన్నిచోడుల కాలములకుఁ బూర్వము వారి భారత కుమార సంభవములవలె గ్రంథరూపముదాల్చిన యాంధ్ర వాఙ్మయము మనకిప్పుడు లభ్యముగాకున్నను గీర్వాణచ్ఛందములగు వృత్తములందును అక్కర, రగడ, సీసము మున్నగు దేశీయచ్ఛందములలోను దెలుఁగు భాషలో రచింపఁబడిన పద్యములుగల ప్రాచీన శాసనములు కొన్ని లభ్యమగుటచే నవి నన్నయాదులకుఁబూర్వమాంధ్రభాషలో నెట్టి రూపమునను గూడ బద్యరచనమే జరుగలేదను నూహలకు వ్యతిరేకసాక్ష్యమొసంగుచున్నవి. "సురవరులంగ్రమంబుగ......" అను నన్నెచోడుని పద్యమందలి "విస్తరమతులన్" అనువిశేషణము తనవాఁతనున్న పురాణకవిసంఘము, ఉత్తమమార్గసత్కవీశ్వరులు, దేశిసత్కవులు, మూఁటికిఁగూడ సాముదాయకముగ నన్వయించును. "పురాణకవిసంఘము" అనుటలో నన్నెచోడుఁడుద్దేశించినది యాతఁడు సన్నుతించిన గీర్వాణకవులార్వురనుగూడ ననియే యెన్నఁదగును. అట్లుగాక వ్యాసవాల్మీకు లిరువురమాత్రమే పురాణకవిశబ్దవాచ్యులుగను, కాళిదాసాదులు నల్వురను మార్గసత్కవీశ్వరులుగను నాతఁడు సంభావించెనని తలంచుట సమంజసము కాదనియే నాయభిప్రాయము. కేవలసంస్కృత కవితనే మార్గకవితగను, తద్భాషాకవులనే మార్గకవులుగను, నాతఁడుగణించి యున్నచోఁ జాళుక్యరాజులకుఁబూర్వము కొన్నివందల సంవత్సరముల నుండి భరతఖండము నల్గడల గీర్వాణభాషాకావ్యములు రచింపఁబడి

యుండె నాంధ్రదేశవిషయమున నాతఁడు ప్రత్యేకముగా "మునుమార్గ కవిత......" అను పద్యమును వ్రాయుటలో స్వారస్యమంతెగాఁ గానరాదు. భూపాలురు తమ శాసనములను దఱచుగాఁ గేవల సంస్కృతవృత్తములతోను బ్రకటించుపద్ధతి దేశమునఁ బరిపాటిగానుండ దేశీయచ్ఛందములలో రచింపఁబడిన పద్దియములకుఁగూడ నాదరణము చూపు నుద్దేశముతోఁ జాళుక్యనృపులుకొందఱు తమశాసనములందు వానికిఁ గూడ స్థానమొసంగుచు దేశికవితా పోషణమునెడఁ బ్రకటించిన యభిలాషమును బ్రశంసించుచుద్దేశముతోడనే ముఖ్యముగా నన్నెచోడుఁడీ పద్యమును వ్రాసియుండును. దేశీయచ్ఛందమగు అక్కరలోనేపూర్తిగా లిఖింపఁబడిన యుద్ధమల్లుని బెజవాడ శాసనమువంటి వాతనికాలమునకు మున్నే వెలసియున్నవి. మార్గదేశి కవితావిభేదవిషయమున నన్నెచోడునిదృష్టిలోఁగేవల సంస్కృతభాషాకావ్యములకుఁ బ్రసక్తిలేదనియే నా తలంపు.

సంస్కృతము భరతఖండమందంతట జనుల వాడుకభాషగా (spoken language) నుండిన యత్యంత ప్రాక్తనకాలమును మనము గుర్తింపఁజాలము. అసలట్టికాలమెప్పుడయిన నుండెనాయనుటగూడ సంశయాస్పదమే. ఆయాదేశభాష లాయాదేశజనులవాడుక భాషలుగా వెలసియున్నను నన్ని దేశములందునుగూడఁ గొలఁదిగనో గొప్పగనో చిరకాలమునుండి యిప్పటికిఁగూడఁ గొందఱు పండితులచే గీర్వాణభాషా కావ్యములు ప్రత్యేకముగ రచింపఁబడుచునేయున్నవి. దేశభాషలుజనుల వాడుకభాషలుగా వ్యవహృతములగుచున్నకాలములో గీర్వాణ భాషా కవిత కొంతసాగి రాజాదరణము నొందినంతమాత్రమున జనులు తమ దేశభాషలో నెట్టి కృతులను నసలేరచింపకుందురనుట ప్రకృతి స్వభావ విరుద్ధమని చెప్పనక్కఱలేదు. కావున నన్నయ యుగమునకుఁ బూర్వమందుండిన దేశికవితలఁగూర్చి ప్రాగభావముకన్నఁ బ్రధ్వంసాభావమునే యూహించుటయుక్తము. కావున మార్గదేశికవితా విభేదనిరూపణములో నన్నిచోడుఁడు పాటించినప్రాధాన్యము కేవలము భాషకుఁగాక

తద్భాషాచ్ఛందస్సరణులకు మాత్రమేయని గోచరించును. ఆంధ్రదేశ విషయమునఁ గేవలము గీర్వాణచ్ఛందములకు సంబంధించిన స్రగ్ధర, శార్దూలము, చంపకోత్పలములు, మున్నగువృత్తములతో (అక్షరగణ బద్ధములు) గ్రంథమంతయుఁ బ్రత్యేకముగాఁ దెలుఁగుభాషలోఁ గూర్పఁబడినది మార్గకవిత. దేశీయచ్ఛందములకుఁ జెందినకందము, గీతము, రగడ, అక్కర, సీసము, ద్విపద, తరువోజమున్నగు మాత్రాగణబద్ధ పద్యములతో గ్రంథమంతయు నాంధ్రభాషలోఁ గూర్పఁబడినది దేశికవిత ; అట్టిమార్గకవితాకావ్యములను, దేశికవితాకావ్యములను బ్రత్యేకముగ రచించినవారే వరుసగ మార్గకవులు దేశికవులునాఁ బరఁగుదురు. ఇట్టికవులు నన్నియ, నన్నిచోడులకాలమునాఁటికిఁ గొందఱయిన నుండియుందురు. నన్నయ తనభారతావతారికలో గీర్వాణ కవులఁగాని, దేశికవులఁగాని యెవరినిబేర్కొనలేదు సరిగదా మార్గదేశి శబ్దములనయిన నుదాహరింపలేదు. నన్నెచోడుఁడు గీర్వాణకవులఁ గొంత ఆనామతఃపేర్కొని స్తుతించి మార్గదేశికవులను సాముదాయికముగ స్తుతించినాఁడు. కొందఱు సంస్కృత పదబాహుళ్యముతోఁ జెప్పిన తెలుఁగుకవిత (నన్నయభారతభాగము వంటిది) మార్గకవిత యనియు, ఆంధ్రపదబాహుళ్యముతోఁ జెప్పినది (తిక్కనభారతము వంటిది) దేశికవితయనియు నిర్వచింతురనియుఁ దెలియుచున్నది. ఇదికూడ సరికాదనియే యెన్నఁదగును. జాను తెనుఁగుపయి మక్కువవెలార్చిన నన్నెచోడునికుమారసంభవమునను, పాల్కురికి సోమునిద్విపదకావ్యములందునుగలసినంత సంస్కృతపదబాహుళ్యమున్నది. కావున భాషాపదబాహుళ్యముతో నిమిత్తములేక కేవలము సంస్కృతచ్ఛందములకుఁ జెందిన వృత్తములతో నచ్చ తెనుఁగులోఁ గూర్పఁబడిన కృతియైనను మార్గకవితగను ద్విపదలు, సీసములు, కందములు, రగడలు, గీతములు, గద్యలు, అక్కరలుమున్నగు దేశీయచ్ఛందములలో సంస్కృతపదభూయిష్ఠముగ రచింపఁబడినను నట్టికృతులు దేశికవితగను గణింపఁదగుననియే నాయభిప్రాయము. సంస్కృతవృత్తపదబాహుళ్యమెక్కువగను, దేశీయచ్ఛందఃపదసముదాయము క్వాచిత్కముగనుగల కృతులను మార్గకవితా

షకోగ నేఁడు స్థూలదృష్టితోఁబలువురు పరిగణించుచున్నారు. కాని మార్గకవితకది సరియైన నిర్వచనముకాదనియే నేఁడలంచుచున్నాను. గ్రంథమంతయు దేశీయచ్ఛందములలోఁ గూర్పఁబడిన కృతులు ద్రవిడ కర్ణాటభాషలలోఁ బూర్వమునుండియుఁగలవు. కన్నడములో హరీశ్వరుని శివగణదరగళె, కెరెయపద్మరసు దీక్షాబోధె, రాఘవాంకుని హరిశ్చంద్రచరిత్రము, సిద్ధరామపురాణము, భీమకవి బసవపురాణము మున్నగునవి యిందుకుదాహరణములు. ఇవిముఖ్యముగ రగడలు, షట్పదులలోఁగూర్పఁబడినవి. అట్లే కేవలసంస్కృతవృత్తములలో గ్రంథమంతయుఁగూర్పఁబడిన మార్గకవితా కృతులుగూడఁగలవు. ఈనిర్వచన ప్రకారము నన్నయనన్నెచోడుల సమీపకాలములో వెలసి మనకుఁదెలియవచ్చిన యాంధ్రభాషాకృతుల నీక్రిందసూచించిన విధమున మార్గ దేశికృతులుగా గణింపవచ్చును.

మార్గకవిత

| | |
|---|---|
| (1) మల్లికార్జునపండితుని శ్రీగిరి మల్లికార్జునశతకము<br>(2) పాల్కురికి సోమనాథుని వృషాధిపశతకము. | చంపకోత్పల వృత్తములతోఁ గూర్పఁబడినవి |
| (1) మల్లికార్జునపండితుని శివతత్త్వసారము | (కందపద్యఘటితము) |
| (2) పాల్కురికి సోముని బసవపురాణము<br>(3) ... పండితారాధ్యచరిత్రము<br>(4) రంగనాథరామాయణము. | ద్విపదకావ్యములు |
| (5) పాల్కురికి సోముని చతుర్వేదసారము | (సీసపద్యగణితము) |
| (6) ,, బసవరగడ, పంచప్రకారగద్యమున్నగు గేయలఘు కృతులు. | |

నన్నయభారతము, నన్నెచోడుని కుమారసంభవము, పాల్కురికి సోమనాథుని యనుభవసారము కేవలము మార్గకవితక్రిందఁగాని దేశికవితక్రిందఁగాని చేర్పఁదగినవికావు, ఇవిమార్గదేశి కవితాసమ్మేళనాత్మకములయిన కావ్యములు. ఇట్టిమిశ్రకావ్యములు కన్నడములో వీరికిఁబూర్వము చిరకాలమునుండి వెలసియున్నవి. కథావిస్తృతియే

ప్రయోజనముగాఁగల కావ్యములు, పురాణములు, ప్రబంధములు నాం
ధ్రభాషలో నిట్లుమార్గదేశికవితల సమ్మేళనముతోడనే కూర్పఁబడినవి.
ఇందుకనన్నియ, నన్నిచోడులే మార్గదర్శకులు. ఇట్టి సమ్మేళనాత్మక
కావ్యరచనమునకు బీజములు కొంతవఱకు ఉదాహరణాదిదేశికృతుల
లో నేర్పడెనని తలంపనగును. పద్యపదముల కలయికగల స్తోత్రగ్రంథ
ముదాహరణమని లాక్షణికులు నిర్వచించియున్నారు. ఇందులో సప్త
విభక్తులలోఁ గ్రమంబుగ సంస్కృతచ్ఛందమునకుఁజెందిన వృత్తమొక
టియు దానిననుసరించి దేశీయచ్ఛందములందలికళిక, యుత్కళికయుఁ
గూర్పఁబడును. పాల్కురికి సోమనాథుని బసవోదాహరణమున్నగు
నవి యిందుకులక్ష్యములు. ఆంధ్రభాషలో రానురాను విస్తరిల్లిన ప్రబం
ధవాఙ్మయము చాలవఱకు మార్గదేశికవితల సమ్మేళనముతోఁగూర్పఁ
బడినవి. ఈవిధానమునకే వ్యాప్తియెక్కువయగుటచేఁగాలము గడచిన
కొలఁది మనభాషలోఁ గేవల మార్గకవితలు, దేశికవితలు సన్నగిల్లినవి.
మొదటిది వృత్తములతోఁగూర్పఁబడిన శతకరచనమునందును, రెండ
వది కంద, సీస, గీతపద్యములతోఁ గూర్పఁబడిన శతకములందును,
ద్విపద కావ్యరచనమునందుమాత్రము కొంతవఱకాశ్రయమునొందినవి.



# అరుంధతీ వసిష్ఠము

శ్రీ బులుసు వేంకటేశ్వరులు బి. ఏ.

( అనువృత్తము )

గీ. చావుఁబుట్టువు లెఱుఁగనిజ్ఞాన నయ్యు
నిన్ను నీజాయఁ బ్రోవఁగా, నిలుప సాంఖ్య
తత్త్వము జగంబునఁ  నాకుఁ దలఁపు కలుగ
నాత్మలీలార్థమై పుట్టు వందఁగలను.'' ౪౬

మ. అని విష్ణుప్రభు వాత్మధామమున కత్యాశ్చర్యలీలన్ సుప
ర్ణుని పై నెక్కి యదృశ్యమయ్యె; మునిశార్దూలుండు నాకర్దముం
డనఘాత్ముండు ప్రియంబునం జరియె బ్రహ్మానందనిష్యందమై
చనునాబిందుసరోవరంబునఁ దపశ్చర్యాదికర్మార్థమై. ౪౭

శా. అంతం గర్దమహాని యంచితతపోధ్యానానురక్తుండు ని
శ్చింతాస్వాంతుఁడు బ్రహ్మచర్యనియమశ్రేష్ఠుండు సర్వేశ్వరా
నంతప్రాభవదృగ్విలాసుఁడు జగన్నాథార్చితాంతర్యవే
దాంతజ్ఞానకృశాంగసుందరుఁడు బ్రహ్మానందియై యుండఁగన్. ౪౮

క. స్వాయంభువమను వాత్మ
ప్రేయసి శతరూపతోడఁ బ్రియకామగుణ
శ్రీయుత యగునాత్మజతో
నాయెడ కేతెంచి మ్రొక్కె నతిభక్తిమెయిన్. ౪౯

ఉ. మ్రొక్కినయంతఁ గర్దముఁడు మోదముతోడ బహూకరించి పెం
పెక్కినయాతిథేయమున నెంతయు వారికిఁ బ్రీతిగూర్చియున్
మక్కువ నాదరించె మనుమాన్యుని సర్వసపర్యలన్; గనన్
దక్కవమే మునీంద్రులకు ధార్మికరక్తియు భక్తియుక్తియున్. ౫౦

గీ. కర్దమునిఁ గాంచి యానందకలితుఁ డగుచుఁ
బలికె స్వాయంభువుండు సభక్తికముగ
వినయగౌరవభావంబు విశదపడఁగ,
చల్లకును వచ్చి ముంత దాఁచఁడు వివేకి. ౧౦

మ. "వరయోగీశ్వర! దేవహూతి యను శోభారాశి మత్పుత్త్రి నీ
కరకాంక్షన్ జనుదెంచియున్నది కనంగా నొల్ల దే మానవున్
వర మీవే కృప నిమ్ముఁ గైకొనఁగ సర్వశ్రేష్ఠుఁ డౌ భర్త వీ
తరుణీశ్రేష్ఠకు; కింక నీ వొసఁగు మోదంబంది యామోదముల్" ౧౧

క. అని వేడుకొనఁగఁ గర్దమ
ముని తొలుతటి విష్ణువాక్యమును స్మరియింపం
గని యిది లలాటలిఖితం
బని, తెలిపెను వినయగరిమ నామోదంబుల్. ౧౨

గీ. తెలిపి "మనువర్య! సమయము కల దొకండు
నాకు నీపుత్త్రివలన సంతతి జనించు
వఱకు నిలిచెద గార్హస్థ్యపథమునందుఁ
బిదపఁ గైకొందు సన్న్యాసవృత్తి నేను. ౧౩

గీ. దీని కొడఁబడి రేని యింతియును నీవు
భవ్యగుణవతి యైనయీభాగ్యరాశిఁ
గైకొనఁగ నాకుఁ బ్రీతియే కానఁ దెలుపు
యుష్మదభిమత" మని పల్కె యోగ్యభంగి. ౧౪

క. సతితలఁపు తనదుతలఁపును
సుతతలఁపును నొక్కభంగి సొంపలరుటచే
మతి సంతసించి యాశా
లత చిగిరింపంగ మనువు లలితగతి ననెన్. ౧౫

ఉ. "మానితవంశ! నీవలుకు మాకు మహాసుఖసిద్ధిఁ గూర్చె నెం
దేని పవిత్రవిప్రులకు నిట్టివ్రతంబె కదా యనారతంబును
బూనఁగ ధర్మ; మిట్టియెడఁ బూజ్యుఁడ వన్నిటఁ గాన నీకు నెం
తేని తగున్ మహాత్మ! యిది యెంతయు మాకు ననుగ్రహంబెయౌ.

క. మాపుత్త్రిఁ జెట్టవట్టిన
యాపుణ్యుఁడు పుత్త్రవంతుఁడై యాపిదపన్
శ్రీపుండరీకనయనుని
బ్రాపింపఁగ నన్న్యసింప భావ్యము కాదే? ౫౭

చ. తొలిమొకనాఁడు మేడపయిఁ దొయ్యలి నెచ్చెలికత్తె లాలతాం
గులఁ గవగూడి లీలమెయిఁ గుందనపుందనుకాంతి యొప్ప నిం
పులు గులుకన్ ముఖాంబుజము పొల్పగుకందుకకేళి నుండ నా
వల నెటనుండియో పడియె వచ్చి యొకండు క్షమింపఁగోరుచున్.

క. చెలికత్తియ యొక్కతె య
మ్మలశీఘ్రత వచ్చి విషయముం జెప్పఁగ మే
మల శరవేగంబునఁ జం
చలియించినచి త్తవృత్తిఁ జని కనుఁగొనఁగన్. ౫౯

గీ. అతఁడు గంధర్వజాతికి నధిపుఁడైన
వ్యక్తి విశ్వావసుం డనువాఁడు మమ్ముఁ
గాంచి వినయాంజలులను జోడించి పలికె
నిష్కలుష చిత్తవృత్తి నిర్లిప్తుఁ డగుచు. ౬౦

ఉ. "ఏమని చెప్పుకొందును మహీశ్వర! యోమనుసార్వభౌమ! నే
నీముదితన్ విమానమున నేఁగుచుఁ గంటిని గన్నయంతనే
నామది మోహమగ్నమయినన్ వివశంబయిపోయె వెంటనే
యీమహిఁ గూలిపోయితి నహీనపులజ్జ క్షమింపవేఁడఁగన్. ౬౧

ఉ. ఎంతపతివ్రతాతిలక మానవమోహనమోహనాంగి యో
యంతయుఁ దోఁచె నిట్లుయినయంతనె బుద్ధియు వచ్చెఁ గాన ని
త్కాంతపదాంబుజద్వయముఁ గాంచి తరింపఁగ దోషవార్ధి ని
శ్చింత యథేచ్ఛ మేఁగెదను శిష్యుని నన్ను ననుగ్రహింపవే! ౬౨

క. అని పలికిన విని మేమును
మనమున నచ్చెరువు దోఁప మహితాదరసం
జనితానందుని నాతనిఁ
గనికరమునఁ బంపఁ జనియె గంధర్వుండున్. ౬౩

ఉ. కావున మానిచంద్రమ! ప్రకాశిలు నీమె త్వదీయపత్నిగా
భావనసేయు నిన్నె భగవంతునిగా సతతంబు; నిట్టిక
న్యావరభిక్షఁ గైకొనుము; నన్ను నొనర్పుము ధన్యకాంక్షిగా
పావన మస్మదీయమనువంశము యుష్మదనుగ్రహంబునన్. ౬౪

గీ. కర్దమమునీంద్రుఁ డెంతయుఁ గౌతుకమునఁ
దెలుపఁగ నిజానుమతము; సత్కృష్టఫణితి
మనుకులాచారవిహితధర్మప్రకార
మునను మునికిచ్చె దేవహూతిని జనకుఁడు. ౬౫

చ. మునికులసంప్రదాయమున మోదముతో మునిచంద్రుఁ డుత్తమం
బును బహుళోపయోగమును బూజ్యమునై నిజకర్మనిష్ఠ క
త్యనుగుణ మైనయాశ్రమమునం దిటు చొచ్చెను; ధర్మదీక్ష కెం
దును బరివర్జనీయమును దూష్యమునున్న దె యాశ్రమంబులన్

సీ. తనకీర్తి యాచంద్రతారకంబుగ నిల్వ
స్వాయంభువుండు విజ్ఞానిరత్న
మైనకర్దమమౌని నల్లునిగాఁ బరి
గ్రహియించి మిన్నందె గౌరవమున

అతఁడును శతరూప యతికష్టమున సుత
నెట్టులో మునిచేతఁ బెట్టి సహాజ
విరహవేదన గెంటి వేయివిధంబులఁ
బుత్త్రిక నూరార్చి పోయి రంత
గీ. నాత్మదేశంబునకు; నెంతయైనఁ గాని
యొకరికొకరయి వినుతురే సకలసుఖము
లాత్మగేహంబు భోగంబు లవనియందు
నిలచుతాత్కాలికప్రేమ చలన జనులు. ౬౭

క. బిందుసరోవరతీరము
నం దాశ్రమ మొందు నిలిపి యత్యంతసుఖా
నందనిధానము గాఁగను
నందుండెను గర్దమర్షి యతివయుఁ దానున్. ౬౮

ఉ. ఉండి కులక్రమానుగత మున్నతసౌఖ్యనిధాన మైనయు
చ్చండతపోధనంబును బ్రశస్తవిరాగసుయోగసంపదన్
మెండుగ సంగ్రహించును నిమీలితనేత్రుఁడు దివ్యచక్షు వా
ఖండలతుల్యవైభవము గల్గఁగ నాతి సపర్య సల్పఁగన్. ౬౯

గీ. లక్ష్మి నారాయణునకుఁ బార్వతి శివునకుఁ
బలుకునఁబోఁడి బ్రహ్మకు భక్తితోడ
సేవచేసెడివిధము హర్షించి మించి
వారిఁ దలదన్నఁ దలఁపందు వారిజాక్షి. ౭౦

క. సతి ముక్తిఁ గాంచఁగనుటకు
వ్రతములు నుపవాసవితతి వలయునె! తలఁపన్
బతియే సమస్త మనుసు
వ్రతనిష్ఠయె చాలుఁ బరమభాగ్యము లందన్. ౭౧

మ. తరుణీరత్నము భక్తియుక్తి ఘనతాత్పర్యంబునన్ స్నేహత
త్పరతన్ నాథుసపర్య చేయుచును గ్రోధద్వేషలోభాదిదు
ష్పరివారంబును గెల్చి యుత్తమమహాసాధ్వీత్వముంగాంచి య
చ్చెరువుం గొల్పును జూచువారికి శుచిశ్రీనూత్న తేజంబులన్.

మ. మునిమూర్ధన్యుఁ డమానుషప్రతిభచే మోక్షాకరాత్మజ్ఞతా
ఘనయోగంబున విష్ణుసత్కృప మహాగంభీరుఁడై దివ్యశ
క్తి నివిష్టుం డయి దివ్యదృష్టియుతుఁడై తేజోమహారాశియై
యనిపించుం బరమేశుఁ డీతఁడె యనన్ వ్యక్తాత్మనిష్ఠాదులన్. ౨౩

మ. ఒకనాఁ డాతఁడు వత్సలత్వమున నెంతో ప్రేమ తొల్కాడ నం
తికమం దున్నసతీవతంసమును బ్రీతిన్ లాలనం జేసి "యో
శుకవాణీమణి! నా కసూయ యగు నిన్ జూడంగ నీవంటినాఁ
తుక, సాధ్వీమణి, నుత్తమవ్రతను నెందున్ జూడ నేకాలమున్. ౨౪

ఉ. నాకృపఁ జూఱగొన్నలలనామణి వోట సమస్తభోగముల్
నీ కిట లభ్యమౌను దరుణీ! తమిదీఱఁగఁ గోరుకొమ్ము తృ
ష్ణాకలితుల్ కనుంగొనని సంపద లెల్లఁ గరస్థమౌను దృ
ష్ణాక్రమనిర్జితాత్ములకు సాధ్వి! జగంబున నూహచేయఁగన్. ౨౫

గీ. వలయునవి కోరుకొమ్ము సర్వంబు నేను
నీ కొసంగుదుఁ దన్వంగి! నిరుపమాన
నిత్యశుశ్రూషచేత ననిత్యదేహ
నిర్మమత్వముచేతఁ దన్పితివి నన్ను" ౨౬

చ. అని పలుకన్ గటాక్షకలితాననపద్మము లజ్జపెంపునన్
వినమితమున్ మనోహరము నిస్తులకాంతియుతంబు గాఁగ న
వ్వనరుహగంధి స్నేహసహవాసము లందిన సౌహృదంబునన్
వినయము పెంపునన్ బలికె విహ్వలతాభయభక్తియుక్తులన్. ౨౭

"ప్రాణేశ! నీమృదుపదకంజములె చాలు
క్షణికంబు లైన భోగంబు లేల?
యోగీశ ! నీకృపా యోగంబె చాలును
క్షణికంబు లైనభోగంబు లేల ?
మానీంద్ర ! త్వద్భక్తి మహితచిత్తమె చాలు
క్షణికంబు లైనభోగంబు లేల ?
జ్ఞానిచంద్రమ ! భవత్సాహచర్యమె చాలు
క్షణికంబు లైన భోగంబు లేల?

ఇన్నియును నీ వెఱింగియు నిట్లు నన్నుఁ
గోరుకొ మ్మన నిరసింప ఘోరదోష
మగును నే నెట్లు పలుకంగ నౌను దేవ !
సర్వవిషయజ్ఞ ! తెలియు నీ శక్తి నాకు. ౭౮

సీ. నియమవృత్తిని నిన్ను నిరతంబుఁ గొల్చినన్
దనుకార్శ్య మది రవంతయును లేదు
నిద్రావిహీననై నిత్యంబుఁ గొల్చినన్
మాంద్యంబె కలుగ దేమాత్రమైన
నిరుపమత్వత్సేవ నిరశననై యున్నఁ
గలుగ దేమాత్ర మాఁకలియు దప్పి
నిత్యోత్సవశ్రీల నెగడు నీకడ నున్నఁ
గల్గ వాధివ్యాధి కల్మషములు

గీ. వర్ష శతములు కడచినన్ బరమపుణ్య!
త్వన్మహాసేవ నున్నయుత్తమతవలనఁ
దరుణసంపద సడలదు; పరమహేయ
కామవాంఛాదికంబులు కడలుకొనవు. ౭౯

గీ. ఇదె మహాభాగ్య మిట్టులే యింక నుండి
భవ్యభవదీయ సఖ్యసంపదను మెలఁగఁ
గోరుకొందును కాని, దేవా! రహస్య
మొండు కల దది తలపోయ మెండుభయము. ౮౦

క. నవమోహనుండ వగునీ
ప్రవిమలతనుసౌఖ్య మంద భావము వోవన్
మిపులన్ భయమగు దానన్
ధవ! సంతతి కలుగు నన్నుఁ ద్యజియింతు వనన్. ౮౧

క. సంతతి కలిగెడుదాఁకను
గాంతను గవగూడి యుండుఁ; గాముకవృత్తిన్
సుంతైనఁ గనక పిదప ధ
రింతును సన్న్యాస మను టెఱింగితి మున్నే. ౮౨

ఉ. కావునఁ బ్రాణనాథ! నను గావఁగఁజూచెద వేని యాత్మ సం
భావనయుండెనేని ననుఁ బాయకయుండుము వంశవర్ధనా
భావము లేక పుత్త్రికలు పై సుతుఁడున్ జనియించి పెద్దవా
రౌవయసుల్ గడించి మనునంతకుఁ దీర్పుము నాదుకోరికల్. ౮౩

గీ. పద్మపత్త్రాయతాక్షునిఁ బడసి సుతుని
గాఁగ నాతఁడు నాకు మోక్షం బొసంగు
దాఁక నన్నేలుకొనుము వాత్సల్య దృష్టి
సన్న్యసింపుము తగ యథేచ్ఛంబు పిదప. ౮౪

క. ఇది యుచితం బని ధవ! నీ
మదిఁ దోఁచెన యేని నీవు మన్నింపుము నన్
సుదతిని బలికిన పలుకులఁ
గొదవయె కలదేని క్షమయె కోరుదు" ననఁగన్. ౮౫

క. "ప్రియురాల! సీతలం ప
ప్రియముల కాకరము కాదు క్షేమంబున నా
క్రియ లెల్ల నే నొనర్తును
భయ ముడుగుము నీవు నిజము ప్రాణేశ్వరిరో!"

మ. అని మౌనీంద్రుఁడు తత్క్షణంబె నిజయోగానూనసత్త్వంబునన్
ఘన దివ్యన్మణి నిర్మితంబు సుభగాకారాత్మకోద్యాన శో
భ నవోదారము సౌధకేళిభవన ప్రౌఢంబు దివ్యంబు నా
వనితామగ్నవిమాన మొక్కటిని జూపన్ బత్ని తబ్బిబ్బుగాన్. ౮౭

క. కని "తరుణీ! బిందుసరో
ఘనజలములఁ గ్రుంకులిడుము కల్గును నీకున్
వనజాక్షి ! సకలఫలములు
ననుపమయోగం" బటంచు నానతి యీయన్. ౮౮

గీ. దేవహూతి ప్రవేశింపఁ దీర్థమందు
నచ్చెరువు గాఁగఁ దోఁచిరి మచ్చెకంటు
లతులసూక్ష్మాంశుధారిణు లై కిశోర
నవవయశ్శోభిత లగుకన్యాజనములు. ౮౯

క. "పరిచారికలము నీ కో
తరుణీమణి ! సేవగొనుము తాత్పర్యమునన్
జరియింతుము కనుసన్నల
నరయుము కారుణ్యదృష్టి నమ్మా! మమ్మున్". ౯౦

చ. అని కమనీయహేమకలశాదులఁ గర్పూరవారిఁ దెచ్చి పెం
పున జలకంబు లార్చి సతిఁ; బుప్పొడి కస్తురి రాసి మేని క
త్యనుపమధూప మిచ్చి బహుళాభరణంబు లొసంగి పా
వనముగ వల్వలిచ్చి యతివన్ గయిసేసిరి వా రొకింతలో. ౯౧

క. నానారసపానంబుల
నానారుచిరాన్నభోజనంబులఁ దృప్తిన్
నానావిధముల నొసఁగియు
నానందాంబుధిని దేల్చి రతిపలు నామెన్. ౯౨

గీ. అంతఁ గర్పూరహారతు లామె కొసఁగి
యుత్తమోత్తమ శయ్యపై నునిచి పిదప
నగణితసువాసనోపేత యామెదరికిఁ
గర్దమమునీంద్రుఁ జేర్చి రుత్కర్ష మొదవ. ౯౩

క. అతఁడును సహస్రవనితా
యుతుఁ డయి బహునవ్యశోభనోపేతుండై
ప్రతి లేనిమన్మథుం డయి
యతిశయదివ్యస్వరూపమం దొప్పుటయ్యెన్. ౯౪

గీ. సకలమును దోఁచె దేవహూతికి విచిత్ర
గతిగ నాపైని భర్తయోగప్రభూత
సృష్టిగా నామె చేడ్పడి చూడ నతఁడు
నామెతోడ విమానంబు నంత నెక్కె. ౯౫

గీ. అతనితో నామె నామెతో నఖిలకన్య
కాసహస్ర మధిష్ఠింప ఘనవిమాన
మాకస మ్మనఁ దారక లనఁగ వారు
కర్దముఁడు పూర్ణశశి నాఁగఁ గానఁబడిరి. ౯౬

వ. అనంతర మాతనికోరిక ననుసరించి ౯౭

చ. సకలదిగీశముఖ్యులకు సంతతదివ్యవిహారభూమియై
సుకముల కాలవాలమును సుందరదృశ్యవిరాజితంబు స
న్నికటసుధాతునిర్ఝరగతిన్ సమశీతలమై శుభ
ప్రకరము లిచ్చుమేరుగిరిపై నిలిచెన్ ద్రుటిలో విమానమున్. ౯౮

మ. అదియే పుష్పక మాతఁడే ధనదుఁ డాయబ్జాక్షులే దేవతా
మదిరాక్షీమణు లంచు నెంచి జనముల్ మార్మ్రాటలోనే యికీ
యది కా దిట్టిమహాద్యుతుల్ కలవె యజ్ఞాధీశునెమ్మోని కీ
సుదతీరత్నము లెన్న నెంతటి మహాశుద్ధాంగు లం చుండఁగన్. ౯౯

మ. శరవేగంబున నందు నేఁగి సుమనోజైత్రంబునం జూచి య
బ్బురపా టొందఁగ నందు నిండఁ గల యంభోరాసులన్ దివ్యసుం
దరముల్ కేళివనంబులన్ గని మహానందంబునన్ సర్వలో
క రహఃకేళులఁ దేలుఁ దలు ఋషి పొంగారంగ శృంగారముల్. ౧౦౦

గీ. పుండరీకాక్షుఁ బొడఁగన్న పురుషవరుఁడు
కర్దమమునీంద్రుఁ డతని కుత్కర్ష కలుగ
త్రిభువనంబులఁ గలదె ప్రాప్తింపనట్టి
యేపదార్థంబు కాని సమీక్షచేయ. ౧౦౧

చ. తనప్రతిభావిశేషమున ధారుణిఁ గల్గిన కేళిభూములన్
గని కని యందు నిండుఁ దనకాంతను గేళులఁ దేల్చి తేల్చి పెం
పున దివిఁ గల్గు కేళివనముల్ గని లీలలఁ దేలియాడి య
మ్మునివరుఁ డేఁగుదెంచె నిజభూమికిఁ దృప్తసతీద్వితీయుఁడై. ౧౦౨

మ. శతవర్షంబులు వారు సౌఖ్యరసవర్షశ్రాంతులై యిష్టభో
గతతిన్ దేలిరి; దేవహూతి పతియోగప్రాభవం బెంచి సం
తతిఁ గాంక్షించెను; గర్దముం డతివసత్కాంక్షన్ నివారింపకే
సతిగర్భంబున నిల్పె వీర్యము నవాంశప్రాభవం బందఁగన్ ౧౦౩

క. అది మొదలుగ దినదినమును
మదిరాక్షికిఁ బెరుఁగఁజొచ్చె మహితం బగుసం
పద నాఁగ నాత్మగర్భము
త్రిదశులు మందారవృష్టి దివిఁ గురియింపన్. ౧౦౪

క. ఈవిధముగఁ గర్దమముని
సేవాఫల మనఁగఁదగినస్త్రీసంతతి రా
జీవాక్షి దాల్చి కనె రా
జీవాక్షులఁ గాలవశముచేఁ దొమ్మండ్రన్. ౧౦౫

క. తొమ్మండ్రు సుందరాంగులు
తొమ్మండ్రును బూర్ణచంద్రతులితాస్యలు నా
తొమ్మండ్రును బద్మాక్షులు
తొమ్మండ్రును లక్ష్మితోడఁ దులతూఁగంగన్. ౧౦౬

గీ. హర్షమునఁ దేలి కర్దముఁ డాత్మపుత్రి
కలకుఁ బెళ్లుంచె $_{1}$అనసూయ $_{2}$కళ యనంగ
$_{3}$శ్రద్ధ నా $_{4}$హవిర్భువు నాఁగ $_{5}$శాంతి యనఁగ
$_{6}$ఖ్యాతి $_{7}$క్రియ $_{8}$యరుంధతి నాఁగ $_{9}$గతి యనంగ. ౧౦౭

గీ. అమలశోభాయమానపద్మాకరమునఁ
దళతళల నీను శ్రేష్ఠపద్మం బనంగ
మణులలోపల నాయకమణివిధానఁ
దరుణచంద్రాస్య యానరుంధతి చెలంగు. ౧౦౮

క. జననీజనకులముద్దుల
కును వారు నిధాన మగుచుఁ గొమరుం దనమున్
వినయాన్వితసౌశీల్యముఁ
గని పెరుఁగం దొడఁగి రతులగతిసంగతులన్.

క. నవనవకాంతుల నీనుచుఁ
బ్రవిమలసరసీరుహప్రభాశోభితలై
పువువిలుతుని నిశితాస్త్ర
ప్రవరంబులు నాఁగ వారు పరగుచునుండన్. ౧౧౦

గీ. బాల్యయౌవనమధ్య మౌవయసు వచ్చె
లలన లెల్లరు మిక్కిలి వెలయుచుండి
ఋషిసపర్యలు చేయ నూహింతు రహహ !
గతము తెల్పు ననాగతక్రమము నిజము. ౧౧౧

మ. పొరపొచ్చెంబులు లేక నెచ్చెలులుగాఁ బొల్పొంది వారల్ పర
స్పరవాత్సల్యవిశేషరాగములతోఁ బ్రాణంబు ప్రాణంబులై
పరమాంతఃకరణప్రవృత్తులను దివ్యప్రేమముం జూపుచున్
బెరుఁగం; జూచెద రెల్లరున్ బరమసంభావ్యంబుగా వారలన్. ౧౧౨

గీ. సానదీఱిన నవరత్న జాలము లని
పుటము వెట్టినబంగరుబొమ్మ లనియు
దివ్యకాంతు లీనుమెఱుపుఁదీఁగ లనియుఁ
దోఁచినటు వారిఁ జెప్పుకొందురు జనములు. ౧౧౩

మ. మునిశుశ్రూషలు మౌనికాంతలవ్రతంబుల్ నిత్యకృత్యంబులై
జనవంద్యం బగుసత్ప్రవర్తనమె సత్సమ్మానితాచారమై
వినుతప్రక్రియ నాత్మవిద్యఁ గని తద్విఖ్యాతనిష్ఠాక్రమం
బొనరం జేసెడిదీక్షలే పనులుగా నొప్పారి రాకన్నియల్. ౧౧౪

గీ. కర్దమప్రజాపతి దివ్యకాంక్ష వలన
దేవహూతికిఁ బుట్టినదివ్యవనిత
లహహ ! వారికిఁ గొఱఁతయే యమలగుణము
లవనిఁ దలిదండ్రులే బిడ్డ లౌట నిజము. ౧౧౫

గీ. ఇది యగు నరుంధతీవసిష్ఠేష్టకావ్య
రాజమునఁ బ్రథమాశ్వాసరాజ; మీశ !
గురువరా ! త్వత్కృపామృతభరితమౌను
కీనవాఙ్మయ మిదియు నంకితము నీకు. ౧౧౬

# అరుంధతీ వసిష్ఠము

## ద్వితీయాశ్వాసము

శ్రీమద్గురువర ! సత్కరు
ణామంద సుఖప్రదాత ! అద్వైతపథ
శ్రీమహితచిత్త ! శ్రీస
ద్మామూల్య రసప్రవిష్ట ! ఆర్యమహర్షి ! ౧

వ. తదనంతరకథాక్రమ మెట్టిదనిన. ౨

క. నవరత్నంబులపగిదిని
నవరసములరీతి వా రనంతప్రభలన్
బ్రవిమలతనువల్లరులన్
మిఫులన్ జెలువొందుచుండి మెలఁగుచునుండన్. ౩

ఉ. కర్దమ మౌనిచంద్రమునిఁ గాంచి ప్రియంబున దేవహూతి సౌ
హార్దముతోడఁ బల్కెనిటు "లార్యఋషీశ్వర ! నీయెడందయా
మార్దవ మెంతయున్ బరమమాన్యము, నౌట సుపుత్త్రికాత్మ స
మ్మర్దము కల్గెఁగాని పరమంబగుపుత్త్రధనంబు లోటెయా. ౪

క. శ్రీరమణి నుమను మఱి వా
ణీరమణిని బోలు పుణ్యనిధు లగుసుతలన్
ఏరమణి గన్న నాయుమ
గారవమును గాంచలేదు కనక సుపుత్త్రున్. ౫

గీ. పుత్త్రవతి యైనకాంతతోఁ బోలఁజాల
రతులితైశ్వర్యయుత లయ్యు నబల లెందుఁ
బుత్త్రికలు వేయి మందియుఁ బుత్త్రుఁ డొక్క
నికిఁ దలంపఁగ లొచ్చంద్రు నీతినిధులు. ౬

మ. ఇహసౌఖ్యంబుల రోఁతపుట్టె నిఁక నే నిందుండఁగాఁ జాల నీ
కుహనాభోగము లల్పముల్; మఱియు నీకుంగోర్కి సన్న్యాసమా
నిహలోకంబున జన్మ మింకెడు తెఱంగే తెల్పి యుద్బోధ స్వా
వహితుం డైనసుపుత్త్రు నిచ్చి కృప దేవా ! నన్ను రక్షింపవే!'' ౭

క. అని విన్నవించు తరుణీ
మణి హృదయమెఱింగి కర్దమఋషీశుఁడు "నీ
యనుపమయోగంబున శ్రీ
వనజాక్షుఁడు పుత్త్రుఁడగును వారిజనయనా ! ౮

మ. నిరతంబుగ్ దలపోయుచుండు మతనిన్ నీగర్భమం దాతఁడే
వరజన్మంబును గాంచు నిన్ననను బ్రోవంజాలు సంసారసా
గర బీభత్సమునుండి లోకములరక్షం దాల్చు సర్వానికిన్
దరుణీ! కష్టము? నిన్ను నన్నుఁగరుణన్ రక్షించి దాటించుటల్''.

గీ. అన్నమాటలు విని యామె యమితమోద
మంది శ్రీపుండరీకుని నాత్మఁ దలఁచు
వ్రతములను బూని యుపవాసవితతి సలిపి
విష్ణుచింతను దినములు వెళ్లఁబుచ్చు. ౧౦

గీ. కొంతకాలంబునకు భర్త గురుకటాక్ష
కలితయగు నామె కార్దమకలిత తేజ
మంద నారాయణుం డామెయందుఁ జొచ్చి
గర్భగతజీవుఁడై యుండెఁ గరుణమెఱసి. ౧౧

క. కాలక్రమమున నాయమ
లీలామాత్రుండు లోకలీలారతుఁడౌ
శ్రీలక్ష్మీదయితుని నొక
బాలునిగాఁ గనియె నామె భాగ్యంబెంతో. ౧౨

గీ. కపిలమౌనిని నిజజనిక్రమవినాశి
సతులయోగప్రభూతుని నాదిదేవుఁ
గడుపు చల్లనియాతల్లి కాంచినంత
దివ్యచిహ్నంబు లెంతయుఁ దేజరిల్లె. ౧౩

క. మందారవృష్టిఁ గురిసిరి
బృందారకు లెల్ల గగనవీథిని బరమా
నందినులై యప్సరసల్
సుందరముగ నాట్యమాడి చూపిరి ప్రీతిన్. ౧౪

చ. సరసజనాంతరంగములు సంతసమందెను; హోమవహ్నులు ల
బ్బురముగ వెల్గి సుప్రభలపుంజము లయ్యె; సముద్రముల్ కలం
కఱి సుభగంబు లయ్యెను; ఫలావళిఁ బుష్పములన్ నతంబులై
పరగెను వృక్షరాజి; ఫలవంతము లయ్యెను సర్వసస్యముల్. ౧౫

క. ప్రకృతికిఁ బరుఁడై వెలిఁగెడు
సుకృతులు జనియించునపుడు శోభిల్లెడియా
ప్రకృతికె యాకృతి నొసఁగిన
సుకృతియె జనియింప మిగుల శోభిలకున్నే. ౧౬

క. కపిలావతారవేళా
సుపవిత్రత నెంచి బ్రహ్మసూనులతో న
య్యపవర్గకాంక్షిఁ గర్దమ
తపస్వినిన్ దేవహూతి దర్శించి వెసన్. ౧౭

చ. "పరమపవిత్రులార! భగవంతునిఁ బుత్త్రుని గాఁగఁ గన్న యో
గరతులు మీరు మీ రెవనిఁ గాంచిరొ యాతఁడె దేవహూతి క
చ్చెరువుగ నిచ్చు మోక్షము; విశిష్టమతంబగు సాంఖ్యయోగమే
పరమమతంబుగా నిలుపు; భక్తులఁ బ్రోచును జ్ఞానదాతయై". ౧౮

(సశేషము)

# క్రౌంచపదవృత్తలక్షణ విశేషము

[ రచయిత - విద్వాన్ - శ్రీ రాపూరి దొరస్వామి శర్మ ]

క్రౌంచపదము సంస్కృత సమవృత్తము. సంస్కృతభాషావృత్తములన్నియు తెనుఁగున గ్రహింపఁబడుటచే నియ్యదియుఁ దెనుఁగులక్ష్య లక్షణగ్రంథములందుప యుక్తమై యొసలారుచున్నది. సంస్కృతాంధ్ర క్రౌంచపదవృత్తలక్షణములందును, దెనుఁగు క్రౌంచపద యతిఘటనయందును భిన్నరీతులు గానవచ్చుటచే నావిషయముల నిందు సమీక్షింపఁదలఁచియున్నాను.

సంస్కృతచ్ఛందంబులందుఁ గ్రౌంచపదలక్షణము:—

పింగళాచార్యనిఛందము

క్రౌంచపదా భ్మౌ స్భౌ నౌ నౌగ్ భూతేంద్రియ వస్వృషయః (7 అధ్యాయ 30 సూ) ప్రతిపాదమునను 'భ-మ-స-భ-న-న-న-న-గ' గణములు, 5-5-8-7 అక్షరములపై యతులుండునని పై లక్షణము చెప్పుచున్నది. ఇయ్యది 25 (అతికృతి) ఛందమునఁబుట్టిన వృత్తమగును.

పై ఛందమున నీక్రింది లక్ష్యశ్లోకముదాహృతము.

'యాకపిలాక్షీ పింగలకేశీ కలిరుచి రనుదిన మనునయ కఠినా
దీర్ఘతరాభిః స్థూలశిరాభిః పరివృత వపురతి శయకుటిలగతిః
ఆయత జంఘానిమ్నకపోలా లఘుతర కుచయుగపరిచితహృదయా
సాపరిహార్యా క్రౌంచపదాస్త్రీ ధ్రువమిహనిరవధి సుఖమభిలషతా'

ఈ పైవిషయమునే యీక్రింది లక్షణము సైతముచెప్పుచున్నది.

క్రౌంచపదా భ్మౌ స్భౌ న న నౌ గ్నా విషుశరవసుముని విరతిరిహభవేత్.

సంస్కృతలక్షణానుసారముగానే కన్నడభాషయందు నీవృత్తము వెలయుచున్నది చూడుఁడు.

'శీతకరోర్వీ వాతశశాంకర్ యుగ మిత సురపుర నివహదకదెయోళ్
భూతగణేశం భూతశ రాశా గజదళె యతిగళు మెసరిదె పెసరిం
నీతియుతే కేళ్ సాతిశయోక్తి క్రమదొళెసెగళుదు దతిశయరచనో
పేతమశేషోర్వీతలకం క్రౌంచపదమతిశయ పద రచనెగళిం.

ఇయ్యది నాగవర్మరచిత కర్ణాటభాషాచ్ఛందములోనిది.

ఇఁకఁ దెనుఁగులక్షణము పరికింతము;

కవిజనాశ్రయమందు,

పంచశరాభా-సంచితపుణ్యా-భమసభననయ - పరిమితమైనన్

గ్రౌంచపదాఖ్యం బంచితమయ్యెం-గ్రమయతి దశవసు-కలితము గాఁగన్.

పై తెనుఁగు క్రౌంచపదము 24 ఛందమునఁబుట్టినది. సంస్కృతమునందువలె 25 వ ఛందములోనిదిగాదు దీనిగణములు- 'భ-మ-స-భ-న-న-న-య' సంస్కృతవృత్తము కన్నఁ దెనుఁగున నొకయక్షరము తక్కువ. మాత్రాసంఖ్య సరిపోవుటచే రెండు నొక్కనడకగలవిగాఁ దోఁచుచున్నవి.

(సం)— భ - మ - స - భ - న - న - న - న - గ

(తె)— భ - మ - స - భ - న - న - న - య

సంస్కృతవృత్తము కడపటి 'నగము' తెనుఁగువృత్తమున 'యగణము' గా మాఱినది. రెంటికి 5 మాత్రలే; నడక యేకరీతిగానున్నను భిన్నచ్ఛందోజాతములనక తప్పదు.

సంస్కృతమున 5-5-8-7 పై యతులు నియతములు. కాని యందుఁ బద విచ్ఛేదమాత్రమాకాంక్షితము. తెనుఁగున యతివర్ణమైత్రిగలది. తెనుఁగు లక్షణమున 10-8 పై యతులు చెప్పఁబడెను కడపటి 7 పై యతి సంస్కృతమునఁ బాదాంతయతి సూచించును. అందుఁ బాదాంతము తరువాతి పాదముతోఁ గలియరాదనునియతి యుండుటచేఁ బాదాంత యతి చెప్పఁబడును. తెనుఁగున నేవంవిధనియతిలేదు. మఱి సంస్కృతమున మొదటి 5 పై యతి గలదు. తెనుఁగు లక్షణమున నయ్యది చెప్పబడ లేదుగాని పై కవిజనాశ్రయ లక్షణపద్యమునను మఱి యీక్రింది లక్షణములందును 5 పై ప్రాసయతి గూర్పఁబడియున్నది. అనఁగా 5 పై యతి యుంచుటకుమాఱు దానిప్రక్కఁ బ్రాసమైత్రి పాటింపఁబడినదని యెఱుంగనగు.

పంచశరాభా-సంచితపుణ్యా..........

క్రౌంచపదాఖ్యం-బంచితమయ్యెన్......

దీనినే ప్రాసాక్షరమును సప్తమస్థానమున నుంచుటయని ప్రకారాంతరముగా జెప్పవచ్చు.

ఈక్రిందిలక్షణములు పరిశీలింపుఁడు

ఛందోదర్పణము-(అనంతుఁడు)

కాంచనభూషా-సందమ మొప్పఁగ-ఘనకప నసారమునఁ-గప్పురపరిమళమున్
జంపలసేతల్-వంచనలోవన్-సముచితగతి వెను-చని తనఁ గొల్వన్
అంచితలీల-ల్మించినకౌరిక్షా-హారిదిభ పరిమిత-యతులొనఁగూడన్
మంచిరచింపం-గ్రౌంచపదంబి-మ్మొగిభమసభనన-మలనయలొందున్.

కావ్యాలంకార చూడామణి—

ప్రాంచిత తేజః-కుంచితవైరీ-భమసభనవన య-పరిచితకీర్తిన్
అంచితమయ్యెం-గ్రౌంచపదాఖ్యం-బనుగతహారిదిభ-యతి నశీవృత్తిన్.

లక్షణసారసంగ్రహము (చిత్రకవి పెద్దన)

పంచయుగాహులై - క్రౌంచపదిన్ వ-ర్ణ్యము సభననయ-పరిమిత మయ్యెన్-
పై లక్షణములంబట్టి చూడఁగ్రౌంచము 24-వ ఛందమునఁ బుట్టిన వృత్తమనుట స్పష్ట మగును. వీనియన్నింట 5-పై యతికి మాఱు దానితర్వాతఁ బ్రాసాక్షర మైత్రియు, తర్వాత 5-పై 8-పై పాద ప్రథమాక్షరముతో యతి మైత్రియుఁ గూర్పఁబడియుండుట గానవచ్చుచున్నది.

సంస్కృత లక్షణమునను సరించి తెనుఁగు లాక్షణికులు 5 పైఁ బ్రాస యతియు, తరువాతి 5, 8 పై యతులును నియమించినారు పాదాంతయతి తెనుఁగున కవశ్యము గాదు గానఁ దర్వాతి 7 పై యతి తెనుఁగునఁ జెప్పఁబడలేదు. తెనుఁగున మొదటి 5 పై యతికి మాఱు ప్రాసయతి ఘటనయొకటి విలక్షణముగాఁ గన్పట్టెను. 5 పై బ్రాసయతి తెనుఁగు లక్షణకారు లేరును గంఠోక్తముగాఁ జెప్పరైరి గాని లక్ష్యములం దొండొరుల ననుసరించి కూర్చియున్నారని యెఱుఁగఁదగును. చిత్రకవి పెద్దనమాత్రము 'పంచయుగ' అని చెప్పియున్నాఁడు గాని యతఁడేని యది ప్రాస యతియని దెలుపఁడయ్యె. తక్కుంగలవారు మొదటి యైదవస్థానముపై యతి లక్షణ మున నసలే చెప్పలేదు.

ఈ ప్రాసయతి ఘటనకుఁ గన్నడలక్షణము గొంత మూలమనవచ్చు. ఛందోంబుధియను కన్నడఛందము రచించిన నాగవర్మ క్రీ॥ శ॥ 990 ప్రాంతమువాఁడు. మన తెనుఁగుప్రాంతముల కెల్లఁ బూర్వరచితమనఁదగు ఛందోంబుధిలోని క్రౌంచపద మున 5-పైఁ బ్రాసయతి ఘటితము.

'శీతకరోర్వీ-వాతశశాంకర్'..........— (ఇంతఃపూర్వ ముదాహృతము) కన్నడబాసయందు యతి లేదు; ప్రాసమాత్రము కలదు.

సంస్కృత క్రౌంచపదములోని 25 అక్షరములను 24 గాఁ జేయుటయు, అందుఁజెప్పఁబడిన మొదటి మూఁడుయతిస్థానములందుఁ బ్రథమమునఁ గన్నడభాషా

పద్ధతిం బ్రాసమైత్రియుఁ, దర్వాతిరెంటికి సామాన్యయతి మైత్రియుఁజెప్పుటయు నను నీ తెనుఁగులక్షణ పరిణామమునకుఁగారణమే మైయుండునో దురూహ మైయున్నది.

పై కవిజనాశ్రయాదిచ్ఛందోనుసారములైన కతిపయలక్ష్యముల నీక్రిందఁ జూపుచున్నాను.

నన్నయ భారతభాగమునఁ గ్రౌంచవృత్తము లేదు; తిక్కనభాగమున స్త్రీ పర్వమున నొకవృత్తముగలదు.

కౌరవసేనా-వీరులు లావుం-గడిమి యుఁజలముచు-గడఁక యెలర్పన్
ధీరతసొంపుం-గ్రూరత పెంపుం-దెగువయు నెఱపఁగ-దెరలక వీఁకన్
బోరనఁ గ్రోవం-గారభసం బే-పునగలితనమును-బొలుపువహింపన్
దారు భయంబుం-గూరుటకుంగా-వలసెను రుధిరము-వదనము సేర్పన్ (స్త్రీ 1-166)

కళాపూర్ణోదయము (6-225)

చంచలవీ-చీ-సంచయలీలా-సలలిత తరళిత-జలరుహపాళీ
సంచితహస్తా-దంచితభంగీ-జనిత మదనమత-సరణిగుణవ్యా
ఖ్యాంచితగోష్ఠీ-సంచరణప్ర-త్యయసముచితహా-హాళికలతో రా
యంచలుప్రేమాయం గొంచలుగాయన్-వ్యవహితపరరవ-మయిన కొలంకున్.

ఉత్తర రామాయణము (కంకంటి పాపరాజు)-7-144

తావులు మీఱం-బూవుల వానల్-దఱమఁగఁగురియఁగ దతఘనభేరుల్
గ్రేవలప్రేమాయం-గేవలగీత-క్రియలను వనితలు-గిటికొని యాడన్
దేవత లెల్లన్-శీవిభుటెల్లన్-స్థిరమతిఁగొలువగ-దివిజవిభుండున్
బావకముఖ్యా-శావిభుయుక్తిన్-బగతునినడఁచిన-ప్రభుఁగనవచ్చెన్.

ధర్మఖండము (భవానీశకవి) -4-102

వారిజగాత్రున్-వారిజనేత్రున్-వనజజముఖసుర-వరనుతిపాత్రున్
దారితవైరిన్-స్వైరవిహారిన్-దశముఖముఖఖల-దనుజవిదారిన్
సారసధామున్ శ్రీరఘురామున్ సరసిజహితకుల జలనిధిసోమున్
సారెనుతింపన్ గ్రూరులకేనిన్ సమధికసుఖతతి సతతమునబ్బున్.

సీతారామాంజనేయసంవాదము (3-45)

సారపదార్థం-బారయుచుందా-సకలనిగమములు-చదివిననైనన్
జారువిశిష్టా-చారఘనుండై-జపములు తపములు-సలిపిననైనన్
స్ఫారసమస్తా-దారసుతీర్థా-చరణములనిశము-జరిపిననైనన్
గారవముంజే-కూరఁగనీయో-గజపరమసుఖము-గలుగదువత్సా.

ఎఱ్ఱాప్రెగ్గడ తనదు హరివంశములో సంస్కృతానుసారము మూఁడుయతులుఁ బాటించినాఁడు. తిక్కనాదుల క్రౌంచములందుఁగల ప్రథమప్రాసమైత్రి నుంచక యచ్చో సామాన్యయతినే కూర్చినాఁడు. ఆపద్యమిది-

హరివంశము ఉ-భా-(9_259)

సారవివేకా-సౌఖ్యవిలోకా-సకలరిపుభయద-సమదసమీకా
♦ భారమణీయా-బంధువిధేయా- పరహితకరుణా-ఫలసదుపాయా
ధీరచరిత్రా-దీపితగోత్రా-దివిజనగసదృశ-ధృతియుతగాత్రా
వీరవరేణ్యా-విశ్రుతపుణ్యా-వినయగుణవిజయి-విలసనగణ్యా.

తిక్కన యెఱ్ఱనల క్రౌంచపద యతి నియతియందే భేదము గానవచ్చెడు.

ఈవృత్తమందే కాదు. కవిత్రయరచనలలోఁ బరస్పర మితరపద్యములందు యతి నియతిభేదము చూపట్టుచున్నది.

పృథ్వి— నన్నయ మతమున 12-వ యక్షరము యతి
ఎఱ్ఱన ,, 9 ,, ,,
మధ్యాక్కర — నన్నయ— 4-వ గణముపై యతి
ఎఱ్ఱన — 3-వ గణముపై యతి
మానిని — నన్నయ— పాదమధ్యమున నొక్కయతి
ఎఱ్ఱన — మూఁడుయతులు
తిక్కన — ఉభయమతములు పాటించె.

ఇవి యిట్లుండఁగా, అప్పకవీయ క్రౌంచమందు బ్రథమప్రాసమైత్రి లక్షణమందుఁ జెప్పఁబడలేదు. లక్ష్యమందును ఘటితముగాదు. తర్వాతిరెండుయతులు (11, 9 చోట్ల) విధింపఁబడెను చూ- (అప్పకవీయము 4 ఆశ్వాసము)

పంచ మకేశుండిచ్చిన భాస్వ-ద్వరమున మనమున-బవరము గోరన్
వంచనతో బాణాసుర హస్త-వ్రజములు దఱిగెను-వడిహరియంచున్
బ్రాంచితలీలన్-శంకరనంద-ప్రకటిత విరతులు-భమసభనాన్యల్
* క్రౌంచపదీవృత్తమ్మునఁ జెన్నా-రఁగఁబలుకుదురిలఁ-గవివరులెల్లన్.

అప్పకవికిఁ బూర్వులగు ఛందఃకర్తలీవృత్తలక్షణమున రెండుయతులే చెప్పిరి. అయిదవస్థానముపైఁబ్రాసమైత్రి వారిలక్షణములో నుక్తముగాదు గాని లక్ష్యమునఁ బ్రయుక్తము. అప్పకవి పూర్వుల లక్షణప్రోక్తయతిద్వయమును మాత్రము గ్రహించినాఁడు. కవి జనాశ్రయాదులందు లక్షణమునఁ బ్రాసమైత్రీనియమము చెప్పఁబడకుం

♦ పరహితకరుణా-తుదిసగణము నలము గానుండవలయు, లేదేని గణభంగమగు.

* సంయుక్తయతి నియతికీపాదము సరిపడకున్నది, ఏకాక్షరయతి మైత్రిలేదు 'క్రౌంచ...... జెన్నా-రఁగఁ బలుకుదురిల-రహిఁగవివర్యుల్' అని సవరించుకోవచ్చు.

టచే, రమ్యతకై పూర్వులు ప్రాస ఘటించియుందురని కాఁబోలు నప్పకవి లక్ష్యలక్షణములందుఁ దాను యతిద్వయమునే కూర్చియుండునని యూహింపవలయు. 24-వ ఛందమందుఁబుట్టిన సరసిజమను వృత్తమునకీ క్రౌంచపదమందువలెఁ బ్రథమమునఁ బ్రాసమైత్రియుఁ దర్వాత రెండు యతులును గవిజనాశ్రయాదులందు ఘటింపఁబడి యున్నవి. లక్షణమున నందును జెప్పఁబడమిచే నప్పకవీయసరసిజమునఁ బ్రథమ ప్రాసమైత్రి ఘటితము గాదు.

పారిజాతాపహరణమందలి క్రౌంచపద మప్పకవీయమందుంబలె రెండు యతులు మాత్రము కలిగియున్నవి.

అంకురిత శ్రీసంగ భుజాంకా-హరిహయ మణిమద-హగతనువర్ణా
సంకటకృద్దైత్యాశయశంకా-జనన నిజచరిత-శయధృతశంఖా
పంకజనాభా భంజితపంకా-పరమపురుషభవ-పరిభవనామా
శంకరభావా కిసలయసంకా-శపదయుగకలశ-శరనిధిశయనా.

ఈ పారిజాత కృతి పద్యము తుదిపాదమున గణములు క్రౌంచవృత్త లక్షణమునకు విలక్షణము గానున్నవి. నేఁటిముద్రితప్రతుల నిట్లే వెలయుచున్నది. ఇదియొకరి ప్రమాదమో? 'శంకరభావా పల్లవసంకాశపదయుగకలశ శరధిశయానా

{శరనిధిశయ్యా / ,, శాయీ} ' అనియింతుక మార్చిన సరిపడును.

అధునాతన బిల్వేశ్వరీయ కావ్యమందు నప్పకవీయమతమే పాటింపఁబడినది.

శ్రీరమణాన న్నారయు మీనా-కృతికమఠమకిటి-నృహరివటూరా
మారఘురామా మాబలరామా-స్మరజయ యసితర-మహితసునామా
వారణరక్షా వాసవపక్షా-వరదయ వగదయ-వనఘనదీక్షా
నారదగేయా నీరదకాయా-నతసురనరతతి-నతిసువిధేయా. (ద్వితీయబింబము- 154)

ఇందుఁ బైకిఁజూచుటకుఁ బ్రథమచతుర్థపాదములందుఁ బ్రాసమైత్రియు; ద్వితీయతృతీయములందు యతిమైత్రియుఁ దోఁచెడుఁగాని, యతిప్రాసలలో నేదో యొకటి మాత్రమే నియతముగా నన్నిపాదములందు లేమిచేఁ గొన్నింట నారిమతమునఁ బ్రథమదశమున యతిప్రాసలేవియు నభిప్రేతములు గావనుట గ్రాహ్యము.

కవిరాజ మనోరంజనములో నీక్రింది క్రౌంచపదము గర్భవృత్తముగా రచితమై యున్నది.

శ్రీమహిమాని-శ్రేయససీమా-చిరశుభకరవిల-సితగుణఖేలా
సామజసంర-క్షానుత సామా-సరసిజ భవసుర-సముదయపాలా
తామరసాప్త-స్థానకధామా-దరనినద చకిత-దనుసుతజాలా
తామసదూరా-ధామసుధామా-తరుణసజల జల-ధరనిభనీలా. (4-177)

ఇయ్యది కందద్వయ రుగ్మవతీ కమలవిలసిత గర్భక్రౌంచపదవృత్తము. ఇందుఁబంచమస్థానముపై యతి కవ్యభిప్రేతమో కాదో దృఢముగఁ జెప్ప వలనుపడదు. రుగ్మవతి గర్భితమగుటచేఁ బంచమయతి యనివార్యము. సంస్కృతానుసారము కవి పంచమయతి గూర్చియుండునని యూహింపనువచ్చును. ఎట్లున్నను నీకవి ప్రథమ ప్రాసను ఘటింపలేదని తెలియనగు.

అప్పకవీయమున గర్భక్రౌంచపదవృత్తమొకటికలదు. అందనివార్యమగుటచే మూఁడు యతులు ఘటితములు.

తెనుఁగుక్రౌంచపదము రుగ్మవతీ కమలవిలసిత వృత్తద్వయ సమ్మేళన మని యెఱయఁదగును ఈక్రిందియప్పకవీయ గర్భ క్రౌంచపదము పైవిషయమును దెల్ల మొనర్చెడు.

'ద్వారపతీనా-థాసముదారా, + తరుణధవళకర-ధరనుతనామా.'
(రుగ్మవతి) (కమలవిలసితము)

ఇఁక సంస్కృత క్రౌంచపదమో రుగ్మవతీ మణిగణ నికర సమ్మిశ్రమగును.
(యాకపిలాక్షీపింగళకేశీ)-(కలిరుచిరనుదిన మనునయకఠినా)

శ్రీ తేకుమళ్ళ రాజగోపాలరావుగారు రెండుతెఱఁగుల క్రౌంచపదమును దమ ఛందశ్శాస్త్రమునఁ జూపియున్నారు. (చూ. 6 ప్రకరణము-49-50 ప)

"క్రౌంచపదము-మ త య న న న న స.
శ్రీరమ్యత్వంబారఁగఁ బెంపూ-ర్జితముగ మణి విర-చిత మకుటములన్
(తిక్కన స్త్రీ పర్వము)

మఱియొక క్రౌంచపదము-భ మ స భ న న న య.
తావులుమీఱన్-బూవులవానల్-పఱుమగఁగుఱియఁగఁ-దలఁచున భేసల్
([illegible]-భాస్కరరామాయణము)"

ఏవంవిధముగ రచితమైయున్నది.

ఇందు రెండవది క్రౌంచపదమే; ఇతఃపూర్వము నాచేనుదాహృతము. మొదటిది సరసిజవృత్తము. తిక్కనభారతమున సరసిజవృత్తమునిదియే కలదు. సరసిజలక్షణము (కవిజనాశ్రయము)

మారాకారా-చారుచరిత్రా-మతయన ననసస-మహియతి రచనన్
సారంబైనన్-సూరికవీంద్రుల్-సరసిజమనివినఁ-జదివిరి సభలన్.

ఇఁక నన్నిచోడకుమార సంభవములోని క్రౌంచపదము కొంత విలక్షణముగాఁ జూపట్టుచున్నది. చూడుఁడు.

చంచల నాస్వా-దించుచు లేఁదూం, డ్లకరువు ప్రియులకు-నలఁదుచు మైరో
మాంచములోలిం-గంచుకితంబై, పొదముఁగ నలరుచుఁ-బులినములం గ్రీ
డించుచు సంభా-షించుచుఁ బ్రీతిన్, బొలుచుచుఁ జెలఁగుచుఁ-గొలయు సముద్యత్
క్రౌంచగతుల్ వీ-క్షించుచు భాస్వ, జ్జ్వలనుఁడు శరవణ-సరసికి వచ్చెన్.

(కుమార -10-30)

ఇందలి యతిఘటన 'మురారేః తృతీయః పంథాః' యనునట్లు క్రొత్తమార్గము నుద్రొక్కినది. ఇందుఁ బంచమస్థానముపైఁ బ్రాసమైత్రియు, పదునొకొండవ యక్షరమునకు యతిమైత్రియుఁ గూర్పఁబడియున్నది. ఈయతి పాదప్రథమాక్షరమునకు సంబంధపడదు. రుగ్మవతీవృత్తదళమున (మొదటి పది యక్షరములు) తిక్కనాదులమార్గమునఁ బ్రాసమైత్రియు, కమలవిలసితవృత్తదళమున (తర్వాతి 14 అక్షరములు) నాభాగము ప్రథమాక్షరమునకు నష్టమాక్షరముపై యతియు ఘటింపఁబడియున్నది.
ప్రథమదళమునఁ బ్రాసమైత్రి, ద్వితీయదళమునఁ బ్రథమదళమునకు సంబంధములేక యతిమైత్రి ఘటించుపద్ధతి యత్యంతము తెనుఁగురచనలో నపూర్వమనక తప్పదు. నన్నిచోడ కుమారసంభవటీకలో శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు, ఈవృత్తమును గూర్చి వ్రాసినవ్రాఁతలను దర్వాతివారు విమర్శించియున్నారు. వానినిందుఁ దడవుట చర్వితచర్వణమగు. కవిగారి వ్రాఁతలో నీక్రిందివాక్యముల మాత్రమించుక పరామర్శింపఁదలఁచితి.

"ఇందుఁ గంద సీసమువలెఁ బూర్వార్ధమునఁ బ్రాసమును ద్వితీయార్ధమున విశ్రమము మాత్రమే కూర్పఁబడియె."

కందసీసములవలెఁ బాదము రెండుభాగములుగా విభజింపఁబడినది గాని, కందమువలెఁ బూర్వార్ధమునఁ బ్రాసముగూర్పబడెననుటలో నర్థము స్పష్టపడకున్నది. కందమున మొదట మూఁడుగణములు, తర్వాత నయిదుగణములుండు. మొదటి పాదమునకు రెండవపాదమునకుఁ బ్రాసముగలదు. ఆరెండవపాదము ప్రథమాక్షరమునకు నాపాదము మూఁడవగణముపై యతియుండును. క్రౌంచములో నట్లుగాక మొదటి భాగము సగములోఁ బ్రాసమైత్రియు, రెండవభాగమున యతిమైత్రియుఁ గలదు. కంద ప్రథమపాదముమధ్య ప్రాసమైత్రి లేదుగదా? అట్లుండఁ గందముతోఁ గవి

గారు క్రౌంచమునకుఁ బోలికయెట్లు కుదిరించిరోకదా ? మీఁదుమిక్కిలి కందమున మొదటిపాదము వేఱు, రెండవపాదము వేఱు. క్రౌంచపదమందువలె నొక్కటిగాదు క్రౌంచపదమందుఁ గందము గర్భితమేయైనను క్రౌంచపాదమాత్రలు కందపద్యార్ధమాత్రలకు సరిపడుచున్నను క్రౌంచ ప్రథమదళప్రాసగాని ద్వితీయదళయతిగాని గర్భకందమునకు జతపడనేరదు. చూ -

చంచుల నాస్వాదించుచు

లేడూండ్లకరువు ప్రియలకు-నలఁదుచు మైరో

ఇందుఁబ్రాసయతులు రెండు సరిపడవు. కందమునకు సరిపడునట్లు వ్రాసినాఁడని యూహించుటకు వీలులేదు.

పోనిండు; సీసపద్యము వంటి దనుటయుఁ జెల్లనేరదు. ఏలయన సీసమందుఁ బ్రథమదళమున విధిగాఁ బ్రాసయు, ద్వితీయదళమున యతియు నియతము గాదుగదా?

నన్నయ క్రౌంచపదము నుపయోగింపఁడయ్యె. నన్నిచోడుని కాలమిదమిత్థమని నిరాక్షేపముగ సిద్ధాంతితము గాక 'ఎవరికివారే యమునాతీరే' యనునట్లుంటచే నాతనిం దప్పించిన నిఁకఁ దిక్కనయే క్రౌంచపదవృత్త రచయితలలోఁ బ్రథముఁడని చెప్పవలసివచ్చు. నన్నిచోడుఁడీయతి ఘటనలో వింతత్రోవఁ ద్రొక్కుటకేమి నిమిత్తమో దురూహము గానున్నది.

తెనుగువృత్తములందెల్లఁ బాదప్రథమాక్షరానుగుణయతి పాటించుటే సంప్రదాయమై వెలయుచున్నది.

కవిగారిది మరియొక వాక్యము- 'తన్వి త్రిభంగి మొదలగు వృత్తములకును ద్వితీయప్రాసనియతికలదు.'

క్రౌంచపదములోఁగల ప్రాసనియమము తన్విత్రిభంగులలోఁగలదనుచున్నారు కవిగారు. త్రిభంగిలోని ప్రాసనియమమునకుఁ గ్రౌంచప్రాసనియమమునకు బాదరాయణ సంబంధమున్నదనుట యందఱకుఁ దెలిసినదేకదా?

త్రిభంగిలోఁ బ్రాసమైత్రియే కాని యతిమైత్రిలేదు. మీఁదుమిక్కిలి యందుఁ బ్రథమదళమున మొదటిదిగాక రెండుమార్లు ప్రాసమైత్రియు, ద్వితీయదళమున నంతను ప్రాసము ముమ్మాఱుసుండును.

'వనరుహజతుని+తనయులు మొదలుగ+ఘనసమతులాదట తో స్తుతి గూడన్ వెన్నునిఁబాడన్' (ఛందోదర్పణము)

ఇం దుత్తరదళప్రాసకుఁ బూర్వదళప్రాసకు సంబంధము లేదు.

త్రిభంగిలోఁగవిగారిప్రాసనియతిలేదుగదా ?

ఇఁకఁ దన్విలోఁ బ్రాసనియతి గగనకు సమము గానున్నది.

'దూడలతోఁ గాపరులును గుహలో + దొంగిలిదాచిన విధి నదలింపన్.'

(అప్పకవీయము)

ఇందొక్క-యతియే యభిహితము. క్రౌంచసరసిజములందువలెఁ బ్రథమదళ ప్రాసయతికి గతిగానరాదు. ఏలయన 'దూడలతోఁగా + పరులును గుహలో' అను దళములోఁ బ్రాసఘటన గుదురదు. కవిగారే తన్వింజూచి ప్రాసనియతి గలదని ?

ఇఁక ముందునకుఁ బోదము.

ఆనందరంగచ్ఛందమునఁ గస్తూరిరంగకవి క్రౌంచవృత్తము నే పంచశరవృత్త మను పేర రచించినాఁడు.

'మించిన రుద్రప్రాథిని బందో + మ్మిదిటను యతి తగి + మెఱసినయంతన్
బంచశరంబా రంగనృపాల + ప్రభుతిలక! భమస-భననయా ప్తిన్!

ఇది యప్పకవీయలక్షణమువంటిదే; రెండుయతులుమాత్రమే చెప్పఁబడినవి. రంగకవి దీని కీక్రొత్తపేరేల యిడెనో? సర్వులు క్రౌంచపదమని యుద్ఘోషించియుండఁగా నితఁడుమాత్రమిట్లేల పేరుమార్చవలె? నాకిట్లు తోఁచెడు-భీమన కవిజనాశ్రయమున 'పంచశరాభాసంచితపుణ్యా యని లక్షణమును మొదలుపెట్టుటను జూచి పంచశరమని నూతననామకరణమును రంగకవిచేసినాఁడు కావలయు.

శ్రీ వేదము వేంకట్రాయశాస్త్రిలవారి ఛందస్సులోఁ గ్రౌంచపదలక్షణ మిట్లున్నది. క్రౌంచపదము (భ-మ-స-భ-న-న-న-య- ౧౧)

పంచశరారిన్ గ్రౌంచపదంబా-భమసభననయ-పరమేష్ఠియతిన్

కుండలీకరణములోను లక్షణములోను 'భమసభననయ' గణములున్నవి. లక్ష్యమునఁ బంచమస్థానముపైఁ బ్రాసయుఁగలదు. లక్ష్యపాదమున భమసభననసస గణములున్నవి. ఇది ప్రమాదపతితమా?

సంస్కృతక్రౌంచపదలక్షణమును శ్రీ గిడుగు సీతాపతిగారు ఛందోదర్పణోపోద్ఘాతమున నీక్రిందిరీతిఁ జూపినారు.

'క్రౌంచపదా భ్మౌ స్మౌ న న నాన్గా విషుశరవసుమునివిరతిరిహభవేత్'
ఇందుఁబొరపాటున్నది; అచ్చు పొరపాటేమో ?

'క్రౌంచపదా భ్మౌ స్భౌ నన నాన్గా అనియుండవలయు
సంస్కృతవృత్త రత్నాకరమున నీవృత్తలక్షణ మిక్రిందిరీతి భిన్నముగానున్నది
'క్రౌంచపదాభ్తౌ భరౌనన నానగౌ మునిశరవసుశరవిరతియుతా!
గణములు-భ-త-భ-ర-న-న-న-న-గ; యతులు-7-5-8-5.

వృత్తరత్నాకరమునకు మణినిధి సమాఖ్యవ్యాఖ్యరచించిన నారాయణపురోహితుఁడుపై లక్షణపాఠమే వివరించి యీక్రింది లక్ష్యముదాహరించె.

పాండుసుతేభ్యోమహీం తు నరేంద్రదేహీశకుని మతరతసకలభృత
నైవహిచేత్త్వంరణాయ కురుష్వబుద్ధిమతులవిపుల ధనురపిబలైః
యాదవనాథే తదేతి గిరైవ మావదతిసదసి ఝుటితినరపతిః
క్రౌంచపదాక్రాంతగాంచ ధరాంనవాత్ర దిశతిమతిరితి సగిరమదాత్.

శ్రీనాథుఁడను మఱియొక వ్యాఖ్యాత పైలక్షణము కొంతమార్పుతో నిట్లు గ్రహించి వివరించినాఁడు.

'క్రౌంచపదాభ్మౌ స్రౌ నననానగా విషుశరముని వసుయతిరిహాభవేత్'

భ-మ-స-జ-న-న-న-న-గ; 5-5-7-8 యతులు.

ఈ లక్షణము దొలుదొలుతఁ జూపిన సంస్కృతలక్షణమునకు ముక్కాలుము వ్వీసము చేరువగానున్నది. నాల్గవగణమందే రెంటిభేదము. అందుభగణమున్నది, ఇందు జగణమున్నది. వృత్తరత్నాకరమున భగణమునకు జగణము లేఖక ప్రమాదజనితమే మోయను సంశయము వొడముచున్నది. ఇదియిట్లున్నను నారాయణ పురోహితుని పాఠము తదుదాహరణము క్రొత్తగాఁ గన్పించుచున్నది. సంస్కృతగ్రంథ మహోదధియందీవృత్తరత్నరచనావిధానము నింకను బరిశోధింపవలసియున్నది.

* గుణచంద్ర విరచితమగు కన్నడఛందస్సారమునఁ గ్రౌంచ పదలక్షణ మిట్లున్నది.

'క్రౌంచపదం భభరం ననం నగం మునిశర వసుశర విరతియుతం'

(భ-భ-ర-న-న-న-న-గ—గణములు; 7-5-8-5 యతులు)- ఇవి లక్షణమునఁ జెప్పఁబడ్డవి. లక్షలపాదమును గణవిభజనచేయఁ బై రీతిగాలేదు. అందేర్పడు గణములు— భ-భ-భ-ర-న-న-న-న-గ; ఒకభగణ మెక్కువయున్నది; లక్షణమున నదితక్కువయైనది. ఇందుఁబ్రౌసప్రథమదళమున లేదు. ఈవృత్తమున కథన్యూచిక లో నిట్లున్నది— "ఈలక్షణవునా-భం-నల్లిరువ లక్షణక్కె భిన్నవాగిదఁ (భమసభ నననగ).

ఒక్క తెనుఁగునందు మాత్రమే క్రౌంచపదము 24 ఛందము లోనిదయ్యెను. "జంటకందమును హరిగతిరగడను కలిపిబంధముగా చేర్చుటకీదేశిలో ఏకాక్షర లోపమత్యావశ్యకమగుచున్నది యనియు, సంస్కృతములోను కన్నడములోను 25

* Annals of Oriental Search - Madras University volume VI Part 2, 1941—42 లోఁ బ్ర

అక్షరములుగానున్న క్రౌంచము తెలుఁగులో 24 అక్షరముల క్రౌంచగతి గామాఱుటకు కారణమిప్పుడైనను విమర్శకులకు బోధపడకపోదనియు"- నన్నిచోడకవిచరిత్రలో శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు విరచించిరి. ఈయంశము పరిశీలింపఁదగినదిగానున్నది. సంస్కృతక్రౌంచమునఁగాని తెనుఁగుక్రౌంచమునఁగాని మాత్రాసంఖ్యలో భేదములేమిచే జంటకందము రెంటికిసరిపడును, చూడుఁడు.

తెనుఁగు క్రౌంచము—

ద్వారవతీ నా-థా సదు దా రా-తరుణధవళీకర-ధరనుత నామా

దీని నే కందమువలె వ్రాయనగు.

ద్వారవతీనాథా సదు

దారాతరుణ ధవళీకర-ధరనుత నామా.

పై క్రౌంచము కడపటి గగమును సగణముగాఁజేసిన సంస్కృత క్రౌంచమగు.

ద్వారవతీ నా-థా సమదారా-తరుణధవళీకర-ధరనుత మహిమా.

మాత్రాసంఖ్య మాఱదు ; ఇదియుఁ గందమునకు సరిపడును.

ద్వారవతీ నాథా సమ

దారా తరుణ ధవళీకర-ధరనుత మహిమా.

దీనింబట్టి కందము కుదురుటకై యేకాక్షరలోపము నావశ్యకమని తేలినది.

ఇఁక హరిగతిరగడ కొఱకై యీమార్పు జరిగెనాయని యాలోచింపవలయు.

నాలుగుమాత్రల గణములగు 'నల - గగ - భ - స'లు హరిగతి పాదమున కెనిమిదియుండును.

యతి నాలుగు గణములమీఁద - అనఁగా 16 లఘువులపై నుండును. అద్యంత ప్రాసలుగలవు.

'ఇతరుల కలవడ దని నృపలఘు యతి-నిభ నల గగ భసల నగును హరిగతి' (ఛందోదర్పణము)

సంస్కృతాంధ్ర క్రౌంచములకు రెంటికి హరిగతి సరిపడుచున్నది గదా ? ద్వారవ, తీనా, థాసమ, దారా, తరుణధ, వళీకర. ధరనుత, నామా (మహిమా).

తుదిగణము సంస్కృతమున సగణము, తెనుఁగున గగము ; రెండు రగడకు సరిపడును.

దీనింబట్టి యేకాక్షరలోపావశ్యకతకుఁ బ్రసక్తిలేదని తెల్లమగుచున్నది. నన్నిచోడండట్టి యభిప్రాయముగలవాఁడైనచోఁ బాదాద్యక్షరానుగుణయతి పెట్టియుండవలయు. అప్పట్టున నే రగడ యతిచెల్లును. తిక్కనాదుల క్రౌంచము హరిగతి రగడ యతికిఁబొసఁగుచున్నది, కాని నన్నిచోడుని యతినియమము (ప్రథమాక్షర సంబంధము లేక ద్వితీయదళ ప్రత్యేక యతినియతి) హరిగతిరగడగాఁ జదివినచోఁ బొసఁగనేరదు. ఒకవేళ మధురగతి రగడయగునేమోయని పరికించిన దానికిని బొందిపొసఁగకున్నది. ఎట్లన-హరిగతికి సగముమధురగతి పాదమునకు నాలుగుగణములు, రెండు గణముల పైయతి, ఆద్యంతప్రాసలుగలవు

'శ్రీవనితాధిపుఁ-జేరి భజింపుఁడు

భావజజనకుని-భక్తిఁదలంపుఁడు'

నన్నిచోడుని క్రౌంచమీ తెఱఁగున రచించిన నాదిప్రాసము, ప్రథమపాదయతి రెండు తప్పుచున్నవి.

చంచలనాస్వా-దించుచు లేఁదూం (యతిభంగము)

ఢ్లకరవు ప్రియలకు-నలఁదుచు మైరో (ఆది ప్రాసభంగము)

ఎటుచూచినను రెడ్డిగారు చెప్పినచొప్పు చొప్పడకున్నది. నన్నిచోడున కట్టియభిప్రాయమేయుండియున్నఁ బైక్రౌంచమును గర్భవృత్తముగా వ్రాసియుండును; పాదాద్యక్షరాను గుణయతి పాటించియుండును.

రెడ్డిగారు, ఈసందర్భమున 'హరిగతిరగడను రెట్టించినచో మధురగతిరగడయై' అనివ్రాసిరి. మధురగతి రెట్టించిన హరిగతియగునని తెలియునది.

'కదియతి నలభస-గగముల సంతతి

హరిగతిలో సగ-మగును మధురగతి'

అని చిత్రకవి పెద్దన లక్షణసారసంగ్రహము.

ఇందాఁకఁ బరామర్శించిన లక్షణముల నీదిగువ సంగ్రహించెద,

సంస్కృత క్రౌంచపదము- (25 ఛందము)

| గణములు | యతులు |
| --- | --- |
| 1. భ-మ-స-భ-న-న-న-న-గ | 5-5-8-7 |
| 2. భ-త-భ-ర-న-న-న-న-గ | 7-5-8-5 |
| 3. భ-మ-స-జ-న-న-న-న-గ | 5-5-7-8 |

కన్నడ క్రౌంచము (25 ఛందము)

| | |
| --- | --- |
| 1. భ-మ-స-భ-న-న-న-న-గ | 5 పైఁబ్రాస, 5-8 యతి |
| 2. భ-భ-భ-ర-న-న-న-న-గ | 7-5-8-5. (ఇందుఁబ్రాసలేదు) |

తెనుఁగు క్రౌంచము (24 ఛందము)

1. భ-మ-స-భ-న-న-న-య — 5 పైఁబ్రాస, 5-8 యతులు

( 5 పైఁబ్రాస యనఁగా 5 అక్షరములపై యతి యుండవలయును, దానికి మాఱు (తనీసములందువలెఁ బ్రాసయతియను యర్థము ప్రాసయతి యన్నది యత్యక్షరము తరువాత పాదద్వితీయాక్షర మావృత్తియగుట)

2. భ-మ-స-భ-న-న-న-య — 5-5-8 యతులు.

3, ,, ,, ,, — 10-8 ,,

4. ,, ,, ,, — 5-ప్రాస, 10-13 ప్రత్యేకయతి.

(పాదాద్యక్షరానుగుణయతి కాదనుట.

5. భ-మ-స-భ-న-న-స-స — 5 ప్రాస, 5-8 యతి

ఏవంవిధముగఁ గ్రౌంచలక్షణము భిన్నరీతులఁ గానవచ్చెను. తెనుఁగున నెవ్వరును 25 క్షరములు గల క్రౌంచము రచించినట్లు గానరాదు. భమసభననయ గణముల తోడి 24 అక్షరముల క్రౌంచము తిక్కనాదు లుపయోగించుటచే నయ్యది సర్వథా గ్రాహ్యము. కాని సంస్కృతానుసారము రచించుటయు సమీచనమే యగు. తెనుఁగు వారికి యతియతిగాఁ బరస్పరము భేదము పొడకట్టుచున్నది, తిక్కనాదులంబోలి 5 పైఁ బ్రాస, తర్వాత రెండుయతులుగాని, ఎఱ్ఱనాదులంబలె మూఁడును యతులుగాఁగాని, అప్పకవీయాదులమాదిరి రెండుయతులేగాని ఘటించి రచింపవచ్చును.

ఈ వృత్తమందే కాక యింకెన్నో వృత్తములందిట్టి భేదములు గానవచ్చెడు. వీనినెల్లఁ బర్యాప్తముగాఁ బరిశీలించి తెనుఁగు ఛందస్సర్వస్వము రచించుట తెనుఁగు లాక్షణికులకర్తవ్యమైయున్నది. ఇక్కార్యమునకుఁ బ్రాచీనలక్షణగ్రంథములన్నియు ముద్రితములుగావుట యావశ్యకము. సమగ్రగ్రంథచ్ఛందోరచనకు భాషాపోషకు లుదారులు తోడ్పడుదురు గాత.

 



# శ్రీ కాళిదాసుని కావ్యసూక్తులు.

శ్రీ విద్వాన్ సాహిత్యవిశారద, యస్. కె. బి, కృష్ణమాచార్యులు



1. సువర్ణము శ్రేష్ఠమయినది, కానిది, అగ్నియందు వేయుటవలనే తెలియఁబడుచున్నది.
2. మనుష్యుని సద్గుణములు, అన్నివిషయములందు, యోగ్యమైన స్థానమును, పొందుచున్నవి.
3. వినయమే మహాపురుషుల క్రోధమును శాంతింపఁజేయుసాధనము
4. సజ్జనులు మేఘములవలె నితరులకు నిచ్చుటకొఱకే తాము గ్రహింతురు.
5. అగ్న్యాతపముల స్పర్శచే జలము, ఉష్ణమగుచున్నది. గాని అది స్వభావముగ చల్లనిదే.
6. నక్షత్రములు, గ్రహములున్నను, రాత్రి చంద్రునివలననే ప్రకాశించుచున్నది.
7. సహజముగ మనుష్యునిమనస్సు పూర్వజన్మసంబంధమును దెలిసికొనఁగలుఁగుచున్నది.
8. కఠినమగు లోహముకూడ, అగ్నిజ్వాలలోఁ గరగుచున్నది. శరీరధారియగు మనుష్యునిగూర్చి చెప్పనేల ?
9. ఈశ్వరేచ్ఛచే విషమొకప్పుడు అమృతమగును. మఱొకప్పుడు, అమృతమే విషమగును.
10. మనుజులధర్మాచరణమునకుఁ బ్రధానకారణభూతులు త్తమస్త్రీలే.
11. అజ్ఞానులు తమప్రియజనుని మరణమును హృదయమందున్న కత్తివలెభావింతురు. జ్ఞానులు దానినే శుభద్వారముగఁ దలంతురు.

12. వాయువేగముచే వృక్షములు, పర్వతములు, రెండు కదిలినచో, వానిలో భేదమేమి కనఁబడును ?

13. పొలమున రగులుకొనిన, అగ్ని భూమినికాల్చియు, సస్యాభివృద్ధికిఁ దగుశక్తినినిచ్చుచున్నది.

14. పుణ్యాత్ములకోరికలు కల్పవృక్షమువలె శీఘ్రముగా ఫలించును.

15. సమయోచితముగఁ బ్రయోగించిన నీతియే సాఫల్యమును బొందుచున్నది.

16. యశోధనులకుఁ దమశరీరముకంటె యశస్సు మిక్కిలిప్రియమైనది. ఇఁకసుఖభోగసామగ్రినిగురించి చెప్పనదేమి?

17. గురువునాజ్ఞను, వృద్ధులయాజ్ఞలను, ఆలోచింపకయే గౌరవింపవలయును.

18. చంద్రుడు పరిపూర్ణముగ వృద్ధిపొందిన పిమ్మటనే క్షీణించును. సముద్రపు కెరటములుగూడ ఎగిరినపిదపనే తగ్గుచున్నవి.

19. తనహస్తములచే, నాటి పెంచిన విషవృక్షమునుగూడ తాను నఱకుట, యుచితముగాదు.

20. పెద్దలను దూషించువారేగాక వినువారలు గూడ పాపములను బొందుదురు.

# — విమర్శక లక్షణములు —

"సాహిత్యాచార్య" శ్రీ పిల్లలమఱ్ఱి వేంకట
హనుమంతరావు ఎం. ఏ.

ఏ భాషాసాహిత్యమైన విమర్శవలననే దీప్తిమంతము, బహుళ వ్యాప్తము, ప్రవర్ధమానము కాఁగలుగును. విమర్శకుని అందుచేతనే సాహిత్యోద్ధారకునిగా గణింపవలసియున్నది. విమర్శకుఁడనఁగా అయిన దానిని, కానిదానిని చెడతిట్టెడి పండితుఁడను భ్రమ యుండుటవలన లోకములో చాలకాలము వఱకు విమర్శకునకు గౌరవము లభింపక వచ్చినది. కాని విమర్శకుని బాధ్యత గురుతరమైనది; సాహిత్యార్ణవ కర్ణధారి కాఁదగిన అతనికి కొన్ని యుత్తమలక్షణము లనఁదగినవి లేక పోలేదు. ప్రాచ్యపాశ్చాత్య పండితులెండఱో ఆ యా సూత్రములను దక్షతతో విచారించియున్నారు.

విమర్శన మొక కళగా పాశ్చాత్యు లుపాసించినారు. ప్రాచ్యులు దాని నొక పాండితీవైభవముగా గమనించినారు. పాశ్చాత్య విమర్శకుల దృష్టి స్థూలమైనది (Comprehensive outlook). చారిత్రిక పరిశీలనము (Historical perception). సూత్రవిభజనము (Analytical treatment) తారతమ్య పరిశీలనము (Comparative study) వారి విశిష్టలక్షణములు. ప్రాచ్యవ్యాఖ్యాతలు నిశితదృష్టితో సూక్ష్మపరిశీలనము చేయువారు. వారిది యెక్కుడుగా శాబ్దికవిమర్శ ప్రామాణికదృష్టియు, ఈరెండు దృక్పథములకు సమన్వయము సాధించుకొను తలంపుతో విమర్శకలక్షణములను గ్రహింతము.

విమర్శకుఁడు కవి వలె ద్రష్ట; స్రష్టయున్ను. నవనవోన్మేష శాలిని అయిన ప్రజ్ఞ అతనికిఁ గూడ సహజముగా నబ్బునట్టిదే. లోక

శాస్త్ర కావ్యాద్యవేక్షణము చేత నతఁడును వ్యుత్పన్నుఁడు కావలెను. బహుకావ్య పఠనమువలన మనోముకురము విశదీభూతమగును. క్రమముగా తన్మయీ భావన యోగ్యత యతనికి చేకూరును. అప్పుడాతఁడు సహృదయుఁడగు చున్నాఁడు. అపుడు కవి చిత్రించిన భావములతోఁడను, పాత్రలతోఁడను, వర్ణనములతోఁడను పరిచయమేర్పడి, కవిహృదయ ప్రవేశము చేయకలిగి, ఆయా ప్రకరణములందు లీనమైపోఁగలిగి, రసానందానుభూతిని పొందఁగల్గును. ఇందులకు విమర్శకుఁడు కేవలము బుద్ధివైభవమును, శాస్త్రజ్ఞానమును మిక్కిలిగా పెంపొందించుకొన్నందువలన ప్రయోజనము పూర్తిగా సమకూడదు. వీనితో నాతఁడు తన హృదయకమలమును నవనవము, సుకుమారము, ఆర్ద్రీభూతము చేసికొని రసపిపాసువు, కళాశీలికావలెను. అనఁగా విమర్శకోత్తముఁడు హృదయములేని శుష్కపండితుఁడు కాఁడని తెలియవలెను. అట్లే తార్కికశక్తిలేని పండితుఁడు విమర్శక శిఖామణి కానేరఁడనుట తథ్యము.

శబ్దస్వరూపము-అర్థగౌరవము - భావగాంభీర్యము - ఆలంకారిక చమత్కృతి - రసపోషణము - శిల్పవ్యక్తి - మొదలైన విషయముల నన్నిటిని అతఁడెఱింగి యుండవలెను. అనఁగా లాక్షణిక సూత్రపరిజ్ఞానము విమర్శకుని కెంతయు నవసరమైనది. కేవల మాసూత్రముల నన్నిటిని వల్లెవేసిన పండితుఁడయిన ప్రయోజనము లేదు. అన్వయము చేయఁగల ప్రతిభావంతుఁడై యుండవలెను. అనగా లక్ష్య లక్షణ సమన్వయ శక్తిగలవాఁడు కావలెనన్నమాట! అంతటి శక్తిసంపన్నుఁడైనవాఁడు అనహంకారిగానుండఁజాలఁడు. అహంకారి అయినవాఁడు, విమర్శనమునకుఁబూనుకొనరాదు. అట్టివాని విమర్శ దోషైకదృష్టితోఁగూడినట్టిదగును. లేకపోయిన స్వీయపాండితీప్రకర్షతో నిండియుండును. వైయక్తికాభిరుచులకెక్కువస్థానములభించును. కేవల వైయాకరణిఅయినచో శాబ్దికచర్చలతో, సాధుత్వాసాధుత్వ విచారముతో తలనొప్పికలిగించును. కనుక విమర్శకుఁడు తానెంతటి విద్వన్మణి

అయినను వినయ శీలముకలిగి కవిని కావ్యమును ఆదరముతో నరయు గల్గు సహనము, సహృదయత్వముల నలవఱచుకొనవలసియున్నది.

కావ్యమందు దేశకాల పాత్రలనెఱిఁగి సాహితీ విమర్శచేయ నొప్పునేకాని విమర్శకుఁడు తనకాలమునాఁటి సులోచనములతో, నాఁటి యభిరుచులతో, కొలబద్దలతో పరిశీలింపరాదు. కవి ప్రతిపాదించినభావము లనాతఁడుపయోగించిన శబ్దములనుండి గ్రహింపప్రయత్నము చేయవలె నేకాని విమర్శకుఁడు తన యూహలను, తనపాండితిని జొనిపి యితర ములఁ బ్రదర్శింపరాదు. మల్లినాథుఁడు వ్యాఖ్యానకర్తగా పూనిన ప్రతిజ్ఞ తాదృశమైనది. మూలమందులేని దానిని స్పృశింపక మూలమునే యనుసరించి యందలి వెలుఁగు జిలుగులను తీరుతీయములను, విమర్శించు టయే - లెస్సగా విచారించుటయే - విమర్శక లక్ష్యమై యుండవలెను.

చారిత్రికదృష్టి, తారతమ్య పరిశీలనము, విమర్శకున కెంతేని యవసరములు. వీనితో అనుకృతులు-మాతృకలు-వాని ముందువెను కలు-నిర్ణయింప ననుకూలించును.

పరిచయకర్తగా-గుణగ్రహణ పారీణుఁడుగా - వందిగా-వ్యాఖ్యా తగా - న్యాయమూర్తిగా-విషయవివేచనమునుండి రసాభివ్యక్తి వఱకు గల వివిధస్థితులతోను సామాన్యపాఠకుని నడిపించి, శిక్షణ మొసఁగి అల రించి, ఆనందమును పంచి యమృతత్వ స్థితికల్గించునట్టి యుత్తమదార్శని కుఁడే విమర్శకుఁడు. అంతటి యధికారము, అపరిమత్తత లున్న వాఁడే హ్లాదైకమయము, నవరసరుచిరమయిన మధురజగత్తును సృజింపఁగల సమర్థుఁడు కాఁగల్గును. అట్టి విమర్శకుఁడు కవివలె ప్రజాపతిత్వము పొంది సమ్మానము నందఁగలఁడు; సాహిత్యగహనమున రాచబాట లను వేయఁగలఁడు!

---

# గ్రంథ విమర్శ

(1) శ్రీ కబీరుచరిత్రము. [పద్యకావ్యము] గ్రంథకర్త శ్రీ దండా నరసింహాకవి. ప్రాప్తిస్థానము : శ్రీ దండా నరసింహాకవి; చిన్నబజారు బరంపురం, గంజాంజిల్లా వెల రు 2. డెమ్మీ సైజు పుటలు. 160.

ఇది మూఁడాశ్వాసముల పద్యకావ్యము. భారతదేశభక్తులలో నగ్రగణ్యుఁడగు కబీరుచరిత్రము-చక్కని ధారాశుద్ధిగల కావ్యముగా సంతరించిన శ్రీకవిగారు స్తవనీయులు. వీరికవిత ప్రశస్తమగు పూర్వ పద్ధతిని-జాలవఱకు నిర్దుష్టముగా నడచినది. ఆయాతావుల వర్ణనములు మనోహరములై మంజులముగ నడచినవి. పూర్వకవుల ధోరణులను బుణికిపుచ్చుకొని కవిగారీకావ్యమును భక్తిరసప్రధానముగా వివరించి యున్నారు. ఇది భక్తులెల్లరును జదువఁదగినకావ్యము

(2) శ్రీ వేంకటేశ్వరస్తుతి రత్నమాల కూర్పరి. కీ॥శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రి. ప్రాప్తిస్థానము. శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనా లయము, తిరుపతి వెల 1-2-0 డెమ్మీసైజు 76 పుటలు.

నృసింహపురాణము, కవికర్ణరసాయనము, కళాపూర్ణోదయము, పరమయోగి విలాసము, చంద్రభాను చరిత్ర మున్నగు ప్రాచీన ప్రసిద్ధ గ్రంథములనుండి శ్రీ వేంకటేశ్వరస్తుతి పద్యరత్నములను కీ. శే. ప్రభాకరశాస్త్రిగారు సేకరించి గతించిరి. అవి యిప్పుడిట్లు ప్రకటితములు. దీనికిఁ జివర శ్రీ ప్రభాకరశాస్త్రిగారు రచించిన పద్యములును గొన్ని కలవు. శ్రీ వేంకటేశ్వర స్తుతి ప్రియులగు భక్తులెల్లర కివి పారాయణ యోగ్యములు. ఈ సంకలిత గ్రంథమును బ్రకటించిన ప్రాచ్యపరిశోధ నాలయమువారు నిరంతరాయముగ నిట్టి యుద్గ్రంథములను బ్రకటించు చుండుట ముదావహము.

(3) తాళ్లపాకవారి గేయరచనలు. ఆఱవ సంపుటము. ఆధ్యాత్మ సంకీర్తనలు. అన్నమాచార్య రచితములు. ఉదయగిరి శ్రీనివాసాచార్య పరిశోధితము. ప్రాప్తిస్థానము: శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్ ఇన్స్టిట్యూట్, తిరుపతి. వెల: రు 2-0-0.

గేయవాఙ్మయ చరిత్రమున శ్రీ తాళ్ళపాక వారి కద్వితీయస్థానము కలదు. ఇదివఱలో అన్నమాచార్యుల శృంగార వైరాగ్య కీర్తనలు ప్రకటించిన ప్రాచ్యపరిశోధనాలయమువా రిపుడీ యధ్యాత్మ సంకీర్తనలు వెలయించి ఆంధ్రగేయ సాహిత్యమునకు వెలలేని సేవచేసినారు. గ్రంథము చివర సంకీర్తనలకే కాక రాగములకుగూడ అకార క్రమమున పట్టికల నిచ్చియున్నారు.

(4) Prasnopanishad Bhashya. Edited with Introduction, Notes and translation by Dr. K. C. Varadachari, M. A., PH. D., and D. T. Tatacharya, Siromani, M. O. L. Published by the Venkateswara Oriental Institute, Tirupati. Price: Rs. 2-12-0.

(5) అనుభవ వైద్యము. ఆయుర్వేదాచార్య, ములుకు విశ్వేశ్వరశాస్త్రిగారు సంపాదించినది. గవర్నమెంటు ఓరియంటల్ మ్యానుస్క్రిప్టు లైబ్రరీ, చెన్నపురి వారు ప్రకటించినది. వెల: 6-0-0.

ఇది చక్కని కాగితములపై మనోహరముగ ముద్రితమైన అమోఘమగు వైద్యశాస్త్ర గ్రంథము. దీని సంపాదకులు: 'ఇది చెన్నపురి పరిసరప్రాంతములందు నివసించిన యొక వైద్యవరుని చేతి పుస్తకము (Diary) అని నాకు తోచినది' అని వ్రాసిరి. ఏమైనను ఇందుసుమారు 1200 యోగములు కలవు. వీని నన్నిటిని అనుభవస్థులగు వారివద్ద గ్రంథకర్త సేకరించినట్లు స్పష్టముగా తోచుచున్నది. కొన్నికొన్ని యోగములు తా నెవరివలన విన్నవియు గ్రంథకర్త అటునటు నిచ్చియుండుటే యిందులకు సాక్ష్యము. ఈ యుత్కృష్ట గ్రంథము వైద్య శాస్త్రజ్ఞులకు సామాన్యులకుగూడ నుపయుక్తమనుటలో సందేహములేదు. కాని,

సంపాదకులన్నట్లు ఈ యోగములు ముందు తగు వైద్యులు పరిశోధన చేసియే రోగులకు వాడుట మంచిది. ఇందు గ్రంథకర్త అటనటవాడిన అఱవ పదములకు గ్రంథాంతమున తెలుగు పర్యాయ పదములు చూపఁ బడినవి. చివర విషయసూచికయు, తప్పొప్పుల పట్టికయుఁ గలవు. ఇట్టి యుత్కృష్ట వైద్యగ్రంథమును ఒరిశోధింపించి ప్రకటించిన ప్రకాశకు లెంతయు నభినందనీయులు.

(6) అభినయదర్పణము. కర్త: లింగముగుంట మాతృభూతయ్య ప్రకాశకులు. గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ, చెన్నపురి. సంపాదకులు సంగీతకళానిధి, శ్రీ టి. వి. సుబ్బారావు, బి.ఏ.,బి.యల్., వెల: రు 1-12-0.

ఇది ప్రాచీన కావ్యరూపమునఁ గల సంగీత లక్షణ గ్రంథము. ఈ గ్రంథమును గూర్చియుఁ గవినిగూర్చియు సంపాదకులు చిన్న పీఠిక వ్రాసియున్నారు. నాట్యశాస్త్రమునకుఁ దలమానిక మగు నీయభినయ శాస్త్రము. 103 పద్యములలోఁ గూర్పఁ బడుట మిగులఁ బ్రశంసనీయము. కవితయుసరసముగను సరళముగను నడచినది. అభినయ సంగీతాభిమాను లెల్లరు తప్పక చూడవలసిన గ్రంథ మిది.

(7) శైవాచార సంగ్రహము. తిరుమలనాథ కవికృతము. విద్వాన్ గంటి జోగిసోమయాజిగారు పరిశోధించినది. వెల: రు 2-0-0.

దీనిని బ్రకటించినవారు మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీవారు.

ఇది మూఁడాశ్వాసముల పద్యకావ్యము. వివిధ శైవగ్రంథము లందుఁజెప్పఁబడిన శైవాచారముల నన్నిటిని సంగ్రహించి శైవుల నిత్య కృత్య పూజావిధానమున కనుగుణముగా నుండునట్లీ గ్రంథముఁ వ్రాయ బడినది. కవిని గురించియుఁ గాలమును గుఱించియు ఈ గ్రంథప్రాశస్త్య మును గుఱించియు శ్రీ సోమయాజిగారు చక్కని పరిశోధనపూర్వక మగు పీఠిక దీనికి వ్రాసియున్నారు. ఇది కేవలము మతదృష్టితో రచింపఁ

బడినదైనను కవిత్వము పేలవముగాలేదు. చెప్పుకోతగ్గ మహాకవిత్వము గాదు. సంసారపక్షముగానున్నది.

(8) శ్రీ మదాంధ్రరామాయణోత్తరకాండ లేక సీతావిజయము. కర్త : దేవళ్ళ కృష్ణారాయ చౌదరి. గ్రంథకర్తయే ప్రకాశకుఁడు, తాటిపాక, రాజోలు తాలూకా. వెల : రు 3-0-0.

ఇది నాలుగాశ్వాసముల చక్కని పద్యకావ్యము. కవిత్వము నిర్దుష్టము. మంజులమునను. కుంభకర్ణ రావణాదుల చరిత్రలు, అంబూత్తరుని కథ, సహస్ర శీర్షాస్రవ చరిత్ర. విభీషణ పట్టాభిషేకము మున్నగు నద్భుత గాథలెన్నియో యిందున్నవి. ఎల్లరు చదువఁదగిన మహా గ్రంథము.

(9) ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము. [సంజ్ఞా సంధి తత్సమాచ్ఛిక పరిచ్ఛేదములు.] మొదటి సంపుటము.
గ్రంథకర్త: కళాప్రపూర్ణ శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు. ప్రకాశకులు : ఆంధ్ర విశ్వ విద్యాలయము, వాల్తేరు. వెల : రు 25-0-0.

(10) కిన్నెర : మాస పత్రిక. సంపాదకులు : పందిరి మల్లికార్జున రావు, పందిరి మీరాబాయిగారలు. 16 జోన్సు వీధి, మద్రాసు 1. విడి సంచిక వెల : 8 అ.

---

# కాకినాడ - ఆంధ్రసాహిత్యపరిషత్తులో

## వెలకు దొరకు గ్రంథములు

| | | |
|---|---|---|
| 1. | ము - వచనము - సముఖము<br>వేంకటకృష్ణప్పనాయకుడు | 1-8-0 |
| 2. | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము<br>జి. రామయ్యపంతులుగారు బి.ఎ. బి ఎల్. | 1-0-0 |
| 3. | స్మృతిశాస్త్రసారము<br>కపిస్థలం కృష్ణమాచార్యులుగారు | 0-8-8 |
| 4. | జ్ఞానప్రసూనాంబికాశతకము | 0-4-0 |
| 5. | సర్వేశ్వరశతకము - యథావాక్కుల అన్నమయ్య | 0-400 |
| 6. | ఆరాధ్యముద్రితగ్రంథసూచిక | 0-8-0 |
| 7. | ప్రాకృత భాషోత్పత్తి - శ్రీమాన్ మేడేపల్లి<br>వేంకటరమణాచార్యులుగారు | 0-11-0 |
| 8. | శివతత్త్వసారము - మల్లికార్జున పండితారాధ్యులు | 1-0-0 |
| 9. | చంద్రభానుచరిత్రము - తరిగొప్పుల మల్లనకవి | 1-0-0 |
| 10. | శివరాత్రిమాహాత్మ్యము - శ్రీనాథ మహాకవి | 1-0-0 |
| 11. | ఆర్యభాషావిభాగము - శ్రీమాన్ మేడేపల్లి<br>వేంకటరమణాచార్యులుగారు | 0-8-0 |
| 12. | ప్రాస్వరంగములు - కొత్తపల్లి సూర్యరావుగారు | 0-8-0 |
| 13. | మన్నారు దాసవిలాసనాటకము - రంగాజమ్మ | 0-12-0 |
| 14. | కాళిందీ కన్యాపరిణయము (ప్రథమభాగము)<br>అహోబలపతి | 1-0-0 |
| 15. | డిటో ద్వితీయభాగము | 0-8-0 |
| 16. | రెడ్లనాటి రెండుశాసనములు | 0-8-0 |

| | |
|---|---|
| 17. ఆంధ్రధాతుమాల | 1-0-0 |
| 18. శాసనపద్యమంజరి - జయంతి రామయ్య పంతులు బి.ఎ. బి.ఎల్. | 1-0-0 |
| 19. శాసనపద్యమంజరి (ద్వితీయభాగము) | 0-8-0 |
| 20. శతకసముచ్చయము (మొదటిభాగము) | 1-0-0 |
| 21 డిటో (ద్వితీయభాగము) | 1-0-0 |
| 22. పరిషత్పుస్తకభాండాగారము (ద్వితీయభాగము) | 1-0-0 |
| 23. సూత్రాంధ్రవ్యాకరణము - చిన్నయసూరి | 0-12-0 |
| 24. రసాభరణము - అనంతకవి | 0-12-0 |
| 25. షోడశకుమారచరిత్రము - వెన్నెలకంట అన్నయ్య | 1-0-0 |
| 26. హంససందేశము (తెలుగుపద్యములు) కల్లూరి వేంకటరామశాస్త్రిగారు | 0-2-0 |
| 27. రామవాచకము - విశ్వనాథనామని స్థానపతి | 1-0-0 |
| 28. సింహాసనద్వాత్రింశిక (ప్రథమభాగము) కొఱవి గోపరాజకవి | 1-0-0 |
| 29. డిటో (ద్వితీయభాగము) ,, | 1-0-0 |
| 29. నిఘంటుచరిత్రము-శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులు | 0-8-0 |
| 30. ఆంధ్రకౌముది-గణపవరపు వేంకటపతికవి | 0-12-0 |
| 31. బాలభారతము-(అగస్త్యకృతమునకుఁ దెలుఁగు ... కొత్తపల్లి సూర్యరావుగారు | 1-8-0 |
| 32. Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు బి ఏ. బి ఎల్. ... | 0-8-0 |
| 33. Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు ,, ... | 0-8-0 |

| | | |
|---|---|---|
| 34. | చాటుధారాచమత్కారసారః-(సంస్కృతము) | 0-8-0 |
| 35. | సాంబోపాఖ్యానము-రామరాజు రంగప్పరాజు | 1-0-0 |
| 36. | రసార్ణవాలంకారము-ప్రకాశవర్షకవి | 0-8-0 |
| 37 | కవిజనోజ్జీవని-సమస్యలు-శ్రీ కోట రఘునాథ తొండమాన్ మహీపాలుఁడు | 0-4-0 |
| 38. | రఘునాథరామాయణము (ప్రథమభాగము) రఘునాథభూపాలుఁడు | 0-12-0 |
| 39. | రజతోత్సవసంపుటము (ఆంధ్రసాహిత్యపరిషత్తు) | 1-8-0 |
| 40. | అరవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము అక్కిరాజు ఉమాకాంతముగారు | 0-4-0 |
| 41. | లౌకికన్యాయవివరణము- శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | 0-12-0 |
| 42. | ఉత్తరరామచరిత్రము-జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ. బి. ఎల్. | 1-8-0 |
| 43. | అమరుకము-సాంధ్రము- జయంతి రామయ్యపంతులుగారు | 1-0-0 |
| 44. | చంపూరామాయణము-(ఆంధ్రము) జయంతి రామయ్యపంతులుగారు ,, | 1-0-0 |
| 45. | ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి జయంతి రామయ్యపంతులుగారు ,, | 1-8-0 |
| 46. | ఉన్మాదసహస్రము, (వేయిపద్యములు) వెఱ్ఱికి వేయివిధములు శ్రీ. సూర్యరావుగారు | 0-12-0 |

47. నీతిభవనము, ,, ,, ... 0-4-0

48. నమస్కారములు ,, ,, ... 0-4-0

49. సీతారామచరిత్రము-బాలకాండము } మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి ... 0-12-0

50. లక్షణసారసంగ్రహము ... 1-0-0

51. కావ్యాలంకారచూడామణి పాఠభేదములు ... 0-8-0

52. పరిషత్పుస్తకభాండాగారము III భాగము ... 1-0-0

— పిఠాపురము మహారాజావారి ప్రచురణములు —

1. ఆంధ్రసూత్రభాష్యము 4 సంపుటములు } పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు ... 8-0-0

2. ధర్మఖండము-ఈదులపల్లి భవానీశకవి } (రెండుభాగములు) .. 2-8-0

3. విష్ణుమాయానాటకము-చింతలపూడి ఎల్లనార్యుఁడు 1-8-0

4. పరమయోగివిలాసము-(ద్విపద) తాళ్లపాక } తిరువేంగళనాథుఁడు .. 1-4-0

5. కళాపూర్ణోదయము-పింగళి సూరనార్యుఁడు } శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారిచే పరిష్కరింపఁబడినది. ... 2-8-0

6 యతిరాజవిజయము-దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి ... 0-10-0

7. రామచంద్రోపాఖ్యానము-వారణాశి వేంకటేశ్వరకవి 1-0-0

8. భద్రాపరిణయము-అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి ... 1-4-0

9. శ్రీపీఠికాపురసంస్థానచరిత్రము-శ్రీరామ వీరబ్రహ్మకవి ... 1-4-0

10. రామరాయవిలాసము-దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి ... 0-12-0

11. మహేంద్రవిజయము- ,, ,, ... 1-0-0

12. Life of Pingali Surana-Tekumalla Achutarao 2-0-0

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

## ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ శ్రీ మహారాజశ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యా రావు బహద్దరువారు సి.బి.ఇ. డి.లిట్ పిఠాపురం మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు)

## అధ్యక్షులు.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసమ్రాడిత్యాది బిరుదాంకితులగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

## కార్యదర్శులు:

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ., బి. యల్.

సాహిత్య శిరోమణి, ఉభయభాషాప్రవీణ,
శ్రీ చతుర్వేదుల సత్యనారాయణగారు ఎం. ఏ., బి. ఓ. యల్.

## కోశాధ్యక్షులు:

శ్రీ క్రతివాది భయంకర పార్థసారథిగారు, బి. ఎ., యల్. యల్. బి.

శ్రీ పరేశ్వరపు వేంకటరమణ సుబ్బారావుగారు, బి. ఏ, బి. యల్.,

## కార్యనిర్వాహక సభాసభ్యులు:

శ్రీ పురాణం భక్తియన్నారాయణుడుగారు, ఎమ్. ఏ., యల్. టి.
,, కోశా శివనాథశాస్త్రిగారు
,, కొమ్మిరెడ్డి కేశవ రామమూర్తినారాయణుడుగారు, బి. ఏ.
,, రావుసాహెబ్ మాదిరెడ్డి సీతారామయ్యనారాయణుడుగారు బి. ఏ, బి. ఎల్.
,, వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు, ఎం. ఏ, (ఆనర్సు)
,, ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.
,, ఎండమూరి వేంకటరమణగారు, ఎమ్. ఏ., బి యిడి.
,, బులుసు వేంకటేశ్వరులుగారు, బి. ఏ.
,, సాహిత్యవిద్యా-భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
,, బండారు తమ్మయ్యగారు.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

కాకినాడ



"దేశభాషలందుఁ దెలుఁగు లెస్స"

సంపుటము ౪౦

సంచిక ౪-౬

# సంపాదక వర్గము.

ప్రధానసంపాదకుఁడు:

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. యల్.

సహాయ సంపాదకులు:

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు ఎం. ఏ.
శ్రీ విద్వాన్ వేదుల రామచంద్రకీర్తిగారు ఎం. ఏ. ఆనర్సు బి ఇడి.
శ్రీ విద్వాన్ బులుసు వేంకటేశ్వరులుగారు, బి. ఏ.
శ్రీ సాహిత్యవిద్యా, భాషాప్రవీణ. చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
శ్రీ బండారు తమ్మయ్యగారు.



# విషయసూచిక.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## కాకినాడ



దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.

సంపుటము ౪౦ | సంచిక ౪-౬

శ్రీ

# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్త్రిక

## కాకినాడ

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

( Journal of the Telugu Academy )

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయీలు.

సంపుటము. ౪౦. { ఖర / అశ్వయుజ - ఫాల్గుణములు. } సంచిక ౪-౬.

## ఖరసంవత్సర విషయసూచిక.

# సంపాదకీయము

ఈపరిషత్పత్త్రిక నెంతత్వరలోఁ బ్రచురింపఁ దలంచినను అని వార్యమైన యంతరాయములచే నాలస్యమైనందులకుఁ బాఠకులు మన్నింతురుగాక. మా పరిషత్తునందలి యపారాభిమానముచేఁ గడచిన మైదువత్సరముల ఆయవ్యయముల సరిచూచి యీసంవత్సర మాదాయ వ్యయముల నెట్టి ప్రతిఫలాపేక్షయు లేక యత్యుదారతతోఁ బరిశీలించిన శ్రీద్రోణంరాజు కామేశ్వరరావు (చార్టర్డు అక్కౌంటంటు) గారికి, ఈవిషయమున వారి కన్నివిధములఁ దోడ్పడి మానుండి ప్రతిఫలమునే మాత్రము నపేక్షింపని శ్రీచిల్లూరి విశ్వేశ్వరరావుగారికి, శ్రీమైలవరపు వెంకటరత్నము, బి.ఏ., బి. కామ్. గారికి మాహృదయపూర్వక వందనముల సమర్పించుచున్నాము.

అడిగినదే తడవుగా నలతికాలములో "స్వప్న వాసవదత్త" యను భాసకృతి ననువదించి యిచ్చి పరిషత్తునకమోఘమైనసేవగావించిన శ్రీమధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారికి, శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారికిని మాహృదయ పూర్వక వందనముల నర్పించు చున్నాము.

మాపరిషత్తునందలి నిరంతరాభిమానముచే నెన్నోవిధములఁ దోడ్పడి దానియభివృద్ధికిఁ గారణభూతులైన శ్రీమతి ప్రభల వెంకట సుబ్బమ్మ, శ్రీపురాణం భద్రయ్యనాయఁడుగార్ల మృతికి హృదయ దాహకమగు సంతాపమును వెలిఁబుచ్చుచున్నాము.

## శ్రీమతి ప్రభల వెంకటసుబ్బమ్మగారు

ఈమె సుప్రసిద్ధులగు జయంతి రామయ్యపంతులుగారికి సోదరి; విశాఖపట్టణములో న్యాయవాదిగను, సాలూరు ఎస్టేటు దివానుగను ఖ్యాతిఁజెందిన ప్రభల సుందరరామయ్యగారి ధర్మపత్ని. ఉద్యోగము నుండి విశ్రాంతి నొంది ధవళేశ్వరమున నివసించుచుండ, సుందరరామయ్యగారు కాలధర్మమందిరి. లేకలేక కల్గిన ఒక్క పుత్రుఁడును పుత్రికయు అంతకుమున్నే గతించిరి. దంపతు లిరువురును విద్యావంతులు, సాహిత్య

ప్రియులు, తమ సర్వస్వమును లోకారాధనకై వినియోగింప, కృత నిశ్చయులు. వెంకటసుబ్బమ్మగారికి సమగ్రమగు పాండిత్యమేగాక, తెనుఁగునఁ గవితాధోరణికూడఁ గలదు.

ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు, తిరుపతి వేంకటేశ్వర ప్రాచ్యవిద్యా సంస్థకు, రాజమహేంద్రవరమున క్షయరోగ చికిత్సాశ్రమమునకు భూరి విరాళముల నిచ్చియున్నారు. దేవాలయములకు, మందిరములకు, ధర్మ శాలలకును విశేషసాహాయ్యము చేయుచుండెడివారు. ఆర్తులకు,విద్యా ర్థులకు, నెన్నఁడును లేదనుటయే యెఱుఁగరు.

ఆంధ్రసాహిత్యపరిషత్తునకు స్థిరవాసములేని కొఱఁతఁదీర్ప సంక ల్పించుకొని, భవననిర్మాణముఁ జేయించి, 1946 లో శ్రీశ్రీ జయపురా ధీశ్వరులగు శ్రీవిక్రమదేవవర్మగారి యాధిపత్యమున,ఆంధ్రవాణి కర్పిం చిరి. ఆనాఁటి సభకేతెంచిన పండితుల నెల్ల యథోచితముగ సత్క రించి, విద్వాంసులయెడ తమకుఁ గలయాదరాభిమానముల వెల్లడించిరి.

పెండ్లిండ్లు చేసికొందు మనియు, బహుకుటుంబికులమనియు, ఆయమ నర్థించి, రిక్తహస్తములతో వెడలినవారు లేరు.

అడిగినంతయు నిచ్చువారు కలరు. ఏదే నొక కార్యమునకుఁ బట్టినదంతయు నిచ్చువారు గలరు; కాని తమకుఁగల సర్వస్వమును దాన ధర్మములకు వినియోగించెడివా రరుదు. తాము స్వయముగఁ జేసిన ధర్మములతోఁ దృప్తినొందక, వారి జీవితాంతమున నిల్చియున్న ఆస్తిలో ఆంధ్రసాహిత్యపరిషత్తున కాఱువేల రూప్యములను హరి జనసేవకసంఘ యాజమాన్యమున కాకినాడలో నున్న హరిజన వసతిగృహమునకు ఆఱువేల రూపాయలును చెందునట్లును, మరణశాస నము వ్రాయించి యుంచిరి. ఎనుబదేండ్లకు పైఁబడిన ప్రాయమున 26-5-52 ని, ఈ జగత్కుటుంబిని భర్తృసాన్నిధ్యమునఁ జేరిరి. వారి యాత్మకు శాంతి కల్గుఁగాక !

---

## పురాణం భద్రియ్య నాయఁడుగారు

వీరి జన్మస్థానము కిర్లంపూడి. పీఠికాపురియందలి యున్నత పాఠశాలాధ్యక్షులగు శ్రీకూచి నరసింహము పంతులుగారి వాత్సల్యమున మెలఁగి వీరు మొదటిఫారము మొదలు మెట్రిక్యులేషను వఱకు విద్య నభ్యసించిరి. అనంతరము స్థానికమైన శ్రీపీఠికా పురాధీశ కళాశాలలో శ్రీబ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నము నాయఁడుగారి పాదపీఠముకడ యఫ్. ఏ. లో నుత్తీర్ణులైరి. పిమ్మట మదరాసు క్రిష్టియన్ కళాశాలలో డాక్టరు స్కిన్నరుగారికిఁ బ్రియశిష్యులై బి. ఏ. ఆనర్సు నందుఁ బ్రథమ శ్రేణిలో నుత్తీర్ణులై యాకళాశాలలోనే మొదటి యుద్యోగమున బి. ఏ. విద్యార్థులకు విద్యగఱపిరి. అటుతరువాత ప్రభుత్వ కళాశాలలో నుప న్యాసకపదవి నధిష్ఠించిరి. అచట నుపన్యాసకపదవి మొదలు క్రమక్రమముగ విద్యాపతి (Director of Public Instruction) వఱకుఁగల యున్న యుద్యోగములు చేసి తమబోధకతా శక్తియందు, పరిపాలన దక్షత యందు, సౌశీల్యమునందు నసమాన విఖ్యాతినందిరి. ప్రభుత్వోద్యోగ విరామసమయమున శ్రీశ్రీశ్రీ పీఠికాపుర మహారాజులుంగారి కోరికను బాలించుచు స్థానిక కళాశాలకు నధ్యక్షులుగా నుండిరి. ఆసమయమున శ్రీశ్రీశ్రీ మహారాజులుంగారు వీరిని పరిషత్కార్య నిర్వాహకసభ్యునిగా నియమించిరి. నాఁటినుండి వీరు పరిషత్తునెడఁ జూపిన యాదరాభిమానము లమోఘములు. వీరి యాదరణమువలననే 2-2-1951 తేదీ జరిగిన సంగీత నృత్యసభ జయప్రదమై పరిషదార్థికస్థితి కొంతకుదుటఁబడుటకుఁ గారణమయ్యెను. వీరిమరణముచే బరిషత్తున కొక యధినేతయు నవలంబనమును గతించెను. పరలోకమున వీరవ్యయానందముల నందుదురుగాక !

---

# 1951—52 ఖరనామ సం॥ర ఆదాయ వ్యయ పట్టిక

| | | |
|---|---|---|
| సంవత్సరాది నిలువ | | 337- 1-11 |
| బ్యాంకినుండి వడ్డి | | |
| శ్రీ వేంకటగిరి మహారాజావారి గవర్నమెంటు పత్రముమీాద వచ్చిన వడ్డి. | 450- 0-0 | |
| శ్రీ బొబ్బిలి మహారాజావారి గవర్నమెంటు పత్రముమీాద వచ్చిన వడ్డి | 400- 0-0 | 850- 0- 0 |
| పత్రిక చందాదార్లు | | 149- 0-0 |
| బదుళ్లు, చిల్లర ఆదాయములు, | | |
| తెచ్చినవి | 270-12-0 | |
| బెనిఫిట్ పెర్ఫార్మెన్సువల్ల | 3,008-0-0 | 3,278-12-0 |
| పుస్తకవిక్రియము | | 1,642- 6-9 |
| | | 6,257- 4-8 |

1951—52 ఖరనామ సం॥ర ఆదాయ వ్యయపట్టిక.

| | | | |
|---|---|---|---|
| బ్యాంకివ్యయము | | 2-14-0 | |
| డిస్కవుంటు | | | |
| డిపోజిట్టులు | | | |
| ఆంధ్రాబ్యాంకి | 1,687-14-0 | | |
| ఇంపీరియల్ బ్యాంకి | 367- 1-7 | 2054-15-7 | 2057-13-7 |
| బదుళ్లు తీర్చినవి | | | 1,763-8-0 |
| పోష్టువ్యయములు | | | 28- 1-6 |
| ఉద్యోగుల జీతములు | | | 1,110- 0-0 |
| ఉద్యోగుల ప్రయాణవ్యయములు | | | 41- 1-0 |
| పత్రికకాగితము, ముద్రణము | | | 512- 2-0 |
| చిల్లర బైండింగు | | | 51- 3-0 |
| నిఘంటు బైండింగు | | | 369-12-0 |
| పత్రికలకు చందాలు, కొనిన పుస్తకములు | | | 159-13-6 |
| సాదరు | | | 62- 8-0 |
| చిఠా నిల్వ | | | 101- 6-1 |
| | | | 6,257- 4-8 |

శ్రీ సాహిత్యపరిషత్తువారికి,

యీపైపట్టికలు పరిషత్తువారిచే వుంచబడిన లెఖలతోను, ఓచర్లతోను సరిచూచి తయారుచేసినాను. అచ్చొత్తించిన పుస్తకముల నిల్వ తేల్చవలసియున్నది. చందాదార్లయొక్క బాకీలు తేల్చవలసియున్నది. ఈ సూచనలకు లోబడి యీపై పట్టిక సక్రమముగా యున్నదని చెప్పగలను.

కాకినాడ,
28—8—52.

ద్రో. కామేశ్వరరావు,
చార్టడ్డు అక్కవుంటెంటు.

# పుస్తక విక్రయము

| | | |
|---|---|---|
| 1. | అకారాద్యముద్రితగ్రంథసూచిక | 1- 14-0 |
| 2. | అమరుకము - ,, జయంతి రామయ్యపంతులుగారు | 5- 9-6 |
| 3. | అఱవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము అక్కిరాజు ఉమాకాంతముగారు | 1- 6-0 |
| 4. | ఆర్యభాషావిభాగము - శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | 3- 4-3 |
| 5. | ఆంధ్రధాతుమాల | 4-14-3 |
| 6. | ఆంధ్రకౌముది - గణపవరపు వేంకటపతికవి | 4- 2-3 |
| 7. | ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి జయంతి రామయ్యపంతులుగారు ,, | 12- 6-3 |
| 8. | ఉత్తరరామచరిత్రము - జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ. బి. ఎల్. | 4- 0-0 |
| 9. | ఉన్మాదసహస్రము, (వేయిపద్యములు) వెఱ్ఱికి వేయివిధములు క్రో. సూర్యరావుగారు | 0-12-0 |
| 10. | కవిజనోజ్జీవని-సమస్యలు-శ్రీకోటి రఘునాథ తొండమాన్ మహీపాలుఁడు | 0-15-9 |
| 11. | కావ్యాలంకారచూడామణి పాఠభేదములు | 0- 8-0 |
| 12. | కాళిందీ కన్యాపరిణయము (ప్రథమభాగము) అహోబలపతి | 14-15-3 |
| 13. | డిటో ద్వితీయభాగము | 5- 7-0 |
| 14. | చంద్రభానుచరిత్రము - తరిగొప్పుల మల్లనకవి | 19- 4-6 |
| 15. | చంపూరామాయణము - (ఆంధ్రము) జయంతి రామయ్యపంతులుగారు ,, | 1- 0-0 |
| 16. | చాటుధారాచమత్కారసారః- (సంస్కృతము) | 1- 8-0 |
| 17. | జ్ఞానప్రసూనాంబికాశతకము | 0- 4-0 |
| 18. | జైమినీభారతము- వచనము - సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు | 102- 3-3 |

19. జ్యోతిశ్శాస్త్రసారము } 2- 3-0
కపిస్థలం కృష్ణమాచార్యులుగారు }
20. నమస్కారములు ,, ,, 0- 4-0
21. నీతిభవనము ,, ,, 0- 4-0
22. పరిషత్పుస్తకభాండాగారము 1- 0-0
23. ప్రాకృత భాషోత్పత్తి - శ్రీమాన్ మేడేపల్లి } 4- 3-6
వేంకటరమణాచార్యులుగారు }
24. బాలభారతము-(అగస్త్యకృతమునకుఁ దెలుఁగు } 5-14-0
కొత్తపల్లి సూర్యరావుగారు
25. మన్నారు దాసవిలాసనాటకము - రంగాజమ్మ 11- 9-6
26. యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము } 4- 4-6
జి. రామయ్యపంతులుగారు బి. ఎ. బి. ఎల్. }
27. రసాభరణము - అనంతకవి 0- 3-6
28. రసార్ణవాలంకారము - ప్రకాశవర్షకవి 2- 1-3
29. రఘునాథరామాయణము (ప్రథమభాగము) } 3- 1-0
రఘునాథభూపాలుఁడు }
30. రజతోత్సవసంపుటము (ఆంధ్రసాహిత్యపరిషత్తు) 3- 8-0
31. రాయవాచకము - విశ్వనాథనాయని స్థానపతి 9- 6-9
32. రెడ్లనాటి రెండుశాసనములు 2- 6-0
33. లక్షణసారసంగ్రహము ... 11-13-9
34. లౌకికన్యాయవివరణము - శ్రీమాన్ } 2- 0-6
మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు }
35. శతకసముచ్చయము (మొదటిభాగము) 2-12-0
36. డిటో (ద్వితీయభాగము) 2-10-0
37. శాసనపద్యమంజరి - జయంతి రామయ్య } 25- 6-3
పంతులు బి. ఎ. బి. ఎల్. }
38. శాసనపద్యమంజరి (ద్వితీయభాగము) 4- 1-3
39. శివతత్త్వసారము - మల్లికార్జున పండితారాధ్యులు 7-14-0

| | |
|---|---|
| 40. శివరాత్రిమాహాత్మ్యము - శ్రీనాథ మహాకవి | 26- 6-9 |
| 41. షోడశకుమారచరిత్రము - వెన్నెలకంటి అన్నయ్య | 4-14-6 |
| 42. సర్వేశ్వరశతకము - యథావాక్కుల అన్నమయ్య | 0-14-3 |
| 43. సాంబోపాఖ్యానము - రామరాజు రంగప్పరాజు | 2-12-0 |
| 44. సింహాసనద్వాత్రింశిక (పథమభాగము) కొఱవి గోపరాజకవి | 11- 0-6 |
| 45. డిటో (ద్వితీయభాగము) ,, | 11- 0-3 |
| 46. సీతారామచరిత్రము - బాలకాండము మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి | 1-4 -0 |
| 47. సూత్రాంధ్రవ్యాకరణము - చిన్నయసూరి | 3- 9-6 |
| 48. హంససందేశము (తెలుఁగుపద్యములు) కల్లూరి వేంకటరామశాస్త్రిగారు | 1- 0-3 |
| 49. ప్రహస్వరంగములు - కొత్తపల్లి సూర్యారావుగారు | 0-14-0 |
| 50. Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ. బి. ఎల్. | 2-14-3 |
| 51. Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు | 2- 5-3 |
| 52. పరిషత్పుస్తకభాండాగారము III భాగము | 1- 7-0 |
| 53. శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు I భాగము | 361- 0-0 |
| 54. డిటో II భాగము | 284- 0-0 |
| 55. డిటో III భాగము | 273- 8-0 |
| 56. డిటో IV భాగము | 269- 8-0 |
| 57. శ్రీ పిఠాపురం మహారాజావారి ప్రచురణములు | 67- 5-3 |
| 58. కొత్తపల్లి సూర్యారావుగారి గ్రంథములు (సుబ్రహ్మణ్యము) | 3- 0-6 |
| మొత్తము | 1,642- 6-9 |

# అరుంధతీ వసిష్ఠము

శ్రీ బులుసు వేంకటేశ్వరులు బి. ఏ;

( ప రి శి ష్ట ము )

క. అని చెప్పి కపిలదేవుని
మనమున కెక్కన్ నుతించి మఱి కర్దమునిన్
మనమార సంస్తుతించి య
తని యాత్మజులన్ విరించి తెగఁ గని యనియెన్. ౧౯

చ. "సరసిజనేత్రలార! విలసద్గుణరాజితలార! మీర లా
పరమఋషీంద్రపత్ను లయి భాసిలఁగాంతురు దివ్యకీర్తులన్
బరఁగుదు రస్మదాదులకుభావన కందనిపూజసేయరై
కర మరుదైనమీకత జగత్త్రితయంబున కొజ్జబంతి యౌ. ౨౦

క. నాకంబె మిన్నలై సుభ
గాకారులునై యెసంగునట్టిమహర్షుల్
చేకొందురి మిమ్ము సతులుగ
లోకంబులు శుభములన్ వెలుంగఁగ మీచే." ౨౧

చ. అని కొనియాడి ధాత తనయాత్మజుఁ డైనమరీచిమానిచం
ద్రుని గని "వత్స! నీవు కళనుం గొని పత్నిగ గార్హ్యధర్మజీ
వనమున సంతతిన్ నిలుపు భావ్యము నీ కిది నిన్ను నీమె దే
వునిగను గొల్చి కీర్తిరమఁ బొందును లోకులు సంతసింపఁగన్". ౨౨

గీ. అని విరించి మరీచికి నాజ్ఞచేసి
కర్దమునియింట విడిచి శీఘ్రమున నేఁగె
నారదాదుల నాత్మనందనులఁ గూడి
సకల పుణ్యాస్పదం బాత్మసదనమునకు. ౨౩

ఉ. అంతటఁ గర్దమర్షియు బ్రియంబును గాంచి మరీచిమౌని న
త్యంతకుతూహలంబున సుఖాంబుధిఁ దేల్చుచు నాదరింపఁగా
నంతటిమౌనిచంద్రముఁడు నంతటిజ్ఞానియు నంతయోగ్యుఁ డా
వంతయుఁ గష్టమందకయె యబ్బెఁగదా యని పొంగిపోయెదుర్. ౧౪

గీ. కార్యమునయందుఁ గార్యము కలిసివచ్చు
ననియు సమవయస్కులు నని యందఱకును
నొక్కసారియె యుద్వాహ మొనరఁజేయఁ
దలఁచి వెదకం దొడంగు నుత్తమవరులను. ౧౫

మ. అనసూయాగుణగౌరవంబుఁ దలపోయం జొచ్చి సాదృశ్యస
ద్గుణసంపన్నుఁడు తుల్యరూపవిభవోద్భూతప్రకాశుండు స
జ్జనమందారుఁడు దివ్యశక్తినిధి విజ్ఞానప్రభావాఢ్యుఁ డౌ
మునితర్నం బగునత్రిమౌనిఁ దలఁచెన్ మునిముఖ్యుఁడు సంప్రీతిగన్. ౧౬

చ. అమలినకర్దమర్షి హృదయంబునఁ బుట్టినపూజ్యభావ ము
త్తమముగఁ బాఱి పాఱి వినుతం బగుసద్వ్రతదీక్ష నున్నయ
త్రిమునిని జేరి యాతనికిఁ దీవ్రముగా జనియింపఁజేసె ను
త్తమతరుణీ వివాహదృఢతత్పరతన్ క్షణమాత్రలోపలన్. ౧౭

ఉ. భావన కెంతశక్తి తలఁపన్ విలసిల్లునొ యౌర, యంచు సం
భావనచేసి యత్రిముని - పావనకర్దమయోగశక్తిసం
భావన కాత్మ మెచ్చి యిఁక మానునె కాక వివాహ మంచుఁ గ
న్యావరకాంక్షఁ గర్దమగృహంబును జేరెను దక్షిణంబునన్. ౧౮

మ. అహహా! మౌనితపఃప్రభావములు భావాతీతశక్తుల్ విన్నతుల్
విహితాత్మక్రియ లంతరార్థములు గంభీరంబు లూహింపఁ; బ్ర
త్యహముల్ దోఁతు రలోకజీవనులుగా నార్యర్షు లెన్నంగ లో
క హితశ్రేష్ఠులు వారె వారిఁ బొగడంగా నౌనె యెవ్వారికిన్! ౧౯

గీ. కర్దముఁడు దేవహూతి యుత్కంఠమీఱ
నత్రి కెదురేఁగి యర్ఘ్యపాద్యంబు లొసఁగి
యుచితసంభావభావితు నొనరఁ జేసి
ప్రీతిఁ గూర్చిరి తాము సంప్రీతు లయిరి. ౩౦

గీ. శ్రద్ధ యనుకన్య కనురూపచరితుఁడైన
వరు నరయఁగోరి కర్దముఁ డురువివేక
మునఁ దలంచెను నంగిరోమునిని మిగుల
నిశ్చలం బైనయాత్మలో నిమిషమాత్ర. ౩౧

చ. ఘన మగునిష్ఠ నాత్మ శితికంఠపరాయణమై చెలంగఁ బెం
పున గనునంగిరోముని యపూర్వముగాఁ గనియెన్ హృదంతరం
బున నొకయంతరాయమును బూనిననిష్ఠకు నంత దివ్యదృ
ష్టిని బరికింపఁ దోఁచిన దశేషభవిష్యకథావిశేషముల్. ౩౨

మ. అతిచిత్రంబులు దైవలీలలు మహాహంకారులై మానవుల్
మతిలో నెంతురు సర్వముల్ నిజకృతుల్ గా నాకు నేఁ డిట్టిస
ద్వ్రతభంగంబులు పెండ్లిబేరములు సంప్రాప్తించెఁగా! యంచు స
న్మతి నేతెంచెను గర్దమర్షికడ కా మాన్యాత్ముఁడుల్ వెంటనే. ౩౩

గీ. కర్దముఁడు దేవహూతియుఁ గౌతుకమున
నతని కెదురేఁగి యర్ఘ్య పాద్యంబు లొసఁగి
సర్వసత్కారము లొనర్చి సంతసమున
నాత్మమందిరమున నిల్పి రతులభక్తి. ౩౪

గీ. పూర్ణసుగుణాబ్ధి యగుహవిర్భువును దలఁచి
తుల్యరూపగుణంబులు తోఁచినంత
ఘనుఁ బులస్త్యుని దలపోసెఁ గర్దముండు
క్షణము హృదిలోనఁ దలపోసి సన్మనీష. ౩౫

ఉ. అంతఁ బులస్త్యమౌనికి హృదంతరమందునఁ జెప్పరాని య
త్యంతముదంబు గల్గ దరహాసము పుట్టఁగ నాత్మలోన ని
శ్చింతఁ దలంచినన్ నిరవశేషము బోధపడెన్ సమస్తమున్
వింతలు దైవలీల లని వేమఱు లెంచి పులస్త్యుఁ డాత్మలో. ౩౬

గీ. బయలుదేఱెను గర్దమప్రభునిఁ జేర
నాతఁడును దేవహూతితో నర్ఘ్యపాద్య
సత్క్రియలతోడ నెదురేఁగి సంతసమున
నాదరించెను వచ్చినయంత నతని. ౩౭

క. గతి యను నిజపుత్త్రికసం
గతి కర్దముఁ డెంచఁ బ్రీతి కడలుకొనంగన్
మతిఁ దోఁచెఁ బులహమౌనియు
బ్రతులకు సదసద్వివేక వైభవ మరుదే! ౩౮

మ. పులహుం డాత్మతపఃపరాయణుఁడునై పొల్పొందు వేళన్ దలం
పులు పైఁబడ్డఁ గలంగ మానసము నెమ్మోము మెఱ్ఱనై క్రోధసం
కుల మయ్యెన్; దన కిట్టి విఘ్నములు చేకూరం గతంబేమి యం
చలఁతిం బోక కరంబునం గొనియె శాపాక్షేపవాగ్ధారలన్. ౩౯

ఉ. ఇంతటిలోన నాంతరపువృష్టి నిగుడ్పఁగఁ గర్దమర్షి శు
ద్ధాంతరసౌహృదంబు గననయ్యెను వానికి బోధ యయ్యె వృ
త్తాంతము సర్వమున్; మివులఁ జిమ్మెను దవ్వుల శాపవారి య
త్యంతముదంబునన్ బయనమయ్యెను బెండ్లికి నీశ్వరాజ్ఞ గాన్. ౪౦

గీ. కర్దముఁడు దేవహూతియుఁ గడలుగొన్న
కౌతుకంబున నెదురేఁగి గౌరవమున
నర్ఘ్యపాద్యాదు లందించి యాదరించి
పులహు నిలిపిరి గృహమునఁ బొలుపుమిగుల. ౪౧

క. కమలాసన చోదితుఁడై
సమరూపవయోనుకూల సమరసభావ
ప్రమదాంతఃకరణుల ను
త్తమవరులను గర్దముండు ధన్యుం డేఱెన్. ౪౨

క. క్రియ యను తన కూర్చెడు క
న్నియకును గర్దముఁడు కూర్చె నిరుపమనిష్ఠా
నియమవ్రతుఁ డగు క్రతువును
వయసును రూపంబు గుణము వఱలఁగ సమమై. ౪౩

ఉ. ఖ్యాతి యనం జెలంగుతనకన్నియ కంతటఁ గర్దముండు వి
ఖ్యాతతపః ప్రభావుఁడు సమంచితవిజ్ఞుఁడు రూపమన్మథ
ఖ్యాతుఁడు ప్రీతచిత్తుఁ డగునార్యు భృగున్ బతి కాఁగ నెంచినన్
బ్రీతి నతండు వచ్చి నురరీకృతిఁ గర్దముఁ డాత్మ మెచ్చఁగన్. ౪౪

క. శాంతంబు రూపు దాల్చుట
శాంతి యనం జెలఁగు నాత్మజను గర్దముఁ డ
త్యంతముఁ గూర్చెడునామెను
స్వాంతమునం దెంచి చూచె సరిపడుభర్తన్. ౪౫

గీ. తఱచి చూడఁగఁ దోఁచె నథర్వుఁ డనెడు
నుత్తమతపోధనుండు మహోత్తమగుణి
కర్దముఁడు వానిఁ గాంక్షించె గాఢముగను
నాతఁడును బ్రీతి విచ్చేసె నంచుకొఱకు. ౪౬

ఉ. కన్నియ రూపుఁ గోరు నధికంబుగఁ గోరును దండ్రియుక్ మహా
భ్యున్నతసద్గుణౌఘమును నున్నతసంపదఁ గోరుఁ దల్లి యి
ట్లన్నియు నాత్మ నెంచి తనయల్లురఁ గూర్చెను గర్దమర్షి యి
న్నిన్నియు నొక్కచోఁ గలఋషీంద్రుల నాత్మమహత్త్వ మెట్టిదో!

మ. సుదతీరత్నములందు శ్రేష్ఠమయి తేజోరాశియై కామ్యముల్
మది వర్జించి తపఃప్రభావమున సమ్మాన్యాత్మయై యొప్పుచున్
ముద మొప్పన్ విహరించుచున్ వెలయుపూవుంబోఁడి పుణ్యంబులన్
ప్రోదుల్ సేయు నరుంధతీరమణి కేపుణ్యుండు పాత్రించునో ? ౪౮

కం. అని కర్దముఁ డత్యంతము
మనమునఁ దలపోసెఁ దుల్యమహిమాన్వితు నె
వ్వనిఁ బ్రార్థింతునో యని నె
మ్మనమునఁ బొడకట్టఁడయ్యె మహితుఁ డెవండున్. ౪౯

గీ. కలఁడు కలఁడు వసిష్ఠర్షి కలఁ డటంచు
నెంచుచుండును గాని యేరీ ? తదీయ
దివ్యతేజంబు సైరింపఁ దివురవార
లనుచు భయమందుఁ దలపోయ నతని నితఁడు. ౫౦

చ. భువనములందుఁ బొల్పెసఁగుపుణ్యుల నెల్లర నుత్తమర్షులన్
మివులఁ బ్రసిద్ధులై చనుమనీషుల నెంచి వసిష్ఠమౌనియే
తవును బరిగ్రహింపఁ గడుధన్య నరుంధతి నంచు నెంచి యా
ప్రవిమలమానసాంబురుహుఁ బ్రార్థనచేసెను గర్దమర్షి తాన్. ౫౧

ఉ. కర్దమమౌని ప్రార్థనముఁ గాంచి వసిష్ఠుఁడు దివ్యదృష్టి సౌ
హార్దముతోడఁ గర్దమగృహాంగణభూమికి నేఁగుదెంచినన్
గర్దమదేవహూతు లతిగౌరవ మొప్ప సమాదరించియున్
మార్దవ మొప్పఁ బల్కియును మాన్యతఁ గొల్చి రనంతభంగులన్.

కం. కరుణాళువై వసిష్ఠుఁడు
పరమవినీతిని గ్రహించి పరిచర్యల నా
దరమేదురతను గాంచెను
అరుంధతిని సుగుణభూషణాంచితరూపన్. ౫౩

ఉ. కాంచినయంత నామె తనకాంత యటంచు గ్రహించి యాత్మలో
నెంచెఁ బరీక్షచేయ ధర నెంతటిరమ్య మహత్త్వ మైన నో
క్కించుక గీటుఱాయిపయి గీఁచినయంతటఁ గాదె వ్యక్తమౌ
నంచు వసిష్ఠమౌని; ఇది యౌఁ గద ! యుత్తమభంగి యెన్నఁగన్.

గీ. "ఓయి కర్దమ ! నీయింట నున్నవారె
యిసుక వంట యొనర్చెడియిగురుఁబోండ్లు ?
అట్టు లైన మనోభీష్ట మగును మనకుఁ
దెలుపు" మనఁ దెల్లపోయిరి లలన లెల్ల. ౫౫

గీ. తండులంబులు తెచ్చినఁ దగినరీతి
వండిపెట్టంగ వనితలు వలఁతు లగుదు
రంతియే కాని యిసుక నేయింతి వండఁ
గల దనుచు నూఱకుండిరి లలన లెల్ల. ౫౬

గీ. ఇతనికోరిక తీరనియెడల నేమి
సంభవించునో యని భయసంభ్రమతుఁ డయి
కర్దముఁడు తెల్పె నీమాట కంబుకంఠి
యగు నరుంధతి కామె యిట్లనియెఁ బ్రీతి. ౫౭

క. "ఇది యెంతటిపని ? తండ్రీ !
మది సంశయ ముడిగి చెప్పుమా యా ఋషికిన్
ముద మొదవ వండిపెట్టుదు
నిదె యిమ్మని యిసుకఁ దెచ్చియిమ్మా ! నాకున్." ౫౮

శా. ఈమాటల్ విని కర్దముండు మదిలో నెంతో ముదం బంది యీ
భామారత్నము చేయఁజాలు నని చెప్పంబోయె నమ్మౌనితో
ఏమో ? యెంతటి శక్తి యున్నదియొ ! మేలే కాద యట్లైనచో
నీముష్టింపచుఁ డిట్లనన్ గతము లున్నే యంచు లోకుల్ వెసన్. ౫౯

చ. ఎవరికిఁ దోఁచినట్లుగ నెల్లరుఁ బల్కఁగొనన్ వసిష్ఠుఁ డ
య్యువిద కొసంగె నాయిసుక నొప్పుగఁ గొల్చి సమంచితంబుగాఁ
దవిన తెఱంగునన్ నలువిధంబుల భక్ష్యము లేహ్య చోష్యముల్
మివు లగుపానమున్ జలుప లేమయుఁ గైకొని భక్తిపెంపునన్. ౬౦

గీ. ఇది యపూర్వము దీనినె ట్లీపడంతి
చేయఁజాలునో చూత మచ్చెరు వటంచు
సిద్ధసాధ్యులు దేవతల్ శ్రేణి గట్టి
యంబరంబున నిల్చిరి సంబరమున. ౬౧

ఉ. ఈచెవి నాచెవిం బడి యనేకజనంబులు మౌనిశేఖరుల్
చూచి తరింత మంచుఁ గడుఁ జోద్యమటంచును జేరవచ్చి సం
కోచము లేక యమ్ముని నకుంఠితతేజుని జ్ఞానమూర్తి భా
షాచతురాననున్ గని ప్రశంస యొనర్చిరి భక్తియుక్తులై. ౬౨

మ. తరుణీరత్న మరుంధతీవనిత చేతఃప్రీతిగా మౌనిశే
ఖరుఁ డైనట్టి వసిష్ఠుఁ డిచ్చునిసుకన్ గైకొంచుఁ బాత్రంబులన్
నరిగా నాల్గిటఁ బోసి భక్ష్యమును జోష్యం బంతటన్ లేహ్యముల్
వరపానీయములన్ బొనర్చె క్షణకాలంబందు నేర్పొప్పఁగన్. ౬౩

ఉ. ఆయమచేతిచల్వ యది యట్టిదయేమొ క్షణంబులోన నా
ప్యాయపుభక్ష్యచోష్యములు నయ్యెను లేహ్యము లయ్యె నంతఁ బా
నీయము లయ్యె నయ్యిసుక; నిశ్చయ మిట్టి పవిత్రహస్తముల్
చేయఁగ లేనిదెద్ది యని చిత్తరులై కరులైరి చూపఱుల్. ౬౪

చ. ధణధణ దేవదుందుభులు తద్దయు మ్రోసె, సురాళిఘంటికల్
గణగణ మ్రోఁగెఁ, దూర్యయుగళంబుల నాదము లొప్పె, నప్సరో
గణముల యాటపాటలును గమ్మని నృత్యములున్ జెలంగె, నా
క్షణమునఁ బుష్పవర్షమును గాఢముగాఁ గురిసెన్ బొరింబొరిన్. ౬౫

మ. దిశ లెల్లన్ శమితంబులయ్యెఁ దమయుత్సేకంబులన్ వీడి స
ద్వ్యశమున్ గాంచఁగ శాంతమూర్తి గనియెసందర్భంబుల్, సుహృత్పాళికిన్
వశమయ్యెన్ సకలేంద్రియంబులును సంప్రాప్తించె లోకాళికిన్
బ్రశమానూనసుఖం బరుంధతి యొనర్పన్ వంట చిత్రంబుగన్.

మ. జయనాదంబుల దేవకామినులు పుష్పవ్రాతముం జల్లఁగా
భయభక్తిప ... ఋషిసమీపప్రాంతముం జేరి "ఓ
ప్రియమహామునీశ్వర ! సిద్ధమయ్యెను మనోభీష్టంబు తీరంగ వం
ట యిదే ర"మ్మని చేరఁజీరెను వసిష్ఠబ్రహ్మ నకాంత తాన్. ౬౭

శా. "సంతోషించితి నేల భోజనము ? నీసాంగత్యమే కోటివేల్
కాంతా ! నే నిదె వత్తునిప్పుడె లసద్గంగా జలాపూర్ణ మ
త్యంతప్రీతిద మీ కమండలువుఁ జేతం బూని నా రాకప
ర్యంతం బిద్ది గ్రహించి యుండు"మని తా నందించె నమ్మానియున్.

క. అందించిన నా కాంతయు
నందించి మహాప్రసాదనయసంగతిఁ దా
నందికొనె నా కమండలు
వందక సందేహ మించుకైనను భక్తిన్. ౬౯

మ. జలపూర్ణంబగు నా కమండలువు హస్తం బందున౦ బట్టి యా
లలనారత్నము నిల్చె నమ్మునియు సంలక్షించి యక్కన్నె న
మ్ములవేగంబున నేఁగె నెచ్చటికొ యేమో యెందుకై యేఁగెనో
తెలియన్ రా దటఁ బొద్దు క్రుంకినను నేతేఁడయ్యె నేపాటికిన్. ౭౦

క. దినములు కడచనెఁ బక్ష
మ్మును నిండెను నెలలుకూడఁ బోయెను గానీ
మునిముఖ్యుఁ డాకపోయెను
వనితామణి యేకదీక్ష వదలక నిలిచెన్. ౭౧

ఉ. తిండియుఁ దిప్పలున్ గనక దీర్ఘదినంబులు వాసరంబు ల
ట్లుండి చలింపదయ్యె "నిటు లొప్పదు దాని నటుండ నిచ్చి యో
యండజయాన ! తిండి తిని యాపయిఁ జేయుము నిత్యకృత్యముల్
దండితనంబు వీడి" యనఁ దా బదు లాడదు కంటఁ జూడదున్. ౭౨

శా. రాఁడయ్యెన్ మునిరాజు జాడ కనఁగా రాదయ్యెఁ దన్వంగి యి
ట్లేఁడుల్ పూఁడులు నేఁగుదెంచినను గానీ దీక్ష యేమాత్రమున్
వీడంజాలక యుగ్రనిష్ఠ నిలువన్ వెన్వెంటనే లోకముల్
పీడెత్తెన్ నిజధర్మముల్ తొలఁగఁగాఁ బెంపేది రార్యర్షులున్. ౨౩

మ. కలగెం దోయధు లెల్లఁ జక్కనినదుల్ గాంభీర్యముల్ వీడి కాఁ
కలఁ దేలం దొడఁగెన్ జగం బులిసె శోకం బందె భూదేవియున్
వెలవెల్వోయె దివాకరుండు ఋషిసద్బృందంబు లెల్లన్ మన
శ్చలనం బందెను తాఱుమాఱయె సమస్తం బింక వేయేటికిన్. ౨౪

ఉ. కర్దమమానిచంద్రుఁ డధికంబగుప్రేముడిఁ జేరవచ్చి "నీ
దుర్దమ నిష్ఠచే జగ మధోగతి పొందఁగ నున్న దమ్మ! యీ
దుర్దశ మాన్పఁగాఁ బరమదుస్సహ మీతప మింత మాను నిన్
గర్దమమానిపుత్త్రి వని గాసిలి తిట్టుదు రట్లు కానిచో". ౨౫

మ. అని యెంతెంతని వేఁడుకొన్నఁ జెవియం దావంతయున్ జేర్ప దే
మని మాఱాడదు లోక మెట్లయిన నేమా నాకు నానిష్ఠ నా
కును జాలున్ బలుమాట లేల యిఁక నొక్కొక్క నాఁగ నాదివ్యదీ
క్షను మానంబె సమస్తమున్ దెలుపునాఁగా నుండె నక్కాంతయున్.

గీ. తండ్రి ప్రార్థించి విఫలుఁడై తలఁచె లోన
నిట్టి దుర్దమవ్రత నిజం బెంచి చూడ
నాకు గౌరవహేతువే నాక కాదు
సకలలోక సంరక్షిణి సత్య మంచు. ౨౭

గీ. తండ్రి ప్రార్థించి విఫలుఁడై తప్పుకొనినఁ
దల్లి ప్రార్థించె మిక్కిలిఁ దా నరుంధ
తీరమణి పక్షపాతంబు తేటపఱుప
దయ్యెఁ దలిదండ్రులందు భేదంబుఁ జూపి. ౨౮

గీ. ఋషివతంసులు నొకరొక్కరే క్రమమునఁ
‘‘దల్లి! యుడుగుము నీదీక్ష దయదలిర్ప
లోకముల నేలు’’ మన్న నాళీకనయన
యతనితోడిద లోక మం చాత్మఁ దలఁచు. ౭౯

మ. తలఁపఁ గొందఱు దీక్షయే యెఱుఁగ రేధర్మంబునుం జూడ రా
త్రులు వారల్ కడు హీను లెన్నఁగను మందుల్, కొందఱీదీక్షయం
దలఁతిశ్రద్ధను జూపి బాధ యగుచో నావంక కే చూడ, ర
త్యలఘుల్ సువ్రతముత్తముల్ విడువ రేయాతంక మేతెంచినన్. ౮౦

ఉ. ఈగతి నాయరుంధతి యహీనమహావ్రత దీక్షచేత స
ద్యోగ మహాగ్ని వెల్వడి మహోన్నతభంగి సమస్తలోకముల్
గ్రాఁగఁగఁ జేయుచుండ సురకామిను లుత్తలమంద నింద్రుఁ డా
వేగముతోడ నేఁగి కడు వేఁడె విరించిని రక్షసేయఁగన్. ౮౧

మ. చతురామ్నాయము లొక్కపెట్టునను ఘోషల్ పెట్టఁ బద్మాసనుం
డతులప్రౌఢిమఁ గోలుపోయినటు లాహా! యంచుఁ జింతించుచున్
మతి దిట్టంబొనరించుకొంచు నిజహంసారూఢుఁడై కర్దమ
ప్రతికూఁతున్ వెదకందొడంగె మది సంభావించి యేతత్కృతిన్. ౮౨

గీ. నలువ విచ్చేసి యాయరుంధతిని గాంచి
‘‘బిడ్డ! యుడుగుము. నీమనోభీష్ట మేమి?
జగము లల్లాడిపోయె నీసరణి తగునె?
మాను వ్రత’’ మని మఱి బతిమాలుకొనియె. ౮౩

గీ. నలువయంతటివాని నైనను గనంగ
నిష్టపడదాయె మాటాడ నెంచదాయె
నాయరుంధతి నిలుచుండి నట్లె నిలిచి
పట్టినకమండలువు నట్లె పట్టియుండె. ౮౪

ఉ. ఈమెఁ గదల్ప నింక వెఱ వేమియు లే దని బ్రహ్మ యాదిగా
నా మహితర్షి చంద్రులును నద్భుతకంఠనినాద మేర్పడన్
"ఓమహనీయ తాపస ! ఋషీశ ! వసిష్ఠమహర్షి ! శీఘ్రమే
యీమహిమాస్పదన్ గనఁగ నిచ్చటికే పఱతేవె సత్కృపన్.

ఉ. నీకృప లేనిచో బ్రదుక నేరము దేవ ! క్షణంబుకూడ నీ
యాకృపగల్గుచోఁ దృణమ యైనియు మేరుసమానమే యగున్
మాకయి లోకసంకటము మానుపుకోసము వేగ వచ్చి నీ
వీకమలాయతాక్షి వ్రత మింతకుఁ బూర్ణసమాప్తి చేయవే ! ౧౬

గీ. లోకసంరక్షణార్థమై నీకు జన్మ;
మరయ మముబోంట్ల రక్షించు టగు వ్రతంబు;
కుంభసంభవ ! విచ్చేసి కొమరుమిగులఁ
బెండ్లికొడుకవు కాఁగదే ప్రియ మెసంగ". ౧౭

క. అని వేడుకొనుచు నుండఁగ
మునిమూర్ధన్యుఁడు వసిష్ఠ మునిచంద్రుఁడు న
వ్వానువీథినుండి దిగియెను
ఘనతేజము దిక్కులందుఁ గ్రమ్ముకొనంగన్. ౧౮

ఉ. వచ్చి నమస్కరించిన తపస్వుల కెల్లఁ బ్రతిప్రణామముల్
మెచ్చి యొనర్చి పద్మభవు మేదురభక్తి నతించి వెంటనే
యచ్చపలాక్షిఁ గర్దముని యాత్మజఁ జేరి "లతాంగి ! యీఁగదే
వచ్చితి నాకమండలువు భద్రము చేసితి విచ్చ మెచ్చితిన్". ౧౯

క. అను నవ్వసిష్ఠుపలుకులు
విని కన్నులు విచ్చి చూచి వినమితశిరయై
తనచేతికమండలువును
మునిచేతం బెట్టి కదలి మ్రొక్కె నతనికిన్. ౨౦

మ. సుమవర్షంబులు దేవతల్ కురియ యక్షుల్ కిన్నరుల్ నృత్యముల్
సమదస్ఫూర్తి నొనర్పఁగా మఱియు గంధర్వుల్ జయధ్వానముల్
ప్రమదం బారఁగఁ జేసి గీతవితతిం బాడంగ దివ్యంబు ది
వ్య మటంచున్ జనముల్ నుతింప శుభముల్ప్రాప్తించె లోకాళికిన్.

గీ. "పడఁతి! లెమ్మింక శుభములు పడయఁగలవు
సిద్ధ మిది త్వన్మనోభీష్టసిద్ధి యగుట"
యని వసిష్ఠుఁ డరుంధతిహస్తయుగళిఁ
బట్టుకొని లేవనెత్తెను బ్రణయ మొప్ప. ౬౨

క. అహహా! మహర్షి పాణి
గ్రహణం బొనరించినంతఁ గన్నియ కపుడే
స్పృహ వచ్చి సిగ్గు గదిరినఁ
దహతహపడి లోని కరిగెఁ దరుణులు నవ్వన్. ౬౩

గీ. "తడయఁ జూడకు మింకఁ గర్దమమునీంద్ర!
శీఘ్రముననే వివాహసంసిద్ధిఁ గూర్పు"
మంచు నానతియిచ్చె నాయంచరౌతు
అవ్వసిష్ఠుఁడు వినఁ జిఱునవ్వుతోడ. ౬౪

మ. సుముహూర్తం బది నిశ్చయించుకొని యచ్చో సర్వసంభారముల్
సమకూర్చెన్ ఋషికర్దముండు పరమాశ్చర్యంబుగన్ మున్నె యా
త్మమహత్త్వప్రతిపాదకుల్ పరమసంభావ్యాత్ములై నట్టి మా
నిమహాశ్రేష్ఠులుఁ జేయఁజాలనివి యున్నే యెట్టికృత్యంబులున్.

గీ. పెండ్లిపెద్దలు చనుదెంచి విడిసి యుండి
రతనిగృహమందు జామాత లండ అతని
నుతితతులఁ దన్పువారైరి నతు లొనర్చి
యతఁడు గావింపఁ బెండ్లిండ్ల నబ్బురంబె! ౬౬

మ. తనతోష్మంద్రుకోమార్తె లిట్లు పరమాత్మజ్ఞానవిజ్ఞానులన్
ఘనమాసీంద్రుల రూపమన్మథుల నిష్కామ్యాత్ములన్ దేవదే
వనికాయస్తవనీయులన్ ద్రిభువనప్రఖ్యాతులన్ బ్రహ్మజీ
వసులన్ భర్తలుగా గడించి రని యాబ్రహ్మర్షి యుప్పొంగుచున్.

ఉ. మునికులసంప్రదాయమున మున్నటు లొప్పినశాస్త్రపద్ధతిన్
గని మనమందుఁ గర్దముఁడు కాంచి సదాచరణంబు వీనిమే
శనమునఁ జేయఁబూనెను జెలంగి వివాహమహోత్సవంబులన్
వినుతవిధాన మొప్పఁగఁ బవిత్రగతిన్ సుమనోనుకూలతన్. ౯౮

గీ. బ్రహ్మమునుముందు నతనియాధ్వర్యవమున
సర్వదేవతాఋషిగణసన్నిధాన
మందు దివ్యవైభవముతో నలరెఁ గర్ద
మాత్మజలపెండ్లి లోకంబు లలరఁ బ్ర ౯౯

చ. మునివరసామగానరవముం బురుడించుచుఁ గోకిలాంగనా
జనకలగానమాధురులు షడ్జములన్ బెనుపొందుచుండఁగా
ననవరతంబు నధ్యయనమందునఁ బాల్గొనుకీరరాజముల్
గొనకొని కల్పఁగాఁ దొడఁగెఁగూర్మిశ్రుతిన్ మునివేదఘోషతోన్.

ఉ. నృత్తము సల్పునచ్చరలు నెమ్మికులం బొనరించునాట్యసం
పత్తిఁ దదీయనూతనవిపర్యయముల్ కనినన్ మనంబులన్
హత్తుకొనంగ నైమఱచి యాటలు మాని నిజాత్తశాస్త్ర మా
వృత్తియొనర్చుకోఁ దొడఁగ నెల్లరు నవ్విరి సిగ్గుచేటుగన్ ౧౦౧

చ. అరవిడి నూత్నశోభల నయాంచితభంగి దిశాముఖంబులన్
బరఁగఁగఁ జేయు పద్మములఁ బావనభంగిఁ గరేణుయూథముల్
సరసముగా గ్రహించి సుమసంగతిచే గజమాల లెన్నొ చే
కురిచి నవీనదంపతులకున్ గయిసేయును భక్తియుక్తులన్. ౧౦౨

ఉ. మందలు మందలై తమ కమందసుఖం బిది యంచుఁ జెప్పఁగా
డెందములందు నెంచియొ కడిందిపొదుంగులతోడ దివ్యగో
బృందము లాప్రదేశమునకే పఱతెంచి పయస్సులన్ మహా
నందముతోడుతన్ గురిసి నందినులే యనఁ బొల్చు నిర్మలన్.

గీ. పండి యుండినపండు లీపెండిలికయి
నిల్చియున్నవో నాఁగ నా నిమిషమందె
రాలిపడిపోయి యామునిరాజిభుక్తి
కొఱకుఁ జూపును వారి కకుంఠభక్తి. ౧౦౪

గీ. పిల్లతెమ్మెరలనె పంపి మెల్లమెల్ల
వారినును మేనులకు సుఖప్రమద మీయ
వాయుదేవుఁడు చూపు హృద్భక్తియుక్తి
తనసదాగతిత్వమ్ము సార్థకము గాఁగ. ౧౦౫

మ. తనకున్ రక్షకులై జగంబుల నితాంతప్రేమ వాటించుచున్
మనువారే కద ! వీర లంచుఁ దనకున్ మర్యాదగా వారికిన్
దనభక్తిన్ బ్రకటింపఁగా శమితతీక్ష్ణత్వంబునన్ మందమై
యినుఁ డొప్పెన్ సమశీతలుం డయి గుణాకృష్టాత్ము లిట్లుండరే ?

గీ. స్వచ్ఛమై శారదాభ్రంబుచంద మగుచు
నొప్పె వినువీథి నీలిమ నొప్పుమిగిలి
సరసహృదయంబులను బోలి సరసులందు
నీరములు గాంచె స్వచ్ఛతన్ నిశ్చలతను. ౧౦౭

ఉ. ఈగతిఁ బంచభూతములు హృష్టములై మఱి హృష్టి నిచ్చి తే
జోగరిమన్ జెలంగఁ బరిశుద్ధమనస్కులు సంతసింపఁగా
నాగమవేదులై చెలఁగునార్యఋషీశులఁ జెట్టవట్టి శో
భాగురుతన్ జెలంగిరి శుభప్రదకర్దమపుత్త్రికామణుల్. ౧౦౮

గీ. సృష్టికర్తయు వారి నాశీర్వదించి
యాత్మధామంబునకు నేఁగె నంచమీఁద
తక్కు దేవత లాశీర్వితానములను
గురిసి వారలపైఁ జేరుకొనిరి దివిని. ౧౦౯

వ. ఆ పిమ్మట యథావిధివివాహసంస్కారానంతరము దేవహూతీకర్దములు తమతొమ్మండ్రుముద్దుగుమ్మ లగుకూఁతుండ్రను దొమ్మఁడ్రుగు రల్లుండ్రకు నొప్పగింతలు పెట్టి కన్నులనీరు గ్రమ్ముకొన ౧౧౦

ఆ. "ముద్దుబిడ్డలార! ముదముతోడుత నేఁగి
పతులవెంట వారె గతులు కాఁగ
మమ్ము మఱవకుండ మహితయశస్సము
పార్జనమ్ముఁ గాంచి వఱలుఁ డమ్మ!" ౧౧౧

చ. అని తమకన్యలన్ బతుల కర్పణచేసి సగౌరవంబుగా
ననుపమవస్తుసంతతు లనంతము వారల కిచ్చి నిత్యనూ
తనములు కట్టుఁబుట్టములు ధన్యత వారి కొసంగి మేలిభూ
షణము లొసంగి పంపిరి ప్రశాంతమనస్కత వారి నెల్లరిన్. ౧౧౨

గీ. తుద కరుంధతీదేవిని ముదము మీఱ
నవ్వసిష్ఠునితోఁ బంపునవసరమునఁ
గనులవెంబడి నశ్రువాహినులు పాఱె
దేవహూతికిఁ గర్దమధీమణికిని. ౧౧౩

గీ. ఇది యగునరుంధతీవసిష్ఠేష్టకావ్య
రాజమున ద్వితీయాశ్వాసరాజ; మీశ!
గురువరా! త్వత్కృపామృతభరితమామ
కీనవాఙ్మయ మిదియు నంకితము నీకు. ౧౧౪

---

# క్రీడాభిరామపాఠములు

బండారు తమ్మయ్య

క్రీడాభిరామము రావిపాటి త్రిపురాంతకుఁడు సంస్కృతమున రచించిన ప్రేమాభిరామమను రూపకము ననుసరించి పదునేనవశతాబ్ది యందాంధ్రభాషలోఁ గూర్పఁబడిన వీథినాటకము. దీనికర్త విజయనగర రాజుల భాండాగారాధ్యక్షుఁడుగా వినుకొండలోనుండిన వినుకొండ తిప్పనామాత్యుని పుత్త్రుఁడు వల్లభరాయఁడని గ్రంథమును బట్టి కానవచ్చును. కాని నిక్కముయిన శ్రీనాథుని వీథినాటక మిదియే యనియుఁ గర్తృత్వమును వల్లభరాయని కారోపించి శ్రీనాథకవి సార్వభౌముఁడే దీనిని రచించెననియుఁ గొందఱ యభిప్రాయము. ప్రౌఢదేవరాయల యాస్థానములో గౌడడిండిమభట్టుతో వివదించుటకయి కర్ణాటరాజధాని కేఁగునప్పుడు మార్గమధ్యమున వల్లభరాయని సందర్శించిన సందర్భమున నీకృతిరచనోద్యమము నాతనివలన విని శ్రీనాథుఁ డందాతనికి విశేషముగఁ దోడ్పడియుండునని నా యభిప్రాయము. ఈ గ్రంథకర్తృత్వమును గూర్చి పండితలోకమునఁ జాలవఱకుఁ జర్చలు మున్నే జరిగియున్నవి. ప్రస్తుత మిచ్చట వానితో మనకుఁ బ్రసక్తిలేదు. కృతికర్త యెవరైనను గ్రంథ మమూల్యమయినది. పదునాల్గవ శతాబ్దినాఁటి సాంఘికపరిస్థితులను, అప్పటి కాకతీయరాజధానియగు ఏకశిలానగరమునకు సంబంధించిన విశేషవివరములను నెఱుంగఁగోరు పరిశోధకులకీ గ్రంథపఠన మత్యావశ్యకము. ఇట్టి యీయుత్తమగ్రంథమునకు గ్రంథపాతములతోఁగూడి శిథిలాతిశిథిలమైన తాళపత్త్రప్రతియొక్కటి మాత్రమే తంజావూరు సరస్వతీమహాలు పుస్తకాలయమునందుఁ జిక్కియున్నది. దానిని బట్టి యీకృతిని దొలుదొలుత 1909 సంవత్సరములో శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు అశ్లీలపద్యములను బద్యపాదములను గొన్నిటిని దొలఁగించి భాషాభిమానులందఱకు నందుబాటుగా స్వల్పమూల్య (0-5-0) మేర్పఱచి ప్రకటించి పాఠకలోకమునకు మహోపకార మొనరించియున్నారు. అటుతరువాత మఱి యిరువదియేండ్లకు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పరిష్కరణముతో విపులపీఠికతోఁ బ్రథమముద్రణ

మున రామకృష్ణకవిగారు తొలఁగించిన యాకొలఁది యశ్లీలపద్యములను బాదములను గూడఁ జేర్చి, పదిరూపాయల మూల్యమేర్పఱచి ప్రాజ్ఞలోకమునందు మాత్రమే ప్రచారమొనర్చు నుద్దేశముతో మదరాసులో శృంగార గ్రంథమాలికాధిపతి శ్రీ గంటి సూర్యనారాయణ శాస్త్రిగారిచే (Scholars edition) ప్రకటింపఁబడినది. అటుతరువాత మఱి యిరువదియేండ్లు గతించినను మరల నీగ్రంథ మెచ్చటను బ్రకటితముగాక వలయువారి కిప్పుడు దొరకుట దుష్కరముగా నున్నది. ఈగ్రంథమందలి పద్యసంఖ్య రమారమి మూఁడువందలు మాత్రమే. అశ్లీలములని రామకృష్ణకవిగారు ప్రథమ ముద్రణములో విడిచిన పద్యములను మానివేసి యిప్పుడుగూడ భాషాసేవకులకుఁ బ్రస్తుత పరిస్థితులఁ బట్టి యుచితమగు తక్కువ వెలకు దొరకునట్లు లీకృతిని మరలఁ బరిశుద్ధముగాఁ బ్రకటించు నావశ్యకత యెంతయేనిఁ గలదు. ద్వితీయ ముద్రణావసరమునఁ దాము తంజావూరులోని మూలప్రతిని బరిశోధించి గ్రంథపాతములను దప్పులను బెక్కింటిని జక్కఁబఱచితిమనియు, ఆతాళపత్రప్రతి యప్పటికే తునాతునకలయి యుండుటచే ముందిఁక దానిని బట్టి సాధుపాఠములను నిర్ణయించుట సాధ్యముకానేరదనియు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తమ పీఠికలో వ్రాసియున్నారు. ప్రథమముద్రణముకన్న శాస్త్రిగారి ద్వితీయ ముద్రణము సర్వవిధములఁ బ్రశస్తతరముగ నున్నదని చెప్పనక్కఱలేదు. కాని యెడనెడ నిందలి పాఠములు గూడఁ గొన్ని సందిగ్ధములుగనే యున్నవి. కావునఁ బ్రథమ ద్వితీయ ముద్రణములను బురస్కరించుకొని యీ గ్రంథమును మరలఁ బ్రకటింపనెంచు భాషాభిమానుల పర్యాలోచనమున కయి కొన్ని ముఖ్యపాఠములను గూర్చియిందుఁ జర్చించుచున్నాను.

## అవతారికా భాగము

“సీ. వాచాల సురధునీ వీచికాగంభీర నాచావిలాసుఁడు బైచమంత్రి” ................. అను పద్యముయొక్క యెత్తుగీతి నాలవపాదము “మల్లికార్జునమంత్రికి వల్లభునకు” అను దానిలో గీతగీసిన భాగము “మల్లికార్జును సుతునకు” అని యుండవచ్చునని ప్రభాకరశాస్త్రిగారు అవ్విజ్ఞాపికలో సూచించినారు. కాని యింతకన్న “మల్లికార్జున

పుత్త్రుఁడు వల్లభునకు" అనునది కవిపాఠమయి యుండునని తలంచుట సమంజసము. షష్ఠీవిభక్తి విశేషణములను విభాషగాఁ బ్రథమా విభక్తి రూపములతోఁ బ్రయోగించుట ప్రాచీనకవి సమ్మతము గదా !

గంధవతీపవిత్రీరపుర ♦ ఘస్మరపాదబిసప్రసూన పు
ష్పంధయచక్రవర్తి ♦ శుభ్రితపర్వత దుర్గమహాప్రధాన రా
డ్గంధగజంబు, తిప్పన య ♦ ఖండిత ధీనిధిగాంచెఁ బుత్త్రులన్
బాంధవకల్పవృక్షముల ♦ బైచన మల్లనతిప్ప మంత్రులన్."

అను పద్యమునందు వర్ణితుఁడయిన తిప్పనకృతికర్త వల్లభరాయని తండ్రి యై యుండునని తలంచి శాస్త్రిగారా పద్యము నాల్గవపాదమందలి "మల్లన" అనునది "వల్లభ" అని యుండవలెనని సూచించినారు. కాని యిది సరిగాదు. ఇచ్చట గ్రంథస్థపాఠమును మార్పనవసరము లేదు. వల్లభరాయని తాతయుఁ దండ్రియుఁగూడ నిరువురు తిప్పనామాంకితులే. పయిపద్యము తరువాత "అందు" అని వచనములోఁ జెప్పి, బైచనమల్లనతిప్పమంత్రు లనుసోదరులలోఁ గనిష్ఠుఁడయిన తిప్పమంత్రినిగూర్చి వెనువెంటనే,

సీ. మూఁడు గ్రామగ్రాస ♦ ములతోడఁ గూడంగ
మోపూరు పాలించె ♦ ముల్కినాట
నాశ్వలాయనశాఖ ♦ యందు ఋగ్వేదంబు
కరతలామలకంబు ♦ గాఁ బఠించెఁ
బ్రత్యక్షమొనరించి ♦ భైరవస్వామిచే
సిద్ధసారస్వత ♦ శ్రీవరించెఁ
గామకాయనసవి ♦ శ్వామిత్రగోత్రంబు
వంశగోత్రంబుగా ♦ వన్నెకెక్కె

గీ. నెవ్వఁడా త్రిపురాంతకా ♦ధీశ్వరునకు
రాయనవరత్నభండార ♦ రక్షకునకుఁ
బ్రియతనూజుండు చంగమాం ♦ బికకుసుతుఁడు
మనుజమాత్రుండె వల్లభా ♦ మాత్యవరుఁడు.

అనుపద్యము రచింపఁబడినది. ఇందెత్తుగీతి మొదటిపాదమున నుదాహృతుఁడయిన త్రిపురాంతకాధీశ్వరునకే (తిప్పనకే) సీసమునాల్గు పాదము

లందు వర్ణింపఁబడిన విశేషణములు వర్తించును. అతనిభార్య చంద మాంబ. వారిసుతుఁడే కృతికర్త వల్లభరాయఁడు. ఇతని తాత తిప్ప మంత్రి "గంధవతీప్రతీర........అనుపద్యమునకు ముందు మఱిమైదు పద్యములలో విపులముగా వర్ణితుఁడయి యందు మొదటిదానిలో

"తిప్పమంత్రిజగదు దీర్ణవితీర్ణుఁడు
ద్వ్యాహమయ్యెనధికవై భవమున
హారితగోత్రజలధి హరిణాంకుఁడగు తిప్ప
నార్యు తనయఁబెద్ద మాంబనెలమి.

అని చెప్పఁబడినది. కావున వల్లభరాయనికి పెద్దమాంబ భర్త తిప్పన తాత యనియు, చందమాంబ భర్త తిప్పన తండ్రియనియుఁ బయిపద్య ములనెల్ల సవిమర్శముగఁ జదివినఁ దెల్లమగును.

గ్రంథభాగము

1. ఈవీథినాటకముయొక్క ప్రస్తావన పద్య మీక్రిందివిధముగాఁ బూర్వ ముద్రణములు రెంటియందును బ్రకటితమయినది.

గతిరసికుండ! షట్చరణ! గానకళాకమనీయ! యోమధు
వ్రత! వికచారవిందవన వాటికనేమిటికింబరిత్యజిం
చితి వటవీ ప్రదేశమునఁ జెట్టులుసేమలు నేమిగల్గినన్
బతిచెడి సంచరించెదవు ప్రాఁబడిపోయెనె నీవివేకముః."

ఇది కథానాయకులలో నొకరుండు దేశాంతరగతుండయి మరల నోరుఁ గంటి పురంబునకేఁగుదెంచు గోవింద మంచనశర్మనుద్దేశించి యాతని ప్రేయసి కామమంజరి పుత్తెంచిన మదన సందేశములో అన్యాపదేశ ముగఁ జెప్పఁబడినదని తరువాతనున్న వచనభాగమువలన ద్యోతక మగును. తుమ్మెదకుపయోగించిన విశేషణములుగూడ పుంలింగాత్మక ములుగనే యున్నవి. అట్టిచోఁ బద్యము మూఁడునాల్గు పాదములిప్పు డున్న ప్రకారము సరియగు నర్థమిచ్చుటలేదు. పురుషునిఁగూర్చి చెప్పి నప్పుడు "పతిచెడి (లేక పతివిడి) సంచరించెదవు" అనుటలో సారస్యము లేదు. కావున నిచ్చట "చెట్టులఁజేమల నేమిగల్గునన్ రతినటు సంచరిం చెదవు" అని కవి పాఠమయి యుండునేమో!

2. చలిని వర్ణించిన—

"ప్రక్కలువంచు వంచిముని పండ్లను బండ్లను రాయురాచిటో
మ్మక్కిలఁజేయుఁజేసితల యల్లనఁగాళుల సందుసందిలో
చక్కికినొక్కునొక్కియిరు చంకడగుమ్మడిమూటగట్టి వీఁ
పెక్కిదువాళిచేసిచలి యిక్కడనక్కడఁబెట్టువేకువన్"

అను పద్యమున జంటక్రియలలో మొదటిదానికి తద్ధర్మార్థక రూపమును రెండవదానికి క్త్వార్థక రూపమును రామకృష్ణకవిగారు వాడియున్నారు. ఇందుకు ప్రభాకరశాస్త్రిగారు "వంచివంచి రాచిరాచి చేసిచేసి అంది యంది నొక్కినొక్కి" అని రెండునుగూడ క్త్వార్థకరూపకములుగాఁ జేసిన మార్పు హృద్యతరము. కాని రెండవపాదములో "తలయల్లనఁ గాళుల సందుసంది" అను ప్రథమ ముద్రణపాఠమును ". . . . .గాళ్ళకు సందియంది" అని మార్చుటలోని సారస్యము బోధపడుటలేదు. 'అందు' అను ధాత్వర్థమిచ్చుట సరిపడునా ? "తలను గాళ్ళసందునకుఁ జొనిపిచొనిపి" అను భావముతో "తల యల్లనఁ గాళుల సందిసంది" అని కవిపాఠమయి యుండునేమో ?

3. ఈ చలివర్ణనములోనే యటుతరువాతి పద్యములో—

"కుమ్ములు హావ్యవాహములు గుత్తపుసుగ్గడితంపుఁదోఁపురెం
టమ్ములు దట్టుపున్నమృగ నాభియుజాదును నోడెనద్దిరా
యమ్మకచెల్ల ! యింకనవ యౌవనదర్పనఖంపచంబులౌ
కొమ్మలచన్నులన్ సరకు గొన్నటులున్నవి హోతుపారముల్."

గీతగీసిన భాగమును "సరకుఁగొనటులున్నవి" అని శాస్త్రిగారుమార్చి నారు. ఇందువలనఁ బ్రథమముద్రణ పాఠార్థమునకుఁ గేవలము వ్యతిరే కార్థమువ్యక్తమగుచున్నది. అటుతరువాతి రెండుపద్యము లందును జెప్పఁబడిన "ప్రాలేయంబుదువాళిసేసిన భయభ్రాంతంబులై యూష్మ ముల్ వాలాయంబుగఁ బ్రాఁకెనంధ్రవనితా వక్షోజశైలాగ్రముల్" స్థూలద్రిత్రిపటావకుంఠనములున్............వధూగాఢోప గూహం బులున్ । గేలీగర్భనికేతనంబు లును గల్గెంగాక లేకున్న నీ ప్రాలేయాగమ మెవ్విధంబున భరిం పన్ వచ్చురా ! టిట్టిభా !"అను విశే షణంబులను బట్టి మొదటి ముద్రణపాఠమే సమంజసమేమోయని

తోఁచునుగాని యీపద్యములం దుదాహృతములయిన యితర పదార్థములు, స్థూలపటావకుంఠనములు (గుత్తపుసుగ్గుజితంపుఁదోఁపు రెంటమ్ములు) కస్తూరీ కాలాగురులేపనములు (తట్టుపున్గు, మృగనాభి, జాదు) చలికినోడెనని పయిపద్యములోఁ జెప్పుటచే వధూకుచములందలి యుష్ణతనుగూడఁ జలిసరకుసేయ నేరదను భావముతో శాస్త్రిగారి సవరణమే కవిపాఠమైయుండునేమో యని కూడ గోచరింపఁగలదు. విజ్ఞులాలోచింతురుగాక !

4. కోఁడికూఁతను వర్ణించిన—

“మంచన! వింటివోవినవా • మన్మథుఁడే కశిలాపురంబులోఁ
జంచలనేత్రలంబతుల • శయ్యలపై రతికేళిరాత్రిఁబో
రించి ప్రభాతకాలము ప • రిస్ఫుటమైనను దమ్మదారవ
ట్టించుచునున్న వాఁడిదె కు • టీగతకుక్కుటకంఠకాహళిన్”

అను పద్యములో గీతగీసిన ప్రథమముద్రణ పాఠములను శాస్త్రిగారు ‘ధర్మదార’ ‘కంఠనాళముల్’ అని మార్చినారు. ధర్మశబ్దమునకుఁ బ్రాకృతరూపము “దమ్మ” కావున నిచ్చట “ధర్మదార” అను మిశ్రసమాసముకన్న “దమ్మదార” అనెడి యాచ్ఛికరూపము కవ్యుద్దిష్టమయి యుండునని తలంతును. మన్మథుఁడు దమ్మదారవట్టించుటలోఁ గుక్కుట కంఠము కాహళిగా నుపకరించెననుట సమంజసముగాఁదోఁచును. కావున “కంఠనాళముల్” అను ద్వితీయ ముద్రణపాఠముకన్న “కంఠకాహళిన్” అనుపాఠమే కవిప్రయుక్తమని గ్రహింపఁదగును.

5. సూర్యోదయమును వర్ణించిన “అదె మాణిక్యపుఁబూర్ణకుంభము— యుదయంబయ్యెడు భానుబింబముదిశావ్యోమావకాశంబులన్. బదియార్వన్నె పసిండి తీఁగలగతిన్ బ్రాఁకెం బ్రభాజాలముల్” అను పద్యములోఁ జివరిపాదమున రెండుముద్రణములందును ‘ప్రాఁకెన్’ అను భూతకాలికరూపము గ్రహింపఁబడినది. ఇంతకన్న “ప్రాఁకన్” అను తుమున్నర్థకరూపము కవిప్రయుక్తమనుట లెస్స.

6. ఓరుగల్లునందలి లక్ష్మణవఝ్ఝుల వంటపూటిల్లు వర్ణనలో నచ్చటి వితంతురత్నము గూర్చి చెప్పిన “పూవుంబోడులు లేరె విప్రి

విధవల్ భూమండలిందాని........" అనునది రామకృష్ణకవిగారి కూర్పులో అశ్లీలతాదోషముచే బూర్ణముగ ముద్రితముగాని పద్యములలో నొక్కటి. ఇది ద్వితీయముద్రణములోఁ బూర్ణముగఁ బ్రకటితమయినది. ఇందులోఁ జివరిపాదమున "సౌవర్ణస్థిరపట్టబంధ సుషమాసౌభాగ్యలక్ష్మిన్ గనున్" అనుచో "గనున్" కన్న "నగున్" కవి పాఠమని తలంచుట యుక్తమేమో.

7. దీనితరువాత నున్న,

"కోయిలపంచమస్వరము ♦ క్రోల్చిన భంగిని విద్దకంచి రా
మాయణ మాఱుకాండములు ♦ నచ్యుతజాగరవేళఁ బాడెనా
రాయవితంతురత్నమను ♦ రాగముతోడ నమశ్శివాయ శాం
తాయసమస్తదోషహర, ♦ ణాయ, సమానమె దానికెవ్వరున్."

అను పద్యములో రామాయణశబ్దమునకు ముందు ప్రథమముద్రణమందున్న "విద్దకంచి" అను విశేషణమును "విద్దికూచి' యనిద్వితీయముద్రణమునఁ బ్రకటించి ప్రభాకరశాస్త్రిగారు "అచ్చుతప్పులు, అర్థానుగుణముగాఁ జేయఁబడిన సంస్కారములు" అను పట్టికలో 'కూచి'' కి "కంచి" యని మాత్రము సవరణ చూపినారు. కాని యిచ్చట 'విద్దకంచి'' "విద్దికంచి" అను పాఠమేది గ్రహించినను గవిభావము వ్యక్తమగుట లేదు. శాస్త్రిగారుకూడ నీఁదలి యర్థవివరణమునకుఁ బూనుకొనలేదు. ఇచ్చట అపపాఠము తాళపత్రప్రతిలో నెలకొనెననియు, "కంఠమెత్తి" అని కవి ప్రయోగించి యుండుననియు నెంచుట సమంజసమేమో! ఆవితంతురత్న మచ్యుతజాగరవేళఁ గంఠమెత్తి గానమొనర్చిన యీరామాయణ మోరుగంటిప్రాంతముననే యంతకు మున్ను మున్నూఱేండ్లక్రిందట రచింపఁబడి ప్రచారమందున్న రంగనాథుని ద్విపదరామాయణమని తలంచుటయే యొప్పిదమని నాయూహ. ఈ గ్రంథమునందే యంతకుముందు "ద్రుతతాళంబున వీరగుంభితకధుంధుంకిటత్కారసంగతివాయింపుచు..." అను పద్యమున పల్నాటి వీరుల కథను శ్రోతలు తన్మయులగునట్లు ద్విపదప్రబంధమున నొకస్త్రీ గానమొనర్చెనని వర్ణితమైనది. ద్విపదకావ్యరచనమునందు మన పూర్వమహాకవు లుద్దేశించిన దిట్టిప్రయోజనమే. నేటికిని తోలుబొమ్మలాట

గాంగ్రండు బిచ్చగాండ్రు రంగనాథరామాయణమును పాటగాఁ బాడెదరు
పయి పద్య మందలి నమశ్శివాయే త్యాద్యనుకరణ పదములను
జూచి, సుబ్రహ్మణ్యకవికృతమగు అధ్యాత్మరామాయణ కీర్తనలందు
మొదటికీర్తనలో "నమశ్శివాయ, భవాయ తే" అని యుండుటచేఁబూర్వో
దాహృతరామాయణ మీయధ్యాత్మరామాయణమై యుండునని
మిత్రులొకరు తలంచిరి. అదిసరిగాదు. అధ్యాత్మరామాయణ కీర్తనకర్త
సుబ్రహ్మణ్యకవి చిత్తూరుజిల్లాలోని కాళహస్తిసంస్థానమున క్రీ॥ శ॥ 1760
ప్రాంతములో నుండి యున్నవాఁడు. క్రీడాభిరామమాతనికి ముందు
మున్నూఱేండ్లక్రిందటనే వెలసినది.

8. మాచల్దేవివారాంగన గృహమందలి చిత్రశాల వర్ణనలో

ని వింటిజోదు రతి ♦ దేవిచనుంగవ నొత్తిగిలి యొ
య్యొయ్యనవంక చక్కఁబడ ♦ నొత్తెడుఁ జూచితె పుష్పబాణముల్
మయ్యెరవ్రాసెఁజిత్తరువు ♦ మాఁగిలి మాఁగిలి; చిత్రకారుఁడా!
దయ్యముగాక! పీనిపస ♦ దానము టిట్టిభ! పీనికీఁదగుర్"

అను పద్యమునఁ జిత్రకారుని నైపుణిని మెచ్చుటలో నాల్గవ
పాదమున 'పీనిపస' యను ప్రథమ ముద్రణపాఠమును 'నీవిపస' అని
శాస్త్రిగారు మార్చినారు. కాని యర్థమునుగాని తత్ప్రయోజనముగాని
వివరింపలేదు. పసదనము (పారితోషికము) అను పదమునకు 'పసదా
నము' అను రూపాంతరమును గూడ గ్రహించి గాని లేక పస (లెస్స,
మంచి) యను విశేష్యమును దాన శబ్దమునకు విశేషణముగఁగైకొని
గాని "నీవు పస దానముటిట్టిభ! పీని కీఁదగుర్" అని కవివ్రాసియుండు
నేమో యని నాయభిప్రాయము.

9. జారధర్మాసనము వర్ణనలో

"ముని తనకూఁతు దీ ♦ ముగఁజూపి, రోవట్టు
పరదేశివిటునిచేఁ ♦ బణముగినిపి"

అను పద్యపాదమందలి 'గినిపి' యను పాఠమును శాస్త్రిగారు 'గినిసి'
యని మార్చినారు. రెంటను అర్థము సుగమముగాలేదు. "పణము
గొనియు" అని కవిపాఠము కానోపును.

# కళాపూర్ణోదయము—కొన్ని విశేషములు

శ్రీ దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రిగారు

( అ ను వృ త్త ము )

మధురలాలసాకళాపూర్ణుల వివాహసమయమున సంతర్పణభోజనముల వర్ణించుసందర్భమున :—

"సురుచిభక్ష్యభోజ్యలేహ్యాచూష్యపేయభేదముల్. ౭. ౮౩ కొం).
అనునొకయుత్సాహావృత్త మేలూరిప్రతినుండి లభ్యమైనది. ఇది యితర వ్రాతప్రతులం దెచ్చటను లభ్యము కాలేదు.

మఱియు శబ్దరత్నాకరమునను జిన్నయసూరినిఘంటువునందును 'పటవణి' అనుపదముకడ "అరిగెలపటవణి నలరుచోట్లు" కళా. ౮. అని లక్ష్యము చూపఁబడినది. నేఁటివఱకున్న ముద్రితాముద్రితప్రతులం దెచ్చటను నీపద్యము కానరాలేదు. ఏలూరిప్రతియం దాపద్యము లభించుటయేగాక దానికిఁ బూర్వము మూఁడుపంక్తులగద్యమును పరమున నొకకందమును, ఒకయుత్పలమాలయు లభ్యములైనవి. ఇందుఁ గథాభాగ మేమియు లేకున్నను వర్ణనలు మనోహరముగా నున్నవి. క్రొత్త ప్రతిలో వరుసగా,

"౮ ఆ. ౨౨౦. ౨౨౧. ౨౨౨. ౨౨౩" పట్లు గమనించునది. ఇది గాక ౨ ఆ. ౭౧ పద్యము. ౫ ఆ. ౧౫ పద్యమును నితరముద్రణములయందు లేవు. ఏలూరిప్రతిలో నున్నవి. ఇవి మల్లాదివారిప్రతియందుఁగూడ నున్నవి. ఇంతేగాక యితరముద్రణములందు లేనిపదునేనుగద్యభాగములు, ఏలూరిప్రతినుండి నూతనముద్రణమున సంగృహీతములైనవి. ఇందుఁ జిన్నవియుఁ బెద్దవియుఁ గలవు. ఇవి ఆయాయి సందర్భముల కెంతయో యుపకరించినవి. (చూ. నూతనపాఠములు, అనుశీర్షికలో.)

## కొన్ని అపరూపములు

అచ్చుప్రతులలో నచ్చటచ్చటఁ గొన్ని సంప్రదాయవిరుద్ధములైన పదములు గలవు. ప్రామాణికనిఘంటువులను వ్యాకృతుల ననుసరించి వానిసాధురూపములను జూపెదను. అనుగతము లగుసాధురూపములఁగాక వేఱుగా సూరనార్యుఁడు వాడునా? ఇందు చి. ని. అనినఁ జిన్నయసూరినిఘంటువును శ. ర. అనిన శబ్దరత్నాకరమును, సూ. ని. అనిన సూర్యరాయాంధ్రనిఘంటువును ఆం. భా. అనిన ఆంధ్రభాషార్ణవమును వాచ. అనిన వాచస్పత్యమును, గ్రాహ్యములు.

(1) గీరెనంగింజలు. ఇది గీరనంగింజలు, అని సాధురూపము. అత్వమునకుఁగాని ఎత్వమునకుఁగాని నిర్ధారకము లేకున్నను బహుగ్రంథముల దీనిరూప మత్వఘటితముగ నున్నది. దీనికి బాలక్రీడావిశేష మర్థము. కాళహస్తి. 3.33. హంస. 3. ౧౮౬ శశాంక ౨. ౧౯. ప్రయోగములు గాంచనగును.

(2) రావురేక. ఇది రావిరేక, అని. శ. ర. రావ్రేక, అని దీనిరూపాంతరము. చిన్నయసూరి గూడ, ఇన్మధ్యరూపమునే గ్రహించెను. బహుగ్రంథముల నిది ఇన్మధ్యముగానే ప్రయుక్తమైనది. (చూ. శ. ర.) కాన ఉన్మధ్య మప్రసిద్ధము అననుగతము.

(3) స్రుకళ్లు. ఇది సృక్కు క్రియమీఁదనుండి స్రుక్కుడు, స్రుక్కుళ్ళు, అని యగును. "స్రుక్కులు తరగలు పొక్కిలి సుడి" నీలా, ౨ ఆ. మఱియు, చి. ని. శ. రలు గూడ నీరూపము నున్మధ్యముగానే గ్రహించినవి. కాఁగా నన్మధ్య మప్రసిద్ధము.

(4) మొగమాట. ఇది, మొగము + ఓడు. మొగమోడు, దీని కృదూపము, మొగమోట. ఇట డు. లోపము. ఓకారమునకు నిర్ధారకప్రయోగము శ. ర. లో చూపినాఁడు. కాఁగా నిది మొగమోట కాని మొగమాట కాదు-పెక్కుగ్రంథములం దిది మోకారఘటితముగానే యున్నది. మోమోట, మోమోడు, మున్నగురూపములుగూడ, ఓడు, నే సూచించుచున్నవి. మోమాట, అనురూపము నెవ్వరును గ్రహింపలేదు.

(5) పట్రము. కత్తి యనునర్థమున నిది 'పట్టెము, అని చి. ని. శ. రలు. దీనిరూపాంతరము 'పట్టియము,రామా. ౨.౨౨. చంద్రాం. ౫. ౬౫. ఈరెండుప్రయోగములును నిర్ధారకములు. కాఁగా అన్న రూప మప్రసిద్ధము. వ్యాకృతివిరుద్ధమును. 'ఇయ, గలరూపము ఎ, త్వఘటితమునకు మూలముగదా !

(6) ముదుల. ఇది ముదల అని, చి. ని. శ. ర. లు. దీనిపై ముదలకించు, ముదలవెట్టు, అనురూపము లనుప్రయుక్తమం దగును. ప్రభా. ౫. ఉ.హారి ర. ఆ. ఈప్రయోగములు శ. ర. లోఁ గాంచనగు. విభిన్నగ్రంథములఁ బ్రయుక్త మై నిఘంటుసమ్మత మైనరూపము ముదల గాని 'ముదుల' గాదు.

(7' కపాలభాతి. నౌలి. ఈరెండును యోగషట్కర్మముల లోనివి. నౌలికి, కపాలభాతి, అని వాచస్పత్యము. కాన పైరూపము లప్రసిద్ధములు.

"ధౌతి ర్వస్తి స్తథా నేతి ర్నౌలికీ త్రాటక స్తథా
కపాలభాతి శ్చైతాని షట్కర్మాణి సమాచరేత్" (వాచ)

(8) పట్టవర్ధనము. ఇది పట్టెవర్ధనము, అని చి. ని. శ. ర. లు గ్రహించినవి. పట్టి, అనుదానికి లలాటపట్టి అని, శ. ర. పట్ట అను దాని కీయర్థము లేదు. పట్టిమీఁదినుండియే యైనచో పట్టివర్ధనము, అగును గాని అన్మధ్యము కాదు. కాఁగా,పట్టెవర్ధనము, అనియే గ్రాంథిక రూపము.

(9) గోర్మొసలి. దీనికి, కోలుమొసడి, కోల్మొసడి,కోలుమొసలి, కోల్మొసలి, అని రూపాంతరములు. సరళాదిగా, రేఫమధ్యముగా రూపములు గానరావు. పెద్దమొసలి అనియర్థము. కోలు, క్రి. వి. ణా. మిక్కిలి యనునర్థముకలది. దీనికి కన్నడమున 'కోల్' అనియుఁ గలదు. కాఁగా గోర్మొసలి, అప్రసిద్ధరూపము (చూ. సూ. ని.)

(10) కిరుచుకత్తి. కిరుసుఁగత్తి, అని గ్రాంథికరూపము. కిరుసు= ఇరుప్రక్కల వాయి గలిగినవాట మైనకత్తి. దీనికిఁ దమిళమున, కిరుచు, అని గలదు. తెనుఁగున,

గీ...కిరుసు, దురుసుమాస్టీని బదరి యయ్యొరుసుపట్టి
గురుసుమదోత్యతనుని దూఱి గరుసు మీఱి, కువల. ర. ౩౧.

అని యనుప్రాసమం దుపనిబద్ధమై సాంతముగా నున్నది. మఱియు నితరప్రయోగము లనేకములు సాంతముగా నున్నవి. కాఁగా, కిరుచు కత్తి, అగ్రాంధికము (చూ. సూ. ని) ఇట్లే 'కిరుసుఁగైదువు' మొ॥

(11) సేవలు. ఇది భక్ష్యవిశేషార్థమున 'సేవెలు, సేవియలు' అని యుండును. చి.ని. శ. రలు గూడ నీ రూపములనే గ్రహించెను. గోదుమ నూకతో సన్నగా తాలికలు చేసి పాలు పోసి వండెడిభక్ష్యవిశేషము అనియు నర్థవివరణము చేసియున్నారు.

"తెగినజందెము లేల తెచ్చెద రనఁ గావు
వినుఁ డివి సన్నసేవియలుగాని. జై. భా. ౮. ఆ.

అని యిన్మధ్యమునకు నిర్ధారకము. మఱియుఁ బెక్కుప్రయోగములం దిది యియాంతముగను, ఎత్వఘటితముగ నుండుటచే అన్మధ్యరూప మగ్రాంధికము.

(12) దినస్సు. ఇది 'దినుస్సు, దినుసు' అని. చి. ని. శ. రలు గ్రహించినవి. గ్రంథములందును, వ్యవహారములందును గూడ నున్మధ్య రూపమే ప్రసిద్ధముగా నున్నది. నిర్ధారకప్రయోగము లేదు. కాన అన్మధ్య మప్రసిద్ధము.

(13) దసలీనూలిపట్టు. ఇది 'దసిలీ' అనుపదము కడ కళాపూర్ణోదయమే యిచ్చి 'దసిలీ నూలుపట్టె' అన్నది శ. ర. ఒక దినుసుపట్టు అని యర్థము. దీని కనేకప్రబంధములలో 'దసిలి, దసిలీ' అనురూపము లకు ప్రయోగము లున్నవి. (చూ. సూ. ని.) కాఁగా 'దసలీ' అప్రసిద్ధము.

(14) గవిసెన. ఇది 'గవుసెన' అని యున్మధ్యముగా బ్రసిద్ధము. వీణ మున్నగువానికిఁ దొడుగుగలీబు అని యర్థము. దీనికే 'గౌసెన' అని రూపాంతరమును గలదు. 'గవు' 'గౌ' అగుట కవకాశ మున్నది గాని 'గవి' గౌ, అగుట కవకాశము లేదు. ఇట్లే "గవుళి 'గౌళి' గవులు,

గాలు, గవుడ, గాడ'' ఇత్యాదు లగుచున్నవి. కాఁగాఁ 'గవిసెన' అగ్రాంథికము. (చూ. సూ. ని.)

(15) ఒడ్డాణించు. ఇది 'ఒడ్డారించు' అనినచోఁ బ్రకరణాను కూలము. ఒడ్డాణమునకు స్వర్ణాదిచే నిర్మింపఁబడిన పటకాయనియర్థము. ఇటనలకూబర మల్లయుద్ధసందర్భము గాన 'ఒడ్డారించు=ఎదుర్కొను,ప్రతి ఘటించు' అను నర్థమే పొసఁగును. తమిళమునఁ గూడ 'ఒడ్డారం= పోటిపందెము, అనునర్థము గలపదము గలదు. ఆం. భా. కూడ నీయర్థ మున రమధ్యముగానే గ్రహించినది. (చూ. సూ. ని.)

(16) మడము. గుదికాలు అనునర్థమున నిది 'మడమ' అని గ్రంథములందును, వ్యవహారమందును గలదు. శ. ర. కొన్ని ప్రయోగము లిచ్చి అదంతముగానే గ్రహించినది. కాఁగా ఉదంతరూపము ప్రబంధ ప్రసిద్ధము కాదు. 'మడమ యంచనఁగను, అని ఆం. భా. కూడ నదంత రూపమునే గ్రహించినది.

(17) కోడంద్రము. 'కోడంట్రము' అని గ్రాంథికరూపము. చి. ని. ఆం. భాలు కూడ దీనిని ట్రమధ్యముగ గ్రహించినవి. "కోడం ట్రికము, కోడంట్రము, కోడఱికము, కోటఱికము, కోటరము'' అని దీని రూపాంతరములు. ప్రయోగములందుఁగూడ ట్రమధ్యమే. కాఁగా ద్రమధ్యరూప మప్రయుక్తము (చూ. సూ. ని.)

(18) సంయూట. ఇది 'సయ్యాట' అని. శ. ర. ప్రయోగము లందు నిర్ధారకముగాఁ బ్రాసస్థానములఁ జూపినది. బహుగ్రంథములయం దును, వ్యవహారమందును నిది 'సయ్యాట' గానేయున్నదిగాని 'సంయూ ట'గా లేదు. కాఁగా 'సంయూట' గ్రాంథికముగాదు.

ఇట్లే, తిరుగా, మెప్పము, పిడిగల్లు, ఏకసంత, బబ్బిలికాయలు, సింధూత్తము, మున్నగురూపము లగ్రాంథికము లని గ్రహింతురుగాక. మఱియు, పిలుపించు, ఎఱుఁగించు, వంటిరూపములు గూడఁ గొన్ని ప్రతులఁ గలవు. ఇట్టివి ప్రాచ్యలిఖితప్రతులలో నెంత సార్వత్రికములుగా నున్నను భాషాసంప్రదాయవిరుద్ధము లని త్యజింపవలసినదే. అవి

వ్రాఁతతప్పులు. "భాషాసంప్రదాయమునకు విరుద్ధముగ నున్న వ్రాఁతతప్పు న్నచో సవరింపవలెను" అని వ్రాయించియు శ్రీ శాస్త్రిగారు పై రూపముల నుకారమధ్యముగా గ్రహించిరి. మఱియొకటి. ఎఱుఁగు, పిలుచు మున్నగుధాతువులక్త్వార్థరూపములు ఉన్మధ్యముగా నున్న నుచ్చరించుట సులువో ఇన్మధ్యముగా నున్న పలుకుట సులువో రవంత పరిశీలించిన నెట్టిరూపము భాషానుగతమో తేలును. విజాతీయమైన ఉ ఇ. లు ఒకదానివెంబడి నొకదానిని పలుకుటకు మనము శ్రమపడవలసి యుండును. కనుకనే విజ్ఞు లగువైయాకరణులు 'అనాద్యోత్త్వము న కిత్త్వము విధించిరి. మఱియు కోశములు, గ్రంథములు నెట్టి రూపములను గ్రాంథికము లని గ్రహించుచున్నవో గూడఁ జూడనగును. ఇందు గ్రాహ్యాత్యాజ్యనిర్ణయము పూర్వమే జరిగినది. కాఁగా పిలిపించు ఎఱిఁగించు, అనునట్టివే సార్వజనీనరూపము లనఁదగును.

ఇట్టి గ్రామ్యరూపములు ముద్రితములందుఁ జాలఁ గలవు. ఇవన్నియుఁ బరిశీలించి నూతనముద్రణమున సంస్కరించి చేర్చికొనఁబడినవి. ఎట్టి ప్రమాణములును లేక, పూర్వానుగత మగు సంప్రదాయమును వీడి, వ్యాకృతులను గోశములను ద్రోసిపుచ్చి పై రీతి నవరూపముల నూరనార్యుఁడు వాడియుండునా? లక్షణలక్షితము లైనసమస్త నియమములను బాటించి యింతటిప్రబంధమును వ్రాసిన మహాత్మున కట్టిలోపములఁ గట్టుట తగునా? గ్రాంథికత్వమునకు లోటులేని తన కాలపువ్యవహారములను జక్కఁగ వాడి భాషకు జీవమును గల్పించిన వాఁ డామహాత్ముఁడు. అంతేగాని వ్యాకృతిచ్ఛందోనియమములు పాటింపనివాఁడు కాడని ఘంటాపథముగఁ జెప్పవచ్చును.

## కొన్ని వ్యాకృతి విశేషములు

(1) కుమారాభ్రభుండు, కుమారాభ్రభనారసింహుఁడు. కుమార+ఔభళ. ఇది సంజ్ఞావాచకపదము గాన వృద్ధిసంధి రాఁగా నీసమాసములు సిద్ధించును. "కుమారయోబవసుధా, కుమారయోబభూకాంతుఁడు, ఉద్దండయోబళేంద్రుఁడు, కనగిరియోబళేశ్వరుఁడు" ఈ సమాసములందు నడుమ సంధిలేమియు, యడాగమమును, ఎట్లు? "శ్రీయహోబలనరసింహ

నాయకుండు, శ్రీయకాబళాఖ్యతిలకవతికి'' అని పాండురంగమాహాత్మ్య మునఁ గలవు. ఇట శ్రీ శబ్దముగాన దీనికి హ్రస్వము రాక మధ్యమపద లోపముచే యడాగమము రావీలున్నది. అప్పు డిది సాధ్యసమాసము. సంజ్ఞావాచకముగాన నెట్లన్నను సరియా ? "శ్రీ యన్నపోతాత్మజః''అని రత్నపాంచాలిక, చమత్కారచంద్రికలు.

(2) 'బంధురాజీపయస్సింధురాజీభవద్బంధు రాజీజయభ్రాజితుండు' యుద్ధ మనునర్థమున 'ఆజి' శబ్దము ఇకారాంతస్త్రీలింగముగాఁ గోశము లు చెప్పను. ఇట 'కృదికారాద క్తినః, అనునియమము ననుసరించి ఈకారాంతముగా ననుప్రాసమున వాడఁబడినది.

(3) స్ఫాయదక్కీర్తి...'' ఇట ఆత్మనేపద మగు 'స్ఫాయీ'=అను ధాతువునకు 'శానచ్' వచ్చి 'స్ఫాయమాన' కావలసి యున్నది. 'అనుదాత్తేత్త్వలక్షణ మాత్మనేపద మనిత్యమ్' అనునియమమున నట్లు ప్రయుక్తమైనది. "స్ఫాయన్నిరోష్ఠ్యకసంధిః''అని మురారి. "యుధ్యన్మేష మధ్యంబునన్'' అని చిన్నయసూరి.

(4) ధృష్ణద్బాహాబలావధీరితభీమా. (౨. ౧౯౧. శ్లో.) 'ఞిధృషా=ప్రాగల్భ్యే, అనుధాతువునకు 'క్త'ప్రత్యయము చేయ ఇడ భావమందు 'స్వపితృషోర్నజిజ్' ధృషేశ్చేతి వక్తవ్యమ్, అనునియమ ముచే 'నజిజ్' చేయఁగా 'ధృష్ణగ్' అనురూప మగును. 'ధృష్ణత్' అనునది సరియైన రూపము కాదు. ముద్రితము లన్నిట నిది యిట్లే యున్నది. కాఁగా,

'ధృష్ణగ్బాహాబలావధీరితభీమా, అని సాధుపాఠము.ఈపాఠము ముద్రితములలో నెందును లేదు.

(5) 'త్రుట్యమాణపతద్బిసాకృతివహింప' ౮. ౧౨౧. శ్లో. ఇందు త్రుటి=ఛేదనే, అనుధాతువువలన నిష్పన్న మగురూపము వట్రువ కలదని తలఁచి పైరీతి యతి నడిపిన ట్లున్నది. కానిచో యతి కుదురదు. ఇందలి ణత్వము ముద్రణస్ఖాలిత్యము. ఈ పద్యము పూర్వ ముద్రితములలో లేనిది. కానఁ బ్రక్షిప్త మందుమా? చిన్నయసూరి, శబ్దరత్నాకరకర్తయుఁదమని ఘంటువుల 'పటవణి' అను పదముకడ నీపద్యమందలి యొక పాదమును గళాపూర్ణోదయమందలి దని లక్ష్య

ముగాఁ జూపిరి. కాఁగా నీప్రమాదము చింత్యము.

(6) తేఁటిపిండురవురావము (౬. ౨౮౭. క్రో). .

ఇట సమూహార్థక మగు 'పిండు' అనుదానిపై 'రము' స్వార్థమునఁ జేరినది. 'పిండురము' అనుపద మేనిఘంటువునను గానరాదు. కొంద ఱిట 'తేఁటిపిం డురవురావము, ఉరవు=విస్తార మైన, అని యనుచున్నారు. అప్పుడు, 'ఉరవురావము' అనునది చెవి కింపుగా లేదు. అట్టిపాఠ మెచటను లభ్యము కాలేదు. కాఁగా, పిండురము, అనుదాని స్వరూప మేమో ? మఱియు నీ పాఠమున 'రావము' అనునది పునరుక్త మైనది. ఇట సరియైన పాఠ మేదియో ?

(7) పోచుక. (౪. ౧౫౭ క్రో.)

'పోవుచుక' అనురూపమునకుఁ బైరీతిగా సూరన వాడియున్నాఁడు. దుబ్మాత్రులు పర మగునపుడే వులోపముకదా ! ఇట 'చుక' అట్టి దేది యుఁ గాదే. కాఁగా నీరూప మెట్లు సిద్ధించును ? ముద్రితములందెల్ల నిది యిట్లే యున్నది. ఇది సూరనస్వాతంత్ర్యమా ?

(8) కన్పఱచు. (౮. ౩౦. క్రో)

'కనుపడు' అనురూపము వ్యావహారికమున 'కనపడు' అనుదానికి దగ్గర. దీనికి 'దృశ్యమగు' అనియర్థము. ఇటీవలి కవులును గ్రంథముల వాడి యున్నారు. దీనిప్రేరణరూపము 'కన్పఱచు' అగుట కవకాశ మున్నను ఇది ప్రామాణికులప్రయోగముల లేదు.

(9) జోడుముట్టు, చోడుముట్టు, ఇవి యపరూపములు. ముద్రితము లన్నిటను నీరూప మిట్లే యున్నది. (చూ. ౬. ౨౨౪ మ. ప్ర. ౨౨౫ క్రో. (ప) సోడు=బ్రహ్మరంధ్రము. సోడుముట్టు=బ్రహ్మరంధ్రము దాఁకు, అనియర్థము. అనఁగా ఘనసారగంధసారపరిమళంబులు నాసామార్గమున నడునెత్తి కెక్కిన వని భావము. ఈ విధమున 'సోడు ముట్టు' అనియే పెక్కురు కవులు దీనిని వాడినారు. సూ. ని. చోడు ముట్టు=సోడుముట్టు. అనుట పొరపాటు.

(10) అంతర్గతము. ఇది విశేషణముగాని విశేష్యము గాదు. ముద్రితములన్నిట 'అంతర్గతంబున' అని విశేష్యార్థమున నీయఁబడినది. అంతరంగమున అని క్రొత్తప్రతి.

## పరీక్షితము

సత్యరంభ కృత్రిమరంభ నెట్లో స్వర్లోకగమనమను యుక్తిపన్ని దానికామె యసమర్థయగుటచే సవతిపోరు తప్పించుకొన్నది. తరువాత నామెకు నలకూబరద్వయమునందెవఁడు దనప్రియుఁడో నిర్ణయించికొన వలసెను. కృత్రిమనలకూబరుఁడు గూడ రంభా మనోహరాకారుఁడగద! వేషభాషలలో సీషద్భేదమున్నను రంభను వంచించుట పరునకుఁ బొసఁగదుగద! అట్టియెడ రంభయెదుట నలకూబరుల కిద్దఱకుఁ గలహము పెఱిఁగినది. వారు వేవిధములఁ బోరాడిరి. అట్లు పోరుచుండ,

"అట్టియెడను బచ్చపట్టుదట్టీచేత
నొప్పుతనదు ప్రియుని నుజ్జ్వలంపు
శ్రీవినెఱపు చంద్రకావి దట్టీచేతఁ
బరుని గుఱుతెఱింగి సురవధూటి."

అనుపద్యము ముద్రితవ్రాఁతప్రతులన్నిట నున్నది. పచ్చపట్టుదట్టీగల తనప్రియుని, చంద్రకావిదట్టీగల పరునిం దెలిసినదఁట నిజరంభ. రంభను వంచింప నలకూబరరూపము దాల్చినపరుఁడు దట్టీరంగులలో మాత్రము సరిపుచ్చుకొని రాలేకపోయినాఁడా? సరిగా నలకూబరుఁడై వచ్చెనని గదా పూర్వము చెప్పెను. ఇంతలో నీ భేదమెట్లీమె కంటఁబడినదో? ఆ వెనుక తిరిగి పరీక్షింపుచు గళాపూర్ణుని పూర్వవృత్త మడిగి, చెప్పిన వానిని సత్యనలకూబరుగా నెంచికొన్నది. ఇట రెండు నిర్ణయములైనవి. సత్యముగా రెండవనిర్ణయమే నిర్ణయముగాని పై పద్యములోనిది నిర్ణయమే గాదు. కాని పై పద్యముమాత్రము అసందర్భముగా నడుమ వచ్చిపడినది. పరిశీలింప నీ విషయము తెలియక సూరనగారు రచించి రందమా! అట్టివాఁడా సూరన? ఆవులించిన ప్రేవులు లెక్కపెట్టువాఁడు. ఇంతజిగిగల గజిబిజితో కథాకల్పన మొనర్చిన యాతనికా యీ యసందర్భకల్పనము నంటగట్టుట? కాదుకాదు. నిజమాలోచింపఁ బ్రకరణము

గాంచితిమేని యీ పద్యమెవ్వరో వ్రాసి చొన్పినట్లు స్పష్టమగును. అదికిన పద్య మదికినట్లుగానే వ్రేలాడుచున్నది చూడుఁడు.

ఇట్లనేక ప్రకారంబులఁబోరుచుండ, 3-ఆ. 266 గద్యము. దీని చివరిభాగము ' శ్రమం, బెక్కుడుగాఁజేసినిలిచి రెడగా నంతఁ ' అని 268 వ పద్యము.

"రంభయు వారిరూపు ననిప్రౌఢియుఁ దుల్యతఁ జూచి" అని 269 వ పద్యము మొదలును గ్రమముగా నన్వయముగలిగి సరిపడినవి. కాఁగా ఆనడుమ గద్యము తఱువాత నున్న పద్యమును ప్రక్షిప్తముగాఁ దోఁచుచున్నవి. ఈక్రమమందు ప్రక్షిప్తపద్యమందలియనుపపత్తితోలఁ గునుగాని,పోరుచుండ,టక్కునఁబోరాడి,అను పునరుక్తి మాత్రము 266 గ॥ 268 ప॥ చూచిన కననగును. అపుడు గద్యమందలి చివరిభాగము 'పోవు చుండఁ, అనునంతవఱకేచాలును. ఎట్లయిన నిచట నాపద్య మప్రసక్త ముగానున్నది. ప్రతులింకను పరిశీలింప వలసియున్నవి. లేనిచో సూర నార్యుని కథాసంవిధానమునిది తేలికపఱచి తీఱును.

# చిన్నయసూరి

చిలుకూరి పాపయ్యశాస్త్రి

ఆంధ్రభాషామతల్లి కపూర్వభక్తితో సేవఁజేసి పండితాదరము నకుఁ బాత్రుఁడైన మహనీయుఁడు చిన్నయసూరి. నియమనిబద్ధమై సర్వాంగసుందరమైన నూతనశక్కిని దెలుఁగున వెలయించి యాదర్శ పూరుషులుగా నెన్నుకొనఁదగినమహనీయులలో నగ్రగణ్యుఁడు నన్నయ. అనుగణ్యుఁడుచిన్నయ. ఇట్టి భాషాసేవకుని పరిశ్రమమును గూర్చి యొక్కింత ప్రసంగింతును.

శ్రీసూరిగారి తండ్రిపేరు, రంగరామానుజాచార్యులవారు. పర వస్తు మఠము వారి కేతద్వంశీయులు శిష్యు లగుటచే వీరికి 'పరవస్తువా' రను గృహనామ మేర్పడినది. ఒకప్పు డీమఠమువా రుత్తరదేశమునుండి దక్షిణయాత్రకు బయలు దేఱినపుడు రంగరామానుజాచార్యులవారు తమభార్య శ్రీనివాసాంబతోను, వితంతు వగుకుమారితతోను గూడి చెన్నపట్టణము తిరువల్లిక్కేని రామానుజకూటములో బసచేసి యుండిరి. అపుడు ప్రతివాదిభయంకరం శ్రీనివాసాచార్యులవారు వీరిని పెరుంబుదూరు గొనిపోయి, అచ్చటికోవెలలో ద్రవిడవేదాధ్యా పకులుగా నియమించిరి. రామానుజాచార్యులవారికి సంస్కృత ప్రాకృత ములందును తెనుఁగునందును మిక్కుటమగు పాండిత్య మేర్పడియుండు టచేఁ బెక్కురు వారికి శిష్యులై విద్యలఁ బడసిరి. పెరుంబుదూరున నేఁటి కిని వారి శిథిలగృహ మొండు గల దఁట.

పుత్రసంతతి లేక కుందుచున్న రామానుజాచార్యులవారిచే శ్రీని వాసాచార్యులవారు పుత్రార్థముగ నొకహోమము చేయించి, శ్రీని వాసాంబ ఋతుస్నాతయైనతఱి మంత్రపూత మైనపాయసమును దంప తుల కిచ్చిరి. తత్కాలమున నామె గర్భవతియై క్రీ.శ: 1806 ప్రభవసంవత్స రమునఁ బుత్రునిగనెను. ఆపుట్టిన శిశువునకు 'చిన్నయ' నామ మిడిరి. ఈయది సూరి జన్మవృత్తాంతము.

## విద్యాభ్యాసము

సూరి పదునాఱు వత్సరముల ప్రాయమువఱకు నక్షరాభ్యాసమునకుఁ గడంగియుండలేదు. గారాపుబిడ్డఁడగుటచేఁ దండ్రిగారు వీరి విద్యాభ్యాసవిషయమున శ్రద్ధగైకొనలేదు. తల్లితోఁగూడి పేరంటములకుఁ బోవుచు మృదుమధురముగఁ బాటలు పాడుటయే యాతని కలవడినది. ఒకప్పుడు సూరిగారి జనకులకు మిత్త్రులయిన కంచిరామానుజాచార్యులుగారు పెరుంబుదూరు వచ్చి, నిరక్షరుఁడగు చిన్నయను జూచి పరితపించి "యిట్లు విద్య లేకుండుట నీకుఁ దగ"దని మందలించిరి. అంత మాత్రముననే యభిమానముతోఁ గుందుచు, చిన్నయ తనతండ్రిగారితో విద్య నభ్యసించెద నని తెలిపి, వారియనుమతిని శ్రీనివాసాచార్యుల వారియొద్ద నక్షరాభ్యాసము సాగించెను. అక్షరము లన్నియు నొక్క రోజునకే నేర్వఁగలిగెను. క్రమముగ వారియొద్దఁ జదువుకొనఁదగిన గ్రంథముల నన్నిటి నచిరకాలముననే చదివి ముగించెను. పిమ్మట తమ తండ్రిగారియొద్దనే సంస్కృతప్రాకృతవ్యాకరణములు చదువ మొదలిడెను. అప్పటికి రంగరామానుజాచార్యులవారిని గాజుల లక్ష్మీనృసింహశ్రేష్ఠిగారు ఈస్టిండియా కంపెనీ సుప్రీము కోర్టులో న్యాయవాదులనుగా నియమించిరి.

తండ్రిగారియొద్ద వ్యాకరణవిద్య సమగ్రముగా నభ్యసించిన వెనుక కంచి రామానుజాచార్యులవారి శిష్యత్వమున తర్కాలంకార గ్రంథములఁ జదివెను. ఇంతలో నరసింహశ్రేష్ఠిగారియొద్దఁ బండితులుగ నెలకొనియున్న రామశాస్త్రులుగారికి సూరియం దభిమాన మేర్పడిన కతమున నాతనికి హయగ్రీవమంత్రము నుపదేశించిరి. నియమముగ పురశ్చరణము సల్పియుండుటచే నామంత్రసిద్ధియు నీతనికి లభించెను. కావుననే సూరిగారు తాము రచించిన గ్రంథములకన్నిటికి నారంభమున 'శ్రీహయగ్రీవాయనమః' అనుచునే వెలయించినారు. ఆమంత్రప్రభావముననే వీరి కసాధారణశేముషీగరిమ యలవడినది. ఇట్లుండ క్రీ.శ.1836లో సూరిగారి తండ్రిగారు స్వర్గధామమును నలంకరించిరి.

అప్పటికి సూరిగారికి గృహయాత్రా నిర్వహణభారము శిరముపైఁ బడినది. కొలఁదిగ నాంగ్లము నభ్యసించియుండుటచే వీ రల్ప వేతనముపై 'ఆప్టన్' మిషనుస్కూలులోఁ దెలుఁగు పండితులుగఁ బనిచేయ మొదలిడిరి. వేదము వెంకటరమణశాస్త్రిగారు (వేదము వెంకటరాయ శాస్త్రిగారి తండ్రిగారు) అప్పటప్పట వీరితోఁ బ్రసంగించుచు వీరి క్షేము క్షేమహిమ కబ్బురపడుచుండెడివారు. సాహితీసేవలో వీరిసాహాయ్యమునుగూడఁ బడయుచుండిరి. ఆపండితపదవిలో నుండుతఱిని బ్రౌను దొరగారు, కొందఱు పాదరీలును, వీరియొద్ద తెలుఁగు నభ్యసించిరి. క్రమముగ సూరిగారి విజ్ఞానమున కచ్చెరువడి యాప్రముఖులు పచ్చయప్పకళాశాలా పరిధానాధికారులగు శ్రీనివాసపిళ్లెగారికి జాబువ్రాసి పంపఁగా వీరి కాకళాశాలలోఁ బ్రధానపండితపదవి లభించెను. ఆస్థానమున క్రీ. శ. 1848 వఱకుఁ బనిచేసినట్లుగ నాకళాశాలయందలి కార్యనివేదికలు (Annual reports) దెలుపుచున్నవి. ఆసమయమున 'పచ్చయప్పయశోమండనము' అను పేర సూరిగారు రచించిన పద్యములు కడు హృద్యములు. మచ్చున కొండు రెండు నీక్రిందఁ బొందుపఱుచుచున్నారు.

చ. అనయము భిక్షితాశనమ యాట, దురంతవిషాదభావముం
గొని, వసనంబులేవడికిఁ గుంది, సగం బయినట్టి పార్వతీ
శుని మును ముకుబ్రోవ నన్న మిడి, శుద్ధదుకూల సమర్పణంబులం
దనియఁగఁజేసెఁ; బచ్చనరనాథుఁడు గేవలదాతృమాత్రుఁడే?

సీ. చందనహిమవారి సమభిషేకంబునఁ
దలమేటి పెనునాచుఁ దలఁగఁజేసి
కమనీయ కస్తూరికా సంకుమదచర్చఁ
బూదిపూఁతలరొచ్చు బోఁకువెట్టి
హరుకుముంజి ముత్యాలచెఱఁగు హారాంబట్టుచే
తోలుతచేలపుతేవ తొలఁగఁజేసి
యమృతోపమాన దివ్యాన్నార్పణంబునఁ
గంఠగరళ కటుకత్వ ముడిపి

గీ. హరు మహాదేవు నిత్యసమర్చ్యాణ క్రి
యాకలాపంబులను దనియంగఁ జేయు
మహిత బుధలోక జేగీయమానుఁడైన
పచ్చనప్పమాళి యాశ్రిత పద్మహేళి.

వ్యాకరణరచయితల కిట్టి ధారాపాటవము కల్గుట యబ్బురము. కాని యీరచన శ్రీనాథుని శైలిని దలఁపించుచున్నది. తెలుఁగునందే గాక సంస్కృతమునందును నీతనికవితకుఁ బాటవము గాన్పించుచున్నది. తిలకింపుఁడు:—

శ్లో. ఏకాం కలాం భువనజాతహితాం దధాన
స్సర్వజ్ఞతాం వద కథం లభతే గిరీశః
బహ్వీః కలా భువనజాతహితా దధాన
స్సర్వజ్ఞ ఏష ఖలు పచ్చపమానవేంద్రః.

శ్లో. గుణస్య బాధికాం వృద్ధిం కృతవాన్ పాణినిప్రభుః
అబాధితగుణాం వృద్ధి మకరో త్పచ్చపప్రభుః.

ఇట్లీ పచ్చయప్ప కళాశాలయందుఁ బనిచేయునపుడే ఇంగ్లీషు లాచట్టములకు భాషాంతరీకరణము (ఆంధ్రానువాదము) నొనర్చినట్లు తెలియవచ్చెడిని. అందలిభాషయు వ్యావహారిక మఁట. దానిస్వరూప మెట్టిదో చెన్నపురియందలి ఆంధ్రభాషాపరిశోధకులు నిర్ణయించి పాఠకుల కెఱిఁగించెదరుగాక.

పిమ్మట సూరిగారు ప్రెసిడెన్సీ కళాశాలలోఁ బ్రధానపండితులుగ నియమింపఁబడిరి. ఆనాఁడు మద్రాసు యూనివర్సిటీ కార్యదర్శిగానుండిన 'ఆర్బతు నాటు' దొరగారు కాశీనుండి కొందఱు పండితులను రప్పించి శాస్త్రములందుఁ బరీక్ష చేయింపఁగా వీరు ప్రథములుగను హయగ్రీవశాస్త్రిలుగారు రెండవవారుగను వచ్చిరి. అప్పుడు వీరికి బంగారు పదకముతోపాటు 'సూరి' యని బిరుద మొసంగఁబడినది. నాఁటినుండి వీరు 'చిన్నయసూరి' అని వ్యవహరింపఁబడుచు వచ్చిరి.

## సూరిగారి          లు.

1. ఆంధ్రశబ్దశాసనము.
2. ఇంగ్లీషులాచట్టముల భాషాంతరీకరణము
3. చాటుపద్యములు.
4. రాణీగారిమకుటాభిషేకపద్యములు
5. సంస్కృతబాలబోధ
6. సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణము.
7. ఆంధ్రశబ్దచింతామణివ్యాఖ్య
8. బాలవ్యాకరణము
9. నీతిచంద్రిక
10. శబ్దలక్షణసంగ్రహము.
11. అక్షరగుచ్ఛము
12. పద్యాంధ్రవ్యాకరణము.
13. విభక్తిబోధిని.
14. అకారాదినిఘంటువు.
15. విశ్వనిఘంటువు టీక.
16. ఆదిపర్వవచనము.
17. సుజనరంజనీపత్త్రిక.
18. ఆంధ్రధాతుమాల.

### ఈకృతులనుగూర్చిన విశేషములు.

సూరిగారు సంస్కృతవ్యాకరణమున నసాధారణమైన పాండితి గల్గియుండుటచేఁ దెలుఁగునందును నట్టి ప్రౌఢిమగల వ్యాకరణము రచియింప నమకట్టి సఫలత గాంచిరి. పాణినీయసూత్రముల నెన్నినతరువాత సూరిగారి సూత్రముల నెన్నఁదగు. 'అల్పాక్షర మసందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్' ఇత్యాదిసూత్రలక్షణము వీరిసూత్రములం దెల్లెడ నన్యూనాతిరిక్తముగ సమన్వితము. వీ రాంధ్రభాష నుద్ధరించుటకై రచియించిన సూత్రగ్రంథము లనేకరీతుల వెలసినవి. వానిలో 'శబ్దలక్షణసంగ్రహము' అను తెలుఁగుసూత్రములతోఁగూడి వెలువడినగ్రంథము తొలుతటిది. ఆనాఁటికి వ్యాప్తిలోనుండిన చింతామణి, అధర్వణకారికలు, అప్పకవీయము, అహోబలపండితీయము మున్నగులక్షణగ్రంథములను బాగుగ విమర్శించి యందలి ముఖ్యసిద్ధాంతము లిముడున ట్లీసూత్ర

ములు రచించిరి. అంతియగాని భాషాస్రవంతి కడ్డు గట్టఁ దలంపుతో నేయొక్కయక్కరమును వ్రాసియుండలేదు. సూరిగారీశబ్దలక్షణసంగ్రహమును, దమకు మొదటనుండి బాసటగా నుండి భాషాసేవకు ప్రోత్సాహకులైన గాజుల లక్ష్మీనృసింహశ్రేష్ఠిగారి కంకిత మిచ్చి 1853 జూలై నెలలో ప్రథమముద్రణము గావించిరి. కొందఱు విమర్శకు లీగ్రంథము సూరి రచియించినది కా దందురు. అయ్యది యవిచారమూలకము. సూరిగారి యితరరాంధ్రవ్యాకరణసూత్రములతోఁ బోల్చి చూచిన పోలిక లెక్కుడు గానవచ్చుటచే విమర్శకుల యూహ గ్రాహ్యముగాదు. సూరిగారి ప్రథమశిష్యులగు బహుజనపల్లి సీతారామాచార్యులవారి యీవచనములచే సూరిగారే యీగ్రంథమును రచించినట్లు సుస్పష్టము.

1853 లో బాలవ్యాకరణము ప్రథమముద్రణము కావింపఁబడినది. అయ్యది సర్వథా నిర్దుష్టము. తరువాతి ముద్రణములలో సూరిగారి మతమునకు విరుద్ధమగు సంస్కారములు గావింపఁబడినవి.

క. మును మదుపజ్ఞం బగుచున్
దనరిన వ్యాకృతిని సూత్రతతి గొంతం
దెనిఁగించి యిది ఘటించితి
ననయము బాలావబోధ మగుభంగిఁ దగన్.

అను సూరిగారి ప్రతిజ్ఞావచనముచే నీ వ్యాకరణము బాలురకు వచనరచన సేయు కౌశల మేర్పడుటకుఁ గూర్పఁబడినది. కావుననే—

క. అనయము లలితోక్తులతో
నెనరుపడం గూర్చి లక్ష్యయోజన మొప్పం
గను బాలవ్యాకరణం
బనఁగా లక్షణ మొనర్తు నాంధ్రంబునకున్.

అని నొడివియున్నారు. దీని ముద్రించుకాలముననే నిఘంటునిర్మాణయత్నమును కొనసాఁగుచుండుటచే నీరీతిగ సూచించియున్నారు.

ఆ. దిక్ప్రదర్శనముగఁ దెలిపెద నిందు ల,
క్షణము గానఁ బూర్వకవుల లక్ష్య
ములను లాఁతిలక్ష్మములఁ గాంచి తక్కు ల,
క్షణ మెఱింగికొనుఁడు చతురమతులు.

అని హెచ్చరించియున్నారు. నిఘంటువు రచించునపుడు లక్ష్యముల ననుసరించి కావింపవలసిన లక్షణవిస్తృతిని గావించియే యున్నారు.

1955 లో నీతిసంగ్రహము వెలువడినది. అందు, "ప్రాచీన పద్యంబులు కొన్నింటితోడం బెక్కు లభించిన పద్యంబులు గూర్చి బాలురకు నీతిబోధంబుకై యీకృతి రచియింపఁబడియె. పరవస్తుచిన్నయసూరి" అని కలదు.

నీతిచంద్రిక 1853 లోఁ బ్రథమముద్రణము నందినది. ముఖపత్త్రమున—

To

A. J. Arbuthnot Exq
Secretary to the Madras University and college of fort saint George.

This work is respectfully dedicated as a mark of respect by
his most obedient and hunble servent
P. Chinniah soore, Telugu Head master
in the Madras University.

అని కలదు. ఇట్టి గ్రంథము తమ కాశ్రయ మొసఁగి గౌరవించిన ఆర్బతునాటుదొరగారి కంకిత మీయఁబడినది. 1865 డిసెంబరు నెలలో వెలువడిన సుజనరంజని పత్త్రికలో చిన్నయసూరిగారిని గూర్చియు వారినీతిచంద్రికను గూర్చియు బహుజనపల్లి సీతారామాచార్యులుగారు. పి. సుబ్బారాయలు నాయుఁడుగారు కృష్ణమాచార్యులుగారును గలిసి యీక్రింది ప్రకటన గావించిరి.

"ఈవచనకావ్యము మిక్కిలి ప్రౌఢముగాను లక్షణములకు లక్ష్యము గాను, జక్కనిప్రయోగములు గలదిగాను గానఁబడుటచేత లోకమునం దిది విశేషవ్యాప్తి గలిగి యుండఁదగినది. దీనిని రచియించిన పరవస్తు చిన్నయసూరిగారికి నాంధ్రమందును దదుపయుక్తమగు సంస్కృతప్రాకృత ములందును దలస్పర్శియగు పరిజ్ఞానము గల దని వారు చేసిన లక్ష్యలక్షణ గ్రంథములే నిరూపించుచున్నవి. మేము వారితోఁ జిరకాలము సావాస మొనర్చి, నాంధ్రమందలి యనేకవిషయంబుల నెఱింగినవారము; గనుక వారిపాండిత్యము మా కనుభవసిద్ధము. వారు రచించిన గ్రంథములలో ముఖ్యములు శబ్దలక్షణసంగ్రహము, బాలవ్యాకరణము, నీతిచంద్రిక. వీ రారంభించి ముగింపనివి అకారాదినిఘంటు వొకటి, సంస్కృత సూత్రాంధ్రవ్యాకరణ మొకటి,విశ్వనిఘంటువుటీక యొకటియు. ఈమూఁ డును ముగిసియుండెనేని యాంధ్రభాషకు మఱి యపేక్షణీయ మేమియు నుండనేరదు. ఆంధ్రభాషయొక్క యభాగ్యమే వారిని గీర్తిశేషులను జేసినది. ఈగ్రంథములను సమగ్రములనుగాఁ జేయవలె నని మ. రా. రా. Honerble గాజుల లక్ష్మీనరసింహులు సెట్టిగారు c. s. i. బహుప్రయ త్నము చేయుచున్నారు. వారియత్నము సఫలము గావలయునని మేము సర్వేశ్వరునిఁ బ్రార్థించుచున్నాము" అని.

శబ్దరత్నాకర కర్తలగు సీతారామాచార్యులవారి పై వాక్యములె సూరిప్రతిభావిశేషమును, ఆతనిగ్రంథప్రాశస్త్యమును వేనోళ్లఁ జాటు చున్నది. పై ప్రకటనయందు ముఖ్యముగ గమనింపఁ దగినయంశములు కొన్ని గలవు. అవియేవి యన—శబ్దలక్షణసంగ్రహము చిన్నయసూరి కృతమే యనియు,సీతారామాచార్యుల వారి యాంధ్రభాషాజ్ఞాన మంతయు గురువులగు చిన్నయసూరిగారివలన లభించిన దనియు, నీతిచం ద్రిక అత్యుత్తమగ్రంథ మనియు—నివి.

నాఁడు పాఠశాలలలోఁ జదువుబాలుర యుపయోగార్థమై రచింపఁ బడిన నీతిచంద్రిక నేఁ డంతయుఁ గాకున్నను గొంతభాగ మైనను విద్యార్థు

లకుఁ బాఠ్యముగా తప్పక కూర్పఁబడుచునే యున్నది. సూరిగారీ కబ్బము తుదిముట్టఁ జదివిన బాలుర కోలి బాషాజ్ఞానము పొదలుటకును నీతికుశలత్వము కొదలేక కుదురుటకును,పంచతంత్రహితోప దేశములఁ బరికించి, వానిలోని యంశములను, అభినవంబుగఁ గొంతయును గూర్చి కృతి యొనర్చిరి. ఈకబ్బము నందలి వచనరచన చాలవఱకు నన్నయ వచనరచన ననుసరించినది. మఱియు,

క. ఘను నన్నయభట్టును ది,
క్కన నేరాప్రెగడఁ బొగడి యలికంబున న
ష్ఠిని డాఁచినట్టి సర్వ
జ్ఞుని నాచనసోమనాథు స్తుతి యొనరింతున్.

అని గ్రంథారంభమున స్తుతించిన కవులయు, శ్రీనాథాది యుత్తమ కవులయు నుత్తమరచనలయందలి సారవచనముల నేర్చికూర్చినాఁడు. ఆయాకవులకావ్యములలో నటనట విరళముగ నున్న మేలిపదజాలమును సందర్భోచితముగ నదికి నూత్నావిష్కారము నొనర్చినాఁడు. ఈరచన కిదియే సాటి. సూరిగారికిఁ బూర్వమునఁ గొన్ని కేవలవచనగ్రంథములు వెలువడినవి. కాని యవి శైలిలో పద్యప్రబంధములతోఁ దులతూఁగు నవియే గాని పై విలక్షణపథము నందినదివి గావు. కందుకూరి వీరేశలింగము పంతులుగారు శ్రమగొని నీతిచంద్రికయందలి కొదువభాగములను బూరించిరే గాని సూరిగారి శైలిమాత్రము వారి కలవడలేదు. అట్టిరచన విలక్షణప్రతిభాసమున్మేషమున సహజముగ నుప్పతిల్లవలెనే గాని యనుకరణమున లభించునదిగాదు. కేతన పెద్దనమున్నగు ప్రాచీనాంధ్రలాక్షణికులును లక్షణగ్రంథములను లక్ష్యగ్రంథములను రచించియున్నారు. అటులనే సూరిగారును బాలవ్యాకరణము లక్షణముగను, నీతిచంద్రికను లక్ష్యముగను సంతరించినారు. బాలురయుపయోగమునకై రచించిన యవి నేఁడు ప్రౌఢులకును దురూహ్యము లైనవి. విచ్చలవిడి వ్రాయుట

కధికారము నపేక్షించువారికి వెగటు గల్గించునది యైనను నీతిచంద్రిక నియమబద్ధరచన నపేక్షించువారికి హృదయంగమమై యమందవికాసమునొదవించుచున్నది. ఒకవాక్యమున నొక్కపదము ప్రయోగింపఁబడినచోఁ దరువాతి రెండువాక్యములలో భంగ్యంతరమున నాపదవివరణముండి తీరును. ముద్దుల మూటగట్టు తెలుఁగునుడికారముసొంపు గాంచవలయు నన్నచో సహృదయతతో నీతిచంద్రిక తనివి దీఱఁ జదువవలయును.

1931 వ సంవత్సరమున కొత్తపల్లి సూర్యారావుగారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలో "సూత్రాంధ్రవ్యాకరణములు" అనునొక గ్రంథమును బ్రకటించియున్నారు. అందు సూరిగారు బాలవ్యాకరణము తుదిని "మును మనుపజ్ఞం బగుచుం దనరిన వ్యాకృతిని సూత్రతతి గొంతం దెనిఁగించి యిది ఘటించితి" నని తెలిపిన సంస్కృతాంధ్రవ్యాకరణసూత్రములును, 'ఆంధ్రశబ్దానుశాసన' మను పేరుగల తెలుఁగు సూత్రములును, పద్యాంధ్రవ్యాకరణ మను పేరఁ బరగిన పద్యములును గలవు. ఈసంగ్రహ మంతయు సూరిగారి బంధుగులును, చెన్నపురి కోమలేశ్వరముపేట కార్పొరేషను పాఠశాలలో నుపాధ్యాయులు నగు నారాయణవనము వకుళాభరణము గారి హస్తపుస్తకము (Hand note book) నుండి సేకరింపఁబడినది. వకులాభరణముగారు సూరిగారికి బంధుగులును శిష్యులును గూడ. ఆపుస్తమునందే వారు సూరిగారి జీవితచరిత్రాదులను వ్రాసికొనియుండిరి. అందు వకుళాభరణముగారు తమకు దొరకిన యీసూత్రములు సూరిగారి చిత్తుప్రతినుండి వ్రాసికొంటిమనియు, సంస్కృతసూత్రాంధ్రవ్యాకరణము శుద్ధప్రతి ఆత్మకూరు సంస్థానము చేరియుండె ననియు వాకొనియున్నారు. పరిషత్తువారికి లభించిన వకుళాభరణముగారి ప్రతి ననుసరించియే సూత్రముల నెత్తి వ్రాయించి స్వరూపోచ్ఛేదము కాకుండు నట్లుగ యథార్థముగ సంస్కరించి 'సూత్రాంధ్రవ్యాకరణము' లను బ్రకటించియున్నారు.

సంస్కృతసూత్రములలో సంజ్ఞాపరిచ్ఛేదము తుదిని గానవచ్చు నీక్రింది గద్యమువలన సూరిగారి వంశాదిక మెఱుఁగ నగుచున్నది. "ఇతి

సకలభాషాకవికమలమిత్త్రి గార్గేయసగోత్ర ఆపస్తంబసూత్ర యజుశ్శాఖాధ్యాయి వేంకట రంగరామానుజార్యపుత్ర శ్రీనివాసాంబాగర్భ శుక్తి ముక్తాఫలాయమాన దిగంతవిశ్రాంత చిరంతనకీర్తి విరాజమాన సంస్కృతాంధ్రభాషానుశాసన బహులక్ష్య లక్షణగ్రంథరచనాధురీణ సర్వదర్శనసంగ్రహ కుసుమాంజలీ మహాభాష్య శ్రీభాష్యభగవద్విషయ పాఠప్రవచనపారీణ చాత్తాద శ్రీవైష్ణవకుల కలశాంబుధి పూర్ణచంద్రేణ ఆంగ్లరాజకీయ సర్వకలాశాలాంధ్ర ప్రధానపండిత చిన్నయసూరిణా ప్రణీతగీర్వాణభాషాయా మాంధ్రశబ్దానుశాసన సంజ్ఞాపరిచ్ఛేదః''

ఈగద్యమును జిన్నయసూరిగారు స్వయముగ రచియించి రనుటకుఁ దగిన యుపపత్తి గానరాదు. కాని సూరిగారి పాండిత్యాదికమునకిది నిదర్శకము. ఇట్లీసూత్రము లతివిపులముగనే యున్నవి. శుద్ధమైన రూపము నందక పోవుటచే సూరికృతము లగునా? కాదా? యని కొందఱకు సందియము నొదవించుచున్నవి. కాని యట్టి సంశయమునకు మాత్రి మవకాశము లేదు. సూరిగారు తమనిఘంటుపదసూచికలో వీనిలోఁ గొన్నిసూత్రిములకు వ్యాఖ్యానము వ్రాయ మొదలిడిరి. అట్టివ్యాఖ్యానముతోఁ గూడినవి కొన్నిసూత్రిములే. అవియు ముద్రితములైన యీ సూత్రిములు నొక్కరూపు గలవియే. వారు స్వయముగ వ్రాసికొనిన ప్రతి లభించినచో విమర్శకుల కప్పుడు శంక గలుగఁ దావల ముండఁబోదు. ఈసూత్రిములఁ గొన్నిటిని వీరికి ముఖ్యశిష్యులు మిత్త్రిలు నగు బ. సీతారామాచార్యులవారు తమ ప్రౌఢవ్యాకరణమునఁ బరివర్తనముచేసికొని యున్నారని యీవఱకే నేను భారతిపత్రిక (1940 నవంబరు) "సూరిగారి సూత్రాంధ్రవ్యాకరణములు" అనువ్యాసమునఁ దెలిపియుంటిని. సూరి నిఘంటువ్రాతప్రతులు సీతారామాచార్యులవారికి లభించి యుండుటను గూర్చి క్రమముగఁ దెలుపుదును.

1930 లో 'ఆంధ్రధాతుమాల' అనుపేరఁ బరిషత్తున సూరిగారి రచన వెలువడినది. ఇం దాంధ్రధాతువులు సంస్కృతభాషావివరణముతోఁ గూడియున్నవి. పలుతావుల ననేకార్థము లీయబడినవి. సక

ర్మకాకర్మకవిభాగముఁ జేయఁబడినది. ఈగ్రంథమునకుఁ బీఠిక వెలయించుచు శ్రీ కట్టి సాంబమూర్తిశాస్త్రిగారు గ్రామ్యములగు స్వరూపములు గానవచ్చినవి గాన నీయవి చిన్నయసూరికృతములు గావేమో యని సంశయించిరి. కాని యట్టిసంశయ మక్కఱలే దనియే నాయూహ. ఏలయన—ఈధాతుసంచయము చిన్నయసూరిగారి నిఘంటువ్రాఁత ప్రతులతోపాటు లభించినది. నిఘంటుప్రథమసంపుటమున సంజ్ఞావివరణ పట్టికలో గ్రామ్యమునకు 'గ్రా' అనుసంకేతము నాతఁడు వ్రాసికొనినాఁడు. ఆయాపట్ల నట్టి రూపముల నిచ్చుచునే వచ్చుట తటస్థించినది. గ్రామ్యముల సేకరింప మను ప్రతిజ్ఞ వారికిఁ గానరాదు. భాషావిభాగమున నట్టివానిలో ననింద్యముల గ్రహించియేయున్నారు. మఱియు నిఘంటుసంపుటములందును పదసూచికలయందును తెలుఁగుధాతువులు సంస్కృతార్థములు నెడనెడఁ గానవచ్చుచునే యున్నవి. ఆతనిరచన సమగ్రము గాకుండుటచేఁ గొండఱ కప్పటప్పట సంశయ మొదవినను నీరీతి ససందిగ్ధముగ నాంధ్రధాతువుల కర్థనిర్ణయము సేయుట సంస్కృతాంధ్రములందుఁ దలస్పర్శియగు జ్ఞానము గలసూరిగారివంటి పండితప్రకాండులకే గాక యన్యులకు సాధ్యపడునది గాదని నామనవి.

1859 లో 'విభక్తిబోధిని' ప్రచురింపఁ బడినట్లు వకుళాభరణముగారి హస్తపుస్తకమునఁ గలదు. ఈగ్రంథస్వరూప మెట్టిదో యెఱుఁగుటకై ఆంధ్రగ్రంథపరిశోధకులు పూనుకొనెదరుగాక.

'అక్షరగుచ్ఛము' ముద్రితము. కాలాదిక ము తెలియరాదు. 'బాలశిక్ష'యని దీనికి నామాంతరము. అందలిగుణితసూత్రములు మాత్రము కొన్ని యుపలభ్యము లగుచున్నవి. వాని నీక్రిందఁ బొందుపఱిచెదను. 1. పరుషంబులకు మీఁద బరక్షరంబు లగు 2. సరళంబులకు హ్రస్వుస్సు లగు 3. ఉభయంబులకు సమానాంతస్థ లగు 4. వర్గసమంబులకు నగు 5. కతనఫసలు సాకగు (తాదిపంచకమునకు శచవర్గములు లేవు) 6. చఛబభమయలు రాకగు 8. జ ఝ జ మయలు రాకగు 9. ఠాకుఢనలలు లేవు 10.కగమరషహాంబులకు ణకారం బగు 11. అనునాసికలకు స్వస్వవర్గంబు లగు 12. జాకుం దఱచుగా నన్నియు నగు 13. మాకు ణాంతస్థంబు లగు

14. ణాకు నమయవలు నగు 15. సరలకు సర్వంబు నగు 16. చణలకు నకారంబు లేదు 17. చథలకు మకారం బగు 18. ఖఠథరలకు రేఫంబు లేదు 19. ఝాకు యకారం బగు 20. షాకు వకారం బగు 21. యళలకు యవలగు 22. కగపఫమయవలహలు లా కగు 23. శాకు సమాంతస్థ చఛశలగు 24. కటప ఖఠఫ మయవషలు కాకగు 25. వాకు నాంతస్థము లగు 26. హాకు మకారంబు నగు 27. వికృతిని బుగ్విసర్గసమజఝశషలులేవు. 28. హల్లు లెల్లం దమకుం దా మగు 29. హాకు యోగంబు లేదు. 30. సరలకు సర్వ మగు 31. తటలు వాకు లేవు 32. సర్వంబునకు క్రారయగు 33. చరణహరలకు లేవు 34. కగచతపమలవలు డా కగు 35. టాకు నలలగు 36. తకారంబు సా కగు. 37. ఉగ్మలి మవ్వమడ్డిడ్డ చెయ్యుంబు చెద్దిచెద్దుము. అవశిష్టంబుగలిగిన శిష్టప్రయోగంబుల గ్రహించునది. ఇందుం గా వ్యావ్యవహారగోచరంబులే నిరూపింపఁబడియె.

## అకారాదినిఘంటువు.

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునం బ్రవేశించి పనిచేయు నాఁడు ప్రారంభమున నే నాభాండాగారమునందలి ముద్రితాముద్రిత గ్రంథములం బరికించుచుండ 'చిన్నయసూరీయము' అను వకుళాభరణముగారు పరిషత్తున కొసంగిన గ్రంథము నాదృక్పథమునం బడినది. పుటలు తెఱచి చూడఁగ నొకచో 'అకారాదినిఘంటువు' అను శీర్షికతో నీక్రింది వాక్యములు గానవచ్చినవి.

“సూరిగారికిం బూర్వమునం దెనుఁగున అకారాది నిఘంటువు లేకయుండుటయు, గాజులలక్ష్మీనరసింహముశ్రేష్ఠిగారి ప్రోద్బలమునను, ఈగ్రంథము వ్రాయ మొదలిడి యటుల కొంతవఱకు వ్రాసి యుండిరి. హకారమువఱ కందురు. (అ to హ) విశ్వనిఘంటువు కూడ వ్రాయుచుండిరి. అప్పుడు వారికి 1861 సం॥న రాచపుండు తటస్థించి 1862 దుందుభి సంవత్సరమున గతించిరి. సూరిగారి కుమారులలో కొందఱు గతించియుండిరి. సూరికోడలివద్ద నీవ్రాఁతప్రతి యుండెను. సీతారామాచార్యులవారు

వీరి ముఖ్యశిష్యులు వీరు సూరిగారి కోడలుండుచోటునకువచ్చి మామా
మగారు రచించియుండు అకారాదినిఘంటువును హానరబిల్ లక్ష్మీనర
సింహము శ్రేష్ఠిగారు కొన నుద్యమించియున్నారనియు, నేనీవ్రాఁత ప్రతి
వారికిఁ జూపి పైక మిప్పించెద ననియుఁ జెప్పి, గ్రంథమును దీసికొనిపోయిరి
సుమారొక వర్షమునకును నేవిషయమును దెలియక యుండఁగా నామె
పరితపించి యచ్చట కాపురముండిన వారలలో కె. విజయరాఘవులు
నాయుఁడుగారిని వీరివద్ద కంపఁగా, ఆచార్యులవా రొక ప్రతివ్రాసుకొని
సూరిగారిప్రతి నాయుఁడుగారిచేతి కిచ్చి యిది యిప్పుడనవసర మనియు,
గ్రంథము పూర్తిగ ముగింపలే దనియు మిషబెట్టి పంపివేసిరి. ఈగ్రంథ
మెట్టులో విద్వాంసులచేతులఁ బడి తుదకు పీఠికాపురాధీశ్వరుల గ్రంథ
భాండాగారము నలంకరించినది. ఆచార్యులవారు అకారాది నిఘంటువు
పూర్తి యొనర్చి శబ్దరత్నాకర మను పేరిడి యాంధ్రదేశంబున మిగుల
నుపయుక్తమగు నిఘంటురాజం బొసంగినందులకు వారల కెంతయు
కృతజ్ఞులము. సూరిగారికి పూర్వము తెలుఁగున నిఘంటువులు లేకయుం
డిన వనియు,సూరిగారే నిఘంటు పితామహుఁ డనియు శబ్దరత్నాకరం
బునఁ దెలిపిరి.”

N. Vakulabharanam.

పై వాక్యములను జదివినదాదిగ నాకు సూరిగారి నిఘంటు వ్రాఁతప్రతు
లను జూడవలె నను నాతురత హెచ్చినది. అప్పటికి శ్రీ సూర్యరాయాం
ధ్రనిఘంటు కార్యాలయము పిఠాపురమున నుండెను. అచ్చటికిఁబోయి
సూరిగారి ముక్తాఫలములఁ బోలు నక్కరములతోఁగూడిన యావ్రాఁత
ప్రతుల నన్నిటిని దమియూరఁ జూచి తనివిచెందితిని.

## నిఘంటు నిర్మాణ పద్ధతి

నన్నయ మొదలుగ కూచిమంచి తిమ్మకవి వఱకుఁ గలఁ
యుత్తమకవుల ప్రబంధములయందలి ప్రామాణిక ప్రయోగములును,
అందలి పదపదార్థములును తొలుత నిఘంటుపదసూచిక, అను పేర
నేకరింపఁబడినవి. ఈరచనా ప్రారంభము 1850 వ వత్సరము మొదలుగ

గానవచ్చెడిని. భారతపదసూచిక ప్రారంభమున "ఏప్రియల్ ౨౩ వ తేది" అని యున్నది. రామాభ్యుదయ పదసూచిక తుదిని "సౌమ్యనామ సంవత్సర పుష్యమాసము తేదులు ౨౯. ౧౮౫౦ జనవరి నెల ౧౨ తేదీ శుక్రవారమున వ్రాసి ముగిసినది'' అని కలదు. నృసింహ పురాణ పద సూచిక తుదిని "సౌమ్యసం ఆవణి నెల ౧౨ తేది వ్రాసి ముగిసినది, అనికలదు. ఇట్లీపదసూచిక ప్రతులన్నిటి యందును తేదులు''గానవచ్చు చున్నవి. కావున 1850 సం॥ మొదలు 1862 సం॥ వఱకు సూరిగారీని ఘంటు రచనను సాగించి రని యూహింపనగును.

పదసూచికలలో ప్రతిగ్రంథాంతమున నకారాదిగపదముల పట్టిక వ్రాసియున్నది. ఇట్టిపదము లన్నియు 'అ' మొదలు 'హ' వఱకు వేఱొక ప్రతిలో వ్రాయఁబడినవి. తరువాత సీపదము లన్నియు నుదాహరణములతోపాటు ఏడు సంపుటములలో విపులముగ వ్రాయఁబడినవి. ఒక్కొక్కపుటలో అయిదు పదములు మాత్రమే వ్రాయఁబడినవి. అట నట సర్థనిర్ణయము గలదు. పశుపక్ష్యాది నామవాచకములకును, వృక్షలతాగుల్మాదివాచకములకును అసందిగ్ధార్థములు కూర్పఁబడినవి. ఆయా ప్రాంతములందలి వాడుకలు కొన్నిపట్టులఁ బ్రదర్శింపఁబడినవి.

పదసూచికప్రతులలోను నిఘంటుప్రతులలోను అటనటఁ బ్రయోగముల ననుసరించి తెలునట్టి వ్యాకరణవిశేషాంశములు సేకరింపఁబడినవి. ప్రౌఢవ్యాకరణమున నీయంశములే పెక్కులు గానవచ్చెడిని. ఇట్టి వ్యాకరణాంశము లన్నియు సంస్కృతభాషయందే గలవు. ఏడవసంపుటము తుదిని "హకారాదికాండము సంపూర్ణము. ప్రయోగసారంబు సంపూర్ణము'' అని కలదు. పిమ్మట 'లక్షణము' అనుపేర భారతాదిగ్రంథస్థపద్యము లుదాహరింపఁబడినవి. అయ్యవి తా నంతవఱకు రచించిన సూత్రముల కుదాహరణములు కొన్నియు, కావించు సూత్రముల కాధారములు గొన్నియును.

ఉదాహరణమునకై కైకొనినపద్యములను స్వతంత్రించి యిచ్చ వచ్చినట్లు సవరించినవిధము గానరాదు. సందిగ్ధస్థలములందు పెక్కుతావుల "మఱియొక మాతృక చూడనగు'' అను వ్రాఁతలు గలవు. అట్లు

మాతృకాంతరములఁ జూచి నిర్ణయించుకొనిన పాఠములు తరువాతఁ జేర్చిన గురుతులును పెక్కుచోట్లఁ గలవు. మఱియొక విశేషము. సూరిగారి పాఠములు చాలవఱకు వ్రాఁతప్రతుల పాఠములతో సరిపడుచునే యుండును.

కవులప్రామాణికత్వము నిర్ణయించుటలో సూరిగారికి మొగమోట మిసుమంతయుఁ గానరాదు. కావుననే ద్విపదకావ్యములందలి యుదాహరణములు, భాగవతమునందలి ప్రయోగములు మొదటవదలి తరువాతఁ గూర్పఁబడినవి. లక్షణవిరుద్ధవిషయములకు సుస్పష్టమయిన ఖండనలును గలవు. మారన మార్కండేయపురాణమునందలి పదము లెత్తి తుది నిట్లు వ్రాసియున్నారు—1. గ్రంథకారోఽయం లఘ్వలఘ్వోః రేఫయోః వళిప్రాసస్థలే అనాదృత్య కృతి మకరోత్. 2. కూర్మపురాణం బలాక్షణిక గ్రంథం బగుట నందలి యుదాహరణంబులు గ్రహింపఁ బడవయ్యె. 3. పుల్లయకవి ప్రణీతమైన బ్రహ్మోత్తర ఖండంబున మూఁడు పదములుమాత్రము సేకరించి ఈగ్రంథంబు బహుప్రదేశంబుల లక్షణవిరుద్ధంబయి కానంబడియెడి. మఱియు భారతాదుల, యందలి పదములకర్థనిర్ణయము సేయుటకై తఱచుగ సంస్కృతభారత శ్లోకము లుదాహరింపఁబడినవి. పూర్వోత్తర విరోధపరిహారమునకును ప్రామాణికత్వ సంపత్తికిని పూర్వోత్తరోదాహృతులు చూడనగు నను వ్రాఁతలు అడుగడుగునఁ గానవచ్చెడిని.

తాము గ్రహించిన ప్రతిపదమును సాధ్యమగునంతవఱకు యతిప్రాసల నిర్ధారణ గలవానినే సేకరించుట పరిపాటి. నిఘంటుసంపుటములలో సందిగ్ధస్థలములందును, విశేషార్థములు గల తావులందును మాత్రమే యర్థములు గానవచ్చును. తద్భవములకు పలుచోట్ల నెల్లెడను జనకము లగు సంస్కృత ప్రాకృత పదములు వ్రాయఁబడినవి. సూరిగారి ప్రాకృతవ్యాకరణ జ్ఞానము నావ్రాఁతలు తేటపఱుచుచున్నవి. ఆయా తావుల నిర్ణయము గాకున్నపుడు 'ప్రా.' అని వదలివేయుటయేః గాన

వచ్చెడిని. ఇట్టి వ్రాఁతలను గనులారఁ గాంచినచో నా మహనీయుని భాషాపరిశ్రమము విమర్శనము నిష్పాక్షికము సుశ్లాఘ్యము నని పాఠకుల కెఱుకపడును.

పదములకు అర్థముల నెఱిఁగించుటలో సూరిగారిపాటవ మగ్రిగణ్యము. ఆంధ్రభాషా పరిపాటికి సరిపడు నుచితతరార్థమును వ్యక్తీకరించుటలో సూరిగారికి సరిపడు ధీశాలురు వేఱొక్క రుండఁ బోరనియే తలఁపనగును. ఒండు రెండుతావులఁ గనుఁడు—

ఓలగందము = స్నానమప్పుడు శరీరమార్జనార్థము గావించిన పిష్టాదికము. క్రింత = శుభార్థము తెచ్చు మంగళద్రవ్యసంతానము. ఇట్టివిశేషములు గాంచినచో లెక్కకు మిక్కిలిగ నుండును. ఆంధ్రమున నీవఱకు వెలువడిన నిఘంటువులకు సూరిగారి నిఘంటువు పునాదియని చెప్పిన నతిశయోక్తి కాఁజాలదు.

పదసూచిక ప్రతులలో నొకచోఁ దాము ప్రయోగార్థమై గ్రహించిన గ్రంథముల పట్టిక వ్రాయఁబడినది. ఆపట్టికలో నెఱ్ఱాప్రెగడ రామాయణము నుదాహృతము. దీన నాలుగువేల తాటియాకు ప్రతులతో నిండిన సూరిగారి గ్రంథభాండాగారమున నీరామాయణమును వెలసియే యుండునని యూహింపనగు. మఱియు నముద్రితసంస్కృతగ్రంథ సంకేతపట్టికలో ప్రాకృతమనోరమ త్రివిక్రమవ్యాకరణము, హేమచంద్ర వ్యాకరణమును బేర్కొనఁబడినవి. ఈయవి ముద్రింపఁదగిన వను సూచన కావింపఁబడినది. ఇందుమూలమున సూరిగారిప్రాకృతగ్రంథ పరిశోధనము తెలియవచ్చుచున్నది. ఉత్తమసంస్కృత కావ్యముల నన్నిటిని నెన్ని, ముద్రింపవలసినవిగా వ్రాసినారు.

ఈ వఱకుఁ దెలుపఁబడిన నిఘంటువునుగూర్చిన యంశము లన్నియు శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయమునఁ బనిచేయునప్పుడనుదినము శ్రీసూరిగారిగ్రంథములఁ బరికించుటచే, నాయూహకుఁ బొడమినవానిని ప్రత్యక్షముగఁ జూచియే వ్రాసియుంటిని. సూరిగారు వ్రాసికొనిన నిఘంటు సంపుటములందలి యక్కరము లన్నియు వారి

స్వహస్తలిఖితములే. అన్యహస్తప్రసార మెచ్చటను గానరాదు. అక్కరములన్నియు ముత్యముల వరుసలే. అక్షరవిన్యాసమునఁగాని విషయప్రదర్శనమునఁగాని సంకీర్ణత యెచ్చటను గానరాదు. నేఁటికి నూరువత్సరములకుఁ బూర్వము వ్రాయఁబడిన యావ్రాఁతతీరు, నాఁడు వా రుపయోగించిన సిరాయును, కాగితములు శిథిలము లగుచున్నను వన్నెకెక్కుచునేయున్నవి.

ఈ నిఘంటువునకు సంబంధించిన కొన్ని భాగములు కాలగర్భమున నణఁగిపోయినవి. మఱికొన్ని యన్యహస్తగతము లైనవి. కొన్ని క్రిమిదష్టము లైనవి. ఉన్నంతదనుక, లభించినంతవఱకు రత్నములమూటయే గాని వేఱొండు గాదు. ఆమహనీయుని పరిశ్రమ సమగ్రము గాక యుండుటను గాంచిన సహృదయున కెవ్వనికైనను గంటఁ దడివెట్టక తప్పదు. ఇంతవఱకైన శ్రీసూర్యరాయ ప్రభువర్యుల యౌదార్య గరిమచేతను వారి కాంధ్రమునఁ గల గౌరవాదరములచేతను రక్షింపఁబడుట యాంధ్రుల యహోభాగ్యము. ఆయాంధ్రభోజుని కరుణాప్రసారమును గాంచకపోయినచో నీవఱ కెన్నఁడో యీయమూల్యరత్నరాశి భూగర్భమున నణఁగిపోవలసినదే. సూరిగారి వ్రాఁతప్రతు లనేకములు ఆళువందారయ్యగా రనువారిచే ననేకుల కీయఁబడిన వని తెలియవచ్చుచున్న దని వకుళాభరణముగారు తమ హస్తపుస్తకమున వ్రాసికొని యున్నారు. మఱియు వారే ముద్రింపించిన సూరిగారి జీవితచరితములో నీక్రింది వారిని సూరిగారి శిష్యులనుగాఁ బేర్కొనినారు.

సూరిగారి శిష్యులు.

1. బి. సీతారామాచార్యులవారు (ప్రౌఢవ్యాకరణ శబ్దరత్నాకరాది గ్రంథకర్తలు)
2. కృష్ణమాచార్యులవారు.
3. రామానుజాచార్యులుగారు. (కళాపూర్ణోదయ వ్యాఖ్యానకర్తలు)
4. రంగమన్నారయ్యగారు (దేవరాజసుధీ తండ్రిగారు.)
5. పంచాంగం తేవప్పెరుమాళ్ళయ్యగారు. (సూరిగారి శిష్యులై మనుచరిత్రాది బహుగ్రంథములకు వ్యాఖ్యలు రచించినవారు; పెక్కుగ్రంథములఁ బరిశోధించి ముద్రింపించినవారు.)

6. రామానుజ సూరిగారు,
7. కొమ్మ్మ రంగయ్య సూరిగారు.
8. వరదాచార్యులుగారు
(Senior Telugu Pandit of Wesleyan College)
9. సుబ్బారాయలు నాయుడుంగారు.
10. అ. వరదయ్యగారు.
11. కరాలపాటి రంగయ్యగారు (స్నేహబృందము)
12. ఆర్బతునాటు దొరగారు ( మద్రాసు విశ్వవిద్యాలయాధికారులు )
13. బ్రౌను దొరగారు (బ్రౌణ్యనిఘంటు నిర్మాతలు)
14 రంగనాథశాస్త్రులుగారు.
15. గాజుల లక్ష్మీనృసింహ శ్రేష్ఠిగారు.
16. కుమారస్వామి శాస్త్రులుగారు.
17. శ్రీనివాస మొదలియారుగారు.
18. వైయాకరణ రామానుజాచార్యులుగారు.
19. తిరువలిక్కేణి ఈచ్చంబాడి శ్రీనివాసరాఘవాచార్యులుగారు.
20. శేరయూరి శ్రీనివాసరాఘవాచార్యులుగారు.
21. శిరోమణి అప్పలాచార్యులుగారు.
22. తిరుమొయి రామచంద్రాచార్యులవారు.
23. తిరుకోట్టియూరు సుందరాచార్యులుగారు.
24. తిరుమహేంద్రపురము వరదాచార్యులుగారు.
25. వైయాకరణ విజయరాఘవాచార్యులు గారు
26. వింజమూరి రాఘవాచార్యులు గారు

ఇట్టి సూరిగారి శిష్యపరంపరకుఁ జెందినవారు చెన్నపురి యందు నెలకొనిన ఆంధ్రభాషాభిమానులు సూరిగారి గ్రంథములను సేకరించి, వాని నుద్ధరించి ప్రకటించి వానిని లోకముఖమున వెలుంగునట్లు చేయఁ బ్రార్థన.

సూరిగారి వ్రాతలను బరిశీలించిచో ఆంధ్ర భాషాలక్షణ నిర్మితిలో కావింప నెంచిన విషయము లెన్నియో గానవచ్చెడిని. వారి యుపక్రమము లన్నియుఁ బూర్తియయినచో మనభాష కింత కెన్నియో సుడుంగులు వికాస మేర్పడి యుండెడిది.

సమకాలికులగు సంస్కృతాంధ్రపండితులచేఁ గొనియాడఁబడి, మాతృభాష కపారసేవ సలిపి, యఖండ గౌరవకీర్తులఁ బడసిన సూరిగారి యెడలఁ గృతజ్ఞత గలిగియుండుట యాంధ్రభాషా సేవకుల కత్యావశ్యక మని విన్నవించువాఁడ.

ప్రయోగసారము—సంస్కృతప్రాకృతములు.

అడియాలము=అభిజ్ఞానము
అతివస=సం. అతవిషా
అత్తి=ఏనుఁగు. సం. హస్తీ. ప్రా. అత్థీ
అద్ద=సగము. ప్రా. అద్ధం. సం. అర్ధమ్
అప్పన, అప్పనము=ఒప్పగింత. ప్రా-అప్పణం. సం. అర్పణమ్
అప్పు—అచ్చుః పుః. చోహలీతి చద్వయస్య పరసవర్ణః
అబ్బెసము=అలవాటు, వాడుక. సం. అభ్యాసః. ప్రా.
అమ్మ=జనని, తల్లి. సం. అంబా.
అర=సగము. సం. అర్ధమ్
అరదము=తేరు. సం. రథః
అలంది=పసుపు. సం=హరిద్రా. ప్రా. హాళద్ధి
అలఁతి=మిక్కిలియల్పము. సం. అల్పిష్ఠమ్. ప్రా.
అలసంద=కాయధాన్యభేదము. ప్రా-అలసందో. సం. అలసాంద్రః
అవారి=బహుళము. ప్రా. అపారమ్. సం. అపారమ్
అవ్వారి=అనవధికము. ప్రా. అవారమ్. సం. అపారమ్
అసడ్డ=శ్రద్ధలేమి. సం. అశ్రద్ధా. ప్రా. అసద్ధా
అవ్వ=తల్లి-సం. అంబా
అసోద=కృష్ణుని తల్లి. సం. యశోదా

అళంది=పసుపు సం. హారిద్రా. ప్రా. హాళద్ది

=శరారి, బాతు. సం. ఆటిః. ప్రా. ఆడీ

ఆదరువు=ఆశ్రయము. సం. ఆధారః

ఆముడము=ఏరండము. సం. ఆరండః

ఆరతి=నివ్వాళి. సం. ఆరాత్రిః. ప్రా. ఆరత్తి

ఆరియము=ఉపవనము. సం. ఆరామమ్

ఆరెకుడు=తలారి. ప్రా. ఆరక్ఖో. సం. ఆరక్షః

ఆలతి=ఆలాపము. సం. ఆలప్తిః. ప్రా. ఆళత్తీ

ఆలవట్టము=వలువతో నిర్మించిన వీవన. సం. ఆలావర్తమ్.
ప్రా. ఆరావట్టము

ఆసత్తి=ఆసంగము. ప్రా. ఆసత్తీ. సం. ఆసక్తిః

ఆస=వాంఛ. సం. ఆశా. ప్రా. ఆసా

ఆళతి, ఆళత్తి=ఆలాపము. సం. ఆలప్తిః. ప్రా. ఆలత్తీ.

ఇంగలము=నిప్పు. సం. అఙ్గారః. ప్రా. ఇంగాలో

ఇంచు=చెఱకు. సం. ఇక్షుః. ప్రా.

ఇంతి=నారి. సం. స్త్రీ. ప్రా. ఇత్థీ

ఇటిక=మంటిఱాయి. సం. ఇష్టకా. ప్రా

ఇట్టిక=ఇటిక. సం. ఇష్టకా

ఈఁదు=ఈఁతచెట్టు. సం. హింతాళః. ప్రా

ఈరసము=ఓరువనితపము. పాి. ఈసా. సం. ఈర్ష్యా

ఉంగరము=ఊర్మిక. సం. అంగులీయకమ్. ప్రా

ఉంగుటము=అంగుష్ఠము. సం. అంగుష్ఠః ప్రా. అంగుట్ఠో

ఉమ్మెత్త=దూస్తూరము. పాి. ఉమ్మత్తో. సం. ఉన్మత్తః

కందము=౧. మాత్రాబద్ధపద్యవిశేషము. పాి. ఖంధఆ.
సం. స్కంధకా

శ్లో. చాపత్తా అట్టపువ్వద్ధేతి హశోంతిసమహూ ఆ. సోఖంధ ఆపియాణ హూ సజ్జలివభణే ఇముద్ధి బహూసంభే ఆ॥ అని తల్లక్షణమునందు

౨. పశుకంఠము. ప్రా. ఖంధో. సం. స్కంధః

కంపిల్లము=రోచని యనుచెట్టు. ప్రా. కంపిల్లో. సం. కాంపిల్యః

కప్పడము=మలినవస్త్రవిశేషము, మాపు. మాసినవలువ.

ప్రా. కప్పడో. సం. కర్పటః

కరడ=పూవులబుట్ట. సం. కరండః

కరటి=పూవులబుట్ట సం. కరణ్టీ

కరటిక=పూవులబుట్ట. సం. కరణ్టికా. పా. కరండిగా

కరదూపము=పా. ఘరధూమో. సం. గృహధూమః

కరవాలు=ఖడ్గము, పట్టియము. సం. కరవాలః

కరణిక, కరణియ=మృదంగముఖచర్మమందలి కృష్ణమండలము

సం. కర్ణికా

కర్ణము=కెలసము సం. కార్యమ్

కల్లు=ఆసవము, కాదంబరి పా. కల్లా సం కల్యా. పా.

కల్లం సం కల్యమ్

కళ్లము=ధాన్యమునూర్చు తావు. సం. ఖలమ్

కారము=ఒట్టు పా. కారో. సం. కటుః

కాలజము=గుండియ. సం. కాలేజమ్. "కాలేజమ్ కాలఖణ్డాకమ్" ఇతిరభస

కాఱియ=యాతన. ప్రా. కారిఆ. సం. కారికా

కాళంజి=తమ్మపడిగము. సం. కలాచీ

కాళియ. ప్రా. కాహలిఆ. సం. కాహళికా

కోట=ప్రాకారమర్గము,సాలము, నగరప్రాకారము. సం. కోట్టః

'కోట్టదుర్గే పునస్సమే' ఇతి హేమచన్ద్రః.

కోన=మూల. సం. కోణః

గంబూరము=ఘనసారము. సం. కర్పూరః

గజ్జి=తీటపొక్కు ప్రా ఖజ్జా సం ఖర్జూః
గడన=సంఖ్యానము, లెక్కించుట సం గణనా
గాటము=నితాంతము, మిక్కుటము సం గాఢమ్
చదుకము=చతుష్పథము ప్రా చదుక్కమ్ సం చతుష్కమ్
చదురుడు=విదగ్ధుఁడు, జాణఁడు, నేర్పరి. ప్రా చదురో సం. చతురః
చల్లడము=లాఁగు ప్రా చళనం సం చలనం "చండాతకమ్ చలన' మితి హేమచన్ద్రః.
చిత్తరువు=ఆలేఖ్యము సం. చిత్రమ్.
చిత్తిని=స్త్రీజాతిభేదము. (రతిశాస్త్రప్రసిద్ధము) ప్రా. చిత్తిణీ సం. చిత్రిణీ
చింత=తింత్రిణి. సం. చిఞ్చా
చింద=ఆతాయి యనుపక్షి సం. చిల్లః
చుప్పనాతి=రావణుని చెలియలు సం. శూర్పణఖా
చామ=స్త్రీవిశేషము సం. శ్యామా ప్రా. సామా
శ్లో॥ శీతే సుఖోష్ణసర్వాఙ్గీ గ్రీష్మేతు సుఖశీతలా
తప్తకాఞ్చనవర్ణాభా సా స్త్రీ శ్యామేతి కథ్యతే.
ఇతి భట్టివ్యాఖ్యానే భరతః. అప్రసూతా శ్యామేతి కేచి దాహుః
'అప్రసూతాఙ్గనాయాంచ శ్యామా సోమలతౌషధా'వితి విశ్వః
'శ్యామా యౌవనమధ్య' స్థే త్యపరే.
చామనము=మేచకము సం. శ్యామః ప్రా. సామళో
చామలు=తృణధాన్యవిశేషము సం. శ్యామాకః ప్రా. సామాఅ
జన్నియ=దివ్యదోహదము ప్రా. జణ్ణిఅం. సం. యజ్ఞియమ్
జమ్మి=సక్తుఫలావృక్షము సం. శమీ
జవళి=ఆపణము, అంగడి, లోకు లీశబ్దమును వస్త్రాపణమునకు వ్యవహరింతురు.

జవ్వనము = తారుణ్యము సం. యౌవనమ్
జాజి = మాలతీలత సం. జాతిః
జెట్టి = ఉత్తమమల్లుఁడు ప్రా. జేట్ఠీ సం. జ్యేష్ఠీ
జ్యేష్ఠికః కథ్యతే మల్లో విద్యాకాయ బలాధికః ఇతి
తత్త్వ రత్నాకరే

'మల్లాశ్చ త్రివిధా జ్ఞేయా ఉత్తమాధమమధ్యమాః
ఉత్తమో జ్యేష్ఠికో నామాంతరజ్యేష్ఠస్తు మధ్యమః
కనిష్ఠో గోజలో జ్ఞేయః కాయప్రాణగుణాన్తరా' దితి

జోదు. ప్రా. జోద్ధా. సం. యోద్ధా
టక్కు = మాయ, ఉక్కివము. సం. ఠక్కః
తక్కలి = బుడ్డబుసరచెట్టు. పా్రి. తక్కాలీ. సం. తర్కారీ
తగరు = ఏడకము, పొట్టేలు సం. తగరః
తమగము = మంచకము, మంచె సం. తమజ్గః,
ఇంద్రక్రోశ స్తమజ్గ ఇతి హేమచన్ద్రః
తామర = పద్మము. సం. తామరసమ్
దండియ = వీణావిశేషము ప్రా. దండిఆ సం. దండికా.
ఇదియ తంబుర నాఁబడు
దాయి = ఉపమాత.సం. ధాత్రీ
దిగ్గియ = దీర్ఘచతురశ్రమగు బావి.ప్రా. దిగ్ఘి ఆ. సం. దీర్ఘికా
దివియ, దివ్వియ, దివ్వె = దీపము ప్రా. దీవి ఆ. సం. దీపికా
దుగ = యుగలము,జంట,సం.ద్వికమ్. ఇది యక్షద్యూతము నం.
దఱుచుగా వ్యవహరింపఁబడు.
దుగుణము = ఇబ్బడి సం. ద్విగుణమ్
దుగ్గ = పార్వతి ప్రా. దుగ్గా. సం. దుర్గా
దుస్ససేనుడు = దుర్యోధనునకు రెండవతమ్ముఁడు.సం.దుశ్శాసనః
దేవళము = దేవాలయము,గుడి ప్రా. దేవులం. సం. దేవకులమ్

దేవరాయఁడు = వరదరాజు. సం దేవరాయః
దేవేరి = కృతాభిషేకయగు స్త్రీ సం. దేవీ.
ద్రోవది = ద్రుపదపుత్రి సం ద్రౌపదీ
నివ్వటిల్లు = వెలయు ప్రా నివ్వట్టు ఇ. సం నిర్వర్తతే
'ర్తస్యటః' ఇతి సూత్రమ్
పజ్జ = వెంబడి ప్రా పచ్ఛా సం పశ్చాత్
పడగ అప పడాగా సం పతాకా
పన్నిదము = పందెము శౌ పణిదం సం పణితమ్
పబ్బము = ఉత్సవము పండుగ ప్రా పబ్బం సం పర్వ
పుత్తడి బొమ్మ. సం పుత్తలీ. సాలభంజీ పుత్తలికేత్యమరపద పారిజాతే
పెక్కణము = చుట్టునుండి జనులు చూచుట కనువుగా నొనరించిన మల్లరంగాదిస్థానము ప్రా పేక్ఖణమ్. సం. ప్రేక్షణమ్
పొట్ట = ఉదరము ప్రా పొట్టో
పోఁక = క్రముకము సం పూగః
బందెయ = పయిరు మేసిన పశువులను వానియొడయనిచే దండువుగొనుట పా బంధ అం సం బంధకం
బొజుగు = విటుఁడు, వేశ్యాపతి సం భుజంగః
ముడాసు = పాగ పా ముడాసో నం మూర్ణవాసః
ముద్దు = మంజిమము, మధురము పా ముద్దం సం. ముగ్ధమ్
రక్కసుఁడు = నిశాచరుఁడు సం రాక్షసః
రిత్త = శూన్యము సం రిక్తమ్
వంజ = అప్రసవ ప్రా వంఝా సం వంధ్యా
వక్కణము = వివరణము ప్రా వక్ఖాణం సం వ్యాఖ్యానమ్
వాగియ = రశ్మి, కళ్ళెయపుఁబగ్గము. ప్రా వాగి అ సం వాగికా
వెన్నుఁడు = విష్ణుఁడు పా వేణ్హూ సం విష్ణుః
వేసడము సం వేసరః

సంపగి = చంపకవృక్షము ప్రా చంపగో సం చంపకః
సారంగము = కన్నము సం సురఙ్గః
సెల=గిరిప్రవాహము సం ఝలః "ఝూరీ ఝరీ ఝల శ్చాపీతి పారిజాతే" ఉదా—మనుచరిత్రే
సాలియ = తంతువాయజాతి ప్రా సాలిఓ సం శాలికః
శాలికః పటకార స్స్యాత్ ఇతి పారిజాతే.

---

సూరి ప్రయోగసారమునందలి వ్యాకరణవిశేషములు.

అద్రుచు = ఆక, అదురుట.

చుగాగమం బని కొంద ఱంద్రు. ఆపక్షంబున నకర్మకత్వరత్వం బులు దుస్సాధంబులు.

ఉలివు=ధ్వానము. ఉలియ క్షిపుః.
ఊఁత=అవలంబము. ఊఁద స్తృష్.
ఊరుచు=ఊరు ధాతువునకు స్వార్థమందు రేఫంబొండె నగు.
గెలుచు=జయించు.

అస్యాణౌ కర్తా ణౌ కర్మ భవతి.

టక్కు=మాయ, ఉక్కివము. సం ఠక్కః.

ఈశబ్దము మాయార్థక మయినను, డక్కుశబ్ద మిందు గుణ మాత్రంబున వ్యవహరింపఁబడు.

తఱుపు. ప్రే=క్షయించుట.

తఱుగోః పుక్.

తూపు=బాణము, అమ్ము.

క. చాపాభ్యాస ప్రౌఢిమ
చూపఱ మెచ్చంగ రాజసూనుఁడు దైర్యా
టోపంబు పెంపు దూలఁగఁ
దూపులు గల్కొలిపె సమరదుర్దమలీలన్. భాస్కర. యుద్ధ.
"కంపుతూఁపులు గలవన్నె కానిఁ గాంచె".

నని యప్పకవి సార్ధబిందూదాహరణంబు నిరాకరం బని యెఱుంగునది.

త్రాగించు. త్రే. క్రోలించుట.

తడయక యబ్బ్యాది శుక్రుఁ ద్రావించి రొగిన్. ఆది.

గతిబుద్ధీత్యాదిసూత్రంబుచే నిచటం బ్రయోజ్యకర్తకుం గర్మత్వం బని యెఱుంగునది.

వ్రయ్య=భాగము, ఖండము.

వ్రయ్యో రః.

దున్నపోతు—స్వార్థే పోతుప్రత్యయః.

జ్యోతిః ప్రాదుర్భావే పొడచు ఇత్యకారమధ్యత్వ మనుమీయతే.

'పొడతెంచు' ఇతి ప్రయోగదర్శనాత్.

డుః—ప్రసన్నుఁడయ్యెడున్.

ప్రసన్నులయ్యెడున్ ... .. ఆది. ఆ. ౧.

ఉ. దేవమనుష్యలోకములు ... .. ఆరణ్య. ఆ. ౨.

మృగావళులం గలిసి, మృగావళులతోఁ గలిసి.

కారకోదాహరణంబులు.

జైమినిభారతోదాహరణంబులు—

చే—సీ. మునినాథుచే ధర్మతనయుండు వీడ్కొని.

అనుజ్ఞాం గృహీత్వే త్యర్థః

వారిధి పంచమ్యా ద్వితీయా.

క. కౌరవసభలో లజ్జా, వారిధిఁ దగ నుద్ధరింపవా ద్రౌపది.

క. మహారథునిచేత తురగంబు పట్టువడి...తానునుం గట్టువడియె.

నిర్వచనోత్తరరామాయణము—

ఎల్లిదము=లఘువు. బల్లిదాదిః. ఎల్లిదుఁడు, ఎల్లిదురాలు.

నృసింహపురాణము—

ఘుటికములు—కంధరాదిః.

లేదుగదయ—ఇతి డాంతంబుమీఁద బరుషంబునకు సరళాదేశము.

పద్మపురాణము—

పురూరవుఁడు—పురూరవసో నిత్యం లోపో దృశ్యతే.
వేదములుఁ దదంగములు......ఏడాది భజించె నేని
గురుఁ డాతని ... ......గి. ఆ.

అత్ర ఏడు ఆది ఇతి పదద్వయమ్. అతఏవ స్వరవళిః
సాగోః పుక్—సాపు.

1. వృద్ధాదే ర్డుజః 2. సహా త్సంబుద్ధేః 3. భృంగాదే ర్నోః
4. ఇదుతో స్సర్వనామ్న ష్టిక్. 5. రేయిప్రభృతేః 6. అంతాదే ర్విభాషా.

సభాపర్వము—

ఇందులకు—ఈయది యేకత్వమునం బ్రయోగింపఁబడిరియె.

క. మంటి హారుదేహ మంటన్...

ఆర. 1. ఆ

ఇత్యాదిపద్యే ఎల్లాదిశబ్దానాం కేషాంచి డ్డుజా వినాపి సంబోధనే ప్రయోగో దృశ్యతే. తథాత్రాపి. కఱకంఠేతి.

భోజరాజీయము. ౪ ఆశ్వాసము.

అస్మి న్పద్యే మహత్యమహతోః పరామర్శే అపీ త్యమహదూర్పం దృశ్యతే.

తోరణస్య మోః కట్టా—లు గి త్యనువర్తతే. బహుళ మితి చ.
తోరణకట్టి, తోరణముకట్టి.
అకటాదీనాం ప్లుతో బహుళం.
లాతాసీనాం వా దీర్ఘః—

లాతము, గోణము, వీణము, ఏతము, గోతము, పెండ్లము, కళ్లము, గుడ్డము.

చనుమి చోః పత్వం క్వాపి దృశ్యతే. కవిత్రయగ్రంథేషుతు న.
మూలం మృగ్యమ్.
గృహ్ణీతే రిందో వా విధ్యాదౌ మధ్యమే
హృద్యము లింద మందు కొమ్మో యీతి కథమ్.

విభక్త్యాగమ సముచ్చయాత్మానుద్రుతిః
ఏభ్యో నామభ్యో ధాతుభ్యశ్చ చుక్.
చిగురు, తలిరు, ఇగురు, పొకారు, వెలారు.
ఆవాపశబ్దస్య ఆవప ఇతి ప్రయోగ స్సాహిత్యదర్పణే.

తరవణి—తేరిమెన యని వాడుచున్నారు.

సూళిగేరు—ఉ. దేశము. ప్రా. సూళిఘరం.

సూళీతి వేశ్యాయాః ప్రాకృతే దేశ్యః. ఈశబ్దమునకు భోగినీ గృహవాటికం బ్రయోగంబు గానంబడియెడు.

నేః కర్మధారయే న గ్వక్తవ్యః. కమ్మందేన.
మ. మరువాలారు శరంబుల న్వారియు కమ్మందేనె. ప. ౨. ఆ.
డావల. ఇ. టి. ంటేః ప్రయోగః కాశీఖండె ద్రష్టవ్యః ౬. ఆ.
తొలకరి—తొలుకుశబ్దా దరిప్రత్యయః
నీరు—ఇ క్లీవా. నీరను, నీటను, నీరున కాశీఖండము. ౧. ఆ

డొలుచు—ప్రే. దొర్లించుట. డొల్లో శ్చుక్.

విచ్చేయు—అ. వచ్చుట.

విచ్చేయుము తల్లికడుపు విడిచి ముకుందా. ఇతి భాగవతే.

ఏవం—వేంచేయు, విజయంచేయు.

భవే ద్విజయతే శ్చేయు ర్గతౌ కర్తృప్రపూజనే
మో రఖండో భవే ద్బిందు ర్వా తదంతస్య వేం విచౌ

విజయముచేయు, విజయంచేయు, వేంచేయు, విచ్చేయు.

దొరయు-స. పోలు అస్య కర్మణి స్తోడో వా.
నాతో దొరసె, నన్ను దొరసె.
ఆరగించు—ఆహారశబ్దాత్ 'ఆర'ఇతి ధాతు ర్నిష్పన్నః. తస్య ఘల్.
ఆర స్యాగణాఙ్ -ఆరోగణము.
ఈదూనూదేభ్యః ఖితః
అనుచు—పోపో శ్చు గన్వాదేశః.

అప్పుడు—అప్పుడాదే ర్ద్విత్వలోపౌ ప్రథమాయామేవ.

అలజడి—అలయో ర్జడిష్. అలపు—అలయోః పుక్

అలమట—అలయో ర్మటష్. అలయిక—అలయో రికః.
అలయు—శోకేఽపి.
అలసత—అలయ స్సటష్. అలుకు=విలేపనము. అలుకో రుః
అలుకుడు—అలుకో ర్డుః.
ఆటవిడుపు—వేదము చదువుకొనుబాలు నాటకై విడుచుట.
ఉంచు—ఉంచో శ్చు గంతిలోపౌ. ఉలివు—ఉలియ ష్షివుః.
ఎడమడవు—అన్యోన్యవిరోధము.

క. పొడవునఁ బ్రాయంబునఁ గడుఁ
గడిఁదిబలంబునను జూడఁగా నసదృశు నీ
కొడు కని యాతని నెంతయు
నెడమడుగుగఁ జూపె దేల యందఱు నగఁగాఁ. భార. ఆది. 3. ఆ.

ఇట్టి లోకవిరుద్ధంబుల కే మోడుదు మి త్యనుపదమేవ విరుద్ధశబ్దేన తదర్థో విదితః.

ఏటవాలు—పక్కవంపు. ఏటమునకు=పక్కకు, వాలు=వాలియుండునది.
ఆచ్ఛిక స్యోత్తరపదే లోపో మోః క్వాపి దృశ్యతే
యనంబట్టి ఏటశబ్దంబు మువర్ణలోపం బని యెఱుంగునది.
కను—దర్శనప్రసవప్రాప్తిషు.
కఱచు—ప్రయోజ్యకర్తృ ర్దంశాదే ర్ద్వితీయా కర్మతా భవేత్.
కఱపు—కఱచః పుక్. కలఁచు—కలఁగో శ్చుక్.
కాఁక—కాఁగః ష్కః.
కానుపించు—ఇది తఱుచుగఁ గర్మకర్త్రర్థంబునం బ్రయోగింపబఁడు.
కాఱియ=యాతన ప్రా. కారి ఆ.
క్వాపి తద్భవే ఽ ప్యలఘురేఫో దృశ్యతే.
చెలియ—సందియాదిత్వా న్నషేః
డొంగ=చోరుఁడు, డొంగువాఁడు. డొంగువాఁడు గావున డొంగ నాఁబడు.
పదరాదే యనువిధిని దీని కప్రత్యయం బని యెఱుంగునది.
బహువచనంబు పరంబగునపు డెద్దానియుపధ కలఘులకారం
బగు దానికి—లి—

తోఁడరు—స. స్పృశించుట, అంటుట.

దీనికర్మంబునకు షష్ఠియు నగు.

క. పనివడి యహింసవ్రతముగ
గొని వనమున నున్న మునులకుం దోఁడర హిం
సనము... ... ... ... భార. ఆర. ౫.

త్రోపించు=త్రోచోరించుక్.

దండడిపదోదాహరణమున
డగ్గఱియె ని తీయు గ్దృశ్యతే. విరా. ౪. ఆ. ౧౮౪.

హ్రస్వ స్స్యా దపరాద్యస్య తద్భవే న భవే త్క్వచిత్.

మసాణః—మసనము. పయాణః—పయనము.

ఆకాశః—ఆకసము. కర్పూరః—కప్పురము.

కుంభారో—కుమ్మర. పడాణ—పడగ. విరాటః—విరటుఁడు.

కథం మూరః—మరుఁ డితి. స్మరశబ్దే సలోపే మరుఁ డిత్యవధేయమ్.

మానార్థా న్నిత్య మేకత్వే ఎఁడుః స్యా త్పరిమాణకే.

మానెఁడు, పుట్టెఁడు — ఇత్యాది. పరిమాణే కిమ్. వడ్లు మూఁడుపళ్లు. బియ్యము నాలుగు పళ్లు. ఎఁడువర్ణకఏకత్వాభిధాయకః స్యా దిత్యర్థాంతరమ్. విశేష్యస్య పరిచ్ఛేద్యస్య బహుత్వేఽపి ఎఁడు వర్ణకాంతం నిత్య మేకవచనాంతం భవిష్య తీత్యర్థః.

పడెఁడు నూవులు. వడ్లు తూమెఁడు.

చాగము. సం. త్యాగః ప్రా. చాగో.
త్యథ్యద్యామ్ చచ్ఛజా ఇతి వరరుచిసూత్రే,
పాయు—ణ్యర్థే యు క్విలోపశ్చ
ప్రాయేణ పాపుదు రితి దర్శనాత్.
ఇంచుక్-కిం తర్హి? పుగాగమ ఏవ.

అస్య ధాతోః ప్రేరణేంచుక్పకా వితి మంతవ్యమ్. అతఏవ ఎడవాపె నిత్యాది సిద్ధమ్. అన్యథా ముత్పరత్వాభావేన పత్వస్య దౌర్లభ్యాత్.

క. అంపమున దీనికంతము

[తెంపి విడుతు......అత్ర [తెగోః పూరణే పుక్.

దంపుదుమే కుభృత్పరివృఢంబుల మొత్తుదుమే.

దంచో ర్దా పః-పక్షే దంతుము.

మేలుకనుపు—మేలుకనోః పుక్.

మేపు. స. మేయఁజేయుట

మేయః ష్పః కర్మణి.

రాజనములు=వ్రీహిభేదము. సంబావు లని ద్రవిడదేశము వారు వాడుదురు. ఇది రాజాన్నశబ్దభవ మని చెప్పుదురు.

వారుచు—వడియించుట. చుక్. గంజి వార్చి.

విచ్చేయు—౧ విజయముచేయుట. ౨. పోవుట.

ఈధాతువు కర్తృపూజయందు వాడఁబడు.

విజయంచేయు, విచ్చేయు, వేంచేయు నా మూఁడు రూపంబులు నొందు నని యెఱుంగునది.

వినుచు—వేఃశ్రావణము, వినిపించుట. వినో శ్చుక్.

కొల్చియుండెదన్ ఇత్యేకవచనం దృశ్యతే. అత్రాత్మార్థవ దస్మచ్ఛబ్దస్యాపి క్వచి త్తార్వ్యమితి జ్ఞేయమ్.

---

# గ్రంథస్వీకారము.

## 1. శ్రీసర్పపురక్షేత్రమాహాత్మ్యము.

### పద్యప్రబంధము కూచిమంచి తిమ్మకవి కృతము.

సర్పవరం దేవస్థాన ట్రస్టీలచేఁ బ్రకటితము. ప్రాప్తిస్థానము, కాకినాడ. వెల పది అణాలు. డెమ్మీసైజు 56 పుటలు.

ఇది 'అభినవవాగనుశాసనుఁడు' 'కవిసార్వభౌముఁడు' అను బిరుదము లంది క్రీ. శ. ౧౭, ౧౮ శతాబ్దముల మధ్యకాలమున విలసిల్లిన కూచిమంచి తిమ్మకవి క్రీ. శ. ౧౭౫౪ సంవత్సరము రచించినప్రబంధము. ఇందలి కథాభాగము బ్రహ్మకైవర్తపురాణోక్తమైనసర్పనగరక్షేత్రమాహాత్మ్యమునకు ఆంధ్రీకృతి. అంబరీషచక్రవర్తియాస్థానమునకు వసిష్ఠమహర్షి విచ్చేసినపుడు అంబరీషుఁ డాతనిం బూజించి కుశలసంభాషణానంతరము 'సర్పపురాఖ్యాన మెట్టిది? భావనారాయణదేవుఁ డట నేల యుదయించె? ఆ దేవు నచట నెవ్వరు ప్రతిష్ఠించిరి? అందలిపుణ్యసరోవరము లెవ్వి? ఆతీర్థములఁ గ్రుంకులిడినఫల మెట్టిది?' అని యడుగఁగా వసిష్ఠుఁ డీమాహాత్మ్యము నుగ్గడించెను.

ఈసత్ప్రబంధమును దోలుత నీలాసుందరీపరిణయముతోఁ గలిపి వావిళ్ళవా రెపుడో ముద్రించిరి. ఆతరువాత నిదియే ద్వితీయముద్రణమై యుండును. కూచిమంచి తిమ్మకవి మహాకవిసార్వభౌముఁడు. ఈతని కవిత్వము ఏనుఁగు లక్ష్మణకవిమాటలలో :

"హాటకగర్భవధూలీ
లాటన చలితాంఘ్రి నూపురారావ శ్రీ
పాటచ్చరములు తేనియ
తేటలు మాకూచిమంచి తిమ్మయమాటల్".

కవిత్వమా మృదుమధురమైనది. కావ్యవస్తువా పరమపవిత్రమైనది. కాకినాడకు రెండుమైళ్ళలోఁ గలయీపవిత్రక్షేత్రమాహాత్మ్య మెల్లరకుఁ బారాయణయోగ్యము. ఈయుత్కృష్టప్రబంధమును జక్కని కాకితములపైఁ జక్కఁగా ముద్రించి ప్రకటించిన శ్రీ సర్పవర దేవస్థాన ట్రస్టీ లభినందనీయులు.

ఇట్టిగ్రంథమున శ్లోకసమగ్ర మగుపీఠిక, తేటతెల్ల మగుకథాసంగ్రహము సమర్థుఁ డగుపండితునిచే వ్రాయించి చేర్చి యుండినచో గ్రంథగౌరవ మినుమడించి యుండెడిది. ప్రాచీనప్రబంధముల నచ్చువేయించి ప్రకటించువా రిట్టిపీఠికాదుల విలువ గ్రహింపక పోవుట పెద్ద లోపము. దేవస్థానమువారు పునర్ముద్రణసమయమున కాకితమునకుఁ గక్కుఱితిపడి గీతములను రెండుపంక్తులలో నిఱికింపక సీసములను పదిపదునొకండు పంక్తులలో నుంచక గ్రంథము మఱింతసుందరముగ నుండునట్లు జాగరూకత వహింతురుగాక !

2. పుష్పబాణవిలాసము.

ఆంధ్రకృతి. రచయిత విద్వాన్ కవికిశోర శంకరప్రసాదు. లలితకళాసమితి. కాకరపఱ్ఱు. పశ్చిమగోదావరిజిల్లా. చిన్నసైజు 32 పుటలు. వెల నాలుగుఅణాలు.

ఇది సంస్కృతమున నెవరు వ్రాసిరో తెలుపుట కష్టము. కాళిదాసకృత మిది యని నానుడి యున్నది. దీనిని నిదివఱలోఁ బలువు రాంధ్రీకరించిరి. ప్రస్తుతము శంకరప్రసాదుగారు దీని నాంధ్రీకరించిరి. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు 'ఆశీస్సు' నిచ్చిరి.

ఇందలిపద్యములు ధారాళములు సరసములు. కాని, ఇంకను జిగిబిగులు చాలవు. రచయిత ముందుముందు రాణింపఁగలకవిత వ్రాయఁగలవాఁ డనిమాత్రము దీనినిబట్టి చెప్పవచ్చును. ఇందలిశ్లోకము లిరువదియాఱు. ఆశ్లోకములను ఎడమపుటలో నచ్చొత్తించి కుడిప్రక్కపుటలో అనువాదపద్యము అచ్చొత్తించిన చాల బాగుగా నుండియుండెడిది. అపుడు మూలశ్లోకములకై వెదకుకొనునక్కఱ లేకుండెడిది. మచ్చునకొకపద్యము.

"అందముఁ జిందుగోపికల నందఱఁ గూడి రమించుచుండుగో
విందుని నందనందనుని వింతగు నేచరితంబు లోకమం
దం దెఱ బ్రసిద్ధి; దానిఁ గొని యాదరసానఁ గృతిం బొనర్చిన
న్నుం దనియింప శారదయునుం గృపతోడఁ బ్రసన్న యయ్యెడున్."

ఈయనువాదము రచయితకవితారంభస్థితిఁ దెలుపుచున్నది. అటనట 'మధ్య' "మేనునన్" "మారుజయేందిరో యనన్" "మరొండు" "దాకుటన్ అపుడ" మున్నగు దుష్ప్రయోగములు కానవగుచున్నవి. శిష్టశిక్షణమున నీకవి ముందుముందు సత్కవియై వర్ధిల్లుఁగాక !

3. లలితకళాసమితి వార్షికోత్సవసంచిక.

ఇది కాకరపఱ్ఱు లలితకళాసమితివారిచేఁ బ్రచురితము. ఇందు సమితిచరిత్ర నివేదికలే కాక, 'రూపరసగంధస్పర్శము' లను వచనవ్యాసము, 'శృంగారవీథి' 'అచ్చతెలుఁగునాయికలు' 'అనుతాపము' 'ఆంధ్రభోజుఁడు' 'ఆలోకనము' 'నిరీక్షణము' 'స్మృతి' అనుయువకవుల ఖండికలును గలవు. సలక్షణరచనాసక్తు లగునీయువకవులు తగుపరిశ్రమమునఁ గృతార్థు లగుసూచనలు ఈరచనములఁ గలవు.

బు. వేం.

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

—— :0: ——

శ్రీ పిఠాపురం మహారాజావారి ధనసాహాయ్యముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువు. నాలుగుసంపుటములు ముద్రితమై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు, అకారము మొదలు నకారము వఱకునుగల సంస్కృతాంధ్రశబ్దము లన్నియుఁ గలవు. ఈ నిఘంటువునందు సంస్కృతశబ్దములు పూర్వనిఘంటువు లన్నిటియందుకంటె మిక్కిలి యధికముగా నీయఁబడినవి కావున సంస్కృతవిద్యార్థులకు గూడ మిక్కిలి యుపయోగకరముగా నుండును. ఇది యున్నచో సంస్కృతనిఘంటువుల యపేక్షయుండదు. ఆచ్ఛికపదములకుఁగల యర్థభేదములఁ గనఁబఱిచి వానికిఁ బ్రమాణవాక్యములు పూర్వగ్రంథముల నుండి విపులముగా నీయఁబడినవి. లభ్యమైనంతవఱకుఁ దెనుగుశబ్దములకు సంస్కృత ప్రాకృత ద్రావిడాదిభాషలయందుఁగల సజాతీయపదములు చూపఁబడినవి. కేవలము విడిశబ్దములేగాక సందర్భానుసారముగ సమస్తపదములు (Phrases) ను వానికిఁగల యర్థములును బ్రయోగములునుగూడ నీయఁబడినవి. జనకశబ్దములక్రింద జన్యశబ్దములు చూపఁబడినవి. ఈపుస్తకమును రచించుటకు, ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయునను తలంపుతోఁ దక్కువవెల నిర్ణయింపఁబడినది.

| | | |
|---|---|---|
| సాదాబైండు | సంపుటము 1 కి | రు. 5-0-0 |
| కాలికోబైండు | ,, | 6-0-0 |

# కాకినాడ - ఆంధ్రసాహిత్యపరిషత్తులో

## వెలకు దొరకు గ్రంథములు

1. అకారాద్యముద్రితగ్రంథసూచిక — 0- 8-0
2. అమరుకము - ,, జయంతి రామయ్యపంతులుగారు — 1- 0-0
3. అఱవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము అక్కిరాజు ఉమాకాంతముగారు — 0- 4-0
4. ఆర్యభాషావిభాగము - శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు — 0- 8-0
5. ఆంధ్రధాతుమాల — 1- 0-0
6. ఆంధ్రకౌముది - గణపవరపు వేంకటపతికవి — 0-12-0
7. ఆధునికాంధ్ర వాఙ్మయవికాసవైఖరి జయంతి రామయ్యపంతులుగారు ,, — 1- 8-0
8. ఉత్తరరామచరిత్రము - జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ. బి. ఎల్. — 1- 0-0
9. ఉన్మాదసహస్రము, (వేయిపద్యములు) వెఱ్ఱికి వేయివిధములు క్రొ. సూర్యరావుగారు — 0-12-0
10. కవిజనోజ్జీవని-సమస్యలు-శ్రీకోటి రఘునాథ తొండమాన్ మహీపాలుఁడు — 0- 4-0
11. కావ్యాలంకారచూడామణి పాఠభేదములు — 0- 8-0
12. కాళిందీ కన్యాపరిణయము (ప్రథమభాగము) అహోబలపతి — 1- 0-0
13. డిటో ద్వితీయభాగము — 0- 8-0
14. చంద్రభానుచరిత్రము:- తరిగొప్పుల మల్లనకవి — 1- 0-0
15. చంపూరామాయణము - (ఆంధ్రము) జయంతి రామయ్యపంతులుగారు ,, — 1- 0-0
16. చాటుధారాచమత్కారసారః- (సంస్కృతము) — 0- 8-0

| | | |
|---|---|---|
| 17. జ్ఞానప్రసూనాంబికాశతకము | | 0- 4-0 |
| 18. జైమినీభారతము - వచనము - సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు | | 1- 8-0 |
| 19. జ్యోతిశ్శాస్త్రసారము కపిస్థలం కృష్ణమాచార్యులుగారు | | 0- 8-0 |
| 20. నమస్కారములు ,, ,, | ... | 0- 4-0 |
| 21. నీతిభవనము ,, ,, | ... | 0- 4-0 |
| 22. పరిషత్పుస్తకభాండాగారము | | 1- 0-0 |
| 23. Defence of Literary Telugu జయంతి రామయ్యపంతులుగారు | ... | 0- 8-0 |
| 24. ప్రాకృత భాషోత్పత్తి - శ్రీమాన్ మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు | | 0-12-0 |
| 25. బాలభారతము-(అగస్త్యకృతమునకుఁ దెలుఁగు) కొత్తపల్లి సూర్యారావుగారు | ... | 1- 8-0 |
| 26. మన్నారుదాసవిలాసనాటకము - రంగాజమ్మ | | 0-12-0 |
| 27. యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము జి. రామయ్యపంతులుగారు బి. ఎ. బి. ఎల్. | | 1- 0-0 |
| 28. రసాభరణము - అనంతకవి | | 0-12-0 |
| 29. రసార్ణవాలంకారము - ప్రకాశవర్షకవి | ... | 0- 8-0 |
| 30. రఘునాథరామాయణము (ప్రథమభాగము) రఘునాథభూపాలుఁడు | ... | 0-12-0 |
| 31. రజతోత్సవసంపుటము (ఆంధ్రసాహిత్యపరిషత్తు) | ... | 1- 8-0 |
| 32. రాయవాచకము - విశ్వనాథనాయని స్థానపతి | | 1- 0-0 |
| 33. రెడ్డినాటి రెండుశాసనములు | | 0- 8-0 |
| 34. లక్షణసారసంగ్రహము ... | .. | 1- 0-0 |

| | | |
|---|---|---|
| 35. | లౌకికన్యాయవివరణము - శ్రీమాన్ మేడేపల్లి వెంకటరమణాచార్యులుగా | 1- 8-0 |
| 36. | శతకసముచ్చయము (మొదటిభాగము) | 1- 0-0 |
| 37. | డిటో (ద్వితీయభాగము) | 1- 0-0 |
| 38. | శాసనపద్యమంజరి - జయంతి రామయ్య పంతులు బి. ఎ. బి. ఎల్. | 1- 0-0 |
| 39. | శాసనపద్యమంజరి (ద్వితీయభాగము) | 0- 8-0 |
| 40. | శివతత్త్వసారము - మల్లికార్జున పండితారాధ్యులు | 1- 0-0 |
| 41. | శివరాత్రిమాహాత్మ్యము - శ్రీనాథ మహాకవి | 1- 4-0 |
| 42. | షోడశకుమారచరిత్రము - వెన్నెలకంటి అన్నయ్య | 1- 0-0 |
| 43. | సర్వేశ్వరశతకము - యథావాక్కుల అన్నమయ్య | 0- 4-0 |
| 44. | సాంబోపాఖ్యానము - రామరాజు రంగప్పరాజు | 1- 0-0 |
| 45. | సింహాసనద్వాత్రింశిక (ప్రథమభాగము) కొఱవి గోపరాజకవి | 1- 0-0 |
| 46. | డిటో (ద్వితీయభాగము) ,, | 1- 0-0 |
| 47. | సీతారామచరిత్రము - బాలకాండము మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి | 0-12-0 |
| 48. | సూత్రాంధ్రవ్యాకరణము - చిన్నయసూరి | 0-12-0 |
| 49. | హంససందేశము (తెలుగుపద్యములు) కల్లూరి వేంకటరామశాస్త్రిగారు | 0- 2-0 |
| 50. | ప్రహస్వరంగములు - కొత్తపల్లి సూర్యరావుగారు | 0- 8-0 |
| 51. | Dravidian Lexicography జయంతి రామయ్యపంతులుగారు బి. ఏ. బి. ఎల్. | 0- 8-0 |
| 52. | పరిషత్పుస్తకభాండాగారము III భాగము | 1- 0-0 |

## పిఠాపురము మహారాజావారి ప్రచురణములు

| | |
|---|---|
| 1. ఆంధ్రసూత్రభాష్యము 4 సంపుటములు<br>పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు | 8- 0-0 |
| 2. కళాపూర్ణోదయము_పింగళి సూర్యనార్యుఁడు<br>శ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారిచేఁ<br>బరిష్కరింపఁబడినది. | 2- 8-0 |
| 3. ధర్మఖండము - ఈదులపల్లి భవానీకవి<br>(రెండుభాగములు) | 1- 8-0 |
| 4. పరమయోగివిలాసము-(ద్విపద) తాళ్ళపాక<br>తిరువేంగళనాథుఁడు .. | 1- 4-0 |
| 5. భద్రాపరిణయము-అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి .. | 1- 4-0 |
| 6. మహేంద్రవిజయము- ,, ,, . | 1- 0-0 |
| 7. యతిరాజవిజయము-దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి . | 0-10-0 |
| 8. రామచంద్రోపాఖ్యానము-వారణాశి వేంకటేశ్వరకవి. | 1- 0-0 |
| 9. రామరాయవిలాసము-దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి. | 0-12-0 |
| 10. విష్ణుమాయానాటకము - చింతలపూడి యెల్లనార్యుఁడు | 1- 8-0 |
| 11. శ్రీపీఠికాపురస్థానచరిత్రము-శ్రీరామ వీరబ్రహ్మకవి | 1- 4-0 |
| Life of Pingala Surana-Tekumalla Achyutarao | 2- 0-0 |

---

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

## ప్ర తి ష్ఠా ప కు లు.

శ్రీశ్రీశ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారు సి. బి. ఇ. డి లిట్ పిఠాపురం మహారాజులుంగారు.

శ్రీశ్రీశ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీశ్రీశ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉ ద్ధా ర కు లు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు)

## అ ధ్య క్షు లు.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవి సమ్రాడిత్యాది బిరుదాంకితులగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

## కార్యదర్శులు :

శ్రీ కిడాంబి రాఘవాచార్యులుగారు ఎం. ఏ, బి యల్.

సాహిత్య శిరోమణి, ఉభయభాషాప్రవీణ,
శ్రీ చతుర్వేదుల సత్యనారాయణగారు ఎం. ఏ, బి. ఓ. యల్.

## కోశాధ్యక్షులు :

శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారథి గారు బి. ఎ, యల్. యల్. బి.

శ్రీ ఏలేశ్వరపు వేంకటరమణ సుబ్బారావుగారు, బి. ఏ, బి. యల్.,

## కార్యనిర్వాహక సభాసభ్యులు :

శ్రీ పురాణం భద్రయ్యనాయఁడుగారు, ఎమ్. ఏ, యల్. టి.

,, కోకా శివనాథశాస్త్రిగారు

,, కొమ్మిరెడ్డి కేశవ రామమూర్తినాయఁడుగారు బి. ఏ.

,, వేదుల శ్రీరామచంద్రకీర్తిగారు. ఎం. ఏ, (ఆనర్సు)

ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు ఎం.

,, ఎండమూరి వేంకటరమణగారు. ఎమ్. ఏ. బి యిడి.

,, బులుసు వేంకటేశ్వరులుగారు. బి. ఏ.

,, సాహిత్యవిద్యా,భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు

,, బండారు తమ్మయ్యగారు.

---

ఆంధ్రప్రచారిణీ ప్రింటింగు వర్క్సు, కాకినాడ.

శ్రీ

# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

## కాకినాడ



దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.


సంపుటము ౪౧ | సంచిక ౧-౩

# సంపాదకవర్గము

ప్రధానసంపాదకుఁడు :

కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. యల్.

సహాయ సంపాదకులు :

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు ఎం. ఏ.
శ్రీ విద్వాన్ వేమల రామచంద్రకీర్తిగారు ఎం. ఏ. ఆనర్సు., బి. ఇడి.
శ్రీ విద్వాన్ బులుసు వేంకటేశ్వరులుగారు, బి. ఏ.
శ్రీ సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
శ్రీ బండారు తమ్మయ్యగారు.

# విషయసూచిక.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## కాకినాడ

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

( Journal of the Telugu Academy )

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయిలు.

సంపుటము ౪౧. { నందన సంవత్సరం చైత్ర-భాద్రపదములు } సంచిక ౧-౩

## ఆంధ్రరాష్ట్రము.

1952 డిసెంబరు పందొమ్మిదవ తేది యాంధ్రులకు శుభదినము. శ్రీపొట్టి శ్రీరాములుగారి యాత్మార్పణ ప్రేరితులై భారతదేశ ప్రధానమంత్రి యానాఁడు సత్వరాంధ్రరాష్ట్రనిర్మాణమును గూర్చి సన్నిహితములై యున్న తెలుఁగుమాట్లాడు ప్రాంతములన్నియుఁ గలసి యాంధ్రరాష్ట్రముగా నేర్పడునని కేంద్రశాసన సభలో నొక ప్రకటనముగావించిరి. నలువది సంవత్సరములనుండి యాంధ్రులొనర్చుచున్న నిరంతర కృషి నేటికి ఫలోన్ముఖమైనది. ఇంతవఱకు హిందీ ఆంగ్లభాషల దాడికి నలుగుచువడి యున్న యాంధ్రభాషామతల్లి కిఁకఁ గొంత యూఱటగలుగవచ్చును. ప్రభుత్వము మనచేతిలో లేనందువలన మన భాషను బోషించుటకు మనకెట్టి యవకాశము లేకుండెను. రాష్ట్రవిభాగముతో మనకు సమగ్రావకాశము చేకూరఁగలదు. ఈస్థితిలో నాంధ్రులు భిన్నభిన్నాభిప్రాయములతో వేర్వేఱుపట్టుదలలతోఁ బరస్పర కలహములతోఁ గాలయాపన మొనరింపక యాంధ్రభాషాభివృద్ధికై పాటుపడవలెను. "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యని మనపూర్వులార్జించిన ప్రతిష్ఠను సార్థకము చేసికొనవలసిన బాధ్యత మనపై నున్నది. ఒకభాష మఱియొకభాష కంటె వెనుకఁబడియున్నదన్నచో, ఆలోపము భాషోపాసకులదే గాని భాషది కాదు. ఒకప్పుడు దేశభాషలలో లెస్స యనిపించుకొని, నేడు మనపాలఁబడి, తెలుఁగుభాష యితరదేశభాషల

కంటె వెనుకఁబడి యుండుట మనకు మిక్కిలి యవమానకరము. ఇప్ప టికైన నీయవమానము తెలుఁగు వారికి దుస్సహమనిపించినచోఁ దెలుఁగు నకు మంచిదినములు వచ్చినవన్నమాట.

ఆం ధ్ర సా ర స్వ త ప రి ష త్తు

ఈజనవరి 11-14 తేదీలలో అలంపూరుగ్రామమున నీపరిషద్వార్షికో త్సవము జయప్రదముగా జరిగెనని తెలిసి మానంతోషము వెలిబుచ్చు చున్నాము. పరిషత్తుస్థాపింపఁబడి పదిసంవత్సరములే యైనను హైదరా బాదురాష్ట్రము నలుమూలల వ్యాపించి ప్రజలయాదరమును జూఱఁ గొనుట గొప్పవిశేషము. రాష్ట్రప్రభుత్వము దీని కన్నివిధములఁ దోడ్ప డుట మిగులఁ బ్రశంసనీయము.

ఆం ధ్ర వ్యా క ర ణ ము

ఈమధ్య "కిన్నెర" పత్రికలో " వాడుకభాష-విశ్వవిద్యాలయ ములు" అనువ్యాసము పడినది. అది వాడుకభాషయొక్క ప్రాశ స్త్యమును దెలిపి యట్టిప్రశస్తమైన భాషను విశ్వవిద్యాలయములు వెంటనే యాదరింపవలెనని నివేదించెను. మొదట నది చిన్నయసూరి పైధ్వజ మెత్తెను. అనంతరము వ్యావహారిక భాషాపోషకులనుగా కందు కూరి వీరేశలింగముపంతులుగారిని, గిడుగురామమూర్తి పంతులుగారిని గురజాడ అప్పారావు గారిని బ్రశంసించెను.

చిన్నయసూరి లోపముల వారిట్లు వివరించిరి—చిన్నయసూరికిఁ బూర్వము వాడుకభాషలో గ్రంథరచనము జరుగుచుండెడిది. ఈయన బయలుదేఱి బాలవ్యాకరణమును రచించి తెలుఁగు భాషాసౌకుమార్య మును బాడుచేసెను. చిన్నయసూరి చెన్నపట్టణపు ప్రాంతములలోఁ బుట్టి పెరిగినవాఁడు. అందుచే "తెలుఁగు దేశానికి సన్నిహితంగా ఈత నికి అంతసంపర్కం లేకపోయింది. కావున జీవద్భాష అయినజాను తెనుగుతోను తెనుగుదేశపు విశిష్ట సంప్రదాయంతోను సూరిగారికి పరిచయం లభింపలేదు," అనివ్రాసినారు. పూర్వగ్రంథముల నుండి యనేక లక్ష్యముల నొసంగుచు నొకచేతిమీఁదుగా తెలుఁగునిఘంటువు నంతయును వ్రాయనేర్చిన పండితాగ్రేసరుఁడు, పలుమంది పండితులతో

నిత్యసంబంధము లభింపఁగల తెలుఁగు రాజధానియగు చెన్నపురియందు నివసించిన సూరికి జాను తెనుఁగు తెలియదని చెప్పుట యతిసాహసము. వారింకను వ్రాసిరి-సూరి ప్రెసిడెన్సీ కాలేజీలోఁ దెనుఁగుపండితుఁడుగానుండి యధికారబలముచేఁ దన వ్యాకరణమును విశ్వవిద్యాలయములలోఁ బ్రవేశపెట్టి వాడుకభాషకట్టి యవకాశముగల్గకుండఁ జేసినారు అని నిజమారసినచో మనకులభించెడి తెలుఁగు వ్యాకరణములలో బాలవ్యాకరణమువలె సులభమైనది సమగ్రమైనది మఱియొకటి లేదు. అందువలనఁ దెలుఁగు దేశమంతయు దానిని శిరసావహించెను. తెలుఁగు దేశము దేనిని శిరసావహించెనో దానినే విశ్వవిద్యాలయము లాదరించినవి. బాలవ్యాకరణమునందలి గుణమును గ్రహించియే విశ్వవిద్యాలయము లాదరించినవిగాని చిన్నయసూరి యధికారమును జూచి కాదు.

వాడుకభాషలో గ్రంథములు వ్రాసి తత్ప్రచారమునకై నడుముకట్టిన గిడుగు రామమూర్తి పంతులుగారిని, గురజాడ అప్పారావు గారిని బ్రశంసించిన నర్థమున్నదిగాని లాక్షణికభాష నంగీకరించిన కందుకూరి వీరేశలింగముగారిని బొగడుటచే వీరికేమి లాభమో తెలియుట లేదు. పంతులుగారు తమరచనలన్నిటిఁ బండితపామరులకర్థమగు మనోహరమైన లాక్షణికభాషలోనే వ్రాసిరి. వారి ప్రహసనములలోని వాడుకభాష పాత్రోచితముగాఁ బ్రయోగింపఁబడినదేగాని యాభాష యందలి యాదరముచేఁగాదు. పై విధముగా సూరిమీఁద, వారిబాల వ్యాకరణముమీఁద దాడి వెడలి వ్యాసాంతమున "నేఁటి కాలానికి దిగ్దర్శన ప్రాయంగా చూపింపగల వ్యాకరణం ఒకటిఅవసరం. అట్టి వ్యాకరణమే విశ్వవిద్యాలయాలలో పఠనీయగ్రంథంకావాలి" అని వ్రాసిరి. జీవద్భాష కెవరును సమగ్రమైన వ్యాకరణము వ్రాయలేరు. నేఁటిభాషకు బాలవ్యాకరణము సమగ్రమైన వ్యాకరణము కాదు. కావున నిదియు దిగ్దర్శనప్రాయమైన వ్యాకరణమే యని చెప్పవచ్చును. ఇట్టిబాలవ్యాకరణము దూషించి వీరెట్టి వ్యాకరణమును రచింతురో తెలియకున్నది. నేఁడువ్యాకరణము రచింపవలెనన్న నొకరు వ్రాయఁగ డంగుట సమంజసముగాదు. ఒక్కరేతమకుఁదోఁచిన విధమున వ్రాయఁ దలంచినచో దానిని వారికూటము వారెవ్వరైన నాదరింతురేమోకాని

యాంధ్ర దేశమంతయు శిరసావహించుట యసంభవము. ఈనడుమ శ్రీగిడుగుసీతాపతిగారు వాడుకభాషకు వ్యాకరణము వ్రాయుచున్నటుల బత్రికాముఖమునఁ జదివియుంటిమి. కిన్నెరపత్రికలో సూచింపఁబడిన దిగ్దర్శనప్రాయమైన వ్యాకరణము శ్రీసీతాపతిగారు రచించుచున్న వ్యాకరణమునుగూర్చియే కావచ్చును. వారొక్కరే యట్టిపనికిఁబూనుటకంటెఁ బ్రాచీనసంప్రదాయానుసారులై నసుప్రసిద్ధులగు పండితులను, భాషాశాస్త్ర సంప్రదాయవిదులను గలిసికొని సర్వపక్షసమ్మతమై సర్వాంధ్రదేశమునకు వ్యవహార యోగ్యమైన వ్యాకరణము వ్రాయుట ప్రశస్తముగా నుండును. ఇట్టి వ్యాకరణ మొకటి సర్వజనాదరణమును బడసినచో నేఁటి పత్రికలలోను, పుస్తకములలోను వ్రాయఁబడుచున్న హేయమైన భాష కవకాశము లేకుండఁబోవును. ఆంగ్లములో భాషావేత్తలగువారే పత్రికా సంపాదకులుగా, గ్రంథరచయితలుగా నుందురు. మనవారాంధ్రభాష చదువవలసిన శ్రమకుఁ బాల్పడకయే దానియందు గ్రంథరచన కారంభించుచున్నారు. గొంగళిలోఁ దినువానికి వెండ్రుకలకై వెదక నవసరములేనట్లు వీరి రచనలలోఁ దప్పుల వెదక నవసరములేదు. ఎవరికిఁ దోఁచినట్లు వారు వ్రాయుచున్నారు. శిష్టమైనభాష యను బాధలేక యెట్టిదైనను చలామణి యగుచున్నది. సర్వజనసమ్మతమైన యొక భాషానుశాసనము లేనిదే యిది శిష్టము, ఇది యశిష్టమని యెవరు చెప్పఁగలరు? ఎవరికివారు తాము వ్రాసినభాషనే శిష్టముగాఁ దలంచుచున్నారు. భాష నియమరహితమైనచో నిట్టి యనర్థములే సంభవించుచుండును. నియమరహితమైనభాష యెప్పటికిని సర్వజనాంగీకారమును బడయఁజాలదు. అందువలననే నియమసహితమైన భాష యవసరమని మాపరిషత్తు చిరకాలమునుండియు నుద్ఘోషించుచున్నది. తెలుఁగుభాషకు సజాతీయేతరభాషలతోఁ గల సాదృశ్యములను సాకల్యముగా నిరూపించుచు నొక వ్యాకరణమునురచించి ప్రచురించుట ప్రధానమైన మాపరిషదుద్దేశములలో నొకటి. ఈ నాఁటికైనను వ్యావహారికవాదులు వ్యాకరణావశ్యకతను గ్రహించుట యాంధ్రభాషకు శుభావహము.

---



శ్రీ

# లలితకళలు—కవిత్వము.

శ్రీ దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ ఆనర్సు.

(ఉస్మానియా విశ్వవిద్యాలయము).



## ౧

మనలోఁ బ్రాచీనకాలము నుండియుఁ గళ లఱువది నాలుగను సంప్రదాయము వచ్చుచున్నది. వాత్స్యాయన కామసూత్రము లందీ చతుష్షష్టి కళలును జేర్కొనఁ బడియున్నవి. ప్రయోజనమును బురస్కరించుకొని వీని నుపయోగకరములు, ఆనందప్రదములు అని యిరు తెఱఁగులుగా విభజింపవచ్చును. మాల్యగ్రథన, ధాతువాద, పాక క్రియాదులు మొదటి రకమునకును, శిల్ప, చిత్రలేఖన, నాట్య, గాన, కావ్యములు రెండవ తెగకును జెందును. ఉపయోగకళలు మానవశరీరమున కనేకవిధముల సౌఖ్యము చేకూర్చి వారి లౌకికజీవితమున కధికముగాఁ దోడ్పడుచుండును. ఆనందప్రదములు వారియాత్మల కనితర లభ్యమును, విగళిత వేద్యాంతరమును బ్రహ్మానందసబ్రహ్మచారియునగు నానందరసమును జూఱయొసంగు చుండును. ఆనందజనకత్వమే ప్రధానముగాఁగల వీనిని బాశ్చాత్యులు Fine Arts అందురు. మనము వీనిని సుందరకళలు, సుకుమార కళలు లేక లలితకళలు అని పిలువవచ్చును. రఘువంశాష్టమ సర్గమునఁ గాళిదాసు "గృహిణీ సచివః సఖీ మిథః ప్రియశిష్యా లలితే కళావిధౌ" యని వ్రాయఁగా, మల్లినాథసూరి "లలితే కళావిధౌ" అను మాటలకు లలితే సుకుమారే, కలానాంగీతాదీనాం, విధౌ అనుష్ఠానవిషయే" యని వ్యాఖ్యానముచేసి యుండెను. దీనినిబట్టి గీతాదులు లలితకళలని యాకవి వ్యాఖ్యాతృ సార్వభౌము లిరువురు నభిప్రాయపడినట్లు వ్యక్తమగుచున్నది. అందుచే మనకున్న రెండవ తెగ వానిని గాళిదాసుపెట్టిన లలితకళలను పేరుతోడనే పిల్చుట యుక్తముగా నుండును. పేరేదియైనను దమ్ము సేవించువారి కానందము నొసంగుట వీని ప్రధానధర్మమని మనము గ్రహింపవలయును.

ఉపయోగకళలు కూడ శరీరసౌఖ్య సంధానముద్వారా మానవుల మానసముల కించుక సంతోష మావహించుట నిజమే. కాని యీయానందము లౌకికమే కాని బ్రహ్మానంద తుల్యమైనదికాదు. అంతేకాక యది సవ్యాజమై యుండును. రుచికరమైన యాహారమును మనము భుజించినచో నది మనకడుపు నింపి యాఁకలిఁ బాపును. అది మనకు సంతోషము నొసంగుటకు క్షుద్బాధానివారణము కారణము. ఆకారణమే లేనిచో నది యెంతవిలువగల శుచియైన పదార్థమైనను మనకుఁ బ్రీతి కలిగింపఁజాలదు. లలితకళలవలన నాఁకలి దప్పులు తొలఁగుటవంటి శరీర సౌఖ్య లాభమేమియు సంధిల్లకపోయినను మైమఱపింపఁజాలు మహానందమొకటి కలుగుచుండును. అందుచేతనే లలితకళాజన్యమైన యానందమునకు నిర్వ్యాజత్వ మొక లక్షణముగాఁ జెప్పవచ్చును.

ఉపయోగకళ లనుభవింపఁబడు కొలంది నల్పపరిమాణములై పోవును. పాకకళానిపుణుఁ డొకఁడు రుచ్యమైన వంటకమును సిద్ధము చేసె ననుకొందము. పదిమంది చేరి దాని ననుభవింప నారంభించినచో నది యల్పకాలముననే యదృశ్యమైపోవును. మఱియు నొకసారి యనుభూతమైన యాపదార్థము నింకొకసారి యెప్పుడైన నెవ్వరైనఁ దిరిగి యనుభవించుట కవకాశ ముండదు. లలితకళ లట్లు కాక యెందఱెన్నిసారు లనుభవించినను దఱుగక కరుగక మెఱుఁగెక్కును. నిచ్చక్రొత్తలై యనుభవించుకొలంది నానంద మినుమడింపఁ జేయుట లలితకళలందలి రెండవలక్షణము.

ఉపయోగకళలలో నొకటగు ధాతువాదము నొకఁడునేర్చి పెట్టెఁడు బంగారము చేసె ననుకొందము. అది యాచేసినవాని కొక్కనికే యానందము కలిగించును. ఇతరు లది చూచి యసూయావిస్మయము లొందిన నొందవచ్చును గాని యానందమును మాత్రము పొందఁజాలరు. మఱియొక్కఁడట్టి యానందము నొందవలె నన్న నాకళ తానును నేర్చి యుపరంజి కూర్చుకొనవలయును. లలితకళలవిషయ మట్లుకాదు.

అవి యెల్లరకు నానందము కలిగించుటయేకాక యేకకాలమున ననేకుల నానందము నొందింపఁ శక్తిగల్గియుండును. గాయకుఁడు గొంతెత్తి త్యాగరాజ కీర్తన శ్రావ్యముగాఁ బాడుచుండ వినుచుండు సభ్యులెల్లరు నేకకాలమున నానందతన్మయు లగుదురు. రమణీయమైన శిల్పమును గాని చిత్రమును గాని చూచువారును రసవంతమైన కావ్యమును విను వారును నిట్లే పలువు రేకకాలమున నానంద తన్మయత్వము నొందుచుం దురు. దీనినిబట్టి సర్వజనీనత లలితకళలయందలి యింకొక లక్షణముగా గోచరించుచున్నది.

లౌకికకళల విషయమునవలె లలితకళల విషయమునఁ బరిమాణ మున కంతప్రాధాన్యము లేదు. వండఁబడిన పదార్థము లెంతయధికముగా నున్న నంతయెక్కువమంది వానిని భుజించి తృప్తినొందుదురు. లక్షల కొలఁది రసికుల మెప్పించుటకుఁ జిన్నదైన చిత్రలేఖనమొక్కటి చాలును. రసవంతమైన వాక్యమొక్కటి చాలును. కాళిదాసుని మేఘసూతము సంస్కృతకావ్యము లందెల్లఁ బరిమాణమునఁ జిన్నదయ్యుఁ బాటవమున నితర కావ్యములకన్న మున్నెన్నఁదగి యున్నదికదా !

ఈవిధముగా లౌకికకళలకును లలితకళలకును భేద మధికముగా గోచరించినను సూక్ష్మముగాఁ బరిశీలించినచో నీరెండు తెగలు కొంతవఱ కన్యోన్యాశ్రయములై యనాదికాలము నుండియు జంటగా వర్ధిల్లెనని చెప్పవచ్చును. ఆదిమకాలపు మానవుఁడు శీతవాతాతపముల బాధ భరింపలేక మొదట గృహనిర్మాణకళ నభ్యసించెను. ఇట్లది ప్రాథమికా వస్థలో నుపయోగదృష్టితో నేర్పడినదే యయ్యుఁ దరువాతఁ గ్రమక్రమ ముగా సుందరములైన దేవాలయములకును రమణీయములైన స్తూపా దులకును ద్రోవ చూపెను. ఇట్లే మానవుఁడు మొదటఁ జలిబాధపడలేక బట్టలునేయుట నేర్చుకొనెను. కాని తరువాత సౌందర్యపిపాసువై వానికి వివిధవర్ణ సుందరములైన అంచు లద్దుటకును రంగులు వేయుటకును బ్రయ త్నించెను. పైయుదాహరణములు లౌకికకళలు లలితకళలకుఁ గొంత

వఱకు బీజావాప మొనరించె ననుటకు దృష్టాంతముగా నున్నవి, ఇట్లే కొన్నిచోట్ల లలితకళలు లౌకికకళల యావిర్భావమునకుఁ గారణములైనవి. కవులు కావ్యములు చెప్పఁగా మొదట వ్రాఁతయుఁ దరువాత ముద్రణమును నేర్పడినవి. చిత్రకారులు తమకళ కభివృద్ధిచేసినకొలంది వర్ణపరిశ్రమ విజృంభింప నారంభించినది.

లలితకళల కానంద జనకత్వమే ప్రధానప్రయోజనమైనను నవి లౌకికముగాఁగూడ నుపయోగపడవచ్చును. శిల్పకళకుఁ బరాకాష్ఠయని చెప్పఁదగిన తాజమహాలువంటి సుందరభవనము సర్వావకాశములు కలవారెవ్వరైన నివాసగృహముగాఁ జేసికొన్నఁగాదను వారెవ్వరు ? కాని యట్లుచేయుట కప్పురమిచ్చి యుప్పుకొనుటవలెఁ బరిహాసాస్పదము గానుండును. లౌకికకళలు జీవితోపయోగ నిర్వహణమునకు వలె నానంద ప్రదానమున కంతగాఁ బనికి రావు, వానిప్రయోజనము శరీరమర్యాద దాఁటి యాత్మ నందుకొనఁజాలదు.

లలితకళ లనుకరణములా లేక స్వతంత్రసృష్టులా యను విషయమున నభిప్రాయభేదము కలదు. గ్రీకు తత్త్వవేత్తలలో నగ్రగణ్యుఁడును బాశ్చాత్య లాక్షణికుల కాచార్యప్రాయుఁడునగు నరిష్టోటలివి యనుకరణములని నుడివెను. విశాలమును, స్థావరజంగ మాత్మకమునగు బ్రహ్మసృష్టినిజూచి యందలి రామణీయకము ననుభవించి కళానిర్మాతలు తమకళలలో దాని ననుకరింతురని యాతనిభావము. కాని కొందఱు కళావిమర్శకు లీతని యూహ నునిరసించి లలితకళలు బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టులో, పునఃసృష్టులో లేక ప్రతినిధులో యయియుండును గాని యనుకరణములు మాత్రము కావని యభిప్రాయపడిరి. మూలపదార్థముకంటె నీలలితకళలందలి పదార్థము (లేకద్రవ్యము) భిన్నమైయుండు ననునంతవఱ కవి ప్రతిసృష్టులో పునఃసృష్టులో యని యంగీకరింపవచ్చును. కాని మూలవస్తువులకును వీనికిని బోలికయే లేదనుట యనుభవ

విరుద్ధముగాఁ గానఁబడును. అన లనుకరణములేకాని మూలవస్తువులు కళావిషయములు కాఁజాలవు. సుందరాంగియైన యొకయువతి ప్రత్యక్షముగా మనకుఁ గానఁబడిన నామెనుగాంచి లౌకికదృష్టితో మనము సంతోషింతుమే కాని కళాదృష్టితో నానందింపము, కాని చిత్రకారుఁడెవఁడైన నట్టిచిత్రమును జిత్రించినను; గవి యెవఁడైన నట్టిపాత్రను వర్ణించినను మనము చూచి, విని, కళానందమును జూఱఁగొందుము. కళానిర్మాతలు మూలవస్తువుల నెంతయధికముగా ననుకరింపఁజాలిన మనకానందమంతయెక్కువగాఁ గలుగుచుండును. అనుకరణమునందలి మూలసన్నిహితత్వము కళాకారుల ప్రతిభాశక్తిపై నాధారపడి యుండును.

కవియొకఁడు యుద్ధమును వర్ణింపఁదలఁచుచోఁ దాను జూచిన యథార్థయుద్ధము ననుకరింప యత్నించును. ఆతఁడు రథ గజ తురగ పదాతుల యాకృతులను, వాని చలనములను, వివిధ పరికరములను, శంఖారావములను, నిహతయోధుల శరీరములనుండి స్రవించు నెత్తురు ధారలను వర్ణించి యొకయుద్ధ వాతావరణమును గల్పించి పఠితలమనోవీథుల యుద్ధమును బ్రత్యక్షముచేయును, ప్రత్యక్షయుద్ధము నీవర్ణన యెంతనిశితముగా ననుకరించిన నాచిత్రము మన కంత యాకర్షకముగా నుండును. అతఁడునిజమైన యుద్ధమునందలి విషయముల ననుకరింపక వేఱేదైన వర్ణించినచో నావర్ణన యెంతసుందరముగా నున్నను. వాడినశబ్దములెంత మృదుమధురములైనను మనకు యుద్ధభావము స్ఫురింపదు. ఇట్లే చిత్రకారుఁడుసుందరమైన యశ్వమును జిత్రింపఁదలఁచినఁబ్రత్యక్షముగాఁదాను జూచిన యశ్వమును దృష్టియం దిడుకొని దానియవయవాదుల ననుకరించును. అట్లుకాక యాతఁడు మూలమును విడిచి యథేచ్ఛముగాఁ జిత్రణము సాగించినచో నాచిత్ర మితరవిధముల నాకర్షకరముగా నున్నను మనకశ్వమను నూహ జనింపఁ జేయదు. శిల్పము విషయముకూడ నింతే. నటుఁడొక మహారాజు పాత్ర నభినయింపఁ దలఁచుచో రంగమున మహారాజు వేషభాషల ననుకరింపవలయును. అట్లుచేయక యాతఁ డితరవిధముల నెన్నఁదగిన యభినయ మెంత నిపుణముగా నొనరించినను సామా

జకులకు రాజభావము కలిగింపఁజాలఁడు. ఇట్లు లలితకళలలో సర్వత్ర యనుకరణము గోచరించుచున్నది. ఈయనుకరణ మహత్త్వము లేనిచోఁ గళాకారుఁ డెంతనేర్పరియయ్యుఁ దా నుద్దేశించు వస్తుభావము ననుభవించువారిలో నుత్పాదింపఁజాలఁడు.

పైని వివరింపఁబడిన రూపానుకరణముతోపాటు భావానుకరణముకూడ నుండిఁగాని లలితకళలు సమగ్రత్వము నొందఁజాలవు. కవి యొకానొక సన్నివేశమునందలి వ్యక్తిని వర్ణించు సందర్భమున దద్రూపములేకాక సన్నివేశమున కనుగుణమైన తద్భావమునుగూడ వర్ణింపవలయును, అప్పుడే యా సన్నివేశముయొక్క చిత్రణము సంపూర్ణమగును. ఇట్లే శిల్పిచిత్రకారులును కేవలరూపమునే కాక ప్రత్యేకభంగిమలచే, రేఖలచే భావమునుగూడ స్ఫురింపఁజేయవలయును. నటుని సందర్భమున నీవిషయము మఱింత స్పష్టముగా గోచరించును. అతఁడు పాత్రల రూపము ననుకరించినంత మాత్రమునఁ బ్రయోజనము లేదు. అవయవవిన్యాసములద్వారా, ఉచ్చరించు శబ్దములద్వారా యాతఁడు భావానుకరణముకూడఁ జేయవలెను. వియోగినీపాత్రము నభినయింపఁగోరు నటి లేక నటుఁడు వేషముచే ముఖభ్రూవిక్షేపాదులచే నిజముగా వియోగమునందున్న స్త్రీభావముల ననుకరింపవలెను. రూపానుకరణము కంటె భావానుకరణ మించుక కష్టసాధ్యమైనదే. కాని యదియెంత సమగ్రముగా నిర్వహింపఁబడిన నంతయధికమైన ఫలము నొసంగును.

లోకమునఁ గవిబ్రహ్మ కవితాసృష్టియను మాటలు వాడుకలో నున్నవి. ఈమాటలు వినినంతనే కవియు బ్రహ్మవలె శూన్యమునుండి రూపముల సృజించుననియు నాతఁ డందు బ్రహ్మవలెనే స్వతంత్రుఁడనియు భావములు స్ఫురించును. కాని యీమాటలు గౌణార్థమున వాడఁబడినవేకాని యౌగికార్థమున వాడఁబడినవి కావు. ఏలయన బ్రహ్మసృజించుపదార్థముల కాతనియూహ సంకల్పములే కారణములు కాని వానికి మాతృక లని చెప్పఁదగిన యితరవస్తువు లేవియుఁ గారణములు కావు. మఱి కవియో చిత్రకారుఁడో నిర్మించు రూపములకు వారి యూహాబలముకూడ నించుక తోడ్పడినను అవి యమాతృకములైనవి మాత్రము

కావు. వానికి మాతృకలైన వెప్పుడో యెచ్చటనోయుండి తీరవలెను. అందుచేతనే వారిసృష్టి స్వతంత్రసృష్టి కాదనవలసి వచ్చుచున్నది.

ఇంకఁ జిత్రలేఖన కవిత్వాదులు సృష్టికిఁ బ్రతినిధులను నభిప్రాయమును బరిశీలింతము. రూపసామ్యములేని కేవల ప్రాతినిధ్యమువలన మనకు వస్తువుయొక్క సమగ్రస్వరూపము ప్రత్యక్షము కానేరదు. "ఆవు" అనుజంతువున కారెండక్షరములును వాని నుచ్చరించునప్పుడు శ్రవణ గోచరమగు ధ్వనియుఁ బ్రతినిధులు. ఆవను నక్షరములను జూచినప్పుడు కాని తత్ప్రతిపాదితమగు ధ్వనిని విన్నప్పుడు కాని మన కావు వర్ణనమునో చిత్రలేఖనమునో చూచినప్పుడు కల్గునంత రూపస్ఫూర్తి కలుగదు. దుష్యంతుఁడు విరహవేదనాదూయమానుఁ డగునప్పు డతనికి శకుంతల యనుపదమునందలి యక్కరములఁ జూచినను అవి కలిగించు ధ్వనిని వినినను గలుగు నుపశాంతికంటె శకుంతలా చిత్రమును జూచినచో బొటిల్లునూఱట యధికముగా నుండు ననుటలో సందేహములేదు. అందుచే లలితకళలు బ్రహ్మసృష్టికి రూపసామ్యముతోడి ప్రతినిధులు రూపసామ్యమనఁగా ననుకరణమన్నమాటే. లలితకళల ననుభవించు వారు తత్కళాజనితానందమును సమగ్రముగాఁ బొందవలె ననిన నవి యనుకరణము లను సంగతి విస్మరింపరాదు. అట్లుకాక యవి యథార్థములే యని భావించుచో వారి కానందమునకు బదులు భయజుగుప్సాకోపాదులగు నితర భావము లుప్పతిల్లును. అనుభవమునుబట్టి చూచిన నీవిషయము విస్పష్టమగును. ఇరువురు యోధులు నిశితకరవాలములు దాల్చి యొండొరులఁ జంప నుంకించుచు యుద్ధమొనరించు దృశ్యమును జూచునప్పుడు మనకు భయకంపాదులే కాని యానందము కలుగదు. అట్టిదృశ్యమును జూడలేక భయాక్రాంతులమై మనము దవ్వుగాఁ బోవుదుము. అట్లకాక ప్రతిభాశాలియైన మహాకవి యిరువురు యోధులు కావించు పోరాటమును సవిస్తరముగా వర్ణించుచుఁ బద్యములు వ్రాసినచో నాపద్యములను జదువునప్పుడు మన మానందము నొందుటేకాక వానిని మాటిమాటికిఁ జదువ నూహింతుము. ప్రకృతిలో దుఃఖమును

గలిగించు నభిమన్యువధాది ఘట్టములను మనము మాటిమాటికిఁ జదువనువ్విళులూరుటకును, హరిశ్చంద్రనాటకాదులందలి కరుణ రసపూరిత ఘట్టముల ననేకపర్యాయములు రంగమునఁ జూడ నుత్సహించుటకును, పంది, గాడిద మున్నగు నసహ్యాకరములగు జంతువుల చిత్రములనైనను బదింపదిగా నవలోకింపఁ దివురుటకును నిదియే కారణము. దీనినే పండితరాయలు "అయం హి లోకోత్తరస్య కావ్యవ్యాపారస్య మహిమా యత్ప్రయోజ్యా అరమణీయా అపి శోకాదయః పదార్థా ఆహ్లాదమలౌకికం జనయన్తి. విలక్షణో హి కమనీయః కావ్యవ్యాపారజ ఆస్వాదః ప్రమాణాన్తరజా దనుభవా" త్తని రసగంగాధరమున నుడివియుండెను. ఈవిషయ మొక్క కావ్యమునకే కాక యితర లలితకళలకును నన్వయించును. ప్రకృతిలో భయ చింతాజుగుప్సాదులను గలిగించు దృశ్యములే కళారూపము నొందినప్పుడు మన కానందజనకములగుట కవి యనుకరణములే కాని యథార్థములు కావని మనభావమున స్థిరముగానుండు జ్ఞానమే కారణము. మనము దారిని బోవునప్పుడొక కుక్క మొఱిఁగినచో భయపడి పాఱిపోదుము. హాస్యకారుఁడు కుక్కకూఁత ననుకరించుచో మన మచ్చెరువుపడి నిల్చి విని యానందింతుము. హాస్యకారుఁడు మనకుఁ గనఁబడకుండ మఱుఁగున నున్నచో మన మాకూఁత నేవిని యది నిజమైన కుక్కకూఁతయే యని యెంచి దానినిగూర్చి యిసుమంతయైన నాలోచింపక మనదారిని బోవుదుము. లలితకళలు మూలములు కాక యనుకరణము లనుటకిది ప్రబలమైన నిదర్శనముకదా !

3

కొందఱు విమర్శకులు లలితకళల ననుకరణకళలు అననుకరణకళలు అని రెండువిభాగములు కావించి సంగీత చిత్రలేఖనముల నందలి రెండవ విభాగమునకుఁ జేర్తురు. చిత్రకారుఁడు భౌతికరూపమును గాక యాధ్యాత్మికరూపమును మాత్రమే చిత్రించునని వారివాదము. సాధారణ మానవులు చర్మచక్షువులద్వారా వస్తువుల భౌతికరూపమును మాత్ర మారయఁజాలుదురు. లోకమున భిన్నవస్తువులు భిన్నరూపముల ధరించి యాకారసార్థక్యము కలిగి భాసిల్లుచున్నవి.

అందుచేతనే యల్పజ్ఞానము కలిగిన బాలురుసైతము దర్శన మాత్రముచే నిది యీవస్తువు, ఇది యీవస్తువు అని స్పష్టముగాఁ జెప్పఁజాలుచున్నారు. చిత్రకారులు చిత్రించు చిత్రములయందుఁగూడ నాకారసంబంధమైన వేఱుపాటు స్పష్టముగాగోచరించుచుండును. ఈవేఱు పాటే లేనిచోఁ జిత్రమునందుఁ జిత్రితమైనయాకృతి కుక్కదో నక్కదో, గాడిదదో గుఱ్ఱముదో, చెట్టుదో గుట్టదో మనము చెప్పఁజాలము. అందుచేఁ జిత్రకారుఁడు భౌతికరూపమును బూర్తిగా విసర్జించుచో నాతఁడు చేయుపని నేలవీడిన సామగును. కాని యొక్కవిషయము మాత్రము మనము చెప్పవచ్చును. ఒకేవస్తువును భిన్నవ్యక్తులు చూచునప్పుడు వారందఱు దానియాకృతి నొకేదృష్టితోఁ జూడరు. దృష్టవస్తువునందలి వివిధభాగములలోఁ గొందఱికిఁ గొన్ని యెక్కువ యాకర్షకములుగా నుండును. వారి నడిగినచో వారు తమ్మధికముగా నాకర్షించినభాగముల ముందుగాఁ బ్రశంసింతురు. అట్లే చిత్రకారులు వివిధవస్తువులఁ జిత్రించునప్పుడు తమ యభిరుచులనుబట్టియు, నావస్తువులను దర్శించునప్పుడు తమకుఁ గలిగిన యాకర్షణమునుబట్టియు వాని వివిధవిన్యాసములకు రూపొసంగుచుందురు. ఇట్టి స్వల్పభేదములున్నను జిత్రకారులు చిత్రించు రూపములలో భౌతికమైన సామ్యము గోచరించుచునేయుండును. సామాన్యమానవులకంటెఁ గళానిర్మాణప్రతిభ కలమేధావులు దృశ్యమాన వస్తువులందలి సౌందర్యము నెక్కువ నిశితముగాదర్శించి యనుభవించు శక్తి కలిగియుందురు.

ఆధ్యాత్మికరూప మనఁగా నాత్మసంబంధమైన రూపము. యోగీంద్రులకుఁదప్ప సామాన్యుల కీరూపమును దర్శింపఁగల శక్తియుండదు. వారు సర్వవస్తువులయందు బ్రహ్మపదార్థమునుదర్శించి "సర్వం ఖల్విదం బ్రహ్మ"యను సూక్తియందలి యాథార్థ్యము ననుభవింతురు. సామాన్యమానవు లిట్లొనర్చుట యసాధ్యము. తాత్త్వికముగాఁ జూచినచో సర్వవస్తువులును నాత్మాంశకములే. కావున వాని యాధ్యాత్మికరూపము

లన్నియు సమానములై యుండవలయును. అట్టియెడఁ జిత్రకారు లాధ్యాత్మికరూపములను మాత్రమే చిత్రించినచో నెందఱు చిత్రకారు లెన్ని చిత్రములఁ జిత్రించినను అవియన్నియు నేకాకృతులై యుండి పోవును. అనుభవమునుబట్టిచూడ నిది యన్యథా గోచరించుచుండుటచే నీవాదమును మనము విశ్వసించుట కవకాశము లేకపోవుచున్నది. చిత్రకారుఁ డాధ్యాత్మికరూపములనే చిత్రించు ననువాదము నకంగీకరించినను అది చిత్రకళ యనుకరణ మనుట కేవిధముగను బాధకము కాఁజాలదు. ఏలయన నప్పుడైన నాతఁడు తాను గుఱియం దుంచుకొనిన యాయాధ్యాత్మికరూపమునే యనుకరింపకతప్పదు.

ఇంక లలితకళలన్నిటిలో సంగీతమునమాత్ర మీయనుకరణాంశము మిక్కిలి తక్కువయైనట్లు గోచరించును. గాయకుఁడు వివిధస్వరముల సమ్మేళనముచే వివిధరాగములతోఁగూడిన ధ్వనుల నుత్పాదించుచుండును. ఈధ్వనులు సృష్టిలో మనకుఁ దఱచుగా వినఁబడునట్టివి కావు. మనము నిత్యము వినుచుండు ధ్వనులకంటె ఎంతో వైలక్షణ్యము వైశిష్ట్యము కల్గి శోభిల్లుచుండును. గాయకులు కోపభయహర్షశోకాది భావములలో నీభావముల నీరాగము లెక్కువగా సూచించు నని సంగీతశాస్త్రగ్రంథములనుండియో గురువులనుండియో తెలిసికొని యట్లాచరించుచుండవచ్చును. కాని సృష్టిలో నాభావములకు గుఱియైనవా రట్టి ధ్వనులఁ గలిగించుట మనకు గోచరింపదు. కోకిలాదిపక్షుల కూజితములు శ్రవణానందకరములుగానుండుమాట నిజమే. కాని గాయకులా కూఁతల నట్లే యనుకరింతు రని మనము చెప్పఁజాలము.

ఒకవిధముగాఁ జూచినచో సంగీతముకూడ ననుకరణమే యని చెప్పుటకించుక యవకాశము కలుగును. కుమారుఁడు మరణించినప్పు డొకతల్లి యాతని పూర్వగుణచర్యల నుగ్గడించుచు గొంతెత్తి యేడ్చుచున్న దనుకొనుఁడు. ఆయేడుపు వినునప్పుడు మనహృదయములు కరుణరసార్ద్రములై కలఁతనొందును. ఆమె యేడ్చుచు వెలువరించుధ్వనిలోఁ గరుణరసోత్పాదకమైనయొక గుణ ముండుట నిశ్చయము. ఆగు

ణమునే విశేషముగాఁ బెంపొందించి పరిణతమైన యొకరాగముగా నాలాపించి గాయకుఁడట్టిభావమును శ్రోతలకుఁ గలిగింప వచ్చును. అట్లే కోకిల కూజితమును యథాతథముగా ననుకరింపకపోయినను గాయకుఁ డదిపాడునప్పుడు శ్రవణగోచరమగు మాధుర్యగుణమును గాలోచితముగా ననుకరింపవచ్చును. సంగీతములోనుండు ననుకరణాంశ మేతన్మాత్రమే. అరిష్టోటలు సంగీతముకూడ ననుకరణ మని యభిప్రాయపడుట యీదృష్టితోడనే సంతోషవిషాదాదిభావములు కలిగినప్పుడు సృష్టిలో వ్యక్తము లగుచుండు ధ్వనులను సంగీత మనుకరించు నని యాతనిభావము. మొత్తముమీఁద నితర లలితకళలకన్న నీసంగీతమున ననుకరణము తక్కువయని చెప్పవలయును.

౪

లలితకళానిర్మాతలును దద్రామణీయకము ననుభవించు రసికులును బరస్పర సానుభూతి కలిగియుండవలయును. లేనిచో నాకళలు రెండుపక్షములవారికిని నిష్ప్రయోజనములుగనే పరిణమించును. కళాకారుఁడు నిర్మాణవిషయమునఁ దానెంత స్వతంత్రుఁడైనను దనకళ ననుభవించు ప్రజల యభిమానాభిరుచుల నించుక దృష్టియందిడుకొనవలయును. ఆతఁడట్లుకాక యతిస్వతంత్రుఁడై వర్తించుచోఁ 'కాలోహ్యయం నిరవధిః విపులాచ పృథ్వీ'యని సంతృప్తిపడియున్న నిబ్బందిలేదుకాని లేనిచోఁ దననాఁటి రసికుల కంతగా నానందము సంధింపలేఁడు. అట్లే రసికుఁడు కళల ననుభవించునపుడు తనభావములు, అభిరుచులు, అనురాగద్వేషములు విస్మరింపవలెను. ఒకనికి సంపెంగపూ వన్న నొడలుమంట. ఆవాసన కతఁడు ముక్కుమూసికొని దవ్వుగాఁ బోవును. అట్టివాఁడు సంపెంగపూవువర్ణనము చదువునప్పుడును, దానిచిత్రమును జూచునప్పుడును దనభావములు విస్మరించి యాకవి, చిత్రకారుఁడు సంపెంగపూవు రామణీయకాదుల నెంతగాన నుభవించి తనచే ననుభవింపఁజేసె ననునదియే పరికింపవలెను. అట్టిభావములేనిచో నాకావ్యమును జిత్రలేఖనమును నత్యంతరమణీయములయ్యు నాతని పాలి కసలు లేకుండనే పోవును.

అందుచేఁ గళారస పిపాసికహంకార పరిత్యాగ మొకయనివార్యధర్మము
గాఁ గానఁబడుచున్నది.

లలితకళలు నిర్మించునపుడు తన్నిర్మాత లావేశపూరితులై యుం
దురనియుఁ దదారాధకులు రసతన్మయులై వాని ననుభవించుచుందు
రనియు మనము వినుచుందుము. అది నిజమేకాని యాయావేశమును,
దన్మయత్వమును మేరమీఱి యతివేలములై యుండరాదు. తాను గళ
ననుభవించుచున్నానను జ్ఞానము తదారాధకుఁడును వహించియుండుట
యవసరము. కవి శుచియుఁ, గరుణామతియుఁ, బ్రశాంతుఁడునై యుండ
వలె నని లాక్షణికులు చెప్పువిషయ మొక్క కవియెడనేకాక యితర
కళాకారులయెడఁగూడఁ జెప్పఁదగినదే. ఆవేశ ముండవలెనుగాని కళా
కారుఁడు ప్రశాంతుఁడై యాయావేశము నెంత నిగ్రహించుకొన్న నంత
యుదాత్తమైన కళ నావిర్భవింపఁ జేయును. రసికులయెడ నీనిగ్రహము
మఱింత యవసరము. ఇదియు నొకవిధముగా నహంకారత్యాగమునకు
సంబంధించినదే. మహమ్మదీయులు తమ దండయాత్రల సందర్భమునఁ
గళాసర్వస్వము లని చెప్పఁదగిన దేవాలయాదులను, విగ్రహములను
జంకుగొంకులేక నాశనము చేసియుండుటకు మతాభిమానముతోపాటు
నిగ్రహములేని యిట్టి యావేశముకూడఁ గారణమే యని చెప్పనగును.
ప్రహ్లాదనాటకము ప్రదర్శింపఁబడు సమయమున హిరణ్యకశిపుఁడు
ప్రహ్లాదునిఁ బెట్టుపాట్లు చూచి సహజదయాశాలియైన యొకసామాజి
కుఁడు హఠాత్తుగా లేచి హిరణ్యకశిపునిపై బూతులవర్షము కురియిం
చుచు నంతవఱకును గరుణరసము ననుభవించుచున్న సోదరసామా
జికుల కించుక హాస్యరసాస్వాదముకూడఁ గలిగించి పరస్పరవిరుద్ధము
లైన యారసముల కేకత్ర పరిపోషణము సాధించెనఁట! అందుచే నత్యా
వేశ మొక్కొక్కప్పుడు రసానందానుభవమునకు మాఱు రసాభాసము
నకు దారిచూపును.

కళానిర్మాతలకు శాస్త్రజ్ఞానము, గురుశుశ్రూష మున్నగువాని
కంటె భగవత్ప్రసాదితమైన ప్రతిభాశక్తి నిండారియుండుట మిక్కిలి

ముఖ్యము. ఆశక్తియున్నచో శాస్త్రాభ్యాస గురుబోధాదులు దానికిఁ వన్నెచేకూర్చును. అదిలేనిచో మిగిలినవెంత యధికముగానున్నను బ్రయోజనముండదు. ప్రపంచమునఁ బలువురు పండితులయ్యుఁ గళాకారులు కాకపోవుట కిదియే హేతువు. ఈశక్తి శాస్త్రాధ్యయనముచేఁగాని, పరికరసంపాదనముచేఁగాని బహుళప్రయత్నముచేఁగాని సాధ్యమగునట్టిదికాదు. రంగులును కుంచెయు నున్నంతమాత్రమున నెల్లరును జిత్రకారులును, బదజాలమును ఛందోజ్ఞానమును సంపాదించినంతమాత్రమున నెల్లరును గవిసార్వభౌములును గాఁ గలిగినచోఁ బ్రపంచమున మనము లక్షలకొలఁది రవివర్మలను గోట్లకొలఁది కాళిదాసులను గాంచియుందుము. ప్రతిభావిశేషము శాస్త్రజ్ఞానాదిలోపమును మఱుగుపఱచును; శాస్త్రజ్ఞానము పుష్కలముగానున్నను బ్రతిభ లేనిచో నాలోప మనుక్షణమును గోచరించుచునే యుండును. కళాకారులు రసికులయాదరాభిరుచుల నరయవలెననుట నిజమేకాని యది వారిస్వాతంత్ర్యము నరికట్టరాదు. శాస్త్రములు ప్రతిభాసంపన్నులైనవారికి విధేయములై యుండవలెనేకాని వారిపై నధికారము నిర్వహింపరాదు. చిత్రకారుఁడు చిత్రమున నిట్టిచోట నిట్టిరంగే వాడవలయును, శిల్పివిగ్రహము చేతులింతకంటెఁ బొడువుగా నిర్మింపరాదు, కవి యిట్టివానినే నాయకునిఁజేసి యిట్టివర్ణనలకే కావ్యమునఁ దావు కల్పింపవలయును అని నియమములు నిర్ణయించుట నిర్నిరోధ నిరాఘాటముగా విహరించువారి ప్రతిభాశక్తికి సంకెళ్లువేయుటయే యగును. ప్రతిపదమున నిట్టి నియమములకు లోఁగియుండినచోఁ గళాకారుఁడు శాస్త్రము చేతికీలుబొమ్మయై జీవరహితమును వైవిధ్యహీనమునైన యల్పకళను మాత్రమే సృజింపఁజాలును. అట్టి కళ శాస్త్రకారులనే తృప్తిపఱచునుగాని రసికుల కానంద మీయఁజాలదు. ఆంధ్రవాఙ్మయమునఁ గొన్నిప్రబంధములకిట్టి గతియేపట్టినది. అవి నియమానుసరణమున నెంతశ్రద్ధవహించెనో రసానందజనకత్వమున నంతశక్తిహీనములగుట సంభవించెను. ఇట్టి నియ

మముల నెక్కువగావిధించుట కళాకారుల ప్రతిభ నరికట్టుటయే కాక దినదినప్రవర్ధమానము కావలసిన కళాగతిని నిరోధించుటకూడ నగు ననుటలో సందేహములేదు. అప్పుడు కళ నిశ్చలమై నూత్నరీతులకు, సంప్రదాయములకుఁ దావొసంగ లేకపోవుట సంభవించును.

లలితకళలన్నిటిలో బహిరంతరములు రెండింటికిని దగిన ప్రాధాన్యమునొసంగి రెండవదానియెడ నుపేక్షవహించుట సమగ్రఫలప్రాప్తి కంతరాయము కలిగించును. చిత్రలేఖనమున వర్ణాదులును, గవిత్వమున ఛందశ్శబ్దాదులును, శిల్పమున శిలామృదాదులును, నాట్యమున వేషాలంకారాదులును,సంగీతమున నాదమును బాహ్యము లైనవి. వీని సాయమునఁ బ్రకటింపఁబడు భావము లేక యర్థము కళలన్నింటికిని నాంతరస్వరూపము. క్షీణయుగమునందలి యాంధ్రకవులు శబ్దమున కధిక ప్రాధాన్యము నొసంగి భావమునెడ నౌదాసీన్యమువహించిరి. ఆధుని కులలోఁ గొందఱు భావమే ప్రధానమనుకొని శబ్దమునెడ నుపేక్ష వహించుచున్నారు. ఈయిరుతెఱఁగుల కవిత్వమును బఠితల కానందము కూర్పఁజాలకపోవుటలో నాశ్చర్యములేదు. ఇందుబహిరంతరములకు సామరస్యమును, సమప్రాధాన్యమును లేమియే యిందుకుఁ గారణము. రమణీయార్థప్రతిపాదకమైన శబ్దము కావ్యమని కొందఱు లాక్షణికులు నిర్వచించుట యీదృష్టితోడనే.ఇందర్థ మాంతరము. శబ్దము బాహ్యము. ఇట్లు బహిరంతరముల కుచితమైనకూడిక యుండవలెననుట కావ్యమునకువలెనే యితరకళలకుఁగూడ నప్రతిమానమైన రామణీయకమును జేకూర్చును.

ఔచిత్యపరిపోషణము కళాకారు లందఱు నవశ్యముగాఁ బాటింపవలసిన పరమధర్మము. ఔచిత్యలోపము రసాభాసమునకు మార్గము. ఔచిత్యము కావ్యచిత్రలేఖన నాట్యసంగీతములం దనేకవిధములుగా భాసిల్లుచుండును. పాత్రోచితములైన భాషాచేష్టలవర్ణనము కావ్యనాటకములకును, రసోచితమైన రాగకల్పనము సంగీతమునకును, సన్ని

వేశానుగుణమైన వాతావరణ నిరూపణము చిత్రలేఖమునకును నౌచిత్యపోషకములై యుండును. పుత్త్రిమరణాతురయై తల్లియేడ్చుసమయమున సంస్కృతసమాసభూయిష్ఠమును నలంకారపూరితమునైన రచన సాగించుటయు, రాజువచ్చినప్పుడు పరివారము కూర్చుండినట్లు చిత్రించుటయు, సూర్యోదయకాలమునఁ బద్మములు ముకుళితములై యున్నట్లు చూపుటయుఁ, గరుణరసమునకో భక్తిభావమునకో భూపాలరాగము నాలపించుటయు ననౌచిత్యమున కాకరములై రసభంగము కలిగించును. ఇట్టి యనౌచిత్యమును బరిహరించుటకై కళాకారుఁడు సర్వవిధముల యత్నింపవలయును. అనౌచిత్య మున్న రసభంగమునకు వేఱు కారణము వెదక నవసరములేదు.

౫

లలిత కళలింద్రియములద్వారా మానసముల రంజింపఁజేసి యానందము నొసంగును. కన్నులు లేనివాఁడు శిల్పచిత్రలేఖనముల సౌందర్యమును, వీనులులేనివాఁడు సంగీతరసమును ననుభవింపఁజాలకుండుటయే దీనికిఁ దార్కాణము. ఇట్లు లలితకళానందమును జూఱ యొసంగు సాధనములఁ బురస్కరించుకొని యాకళలను మూఁడురకములుగా విభజింపనగును. శిల్పచిత్రలేఖనము లొక్క నేత్రేంద్రియమును, సంగీత మొక్క శ్రోత్రేంద్రియమును మాత్రము తనుపఁజాలును. ఇందు మొదటి వానిని దృశ్యకళ లనియు రెండవదానిని శ్రవ్యకళ యనియుఁ జెప్పనగును. కావ్యమునుగూడ శ్రవ్యకళగానే పేర్కొనవచ్చును. కాని వ్రాయఁ బడినప్పుడును ముద్రితములైనప్పుడును గావ్యములను నేత్రముల ద్వారా గ్రహించి తజ్జన్యమైన యానందము ననుభవింపవచ్చును. అందుచే దీని నుభయకళ యనిచెప్పుట యుచితము. ఉభయేంద్రియ తర్పణశక్తి కావ్యమునందుఁ గంటెను నాట్యమునం దధికముగాఁ గలదు. అందుచే నుభయకళలకు నాట్యమును సమగ్రమైన నిదర్శనముగాఁ జెప్పవచ్చును.

దృశ్యకళలు దర్శనశక్తిగల యెల్లవారి నానందింపఁ జేయును. వారికా కళయందుఁగాని దానికి సంబంధించిన శాస్త్రము నందుఁగాని

పరిచయములేకున్నను ఇబ్బందిలేదు. కావ్యము శ్రవణమాత్రముచేఁ గూడ నించుక యానందమొసంగుమాట సత్యమేకాని యందలి రసమును బూర్తిగా గ్రహించుటకుఁ బఠిత లేక శ్రోత సంస్కారముకలిగి యుండవలెను. ఈసంస్కారముయొక్క పరిమాణమునుబట్టి కావ్యజనితానందముకూడ న్యూనాధిక్యముల నొందుచుండును. సంగీతము కేవల స్వరమయము సాహిత్యసమేతము నని రెండు తెఱఁగులు. ఇందు స్వరమయమైనది వీను లున్నవారి నెల్ల రంజింపఁజేయును. వారు పండితులు కానక్కఱలేదు. జ్ఞానవంతులైన మానవులనేకాక పశుపక్ష్యాదులనుగూడ నది యాకర్షింప శక్తిగల్గియుండును. దీనిని గూర్చియే 'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః' అని లోకమునఁ జెప్పఁబడుచున్నది. సాహిత్యసమేతమైనది పామరులకంటెను బండితులకధికతరమైన యానంద మొసంగును. త్యాగరాజాది కృతులు విను నప్పుడు కలుగు నానందములో గానకావ్యజనితానందములు రెండును నిమిడియుండును. ఆకృతులును దత్సదృశములు నందుచేతనే గేయకావ్యములని ప్రశస్తి నందుచున్నవి.

దృశ్యకళలకును శ్రవ్యకళలకును నొకభేదము కలదు. దృశ్యకళలయొక్క సమగ్రస్వరూపమును మన మొకేసారి చూచి యానందింపవచ్చును. శిల్పచిత్రలేఖనములఁ గాంచినప్పుడు పరిశీలనము ముగిసినంతనే యానంద మనుభూతమగును. కావ్యాదులను (శ్రవ్యకళలను) వినునప్పుడే క్షణమున కాక్షణమే కొంతయానందము గలిగినను సమగ్రానందానుభవమునకుఁ గొంతకాలము పట్టును. ఈభేదమును బురస్కరించుకొని కొందఱు వీనిని సమయావచ్ఛేదకములు, స్థలావచ్ఛేదకములు నని విభజించిరి. ఉభయకళయైన నాట్యము లక్షణద్వయోపేతమైనను, ఈదృష్టితోఁజూచిన సమయావచ్ఛేదక కళయనియే చెప్పఁదగియున్నది.

౬

లలితకళ లింద్రియముల ద్వారా మానవ మానసముల కానందము చేకూర్చి తమ్ము నుపాసించువారికిఁ గించిత్కాలమైన బ్రహ్మానంద

ముయొక్క పరమార్థము నెఱింగించు ననువిషయము గ్రహించి బుద్ధిమంతులు తాత్కాలికమైన యాకళానందమునుండి శాశ్వతమైన బ్రహ్మానందమునకు దారిచూపు ప్రయత్నము లాచరింపవలయును. అట్లుచేసిననాఁడే వారికళోపాసన సాఫల్యమునందినదని చెప్పవచ్చును. లేనిచోఁ గళోపాసనాసమయమున నానందలోకమున విహరించి యది ముగిసినంతనే వారు మరల సుఖదుఃఖరాగద్వేషాది ద్వంద్వములతోఁగూడిన దృశ్యమానలోకమున కరుదేరవలసివచ్చును. యోగీశ్వరులకును గళోపాసకులకును నదియే భేదము. వారు నిరంతరముగా బ్రహ్మానందసాగరమున నోలలాడుచుండ వీరెడనెడ దానిని జవిచూచి మరల విస్మృతిఁ బొరయుచుందురు.

చిత్రలేఖనము చక్షురింద్రియముద్వారా మానసమున కానందముచేకూర్చును. కన్నులు భావగంభీరమైన సుందరచిత్రమును జూచినంతనే యావర్జితములై మానసమును బహిర్లోక విస్మారకమైన యానందరసమున నోలలార్చును. చిత్రలేఖనమున మనము చిత్రితవస్తువుయొక్క సంపూర్ణాకారమును గాక యందలి యేకదేశమును మాత్రమే దర్శింపఁజాలుదుము. అదియునుగాక చిత్రకారుఁడు దృశ్యమును బాగుగాఁబరిశీలించి తనమానసమునకు మెచ్చుగొల్పిన యొకానొకసమయమునందలి దానివిశ్వాసమును జిత్రమున రూపొందించును. ఆక్షణము గడచిపోయినచో నాదృశ్యముయొక్క స్థితియందుఁ గొంతమార్పు సంఘటిల్లును. ఈమార్పును గూడ సూచింపఁ దలఁచినచోఁ జిత్రకారుఁడు మఱియొక చిత్రమును రచింపవలసినదే. ఇట్లే వస్తువుల దశలను క్షణచాంచల్యమానము లగుచుండును. గావునఁ జిత్రకారుఁడా దశలనన్నింటిని దనచిత్రమునఁ జూపఁజాలఁడు. ఆతనిచిత్రము వస్తువుయొక్క యేకైకదశావిన్యాసమును మనకుఁ బ్రదర్శింపఁజాలునంతే.

శిల్పము కూడఁ గొంచెమించుమించుగాఁ జిత్రలేఖనము వంటిదే. ఇదియుఁ జక్షురింద్రియముద్వారా మానసమును దివియునట్టిదే. ఇందును వస్తువుయొక్క కించిత్కాలస్థేయమైన యేకైకవిన్యాసమే ప్రదర్శింపఁబడును. కాని శిల్పియందు వస్తువును సంపూర్ణాకృతిగాఁ బ్రద

ర్శింపఁజాలును. శిల్పి చెక్కిన సమగ్రవిగ్రహములందు మనము ముందు వెనుకలను పార్శ్వములనుగూడ దర్శింపఁ జాలుదుము. అదియును గాక చిత్రలేఖనమువలెఁగాక యిది త్వగింద్రియమునకుఁగూడ గోచరించుట కవకాశము కలదు. చిత్రలేఖనమును మనము స్పృశించి చూచినచో నందలి విశేష మేమియును గ్రహింపఁ జాలము. శిల్పమున నట్లుగాక స్పర్శచే నందలి నిమ్నోన్నతభాగముల గుర్తించి పరిశీలింపగలము. అందునఁ జిత్రలేఖనమును దదాలంబన మైన పటపత్త్రాదికమును నిర్విశేషమే. శిల్పము నైనచో నాతఁడు చేతితోఁ దడవి చూచి స్పర్శప్రభావముచే దాని రామణీయకము నంతను గాకపోయినను గొంచెమైన గ్రహించి యానందించుట కవకాశమున్నది. ఈవిషయమున శిల్పము చిత్రలేఖనముకంటెఁ గొంచెమాధిక్యనమేతమని చెప్పవచ్చును. ఇట్లే శిల్పమునలేని విశేషమొక్కటి చిత్రలేఖనమునఁ గానన గును. చిత్రకారునివలె శిల్పి సూర్యోదయము, సూర్యాస్తమయము మున్నగు ప్రకృతి రామణీయకముతోఁగూడిన దృశ్యములను జక్కఁగాఁ బ్రదర్శింపఁజాలఁడు.

సంగీతము శ్రవణేంద్రియము ద్వారా మానసమున కానందము నుత్పాదించును. వివిధస్వరముల విన్యాసముచేఁగలుగు నొకానొక యనిర్వచనీయమైన సామరస్యముచే నిది వినువారి డెందముల నాకర్షించి వారి కందేకాగ్రత కలిగించును. ఇది భావాశ్రయముకాని రసాశ్రయముకాని కాదు. ఒక విధముగాఁ జూచినచో దీనిని దాళుల యాశ్రయమైన నృత్తమువంటిదని చెప్పవచ్చును. అయ్యునిది చిత్తాకర్షకత్వమున నితరకళలకుఁ దీసిపోదు. పంచేంద్రియములలో నితరములైనవానికన్న శ్రవణేంద్రియమున కెక్కువ ప్రభావమున్నట్లు గోచరించును. రంజకమైన రాగాలాపము నాలించినంతనే యది విషయాంతరలగ్నమై యున్నదానినైన మనమును బలవంతముగా నాకర్షించి తదేక పరాయణము కావించును. పాశ్చాత్యులు లలితకళ లన్నిటికిని సామానప్రాధాన్యమునే యొసంగుదురు. భారతీయులట్లుగాక చిత్రలేఖన శిల్పములకంటె సంగీతమునకును, సంగీతముకంటె నాట్యకవిత్వ

ములకును నధికమైన ప్రాధాన్య మొసంగుచుందురు. దీనిని శ్రీవణేం ద్రియసమ్మోదము ద్వారా మానసమునకుఁ గలుగు నానందమున వారికిఁగల యభిమానమే కారణమై యుండవచ్చును.

నృత్యము భావాశ్రయమైనది. ఇది పదార్థాభినయాత్మకమైన మార్గమని ప్రసిద్ధినందియున్నది. జనులు సాధారణముగా నృత్యనాట్యము లందలి భేదము గుర్తింపక రెంటిని సమానార్థకములుగా వాడుచుందురు. కాని దశరూపకకారుఁడు "అన్యద్భావాశ్రయం నృత్యమ్మని యు" ధనికుఁడు "రసాశ్రయా న్నాట్యాద్భావాశ్రయం నృత్యమన్యదేవ" యనియు నా రెంటికిని భేదము నిరూపించియున్నారు. రసాశ్రయమైన నాట్యమున వాక్యార్థాభినయము గోచరించును. నృత్యమున నాంగికాభినయము ప్రాధాన్యము వహింప నాట్యము సాత్త్వికాభినయ బాహుళ్యమై యొప్పారుచుండును. "అత్రనృత్యేదర్శనీయ మేవ సర్వం భవతి. నతుశ్రవణీయం. "నృత్యేకావ్య సంబంధాభావాదిత్యర్థః" అని దశరూపకవ్యాఖ్యలలో నొకటగు ప్రభలో వివరింపఁబడియున్నది. దీనినిబట్టి నృత్యముకూడ నృత్తమువలెనే శ్రవణేంద్రియమున కంటెఁ జక్షురింద్రియమునకే యెక్కువ ప్రీతికలిగించునని తెలియుచున్నది. నృత్తనృత్యములకు గాత్రవిక్షేపసామ్య మున్నప్పటికిని నృత్తమునలేని యనుకరణము నృత్యమున నుండుటచే నిది సర్వవిధముల దానికంటె నతిశయవంతమగుచున్నది. నృత్యమాంగికాభినయ బాహుళమగుటచేఁ జిత్రలేఖన శిల్పములవలెనే చక్షురింద్రియమునకుఁ బ్రీతి సంధించును. కాని యవి వస్తువుయొక్క యేకక్షణవ్యక్తమగు స్థిరవిన్యాసమునే సూచింపఁగల్గియుండ నృత్యము క్షణక్షణ పరివర్తమాన దశావిపర్యయమును గూడ సూచింపఁ జాలియుండును. ఇదియే శిల్పచిత్రలేఖనముల కంటె నృత్యమునఁ గల గుణాధిక్యము.

కావ్యము రసాశ్రయమైనది. ఇది శ్రవణేంద్రియమున కపారప్రీతి కలిగించి మనస్సు నధికముగా నాకర్షించును. ఇతర లలితకళలం దెచ్చట

నులేని వాక్సాహాయ్యము దీనికిఁ గలదు. ఈ సాహాయ్యముచేఁ గవి దృశ్యములను సమగ్రముగా వర్ణించి వానిని బఠితల మనఃఫలకముల సాక్షాత్కరింపఁజేయును. ఈ విధముగా నిందు సంగీతచిత్రలేఖనముల గుణములు రెండును మిశ్రితములై మానసమున కమేయానందము కలిగించును. కవివాక్కుల సాయమున బమ్మెర పోతనవలె దివ్యసంగీతమును వినిపింపఁగలఁడు. తిక్కనామాత్యునివలె క్షణక్షణము మార్పు చెందుచుండు దృశ్యముల దశావిన్యాసములను జక్కఁగాఁ జిత్రింపఁగలఁడు. వాక్ప్రభావ మింతింతని చెప్పనలవికాదు. ఈ వాక్కే లలితకళలలోఁ గావ్యమున కగ్రస్థాన మొసంగుచున్నది.

నాటకముకూడఁ గావ్యభేదమే. కాని యిది దృశ్యకావ్యము. శ్రవ్యకావ్యములలో శ్రవణేంద్రియమునకు ప్రీతి సంధించుశక్తియే హెచ్చు. దృశ్యకావ్యమగు నాటకము చక్షుఃశ్రవణేంద్రియములు రెండింటికిని సంపూర్ణమైన యానందము చేకూర్చును. ఇందు లలితకళలైదును మూర్తీభవించి యుండును. శ్రవ్యకావ్యములలో మనోనయనమాత్రగోచరములగు దృశ్యములు దృశ్యకావ్యములందుఁ జర్మచక్షువులకుఁ గూడ గోచరించి యింతింతయనరాని సంతోషము సంతరించును. అందుచేతనే లలితకళలలో గావ్యమునకువలెఁ గావ్యభేదములలో నాటకమున కగ్రతాంబూలము లభించుచున్నది.

---

# పురాణయుగములో ఆంధ్ర దేశము

కుందూరి ఈశ్వరదత్తు

[ అఖిలభారత రేడియో విజయవాడ కేంద్రమునుండి 11—7—52 తేదీని చేసిన ప్రసంగము. ]

## పురాణములు వాని విశిష్టత.

సర్వసాధారణముగా పురాణము లనఁగా వెంటనే రామాయణ, భారత, భాగవత గ్రంథములు మనకు స్ఫురణకు వచ్చును. పురాణములు పదునెనిమిది. అందు భాగవతమొకటి. మిగిలిన పదునేడు, బ్రహ్మ, పద్మ విష్ణు, శివ, నారద, మార్కండేయ, ఆగ్నేయ, భవిష్య, బ్రహ్మవైవర్త, లింగ, వరాహ, స్కాంద, వామన, కూర్మ, మత్స్య, గారుడ, బ్రహ్మాండ మనునవి. రామాయణ భారతములు సహితము పురాణములలోనికే గణనకు వచ్చును. నన్నయభట్టు రాజరాజు కొల్వుకూటమును వర్ణించుచు, దానిలో భారతరామాయణాద్యనేక పురాణప్రవీణులు పరివేష్టించి యున్నట్లు వ్రాసియున్నాఁడు. పురాణ శబ్దమున కర్థము పూర్వవృత్తము. పురాతనాఖ్యానము ప్రతిపాదించునదియే పురాణము. పురాణములలోఁ జెప్పఁబడిన ముఖ్యవిషయములైదు. వీనినే పంచలక్షణము లందురు. అవి యేవనఁగా సృష్టి, ప్రతిసృష్టి, మునుల దేవతల వంశక్రమము, మన్వంతరములు, చంద్రసూర్య వంశరాజన్యుల చరిత్రములు. అన్ని పురాణములలో నీనైదు విషయము లుండవచ్చును, లేకపోవచ్చును. ప్రాచీన భారతదేశచరిత్రకుపయుక్తములుగా నున్న విషయము లెన్నో యీ పురాణములందుఁ గలవు. వానిలో ముఖ్యముగా భూగోళవిన్యాసమునుగూర్చి ప్రశంసయొకటి. నేఁడు భూమండలమునంతయు, ఆసియా, ఐరోపా, అమెరికా, ఆస్ట్రేలియా యని వేర్వేఱు ఖండములుగా విభజించినట్లే, మన ప్రాచీనులు సహితము భూభాగము నేడు ద్వీపములుగను, నేడు సముద్రములుగను విభజించిరి.

'సప్తద్వీపావసుమతీ' యని మార్కండేయము.
'సప్తద్వీపవతీమహీ' యని బ్రహ్మాండము.

సప్తద్వీపములు - జంబూద్వీపము

సప్తద్వీపము లేవియనఁగా, జంబు, ప్లక్ష, కుశ, క్రౌంచ, శాక, శాల్మలి, పుష్కరములు. పురాణములలో వర్ణింపఁబడినప్రకారము జంబూద్వీపమే యీ యేడు ద్వీపములకు నడుమనున్నది. ఈ జంబూద్వీపమే, యిప్పటి ఆసియా (Asia) ఖండమునకును, దానికి తూర్పు దక్షిణములోఁ గల ద్వీపములకును సరివచ్చును. ఈ జంబూద్వీపములోని మొదటి పదము, నేఁటి జమ్ము- కాశ్మీరము (Jammu and Kashmier) అను రాష్ట్రములో జమ్ము విభాగములో శేషించియున్నది.

భరతవర్షము

జంబూద్వీపము మరల తొమ్మిది వర్షములుగ విభజింపఁబడినది. ఈ జంబూద్వీపములో నేడు కులపర్వతములు గలవు. అవి హిమవంతము, హేమకూటము, నిషధము, మేరువు, నీలగిరి, శ్వేతాచలము, శృంగవంతము ననునవి. ఈ కులపర్వతము నంటుకొని యేడు వర్షములు గలవు. అవి ఇలావృత, భద్రాశ్వ, కేతుమాల, హరి, కింపురుష, రమ్యక, హిరణ్మయ, కురు, భరతవర్షములు. వాయుపురాణములో,

నవవర్షం ప్రవక్ష్యామి జంబూద్వీపం యథాతథా
ఉత్తరం యస్సముద్రస్య హిమవద్దక్షిణం చయత్ ।
వర్షం తద్భారతం నామ యత్రేమాం భారతప్రజాః
పూర్వేకిరాతా హ్యస్యాంతే పశ్చిమే యవనాః స్మృతాః ।
బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా మధ్యే శూద్రాశ్చ భాగశః
యదిదం భారతం వర్షం యస్మిన్ స్వాయంభువాదయః॥

హిమవన్నగమునకు దక్షిణమునను, సముద్రమున కుత్తరమునను భరతవర్షముగలదనియు, ఈ భరతవర్షమునకు తూర్పున కిరాతులు పశ్చిమమున యవనులు, మధ్యమమున బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య శూద్రులు గలరనియు వ్రాయఁబడినది. ఈ భారతవర్షాంతరభాగమే

నేఁటి భరతఖండము. హిందూదేశము, భరతఖండము, అని (India i.e. Bharat) మన రాజ్యాంగశాసనమునందుఁ గలదు. భరతఖండమునకీ పేరు ఏల గల్గెనో పురాణములందుఁ దెలుపఁబడినది. స్వాయంభువ మనువు తనయుఁడైన ప్రియవ్రతునకు తొమ్మండుగురు పుత్త్రులు. వారిలో అగ్నీధ్రుఁడను పుత్త్రుని జంబూద్వీపపాలకునిగా నియమించెను. ఈ అగ్నీధ్రునికిఁ దొమ్మండుగురు పుత్త్రులు. వారిలో ఋషభుఁడను వానిని హిమవంతమునకు దక్షిణఖండమున కధిపతినిగాఁ జేసెను. ఋషభునకు భరతుఁడను కుమారుఁడు గలఁడు. ఋషభునితర్వాత భరతుఁడీ భూమండలమును బాలించెను. కావున నీ ఖండమునకు భరత ఖండమని పేరు వచ్చెను.

## భరతఖండము - ఆంధ్రదేశము

భరతవర్షము మన పురాణములోఁ దొమ్మిది విభాగములుగఁ జేయఁబడినది. వాని నామములు, ఇంద్ర, కేతుమంత, తామ్రవర్ణ, గభస్తిమంత, నాగ, సౌమ్య, గాంధర్వ, వారుణ, కుమారికా ద్వీపములు. నాఁటి కుమారికా ద్వీపమే, నేఁటి హిందూదేశముతో సరిపోవును. ఈ కుమారీద్వీప మేడు విషయములుగ విభజింపఁబడినది. అవి, మధ్య, ఉదీచ్య, ప్రాచ్య, దక్షిణాపథ, అపరాంత, వింధ్య, హిమాలయప్రదేశములు. ఇందలి దక్షిణాపథమే నేటి డక్కన్ పీఠభూమి. ఈ దక్షిణాపథ దేశములలో, పాండ్య, కేరళ, చోళ, కుల్య, మహారాష్ట్ర, మహిష, కళింగ, విదర్భ, కుండల, ఆంధ్ర దేశములు తెలుపఁబడినవి. మార్కండేయపురాణాదులలో ఆంధ్ర దేశము దక్షిణాపథ దేశములలోఁ జెప్పఁబడినది. కాని నాఁటి దేశముల యెల్లలు పురాణములలో వివరింపఁబడ లేదు. స్థలనిర్దేశము ననుసరించి, ఆంధ్రదేశము కళింగ దేశమునకు దక్షిణముగను, ద్రావిడదేశమున కుత్తరముగను, కర్ణాటకమహారాష్ట్ర దేశములకు పశ్చిమమున నున్నట్లు మాత్రము చెప్పవచ్చును. ఈస్థల నిర్దేశము సంస్కృతకావ్యయుగమునందును, తర్వాత శిలాశాసనములందును స్పష్టము చేయఁబడినది.

## రామాయణ- భారతములు—ఆంధ్రదేశము.

నేటికిని మనము సంకల్పములో 'జంబూద్వీపే, భరతఖండే, దండకారణ్యే, కృష్ణాగోదావరీ మధ్యదేశే' అని చెప్పుకొందుము. నేటి ఆంధ్రదేశము సగముభాగము దండకారణ్యములోను, సగము భాగము కిష్కింధారాజ్యములో నిమిడియుండెను. వింధ్యపర్వతమునకు దక్షిణముననను, కృష్ణాస్రవంతి కుత్తరముననను మలయ మహేంద్రపర్వతములకు మధ్యమమున, దండకారణ్య ముండెను. దానిలోఁ దూర్పు భాగము జనస్థానము. కృష్ణకు దక్షిణమున కిష్కింధారాజ్య ముండెను. రామాయణకాలమున రావణుని సోదరుఁడగు ఖరుఁడు ఈ జనస్థానమున కధిపతి. ఈ జనస్థానమందే పంచవటి కలదు. శ్రీరామభద్రుఁడు సీతాసౌమిత్రి సమేతుఁడై, ఈ పంచవటియందే కొంతకాలము కాపుర ముండెను. ఇచ్చటనే సీతాపహరణము జరిగినది. ఈ పంచవటి ఆంధ్రదేశములోని తూర్పుగోదావరీ మండలములో భద్రాచలక్షేత్రమున కుత్తరముగా నిరువదిరెండు మైళ్ళదూరమున నున్నది. శ్రీమద్రామాయణము, కిష్కింధాకాండములో హనుమదాదులను సీతను వెదకుటకై దక్షిణదిక్కునకుఁ బోయి, దండకారణ్యమున కరిగి, యచట గిరివన దుర్గముల, గోదావరీతీరముల, సండ్రపుండ్రకేరళ కురుదేశములఁ బరికించి రండని యాజ్ఞాపించినట్లు గలదు. కాని క్రీ. శ. పూర్వమూఁడవ శతాబ్దమున వాల్మీకిరామాయణము రచింపఁబడెననియు, దానిలో దాక్షిణాత్యములైన ఆంధ్ర, చోళ, పాండ్యాదిదేశముల ప్రశంస ప్రక్షిప్తమనియు, నాఁటి కా పేరఁ బ్రజలుగాని,రాజ్యములుగాని యుండ లేదనియుఁ గొందఱు చరిత్రకారులు వ్రాయుచున్నారు.

మహాభారతములో సభాపర్వమునందలి సభాక్రియాపర్వణాధ్యాయమునందును, సహదేవుని దక్షిణ దిగ్విజయ యాత్రాసందర్భముననను, నిమంత్రితరాజానుగమనములోను, భీష్మపర్వములో భారతీయనద్యాదికథనములోను ఆంధ్రదేశప్రశంస యున్నది. ధర్మజుని కొల్వుకూటమును బరివేష్టించియుండిన నృపాలురలో ఆంధ్రభూమీశుఁడు కలఁడు. ఈతని పేరు తెలియదు. తిక్కన సోమయాజియు,

ఆంధ్రీకృతభారతములో ఆంధ్రదేశమును మూలమున కనుగుణముగా, దాక్షిణాత్యజనపదములలో నొకటిగా వ్రాసెను. భీష్మపర్వములోని ఆంధ్రజనపదము కృష్ణాగోదావరీ మధ్య దేశమని

ఆంధ్రకాః కృష్ణాగోదావర్యోర్మధ్యే విద్యమానదేశః॥

అని వ్యాఖ్యానమున గలదు. కురుపాండవ సంగ్రామములో దాక్షిణాత్యజనపదములైన, ఆంధ్ర, కేరళ, కొంకణ, కర్ణాట, కోసల, కాళింగ, కుంతల, విదర్భములు కౌరవపక్షమునఁ జేరెను. పాండ్యచోళ జనపదములు మాత్రము పాండవపక్షమునఁ గలిసెను కర్ణునికిఁ బ్రాపై పుళింద, కొంకణ, బాహ్లీక, ఆంధ్రసైన్యములు పోరినట్లును, పాండీఁడైన మలయధ్వజుఁడీ సైన్యములతోఁ బోరాడి నిహతుఁడైనట్లును కర్ణపర్వమునందుఁ గలదు.

## ఆంధ్రదేశము - తెలుఁగుదేశము.

మనభాష తెలుఁగుభాషయనియు, మనము తెలుఁగు వారమనియు మనదేశమునకు తెలుఁగుదేశమనియు పేర్లుగలవుగదా. పురాణములలో నత్యంత ప్రాచీనమైనవానిలో మార్కండేయ పురాణ మొకటి ఇది క్రీ. శ. నాల్గు, ఆఱవ శతాబ్దముల మధ్యమున రచింపఁబడెనని పురాణము లన్నింటిని గూలంకషముగా బరిశోధించిన, హైందవ ఆంగ్ల పరిశోధకుల యభిప్రాయములు. ఈపురాణములను బరిష్కరించి, ప్రచురించిన పర్గిటార్ దొరగారు (Par giter) తత్పురాణములో కూర్మ సంస్థాపన వర్ణనమునందలి కూర్మదక్షిణకుక్షి యందలి దేశవిభాగములో గల క్రిందిశ్లోకమునుగూర్చి, యిట్లు వ్రాసియున్నారు.

తిలింగో కుంజరదరీ కచ్ఛవాసాశ్చ యే జనాః।
తామ్రపర్ణీ తథాకుక్షి రితికూర్మస్య దక్షిణః॥

పైశ్లోకములోని తిలంగులనువారు నేఁటి తెలుఁగువారనియు వారు నివసించు దేశమే తెలుఁగు దేశమనియు, దీని ప్రసక్తిననుసరించి, ప్రాచీనాంధ్ర జనపదమునకు సరివచ్చుననియు వ్రాసియున్నారు. మనము తిలింగులమనియు, కావుననే మన భాషకు తిలింగ భాషయనియు, దేశమునకు తిలంగ దేశమనియు మొదటపేర్లుగల్గి, తర్వాత

తిలంగపదమె, తెలుఁగుగా మాఱెననియుఁ జెప్పవచ్చును. ఈమార్కండేయ పురాణములోఁ దక్క ఈపద మీరూపమున నేపురాణములలో నెక్కడనులేదు. కాని యొక విచిత్రమేమనఁగా, క్రీ. శ. 1876 సం॥ లో తెలుఁగులిపిలో ముద్రింపఁబడిన సంస్కృత మార్కండేయ పురాణములో, ఈశ్లోకములోని తిలింగపదము త్రిలింగపదముగాఁ బరిష్కర్తలు దిద్దినారు. మార్కండేయ పురాణములోని యీతిలింగపదము ఆంధ్రభాషాచరిత్రకారులకేమి, ఆంధ్రచరిత్రపరిశోధకులకేమి యత్యంత ప్రాధాన్యమైన విషయము. మారన ఆంధ్రీకృత మార్కండేయ పురాణములో కూర్మసంస్థాపన వర్ణనము ను సంక్షిప్తముగా నొసర్చి మూలములోని వేశ్వేఁజు జనపదవాసుల సర్ణింపలేదు. ఈవిషయ మిదివఱకు అంధ్రసాహిత్య పరిష్పత్రిక 28 వ సంపుటము 4 వ సంచికలో సవిమర్శముగాఁ జర్చించి యున్నాను.

## సాంక్ద బ్రహ్మాండ పురాణములు.

## త్రిలింగ దేశము.

మనభాష ఆంధ్రభాష, తెలుఁగుభాష, మనదేశము ఆంధ్రదేశము, తెలుఁగుదేశమని యెట్లు వ్యవహరింపఁబడుచున్నదో, అట్లైనన భాష త్రిలింగభాష మనదేశము త్రిలింగదేశమనియు వ్యవహరింపఁబడుచున్నది. కానినేఁడు త్రిలింగపదమునకు బహుళ వ్యాప్తిలేదు. త్రిలింగ దేశవిభాగము స్కాంద బ్రహ్మాండ పురాణములందు మాత్రముగలదు. స్కాందపురాణములో త్రైలింగులనువారు వింధ్యదక్షిణ వాసులలో నొకరుగఁ జేర్కొనఁబడిరి. ఆంధ్రదేశము శ్రీశైలము, భీమేశ్వరము, కాళేశ్వరములను మూఁడు శివక్షేత్రములమధ్య గత దేశమని వ్రాయఁబడినది. శ్రీశైలము కర్నూలుమండలములోని సుప్రసిద్ధమైన శివక్షేత్రము. భీమేశ్వరము తూర్పుగోదావరీ మండలములోని దక్షారామమను మఱియొక శివక్షేత్రము. కాళేశ్వరము నైజాము రాష్ట్రములోని నెలగందలమండలమునఁ గల మంథని (మంథెన) యను గ్రామసమీపమునఁగల వేఱొక శివక్షేత్రము.

బ్రహ్మాండ పురాణముననుసరించి 'ఆంధ్రవిష్ణు'వనువాఁడు శ్రీశైలము, భీమేశ్వరము, కాళేశ్వరము, మహేంద్ర పర్వతమును గూడఁగలి యునట్లుగాఁ బ్రాకారములు నిర్మించి, యామూఁటిని ద్వారములుగాఁ జేసెననియు, నీద్వారములయం దీశ్వరుఁడు శూలపాణియై ప్రమథగణములచేఁ గొలువఁబడుచు లింగరూపములను దాల్చి యుండెననియు, ఆంధ్రవిష్ణువు సురల సాహాయ్యమునొంది దానవాగ్రేసరుఁడగు శంభునితోఁ బదుమూఁడు యుగములు యుద్ధముచేసి వానిని హతుని గావించి, గోదావరీ తటమునందలి ఋష్యాశ్రమములలో వానినివాసము నాక్రమించుకొనెననియు నప్పటినుండియు, నీదేశము త్రిలింగదేశమని పేరఁబరగుచున్నదనియు, దెలియుచున్నది. ఈత్రిలింగపదము, తిలింగ పదమున కన్న ప్రాచీనమైనదని చెప్పరాదు. స్కాంద బ్రహ్మాండ పురాణములలో లెక్కలేనన్ని సంహితలు, ఖండములు, మాహాత్మ్యములు, ఎవరికి దోచినవివారు, ఎప్పటికప్పుడు చేర్చుచుండిరి.

వీనిలోని విషయములు పెక్కుభాగములుఆధునికములు. ఈత్రిలింగపదము ఆంధ్రదేశములో కాకతీయులకాలమున శైవమతము విజృంభించినసమయమున, నుత్పత్తి నొందియుండును. పదుమూఁడవ పదునాల్గవ శతాబ్దములనాఁటి ఆంధ్రదేశపు శాసనములలోత్రిలింగపదములు బహుళముగాఁ బ్రయోగింపఁబడెను. ఆనాఁటి సంస్కృత కావ్యములందు త్రిలింగపదముగా కవులు ప్రయోగించిరి. కాకతీయ ప్రభువులు త్రిలింగపరమేశ్వరులని వర్ణింపఁబడిరి. ఈత్రిలింగదేశప్రసక్తి కాకతీయ రాజ్యకాలమునఁ బ్రభవించి, రెడ్లరాజ్యకాలమున సారస్వతములోను, శాసనములలోను బహుళవ్యాప్తిని గావించెనని ఘంటాపథముగఁ జెప్పవచ్చును. తెలుఁగు పదమువేఱు, త్రిలింగ పదమువేఱు. త్రిలింగపద తద్భవము తెలుఁగుకాదు. ఆకాలమునాఁటి పండితులెవరో త్రిలింగసంబంధమైన శ్లోకమును బ్రహ్మాండ, స్కాందపురాణములలో పదునాల్గవ శతాబ్దముననో తరువాతనో చేర్చియుందురు. పాశ్చాత్యచరిత్రకారులలో కొందఱు ఈరెండుపురాణములలోని విషయము లర్వాచీనములనియు, ననేక విషయములు ప్రామాణ్య రహితములనియు వ్రాసియున్నారు.

## పురాణములు, ఆంధ్రులు, ఆంధ్రరాజవంశములు

పురాణములలో ఆంధ్రులు కిరాత, హూణ, పుళింద, యవనదేశీయులతోఁ జేర్చి, వీరు నికృష్టజాతిగ వర్ణింపఁబడిరి. భాగవతము ద్వితీయ స్కంధములో,

"కిరాతహూణాంధ్రపుళిందపుల్కసా ఆభీరకంకాయవనాఃకషాదయః
యేఽన్యే చ పాపా యదుపాశ్రయాశ్శుధ్యంతి తస్మైప్రభవిష్ణవేనమః"

అని ఆంధ్రులు పాపజాతిగ వర్ణింపఁబడిరి. మఱియు నవమస్కంధములో భవిష్యద్రాజేతిహాసములో దుష్యంతుని కుమారుఁడగు భరతుఁడు ఆంధ్రహూణయవనదేశీయులను జయించెననియు, వీరందఱు మ్లేచ్ఛులనియుఁ జెప్పఁబడెను.

"కిరాతహూణాన్ యవనాంధ్రాన్ వంగాన్ శకాన్ కషాన్
అబ్రహ్మణ్యాన్నృపాంశ్చాహన్ మ్లేచ్ఛాన్ దిగ్విజయే బలాత్"॥

ఆంధ్రీకృతభాగములో శక, శబర, బర్బర, కిరాతక, హూణ మ్లేచ్ఛదేశములు మాత్రము పేర్కొనఁబడి, ఆంధ్రులమాట వదలివేయఁబడినది. భాగవతము ద్వాదశస్కంధములో నాంధ్రరాజ్యస్థాపకుఁ డొక వృషలుఁడని యీ క్రింది విధముగ వ్రాయఁబడినది.

"మఱియుఁ గణ్వవంశజుఁడగు సుశర్ముండను రా జుదయించిన వాని హింసించి తద్భృత్యుం డంధ్రజాతీయుండైన వృషలుం డధర్మమార్గవర్తియై వసుమతీ చక్రం బవక్రుండై యేలె".

ఆంధ్రులు మగధరాజగు జరాసంధునితోఁ జేరి యాదవులతోఁ బోరాడిరి. చాణూరుఁడను ఆంధ్రమల్లుఁడు శ్రీకృష్ణునితో మల్లయుద్ధమునందు నిహతుఁడయ్యెను. శ్రీమహావిష్ణువునకుఁ జాణూరాంధ్ర నిషూదనుఁడను పేరు విష్ణుసహస్రనామములలో నొకటి. ఈవిష్ణు సహస్రనామములు మహాభారతములో అనుశాసనిక పర్వాంతర్భాగము.

మత్స్యపురాణ మాంధ్రదేశచరిత్ర కత్యంతప్రధానమైనది. ప్రాచీనాంధ్రరాజ్యస్థాపకులఁ గూర్చి యిందు విపులముగ వ్రాయఁబడినది. కాణ్వవంశీయులగు బ్రాహ్మణప్రభువులలోఁ గడపటివాఁడగు సుశర్మయనువానిని సంహరించి ఆంధ్రుఁడగు శ్రీశిశుకుఁ డనువాఁడు

శుంగరాజ్యాధికారమును నిర్మూలించి ఆంధ్రభూమీశుఁ డయ్యెనని చెప్పఁబడినది.

"కాణ్వాయనస్తతో భూపాః సుశర్మాణః ప్రసహ్యతామ్ ।
శుంగానాంచైవ యచ్ఛేషం క్షిపిత్వాతుబలీయసః॥
శిశుకోంధ్రః సజాతీయః ప్రాప్స్యతీమాం వసుంధరామ్
త్రయోవింశసమా రాజా శిశుకస్తు భవిష్యతి॥

273 - అధ్యాయము

ఈశిశుకుఁడే విష్ణుపురాణములో శ్రీపకుఁడనియు, సింధకుఁడని వాయుపురాణములోను చెప్పఁబడెను. మత్స్యపురాణములో పందొమ్మండుగురు ఆంధ్రరాజులు నాల్గువందల యఱువది వత్సరములు పాలించిన తర్వాత వారిరాజ్యముభృత్య వంశముల పాలయ్యెనని కలదు.

"తేషాంవర్ష శతానిస్యుశ్చత్వారిషష్టిరేవచ।
ఆంధ్రాణాం సంస్థితోరాజ్యే తేషాం భృత్యాన్వ యేనృపాః॥

పైవిధముగ పురాణములలో నాంధ్రదేశమును గూర్చియు, ఆంధ్రులనుగూర్చి దిక్ప్రదర్శనముగ వివరించి, ప్రసంగమును విరమించుచున్నాను.

( అఖిల భారత రేడియో విజయవాడ కేంద్రము అనుమతిని )

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

— □ —

శ్రీ పిఠాపురం మహారాజావారి ధనసాహాయ్యముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువు. నాలుగుసంపుటములు ముద్రితమై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు, అకారము మొదలు నకారము వఱకునుగల సంస్కృతాంధ్రశబ్దము లన్నియుఁ గలవు. ఈ నిఘంటువునందు సంస్కృతశబ్దములు పూర్వనిఘంటువు లన్నిటియందు కంటె మిక్కిలి యధికముగా నీయఁబడినవి. కావున సంస్కృతవిద్యార్థులకు గూడ మిక్కిలి యుపయోగకరముగా నుండును. ఇది యున్నచో సంస్కృతనిఘంటువుల యపేక్ష యుండదు. ఆచ్ఛికపదములకుఁగల యర్థభేదములఁ గనఁబఱిచి వానికిఁ బ్రమాణవాక్యములు పూర్వగ్రంథముల నుండి విపులముగా నీయఁబడినవి. లభ్యమైనంతవఱకుఁ దెనుఁగుశబ్దములకు సంస్కృత ప్రాకృత ద్రావిడాదిభాషలయందుఁగల సజాతీయపదములు చూపఁబడినవి. కేవలము విడిశబ్దములేగాక సంధర్భానుసారముగ సమస్తపదములు (Phrases) ను వానికిగల యర్థములును బ్రయోగములునుగూడ నీయఁబడినవి. జనకశబ్దములక్రింద జన్యశబ్దములు చూపఁబడినవి. ఈపుస్తకము రచించుటకు, ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయునను తలంపుతోఁ దక్కువవెల నిర్ణయింపఁబడినది.

సాదాబైండు సంపుటము 1 కి రు. 5—0—0

కాలికోబైండు ,, 6—0—0

# భీమేశ్వర పురాణము - కొన్ని స్థల విశేషములు.

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి.

శ్రీనాథుఁ డాంధ్రభాషలోఁ గ్రొత్తయుగమును మొదలుపెట్టిన కవి. అతనిరచన యారంభ మగునంతవఱకుఁ బురాణముల ననువదించుటయే కొనసాగినది. ఒండు రెండు ప్రబంధములు వెలువడినను, వానిలో సంస్కృతకావ్యపద్ధతులు కొన్ని తెలుగులోని కవతరించినను, ప్రబంధ రచన కొరవడిపెట్టఁ దగినట్టి నైషధమువంటి ప్రౌఢకావ్యము వెలువడ లేదు. అట్టితరుణమున సంస్కృతభాషలో నారికేళపాక మనఁ బరగిన నైషధమును జేఁబట్టి, సంస్కృతపదభూయస్త్వముతోపాటు తెలుఁగు పొంక మీడఁబోకుండ రచన సాగించి, ఆరచనతో దేశమునం దంతటను బ్రౌఢకవి యనిపించుకొని, రాజాస్థానములలో స్థానము నాక్రమించి, పెదకోమటివేమభూపాలుని పేరోలగమున విద్యాధికారియై, తరువాతికవులకు ప్రబంధరచనకుఁ బథప్రదర్శకుఁ డైనాఁడు.

కొండవీడు వదలి కాంచికిఁ బోయి, అవచితిప్పయ్యకు హర విలాసమును గృతిగా నిచ్చి, దేశమంతయుఁ దిరిగి, తుదికి రాజమహేంద్రవరము చేరునాఁటికి వయఃపరిపాకమును గవితాపరిపాకమును గూడ ప్రౌఢము లైనవి. వీరభద్రారెడ్డియాస్థానమునఁ గవీశ్వరుఁడై వెల యుటకు నాందిగా నాతనిమంత్రియగు బెండపూడి అన్నమంత్రికి భీమేశ్వరపురాణమును కృతిగా సందిచ్చినాఁడు. ఈవిషయమును కాశీ ఖండములో "ప్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొనియాడితి భీమనాయకుని మహిమ"నని వాకొనియున్నాఁడు. ఈభీమనాయకుని మహిమతో పాటు భీమమండలి నంతయుఁ గొనియాడి, తనకుఁ గల యాంధ్ర దేశాభిమానమును వెలువఱిచి, నాఁటి తెలుఁగునారిపరిపాటుల నెన్నియో యెఱుకపఱచినాఁడు. కేవలము తీర్థక్షేత్రమాహాత్మ్యములతో

నిండి నీరస మనిపించుకొనఁదగిన యితివృత్తమును దీసికొని, రసవత్తర మయిన ప్రబంధముగా భీమేశ్వరపురాణమును నిర్మించియున్నాఁడు.

ఈప్రబంధమును మొదట స్కాందాంతర్గతమైన గోదావరీఖండము నూఁతగఁగొని తెనుఁగుకవులనఁ బోసి కావ్యముగఁ దయారుచేసి భీమనాథునకే కృతియొసఁగినాఁడు. కావుననే షష్ఠ్యంతములతుదిని "అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన యిమ్మహాప్రబంధమునకుఁ గథానాయకుండైన భీమేశ్వరమహాదేవునకుఁ బ్రియధామంబైన దక్షారామపురవరం బెట్టి దనిన" యని దక్షారామ పురవర్ణనము నారంభించినాఁడు. దీనినిబట్టి తొలుత నీతనిప్రబంధమునకు నాయకుఁడు దక్షారామభీమేశ్వరుఁడే యయ్యు, వీరభద్రారెడ్డియాస్థానిలోఁ బ్రవేశము వడయుటకై బెండపూడి అన్నామాత్యుఁడు కృతినాయకుఁడైనట్టు తోఁచెడిని. ఈపరిపాటి హరవిలాసమునందుఁగూడ మనకుఁ గాననగును. సిరియాళునిచరిత్రము పార్వతీపరిణయము కిరాతార్జునీయములకు సంబంధించిన కథాంశములను ముందుగనే తెలుఁగుభాషలో సంతరించికొని, కృతిపతిగా నవచి తిప్పయ్యసెట్టి లభింపఁగా నాతనిఁ గృతిపతి చేసి యాకథాఖండముల నాతనికిఁ గృతిగా నిచ్చినాఁడు.

## భీమమండలము.

శ్రీనాథుఁడు ప్రాసాదపంచాక్షరీమంత్రోపాసకుఁడు. శివుఁడాతనికిఁ బరమోపాస్యుఁడు. శివుని మహిమాభివర్ణన మాతని కభీష్టతమము. తాను రచించిన కావ్యములలో నేరసమునైనను బరమేశ్వరాలంబనముగనే కొనసాగించినాఁడు. భీమేశ్వరపురాణమున దక్షారామ భీమేశ్వరుఁ డీతనికిఁ గథానాయకుఁడు. దక్షారామము పంచారామములలో నొకటి. ఈపట్టణమున కధిపతియైన భీమేశ్వరుని మహిమ మీప్రబంధమునఁ బ్రధానముగ వర్ణించి, దీనికి 'భీమేశ్వరపురాణము' అని నామకరణము చేసినాఁడు.

గోరుచు నెలకొనిన దక్షారామము నవధిగఁ జేసికొని మూఁడుయోజనములు మేరగ చక్రాకారవలయ రేఖ భీమమండలముగఁ బేర్కొనఁబడినది.

ఉ. అంబుధి మేర తూర్పునకు నబ్ధియ సీమటు యామ్యదిగ్విభా
గంబునకుం బ్రతీచికిని గౌతమి సీమ యుదీచికిం బ్రమా
ణంబు త్రియోజనంబు సురనాథుఁడు దక్షిణకాశి భీమలిం
గంబున కేకభోగముగఁ గట్టడచేసె వసుంధరాస్థలిన్.

భీమ. ఆశ్వా. ప. 76.

తూర్పుదిక్కున భైరవపాళెపుసముద్రము, దక్షిణమున అంతర్వేది సముద్రమును, పడమర రాజమహేంద్రవరమునందలి గౌతమియు, ఉత్తరమున పీఠికాపురమును సరిహద్దులుగ నడుమ నుండెడి మూఁడు యోజనములమేర యీభీమమండలిలోనికి వచ్చును. ఈసరిహద్దుల నడుమ దక్షారామము, కుమారారామము (సామర్లకోటభీమవరము) భీమారామము, లేక సోమారామము (గునుపూడిభీమవరము) క్షీరారామము పాలకొల్లు) అను నాలు గారామములున్నవి.

ఈ యారామములను గూర్చి భీమేశ్వరపురాణమునం దిట్లు వ్రాయఁబడియున్నది "అనంతరం బాయంబికావల్లభుండు......కృతకృత్యుండై త్రిపురదైతేయుల కులదైవతంబైన యద్దివ్యలింగంబును బంచబ్రహ్మ పంచాక్షరీ పంచతత్త్వ పంచభూతమయం బగుటంజేసి పంచఖండంబులుగా ఖండించి కృష్ణవేణీమహానదీతీరమున ధరణాలకోట యనుగ్రామంబున (నేఁడు దీనిని ధరణికోట యందురు) నమరేశ్వరుని చేతం బ్రతిష్ఠితుఁడగుటంజేసి యమరలింగంబునాఁ బ్రసిద్ధంబైన యమరారామంబును (అమరావతి) గౌతమీతీరంబున దక్షిణకూలంబున గుణపూడి యనుగ్రామంబున సోమునిచేతం బ్రతిష్ఠితం బగుటంజేసి సోమలింగంబనఁ బ్రఖ్యాతంబైన సోమారామంబును (నేఁడు దీనిని గునుపూడి

భీమవరము అందును బాలకోట యనుగ్రామంబున శ్రీరామచంద్రునిచేఁ బ్రతిష్ఠితం బగుటం జేసి రామలింగంబు నాఁ బ్రసిద్ధంబైన క్షీరారామంబును, చాళుక్యవంశరాజధానియగు చాళుక్యభీమవరనామగ్రామంబునఁ గుమారరత్నంబైన కుమారస్వామిచేతం బ్రతిష్ఠితంబగుటంజేసి కుమారభీమలింగంబనఁ బ్రఖ్యాతి నొందిన భీమారామంబును, మొదలిసామ యగుదక్షప్రజాపతి యునికిపట్టైన యారామం బగుట దక్షారామంబున శివసన్నిధానంబై తా నుండునట్లుగా నీప్రకారంబున భోగమోక్షప్రదంబులైన పంచారామంబులను బ్రతిష్ఠ నొందించి తానును దక్షవాటంబున శ్రీభీమేశ్వరలింగమునం దధివసించె".

ఈప్రసంగమునుబట్టి త్రిపురాసురసంహారానంతరము తదుపాస్యమైన లింగము పంచఖండములై నెలకొనిన స్థానములు పంచారామములైనట్లు తెలియుచున్నది. ఈపంచారామములయుత్పత్తినిగూర్చి మఱియొక యైతిహ్య మిట్లున్నది. కుమారస్వామి తారకాసురసంహారము సేయునపుడు ఆతని కుపాస్యమైన లింగమును భేదింపఁగా నది యయిదు తునకలై యైదుచోటు లందుఁ బ్రతిష్ఠితముకాఁగా నవి పంచారామములైనవి. ఈతారకాసురవధ గోస్తనీనదీతీరమున 'తణుకు' అనుగ్రామమునకు సమీపమున జరిగినట్టు లాప్రాంతములందలి గ్రామములు తార్కాణించుచున్నవి.

1. తణుకు—తారకాసురపురము. ఇది నేఁడుపశ్చిమగోదావరి జిల్లాలో వస్థానది కెనిమిదిమైళ్లదూరమున గోస్తనీనదీతీరమునం దున్నది. దీనికి నాలుగైదుక్రోసులలో నీక్రిందిగ్రామము లున్నవి.

2. వేల్పూరు—దేవతలు విడిసినచోటు

3. కావలిపురము—దేవతల రక్షణశిబిర మున్నచోటు. దీనిని నేఁడు 'కావలిపాడు' అని యందురు.

—భూమిలో దేవేంద్రుఁడు విడిసినచోటు. నేఁడు దీనిని 'ఇలేంద్రపట్టు' అని యందురు.

భీమేశ్వర పురాణము - కొన్ని స్థలవిశేషములు

5. అర్జునపాలెము—దేవతలకు సహాయముగా వచ్చిన కార్త వీర్యార్జునుడు విడిసినచోటు.

6. కుమారపురము—కుమారస్వామి విడిసినచోటు. దీనిని నేడు 'కొమరారము' అని యందురు.

7. సోమరాజిలేంద్రపట్టు — ఈసమీపముననే యీపేరిటి గ్రామ మొకటి గలదు. సోముడు ఇంద్రుడు కలిసి విడిసినచోటు కానోపును.

8. దేవదానవులపుంత—ఇది 'జుత్తిగ' యను గ్రామసీమలో నున్నది. దేవదానవుల కిరువురకును యుద్ధము జరిగిన తావగుటచే దీని కీపేరు వచ్చియుండును. నేటికిని ప్రభుత్వపులెక్కలలో దీనికీపేరు చెడకుండ నిలిచియున్నది. క్షీరారామము భీమారామము నీప్రదేశమునకు రెండుయోజనములమేరలో నున్నవి. కావున నీయైతిహ్యము గూడఁ గొంతసరిపడుట కవకాశము లేకపోలేదు. స్కాందాంతర్గతమైన 'గోస్తనీ నదీమాహాత్మ్యము' వెలువడలేదు. అం దీయైతిహ్య ముండునేమో యని సంశయము.

ఈభీమమండలి యాంధ్రమండలములలోఁ బరమపవిత్రమైన దనియు, ఇతరమండలము లేవియు దీనికి సాటియైనవి లేవనియు శ్రీనాథుఁ డిట్లుగ్గడించియున్నాఁడు.

ఉ. ఎక్కడఁ జూచిన న్సరసి, యెక్కడఁ జూచిన దేవమందిరం
బెక్కడఁ జూచినం దటిని, యెక్కడఁ జూచినఁ బుష్పవాటికం
బెక్కడఁ జూచిన న్నది, మహీవలయంబున భీమమండలం
బెక్కడ ? యన్యమండలము లెక్కడ భావన చేసి చూచినన్ ?

సీ. ఒకచోటఁ గోటిపల్లూడు రాజకోటీర
విభ్రాజితోత్సంగ వృద్ధగంగ
ఒకచోటఁ జటులనక్రకుళీరపాఠీన
తోయగర్భాభోగ తుల్యభాగ

ఒకచోటఁ బితాంబికోన్నత స్తనభరా
స్ఫాలజర్ఝరితకల్లోల యేల
ఒకచోట నప్సరోనికరసంసేవితాం
తరము శ్రీసప్తగోదావరంబు
సమరు నాగరఖండసిద్ధాంతజాతి
నాగవల్లీసమాక్రాంతపూగఖండ
మండితోద్యానవాటికాఖండవిభవ
పాత్రమగు భీమమండలీక్షేత్రమునకు.

ఈభీమమండలమునం దన్నిదిక్కులందును గోదావరీనది శా ఖలుగాఁ బ్రవహించి యీమండలమునంతను నాఁటికి నేఁటికి బహు సస్యభరితముగా నొనర్చుచున్నది. ఒకవైపున కోటిపల్లివాసియైన సోమేశ్వరుని చంద్రికళచే విభ్రాజితమైన వృద్ధగంగానది. ఈనది అమలాపురము తాలూకాలోఁ గొంతమేరఁ బ్రవహించి సముద్రమునఁ గలియును. ఆసాగరసంగమస్థలమును 'బ్రహ్మసంవేద్యము' అని యందురు. ఈనదీతీరము నేఁటికిని నారికేళవనీసమావృతమై బహుసార వంతమైనది.

ఒకచక్కని నక్రకుళీరాదిజలజంతువులతోఁ గూడిన తుల్యభాగా నది. ఇది ధవళగిరి (ధవిళేశ్వరము దగ్గఱ గౌతమినుండి విడువడినదియై రామచంద్రపురము తాలూకా, కాకినాడతాలూకా గ్రామములమీఁ దుగాఁ బ్రవహించి, కాకినాడకు సమీపమునం దున్న 'చొల్లంగి'యను క్షేత్రమున సముద్రగామి యగుచున్నది. ఈనదీతీరభూమి మిక్కిలి సార వంతమైనది. ఈనదీతీరమునందలి పవిత్రక్షేత్రములను శ్రీనాథుఁ డిట్లు గ్గడించియున్నాఁడు.

శా. చేతోమోద మెలర్పఁ గట్టెనుటఁ గాంచె న్భారతామ్నాయవి
ద్యాతంత్రగ్రథనాబ్జసంభవుఁడు వేదవ్యాసుఁ డభ్యర్హిత
జ్యోతిర్లింగమయస్వరూపుల జటాజూటావనద్ధేందులన్
వాతాపీల్వలవైరిగౌతమనదీవాస్సంగమేశానులన్.

## భీమేశ్వర పురాణము - కొన్ని స్థలవిశేషములు

వేదవ్యాసుఁడు కాశీ బాసి దక్షిణకాశియగు ద్రాక్షారామమునకు యాత్రసలుపుచు తుల్యానదీతీరవాసులు, జ్యోతిర్లింగమయస్వరూపులు నైన వాతాపీల్వలేశ్వరులను సంగమేశ్వరుని గాంచెనఁట. వాతాపీశ్వరుఁడు ఇల్వలేశ్వరుఁడు వాతాపీల్వలులకు వైరియైన యగస్త్యునిచే నీనదీతీరమునఁ బ్రతిష్ఠింపఁబడినారు. వాతాపీశ్వరుఁడు తాపేశ్వరమునను ఇల్వలేశ్వరుఁడు ఇప్పనపాడునందును గలరు. ఈరెండు ఆలయములు తుల్యానదీతీరమునందే యున్నవి. గౌతమనదీప్రవాహము తుల్యానదీప్రవాహము సంగమించినచోట ప్రతిష్ఠితుఁడైనయీశ్వరుఁడీ సంగమేశ్వరుఁడు కావలయును. 'ఏడిది, తాపేశ్వరము, మండపేట'యను గ్రామములకునడుమ నీసంగమేశ్వరుఁడు గలఁడు. ఆస్వామి యాలయముముందు కొలనువలె నొకతీర్థ మున్నది. దానికిఁ దుల్యభాగానదీశాఖతో సంబంధ మున్నట్టు గానవచ్చుచున్నది. గౌతమనదీప్రవాహముతో సంబంధ మెక్కడినుండి యుండెనో తెలియకున్నది. అచటి యీశ్వరుని పేరుమాత్రము సంగమేశ్వరుఁడే. ఆ యాలయ ప్రాంతము కదంబవనముతో నిండి పరమప్రశాంతమై తపశ్చర్య కీనాఁటికి ననుకూలముగనే యున్నది. వ్యాసునిదక్షిణకాశీప్రయాణములో నీనదీతీరమునందలి మఱియొకదివ్యక్షేత్రము నాతఁడు గాంచినాఁడు. 'మఱియుఁ దుల్యభాగాతీరంబున సాంపరాయగ్రామంబుచేరువ బిల్వాటవీవాటిఁ గపటభిల్లుండైన చలిగొండఱేనియల్లుని ముక్తీశ్వరుని' దర్శించినాఁడు. సాంపరాయగ్రామంబును నేఁడు 'సంపర' యని యందురు. ఈగ్రామమునకుఁ జేరువను తుల్యభాగానదీతీరమున 'ముక్తీశ్వరుఁడు' గలఁడు. శ్రీనాథుని నాఁటి కాతఁడు బిల్వవనాటవీమధ్యమున నుండెనఁట. ఆముక్తీశ్వరుని వ్యాసుఁడు శిష్యులతోఁగూడి బిల్వదళములతోను పదాఱువన్నెబంగారును బరిహసించు తేలపూవులతోను బూజించె నని తెలిపినాఁడు.

ఉ. వేదవిభాగముం బరిఢవించినపుణ్యుఁడు వేడ్కఁ బూన్చె బి
ల్వీదళపూజనంబు గడుఁబెన్పుగఁ గూరిమిశిష్యపంక్తితో
నాదిమభిల్లు నిత్యకరుణామృతపూరముఁజల్లు పుండరీ
కోదరభల్లు సృత్తకరియూథపుమల్లునిఁ గొండయల్లునిన్.

గీ. పదియునార్వన్నె బంగారుఁ బరిహసించు
నవనవారగ్వధప్రసూనములు గోసి
సాంపరాయమహాగ్రామ సవిధనిలయు
నభవుఁ బూజించెఁ బుండరీకాక్షమూర్తి.

ఈవిధముగ వేదవ్యాసపూజితుఁడైన ముక్తీశ్వరుఁడు నెలకొనిన యీప్రదేశ మొకదివ్యక్షేత్రము.

## పీఠికాపురము

ఈభీమమండలికుత్తరసీమలో ఏలానది యున్నది. దీని నిప్పుడు 'ఏలేరు' అనియందురు. నాఁ డీయేలానది పీఠికాపురాధివాసినియైన పీఠాంబిక స్నానమాడఁగా నామె స్తనభరాస్ఫాలనమున జర్ఘరితమైన తరంగములు గలదఁట. ఈపీఠాంబనుగూర్చి మఱియొకతావున నిట్లు వ్రాసియున్నాఁడు.

ఉ. హాటకపానపాత్రియును నారగఁ బండిన మాతులుంగము
ఖేటము లోహదండము నొగిం ధరియించి పురోపకంఠశృం
గాటకభూమిభాగమునఁ గాపుర ముండెడి పీఠికాంబకుం
గైటభదైత్యవైరిప్రియకాంతకు మ్రొక్కె నతండు భక్తితోన్.

భీమ. 2-59.

ఈపీఠాంబ యొకచేత బంగారుపానపాత్రియును, వేఱొకచేత బాగుగాఁ బండిన మాదీఫలమును, ఒకచేఁ ద్రిశూలమును, మఱియొక చేతను లోహదండమును ధరించి నేఁటిపిఠాపురమునకు సమీపమున నాల్గువీథులు కలిసెడిచోటున శ్రీనాథునినాఁ డుండినట్లు లీపద్యము తెలుపుచున్నది. ఇట్టి విగ్రహ మొకటి యీనాఁడు పీఠాపురము క్రొత్తపేటలో నున్న కుమారస్వామియాలయమునం దున్నది. ఈవిగ్రహమునకు నాలుగుచేతులు, నాలుగుచేతులలోను పైనఁ జెప్పిన సామ

గ్రియు నిమిడియున్నవి. ఈవిగ్రహము చిరకాలము జలనివాసము చేసి, బయటికి వచ్చి యాదేవళముసం దింతవఱకుఁ దలదాఁచుకొని యున్నది. ఈపీఠికాంబిక ఏలానదీతీరమునం దున్నది. ఈపిఠాపుర మొకదివ్యక్షేత్రము. ఇచట కుక్కుటేశ్వరుఁడు, కుంతీమాధవస్వామియుఁ బ్రధాన దేవతలు. కుక్కుటేశ్వరునియాలయమునెదుట నున్నకొలనికి 'పాదగయ' అని పేరు. గంగానదీతీరమున నుండిన గయ గయాశీర్ష మనియు, ఇది పాదగయ యనియు నందురు. ఇది హుంకారిణీశక్తిపీఠము. హుంకారిణీశక్తిపీఠ మీనాఁడు గానరాదు. కాని యీపిఠాపురమును గూర్చి శ్రీనాథుఁ డిట్లుగ్గడించియున్నాఁడు.

సీ. అదె కుక్కుటేశ్వరం బయ్యుపాంతము మేడ
హుంకారిణీదేవి యోలగంబు
ఏపట్టణము మ్రోల నేలేరు ప్రవహించుఁ
బృథివికి ముత్యాలపేరువోలె
మున్నూటయఱువదిమూర్తిభేదములతో
విహరించు నేపీట వేల్పుపిండు
పీఠాంబచెలి యోగపీఠి హుంకృతిదుర్గ
ననిచి కాపుండు నేనగరికెలన
కుంతీమహాదేవి కూర్మిమేనల్లుఁడు
మాధవుం డేపీట మరగినాఁడు
పెద్దగవనుల నేపుటభేదనమున
నెలమి నిలుచుండు క్రీడావిహీనజఘనుఁ
డట్టిపీఠాపురముఁ జేర నరుగుదెంచెఁ
బరమశైవుఁడు శ్రీపరాశరసుతుండు.

పీఠికాపురసమీపప్రాంతమున నేలేటికాల్వల సొబగుచ గాచిన నిజమున కవి పుడమికిముత్యాలహారములవలెనే యుండును. ఆపట్టణపరిసర మంతయు బహువృక్షవాటికాసముపేతమై చూపఱకు విరాళి గొలుపు చుండును. ఆపట్టణమునందలి కుక్కుటేశ్వరాలయమునఁ గలకాలభైరవ విగ్రహము క్రీడావిహీనజఘనమై నిలిచియున్నది. కాని చూచువారి

కందఱకు నది సిగ్గును గలిగించును. ఆవిగ్రహము శ్రీనాథునికంటెఁ బడి నంతనే దాని నీపద్యములోఁ జిత్రించి వదలినాఁడు. ఏలేటికాల్వల నీటి సాయమునఁ గనరెడిసస్యసమృద్ధిని ఫలసమృద్ధిని పుష్పసమృద్ధిని శాకములను శ్రీనాథుఁ డిట్లుచిత్రించియున్నాఁడు.

సీ. ఏలేట విరినీట నిరుగారునుం బండుఁ
బ్రాసంగువరిచేలుఁ బసిఁడిచాయఁ
బరిపాకమున వేరుపనసపండులతావి
యిందిందిరములకు విందు సేయు
వేఁబోఁకఁ బోలుపారు వింధ్యాద్రిపవనంబు
పోఁకపువ్వులతావిఁ బుక్కిలించు
వేశ్యవాటికలందు విహరించు వలరాజు
ననయంబుఁ జెఱకువిల్లును ధరించి
నారదంబులవలపు పొన్నలఁ బెనంగి
విచికిలామోదములతోడ వియ్యమందుఁ
బాటలీపుష్ప కేతకీపరిమళములు
పొదల నిలసిల్లుఁ బీఠికాపురమునందు.

ఈపద్యములోఁ బేర్కొనిన సస్యములు ఫలములు పుష్పములు చాలవఱకు నేఁటికిని నీప్రాంతములం దుపలభ్యములే. నేఁడు పోఁకతోఁట లంతగఁ గానరావు. వేఱుపనసలు గానరావు; గాని సదాపనసలు మాత్రి మెల్లపుడు పండ్లతో నిండియుండును. ఏలేటిప్రాంతమంతయు చెఱకుపండుటకు మంచి నెలవు. ఈక్రిందిపద్యములోఁ బేర్కొనిన శాకములన్నియు శ్రీనాథునినాఁటను నేఁడును గూడ సమృద్ధముగ నేయున్నవి.

సీ. త్రిపుసపుష్పలతామతల్లీ పటోలికా
కారవేల్ల కడుంగకములతోడఁ
గూష్మాండ వృంతాంక కోలక చించికా
కాయమానకదంబకములతోడ

శాకినీ మూలక చ్ఛత్రిక సారణీ
ధాన్యాక మేఘనాదములతోడఁ
బిప్ప ల్యుపోదకీ పీతపలాండుక
వాస్తు శాఖా కోటివాటితోడ
రాజనలతోడ శృంగబేరములతోడఁ
జిఱుగడపుఁ బెండలముతోడఁ జేమతోడ
నొప్పు నాలుగుపొలములం దుపవనములు
భువనసారము పీఠికాపురవరమున.

ఈశాకజాతియంతయు ననుదినము కాకినాడలో నీనాఁ డవతరించుచుండును. పీఠికాపురసమీపప్రాంత మంతయు నతిసారవత్తరము బహువిధఫలవృక్షభరితమును. ఈపిఠాపురము మీఁదుగాఁ బ్రవహించిన యేలానది, అచటికి యోజనదూరములో 'పొన్నాడ' యను గ్రామసమీపమున సముద్రగామి యగుచున్నది. అచట నీయేలానదిలో అన్నవరముసమీపమునఁ బ్రవహించెడి పంపానదికూడ వచ్చి కలియుచున్నది. ఈనదీసాగరసంగమప్రదేశమునజగన్నాథమునవలెనే జగన్నాథస్వామి బలభద్రస్వామి సుభద్రాదేవి ప్రతిష్ఠితులై యున్నారు. ఈప్రదేశమును పూరీజగన్నాథముతో సమానమైన దివ్యక్షేత్రమునుజేయవలయునని యెంచి ఒడ్డెరాజులతో విరోధము నూనిన గజపతులు (తూర్పువిజయనగరాధీశులు) ఈవిగ్రహముల నిచట స్థాపనచేసి యున్నట్టు లీవిజయనగరరాజుల చరిత్రమువలనఁ దెలియుచున్నది. ఇచటి జగన్నాథస్వామి నాప్రాంతము వారు మొండిజగ్గప్ప యని వాకొందురు. చేతులు మొండిగా నుండుటచే నీతని కాపే రేర్పడినది. ఇదియు నొక పుణ్యస్థలమే. శ్రీనాథునికాలమున కవతరింపకపోయి యుండవచ్చును.

### కుమారారామము.

ఈ పీఠికాపురమునకొక యోజనమేరలో దక్షిణమున కుమారారామమున్నది. ఇచటి యీశ్వరుఁడు భీమేశ్వరుఁడు. విష్ణువు రాజనారాయణస్వామి. ఈయాలయములు రెండును సామర్లకోట రైలుస్టేషనుకు వెనుకభాగమునం దున్నవి. ఈ ప్రదేశమును నేఁడు సామర్లకోటభీమవరము అని యందురు. శ్యామలాదుర్గము సామర్లకోట యయిన దని

యచటివారు చెప్పెదరు. చాళుక్యకోట సామర్లకోట యయినదేమో? చాళుక్యభీమున కిది రాజధాని యని శ్రీనాథుఁడే తెలిపియున్నాఁడు

ఈకుమారారామమునందలి భీమేశ్వరాలయమునకు దక్షారామ భీమేశ్వరాలయమునకు ప్రాకారాదులను నిర్మింపఁజేసినవాఁడు చాళుక్యభీముఁడే. కావుననే యీయాలయములు రెండును ప్రాకారావరణాదినిర్మాణములన్నిటియందును సర్వవిషయములందును సరిపోలియున్నవి. భేద మింతుకయుఁ గానరాదు. ఆలయముల కుపయోగించిన శిలలు శిల్పులు శిల్పములు అన్నియు నొక్కటియే. భేద మింతుకయుఁ గానరాదు. ఈకుమారారామమునుగూర్చి శ్రీనాథుఁడు వర్ణించుపరిపాటిలో నచటివాయువులచల్లఁదనము నిట్లుగ్గడించినాఁడు.

సీ. కొమరేటికల్హార కమలషండంబుల
సౌరభ్యభారంబు సంతరించి
నారికేళాటవీ నవపుష్పకుహాళికా
వితతికన్నెరికంబు వీడుకొలిపి
యప్సరఃకాంతా విహారహాటకహర్మ్య
శశికాంతమణిగవాక్షములఁ దూరి
భీమనాయకదేవు పేరురంబునఁ గ్రాలు
భుజగహారములకు భుక్తి వెట్టి
రాజనారాయణస్వామిరమ్యభవన
తార్క్ష్యకేతనపతికి నర్తనము గఱపి
పొలసె నధ్వపరిశ్రాంతిపోడ వడంగ
మానివరుపైఁ గుమారవనానిలములు.

కాశిఁ బాసి దక్షిణకాశికి శిష్యవర్గముతోఁ గూడి వచ్చువ్యాసునకు కుమారారామమునందు గాలులు మార్గాయాసము శమియింప వీచినవఁట. ఈవాయువులు భీమనాయకునియెదుట నున్న కొమరేటి పద్మముల పరిమళభారమును వహించినవి. కొబ్బరితోటలలోని పూలమొగ్గలను పుష్పింపఁజేసినవి. అప్సరఃకాంతల చంద్రకాంతమాణిక్యవిహారభవనములఁ జొచ్చినవి. భీమేశ్వరుని వక్షస్థ్సలమునందలి పాములకు మేఁతవెట్టినవి. ఆభీమేశ్వరుని పార్శ్వమునందున్న రాజనారాయణ

స్వామి గుడిమీఁది గరుత్మంతునకు నాట్యమునేర్పినవి. శ్రీనాథునినాఁడు గుడిమీఁద కేతనముగా నుండిన గరుత్మంతుఁ డీనాఁ డాతావునందు లేక ఆలయము క్రిందికి దిగినాఁడు. శ్రీనాథునికంటఁబడుటచేఁ బద్యములోని కెక్కినాఁడు.

## స ర్ప పు ర ము.

కుమారారామమునకు యోజనముమేర తూర్పుగ సర్పపురము. దీనిని నేఁడు సర్పవరము, సర్పారము అని యందురు. ఇచట భావనారాయణ స్వామి నెలకొనియున్నాఁడు. ఇది యొకపురాతనమైన విష్ణుక్షేత్రము. ఈభావనారాయణస్వామి యాలయమున కెదురుగనున్న కొలనికి 'నారదకుండము' అనిపేరు. ఇచట వైష్ణవులు పెక్కురా స్వామి నాశ్రయించినవారు నేఁటికిని గలరు. ఈక్షేత్రమును వ్యాసుఁడు దర్శించి భావనారాయణస్వామికి శనివారోత్సవము చేసినట్లు శ్రీనాథుఁ డిట్టు లుగ్గడించినాఁడు.

శా. కాంచె న్సర్పపురాభిధానముఁ ద్రిలింగక్షోణివైకుంఠమున్
ముంచెన్ నారదకుండికాజలముల న్మోదంబుతో దేహమున్
జించెన్ గాశివియోగదుఃఖము మహాక్షేత్రంబు వీక్షించి ద
ర్శించెన్ సన్మునిలోచనోత్సవముగా శ్రీభావనారాయణున్.

భావనారాయణస్వామివిగ్రహము లాయాలయమున రెండున్నవి. ఆవరణలో నొకగుహవంటిచోట నున్నవిష్ణువిగ్రహమును పాతాళభావనారాయణస్వామి యని యందురు. ఆవిగ్రహము లోచనోత్సవమై దృష్టి నాకర్షించును. శనివారోత్సవములో శ్రీనాథుఁడు దనకుఁ బ్రియమైన పిండివంటలను వ్యాసునిచే భావనారాయణునకుఁ బెట్టించినాఁడు. ఈపద్యము శ్రీనాథునినాఁటిఖాద్యములను మనకుఁ దెలుపుచున్నది.

మ. శనివారోత్సవ మాచరించె ముని శిష్యవ్రాతముం దానుఁ గ
మ్మనిపణ్యారముతోడ బూరెగమితో మండెంగ తండంబుతో
ననుకుంబాసెముతోడఁ బాండుకలమాహారంబుతో నేతితో
ఘనరంభాఫల ఖండశర్కరలతోఁ గారుణ్యపాథోధికిన్.

ఈవిధమైన ఆంధ్రదేశమున నుపయోగించు భక్ష్యభోజ్యముల నీసర్వవరమున నీవైష్ణవదివ్యక్షేత్రమునందు భావనారాయణున కర్పింపఁ జేయుట సహజమే కాశిలో నన్నపూర్ణాదేవి వ్యాసునకు శిష్యులకు భోజనము పెట్టునప్పుడు గూడ శ్రీనాథుఁ డీభక్ష్యభోజ్యములను వారి కవతరింపఁజేసినాఁడు.

ఉ. పప్పును బిండివంటలును బాయసముల్ ఘృతము ల్గుడంబులున్
గుప్పలుగాఁగఁ జుట్టునను గూర్పఁగఁ గూడిన యేరుఁబ్రాలతె
ల్లప్పురభోగివంటకముఁ గమ్మని తాలిపుసాజెపిండితో
నొప్పులుగా భుజించిరి బుధోత్తము లాకటిచిచ్చు పెచ్చునన్.
భీమ. 2-139.

పిండివంటలు తెల్లని కర్పూర భోగపు టేరుఁబ్రాలవంటకము, కమ్మనితాలింపుసాజెపిండియు నాంధ్రదేశములోఁబ్రసిద్ధమైన విషయములు. శ్రీనాథునకు కర్పూరభోగపువంటకము ఖండశర్కర, అరఁటి పండ్లు పప్పు క్రొత్తగఁగాచిననేయి మండెగలు చాలప్రియమైనట్టు లీక్రింది పద్యములవలనఁ దెలియుచున్నది

శా. ద్రాక్షాపానకఖండశర్కరలతో రంభాఫలశ్రేణితో
గోక్షీరంబులతోడ మండెఁగలతోఁ గ్రొన్నేతితోఁ బప్పుతో
నక్షయ్యంబుగ నేరుఁబ్రాలకలమాహారంబు నిశ్శంకతం
గుక్షుల్నిండఁగ నారగించితిమి యక్షుద్రక్షుధాశాంతికిన్.

ఈవిధమైన భోజనము ఓరుగల్లులో లక్ష్మణవజ్ఝుల పూటకూళ్ల యింట నొకరూకకు దొరకునని చెప్పినాఁడు.

ఉ. కప్పురభోగివంటకము కమ్మనిగోధుమపిండివంటయున్
గుప్పెడు పంచదారయును క్రొత్తగఁ గాచినయాలనే పెస
ర్పప్పును గొమ్మునల్లనఁటిపండులు నాలుగు నైదు నంజుడుల్
లప్పలతోడఁ గ్రొంబెరుగు లక్ష్మణవజ్ఝులయింట రూకకున్.
క్రీడాభిరామము.

ఇట్టిఖాద్యములు భోజ్యములు శ్రీనాథున కానాఁ డీభీమమండలిలోఁ దఱుచుగా లభించె ననుట కాతనియీరచనయే తార్కాణము. వీనినిబట్టి శ్రీనాథుని భోజనప్రియత్వముగూడ మనకువ్యక్తమగుచున్నది.

ఏలాతుల్యభాగానదీతీరభూములవలె సారవంతమయినది, బహువిధఫలభారంసము చేత వనవాటికాసహితమైనదియు నగు కౌంతేయీనదీతీరభూమియు నీ భీమమండలిలో నిమిడియున్నది. ఈ ప్రాంతము నీనాఁడు కోనసీమ యని వ్యవహరింతురు. ఈ విషయమును శ్రీనాథు డిట్లు పేర్కొనియున్నాఁడు.

"భీమమండలమునఁ బంద్రెండు యోజనంబులమేర కైవల్యకల్యాణమంటపంబును, భోగలక్ష్మీభవనపుండరీకంబును నై, కుండలాముఖ సంవేద్య శార్దూలతీర్థంబులు మొదలుగా శాఖోపశాఖాతీర్థంబులు గలిగి, దక్షిణజలనిధి వేలావనోపకంఠంబున వేదండవదన శుండాకాండ చుళికితోన్ముక్త సప్తగోదావర సలిలధారాఘుమఘుమాత్కార బృంహిత బ్రహ్మాండగోళంబును, తుల్యభాగా ప్రవాహలహరీకాఘోష ఘుమఘుమాయమాన దిగ్విభాగంబును, ఏలానదీమాతృకాయమాన కేదారక్షేత్రసంవర్ధితానేకవ్రీహిభేద సంపత్సమున్నతంబును, ఫలభరిత నారికేళషండ మండిత ప్రౌఢపీఠాపురోపకంఠ సీమాబహిర్భాగంబును, మాతృకాయమాన గోదావరీతీర పుణ్యాగ్రహారపరంపరా భూనిలింప సంపత్సంపాదితాధ్వరక్రియా సమాహూత పురుహూతాది దేవతాకదంబ సంబాధసంచరితంబును, కౌంతేయవాహినీప్రాంత సంతన్యమాన సహకారకాంతార ఫలరసాస్వాద మోదమాన పుంస్కోకిల కుటుంబకంఠనాళకోమల కుహూకారకోలాహలపరిపంచిత పంచమంబును...నశేషకల్యాణనిలయంబై యొప్పు నమ్మహాస్థానంబున" నీ నాఁటికి శ్రీనాథుని నాఁటి విశేషములు గానవచ్చుచునే యున్నవి.

కౌంతేయినది నీనాఁడు కౌశికినది యని యందురు. ఇప్పటికి నీనదీతీరమున మధురరసఫలభరితములైన మామిడితోఁటలు పెక్కులున్నవి. నారికేళవనాటవులు హెచ్చు. మంచిరుచిగల చెఱకుతోఁటలు మధురరసభరితములైనపనసచెట్లు కదళీవనములు మెండు. ఈనదీతీరమున బ్రాహ్మణాగ్రహారములలో, అటనట నీనాఁటికి వేదవిద్యాభ్యాసము గానవచ్చుచున్నది. నేఁటికి నటనట యాగక్రియాకలాపము లీగోదావరీ నదీశాఖాతీరాగ్రహారములలోఁ గొనసాగుచునే యున్నవి.

ఈకాంతేయు (కౌశిక) నదీతీరమున 'వ్యాఘ్రేశ్వరము' అను గ్రామ మొకటి గలదు. ఈయూరఁ బ్రతిష్ఠితుఁడైన యీశ్వరునిపేరు వ్యాఘ్రేశ్వరుఁడు. ఈయీశ్వరుని యుత్పత్తినిగూర్చిన యైతిహ్యమొక్కటి గలదు. ఆగ్రామవాసియగు బ్రాహ్మణుఁడొకనాఁటి శివరాత్రివేళ నీశ్వరుని బిల్వదళములతోఁ బూజించుటకై సమీపమునందు బిల్వవృక్షము లున్న తావునకుఁబోయెను. అచట బిల్వములు కోయుచుండఁగా వ్యాఘ్ర మొకటి హుంకరించుచు నచటికివచ్చెను. అదిచూచి బ్రాహ్మణుఁడు బిల్వవృక్షము నెక్కెను. క్రింద పులి హుంకరించుచు నాతనికై యెదురుచూచుచు నిలిచియుండెను. క్రమముగ రాత్రి గడచిపోవుచుండెను. పులి కదలెడియత్నము కానరాలేదు. లింగోద్భవకాలము సమీపించుసరికి నాతని కారాట మెక్కువయై మైమఱచి మంత్రము లుచ్చరించుచు వ్యాఘ్రమునే శివుఁడని భావించి చెట్టుమీఁదనుండియే బిల్వదళములతోఁబూజింప దొరఁకొనెను ఆతనిపూజపూర్తియగుసరికి వ్యాఘ్రము మృగరూపమునువదలి యీశ్వరలింగముగా మాఱిపోయెను. కావుననే యచటియీశ్వరుఁడు వ్యాఘ్రేశ్వరుఁడైనట్లు లాప్రాంతమునందీ యైతిహ్యము నలుగడలఁ బ్రసిద్ధమైయున్నది. ఈప్రాంతము బహుసారవంతము.

శ్రీనాథునికంటఁబడిన విహారప్రదేశ మాతనిగ్రంథములలో నేదోయొకచోట కవతరింపకమానదు. ఈభీమమండలిలో 'కోరంగి' యను క్షేత్రము శివరాత్రిమహాత్మ్యములోఁ బ్రవేశించినది. అందు చతుర్థాశ్వాసములో మాఘమాసవాసరములు వర్ణించుపట్టున దక్షారామభీమేశ్వరుని కోరంగి కంపినాఁడు. "భువనరక్షాదాక్షిణ్యుండు దక్షారామభీమేశ్వరుండు దక్షిణజలధివేలావలయితంబులగు నేలాలవంగలవలీమతల్లి కాకుడుంగ క్రోడంబులఁ గ్రీడించుటకునై సారంగలోచనలుఁ దానును గోరంగినెడలె" శివరాత్రి. 4 ఆ. 30.

ఈకోరంగి యనునది కురంగేశ్వరుని నిలయము. శ్రీరాముఁడు కురంగరూపుఁడయిన మారీచు నిటఁజంపి కురంగేశ్వరుని బ్రతిష్ఠించెనని యైతిహ్యము. ఈ కోరంగిసమీపమున ఆత్రేయీనది సముద్రగామి యయినది. ఈకోరంగిగ్రామమున కెదురుగ ఏలాలవంగాదులులేకున్నను, లవలీమతల్లికాకుడుంగక్రోడంబులు నేఁడును గలవు.

# వ్యక్తివివేకము

శ్రీ భాగవతుల కుటుంబరాయశాస్త్రి, ఎమ్. ఏ.

## ప్రథమ విమర్శ.

ఉపోద్ఘాతము:—

"అనుమానేఽన్తర్భావం సర్వస్యైవ ధ్వనేః ప్రకాశయితుమ్
వ్యక్తివివేకం కురుతే ప్రణమ్య "మహిమా" పరాం వాచమ్.

మహిమభట్టు, పరావాక్కునకు నమస్కరించి, అనేకవిధములుగ నున్న ధ్వని కంతకును, అనుమానమునందంతర్భావమును బ్రకాశింపఁజేయుటకై, 'వ్యక్తివివేక'మను గ్రంథమును రచించుచున్నాఁడు.

వివరణము:— ధ్వన్యాలోకమున నానందవర్ధనుఁడు- "కావ్యమున కాత్మ ధ్వని" యని తెల్పినాఁడు. ఈ ధ్వని యనునది అనేకవిధములుగ నున్నది ధ్వనిభేదము లన్నియును, ధ్వన్యాలోకమున వివరింపఁబడినవి. ఈ "ధ్వని" యనుదానిని క్రొత్తగా సృష్టింప నక్కఱలేదనియు, ధ్వనిసిద్ధాంత ప్రతిపాదనకుఁ బూర్వమే, తర్కశాస్త్రమునందుఁ బ్రసిద్ధమైయున్న "అనుమానము"నందే యిది యంతర్భావము నొందుననియు మహిమభట్టు సిద్ధాంతము. ఈ సిద్ధాంతమును నిరూపించుటకే యీ గ్రంథము ప్రారంభింపఁబడినది.

అనుమానము: ఇది తర్కశాస్త్రప్రసిద్ధము. పొగను (వ్యాప్యమును) జూచి, ఇచట నగ్ని (వ్యాపకము) ఉన్నదని నిశ్చయించుట యనుమాన మని సాధారణముగ మనము తెలిసికొనవచ్చును. (వ్యాప్యదర్శనముచే వ్యాపకనిశ్చయము సేయుట—లేక అనుమితికి సాధనమైన వ్యాప్తిజ్ఞానముకూడ ననుమాన మగును.

అన్నివిధములైన ధ్వనియు ననుమానమునందే యంతర్భావము నందు ననుటచే, ఏ విధమైన ధ్వనికి ననుమానముకంటె విలక్షణముగా, అస్తిత్వము లేదని తెలియవలెను.

ప్రకాశింపఁజేయుట:— ఇంతకుఁ బూర్వమే సిద్ధమై, కప్పఁబడి యున్న వస్తువు నిపుడందఱకును దెలియునట్లు ప్రకటించుటను

ప్రకాశింపఁజేయుట యని యందుము—ధ్వని యనునది అనుమానము తో గతార్థమగుట, అనుమానమునం దంతర్భావము నంపుట యను నది, ఇంతకుఁబూర్వము సిద్ధమే. మహిమభట్టు క్రొత్తగా దాని నంతర్భ వింపఁజేయుట లేదు. కాని, యిదివఱ కావిషయము నెవరును గన్గొన లేదు. అందుచే మహిమభట్టావిషయమును ప్రకటనచేసి, ధ్వనికిని, అనుమానమునకును భేదము లేదని నిరూపించుచున్నాఁడు.

వ్యక్తివివేకము:— మహిమభట్టు వ్రాయనున్న గ్రంథము పేరు వ్యక్తివివేకము. వ్యజ్యతే అర్థో అనయా ఇతి వ్యక్తిః—

అర్థము దేనిచేఁ బ్రకాశితమగునో అది "వ్యక్తి" యగును. అనఁగా వ్యంజనా' వ్యాపారమని తెలియ నగును. ఆ వ్యంజనయొక్క వివేకము, అనఁగా విచారణ- వ్యక్తివివేకము. ఆ వ్యంజనా విభేదముల నన్నిటిని బరిశీలించి, అవి యన్నియు, ననుమానముతో గతార్థ మగునని నిరూపించుటయే యీ గ్రంథముయొక్క తాత్పర్యము.

పరావాక్కు:— శబ్దము నాల్గువిధములు, పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరులు; ఇందు పరావాక్కు, బ్రహ్మస్వరూపమని శబ్దబ్రహ్మ వాదుల యభిప్రాయము. ఆ శబ్దబ్రహ్మమునకు మహిమభట్టు గ్రంథాదిని నమస్కరించుచున్నాఁడు. శబ్దశక్తిని విచారించుటకే యీ గ్రంథము ప్రస్తుతమైనది. అట్టిచో శబ్దబ్రహ్మకు నమస్కరించుట యెంతయు నుచితముగ నున్నది.

యుక్తో.యమాత్మ సదృశాన్ ప్రతి మే ప్రయత్నః
నాస్త్యేవ తజ్జగతి సర్వమనోహరం యత్,
♦ కేచి జ్జ్వలన్తి, వికస న్త్యపరే, నిమీల
న్త్యన్యే, యదభ్యుదయభాజి జగత్ప్రదీపే.

ఈ గ్రంథ మెవరి నుద్దేశించి వ్రాయఁబడినది? అను ప్రశ్నమునకు సమాధానముగా నీ విషయమును దెల్పుచున్నాఁడు.

---

♦ ఇచ్చట జ్వలన్తి—మండును; కోపపడుదురు.
వికసన్తి—వికాసమునొందును లేక విచ్చును; ప్రసన్నులగుదురు.
నిమీలన్తి—మూసికొనును; దుఃఖమునొందుదురు.
అని రెండర్థములను తెలియవలెను.

నాతో సదృశులైనవారికొఱకు (నైయాయికుల కొఱకు) ఈ ప్రయత్నము చేయుచున్నాను. ఇతరుల కీకృతి ఇష్టము కాకపో వచ్చును. అంతమాత్రమున దోషమేమియును లేదు. ఈ ప్రపంచమున సర్వమనోహరమైన వస్తు వేదియును లేదు. దృష్టాంతమున కీవిషయమును బరిశీలింప వచ్చును. జగత్ప్రదీపమగు సూర్యుఁ డుదయించినపుడు కొన్ని జ్వలించును. (సూర్యకాంతమణులు జ్వలించును) కొన్ని వికసించును (పద్మములు) మఱికొన్ని ముకుళితములగును. (కలువలు) ఇది లోక దృష్టమే. అటులే ధ్వని సిద్ధాంతవిషయమునందలి భ్రమను పోఁద్రోలి విశేషజ్ఞానము నిచ్చు నా వ్యక్తివివేకగ్రంథము పైకివచ్చినంతనే, నా మతముతో నేకీభవింపనివారు మండిపడవచ్చును (కోపపడవచ్చును). సుహృదులైనవారు ప్రసన్నులు కావచ్చును. మఱికొంతమంది దుఃఖ ము నందవచ్చును. కావున, నాయీ రచన యందఱకును అభీష్టము కాకున్నను నాకు ఖేదము కలుగదు.

ఇహ సమ్ప్రతిపత్తితోఽన్యథా వా
ధ్వనికారస్య వచో వివేచనం నః,
నియతం యశసే ప్రపత్స్యతే య
న్మహతాం సంస్తవ ఏవ గౌరవాయ.

ఈ నా రచనయందు, ధ్వనికారుల మతమును నే నంగీకరించినను, ఖండించినను, ఆతని వాక్యవిమర్శనమే, నాకుఁ గీర్తిని గల్పించును. ఏలన, గొప్పవారియొక్క నామోచ్చారణము చేయుటయే గౌరవము నిచ్చును. వారి రచనను బరిశీలించునపు డేఁకఁ జెప్పవలయునా ?

సహసా యశోఽభిసర్తుం సముద్యతాదృష్టదర్పణా మమ ధీః,
స్వాలంకారవికల్పప్రకల్పనే వేత్తి కథ మివావద్యమ్.

"హృదయదర్పణ"మను గ్రంథమునం దింతకుఁబూర్వమే ధ్వని కారుని మతము ఖండితమైనది. ఆ గ్రంథమును జూడకయే, వేగిరముగఁ

గ్గీర్తి నభిసరింప నెంచిన నాబుద్ధి, ఈ నారచనయందలి దోషముల నెట్లు తెలిసికొనఁగలదు ♦

ధ్వనివర్త్మన్యతిగహనే స్ఖలితం వాణ్యాః పదేపదే సులభమ్
రభసేన యత్ప్రవృత్తా ప్రకాశకం చంద్రికాద్యదృష్ట్వైవ.

ధ్వనిమార్గ మతిగహనమైనది. ఈ మార్గమునఁ బ్రకాశము నిచ్చు, చంద్రిక (ధ్వన్యాలోక వ్యాఖ్యానము) వెన్నెల అని రెండర్థములు) మొదలగువానిని జూడకయే, తొందరపాటున నుపక్రమించిన, నావాణి వాక్కు ప్రతిపదము నందును సులభముగనే స్ఖలితము నంద వచ్చును *

---

♦ ఇచట శ్లేషబలమున మఱియొక యర్థము స్ఫురించుచున్నది.

ఒక అభిసారికానాయిక తన ప్రియునొకచో నొకనియమిత కాలమునకుఁ గలియుదు నని తెల్పినది. కాని విలంబమైనది. ఇప్పుడైనఁ దొందరగా వెళ్లవలయునని యత్నించుచున్నది. ఆతొందరపాటులో, అద్దము చూడకయే నగలతోఁ దనశరీరము నలంకరించినది—ఆనగలు సరిగనున్నవో లేవో యామెకుఁ దెలియుటెట్లు? —

శ్లేష—దర్పణము—అద్దము; హృదయ దర్పణమను గ్రంథము.

అభిసరణము—ప్రియుని గలియుటకై వెళ్లుట.

స్వాలంకారవికల్పప్రకల్పనము—1. తనయలంకారములను సరిగా నుంచుకొనుట,

2. వ్యక్తివివేకమునందలి సిద్ధాంతములను సమంజసములుగఁ బ్రతిపాదించుట,

* పైశ్లోకమున—బుద్ధి(ధీః)యందు అభిసారికాత్వవ్యవహారము గోచరించినది, ఇట వాణి (వాక్కు) యందు అభిసారికాత్వవ్యవహారము స్ఫురించుచున్నది. వెన్నెల లేకయే, చీకటియందు, వెళ్లుచు అడుగడుగున కాలు జారిపడుచున్న యభిసారిక యిచట వ్యంగ్యము—విశేషణములు మార్గమునకును ధ్వనిగ్రంథమునకును రెండింటికి నన్వయించును.

అతిగహనము—1. అనేక ప్రమేయములచే (శాస్త్రీయవిషయములచే) నతి కష్టమైనది. చీకటితో నావృతమైనది.

స్ఖలితము—1. తప్పు 2. కాలుజారిపడుట;

చంద్రిక—1. చంద్రిక యను ధ్వన్యాలోకవ్యాఖ్యానము. 2. వెన్నెల.

కిన్తు తదవధీర్యార్యైః గుణలేశే సతత మవహితై ర్భావ్యమ్
పరిపవనవదథవా తే జాత్యైవ న శిక్షితా స్తుషగ్రహణమ్.

కాని, ఆర్యులైనవారు, దోషములను జూడక, ఇందుఁగల గుణలేశమునందే శ్రద్ధాళువులై యుండవలయును. అయినను నే నీవిషయము చెప్పనక్కఱయే లేదు. చేట మంచి గింజలను గ్రహించి యూఁకను వదలివేయును. అటులే యార్యులైనవారు సహజముగనే దోషములను ద్రోసివేసి, గుణములనే గ్రహింతురు.

## ధ్వని లక్షణము.

ముందు ధ్వనిలక్షణమును దెలిసికొనవలయును. ధ్వనికారుఁడే ధ్వని కీలక్షణముఁ జెప్పినాఁడు.

యత్రార్థశ్శబ్దో వా తమర్థ ముపసర్జనీ కృతస్వార్థౌ
వ్యఙ్క్తః కావ్యవిశేష స్స ధ్వనిరితి సూరిభిః కథితః

ఏ కావ్యమున నర్థముకాని శబ్దముకాని, ఉపసర్జనీకృతస్వార్థములై, ప్రతీయమానార్థము నభివ్యక్తి సేయునో, యాకావ్యవిశేషము "ధ్వని" యని పండితులచేఁ జెప్పఁబడినది ♦

---

♦ 1, ధ్వనికర్త భావమిది 1. వాచ్యార్థము, ప్రతీయమానార్థము నభివ్యక్తి సేయునపుడు, తా నప్రధానమైయుండి, ప్రతీయమానార్థమునకే ప్రాధాన్యము నిచ్చును—అటులే శబ్దము తనచే వాచ్యమగు నర్థము నప్రధానముగాఁ జేసికొని; ప్రతీయమానార్థస్ఫురణము గలుగఁజేయును.

"ఉపసర్జనీకృత స్వార్థౌ" అను పదమున కిదియే అర్థము—;

2, పైలక్షణశ్లోకమునకుఁ బ్రతిపదార్థమిది—

యత్ర=ఏ కావ్యమునందు, అర్థః వా శబ్దః, వా=అర్థముకాని శబ్దముకాని, ఉపసర్జనీకృత స్వార్థౌ=వాచ్యార్థము తా నప్రధానమై యుండియు, శబ్దము తన వాచ్యార్థమున ప్రధానముగాఁజేసికొనియు; తమ్=అప్రతీయమానార్థమును (వ్యంగ్యార్థమును), వ్యఙ్క్తః=వ్యంగ్యముచేయుచున్నవో (ద్వివచనము) సః కావ్యవిశేషః= ఆ కావ్యవిశేషము; ధ్వనిః ఇతి=ధ్వనియని; సూరిభిః=పండితులచేత, కథితః= చెప్పఁబడినది.

3. వ్యఙ్క్తః= వ్యంగ్యము చేయుచున్నవి. — ఇది ద్వివచనము — దీనిననుసరించి యొక విషయము తెలియుచున్నది — శబ్దముతోఁగలిసిన అర్థము, అర్థముతోఁ గలిసిన శబ్దమును, ప్రతీయమానార్థము నభివ్యంగము సేయును — కేవల శబ్దము కాని కేవలమర్థము కాని వ్యంగ్యార్థప్రతీతిని గలుగఁజేయవు. శబ్దార్థములు రెండును గలిసియే వ్యంగ్యార్థప్రతీతిని జేయును. అందుచేతనే 'వ్యఙ్క్తః' అని ద్వివచన ముపయోగింపఁబడినది

4. అర్థోవా, శబ్దోవా= "వా" శబ్దమునకు సామాన్యముగ వికల్పమర్థము-
"శిరశ్శ్వా, కాకో వా ద్రుపదతనయో వా పరిమృశేత్"॥

శిరసును, కుక్కగాని, కాకిగాని ద్రుపదతనయుఁడుగాని స్పృశించుఁగాక.

అనుచోట వా శబ్దమునకు కేవలము వికల్ప మర్థము, పైవారిలోనే యొకరైనను స్పృశింపవచ్చు ననియే అర్థము వచ్చును అందుచేతనే "పరిమృశేత్" అని ఏకవచన ముపయుక్తమైనది అందఱును కలిసి స్పృశింతురను నర్థమిందు లేదు. కావుననే బహువచనము ప్రయుక్తము కాలేదు. — ఈరీతిననుసరించియే "అర్థోవా శబ్దోవా" అనుచోట, గూడ వ్యాఖ్యానించితిమేని, అర్థమొక్కటియేగాని, శబ్దమొకటియేగాని వ్యంగ్యార్థమును వ్యంగము చేయును, అని యర్థము చెప్పవలసి వచ్చును. అపుడు క్రియ వ్యఙ్క్తః అని ద్వివచనమునందు కాక, వ్యనక్తి అనియేకవచనమున నుండవలసి వచ్చును — కాని యిట్లు వ్యాఖ్యానించుట మూలకారుని యభిప్రాయమునకు భిన్నము. శబ్దసాహాయ్యములేని అర్థముకాని, అర్థసహాయ్యములేని శబ్దముగాని యొంటరిగ ప్రతీయమానార్థము నభివ్యక్తిచేయు ననుట ధ్వనికర్తకు సమ్మతమైన విషయముగాదు — అందుచేత నిచట "వా" శబ్దము "అభివ్యక్తిసేయుట" యనుక్రియయందు శబ్దమునకును, అర్థమునకునుగల కర్తృత్వమునందు వికల్పమును బోధింపదు. అనగా అభివ్యంగము చేయుటయను క్రియకొకప్పుడు, శబ్దము, మఱియొకప్పుడర్థమును కర్తయగునని తెల్పదు. మఱేమన, అభివ్యక్తి చేయుటలో శబ్దార్థములకుఁగల ప్రాధాన్యమునందు, వికల్పతను "వా" శబ్దముబోధించును, శబ్దము ప్రధానముగానుండిగాని, అర్థము ప్రధానముగానుండిగాని అభివ్యక్తిచేయును, అని తెల్పును. అపు డభివ్యక్తి చేయుటలో శబ్దార్థములకుఁ గలప్రాధాన్యము నకే వికల్పము. — శబ్దము ప్రధానముగనున్నను, అర్థముగూడ నప్రధానముగ నైననుండి వ్యంగార్థమును స్ఫురింపఁజేయును, అటులే యర్థము ప్రాధాన్యము వహించినపుడుగూడ శబ్దమున కప్రధానముగ నైనఁగర్తృత్వముపోలేదు. ఈవిధము ప్రధానముగనైనను, శబ్దార్థములు రెండును గలిసి అభివ్యక్తి క్రియయందు కర్తలే యగుచుండుట ద్వివచనము ఉపపన్నమే యగుచున్నది. వాశబ్దము కేవలశబ్దార్థకర్తృత్వగత వికల్పమును బోధింపదని తెలియవలెను.

5. కావ్యవిశేషః — కావ్యంచ, తద్విశేషశ్చ అసౌ కావ్య విశేషః — అని కర్మధారయ సమాసమును జెప్పవచ్చును. అపుడు శాస్త్రాదులకంటె విలక్షణమైన ఈకావ్యము — అనునర్థము వచ్చును.

కావ్యస్య విశేషః—అను షష్ఠీసమాసమును చెప్పుకొనవచ్చును.— కావ్యము యొక్క విశేషము అనునపుడు విశేషశబ్దమునకు 'ఆత్మ' యని యర్థము చెప్పుకొనవలయును.— కావ్యమున కాత్మయగునది—ధ్వని—అని తాత్పర్యము వచ్చును.

కేవలము 'విశేషః' అను పదమును ప్రయోగింపక కావ్యవిశేషః, అని కావ్యశబ్దమును గ్రహించుటలో విశేషము కలదు. గుణాలంకారయుతములగు శబ్దార్థముల నుండి సిద్ధించినపుడె, ఈప్రతీయమానార్థమునకు ధ్వనియని పేరుగల్గును. లేనపుడీ ధ్వని వ్యవహారము కలుగదు. లోకములోఁగూడఁ గొన్నివాక్యములు వినినచో వాచ్యేతరమైన యొక యర్థము స్ఫురించుచుండును-ఉదాహరణమునకు దేవదత్తుఁడు పగలు భోజనము చేయుటలేదు, కాని బలిసియున్నాఁడు. అనువాక్యమును విన్నవారికి, వెంటనే అతఁడు రాత్రిభోజనము చేయుచున్నాఁడను నర్థము. స్ఫురించును. దీనినే శ్రుతార్థాపత్తియందురు, భోజనముచేయనిచో బలిసియుండుట కుదురదు కావునను దేవదత్తుఁడు బలిసియుండుటచేతను, రాత్రిపూట తప్పక తినియుండవలెనను విషయము అర్థవశమున సిద్ధించుచున్నది.— ఇచట నీప్రతీయమానార్థమును ధ్వనియని పిలువము. పిలువఁగూడదు. ఈవిషయమును దెలుపుటకే, "కావ్యః" అను పద ముపాత్తమైనది.

సః = అది-కావ్యవిశేషమైన ఆది, ధ్వని ఆకావ్యవిశేషము ధ్వని యనునపుడు "అది" యను దానికర్థమేమి? కావ్యమున, శబ్దము, వాచ్యార్థము, వ్యంగ్యార్థము, శబ్దార్థవ్యాపారము, నను నాల్గున్నవిగదా యని ప్రశ్న రావచ్చును. ఇటనాల్గును ధ్వని శబ్దవాచ్యములు కావచ్చును, 'ధ్వనతీతిధ్వనిః'—అని వాచ్యార్థమునకును శబ్దమునకును వర్తించునపుడును, "ధ్వన్యతే ఇతి" అని వ్యంగ్యార్థపరముగను, 'శబ్దార్థయోఃధ్వననం ధ్వనిః' అని వ్యాపారపరముగను, వ్యుత్పత్తిని జెప్పుకొనవలయును. కాని యిట ధ్వని శబ్ద మీనాల్గిటి యొక్క సముదాయమైన కావ్యరూపమునే ప్రధానముగఁ దెల్పును.

---

ఆలోచించినచో నీలక్షణము "అనుమానమునకే" కుదురును. మఱి దేనికిని గుదురదు.

ధ్వని నుద్దేశించి చెప్పిన యీ లక్షణమునం దీదోషములు కలవు.

1. "అర్థ ముపసర్జనీకృతాత్మమై" అని చెప్ప నక్కఱయే లేదు. "ఇచట పొగ కన్పడుచుండుటచే నగ్నియున్నది" అనునపుడు, "అగ్ని యున్నదని సాధించుటకొఱకు హేతువుగా పొగను గ్రహించినాము. ఈ "పొగ" యనునది, ఎప్పుడు నుపసర్జనమే యగును. దానికిఁ బ్రాధాన్య ముండనే యుండదు. ఈ విధముగనే ప్రతీయమానార్థమును వ్యంగ్యముచేయుటకై యున్న వాచ్యార్థ మెప్పుడు నుపసర్జనమే యగును. (అప్రధానమే యగును) దానికి ప్రాధాన్య ముండుట యెట్లు?

"మఱియొక వస్తువుయొక్క సిద్ధికొఱకు హేతువుగా గ్రహింపఁబడుట యే ఇటువంటి యప్రధానవస్తువులకు లక్షణము. (ఈ అప్రధానవస్తువునే- గుణము- ఉపసర్జనము అని యందురు) దానికి లక్షణమే యది యైనపుడు తిరిగి "అప్రధానమై" అని చెప్పనేల? "నీలోత్పలము" నల్లకలువ- అని చెప్పినా మనకొనఁడు. ఎఱ్ఱకలువలు కూడ నుండుటచే, ఎఱ్ఱ కలువలను గ్రహింతుమేమో యని "నల్లకలువలను తెమ్ము" అన్న వాక్యము సార్థకమగును. అట్లుగాక "ఉష్ణముగా నున్న యగ్నిని తీసికొనిరమ్ము" అని యెవరైనఁ జెప్పుదురా?

అటులే ప్రతీయమానార్థసిద్ధికొఱకున్న వాచ్యార్థ మెప్పుడు నుపసర్జనమే యగును. అట్టిచో "అర్థ ముప జ ర్జనమై" యని చెప్ప నక్కఱ యేమి?

ఆక్షేపము:—"సమాసోక్తి" యను నలంకారమునందు వ్యంగ్యార్థమునకుఁ బ్రాధాన్యము లేదు. వాచ్యార్థమునకే ప్రాధాన్యము కలదు. అందువలననే సమాసోక్త్యలంకారము గుణీభూతవ్యంగ్యమని వ్యవహరించుచున్నాము. "అర్థ ముపసర్జనీకృతాత్మమై" అని యనినచో, సమాసోక్త్యలంకారముగూడ "వ్యంగ్యము, లేక ధ్వనికావ్యమున" కుదాహృతి కావలసివచ్చును. అట్టి యాపత్తిని వారించుటకై యీ పదముపయుక్తమైనది. కావున నిందు దోషమేమి?

సమాధానము:—సత్యమే- సమాసోక్త్యలంకారమున వాచ్యార్థమునకే ప్రాధాన్యము కలదు. కాని యాప్రాధాన్యముయొక్క స్వరూపమును మనము తెలియవలెను. ఇచట వాచ్యార్థము దేనికంటె ప్రధానమై యున్నది? ప్రతీయమానార్థముకంటె కాదు. ప్రకరణము ననుసరించియే వాచ్యార్థము ప్రధానమై యున్నది. అనఁగా నిట వాచ్యార్థము ప్రస్తుతమునకు సంబంధించినదై యుండును. వ్యంగ్యార్థ మప్రస్తుతమై యుండును. అందుచే నీ రెంటిలో వాచ్యార్థమునకు ప్రాముఖ్యము కల్గినదే కాని, ప్రతీయమానార్థముకంటె వాచ్యార్థము ప్రధానమైనదని తాత్పర్యము కాదు. ఉదాహరణము చూడుఁడు.

* ఉపోఢరాగేణ విలోలతారకం
తథాగృహీతం శశినా నిశాముఖమ్
యథా సమస్తం తిమిరాంశుకం తయా
పురోఽపి రాగాద్గలితం నలక్షితమ్.

"అతిశయమైన రాగమును ధరించిన శశాంకుఁడు విలోలతారకమైన నిశాముఖము నెంతయో వేగముగ గ్రహించినాఁడు. ఆ వేగతీవ్రత వలన సాంధ్యరాగానంతరము, తనముందే జాఱిపోయిన తిమిరాంశుకమునుగూడ రాత్రి చూడనే చూడలేదు."

ఇచటఁ బ్రస్తుతమునకు సంబంధించిన యర్థమిది.

సంధ్యాకాలమున నెఱుపుగనున్న చంద్రుఁడు, చంచలముగనున్న నక్షత్రములు గల రాత్రి నొక్కసారిగఁ బ్రకాశింపఁజేసినాఁడు. అట్లు తటాలున చంద్రోదయమగుటచే ప్రదోషసమయ మెపుడు వచ్చినదో, ఎపుడు పోయినదో గూడ లోకులకుఁ దెలియలేదు. ఇది వాచ్యార్థము.

కాని యిచట "నిశా" యను స్త్రీలింగపదము, "శశీ" యను పుంలింగపదముల మహిమచేతను, రాగము, ముఖము, గలితము విలోలతారకము, తిమిరాంశుకము. అను పదములకు రెండర్థములుండుటచేతను, మనకు మఱియొక యర్థము స్ఫురించుచున్నది. అది యప్రస్తుతమే కాని స్ఫురించుచున్నది. ఒక నాయికానాయక వ్యవహార మిందుఁ గోచరించుచున్నది. ఇదియే యిట వ్యంగ్యార్థము.

---

* ఉపోఢరాగేణ=అతిశయమైన రాగమును (ప్రేమను) ధరించిన.శశినా = చంద్రునిచేత (ఉపనాయకునిచే నని గమ్యము) విలోలతారకం = చంచలమైన నక్షత్రములుగల (చంచలమైన కనుగ్రుడ్లుకల) నిశాముఖం = రాత్రియొక్క ప్రారంభము (నాయికయొక్క ముఖము) తథాగృహీతమ్ = ఆవిధముగా గ్రహింపఁబడినది- అనఁగాఁబ్రకాశింపచేయఁబడినది —(ముద్దిడుట కుపక్రమించినాఁడు)

♦ యథా = ఎట్లనఁగా, పురః = ముందు, అనఁగా తూర్పుదిక్కున (తనముందు) రాగాత్ = సంధ్యాకాలపు, ఎఱుపురంగుతరువాత, (ప్రేమవలన) తయా = రాత్రి) చేత (నాయికచేత) సమస్తం = అంతయు, తిమిరాంశుకం = చీకటియనెడి వస్త్రము (నల్లనివస్త్రము) గలితమపి = పోయినను (జాఱిపోయినను) నలక్షితం = చూడఁబడలేదు-

ఉపనాయకుఁ డొకఁడు ప్రేమభరమున నాయికను ముద్దిడు కొనుటకై తటాలున నామె ముఖమును గ్రహించినాఁడు. ప్రేమవశమున నామెయు, మైమఱచినది. తన వస్త్రము జాఱిపోయిన విషయమునైనను దెలిసికొనలేకపోయినది. ఇది వ్యంగ్యార్థము. నిజమున కిది ప్రస్తుతమగు సంధ్యాసమయవర్ణనతో సంబంధించినది కాదు. కాని నిశాశశాంకులయందుఁ గవి, నాయికానాయక వ్యవహారము నారోపించి, చమత్కృతిని చూపినాఁడు. నిశాశశాంకుల వ్యవహారమే యీ శ్లోకమునకుఁ బ్రధానతాత్పర్యము. కాని కేవల నిశాశశాంకులు గాదు. సమారోపిత నాయికానాయక వ్యవహారముగల నిశాశశాంకులే ఈ శ్లోకమున వర్ణితులైనారు. కావుననే, ప్రతీయమానార్థముతోఁ గలిసియున్న వాచ్యార్థమే ఇచట ప్రధానముగ భాసించుచున్నది.

ఇంతవఱకుఁ బై శ్లోకమున కర్థమును తెలిసికొనినాము. ఇఁక నిచట విషయ మిది. ఇచట నిశాశశాంకవిషయకమైన వాచ్యార్థము ప్రస్తుత సందర్భమునకు తగియుండుటచేఁ బ్రధానమైనది. కాని, "ప్రతీయమానార్థమగు నాయికానాయక వ్యవహారమును" నుంచుకొనినపుడీ వాచ్యార్థము, దానికి నుపసర్జనమే (అప్రధానమే) యైనది గదా. అనఁగా, ప్రతీయమానార్థమును సాధించుట కిచ్చట వాచ్యార్థము సాధనమే యైనది. సాధ్యమునకు సాధనమెప్పుడును నుపసర్జనమే యగును. అందుచే వాచ్యార్థమున కిచటఁగూడ నప్రాధాన్యమేగాని ప్రాధాన్యము లేనేలేదు. అందుచే సమాసోక్త్యాద్యలంకారములయందు ధ్వని లక్షణము వర్తింపకుండఁ జేయుటకై, ధ్వని లక్షణమున "అర్థముపసర్జనీకృతాత్మౌ" యని యన నక్కఱలేదు.

<u>ఆక్షేపము:</u>—పై వాదము సమంజసము కాదు. ఇది ప్రధానము. ఇది అప్రధానము అనుటకు ఆధారము, ప్రకరణము (సందర్భము) గాదు. మఱే మనఁగా "చారుత్వము"- చారుత్వమున కేది కారణమో అది ప్రధానము. ప్రస్తుతము సమాసోక్త్యలంకారమున వ్యంగ్యార్థము కంటె వాచ్యార్థము ఎక్కువ సుందరముగ నుండుటచే నిదియే ప్రధానమని మే మనుచున్నాము. అందుచే నిట వాచ్యార్థమున కప్రధానత కుదురుట యెట్లు!

సమాధానము:- -ఒకవేళ నిట వాచ్యార్థమునకు ప్రాధాన్యము లేదని యొప్పుకొన్నను, "అర్థ ముపసర్జనీకృతాత్మనౌ" యనుట నిష్ప్రయోజనమే- ఏలన, గుణీభూతవ్యంగ్యకావ్యమునందును వాచ్యార్థమునకే కాక, ఒకప్పుడు వ్యంగ్యార్థమునందుఁగూడ చారుత్వాతిశయము కన్పడుచున్నదని మేము కావ్యవైశిష్ట్యనిరాకరణ ప్రస్తావమున నిరూపింపఁబోవుచున్నాము. అందుచే నెటుచూచినను ఈ విశేషణము నిష్ప్రయోజనమే యని సిద్ధాంతము చేయుచున్నాము. ♦

2. యత్రార్థః శబ్దోవా- అనుచో, "శబ్దః" అను పదప్రయోగము కూడ వ్యర్థమే- తనకుఁగల యర్థమును తెల్పుట యొకటియే, శబ్దమునకుఁగల వ్యాపారము. వేఱొక వ్యాపారము లేనేలేదు. వస్తువును ప్రకాశింపఁజేయుట యను నదొకటియే దీపమునకుఁ గల వ్యాపారమైనట్లే, అజ్ఞాతజ్ఞాపనమొకటియే శబ్దమునకుఁగల వ్యాపారము. తన అర్థమును దా నుపసర్జనముగఁ జేసికొనుటయను వేఱొక వ్యాపారము శబ్దమునకు లేనేలేదు. శబ్దము తన యర్థము నుపసర్జనముగఁ జేయుట యనునది, అనుకరణస్థలమునందు మాత్రమే కన్పడును.

ఉదా:— తం కర్ణమూలమాగత్య రామే శ్రీః న్యస్యతామితి
కైకేయీశంకయేవాహ పలితచ్ఛద్మనా జరా —
(రఘువంశము 12-౨)

---

♦ ఇట్లు తనవాదమునంతయుఁ జెప్పినతరువాత, గ్రంథకర్త, తనవాదమునంతయు సూత్రప్రాయముగఁ దెల్పుశ్లోకము నొకదానిని వ్రాయును. దీనిని సంగ్రహశ్లోకమందురు. ఇందులోఁగూడఁబూర్వోక్తమైన వాదమేయుండుటచే, ఈసంగ్రహశ్లోకములకుఁ బ్రత్యేకముగఁ దెనుఁగువ్యాఖ్య వ్రాయుట వ్యర్థమనితలఁచి, మూలమున వీని నిచ్చుటలేదు. అయినను, ప్రతివాదాంతమునను, పాఠకులసౌకర్యముకొఱకై, పుటల కడుగుభాగమున వానినిగూడ నిచ్చుచున్నాను. అవసరమైనపుడుమాత్రమే యర్థము వ్రాయఁబడును.—ఈవాదాంతమునందలి సంగ్రహశ్లోక మిది—

"ఉక్తం గుణీకృతాత్మత్వం యదర్థస్య విశేషణమ్,
గమకత్వాన్న తత్ తస్య యుక్తమవ్యభిచారతః"

తా. అర్థమునకు, ఉపసర్జనీకృతాత్మమై అను విశేషణము, వ్యర్థము. ఏలన, అది ప్రతీయమానార్థమునకు సాధనమే యైనపుడు తప్పక ఉపసర్జనమేయగును. ఉపసర్జనము కాకుండుట యనునది లేనపుడీ విశేషణమువలనఁబ్రయోజనమేమి ?—

తా. దశరథుఁడు ముసలివాఁడైనాఁడు. చెవిదగ్గఱ వెండ్రుకలు కూడ నరసినవి. వెండ్రుకలు నరయుటయను నెపమున, ముసలితనము, కైకేయి వినిపోవునేమోయను భయముననో యనునట్లు, దశరథుని చెవిలో రామునకు రాజ్యపట్టాభిషేకము చేయుమని చెప్పినది.

శ్లోకమునందు "రామే శ్రీః న్యస్యతాం" అనుపద సమూహము తరువాత ఇతి (=అని) శబ్దమున్నది, ఇట్లుండుటచే నిది అనుకరణశబ్దమని తెలియుచున్నది. ముసలితనము చెప్పినవాక్యము అనుకార్య శబ్దము, ఆ వాక్యము ఈ శ్లోకమున ననుకరింపఁబడినది. శ్లోకమునందలి "రామే శ్రీః న్యస్యతామ్" అను శబ్దసమూహమునకు, ఆ శబ్దసమూహస్వరూపమే యర్థము. అనఁగా అనుకార్యశబ్దమే అనుకరణశబ్దమున కర్థమైనది. అనుకరణశబ్దమునకు సామాన్యముగ, మన ముందుననుకొను రామునియందు రాజ్యలక్ష్మి నుంచుము అను నర్థము లేదని తెలియవలెను. ఇచ్చట ఈశబ్దమునకు సహజముగఁ గలయర్థము అప్రధానమై శబ్దస్వరూపమే భాసించుచుండుటచే ననుకరణస్థలమునందు మాత్రము, అనుకరణశబ్దము, తన యర్థము నప్రధానముగఁ జేసికొనునని తెలియుచున్నది.

అగుచో నిచ్చట నర్థప్రతీతి కలుగుట యెట్లందురా? అనుకార్యశబ్దమే యర్థమును చెప్పును. అనుకార్యమైన శబ్దములు రెండు విధములు. సార్థకములు, నిరర్థకములు;- ఈ శ్లోకమునందలి యనుకార్యశబ్దమునకు వ్యవహారయోగ్యమైన యర్థము కలదు. అందుచే నిది సార్థకము. పటత్ పటత్ ఇతి—కుహ కుహ అని మొదలగు తావులనున్న యనుకార్యశబ్దమున కాశబ్దస్వరూపమే యర్థముకాని, వ్యవహారయోగ్యమైన వేఱొక యర్థములేదు. అందుచే నివి నిరర్థకానుకార్యశబ్దములగుచున్నవి.

---

♦ జరా = ముసలితనము, పలితచ్ఛద్మనా = వెండ్రుకలు నరయుట అను నెపమున, కైకేయీశంకయా ఇవ = కైకేయి వినిపోవునేమోయను సంశయము చేతనాయన్నట్లు, కర్ణమూలమ్ ఆగత్య = చెవిదగ్గఱకువచ్చి, "రామే శ్రీః న్యస్యతామ్ = రామునియందు రాజ్యలక్ష్మి నుంచుము ఇతి = అని, తం దశరథం ఆదశరథునుద్దేశించి, ఆహ = పలికెను.

ఈ విధముగ ననుకరణస్థలములందు, అనుకార్యమగు శబ్దము నుండియే వ్యవహారయోగ్యమగు నర్థము సిద్ధించుచున్నది కాని, అనుకరణశబ్దమునుండి కాదు. అనుకరణశబ్దమునకుఁ గల యర్థ మప్రధానముగనే యుండునని తేలినది.

అనుకరణేతరశబ్దము తన యర్థము చెప్పునపుడును, అనుకార్య శబ్దము తన యర్థమును జెప్పునపుడును, శబ్దమే యర్థమున కుపసర్జనమగును. అర్థమునకు శబ్దము సాధనమే యగును.

ఇట్లనుకరణేతరస్థలములలో నర్థమును దెల్పుటకొరకే శబ్దముండుటవలన, శబ్ద మెప్పుడును, అర్థమున కుపసర్జనమయియే తీరును. కాకుండ నుండనే యుండదు. అగునపుడు "శబ్దము తన యర్థము నుపసర్జనముగాఁ జేసికొని" అని ప్రత్యేకముగఁ జెప్పుటవలనఁ గలుగు ప్రయోజనమేమి? ఉదకమును దీసికొని వచ్చుటకై సాధనముగఁ గుండను దీసికొని వచ్చినాము. ఇచట నుదకము ప్రధానము, కుండ యప్రధానము. దీనికి విపరీతముగఁ గుండయే ప్రధానమై, ఉదక మప్రధానముగ నగుట యెప్పుడైనఁ దటస్థించునా? తటస్థింపదు. లేనిచో, ఇది ప్రధానము, ఇది అప్రధానము, అను వ్యవస్థయే కుదురదు. ఈ విధముగ శబ్దమున "కుపసర్జనీకృతార్థత్వము" అను లక్షణ మెచటను సంభవము కాకుండుటచే నిచట నసంభవమనుదోషము వచ్చినది.

ఇట నొకయాక్షేపము రావచ్చును- గుణీభూతవ్యంగ్యమునందు, చారుత్వవిషయమున, వ్యంగ్యార్థముకంటె వాచ్యార్థము ప్రధానముగ నుండుటచే,అట్టి స్థలములను వారించుటకై, "అర్థము గుణీకృతాత్మమై" అని ప్రయుక్తమైనదని ఇదివఱకే తెల్పితిమి - శబ్దమువిషయమునఁ గూడ-"ఉపసర్జనీకృతార్థమై" యను విశేషణమునశ్యమే - ప్రతీయమానార్థమును తెల్పుటయందు, శబ్దము తనవాచ్యార్థమును, ఉపసర్జనముగాఁ జేసికొనుటలేదా? - అందుచే నీరెండువిశేషణములును సార్థకములేగదా—

సమాధానము :—ఒకవేళ, ఇట్లని యంగీకరించినను, - లక్షణమున దోషము పో లేదు. అర్థాన్తరము నభివ్యక్తి సేయుటకై ప్రయుక్త

ములైన శబ్దార్థములకు 'ఉపసర్జనీకృతస్వార్థత్వము,' మనము చెప్ప
కయే సిద్ధించినది - అట్టిచో మనము తిరిగిచెప్పుట పునరుక్తియే
యగును.—

ఆక్షేపము:—పార్థుఁడే ధనుర్ధరుఁడు - ఇతరుఁడుకాఁడు - అనువా
క్యములలో, 'ఇతరుఁడు కాఁడు' అనువాక్యము, పూర్వవాక్యస్వరూప
స్వభావములను దెల్పుట కుపయుక్తమైనట్లే, ఇచటఁగూడ ఈవిశేషణ
ములు, స్వరూపమాత్రానువాదఫలములే యని యేలచెప్పఁగూడదు ?

సిద్ధాంతి సమాధానము:—అదియును పునరుక్తియేయగును.—

శబ్దమునకు, వాచ్యార్థమును తెల్పు అభిధావ్యాపారముకంటె
భిన్నమైనవేఱొక వ్యాపారము లేదని సిద్ధాంతముచేసినాము - ఈసిద్ధాం
తము ననుసరించి, ధ్వనికర్త యిచ్చిన - 'సువర్ణపుష్పాం పృథివీం' అను
నది సుసంగతము కానే కాదు.

'సువర్ణపుష్పాం పృథివీం చిన్వన్తి పురుషాస్త్రయః
శూరశ్చ కృతవిద్యశ్చ యశ్చజానాతి సేవితుమ్'.

'శూరుఁడు, విద్యానిష్ణాతుఁడు, సేవించుట నెఱిఁగినవాఁడు -
అను నీముగ్గురు పురుషులును, భూమిని బంగారు పూవులుపూఁచు
దానినిగాఁజేయుదురు' అని తాత్పర్యము - ఇచట భూమి బంగారు
పూవులను బూఁచుటయను నర్థ మసంగతముగనున్నది. అందుచే వాచ్యా
ర్థమిచట వివక్షితముగాదు లక్షణావ్యాపారము నాశ్రయించి, ఆశూ
రాదులు, సులభముగ సంపత్సమృద్ధినొందుదురను నర్థమును దెల్పుచు
న్నది. శూరాదుల ప్రాశస్త్యమిట ధ్వనించుచున్నది.

ఈశ్లోకమును, అవివక్షితవాచ్యధ్వని కుదాహరణముగా ధ్వని
కర్త యిచ్చినాఁడు. ఇది లక్షణామూలమైన ధ్వనియగును - లక్షణా
వ్యాపారమను నదొకటియున్నచో నప్పుడిది సిద్ధించును. అభిధకంటె
నితరమైన వ్యాపారమే లేనపుడిఁక లక్షణయనుకారణము, దానినుండి కలి
గినధ్వని యనుఫలము నుండుటెట్లు? కావున నిది సహజమైన స్వరూపమే
లేని కార్యకారణధర్మముల నాశ్రయించినదే కాని, సిద్ధమై, సుసంగతమై

నదికాదు. అందుచే "సువర్ణపుష్పాం" అను శ్లోకమును వివక్షితవాచ్య ధ్వని కుదాహృతియనుట చెల్లదు.

3. ధ్వనికారుని లక్షణములో, అర్థమును, శబ్దమును చెప్పినట్లే, శబ్దార్థవ్యాపారరూపమైన యభిధనుగూడఁ జెప్పవలసియున్నది. అట్లు చెప్పకుండుటవలన, అవ్యాప్తియను దోషము కలిగినది. ఈదోషముండుటచే, ధ్వనియున్న స్థలములలోఁగూడ నీలక్షణము కొన్నిచోట్ల పట్టదు. ఉదాహరణమునకు, దీపకాలంకారముమండి యుపమాలంకారము భాసించుచున్నది. అనఁగా, ఉపమాలంకారము ధ్వనించుచున్నది. - అలంకారములనునవి భంగిభణితులలో, (వక్రోక్తులలో) నొకరూపమే యగుటచే, నవి యభిధాస్వరూపములేయని సిద్ధాంతము. వాచ్యార్థస్వరూపములుగావు. - ప్రస్తుత మభిధను 'యత్రార్థశ్శబ్దో వా' అను లక్షణమునఁ జేర్పకపోవుటచే నభిధారూపములైన యలంకారము లుపసర్జనీకృతస్వార్థములై, వేఱలంకారములను భాసింపఁజేయు చోట ధ్వనిలక్షణము పట్టుటలేదుగదా!

ధ్వనివాది ఆక్షేపము.

"అలంకారా స్తరస్యాపి ప్రతీతౌ యత్ర భాసతే
తత్పరత్వం న వాచ్యస్య నాసౌ మార్గో ధ్వనేర్మతః".

'వేఱొక యలంకారము భాసించుచున్నను, వాచ్యార్థము తత్పరముకా నప్పుడది ధ్వనికి విషయముగాదు.' అని ధ్వనికర్త చెప్పినాఁడు. ఇచట, దీపకాలంకారము, ఉపమాలంకారపరముగ లేదు. అందుచే నిట్టిచోట్ల ధ్వని లేదని తేలినది. ఇచ్చట ధ్వనియున్నదని, ధ్వనికర్త యంగీకరించినాఁడు, మీరు, ధ్వనిలక్షణమిచట పట్టదని దోషమును జూపవచ్చును. ఇపు డాయవకాశమేలేదుగదా!

<u>సిద్ధాంతి:</u>—ఇచట ధ్వనిని నిషేధించుటకు, హేతువు "వాచ్యము వ్యంగ్యపరముగలేద"నియేగదా ! ఆహేతు వేకుదురదు. ఇచట నున్న ఉపమానోపమేయభావమును ప్రధానముగ తెల్పుటకే యియ్యే,

దీపకాలంకారమనుభంగీవై చిత్రి ఆశ్రితమైనది. - కావున, దీపకాలంకారము ప్రతీయమానమైన ఉపమాలంకారపరముగ నేయున్నది. — ప్రతీయమానమగు నుపమాలంకారమే ఎక్కువ సుందరముగగూడ నున్నది. చారుత్వాతిశయ మెచ్చటనున్నదో అచ్చట ధ్వనియనియే గదా సిద్ధాన్తము. - ఈవిధముగ వాచ్యము ప్రతీయమానపరముగ లేదను హేతువే యసిద్ధమైనపుడు, సాధ్యమైనధ్వని ప్రతిషేధసిద్ధి ఎట్లు కలుగును. అందుచేఁ బై శ్లోకమున ధ్వనిలేదనుట సమంజసముకాదు.

ఆక్షేపము :—అట్లనుకొనినను, అభిధనుగూడ ప్రత్యేకముగ నేల చెప్పవలయును? అభిధావ్యాపారములేనిదే యర్థప్రతీతియే కలుగదు గదా? "శబ్దార్థము లుపసర్జనీభూతస్వార్థములై" యని యెపుడు తెల్పినామో, అపుడభిధకుఁగూడ పై విశేషణము, మనము చెప్పకున్నను సిద్ధించుచునేయున్నదిగదా!

సిద్ధాంతి :—అగుచో, అర్థమునకొకదానికే, "ఉపసర్జనీకృతాత్మమై" యను విశేషణమును చెప్పుచోసరిపోవును. శబ్దమునకుఁ బ్రత్యేకముగఁ జెప్పనక్కఱలేదు. - అభిధావ్యాపారమునకును శబ్దమునకు నీవిషయమున భేదములేదు. అభిధకు, చెప్పకున్నను, ఉపసర్జనీకృతార్థత్వము సిద్ధించినట్లే, శబ్దమునకును సిద్ధించును. కావున లక్షణవాక్యమునందు శబ్దగ్రహణముచేయుటవ్యర్థము. కాదందురా, అభిధాగ్రహణముకూడఁ జేయవలయును.

ఇంకొకవిషయముకూడనున్నది. - తనకుఁగల యర్థమును దెల్పుటతోనే శబ్దమునకుగల సామర్థ్యము సమాప్తమగును. అట్టిశబ్దమునకు, వేఱొకయర్థమును దెల్పుటకు, వ్యంజనయను వ్యాపారము నొకదానిని కల్పించుటయు, ఇందుకై ఉపసర్జనీకృతార్థత్వమను మఱియొక విశేషణమును శబ్దమునకు కల్పించుటయు సమంజసముకాదు. - ఉపపత్తిమూలమున, అనఁగా సామర్థ్యవశమున ఉపసర్జనీకృతాత్మతసిద్ధించుట యర్థమునకేగాని శబ్దమునకులేనేలేదు. అందుచే లక్షణమున శబ్దగ్రహణముచేయుట దోషావహమేయని నిశ్చితాభిప్రాయము.

శ్రీ

భాగవతము

హరిభట్టారక ప్రణీతము

# ఏకాదశస్కంధము

శా. శ్రీరాజత్కుచకుంభ యుగ్మ నిహిత శ్రీగంధ సంవాసితో
దార స్వీయభుజాంతరాళ విచలద్రత్న ప్రభారంజితుం
గారుణ్యైక నివాసు వాసవపయోనాథాదిసంసేవితుం
గారావంబున సన్నుతింతుఁ ద్రిగజత్కళ్యాణమూర్తిన్ హరిన్. 1

క. మనమున రఘునాయక పద
వనరుహ యుగళంబు దలఁచి వైభవలీలన్
దినదినము హర్ష మందెడి
హనుమంతుని సన్నుతింతు ననురాగమునన్. 2

సీ. గురుతరమాణిక్య కుండలద్వయదీప్తి
మండితగండ యుగ్మంబువాని
బాలభానుప్రభా భాసుర సంరక్త
సలలిత వక్త్రాంబుజంబువాని
కాంచనశైల సంకాశదేహమున య
జ్ఞోపవీతంబు చెన్నొందువాని
కౌపీనమేఖలా కలితకటిస్థల
స్థాపితపుష్పగుచ్ఛములవాని
వాలరోమాగ్ర నిర్భిన్న వారివాహ
సంఘనిష్ఠుర నిర్ఘోష చలితభువన
నిర్జితేంద్రాది సన్నుత నిజచరిత్రు
బాహుబలవంతు హనుమంతుఁ బ్రస్తుతింతు. 3

శా. బంధూకప్రసవాతిరక్తవదనుఁ బ్రఖ్యాతునిం రామహృ
ద్బంధున్ వాయుతనూభవున్ దలఁచి విద్వత్కోటి మద్వాగ్విభూ
తిం ధాత్రిన్వి నుతింప భాగవతమం దేకాదశద్వాదశ
స్కంధంబుల్ దెనిఁగింతుఁ బూర్వకథిత స్కంధానుసారంబునన్. 4

క. మారుతసుతుఁ డఁట కృతిపతి
పారీణత భాగవతము పలికెడి దఁట యీ
సారస్య మిచట గల్గఁగ
వేఱొక మార్గమునఁ బోవు వెఱ్ఱియుఁ గలఁడే. 5

క. శ్రీ రాఘవపద సేవా
పారాయణ భక్తలోక బహుళాపన్ని
స్తారకరజనీచరసం
హారాధిక జయసనాథ హనుమన్నాథా! 6

వ. నారాయణ చరణకమల ధ్యానామృతపాన పరవశులగు శౌనకాది
మునివరులకు సకలవేద వేదాంత పురాణేతిహాస కథావ్యాఖ్యానవైఖరీ
సమేతుం డగు సూతుం డిట్లనియె; నట్లు పరీక్షిన్నరేంద్రునకు శుక
యోగీంద్రుం డిట్లనియె. 7

క. జననవ్యాధుల కౌషధ
మనయంబును గర్మబంధహరణము తిరమై
వినుము నృపాలక! హరికథ
వినిపించెదఁ గర్ణములకు వేడ్క దలిర్పన్. 8

సీ. అంతట శ్రీకృష్ణుఁ డధికసైన్యముఁ గూడి
సకలరాక్షస బలక్షయముచేసి
హర్షంబుతోడుత నఖిలభూభారంబు
మానిచి సురలు సమ్మతమునొంద
దుర్ద్యూత హేళనాదులు నిమిత్తముచేసి
పాండవకురుభూమిపాలబలము
లను జంపి నందాదులకును సంతోషంబు
కావించి లోకరక్షణముచేసి

యంతలోపల నిజభక్తు లైన యాద
వుల సమూహంబు చెలరేఁగి పాదవఁ జూచి
ఋషుల శాపంబు దలపోసి రోషమంది
తద్వినాశము సేయంగ దలఁచి యపుడు. 9

మ. విదితుండై సకలామరుల్ వొగడ నుర్వీభారమున్ మాన్పిదు
ర్మదసంయుక్త వసుంధరాధిపతులన్ మర్దించి కంసాదులన్
దుదముట్టన్ వధియించి కృష్ణుఁ డతిసంతుష్టాత్ముఁడై యున్నచో
యదుసైన్యంబులు భూమిలోనను నసహ్యం బయ్యె నత్యుగ్రమై. 10

వ. ఇవ్విధంబున యశోదానందనుండు పూతన, కేశి, ప్రలంబ, తృణావర్త, శకట, ధేనుక, వత్స, ముష్టిక, చాణూర, కంస, సాల్వ, శిశుపాల దంతవక్త్రాదులం బరిమార్చి దుర్ద్యూతనిమిత్తంబునఁ గురుపాండవసైన్యంబుల నేపణంచి యంత నిజసేవాపరులైన యాదవులబలంబు లుదిలంబులై భూమికి వెక్కసంబులై ప్రకాశిలుచు వర్తించునెడ వారలం జూచి మనంబున నిట్లనియె.

గీ. మత్సమర్పిత శక్తిచే మలయుఁ గాన
నన్యపరిభవమెటుఁగ దీయదుబలంబు
వీరిఁ బరిమార్ప నేఁదక్క వేఱె మఱొక
దైవ మోపునె త్రిభువనాంతరములందు. 12

క. అని విప్రశాపమూలం
బున యాదవబలము నణఁచి భూభారము మా
న్చిన మీఁదఁ బరమపదమును
జనియెన్ వసుదేవసుతుఁడు సంరంభమునన్. 13

వ. అని పలికిన మునివరునకు రాజవరుం డిట్లనియె. 14

సీ. బ్రహ్మణ్యులై జగత్పావనమూర్తులై
వాసుదేవాంఘ్రి సేవాధురీణు
లగునట్టి యాదవులకు నెట్లు భూదేవ
శాపంబు దగిలె నాశాప మెట్లు

హరి మాన్పలేఁడయ్యె నఖిలలోకేశ్వరుఁ
డతనికి సమ్మతంబయ్యె నెట్లు
యే మూలమున వచ్చె నీశాపకాలాగ్ని
నేరీతి హతమయ్యె నీబలంబు
నిట్టి వృత్తాంతమంతయు నేర్పడంగ
విమలవాక్ప్రౌఢితోడుత విస్తరించి
శ్రవణపుటయుగ్మమునకు నుత్సాహ మొదవ
నఖిలమునిలోకవంద్య నా కానతిమ్ము. 15

వ. అవి పలికిన నరపాలపుంగవునకు యతిపుంగవుం డిట్లనియె. 16

క. విను భూపాలక యాకథ
వినిపించెద మనములోన వేడుక పుట్టన్
ఘనతర మద్వాగ్విభవం
బునఁ దోఁచినకొలఁది నధిక మోదముతోడన్. 17

క. నిరుపమసుందర దేహము
ధరియించి సమస్తకర్మతత్పరుఁడై యా
చరణంబుచేసి ధర్మము
హరి మనమునఁ దలఁచె నణఁప యాదవబలముల్. 18

వ. ఆసమయంబున జటావల్కల జపమాలాదండకమండలు సహితులైన విశ్వామిత్ర, అశిత, కణ్వ, భృగ్వాంగీరస, కశ్యప, వామదేవ, అత్రి, వసిష్ఠ నారదాది మునివరులు స్వేచ్ఛావిహారంబున ద్వారకానగరంబున కరుగుదెంచి, యందు మంజుశింజానమంజీర కీలిత వివిధ రత్నకాంతిచ్ఛటాపుంజ పింజరిత పాదాంబుజాత యుగళుండును ఝుణ ఝుణత్కార ముఖర రత్న ఘంటికాసమంచిత కటిస్థల విరాజమాన పీతాంబరాలంకృతుండును నానావిధరత్నహార దేదీప్యమాన వక్షస్స్థల నిత్యనివాస లక్ష్మీసమాలోకన స్మితముఖాంబుజాతుండును అంబుజాత సమానకరకంకణ క్రేంకారసంకుల దశదిశాభ్యంతరుండును

అభ్యంతరనిలయ చతుర్దశభువన పరిపూర్ణుండును పూర్ణాబ్జమండల
స్వచ్ఛకపోలస్థల విలంబమాన మకరకుండల ద్వయదీప్త శ్యామ
లలితకంబుకంధరుండును కంధరపోత నికరశ్యామల నిజాకారభాసు
రుండును సురనికరమౌళిరత్ననానావిధరంజిత పాదాభిరాముండును
నిజకిరీట సముల్లసద్గారుత్మతమణి సహస్రద్యుతి పిశంగీకృత నిజాస్థాన
ప్రదేశుండును కరుణారస పరిపూర్ణ కటాక్షవీక్షాసముజ్జ్వలుండును
శంఖచక్రగదాసిశార్ఙ్గాద్యుదాయుధ ధరుండును మదనకోటిలావణ్య దేదీ
ప్యమానుండునునైన యప్పుండరీకాక్షుం గనుంగొని తత్సమర్పితసవిన
యార్ఘ్యపాద్యంబు లంగీకరించి హేమాసనసమాసీనులై మునివరులు
వాసుదేవ సమ్ముఖంబున నిట్లనిరి. 19

క. దలముయిన కలుషజాతము
దొలఁగును భాగ్యంబులెల్ల దూకొనఁగలిగెన్
ఫలియించెను మాతపములు
ఫలములు నేఁ డంబుజాతపత్త్రశుభాక్షా. 20

చ. కలిగెను నేఁడు భాగ్యములు కంటిమి నీపదపద్మయుగ్మమున్
బొలిసెను పాపసంఘములు పోయె నవిద్య సమస్తయోగి హృ
జ్జలరుహ మధ్యవర్తి వగు శాశ్వతమా నిజమూర్తి నిచ్చటన్
నెలకొని చూడఁగల్గె నిదె నిర్మలమైన విలోచనంబులన్. 21

సీ. ఒకవేళఁ బరమాణువులకన్న మిక్కిలి
సూక్ష్మరూపముదాల్చి సూక్ష్మమగుదు
వొకవేళ విభురూప మొనరించి వేడ్కతో
విశ్వంభరుండవై వెలయుచుందు
వొకవేళ సగుణంబు నొంది రుద్రాదులు
వినుతింపనుందువు విమలచరిత
యొకవేళ నిర్గుణయుక్తమై యోగీంద్ర
మానసంబులయందె కానఁబడుదు

విట్టిరూపంబు వాఁడని యెట్లు నిన్ను
నిశ్చయమ్ముతోడఁ దెలియంగ నేరనగునె
వామనాచ్యుత గోవింద వాసుదేవ
నీమహత్త్వము నేము వర్ణింపఁగలమె. 22

సీ. నీనామకీర్తన నిఖిలమర్త్యస్తోమ
పాపతూలాహార్య పవనసఖుఁడు
నీపాద యుగభక్తి నిర్మలకమలాల
యాకర్షణంబున కాశ్రయంబు
నీగుణశ్రవణంబు నిబిడజన్మార్జిత
కర్మపాశచ్ఛేద కర్తరగును
భవదీయసద్భక్త పదసేవ ముక్తికి
బాటయేర్పఱుచు చొప్పరి ముకుంద
సర్వపరిపూర్ణ సర్వేశ సర్వతుల్య
నీ నిజాకార మిట్లని నిర్ణయింప
నెమ్మితోడుత వర్ణింప నిర్జరేంద్ర
హరవిరించాదులకునైన నలవియగునె ? 23

క. శ్రీనాయక నీనామము
నానావిధకర్మరోగనాశమునకు వి
జ్ఞానంబగు నౌషధ మిది
గానరు దుష్టాత్ములకట ! కంజదళాక్షా ! 24

వ. అని సన్నుతించిన మునివరుల వీక్షించి వసుదేవకుమారుం డిట్లనియె.

మ. భవరోగఘ్నము లిందుశేఖరహరిబ్రహ్మాది ధార్యంబు లు
త్సవసన్మంగళ కారణంబు లోగి సంతాపఘ్నముల్ నిత్యసం
భవపాపచ్ఛిదముల్ జయప్రదము లెప్పాటన్ మత్తెల్లప్పుడున్
భవదీయాంఘ్రిసరోజసంజనిత విభ్రాజ ద్రజఃపుంజముల్. 25

క. ధరణీసురుల మనంబుల
పరితాపము మాన్చి వారి భక్తిని భజియిం
తుర యెవ్వ రేని వారికి
సిరి యాయువు గలిగియుండుఁ జిరకాలంబున్. 26

వ. అని పలికి వెండియు, 27

క. విచ్చలవిడి మును లందఱు
నిచ్చట మామీఁది భక్తి నెలమి దలిర్పన్
విచ్చేసినకారణ మిది
చెచ్చెర నా కానతిండు శీఘ్రముతోడన్. 28

వ. ఇట్లు బలభద్రానుజుండు పలికిన మునులి ట్లనిరి.

క. వనజాతరమ్యలోచన
మునిహృదయాంతర్నివాస మోదముతోడన్
బనివింటిమి నిను దర్శిం
పను నింతకు నెక్కుడైన పనులుం గలవే. 29

వ. అని సన్నుతించి మునువరులు నిజనేత్రచకోరంబులచే వాసుదేవ
వదనచంద్రచంద్రిక పానంబుచేసి తద్విసృష్టులై ద్వారకానగరంబున
కనతిదూరంబున పిండారకంబను పుణ్యతీర్థంబున కఱిగి రంత. 30

సీ. దర్పితులైన యాదవకుమారులు గూడి
జాంబవతీసూను సాంబుఁ బిలిచి
సకల భూషణములు సమకూర్చి వానిని
గామినిరూపంబుగా నొనర్చి
మూకలై నవ్వుచు మును లున్నచోటికిఁ
జని దుర్వినీతులై సాగ్రిమొక్కి
యడుగ సిబ్బితిపడి యట మాటుపడియున్న
దీగర్భవతియైన యింతి కెవ్వ
రుదయమయ్యెద రూహించి హృదయమందు
నట్టి వృత్తాంత మంతయు నానతీయ
వలయు నని పల్కి ముందఱ నిలచినట్టి
డింభకులఁ జూచి మునులు సంరంభమునను. 31

కవిరాజ విరాజితము.

అని యదుబాలకు లాడిన మాటలు మునులందఱు నాత్మఁదలం
చినఁ బరిహాసముచిహ్నలు దోఁచిన జిఱ్ఱనఁగోపము చిత్తములం
దెసయఁగ మోముల నెఱ్ఱలు దేరఁగ నీపశుబాలుర నీక్షణ చే
సిన యటమీఁదట జిహ్వల నిప్పులు చెచ్చెర రాలఁగఁ జెప్పి రయో!

క. వాలాయము యదుకుల ని
ర్మూలకరంబైన యట్టి ముసలం బొక డి
బ్బాలిక కుదయించుం బొం
డాలస్యము లే దటంచు నటఁ బల్కుటయున్. 33

వ. అంత మదోద్రేకాంధులైన యదుబాలకులు మునుల శాపదగ్ధులై వణంకుచు సాంబుకుక్షి సిక్షిప్తచేల గ్రంధిమోచనంబు సేయు సమయంబున ముసలం బొక్కటి భూతలంబంబునఁ బతితంబైన విస్మయం బంది, దానిం బట్టుకొని వాసుదేవసమక్షంబున కరుగుదెంచి యేత త్కథావృత్తాంతం బెఱింగించిన నంత నాత్మకల్పితమాయారూపం బగుట యెఱింగియు నెఱుంగని యట్ల వారలం జూచి యిట్లనియె.

చ. మదిమదినుండి యాదవకుమారకులెల్లను మూఁకమూఁకలై
మదమునఁ గన్నుఁగానక సమగ్రతపోమహిమానురక్తులై
పొదలెడు సన్మునీశ్వరుల బొంకఁగఁ జేయుద మంచు వారలం
గదియఁగఁ బోవఁగా దరలెఁ గ్రక్కున శాపము నాశహేతువై. 35

ఆ. ఇట్టి విప్రశాప మేరీతినైనను
నడ్డుపెట్ట నొరుల కలవిగాదు
శర్వ కమలజాత శక్రాదులైనను
దిరుగఁబెట్టలేరు తెలిసిచూడ. 36

వ. అది గావున — 37

ఉ. వారిధితీరమందు నొకవర్ణితమైన మహోపలంబు వి
స్తారముతోడ నున్నయది చక్కఁగ మీరట కేఁగి యాదవుల్
దారుణ బాహుసత్త్వములు దప్పక యీ ముసలంబు నూఱఁగాఁ
జారిన చూర్ణమంతయును జల్లుఁడు నీటఁ బడంగ సంగతిన్. 38

వ. అని యివ్విధంబునఁ గృష్ణుం డానతిచ్చిన యదువీరులమ్ము
సలంబుపట్టుకొని సముద్రతీరంబునం గలుగుమహోపలంబుమీఁద జూర్ణం
బుగాఁ దివిచి జలంబులం గలిపి తత్కీలితమగు లోహఖండంబును
సరకుసేయక సముద్రంబునం బడవేయ నది మత్స్యంబు గ్రహించు
టయు, నామత్స్యంబును లుబ్ధకుండు జాలమార్గంబునఁ బట్టి తదు
దరగతంబైన లోహఖండంబును బాణాగ్రఫలంబుగా నొనరించుట
యును నిట్లు తత్కథావృత్తాంతం బెఱింగించిన పరీక్షిన్నరేంద్రునకు
శుకయోగీంద్రుఁ డిట్లనియె. 39

సీ. వినుము నృపాలక వివరించి చెప్పెదఁ
బూర్వమయినకథ పొలుపుమీఱ
పరమేశభుజగుప్త పాలితద్వారకా
నగరంబునకు వచ్చి నారదుండు
తద్దయుఁ గృష్ణసందర్శన కాంక్షియై
హర్షంబుతోఁ దద్గృహాంతరమున
కరిగిన వసుదేవుఁ డమ్మునీంద్రునిఁ జూచి
తఱితోడ నర్ఘ్యపాద్యముల నొసఁగి
యుచిత హేమాసనంబున నునిచి గంధ
పుష్పములచేత మిక్కిలి పూజచేసి
చేర డగ్గఱి యోగక్షేమమడిగి
పలికె వాఁడు నమ్రుఁడై భవ్యచరిత. 40

క. ఏనరుఁడై ననుగానీ
శ్రీనాథుని చరణయుగము సేవించిన య
మ్మానవునకు నమృతము వి
జ్ఞానంబుగ నేవిధంబునం గవియునొకో. 41

సీ. నీసమాగమ మది నిఖిలదేహములకు
మంగళార్థంబు నిర్మలచరిత్ర
తల్లిదండ్రులభంగి ధరణి భూతములకు
సుఖదుఃఖరూపమై సొంపుమీఱ

నచ్యుత స్థిరచిత్తులైన మీవంటి స
జ్జనుల రాకలు సుఖాశ్రమము లగును
పరువడి దేవతాభజనంబు చేసిన
హరిని దేవతల్ వదల రెపుడు
ఛాయమాఱ్కని సత్కర్మసచివులైన
సజ్జనులు దీనులైనట్టి జనులయందు
భక్తి సేతురు గాన నీ భాగవతము
లైనధర్మంబు లడిగెద నానతిమ్ము.

క. ఏ ధర్మంబులు విని యమ
బాధలలోఁ బడక నరుఁడు పావనుఁడై లో
కాధారపదముఁ జెందునొ
యా ధర్మము లానతిమ్ము హర్షం బొదవన్. 43

క. శ్రీ రమణుఁ దొల్లి సుతుఁగాఁ
గోరితి భువిలోన ముక్తిగోచరమార్గం
బారూఢి నడుగ మఱచితి
దారుణసురమాయచేతఁ దత్తరపడుచున్. 44

క. ఏ రీతిని జిత్తవ్యథ
నా రక్షితమైన యాశ్రయంబగు నీ సం
సారచ్ఛేదక మెట్లగు
నారీతిని నానతిమ్ము హరికథ లనఘా. 45

వ. ఇట్లు వసుదేవకృతప్రశ్నుండై నారదుండు హరికథాసల్లాప సం
స్మారితుండై సంతసంబంది యి ట్లనియె. 46

సీ. నీవు చేసినప్రశ్న నిర్మల సుజ్ఞాన
జనకంబు సాత్త్వతర్షభ సమస్త
శాస్త్రవేదంబుల సారమ్ములౌ భాగ
వతధర్మముల నడిగితివి యనఘ

విశ్వపావనములై వినినఁ బఠించిన
నాదరించినఁ జిత్తమందు నిలుప
సద్ధర్మచయము విశ్వద్రోహినైనను
బావనుఁజేయు విభ్రాజమాన
పరమకళ్యాణుఁడైనట్టి పరమ పురుషుఁ
డాదిదేవుఁడు భగవంతుఁడైన విష్ణు
మనములోపలఁ బరితోష మినుమడింప
స్మారితుండయ్యె నీచేత సత్యవినుత. 47

వ. అది గావున విష్ణుభక్తి జనకంబై ముక్తిపదప్రాప్తికరం బగు నార్షభవిదేహ సంవాదంబు నాఁబరగు నొక్క పురాతనంబగు కథా వృత్తాంతం బెఱింగించెద నాకర్ణింపుము. 48

సీ. వినుము స్వాయంభవుండను మనువునకు
రమణ నుదయించెనట ప్రియవ్రతుఁ డనంగ
... ... ... ...
... ... ...
... ... ... ...
.. ... ...
... ... ... ...
... ... ...
... ... ... ...
... ... ... ...
తనయుఁడాతని కాగ్నీధ్రుఁడను సుతుండు
జాతుఁడయ్యెను భువన విఖ్యాతుఁడగుచు. 49

క. ఆగ్నీధ్రునకు న్నాభను
ప్రాజ్ఞుండగు సుతుఁడు పుట్టి బలిమిం ద్రిజగం
బాజ్ఞాసిద్ధిగ నేలుచు
సాజ్ఞామాత్రంబుచేసె సకలాహితులన్. 50

క. మతమున నానాభికి స
తృతుఁడయి ఋషభుండు పుట్టి సుందరహృదయ
స్థితవిష్ణుభక్తుఁడగుచును
జతురతతో నతఁడు తనుజశతముం బడసెన్. 51

వ. ఇట్లు గాంచిన ఋషభకుమారశతంబున కగ్రజుండైన భరతుం డనుమహాత్ముండును నారాయణపరాయణుండై యిహలోకసుఖంబుఁ బరిత్యజించి ఘోరతప మాచరించి జన్మత్రితయంబునం బరమపథంబు నకుం జనియె నతనిమూలంబున భారతవర్షం బనియెడి నామంబు జగంబునఁ బ్రసిద్ధంబయ్యె మఱియు నందు తొమ్మండ్రు కుమారకులు బలపరాక్రమ తేజోరూపసంపన్నులై, నవఖండంబులకు నధీశ్వరు లయిరి. మఱియు నెనుబదియొక్కండ్రు కుమారకులు కర్మతంత్రనిష్ఠులై విప్రత్వం బంగీకరించిరి. అందు శేషించినవారలు కవి, హరి, యంతరిక్ష, ప్రబుద్ధ, పిప్పలాయన, ఆవిహోత్ర, ద్రవిళ, చమస, కరభాజను లనంబరగిన సుతనవకంబు నూర్ధ్వరేతస్కులై యాత్మవిద్యావిశారదులై సకలజగంబును బరమాత్మాధిష్ఠితంబుగాఁ దెలియుచు ముక్తులై యవ్యాహతగమనులగుచు సురసిద్ధ సాధ్యగంధర్వ యక్షకిన్నర నాగలోకంబుల స్వేచ్ఛావిహారంబు సేయుచు నొక్కనాడు :— 52

మ. త్రిజగన్నాథుని సద్గుణంబులొగి భక్తిన్ సన్నుతుల్ సేయుచున్
విజితాత్మేంద్రియులైన యట్టి మును లుర్వీభాగమధ్యంబునన్
దజనాభక్షితిపాలపుంగవుని యజ్ఞాంతంబున న్వచ్చినన్
యజమానర్త్విజులన్నెదుర్కొనిరి సూర్యాభీలతేజస్కులన్. 53

క. నారాయణరూపములగు
వారలఁ దోతెంచి భక్తివై భవసుగుణో
దారుండైన విదేహ
ధ్మారమణుఁడు పూజచేసె సభలోన స్పృహ.

సీ. దివ్యకాంతుల చేతఁ దేజరిల్లెడు మిమ్ము
హరికి భార్గవుల నానెఱుఁగుచుందు
విష్ణురూపంబులవెలయు మూర్తులు లోక
పావనంబునకునై పరగుచుందు
క్షణభంగురములైన సకలదేహములందు
మానుషాకారంబు ప్రాను టరుదు
ఆమానవాకృతియందు దుర్లభమగు
విష్ణు సద్భక్తలవీక్షణంబు
నట్లుకావున మిమ్ము నాత్యంతికస్వ
రూపమయినట్టి సేమంబు రూఢితోడ
నడుగవలసెను సంసారమందు సుజన
సంగతించుక సేపైనఁ జాలమేలు. 54

క. నారాయణుఁడు ప్రసన్నుని
కేరీతిని నిజశరీర మిచ్చును దయతో
విష్ణుకథలను
తేరకొనఁగ నేఁడు నాకుఁ దెలుపుఁడు మీరల్. 55

వ. అని యిట్లు విదేహుం డడిగిన హరిచరణస్మరణామృత పాన
మత్తనిజస్వాంతులై శాంతులైన నవమునుల సమాజంబునందు కవి
యను మహాత్ముండిట్లనియె. 56

సీ. ఉద్విగ్న బుద్ధిసంయుక్తుఁడయ్యు సదాత్మ
భావుఁడై నిత్యంబు బరగునట్టి
వానికి సంసారవార్ధిలో నెప్పుడు
నచ్యుతపాదయుగాబ్జసేవ
విశ్వంబు నాత్మయు వేఱుగా భావన
సేయ జయం బెల్లఁ జెఱచు మఱియు
నజ్ఞులయినవారి నాత్మవిజ్ఞానార్థ
మైహరి యేయుపాయములఁ జెప్పె

నప్రమాదములై నట్టి యూయుపాయ
ముల మనుష్యుండు తానొంది మురువుతోడ
బరగు బ్రహ్మాదిసన్నుతంబగుచు మీఁద
నుజ్జ్వలంబగు విష్ణుసాయుజ్యమునకు. 57

గీ. నయనములు మూసికొని చక్కనై నత్రోవ
బరువువెట్టుచు నటఁ దొట్రుపాటు లేక
చనెడి మనుజుని మాడ్కి నిశ్చలయథార్థ
భక్తిచేఁ బొందు సులభంబు పరమపదము. 58

క. పరువశిఁ గాయవచో హృ
త్సరసేంద్రియ బుద్ధిభావ సంఘముచేతన్
నరుఁడేమిచేసె భక్తిని
హరికర్పణ సేయవలయు నాకర్మములన్. 59

సీ. ఈశాదిజేత యయినవానికి ద్వితీ
యాభినివేశాన నధికభయము
దోఁచినఁ దన్మాయతోడ సంకలితుఁడై
స్మృతివిపర్యయములఁ జెందుచుండు
నదిగాన గురుదేవతాత్ముఁడై బుధుఁడు శ్రీ
విభు నేకభక్తిసేవింపవలయు
స్వప్నమనోరథచ్ఛాయ నీశుఁడ విద్య
మానుఁడై తోఁచును మనమునందు

సర్వసంకల్పనాశకచలన హేతు
వైనదాని నరుఁడు కుదియంగఁ దిగిచి
సంతతధ్యాన మేప్రొద్దు జరపెనేని
కలుగు నతనికి ముక్తి విఖ్యాతముగను. 60

మ. అనయంబుల్ హరిజన్మకర్మకథలన్ హర్షంబుతో వీనులన్
వినియుం బాడుచు నాడుచున్ వ్రతముతో విశ్వంబులో సంచరిం
పను లజ్జింపక లోకబాహ్యుఁడగుచున్ భావంబులో నవ్వుచున్
ఘనతత్త్వాదకృతానురాగుఁడగుచున్ గాంతారదేశంబులం
దును వర్తించును వెఱ్ఱివానికి్రియఁ దల్లోత్సాహసంపన్నుఁడై. 61

వ. మఱియు నాకాశంబును వాయువును నగ్నిసలిలంబులను ధర ణిని తేజంబును దేశంబులను మహీరుహంబులను నదులను సముద్రంబులను నారాయణశరీరంబుగా విచారించి భేదంబుసేయని ప్రసన్నునికి భుజియించెడివానికి నొక్క కాలంబునం దతుష్టియు, క్షుధాపాయంబునునైన చందంబున భక్తియుఁ బరేశానుభవంబు నన్యత్ర విరక్తియుం గలుగు; నిట్లచ్యుతాంఘ్రిసేవాపరుండై భాగవతుండు సాక్షాత్కారంబునంద వసియించు నని వారి భక్తిప్రకారంబు చెప్పిన విని విదేహుం డిట్లనియె. 62

ఆ. వరుసతోడ భాగవతధర్మ మెద్ది చ
ర్చింప భాగవతుల చిహ్నలెవ్వి
అతఁడ మేమి పలుకు నాచరించునో యెద్ద
చెలఁగి యెట్టికథలు చెప్పవలయు. 63

వ. ఇట్లు విదేహుం డడిగిన నందు హరియను మహాత్ముం డిట్లనియె. 64

సీ. సర్వభూతములందు సర్వేశుభావంబు
సర్వేశునందును సర్వభూత
భావంబునొనరించుఁ బరమ భాగవతుండు
ఉత్తమోత్తముఁడన నుర్వి వెలయు
పరమేశ తదధీన బాలిశరిపులందు
ప్రేమమైత్రియు గృపాపేక్ష లొనఁగు
నతఁడు మధ్యముఁడగు సర్వావతార స
ద్భక్తి సంయుక్తుండు ప్రాకృతుండు

ఏనరుండై న నర్థంబు లింద్రియముల
చేత గ్రహించియును సర్వజాతులందుఁ
గ్రమము దప్పక యొక్కమై సమముగాను
యోగమును జూచు నాతఁడు భాగవతుఁడు. 65

సీ. అనయంబు దేహేంద్రి యప్రాణహృద్బుద్ధు
లకు నేవి గాలంబు ప్రకటమగుచు
సొరిది జన్మాప్యయక్షుద్భయతర్షాది
బహుళసంసార సంభవములై న
యట్టి ధర్మములచే నవిముహ్యమానుఁడై
కర్మకామంబుల కాశ్రయంబు
గాక జన్మాదికకర్మ వర్ణాశ్రమ
జాతివర్గంబులచేతఁ జెడక
స్వపరవిత్తాత్మభేదంబు సలుప కఖిల
భూతములయందు సమమైన బుద్ధి కలిగి
పరమపురుషుని పాదాబ్జభక్తిఁ దనరు
పరమపుణ్యుఁడు వాఁడువో భాగవతుఁడు. 66

వ. మఱియు సన్న్యస్త సకల కర్మారంభుండై యఖిలజీవవత్సలుఁడై న పరమేశ్వరభక్తుండు బాలభాస్కరుండు కిరణరేణు చయంబుచే లోక త్రయంబును బావనంబు సేయుచందంబున నతండు నిజపాద జనిత రజఃపుంజంబులచేత జగంబు పవిత్రంబు సేయుచు సురాసుర మృగ్యం బైన భగవత్పాదారవిందంబుల భక్తివలన లవమాత్రంబును జలిం పక చంద్రోదయంబున భాస్కరజనిత తాపనివారణం బగుచందం బున భగవత్పాదాంగుళి నఖమణి చంద్రికా నిరస్తహృదయ తాపుండై యాత్మీయభక్తికతన వాసుదేవాంఘ్రి సరోరుహంబు గలుగునతండు భాగవత ప్రధానుండని యెఱింగించిన విని విదేహుం డిట్లనియె. 67

# ఉపోద్ఘాతము.

ఈ యన్యాపదేశ ప్రాస్తావిక పద్యావళి రచించిన కవితల్లజుఁడు శ్రీమచ్చ లక్ష్మీనారాయణకవి. తండ్రి శ్రీవిక్టోరియా మహారాజ్ఞీదత్త సుబేదార్ మేజరిత్యాది చిహ్నప్రకాశిత శ్రీశపదధ్యానానూనానంత స్వాంత వసంతరాయఁడు. ఈకవి యాయుధోపజీవి, శార్దూల భంజనాంకుఁడు, పావన తెలగవంశోద్భవుఁడు. శ్రీకాకుళ మండలాంతర్గత వంశధారానదీతీరస్థ జల్మూరు గ్రామనివాసి. 19 వ శతాబ్దియంతము నవాఁడు. రమారమి యేఁబది వత్సరముల క్రింద నీకవిసత్తముఁడు పరమపదించెను.

చిత్ర చిత్ర బంధ గర్భాశేషాశుశ్లేష వ్యంగ్య శృంగారకవన రచనాధురీణుఁడు, సంతత శ్రీరామనామ చింతన పరాయణుఁడు. శుద్ధాంధ్ర నిర్వచన నిరోష్ఠ్య కుశచరిత్ర నిర్మాతయగు శ్రీమచ్చ వేంకట విద్వత్కవి యాతని సన్నిహితబంధువు. ఆదినుండియు నీమచ్చకుటుంబము కవితకాలవాలము. ఈతనికవిత మృదుమధురము. వ్యంగ్యవైభవ మీతని సొత్తు. వ్యంగ్యప్రధాన మగు నీతని కవితనుగూర్చి యితని బావమఱఁది 'శృంగార వనోత్కర్ష' కృతిపతియగు గయినీడి వేంకట స్వామినాయఁడు-

"మును సంస్కృతమున మాఘుని
తెనుఁగున నల భట్టుమూర్తి ధీరుని వెనుకన్
నినుఁదక్క నన్యులను నసఁ
జనునే యిఁక వ్యంగ్య కావ్యచాతురిఁ జూపన్—" అని ప్రశంసించెను.

శ్రీకాకుళముజిల్లా నరసన్నపేఁట తాలూకా జల్మూరు గ్రామములో నేను ఉద్యోగము చేయునప్పుడీ కవిగారి బంధువర్గమునుండి యాపరిసర ప్రదేశములలో నీప్రాస్తావిక పద్యావళిని సేకరించితిని. ఆగ్రామములో నీకవి శిఖామణి కవితా ధోరణి నిప్పటికిని బ్రశంసించుచుందురు—
ఈకవి రచించిన గ్రంధములు.

1. శృంగారవనోత్కర్షము (ముద్రితము)
2. శ్రీరామోత్కర్షము (అసమగ్రము, అముద్రితము.)
3. చెన్నకేశవ రామాయణము-శతకము- ... ... ...
4. అవలింగి జగన్నాథశతకము- ... ... ...
5. శ్రీరామదండకము, ... ... ...
6. ఇతర చాటువులు. ... ... ...

ఈకవివతంసుని యముద్రితమైన యీయన్యాపదేశ ప్రాస్తావిక పద్యావళి ప్రకటించు భాగ్యము నాకుఁగలిగించి నందులకుఁ బరిషత్తునకెంతయుఁ గృతజ్ఞుఁడను, ఈమహనీయుని యితరచాటువుల నీపత్రికాముఖమునఁ ద్వరలోఁబ్రకటింతును.

గొల్లపాలెము.
19-1-1953

కొయ్యా చల్లయ్య.

శా. దీనిన్ హైందవసార్వభౌమి యగుచున్ దీపించు విక్టోరియా
సేనన్ మేజరుసుబ్బెదారగుచు నాజిం గొప్పిలిం గొట్టి, స
న్మానంబందు వసంతరాయసుతరత్నంబైన శ్రీమచ్చల
్మనారాయణ నామసత్కవి రచించెన్ సృష్టిహృష్టంబుగన్.

# ప్రాస్తావిక పద్యావళి

మచ్చ లక్ష్మీనారాయణకవి.

## 1. నేత్రోపదేశము

ఉ. ఆయినుప్రాపులేనియెడ నంతయు శూన్యము లోకబాంధవుం
డాయన యట్టిమిత్రుని మహాప్రభఁ జూడఁగఁ జాల వక్షి ! నీ
వాయన నీటిబుగ్గవుగదా పరమాత్ముఁ డొకండు దక్కఁగా
నేయెడ నేరికిన్ సతమె యింతకు లాభము లేదు త్రిక్కయన్ 1

క. పాపలు గల్గియు మీరీ
పాపని పైదృష్టివైవఁ బాడియె నమసెన్
బాపవునయనములారా!
తూపులు మీకంటెమేలు త్రుంచుఁ బగతునిన్. 2

క. కని, కరము సంతసింపుము
కనికరము వహింపు మవని గలవానిని లే
మిని గుందువాని నిది చ
క్కనిమార్గము నేత్రయుగ్మకమ! విడువకుమీ 3

క. అనయముఁ గాపాడుచుఁ జెం
తనఁదగు రెప్పలను జూచు దార్ఢ్యములేదో
కనులార! దేవుఁ జూచితి
మనుడంబముఁ గట్టిపెట్టుఁడది నమ్ముదురే. 4

క. నాలుక దయ గుండలములు
దాలిచెఁ గర్ణములు వానితప్పేమి కనన్
మీలరెయడుగున నోడ్లకు
శ్రీలబ్బినఁజెడు గుణంబు నీ కనులారా. 5

క. గంజాధూమ మహత్వమునం
జూచితి నంటిగాని నయనమ ! మునిరాట్
కుంజరులయినను బరమా
త్మంజూచిరె మాంసదృష్టి మున్నను నేఁడున్. 6

క. (పాఠా) గంజాధూమ మహత్త్వము
నం జక్షువ! జూచితంటి నలినజుఁడైనన్
నంజుడుగన్నులఁ బరమా
త్మంజూచెనె జ్ఞాననయనమున నేమొ కనన్. 7

క. నల్లనిమచ్చ యొకండా
హల్లకబాంధవుని జెఱచినది లేకున్నన్
జెల్లదె పొగడఁగ నని నగి
తల్లదె యద్దంబు జూడు మక్షీ! తెలియన్. 8

తే. గీ. కాంచితివి గాశి ననుచును గడుఁ జెలంగు
దంబకమ! నిక్కమగును బరాంగనాను
షంగదృగ్లీలఁ దగు నీకుఁ జాలదదియ
ముందు రెట్టిగ లభియించు మోదమందు. 9

క. అంబక! పాపేచ్ఛను పెర
శంబరనేత్రలనుగాంచి సంజ్ఞసలిపె దా
యంబుజమిత్రాత్మజు చటు
లాంబకముల కెట్టులోర్తు వాపయిఁ జెపుమా? 10

క. మనమును నీవును నొకఁడై
ధనకాంతానంత వాంఛఁదవిలించి జగం
బునుఁ బాప కూపనిచయం
బునఁ ద్రోయుదు రీక్షణంబ! మూర్ఖతగాదే 11

2 భృంగాపదేశము

ఉ. మాలతిఁ జేరఁబోయి మధుమాసమునం దవమాన మందుదే
చాలును నన్నపర్వ్వ సన షట్పద! పౌషమునందు మల్లియన్
బోలునెచేరఁ, గూడదని పూనివచించిన నాది తప్పు? హా
కాలమునెంతు రే? మధువికారపరీతమలీమసాధముల్ 12

గీ॥ పగలునాక రజోవతి తగదునాక
యమితమధుపానమత్తత నపవిత్రుళ్ళి
బిసినిఁగూడిన చెడుమలీమసులు మిమ్ము
నంటఁగూడునె పరమచండాలులార. 13

తే॥ గీ॥ తేనెనూనె మెఱుంగులు దీపశిఖరర
జోహారిదప్రియుఁ డగఁగల్వజోటి రాజు
కొలఁకుఁ బ్రతికవాటముల్ దెఱవ నదను
దొరకె నని దూఱితివె తేఁటి దోసకారి. 14

గీ॥ బంభరాచార్య యీకీటడింభకంబు
పాటనేర్చెను రెక్కలువచ్చె బ్రతుకు
నంతియేకాదు నీశిష్య నార్య యెన్నఁ
గాంచె మధుపానసాహితీకౌశలంబు. 15

క॥ ప్రతిదినమును మధుపానము
మితిరహితముగాఁగఁ జేసి మే మఱచుమధు
వ్రతమా! కనకమునకు నీ
కతిదూరము తొలఁగు భోగి కది తగు నరయన్. 26

గీ॥ లీల నలరుచు మాధవీప్రేమలఁ గ్రాల
నేల? మాలతిఁ జేరితి పాలుమాలి
పరిభవమెకాని యందులఫలము గలదె
సమయ మెఱుఁగవె యోవెఱ్ఱిచంచరీక! 17

చ॥ కలువపరాగ మంగమునఁ గ్రాలఁగఁ దమ్మికిఁజేరఁ దద్రజః
కలితవపుర్విలాసమునఁ గల్వకుఁజేర మనోరథంబులోఁ
గలఁగక తీర్చి పుచ్చుటయెకాని యసహ్యత లేదు వానికో
యలిశర! నీదుపూర్వ సుకృతాతిశయంబులొ లేక నేర్పులో 18

క॥ కాదుద్దేశము కంఠ్యము
గాదు గరుద్భవము నీదుగానమె యది గా
దా దెస విను మళియుఁ బికి
నాదము దత్ప్రజ్ఞ యది జనస్తుత్యమగున్. 19

ఉ॥ ఏమ్మఁ మధువ్రతత్వమిటు ముఖ్యముగాఁగ యథార్థమయ్యెనో
తుమ్మెద! కాంచనంబు విడి తుచ్ఛసుఖానుభవంబుఁగోరి యీ
యుమ్మెత కేలవచ్చితి హాహా! మెయిశాశ్వతమే! కృశించెనీ
వమ్మహనీయ వాసనల నందెడు భాగ్యము యోగ్యతావలిన్. 20

చ॥ అనవరతస్ఫుటంబగుట నందెద మేలని పెండ్లి జీల్గుపు
వ్వనఁ గని చేర వచ్చితివె పో! మధుపా! రసహీనమైన బెం
డనుచు నెఱుంగవో తొలుత నానిన దే యని స్వీకరింతు; వే
జనును ప్రభాతమయ్యె విలసన్మకరందముఁ ద్రావఁ దమ్మికిన్ 21

గీ॥ మాధుకరకులవీర! యొకమాట యేని
కర్ణమిడి హాస్యమునకు మాకంద మొల్ల
కాల మలరుచు నిడలేదు కరుణాబ్ధికిఁ 22
బిప్పలముఁ జేరు మట్లబ్బు గొప్పదాత 22

ఉ॥ బంధురమా సుగంధములఁ బ్రస్తుతిఁ గాంచినపూల మాని ని
ర్గంధసుమాళిఁ బైకొని విరాగిలి తింతియ కాక యిష్ట దు
ర్గంధలతాంత సంతతుల భ్రాంతిని జేరి తయారె! యౌను బు
ష్పంధయ మప్పు డబ్బుటయ చాలును మద్యము దానుషంగికిన్ 23

గీ॥ మాలతీమల్లికాదులు మాధుకరకు
లవర! బికిరము లర్హ వేళల నొసంగ
తనివి నెడఁ బాసి పేరాసఁ గనకమునకుఁ
బోవఁగా నేల హా! యటుఁ జావ నేల 24

క॥ లతకూనలు లతకూనల కితవుగఁ
బెండిళ్లులు సేయ నెడదూతిమధు
వ్రతమా! తుమ్మెద నని ఝుం
కృతిఁ జీకాకొదవఁ జేయుదేరు పిలిచిరో! 25

౨ భృంగ్యుపదేశము

ఆ॥ గీ॥ పెంచికొనెదు జాతినెంచక పరుల పి
ల్లలను దెచ్చి యెప్డులావు నాక
మధువు నాని స్థిరత మంటలోఁ గలిపెదు
వేశ్యవనుట కేమి వెలితి భృంగి! 23

తే॥ గీ॥ (పాఠాంతరము) పెరలబిడ్డలఁ గొని తెచ్చి పెంచుటొకటి
యనుదినంబును మధువునానుటొకటి
సంచరించుచు గానంబు సలుపుటొకటి
కాంచి కద వేశ్య యంటి నిన్ జంచరీక. 24

4 శిరోపదేశము

క॥ తిరువీథికి వేంచేసెను
హరిపూజాపరులు సూడ నాటకు రోసుం
దరి శిరమా ! చను తత్పద
సరసిజ రజ మూన నిదియ సమయము సుమ్మీ 28

క॥ హరునభిషేక జలంబుల
గురిసిచి కదా సోమసూత్రకుండిక నిడవో
శిరమ ! యఘమున్న వేశ్యా
తరుణీనిలయ ప్రణాళిఁదగుఁజల మానక 29

5 కీరోపదేశము

క॥ కూరిమితోడను బెంచిన
వారిని విడనాడి పోవవచ్చునె యదియూ
పూరేటికిఁ దగు నెంచఁగ
గీరమ! చదు వెరుఁగు దీవు కృతమెఱుఁగ వాకో? 30

క॥ అర్థజ్ఞానము దెలియని
వ్యర్థపుఁ జదువేల ? దాన నవనీ స్థలిలో
సార్థకము సుంతలేదు ని
రర్థక కష్టంబు రసన కది బింబాశీ! 31

క॥ రాముండెవఁడో వానికి
నీమహీఁదన్నామ మేలయే తెంచెనో నీ
కేమియుఁ దెలియునె యైననుఁ
గామాశ్వేమ ! తారకంబుగాన ఫలించెఁ 32

తే॥ గీ॥ పిలుతు పూరక వేశ్యేఱఁ బేరువెట్టి
కార్యమావంతయును లేనికాలములను
జిలుకరాయఁడ ! నీ దాయ చేరునప్పు
డూరకుండుదు వది జ్ఞానమో యెఱుంగ 33

### 6 జిహ్వోపదేశము.

మ॥ రద నాసా గళ తాలు దంతపట మూర్ధంబుల్ ననున్ లేవనె
త్త దరంబించుక లేక సత్సభఁగవిత్వప్రౌఢి గాన్పించ నే
ను దయన్ జేసితి! గుండలంబులవి మీనల్ దాల్చి సంచల్లుదే
ముదముంబొందు రసజ్ఞ! కీర్తి యొదవెన్ మోతల్గదా వానికిన్. 34

ఉ॥ కన్నులుగర్ణముల్ దెలిసి గల్లగఁజేయుదు దాతకల్గినన్
మన్ననఁగల్పవే నరుల మాటికిమాటికి బొంకి నాల్కా నే
నెన్నఁడు కొట్టితిట్టితిని నీతని; తేఁడు వివేకియాటచే
నన్నుక్షమించె లేనియెడ నాపనియేమగు మంచిసాక్ష్యమే. 35

క॥ వ్రీడను విడి తలవాకిలి
వీడక గయ్యాళి వగుచు వినువారు నగన్
జూడాపృష్ఠములకుఁ గడుఁ
గీడొనరించితి వృథాసుకీర్తియె నాల్కా.

### 7

క॥ కేసరికిశోరమా! నీ
కే సరి కరికుంభదళన కేళీనిపుణో
ద్భాసితనఖములు, కుక్కల
కాసంపద గలుగ విట్చ్రావళిపై కే. 36

క॥ (పాఠాంతరము) కేసరికిశోరమా! నీ
కే సరి కరికుంభదళన కేళీనిపుణో
ద్భాసిత శిఖరనఖాళి శ
బా సవి భషకముల కున్న ఫలమేమి ధరన్. 37

ఉ॥ గర్జయొనర్చి వన్యమృగకాండము వారిగఁ జేరఁబోవుచున్
దుర్జయసత్వసంపదను దూఁకి వధించును తప్పువీడుఁ డా
స్వార్జితమే భుజించు నితరార్జితమన్నను నోకరించు. నీ
ధూర్జటికామినీహయము దోర్బలశాలి స్వభావ మిట్టిదే. 38

ఉ॥ భృంగనినాదముల్ ముకుళబృందమరందములం దలంచి యో
సింగమ!బృంహితం బనుచు సిబ్బెమటంచును దానమంచు ను
త్తుంగమదావళభ్రమను దూఁకితె చీఁకటిచెట్టుమీఁద నా
వంగడమే కదా మన కభంగమహోన్నతదుర్గ; మొప్పునే ? 39

క॥ శౌర్యమున సత్యమున నని
వార్యపరాక్రమమునందుఁ బడితివి వేశా
దార్యం బేనుఁగుమాంసము
హార్యక్షా! కీర్తి కుపమ యగు దీవు బళీ ! 40

8 జలూకాపదేశము

మ. క్రకచారాళకరాలఘోరతరదంష్ట్రాచండమండంబు వ
జ్రకఠోరోగ్రనఖాగ్రభీకర కరప్రాబల్యమున్ గల్గు నీ
మక రేంద్రుండొకవేళ స్థానబల సంపచ్ఛోభితుండై నిల్పు నే
మొ; కరింబట్టితి నిల్పనెంచితివె పో పో! సాగునే రక్తపా! 41

9 ఖర్యపదేశము

క॥ పరభృద్రవమునకును నా
పరభృతరవ ముద్దిగాని పగిదిని మాఱియా
ఖరిరవమునకున్ బంభర
గరుదురురవ ముద్ది గాదు గణుతింపంగన్ 42

10 వీణాపదేశము

క॥ వీణా ! యీపలుగాకుల
వీనులకున్ రాముపాట విషము; కఱచునే
పోనిమ్ము రమ్ము శుకసం
తానములకుఁ గఱపు;నుట వృథాశ్రమ మేలా. 43

ఉ॥ పాడితి వార బర్హివలెఁ బాడితి హైసరె కోడెవై ఖరిన్
బాడి తయారె మేకగతిఁ బాడితి బాపురె క్రౌంచరీతిఁగాఁ
బాడితి చాగురే పికము భాతినిఁ బాడితి మేల్ హయుక్రియన్
బాడి తయారె దంతిబలెఁ బాడుదె గాడిదపోలె వలకీ ! 44

11 మలయమారుతోపదేశము

చ॥ తలఁగు సమీరదారక! లతాశతముల్ గల వింద చాలవే
మలయజశాఖ నంటుటకు మాటికిమాటికిఁబోదు కూడ దం
దలఘురుషాగ్నిభీషణవిషాహి నిన్నున్ గబళించు నక్కటా
తలఁపటు లుంచు మూర కిటు బ్రాణము దానముసేయ నేటికిన్. 45

ఆ॥ గీ॥ అన్నికుసుమలతలయట్లు మాటికినీవు
మల్లెఁజేరఁబోకు మలయపవన !
యచట విషము లుమియు నహి గాచియుండు నా
వలపు దయ్యె మెఱుఁగు వలవ దుడుగు. 46

12 చరణోపదేశము

ఆ॥ గీ॥ సన్యసింప మీకు సమ్మతిగల దేని
యడుగులార ! వేశ్యకడకుఁ బొందు
ఈషణముల వేఁడియీముండ్లఁ బడనీక
తొలఁగఁజేసి మంచిత్రోవఁజూపు. 47

13 మశకోపదేశము

ఉ॥ భృంగికి బోలె నిట్టికడు బీదను బెండిలిమైననాకు సా
రంగమదంబె దాహ్యదము నానిన నానఁగవచ్చునే యటం
చంగన వల్కవే చని మహత్తరపిచ్ఛిలతత్కపోలభి
త్తిం గరులంటఁ జిక్కితి కదే మశకాధమ ! జ్ఞానహీనతన్. 48

14 కరోపదేశము

క॥ హరిపదతీర్థముఁ బోసితి
కరమా ! యీనోటికేమికార్యము వెలసుం
దరిపదతీర్థము బోయుము
గురుకల్మషహారము పరమగోప్యము సుమ్మా. 49

క॥ అర్థికిఁ బ్రత్యర్థికిని య
థార్థముగాఁ దెలిసె నిడుదు దానంబనుచున్
బార్థివునకుఁ జెయికావున
సార్థకమని బిరుద కంకణాదు లొసంగెన్. 50

### 15 మక్షికాపదేశము

ఉ॥ పోతరమో తరం బెఱుఁగవో చెడుమక్షిక! దూష్యకశ్యపా!
నాతివివేకహీనత మహాకరినాథుని జుల్కఁజేసి హా
దూతను బంచితే రణకుతూహలి వౌచుఁదదీయ ధూత్కృతో
ద్భూతసమీరణార్ధలవమున్ సహియింతువె ప్రోల నిల్తువే. 51

### 16 చాంపేయోపదేశము

ఉ. రేయి సరోవరాంతర పరిస్ఫుటకైరవపంక్తి, వేగినన్
దోయజవారముం గదిసి త్రుళ్లునఁజొచ్చి మధూరుపూరముల్
గాయ మెఱుంగ కాని యిటఁ గంతుగొనన్ బధికుండు గాంచెఁ జాం
పేయమ! నిందరా దతఁడు మిత్రుఁడె? నీ కళిచర్యగోప్యమే? 52

### 17 ఘూకకుమార్యుపదేశము

క॥ శారియుఁ గీరియు ఘూకకు
మారీ! నీమృదుల భవ్యమంజువాగ్ఝరీ
వారమ్మును బ్రతికూల వ
చోరభటిని నిల్పనేర్చునా? కల్ల సుమీ. 53

చ॥ కలువలు, మీల్, చకోరములు, గాటుకపిట్టలు, దేంట్లుఁ, దోఁకచు
క్కలు, జలజంబు, లేణములు గాసిలె నీకనుదోయి కట్టి నీ
కలుముల నీను జూడ్కులను గ్రాలుచు నెవ్వనియిల్లు మెట్టితో
గళమునఁ దాళి లేదదియకా యనుమానము పేచకాత్మజా. 54

### 18 కర్ణాపదేశము

ఉ॥ ఏ లొకో కర్ణనామము వహించుట కుండలముల్ ధరించుటల్
శ్రీ లనిపించుకొంట నగరే శ్రుతినింద వినంగఁజాలనే
నాలుకయూరకుండ దది నావశమానె శ్రవంబులార! హా
కేలునుబోలి యీవిఁబటు కీర్తిని మించ నుతించిరే బుధుల్ 55

### 19 భేకాపదేశము

గీ॥ పరభృతారవంబు బంభరఝంకృతి
చిలుకపలుకు నాటపులుగుఁగేక
బెదరఁజేయ లేవు ప్రియుఁడు నేకురేఁ గాని
దర్దురార్భటులకుఁ దాళఁజాల. 56

### 20 కింశుకాపదేశము

క॥ శుకపండితపికగాయక
నికరము నినుఁజేర దనిన నేరమె ? మధుప
ప్రకరము మన్నించెదు కిం
శుక! మాడలుగల్గునంత క్షోణి నురవాకో. 57

### 21 ఖరాపదేశము

శా॥ శ్రీకంఠుండవుగావు భూతిమెయి నర్థిం దాల్చినన్, జంద్ర రే
ఖాకల్పంబుగలేక్ ఖరీఖరఖురోద్యచ్చిహ్నఁజెన్నారినన్,
గోకన్ గట్టక సంచరించినను, నీకున్ వానికాయుద్ది నీ,
లోకుల్ నమ్మ రిదేటివేస గుఁకఁ జాలున్ బాలబాలేయమా. 58

ఉ. వీసరవోని మోహమున వేఁగదియం జని సత్యె తన్నఁగా
నాసరసాగ్రగణ్యుఁడగు నచ్యుతుఁడోపె మహారహస్య మి
ట్లీనరికేరు వెల్లడిగ నీధర నోపెడువారు లే రహో
ధూసరవాసరాధిపతి! తొయ్యలితాపుల కీవు దక్కఁగన్. 59

ఉ. హాటకచేలుఁ డామధురయం దుదయించెడు వేళ వీణఁ దా
మీటుచు నారదుం డతనిమీఁదఁ బదంబులు బాడుచోట, నీ
పాటయె మెప్పుఁగాంచె నట బాపురె చాలదె, వేరు నిక్కమీ
వీటను నిన్ను బోల్చెదు వివేకులు రాసభ గాయకోత్తమా. 60

శా. శూరాగ్రేసరులెంచ నుద్భట జవస్ఫూర్జద్గతిన్, వైరిరా
ణ్ణీరంధ్రోన్నతదుర్గలంఘనఘనోన్నిద్రంబులై గెల్చె తే
ద్దీరన్ వార్యములాత్మ నాయకులనర్థిన్ గూర్చుటన్ గర్తె మీఠ
జీరాద్యంకములో ఖరాధమ! వృథా సిద్ధించునే నీ కిలన్. 61

తే. గీ. నీదు భోజనసౌఖ్యంబు నీదు తల్ప
సుఖము నే రాజునకైనఁ జూడ నంబ
రంబులనె లెక్కపెట్టఁగ రాదు శంకు
కర్ణకులకంధి సంపూర్ణ కైరవాప్త. 62

క. ఆరోహణావరోహణ
సారతరాకుంఠ కంఠసాధకమునఁ గన్
నారదుఁడు నీకుఁ దుల్యుఁడె ?
యౌరా బాలేయ ! గాయకాన్వయతిలకా. 63

క. వరకాంభోజీరాగము
ఖరగాయక ! నీదు సొమ్ము గావునఁ బాడన్
మరులునఁ జేరరె గర్దభ !
గురుకుచ లా కృష్ణుకడకు గోపికలగతిన్. 64

క. (పాఠాంతరము) వరకాంభోజీరాగము
ఖరగాయక నీదు సొమ్ము కావునఁ బాడన్
మరులునఁ జేరుచు, నీ సఖి
కరఁగి మనోభవము నీకుఁ గానుక యౌడే. 65

చ. రజకధరాధరాహరవరప్రకరం ఖురుగాయకోత్తమ
వ్రజములలోన మిన్నలను వార్త జగద్విదితంబు, మీర ల
క్కజముగ వారిచెంతఁ ఘనకాండ బహూకృతులందినార లీ
గజపతియో నిషాదబలగర్వి యెఱుంగునె పొమ్ము గాలిగా. 66

క. కాలజ్ఞ గానగరళం
బీలల నాశ్రుతికి నింప దింపు విసిగడిన్
గోలెంత ! నీదుగానోద్వేల
సుధాధార నింపవే వేడ్కపడన్. 67

మ. వరసంగీతకళా విశారదుల గెల్వన్ వచ్చుసత్కీర్తియో
దరరాజంబు గళస్వనాపజితమై దాస్యార్థమై నిల్చెనో
దరహాసం బెపుడున్ స్వభావమగుటన్ దచ్ఛాయ దీపించెనో
ఖర! లేకున్నభవన్ముఖాబ్జము పయిన్ గన్పట్టునే బొల్లి; పో. 68

చ॥ శతధృతిమేలు గోరి మును శంకరువాహగళస్వనంబు భా
రతి యిదె 'రి' స్వరంబనుచు రాగములం దని యంద్రు కాదు ము
న్వితకె విభూతి ధారణకు నీవపు డేగితి లేక యున్ననం
చితముగ నీగళస్వనమె చేర్చదె శంఖముఖాశ్వరత్నమా. 69

క॥ తిరుమణిజననముతోడన్
బరగెన్ దృణమబ్జ బైడినగముగఁ దలఁతే
హరిదాసులు సములే యు
ర్వరఁ జక్రీవంత భాగవతమణి నీకున్. 70

22 శునకాపదేశము

చ॥ ఎఱుఁగు సమస్తమంచు మతిహీనులు వాకొన మోరలెత్తి బి
ట్టఱచినయంతమాత్రమున నందఱు నమ్మరు రెట్లు రెంటనీ
వెఱుఁగుదువన్న నమ్మఁజను; నెంగిలియాకులవేళ దుమ్ములన్
గొఱికెడు నేర్పు నిన్నిచటగోరిరె, ఛీ, చను సారమేయమా. 71

ఉ. గుఱ్ఱులు భానినాదము లకుంఠగతి న్మినుముట్ట డాసెఁ దా
గొఱ్ఱెయటంచు నెంచితివె కొండలనైనను బిండిఁజేయుపెన్
వెఱ్ఱిగజంబునుమ్మిది వివేకముతో మనుటొప్పుఁ జాలునీ
బుఱ్ఱయె దీనిఁబట్టెదవె, పో, శునకాధమ యేలయీశ్రమల్. 72

ను॥ నీరజాస్త్రశాస్త్రమెల్ల నీరుగాఁగఁ ద్రావె నీ
భైరవాశ్వశాస్త్రి తత్ప్రబంధమెంత వ్రాతియే
వారికైనఁ జాటులేదు వాంఛకల్గెనేని వే
చేరవచ్చుఁ గీలుదెల్పి శిష్యుఁగాఁగఁ జేకొనున్. 73

తే॥ అతను దివ్యప్రబంధంబునందు నెందు
ఘేరవాచార్యమణియును బెద్దగాని
వంచకుఁడు కురుక్కురాచార్యవర్య దాచుఁ
గరుణఁదద్గ్రంధిఁ దెల్పుమీ ఖరకులునకు. 74

తే॥ మీప్రబంధవిజృంభముల్ మెచ్చఁబోము
పణ్యులమెగాని గోప్యంబుఁ బరువులేదె
పొందు మీబోటిబోటుల పొంతకున్నఁ
గొట్టెదరు చేటికలు చిత్తకుక్కలార ! 75

23 ఘూకాపదేశము

ఉ॥ ప్రాకటమంజువాగ్విభవ బంధురకీరమరాళశారికా
నీకము లుండ, నాకొఱకు నిన్నొకదయ్యముగాఁ దలంచి య
స్తోకరహస్యముల్ నుడివి దోకొనిరమ్మనఁ, బిల్వవచ్చితే
ఘూకమ! యేమిదెల్పె వెడఁగుంజెలి తెల్పవె పార్శ్వవర్తివై. 76

క॥ కౌశికవిప్రవరా ! నీ
యాశీర్వాదంబమోఘ మది తాఁ గొనితా
నాశూరుఁడు నని యని మును
నాశూరవిభేదనక్రియార్హుండయ్యెన్. 77

ఉ॥ నందనజావనీజసుమనఃపరికల్పితతల్పకాప్సరో
బృందకుచోపగూహనమహీనధృతిన్ మతిఁగోరు శూరసం
క్రందను లాజిఁ గౌశికశిఖామణి నిన్ మునుమున్నుగాంతు ర
ట్లందఱకున్ లభించునె త్వదంచితదర్శనలాభసౌఖ్యముల్. 78

ఉ॥ చీకునిజంబు పీనికిని నీయనులోకులకేలికేమి ? హా
శ్రీకరమా భవన్ముఖకుశేశయమున్ జనముల్గనంగొనన్
దాకును దృష్టి; నష్టియది తప్పదు విప్పి యెఱుంగఁజెప్పితిన్
రాకు సుమీ దినంబునఁ బరాకుననైనను ఘూకనాయకా. 79

క. సహజునకున్ రాజ్యంబిడి
బహుదినములనుండి యటవిఁ బర్వతగుహలం
దహహా తప మిటు సేసెదు
సహనవిరీహతలు నీకె చను ఘూకజటీ ! 80

క॥ ధరసూర్యోపాసకులం
దఱు శిరముల వంచికొనుచుఁ బ్రపంచెందఁగ, నా
ఖరకరుఁ జూచుచు నతి దు
ర్భరతపమును సలుపు దెంచ వశమె దివాంధా ! 81

ఆ॥ పికకుహూరవంబు, మకరాంకుహాయహేష,
పావురముగుబ్బాళ, మీఁవెలందిఁ
జంకఁజేయుఠేవ, పక్షుఁడబ్బనేని ఘూ
త్కారమొక్కఁడు సేయు కాకవైరి. 82

తే॥ పుల్లుఁగుపిట్టదొరా! నీవు పురికిరేయి
నేగి ప్రజకష్టసుఖముల నెఱిఁగి నెమకి
కడిమి బలుగాకులకు శిక్షఁదొడఁగి చేయ
ం బటందు రీ యవనిజనులు 83

24 కాకాపదేశము

ఉ॥ దేవుఁడులేఁడు బొమ్మ సతి తిరస్కృతిసం బను వారి కింపుగా
గోవెలఁ జేరి రెట్టునిడి కూలఁగఁ జేసినయట్టినిన్ జిరం
జీవిగఁ జేసెఁ గావున నశేషజగజ్జన దూషణార్హుఁడై
యావిధి నింద పాల్పడియె హాబలి పుష్టమ! వేశ్మధూర్యుఁడై. 84

చ॥ చిలుకకుఁ బ్రోలెఁ బంజరముఁ జేర్చితి నేర్పితి రామనామముల్
బలుకఁగఁ జేదు మొద్దనెడు భామకు వెట్టినవాని మేర్పడన్
బలికెదు నీకుఁ బెద్దబిరువా యధియున్ గలమేక దాకటా
తలఁపదు నీవిరోధియుఁ జానమటంచు సకృత్ప్రిజోత్తమా. 85

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారు సి. బి. ఇ. డి. లిట్., పిఠాపురం మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు (జమీందారు, ఉయ్యూరు యెస్టేటు)

అధ్యక్షులు.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవి సమ్రాడిత్యాది బిరుదాంకితులగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

కార్యదర్శులు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. యల్.

శ్రీ సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ, చతుర్వేదుల సత్యనారాయణగారు, ఎం. ఏ., బి. ఒ. యల్.

లు :

శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారథి గారు, బి. ఎ, యల్. యల్. బి.

శ్రీ ఏలేశ్వరపు వేంకటరమణ సుబ్బారావుగారు, బి. ఏ, బి. యల్.,

కార్యనిర్వాహక సభాసభ్యులు ;

శ్రీ పురాణం భద్రియ్యనాయఁడుగారు, ఎమ్. ఏ, యల్. టి.

,, కోకా శివనాథశాస్త్రిగారు

రా.సా. మాదిరెడ్డి సీతారామయ్య నాయఁడుగారు, బి. ఏ, బి. యల్.

శ్రీ కొమ్మిరెడ్డి కేశవ రామమూర్తినాయఁడుగారు, బి. ఏ.

,, వేమల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

,, ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.

,, ఎండమూరి వేంకటరమణగారు, ఎమ్. ఏ. బి. యిడి.

బులుసు వేంకటేశ్వరులుగారు, బి. ఏ.

,, సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రి గారు

,, బండారు ... య్యగారు.

శ్రీ

# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

## కాకినాడ



దేశభాషలందుఁ దెలుఁగులెస్స

| సంపుటము | సంచిక |
| --- | --- |
| ౪౧ | ౪-౬ |

# సంపాదకవర్గము

ప్రధానసంపాదకుఁడు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. యల్.

సహాయ సంపాదకులు :

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు ఎం. ఏ.
శ్రీ విద్వాన్ వేమల రామచంద్రకీర్తిగారు ఎం. ఏ. ఆనర్సు., బి. ఇడి.
శ్రీ విద్వాన్ బులుసు వేంకటేశ్వరులుగారు, బి. ఏ.
శ్రీ సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
శ్రీ బండారు తమ్మయ్యగారు.

# విషయసూచిక.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## కాకినాడ



దేశభాషలందుఁ దెలుఁగు లెస్స


సంపుటము

౪౧

సంచిక

౪-౬

శ్రీ

# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

## కాకినాడ

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

( Journal of the Telugu Academy )

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయిలు.


సంపుటము ౪౧. { నందన సంవత్సరము } రెండు సంచికలు


## విషయసూచిక

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

## కాకినాడ

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

Journal of the Telugu Academy

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయిలు.

సంపుటము. ౨౧. | విజయ సంవత్సరం ఆశ్వయుజ ఫాల్గుణము | సంచిక ౧-౬.

## వార్షికసభ

వార్షికసభ:— ఈసంవత్సరము వార్షికసభ జరుపుటకై యెంతయుఁ బ్రయత్నించుచున్నాము. ఆంధ్రభాషాభిమానులెల్లరు సాయపడినచో మా ప్రయత్నము త్వరలోనే సఫలముకాఁగలదని తలంచుచున్నాము.

ప్రస్తుత మాంధ్రసారస్వత లోకమున వ్యాకరణావశ్యకతను గూర్చి విమర్శనములు జరుగుచున్నవి. ఆంధ్రభాషాభిమానులు నాలుగు తెగలుగాఁగానవచ్చుచున్నారు. వీరిలో నొకతెగవారు ఆంధ్రభాష లక్షణానుసారముగా నుండవలయునని వాదించుచున్నారు. ఆలక్షణము వ్యాకరణము కావచ్చును, లేక ప్రామాణికులగు పూర్వకవుల ప్రయోగములు గావచ్చును. ఎవరియిష్టము వచ్చినట్లువారు రచించుటకు వీ రంగీకరింపరు. రెండవతెగవారుకూడ లక్షణము ననుసరించువారే; కాని లక్షణములందలి క్లేశములను బరిహరింపవలయునని వీరియభిప్రాయము. అరసున్నల శకటరేఫలనిర్బంధము వీరి కనభిమతము. మూఁడవతెగవారు వ్యావహారికవాదులు. పై రెండుతెగలవారివలె వీరికిని భాషయందు మంచి సంస్కారము గలదు. లక్షణమునందుఁగూడ నభిమాన మున్నట్టులే చెప్పెదరు. కాని తమయిచ్చవచ్చిన చోటులందు లక్షణము నుల్లంఘించుటకు సంశయింపరు. నాల్గవ తెగవారు యథేచ్ఛావాదులు. వీరికి

లక్షణ మక్కఱలేదు. భాషావిషయమున నెట్టినియమమును వీరు పాటింపరు. జనసామాన్యమైన విషయమునుగూర్చి తోఁచినట్లు వ్రాయుటయే వీరిపద్ధతి.

ఈవిధముగ నాంధ్రభాషావాదులలో సామరస్యము గానవచ్చుటలేదు. వీలైనంతవఱకు సామరస్యమును గల్పించుట వార్షికసభ జరుపుటకుఁ బ్రధానోద్దేశము. వార్షికసభకు ముందుగనో తరువాతనో యీవిషయమును జర్చించుటకై పండితసమావేశము కావింపఁబడును. మన దేశమునందలి కవులు పండితులు భాషాభిమానులును మాయాహ్వానముగైకొని సభలకు విచ్చేసి యాంధ్రభాషావ్యవస్థను గావించుటలో మాకుఁదోడ్పడఁ బ్రార్థించుచున్నాము.

<u>ఉపకారప్రదర్శనము</u> (Benefit performance :—పరిషత్తునకు ధనము సమకూర్చుటలో ఉపకార ప్రదర్శనమొక సాధనముగాఁబెట్టుకొంటిమి. క్రిందటి వత్సరమున కాకినాడలోనె సంగీతనృత్యప్రదర్శనము గావించి మూఁడువేలరూప్యములు సంపాదించితిమి. దానితో పరిషత్తునకున్న ఋణము చాలవఱకుఁదీఱినది. ధనాభావముచేఁ బరిషత్కార్యములు చుఱుకుగా సాగుటలేదు. మరల నెచ్చటనైన ఉపకారప్రదర్శనము జరుపవలెనని తలంచుచుండఁగా, విజయనగర కళాశాలా ప్రధానార్థశాస్త్రోపన్యాసకులగు శ్రీ ఆర్. కృష్ణమూర్తిగారు తమనగరమున నట్టి ప్రయత్నముగావింపుఁడని కోరిరి. ఆంధ్రా ఆర్టిస్టు అసోసియేషన్ వారి పాండవోద్యోగ విజయములు ప్రదర్శించినచో చాలధనలాభముకలుగఁ గలదని తలంచితిమి. ఆనాటకసమాజమునఁ బ్రధానులగు శ్రీమాధవపెద్ది వెంకటరామయ్యగారు, శ్రీ అద్దంకి శ్రీరామమూర్తిగారు, శ్రీ పీసపాటి నరసింహమూర్తిగార్లకు మాయభిప్రాయమును నివేదించితిమి. వారును సహజౌదార్యముచేతను, పరిషత్తునందలి యభిమానముచేతను, తమకుఁ గల సారస్వతాభినివేశముచేతను మే మడిగినదియే తడవుగ మాప్రార్థన నంగీకరించిరి.

ఇది సంఘమునకుసంబంధించిన కార్యమగుటచేఁ దలపెట్టిన సంవత్సరమునకుఁగాని యాచరణములోఁ బెట్టలేకపోయితిమి. ఈసంవత్సర వ్యవధిలో విజయనగరము స్థితిగతులు తారుమారైనవి. అచటిప్రధాన వస్తువులకు ధరలు పడిపోయినవి. తన్మూలకముగ ధనాభావక్లేశము హెచ్చుగా నుండెను. ఏది యెట్లున్నను 15-2-53 వ తేదీని ఆంధ్రాఆర్టిస్టు ఎసోసియేషనువారు విజయనగరమున పాండవోద్యోగ విజయములు ప్రదర్శించిరి. ఈప్రదర్శనవిషయమున మాకుఁబురప్రముఖులు పలువురు బహువిధముల సాయ మొనర్చిరి. వీరిలో మొదటఁ బేర్కొనఁదగినవారు విజయనగర కళాశాలాధ్యక్షులు శ్రీ. ఎ. యల్. నారాయణగారు. వీరు మాపరిషత్తునం దెంతయు నభిమానము చూపి నాటకమునకుఁగావలసిన కుర్చీలు బెంచీలు సమకూర్చిరి. వారికి మాయందు గల యభిమానము చూచి వారియనుయాయులుకూడ మాకెంతయు సాయమొనర్చిరి.

మే మీప్రదర్శనమునకు సంకల్పించినది మొదలు చివరవఱకు మాకుఁ గావలసిన సౌకర్యములను సాహాయ్యముల నొనర్చి మాతో పాటు కష్టసుఖములఁ బాల్గొనినవారు శ్రీ ఆర్. కృష్ణమూర్తిగారు. మాతోఁగూడ శ్రమపడిన వారిలో శ్రీ డి. భగవానులుగారు పేర్కొనఁదగినవారు. ధనసంపాదనమున మాకుఁదోడ్పడుటయేగాక తామధ్యక్షులుగా నున్న సంస్థానమువారి 'హాస్తబల్' హాలును పరిషత్తునకు నాటకప్రదర్శనమున కుచితముగా నొసంగిరి. శ్రీ సన్యాసయ్యదొరగారు (శ్రీ సన్నిబాబుగారు) మాకమూల్యమైన సాహాయ్యము నొసంగిరి. పట్టణమునందలి న్యాయవాదులందఱు మాయెడ మిగుల నభిమానముఁ జూపిరి. న్యాయవాది సంఘకార్యదర్శులగు శ్రీజోగారావుగారు మాతోఁగూడఁ దిరిగి మిగుల శ్రమఁగొనిరి. పైఁబేర్కొనిన పెద్దలందఱకు మావినయపూరితమైన కృతజ్ఞతాభినందనముల నర్పించుచున్నాము. ఈక్లిష్ట పరిస్థితులలో వీరి సాహాయ్యముననే మేము నష్టములేక కొలఁది లాభముతో బయటఁబడఁగలిగితిమి.

ఈసందర్భమున 'విజయా కెమికల్ సిండికేటు' ప్రొప్రయిటర్లగు శ్రీ సురభి జగన్నాథరావుగారికి, శ్రీ పేరి శ్రీహరిగారికి మాకృతజ్ఞతాభివందనములఁ దెలుపుచున్నాము. వీరు కాకినాడ వాసులగుటచే మేము చనవుతో మాకార్యమునకు సాయముచేయ నర్థించితిమి. వారు మాయందలి యాదరముతో, పరిషత్తునందలి యభిమానముతో, నాటక ప్రదర్శనమునకుఁ గావలసిన సౌకర్యములన్నియు సమకూర్చిరి. వారి సాహాయ్యమువలననే నాటకప్రదర్శనమునం దెట్టిలోపము జరుగలేదు.

ఇంకను పలువురు పలుతెఱంగుల ఈనాటక ప్రదర్శన సందర్భమున మాకుఁదోడ్పడిరి. వారికి మాకృతజ్ఞతను దెలుపుచున్నాము.

చందాదారులు :— ఈసంవత్సరము కాకినాడపురముననే అఱువదియైదు చందాదారుల నదనముగాఁజేర్పించితిమి. ఇంకను ఈపురమున పలుమంది భాషాభిమానులు, ఉదారులగు ధనికులును గలరు. వారందఱిదగ్గఱకు నేగుటకు మాకవకాశము లేక యూరకుంటిమి, ఈసంవత్సరము వార్షికసభనాఁటికి పురప్రముఖులనందఱిని దర్శించి పరిషత్సభ్యులుగాఁజేరఁ బ్రార్థించెదము. ఈసాహిత్య పరిషత్తు అఖిలాంధ్రదేశమునకు సంబంధించినదైనను కాకినాడ పురమున స్థాపింపఁబడియుండుటచే దీని నిర్వాహణబాధ్యత కాకినాడ పురజనుల యందధికముగాఁ గలదు.

ఈసంవత్సరము నూటపదియాఱు రూపాయాలు చెల్లించి యీక్రింది వారు పరిషత్తునందు యావజ్జీవ సభ్యులుగాఁ జేరిరి.

1. శ్రీ ఏమూరి సీతారామారావుగారు (రిటైర్డు తాశీలుదారు-కాకినాడ.
2. శ్రీ ఆచంట వెంకటేశ్వర రావుగారు.
రిటైర్డు డిప్యూటీకలెక్టరు-కాకినాడ.
3. శ్రీ కాళ్ళూరి రామచంద్ర సత్యనారాయణ రావుగారు.
భూస్వాములు, కాకినాడ.
4. శ్రీ దంటు సూర్యారావుగారు
(ప్రొప్రయిటర్ D. S. నారాయణ కంపెనీ-కాకినాడ
5. శ్రీ వేలూరి లక్ష్మీనరసింహ వెంకటరమణయ్య గారు.
(భూస్వాములు. ఉల్లితోటవీధి, రాజమండ్రి.

ఈ యుదారాశయులకు మాకృతజ్ఞత దెలుపుచున్నాము.

# ప్రాచ్యపాశ్చాత్య సాహిత్య సిద్ధాంతములు

శ్రీ భాగవతుల కుటుంబరావు, M. A.

వస్తుతత్త్వావగాహనమున భారతీయుల ప్రజ్ఞ యకుంఠిత మైనది. దుర్జ్ఞేయమగు నాత్మతత్త్వమును కరతలామలకముఁ జేసికొనిన వారికి ప్రాపంచికవస్తుస్వరూపస్వభావనిరూపణములు కష్టసాధ్యములు కావు. ఏవిజ్ఞానముచే సర్వవిజ్ఞానము కల్గునో ఆయాత్మవిజ్ఞానము భారతీయుల సొమ్ము. సాహిత్యవిజ్ఞానము తదనుపాతియు నంతఃపాతియునై యుండక తప్పదు.

ప్రాచీనభారతీయమహర్షి "రసో వై సః" అనినాఁడు. రసము, బ్రహ్మ, ఆనందము, పర్యాయపదము లనినాఁడు "ఏతస్యైవానన్దస్యాన్యాని భూతాని మాత్రాముపజీవన్తి" యని తెల్పుటతో కావ్యానందము గూడ బ్రహ్మానందాంశరూపమే యని సూచించినాఁడు. భరతముని రససూత్రమును నిర్వచించినాఁడు.

"ఇతివృత్తం తు కావ్యస్య శరీరం పరికీర్తితం" అని "తు"శబ్దము నుపయోగించుటతో, ఇతివృత్తము కావ్యమునకు శరీరము మాత్రమే. ఆత్మ కానేరదని సూచించినాఁడు భామహాదులు సాహిత్యపాథోధిని మథించినారు. ఆనందవర్ధనాభినవగుప్తాదులు కొందఱు మాత్రమే యమృతసిద్ధినొందినారు. ఇతరులాయమృతాస్వాదనమునఁదుష్టిపుష్టులనొందినారు. ధ్వన్యాలోకము, అభినవభారతి, రసగంగాధరము, సాహిత్యదర్పణము మొదలగు గ్రంథము లీయమృతమును తరతరములవారి కందఁజేసినవి. భారతీయసాహిత్యసిద్ధాంతములు సర్వతోముఖమగు వ్యాప్తినొంది సర్వసహృదయ హృదయోల్లాసమును గల్పించినవి.

ఇది యిట్లుండ, భారతీయసాహిత్యశాస్త్ర మసమగ్ర మనియు, అలంకార నిరూపణమాత్రపరితుష్ట మనియు న[illegible]కులు విమర్శించుచుండుట విజ్ఞులకుఁ దెలియనిది కాదు. భారతీయాలంకారశాస్త్ర మేతావన్మాత్రము కాదు. ఆలంకారిక సిద్ధాన్తములు గ్రాహ్యములే యగునను

విషయమును కొంతవఱకు క్లుప్తముగ నిరూపించుటకే యీరచన ముపక్రాంతమైనది.

కావ్యలక్షణము-1 "శబ్దార్థౌ సహితౌ కావ్యమ్"(భామహుఁడు) (2) "రీతిరాత్మా కావ్యస్య" (వామనుఁడు) (3) కావ్యస్యాత్మా ధ్వనిః" ఆనందవర్ధనుఁడు (4) "తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునః క్వాపి" (మమ్మటుఁడు) (5) "వాక్యం రసాత్మకం కావ్యం" (విశ్వనాథుఁడు (6) రమణీయార్థప్రతిపాదకః శబ్దః కావ్యమ్" (జగన్నాథుఁడు) అనియు భారతీయాలంకారికుల కావ్యలక్షణములు కన్పడుచున్నవి.

ఇందు మొదటిలక్షణము శబ్దార్థములు కావ్యమని తెల్పుచున్నది, అనఁగా అలంకారయుతములైన శబ్దార్థములు కావ్యములని భావము. రసమను నదొకటియున్నదని యీలక్షణకర్తయగు భామహునికిఁ దెలియకపోలేదు. కాని యీతని మతమున నలంకారములకే కావ్యమునఁ బ్రధానస్థానము గలదు. రసము గూడ దీనిలో నంతర్భావమునొందు ననియే యీతని యభిప్రాయము. "శరీరం తావదిష్టార్థవ్యవచ్ఛిన్నా పదావళిః" అనియు,"కావ్యశోభాకరాన్ ధర్మా నలంకారాన్ ప్రచక్షతే" అనియుఁ దెల్పినదండియు నీమార్గమునే యనుసరించి గుణ,రీతి, మార్గములకుఁగూడ నలంకారమునందే యంతర్భావమును జెప్పినాఁడు.

ఈవాదమునందు, సహితములైన శబ్దార్థములకుఁ బ్రాధాన్యముండుట A.C. Bradley మహాశయుఁడుఁదెల్పిన "If substance and form mean anything in the poem, then each is involved in the other and the question in which of them the value lies, has no sense అను వాక్యములను స్మృతికిఁ దెచ్చును.

రీతి రాత్మా కావ్యస్య యను రెండవలక్షణము "Style is the man" అను నింగ్లీషునందు ప్రసిద్ధమైన భావమును తలపునకుఁ దెచ్చుచున్నది. మమ్మటుని కావ్యలక్షణము భామహాదులనే యనుసరించి, కావ్యసామా

వ్యమునకుఁగూడ సరిపోవుచున్నది. విశ్వనాథుని లక్షణము రసమునకు ప్రధానస్థాన మిచ్చుచున్నది. ఆనందవర్ధన, జగన్నాథపండితుల లక్షణములు, పూర్వము తెల్పిన యంశముల నన్నిటిని తమలో నంతర్భావము జేసికొని సమగ్రమగు రూపమున నున్నవి. తుదకు నిష్పన్న మగు నర్థ మేమనఁగా, రసము, లేక యానందమును గలిగించు నుత్తమ రచనమే కావ్యము.

ఇఁకఁ బాశ్చాత్యుల కావ్యలక్షణములను బరిశీలింతము.

1. What is poetry but the thoughts and words in which emotion spontaneously embodies itself (John Mill).

2. By poetry we mean the art of employing words in such a manner as to produce an illusion on the imagination, the art of doing by means of words what the painter does by means of colours. (Macaulay)

3. "Poetry is the language of the imagination and passions". (Hazlitt)

4. Poetry is the antithesis of science, having for its immediate subject pleasure, not truth. (Coleridge)

5. Poetry is simply the most delightful and perfect form of utterance that human words can reach. (Matthew Arnold)

6. It is the art of producing pleasure by the just expression of imaginative thonght and feeling in metrical language. (Courthope)

7. (An artist is one who, through the imposition of form on his particular material, creates for himself, and potentially for others, a unified contemplative experience, highly objective in character:) A poet is one who through the metrical arrangement of words, creates an experience of this kind and a metrical arrangement of words having such an effect is a poem.

— — — — — — —

I give the name poem not to the experience (although that is the end of all poetry) but to the words through which the experience is created. (G. Rostrevor Hamilton)

ఈలక్షణములు, భారతీయాలంకారికుల కావ్యలక్షణముల వలె స్పష్టార్థప్రతిపాదకములు కాకున్నను వీనియన్నిటి యందును ఆనంద జనకత్వమునకును కవిప్రతిభకును ప్రాధాన్యము కన్పడు చున్నది. కాల రిడ్జిమహాశయుని లక్షణము 'వాక్యం రసాత్మకం కావ్య' మను వచనమును పోలియున్నది. అయిదవ లక్షణము చదివినవారికి జగన్నాథపండితుని కావ్యలక్షణము జ్ఞప్తికి రాకుండదు. అటులే మిగిలిన లక్షణములు గూడ భారతీయాలంకారికుల లక్షణములతో నభిన్నములు కాకున్నను సదృశార్థస్ఫోరకములు కాకపోలేదు. ఇట్లు కావ్యమునకు లక్షణమును దెలుపుటయందే పాశ్చాత్యభారతీయ సాహిత్య సిద్ధాంతములలో సాదృశ్యము కనఁబడు చున్నది.

## కావ్యనిర్మాణ సామగ్రి.

దండియనునాలంకారికుఁడు కావ్యనిర్మాణసామగ్రి నిట్లు తెల్పినాఁడు

నైసర్గికీ చ ప్రతిభా శ్రుతం చ బహునిర్మలమ్
అమన్దశ్చాభియోగోఽస్యాః కారణం కావ్యసంపదః.

ప్రతిభా, వ్యుత్పత్తి, అభ్యాసము, లోకశాస్త్రకావ్యాద్యవేక్షణ మును గవికిఁ గావలసిన సామగ్రి యని విజ్ఞుల యభిప్రాయము. అందును ప్రతిభయే ప్రధానము. ప్రతిభయున్నచో మిగిలినవి లేకున్నను అంత గా దోషము కాదు. మిగిలిన సామగ్రి యెంతయున్నను ప్రతిభ లేనిచో వ్యర్థమే యగును.

(1) అవ్యుత్పత్తికృతో దోషః శక్త్యా సంవ్రియతే కవేః
యస్త్వశక్తికృతో దోషః స ఝటిత్యవభాసతే.

(2) న కావ్యార్థవిరామోఽస్తి యది స్యాత్ప్రతిభాగుణః.

ఇవి యానందవర్ధనుని వాక్యములు. ఈ ప్రతిభను గుఱించి యాలంకారికు లెంతయో వర్ణించిరి.

"అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః
యథాస్మై రోచతే విశ్వం తథేదం పరివర్తతే.

శృంగారీ చేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్
స ఏవ వీతరాగశ్చేత్ నీరసం సర్వమేవ తత్
భావా నచేతనా నపి చేతనవచ్చేతనా నచేతనవత్
వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతన్త్రతయా.

అను వాక్యములు కవియందలి ప్రతిభాశక్తిని వర్ణించునవే ఆంగ్లసారస్వతవిమర్శకు లందఱును (creative imagination) అనునది కవికి ముఖ్యమని తెల్పుచున్నారు (imagination) అనుదాని యనంత భేదములను సోదాహరణముగ నిరూపించుచున్నారు.
మన యాలంకారికులు వర్ణించు ప్రతిభాశక్తి కిది సన్నిహితమైనదియే యని విమర్శకులకుఁ దెలియఁగలదు.

The powers requisite for the production of poetry are, first those of observation and description .... ... .... secondly, sensibility, thirdly reflection ... .... fourthly imagination and fancy,— to modify, to create and to associate. Fifthly, invention ... ... and lastly judgment,- to decide how and where, and in what degree each of these faculties ought to be exerted. (Wordsworth.)

This energy is an absolute essential of poetry and of itself would constitute a poet, though not one of the highest class (Coleridge.)
వర్డ్స్వర్తు, కాలరిడ్జి, లైహంటు (Leigh Hunt) మొదలగువారీ ప్రతిభాశక్తి విశేషములను నిరూపించిరి. Ernest G. Moll అనునాయన తన Appreciation of poetry అను గ్రంథమున నాల్గవ యధ్యాయమున నీప్రతిభను Practical, reproductive, and creative అని మూఁడు విధములుగ విభజించి సోదాహరణముగ నిరూపించిరి. ఆయాభేదములను జదివి, మన యాలంకారికులు తెల్పిన అలంకారవిభేదములను సోదాహరణముగాఁ బరికించిన వారికి, ప్రాచ్యపాశ్చాత్యసిద్ధాంతములకుఁ గల సాదృశ్యసంబంధములు చాలవఱకుఁ దెలియఁ గలవు.

<u>కావ్యప్రయోజనములు</u> :— ఈ విషయమున నభినవగుప్తాచార్యు లీవిధముగఁ దెల్పినారు.

"తత్ర కవేః తావత్ కీర్త్యాపి ప్రీతిరేవ సంపాద్యా. యదాహ "కీర్తిం స్వర్గఫలా మాహుః" ఇత్యాది. శ్రోతౄణాం చ వ్యుత్పత్తిర్యద్యప్యస్తి, యథోక్తమ్ "ధర్మార్థకామమోక్షేషు వైచక్షణ్యం కలాసు చ కరోతి కీర్తిం ప్రీతిం చ సాధుకావ్యనిషేవణం-ఇతి. తథాపి ప్రీతిరేవప్రధానమ్. అన్యథాప్రభుసమ్మితేభ్యో వేదాదిభ్యః మిత్రసంమితేభ్యశ్చ ఇతిహాసాదిభ్యఃవ్యుత్పత్తిహేతుభ్యః కోఽస్యకావ్యరూపస్యవ్యుత్పత్తిహేతోః జాయాసంమితత్వలక్షణో విశేష ఇతి ప్రాధాన్యేన ఆనంద ఏవోక్తః. చతుర్వర్గవ్యుత్పత్తేరపి చానన్దఏవ పార్యన్తికం ముఖ్యం ఫలం" ఈ వ్యాఖ్యానమునకు మూలమగు నానందవర్ధనుని వాక్య మీయర్థమునే సూత్రప్రాయముగఁ దెల్పినది- "అథచ రామాయణమహాభారతప్రభృతిని లక్ష్యే సర్వత్రప్రసిద్ధవ్యవహారం లక్షయతాం సహృదయానాం ఆనన్దో మనసి లభతాం ప్రతిష్ఠాం ఇతి ప్రకాశ్యతే"

దశరూపకకర్త తెల్పిన యభిప్రాయమిది—

ఆనన్దనిష్యన్దిషురూపకేషు వ్యుత్పత్తిమాత్రం ఫలమల్పబుద్ధేః
యోఽపీతిహాసాదివదాహ మూఢః తస్మైనమః
స్వాదుపరాఙ్ముఖాయ"

ప్రసిద్ధమైన యీక్రింది శ్లోకము గూడ కావ్యప్రయోజనములనే తెల్పుచున్నది.

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాన్తాసమ్మితతయోపదేశయుజే"

వీనియన్నిటికంటెఁ బ్రాచీనమైన భరతుని నాట్యశాస్త్రమున నాట్యప్రయోజనమును గుఱించి యీవిధముగ నున్నది.

"క్రీడనీయకమిచ్ఛామో దృశ్యం శ్రవ్యంచ యద్భవేత్"
"ధర్మ్యమర్థ్యం యశస్యం చ సోపదేశం ససంగ్రహమ్
భవిష్యతశ్చలోకస్య సర్వకర్మానుదర్శకమ్
సర్వశాస్త్రార్థ సంపన్నం సర్వశిల్ప ప్రవర్తకమ్
నాట్యాఖ్యం పంచమం వేదం సేతిహాసం కరోమ్యహమ్"

ఇచటనే యభినవగుప్తుల వాక్యములను గొన్నిటిని అభినవ భారతినుండి తెలిసికొందము.

(1) "దృశ్య మితిహృద్యం శ్రవ్య మితివ్యుత్పత్తిప్రదం
ఇతిప్రీతివ్యుత్పత్తిప్రదమిత్యర్థః"
(2) "తేనానధికృతానామపి సుకుమారాణాం వ్యుత్పత్తిదాయి
నాట్యం శ్రుతశాస్త్రాణామపి సంవాదాదవిచలకార్యా
కార్యవివేక సిద్ధిరితి".

ఈ పై వాక్యముల యర్థములను బరిశీలించితిమేని కావ్యమునకు ఆనందమే పరమప్రయోజనమైనను, ఉపదేశముగూడ నొకప్రయోజనమే యనియు సనిపించును. కావ్యప్రయోజనము విషయమై మూఁడువాదములు ప్రధానముగఁ గనఁబడు చున్నను, మన ముపదేశానందములు రెండును కావ్యప్రయోజనములే యనిచెప్పుట కవకాశ మెక్కువ కనఁబడుచున్నది. విచారించినచో నుత్తమానందజనకమగు నదేదియు, ననుద్దిష్టముగ నైనను నుపదేశబోధకము కాకుండదు. ఈయుపదేశ గ్రహణాచరణముల వలనఁ గూడఁ గలుగునది తిరిగి యానందమేయగును. ఉపదేశసమయమున నానందమే సాధనమై, ఉపదేశగ్రహణాచరణ తత్ఫలప్రాప్త్యనంతర మాయానందమే సాధ్యమైనది. ఇది యిచటిరహస్యమని తోఁచుచున్నది.—మనయాలంకారికుల యభిప్రాయము లిట్లుండ పాశ్చాత్త్య విమర్శకుల భావములు గూడ నేతత్సదృశములే యగుట పాఠకుల కాశ్చర్యము గొలుపరాదు. ఏలన, ధీమంతు లన్నితావులను,

సాధారణముగ నొకరీతిగనే తలపోయుదురు—పాశ్చాత్త్యవిమర్శకు లేమి తెల్పిరో చూడుడు.

1. Poesy therefore is an art of imitation with the end to teach and delight.

Sir P. Sidney, Apology for Poetry.

2. The right use of Poetry is to mingle profit with pleasure, and so to delight the reader with pleasantness of his art, as in the meantime his mind may be well instructed with knowledge and wisdom.

W. Webbe, A discourse of English Poetry.

3. Delight is the chief, if not the only, end of Poesy; instruction can be admitted but in the second place, for poesy only instructs while it delights.

J. Dryden, Defence of an essay of Dramatic Poesy

To instruct delightfully is the end of all Poetry.

J. Dryden, Preface to Troilus and Cressida.

వీరిలోఁగూడ నుపదేశాదులు కళకు ప్రయోజనములు కావనియు, కళ కొఱకే కళనారాధింప వలయుననియు తెల్పినవారున్నారు.

Art is to be loved, not because of its effects, but because of itself; not because it is useful for spiritual pleasure, or even for moral culture, but because it is art and the highest in man, and the soul of all Beauty. To inquire after its utility would be like inquiring after the utility of a God ... .... .... ...

T. Carlyle, State of Grammar Literature.

అయినను Hudson తన గ్రంథమున * తెలిపినట్లు, ఈవాదమును ప్రముఖు లనేకు లంగీకరింప లేదు — ఇంకను పలువురు విమర్శ

---

An Introduction to the study of Literature

కులు ఆనందమే కావ్యప్రయోజనమని తెల్పుచు ఉపదేశము ప్రబంధ వ్యంగ్యముగా నుండవచ్చు ననియు నుండుననియు నందుచే నుపదేశము ప్రధానమని చెప్పరాదనియు వాదించినారు. ఈక్రింది వాక్యములను కొన్నిటిని పరిశీలించుచో నభినవగుప్తానందవర్ధనాదులు తెల్పిన వాక్యముల కివి స్వేచ్ఛానువాదములో వ్యాఖ్యానములో యనిపించును. మనయాలంకారికులు ప్రబంధవ్యంగ్యమనునది యుండుననియు, నది గ్రంథమంతయుఁ జదివిన తరువాత స్ఫురించు నర్థమనియు చెప్పి భారతము నందలి గాథలను, భారతమును గూడ నుదాహరించినారు. కావ్యమునందు నీతి వాచ్యముగా నుండకూడ దనియే మనవారు తెల్పినారు. కాన్తాసమ్మితయోపదేశయుజే యనుటలోనే ధర్మాదులు వ్యంగ్యములే యని తెలియుచున్నది. ఇఁక నీక్రింది యాంగ్లవాక్యములఁ జదువుదము.

1. that in metaphysical language, the moral of an epos or a drama should be immanent, not transient; or otherwise that it should be vitally distributed through the whole organisation of the tree, not gathered or secreted into a sort of red berry or racemus, pendent at the end of its boughs.

T. Dequincey, Milton V. Southey and Landor

2. Poetry or any one of the five arts can teach only as nature teaches, as forests teach as the Sea teaches, as infancy teaches viz by deep impulse, by hieroglyphic suggestion. Their teaching is not direct or explicit, but lurking, implicit, masked in deep incarnations. To teach formally and professedly is to abandon the very differential character and principle of poetry .... .... .... The great moral, for instance, the last result of the "Paradise lost" is once formally announced viz "to justify the ways of God to man !, but it teaches itself only by diffusing its lesson through the entire poem in the total succession of events and purposes; and

even this succession teaches it only when the whole is gathered into unity by a reflex act of meditation; just as the pulsation of the physical heart can exist only when all the parts in an animal system are locked into one organization.

T. De Quincey—Alexander Pope.

3. A poem deserves its title only in as much as it excites by elevating the soul. The value of the poem is in the ratio of this elevating excitement ... ........ That pleasure which is at once the most pure, the most elevating and the most intense, is derived, I maintain from the contemplation of the beautiful. In the contemplation of beauty we alone find it possible to attain that pleasurable elevation or excitement of the soul, which we recognise as the poetic sentiment, and which is so easily distinguished from truth ... .... ... ... .... ... It by no means follows, however, that the incitements of passion, or the precepts of duty, or even the lessons of truth, may not be introduced into a poem and with advantage; for they may subserve, incidentally, in various ways, the general purposes of the work; but the true artist will always contrive to tone them down in proper subjection to that beauty which is the atmosphere and the real essence of the poem.

Dividing the world of mind into its three most immediately obvious distinctions, we have the pure intellect, taste, and the moral sense. I place taste in the middle, because it is just this position which in the mind, it occupies. It holds intimate relations with either extreme; but from the moral sense is separated by so faint a difference that Aristotle has not hesitated to place some of its operations among the virtues themselves. Nevertheless we find the offices of the two marked with a sufficient distinction. Just as the intellect concerns itself with truth, so taste informs us

of the beautiful, while the moral sense is regardful of duty. Of this latter, while conscience teaches the obligation, and reason the expediency, Taste contents herself with displaying the charms:— waging war upon vice solely on the ground of her deformity - her disproportion - her animosity to the fitting, to the apropriate, to the harmonious - in a word, to Beauty.

ibid.

4. The office of poetry is not moral instruction, but moral emulation, not doctrine, but inspiration.

G. H. Lewes — Inner life of Art.

కావ్యము ధర్మార్థకామములకు సంబంధించిన దని యెప్పుడు తెల్పితిమో అప్పుడే కావ్యము సంఘమునకును జీవితమునకును సంబంధించిన దనియు, నుత్తమకావ్య ముత్తమ జీవితప్రబోధకముగ నుండు ననియు మన మూహింపవచ్చును. ఉత్తమజీవిత మెప్పుడు నుత్తమాదర్శప్రబోధకముగనే యుండును. అవినీతి కందు తావుండదు. ఇక ప్రసిద్ధ విమర్శకులగు Arnold గారి యీక్రింది వాక్యములను చదువుడు.

"A poetry of revolt against moral ideas is a poetry of revolt against life."

గొప్పతత్త్వవేత్తయు, కవియునగు కాలరిడ్జిగారు, ఎమర్సను పండితులును ఈక్రింది యభిప్రాయముల నీవిషయమునఁ దెల్పిరి.

No man was ever yet a great poet without being at the same time a profound philosopher. (Coleridge)

The great poets are judged by the frame of mind they induce. (Emerson)

ఈ పై వాదములను చూచినవారికి, అభినవగుప్తాచార్యులు తమ యభినవభారతి వ్యాఖ్యానమున దెల్పిన "ప్రీతి వ్యుత్పత్తిప్రదమ్" అను వాక్యార్థమునకు మూలమగు భరతముని తెల్పిన "దృశ్యం శ్రవ్యంచ"

యనువాక్యార్థము— ఆనన్దమే పరమప్రయోజనమను వాదమునకును, నీతియే పరమప్రయోజనమను వాదమునకును మధ్యస్థమై యుక్తి యుక్తముగ నున్నదని యనిపింపకపోదు. S H. Burton అను విమర్శకమహాశయులు గూడ The criticism of poetry అను గ్రంథమున నీ రెండు వాదముల స్వరూపమును సూక్ష్మముగ స్పష్టముగఁ దెల్పి, ఈవిషయమున నిర్ణయము జేయుట కష్టసాధ్యమనియు తెల్పియు నీమధ్యస్థమార్గము నే పెక్కురు ధీమంతు లనుసరించుచున్నారని చూపినారు.

"Many thoughtful readers of poetry are agreed in rejecting the extremeties on both sides, yet still they find with Coleridge the poetry which merely gives pleasure is fanciful, and poetry which combines the giving of pleasure with the discovery of truth is imaginative. They condemn poetry which too obviously and narrowly teaches, but while enjoying that poetry which is full of "natural magic," they find their deepest and most abiding satisfaction and pleasure in poetry which unites "natural magic and moral profundity" (Matthew Arnold) They expect in other words, that a poem shall enlarge their experience and modify their sensibility before they will accord to it the title of great."

## కా వ్య వ స్తు వు.

కావ్యమునకు వస్తు వేది యుండవలయును ? "జగద్గ్రావప్రఖ్యం నిజరసభరాత్సారయతిచ" అనురీతిని అచేతనములగు శిలలవలె నీరసమైన వస్తువుల నన్నిటిని రసమయముగఁ జేయుశక్తి గలకవికి 'యస్మిన్న కించిదపి కించిదివావభాతి' అనువిధమున శూన్యమునకు గూడ రూపమును బ్రసాదింపఁ గల కవికి బ్రపంచమున నేవిషయమైనను నుపాదేయమే యగును— ఈవిషయ మాలంకారికు లంగీకరించినారు. కాని మహాకావ్యమునకును, రూపకములలో నాటకమునకును ప్రఖ్యాతేతివృత్తము, పురాణాది ప్రసిద్ధ ముండుటయే మంచి దనినారు. అప్పుడు

కవిశ్రమ కొంతగాఁ దగ్గుననియు, దోషము లంతగా నుండవనియు, కవి కథానిర్మాణమునకై యెక్కువ బాధ పడనక్కఱలేదనియు, రస పోషణమును చూచుకొనినఁ జాలుననియు, సీవిమర్శకుల యభిప్రాయము— కథను గ్రహించునపుడే కవి జాగరూకతను వహించి, విభావానుభావాదిసామగ్రీవర్ణనమునకే కథ యుచితమో దానినే గ్రహింపవలయును. గ్రహించిన దానిలో నక్కఱయగు సన్నివేశములను మాత్రమే గ్రహించి మిగిలిన వానిని వదలవలెను. గ్రహించిన వానిని రసమయముగాఁ జేయవలయును.

"యదితిహాసాదిషు రసవతీషు కథాసు వివిధాసు సతీష్వపి యత్తత్ర విభావాద్యౌచిత్యవత్ కథాశరీరం తదేవగ్రాహ్యం నేతరత్ వృత్తాదపిచ కథాశరీరాత్ ఉత్ప్రేక్షితే విశేషతః ప్రయత్నవతాభవితవ్యమ్। తత్రహ్యనవధానాత్ స్ఖలతః కవేరవ్యుత్పత్తిసంభావనా మహతీభవతి।

సన్తిసిద్ధరసప్రఖ్యాయేచ రామాయణాదయః కథాశ్రయా నతైర్యోజ్యాస్వేచ్ఛా రసనిరోధినీ॥

పాశ్చాత్యవిమర్శకులలోఁ గూడ గొందఱు ఏవస్తువైనను, అది యెంత యల్పమైనను, కావ్యమునకు విషయముగా నుండవచ్చునని వాదించిరి. అయినను ఉదాత్తవస్తువును గ్రహించుటయు, రసపోషణకనువగు కథను స్వీకరించుటకు రచయితకుఁ జాలసాయము చేయునని తెల్పినవారును గలరు. కొన్నియభిప్రాయములను చూడుడు:—

1. Poetry is not debarred from any matter which may be expressed by pen or speech.
   W. Webbe—Discourses of English poetry.
2. Poesy ought not to be employed upon an unworthy matter and subject, nor used to vain purposes.
   G. Puttenham—Art of English poetry.
3. As the description of great men and great actions is the constant design of a poet, so the descriptions of worthy

circumstances are necessary accessions to a poem, and being well performed are the jewels and most precious ornaments of poesy.

T. Hobbes—Answer to Davenant.

4. The subject of a poet either in tragedy or in an epic poem is a great action of some illustrious hero.

J. Dryden - Essay of Heroic poetry.

5. It is the honourable characteristic of poetry that its materials are to be found in every subject which can interest the human mind. The evidence of this fact is to be sought, not in the writings of critics, but in those of poets themselves.

W. Wordsworth—Advertisement to lyrical ballads.

6. Let our poets look to this : is their feeling really finer, truer, and their vision deeper than that of the men – they have nothing to fear, even from the humblest subject; it is not so — they have nothing to hope, but an ephemeral favour, even from the highest.

T. Carlyle - Essay on Burns.

7. In my mind, the highest of all poetry is ethical poetry, as the highest of all earthy objects must be moral truth.

Lord Byron - Letter to John Murray.

8. The subjects of poetry are as various as Nature herself ... ... They are no great subjects but such as are made so by the genius of the artist .... ... .... Genius can ennoble the lowest subject, as the want of it may debase the highest.

W. Roscoe—Poetical character of Pope.

9. "The poet then has in the first place to select an excellent action; and what actions are the most excellent ? Those certainly, which most powerfully appeal to the great primary human affections; to those elementary feelings which subsist permanently in the race

and which are independent of time. These feelings are permanent and the same.

M. Arnold - Preface to poems.

"Their theory and practice alike, the admirable treatise of Aristotle, and the unrivalled works of their poets, exclaim with a thousand tongues "All depends upon the subject; choose a fitting action, penetrate yourself with the feeling of its situations; this done everything else will follow."

ibid.

"I only counsel him to choose for his subjects great actions, without regarding to what time they belong. Nor do I deny that the poetic faculty can and does manifest itself in treating the most trifling action, the most hopeless subject. But it is a pity that power should be compelled to impart interest and force to his subject, instead of receiving them from it, and thereby doubling his impressiveness. There is, it has been excellently said, an immortal strength in the stories of great actions; the most gifted poet, then may well be glad to supplement with it that mortal weakness which in presence of the vast spectacle of life and the world, he must for ever feel to be his individual portion.

ibid (2nd edition)

## శా స్త్ర ని య మ ము లు

ప్రాచీన వాఙ్మయమున నుత్తమగ్రంథములను జూచి, యాలంకారికు లుత్తమకావ్యనాటకములకు గలయు లక్షణములను తెలిపి, కవి కాఁదగిన వానికి మంచికావ్యము వ్రాయనెంచినవా మార్గదర్శకము లగు నియమములను సూచించిరి. కాని కవులు గ్రుడ్డిగా నీ నియమములనే పాటింపవలయునని తెలుపలేదు. ఈనియమములన్నియు రసాభివ్యక్తి కనుగుణముగనే యుండవలయుననియు కవియగు వానికి స్వాతం

ముగ నాలోచించి యౌచిత్యమును విడకుండుటయే ప్రధానలక్షణ మనియు నవ్యాలంకారికు లందఱును తెల్పినారు. రసానుగుణముగ కథయందు మార్పులు చేయవచ్చుననియుఁ దెల్పినారు.

> విభావ భావానుభావ సంచార్యౌచిత్యచారుణః
> విధిః కథాశరీరస్య వృత్తస్యోత్ప్రేక్షితస్య వా
> ఇతివృత్తవశాయాతాం త్యక్త్వాననుగుణాం స్థితిం
> ఉత్ప్రేక్ష్యోప్యన్తరాభీష్ట రసోచితకథోన్నయః
> సంధిసంధ్యంగఘటనం రసాభివ్యక్త్యపేక్షయా
> న తు కేవలయా శాస్త్రస్థితిసంపాదనేచ్ఛయా॥

పాశ్చాత్త్యవిద్వాంసుల సరణియు నిట్టిద.

1. Better a mechanic rule were stretched or broken than a great beauty were omitted.

   J Dryden - Dedication of the Aeneis.

2. To judge ... .. of Shakespeare by Aristotle's rules is like trying a man by the laws of one country who acted under those of another.

   A Pope. Preface to Shakespeare.

3. The precepts of the art of poesy were posterior to practice — — — A petulant rejection, and an implicit veneration of the rules of the ancient critics are equally destructive of true taste.

   J. Warton —Essay on Pope.

4. "For rules like crutcpes are a needful aid to the lame, though an impediment to the strong."

   E. Young - Conjectures on original composition.

5. The art of poetry is — — —, universally, the art of pleasing and all its rules, but so many means which experience finds most conducive to that end.

   R. Hurd - On the idea of universal poetry.

6. Could a rule be given from without, poetry would cease to be poetry and sink into a mechanical art.

   S. T. Coleridge.

భారతీయాలంకారశాస్త్రమున ఔచిత్యమను నంశమునకు ప్రముఖస్థానము కలదు. కావ్యమునకు నాత్మ రసధ్వని. ఆరసమున కౌచిత్య మాత్మ యగును. కావున నౌచిత్యభంగము కంటె భిన్నమైన రసభంగ కారణము లేదని యానందవర్ధనాదుల మతము.

1. "అనౌచిత్యాత్ ఋతే నాన్యత్ రసభంగస్య కారణమ్
ఔచిత్యోపనిబన్ధస్తు రసస్యోపనిషత్పరా॥
2. వాచ్యానాం వాచకానాంచ యదౌచిత్యేన యోజనమ్
రసాదివిషయేణైతత్ ముఖ్యంకర్మ మహాకవేః॥

(ధ్వన్యాలోకము)

3. ఔచిత్యస్య చమత్కారకారిణశ్చారుచర్వణే
రసజీవితభూతస్య విచారం కురుతేఽధునా॥

(క్షేమేన్ద్రుడు)

ఔచిత్య మనేకవిధములఁ గలదు. ఒక్కొక భావము తెల్పుట కొక్కొక వృత్తమే యుచితముగ నుండును. శాన్తిప్రియులు మాట్లాడు భాష వేఱు. రౌద్రప్రియుల పలుకుబడి మఱియొకతీరు. శృంగారరస ప్రతిపాదనమునకుఁ బనికివచ్చు భాష రౌద్రరసమునఁ బనికిరాదు. సమాసములన్ని యెడలను సౌందర్యము నీయవు. సమాస విరహిత మైన భాష యొక్కొకచో పేలవముగ నుండును. దేవతలకు సంబంధించిన పరాక్రమాతిశయవర్ణనమునకును మనుష్యాశ్రయపరాక్రమాతిశయవర్ణనమునకును విభేద ముండవలయును. ఇటులే మాధుర్యాది గుణముల విషయముననుగూడఁ దెలియవలెను. ఈవిధముగ నన్ని యంశములును అన్నివిధముల నుచితములుగఁ గన్పడినప్పుడే కావ్యము రసాకరమై హృదయాహ్లాది యగును. ఇది ఆనందవర్ధనక్షేమేంద్రాదుల మతము. ఆనందవర్ధనుని ధ్వన్యాలోకమునను, క్షేమేంద్రుని ఔచిత్యవిచారచర్చయందును, ఈవిషయములు వర్ణితములైనవి. పదౌచిత్యము వాక్యౌచిత్యము, ప్రబన్ధార్థౌచిత్యము, గుణౌచిత్యము, సంఘటనౌచి

త్యము, క్రియౌచిత్యము, విశేషణౌచిత్యము, కారకౌచిత్యము, లింగౌచిత్యము మొదలగు నౌచిత్యభేదము లసంఖ్యములుగ నీరెండుగ్రంథముల యందు నుదాహృతములైనవి.

"గుణానాశ్రిత్యతిష్ఠన్తి మాధుర్యాదీన్ వ్యనక్తిసా
రసాంస్తన్నియమే హేతు రౌచిత్యం వక్తృవాచ్యయోః"
విషయాశ్రయమప్యన్యదౌచిత్యం తాం నియచ్ఛతి
కావ్యప్రభేదాశ్రయతః స్థితాభేదవతీహి సా
ఏతద్యథోక్తమౌచిత్యమేవ తస్యానియామకమ్
సర్వత్రగద్యబన్ధేపి ఛన్దోనియమ వర్జితే
రసబన్ధోక్తమౌచిత్యం భాతి సర్వత్ర సంశ్రితా
రచనా, విషయాపేక్షం తత్తుకించి ద్విభేదవత్."

ఈయౌచిత్యమునే పాశ్చాత్త్యవిమర్శకులు Propriety అనియందురు. వారుగూడ నీయౌచిత్యము ప్రతిరచనమున కావశ్యకమే యనియు, లేకున్న నాకావ్య మంగసౌష్ఠవానురూప్యములు లేని శరీరమువలె వికృతముగానే యుండుననియు, దెల్పియే యున్నారు. ధ్వనికర్తయు సంధిసంధ్యంగఘటనము రసాభివ్యక్తి కనుగుణముగ నుండవలయునని వివరించినాడు. రసపోషణ మానందదాయక మగును గదాయని తలచి, రసప్రతిపాదనమునే ఎక్కువగునట్లు సేయగూడదు—అట్లని అల్పాల్పముగ వర్ణింపరాదు.

అకాండ ఏవ విచ్ఛిత్తి రకాండేచ ప్రకాశనమ్
విస్తరేణాన్వితస్యాపి వస్తునోఽన్యస్య వర్ణనమ్
పరిపోషం గతస్యాపి పౌనఃపున్యేన దీపనమ్
రసస్యస్యాద్విరోధాయ వృత్త్యనౌచిత్యమేవచ
— — — పునశ్చాయ మన్యోరసభంగహేతురవధారణీయో యత్పరిపోషంగతస్యాపి రసస్యపౌనఃపున్యేన

దీపనమ్. ఉపభుక్తోహిరసః స్వసామగ్రీలబ్ధపరిపో
షః పునఃపునరామృశ్యమాణః పరిమ్లానకుసుమకల్పః
కల్పతే — ధ్వన్యాలోకము.

ఇక పాశ్చాత్యపండితుల యభిప్రాయములను పరికింతము.

I. It must have also a magnitude – for the beauty consists in magnitude and order—the unity here spoken is ... ... ... relative and compound, a unity consisting of different parts, the relation of which to each other and to the whole is easily perceived at one view. On this depends the perception of beauty—Twining— Poetics.

The second requisite of manners is propriety. There is a manly character of bravery and fierceness which cannot, with propriety be given to a woman.

Poetics—Aristotle

"To employ with propriety any of these modes of speech .... .... is a great excellence" Aristotle

"One must mind however that the episodes are appropriate .... ... Aristotle.

A metaphor ought not to be so far-fetched as that the similitude may not easily appear.

Hobbe's Digest of Aristotles Rhetoric.

Elocutions are made decent

1. By speaking feelingly, that is with such passion as is fit for the matter he is in; is angerly in matter of injury.
2. By speaking as becomes the person of the speaker; as for a gentleman to speak eruditely.
3. By speaking proportionately to the matter as of great affairs to speak in high, and of mean in a low style — ibid

II. High language is not for indiscriminate use ; for to put great and dignified words on petty trifles would be like putting a tragic mask on a baby.

Longinus—on the sublime.

III. The rightful metre for the exploits of princes and leaders and the sad story of war has been shown us by Homer .... ... A comic theme refuses to be unfolded in tragic verses .... ....
Let each style maintain the fitting place which belongs to it. ... ...
Either follow tradition or invent a consistent story. If in your tale you represent the renowned Achilles, let him appear restless, passionate, inexorable dauntless etc .... ... ...
You must mark the character of every age and assign a seemly manner to man's shifting dispositions and years .... .... ...
If the speaker's words fail to express his mental state, a Roman audience, high and low will roar with laughter .... ....

Art of poetry—Horace (Monon).

IV. Beauty usually designates proportionate arrangements of constituents ... ... T. Sturge Moore.

V. The desire of carrying things to a greater height of pleasure and admiration than, omnibus trutinatis, they are susceptible of, is one great cause of the corruption of poetry. S. T. Coleridge—Anima Poetae.

## రీతి లేక శైలి.

రీతి మార్గము, అనువిషయమున అలంకారశాస్త్రములయందు విశేషవ్యాఖ్యానము లున్నవి. రీతిని గుఱించి వివరింపని యాలంకారికుఁడే లేఁడనవచ్చును — ప్రధానముగ వైదర్భి, గౌడి, పాంచాలి అను మూఁడు విధముల రీతులు మనపూర్వులు తెల్పినారు. ఇంకను అనేక నామములతో ననేకులు, ముఖ్యముగ వక్రోక్తి జీవితకర్తయగు కుస్తకుఁడు మొదలగువారు రీతులను వర్ణించినారు. మాధుర్యము, ఓజస్సు ప్రసాదము అనుగుణములు గూడ నీరీతులకు సంబంధించినవియే. కొన్ని శబ్దములే మాధుర్యవ్యంజకము లగును. ఓజోవ్యంజకములగు శబ్దములును కొన్నియే. అయితే ప్రతిపాద్యమగు రసము ననుసరించి యీరీతి

గుణాదులు గూడ నూరుచుండును. — ఇందు వైదర్భీరీతియు, ప్రసాద గుణమును ఎక్కువ మన్ననను పొందినవి — పదములయొక్క సంఘటనయే రీతియని యాలంకారికుల మతము.- ఈసంఘటనను గుఱించి యానందవర్ధనాచార్యులుగూడ విశేషముగ వివరించినారు. అలంకారికు లందఱును గుణదోషములను విపులముగ వర్ణించినారు. ఇవన్నియు పాఠకులు సమగ్రముగ నేదేని యలంకారగ్రంథమునఁ జూడనగును. దిఙ్మాత్రముగ కొన్ని ప్రమాణవాక్యములిచ్చుచున్నాను.

1. శ్లేషః ప్రసాద స్సమతా సమాధిః మాధుర్యమోజః పదసౌకుమార్యమ్
అర్థస్య వ్యక్తిరుదారతాచ కాన్తిశ్చ కావ్యస్యగుణాదశైతే.
నాట్యశాస్త్రీము.

2. సమగ్రగుణా వైదర్భీ
ఓజః కాన్తిమతీ గౌడీయా
మాధుర్య సౌకుమార్యోపపన్నా పాంచాలీ
తాసాం పూర్వాగ్రాహ్యగుణసాకల్యాత్ — వామనుడు.

3. వైదర్భీ - పాంచాల్యౌ ప్రేయసి కరుణే భయానకాద్భుతయో
లాటీయా-గౌడీయే,రౌద్రేకుర్యాత్ యథౌచిత్యమ్--రుద్రటుడు

కున్తకుడీనామములను తీసివేసి సుకుమారమార్గము విచిత్రమార్గము, మధ్యమామార్గము అని మఱియొక విధముగ నామకరణముఁ జేసినాడు- అనగా వైదర్భి మొదలగు నామములు దేశము ననుసరించి వచ్చినవి. కున్తకుఁడు కవిస్వభావము ననుసరించి నామకరణము చేసినాడు. ఇతని సుకుమారమార్గమునకు మాధుర్యము, ప్రసాదము, లావణ్యము, ఆభిజాత్యము అను గుణములను తెలిపి వివరించినాడు.

4. గుణానాంహి మాధుర్యప్రసాదప్రకర్షః కరుణ విప్రలంభ
శృంగార విషయఏవ । రౌద్రాద్భుతవిషయమోజః । మాధుర్య

ప్రసాదో రసభావతదాభాస విషయోవేవ "ఆనందవర్ధనుడు"
సర్వాసుచ సంఘటనాసు—ప్రసాదాఖ్యోగుణో వ్యాపీ
ఆనందవర్ధనుడు

ఈరీతికి వక్తృవాచ్యవిషయౌచిత్యములు నియామకములనియు నానన్దవర్ధనుని మతమింతకుఁ బూర్వ మౌచిత్యనిరూపణప్రకరణమున నుదాహృత మైనది.

5. మూర్ధ్నివర్గాన్త్యగాః స్పర్శాః అటవర్గారణౌలఘూ
అవృత్తిర్మధ్యవృత్తిర్వా మాధుర్యే ఘటనాతథా
యోగఆద్యతృతీయాభ్యా మన్త్యయోః రేణతుల్యయోః
టాదిః శషౌవృత్తిదైర్ఘ్యం గుమ్ఫఉద్ధతఓజసి

ఇక నొక్క ప్రధానవిషయమును గూడ మన మిచట పరామర్శింప వలయును. శబ్దమునకు అభిధా, లక్షణా, వ్యంజనా అనువ్యాపారములు మూఁడుకలవనియు, అటులే అర్థముగూడ వాచ్యము, లక్ష్యము, వ్యంగ్యము నని మూఁడువిధములుగ నుండుననియు, అందు వ్యంగ్యార్థ ప్రధానమైన కావ్య ముత్తమ శ్రేణికిఁ జెందుననియు, కవియగు నతఁడు ప్రతిశబ్దము నుపయోగించునపుడు శ్రద్ధాళువై యుండవలయుననియు నానన్దవర్ధనుఁడు తెలిపినాఁడు.

"ప్రతీయమానం పునరన్యదేవ వస్త్వస్తి వాణీషు మహాకవినాం
యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం విభాతి లావణ్యమివాంగనాసు"
ఉక్త్యన్తరేణాశక్యం యత్తచ్చారుత్వం ప్రకాశయన్
శబ్దోవ్యంజకతాం బిభ్రత్ ధ్వన్యుక్తేర్విషయీభవేత్"
సోఽర్థస్తద్వ్యక్తిసామర్థ్య యోగీశబ్దశ్చకశ్చన
యత్నతః ప్రత్యభిజ్ఞేయౌ తే శబ్దార్థౌమహాకవేః" ధ్వన్యాలోకము.

ఈవిషయమునఁ గూడ పాశ్చాత్త్యవిమర్శకుల యభిప్రాయములు తుల్యముగనే కన్పడుచున్నవి.

అరిస్టాటిల్ మతమున సాహిత్యైకశైలియు, వాదశైలియు పరస్పర భిన్నములు.

1. The style that should be read ought to be more exact but the style of pleader ought to be suited to action and pronunciation.
2. డెమెట్రియస్ అనువిమర్శకుఁడు శైలిని గుఱించి ప్రత్యేక గ్రంథము వ్రాసినాఁడు.
   - (a) The simple kinds of style are four—plain, stately, polished, and powerful.
   - (b) A long syllable at the beginning produces an explosive effect, and at the end it leaves the hearer on a stately note.
   - (c) Compound words are out of place in the plain style. These too, belong to the opposite style.
   - (d) Sometimes harshness of language adds power especially when the theme requires.
   - (e) An idea suggested is more weighty; simplicity of statement excites contempt.
3. "For different styles with different subjects sort
   As several garbs with country town and court".
   Pope-Essay on criticism.
4. Perspicuity is 'the first and most necessary qualification .... .... it must also be sublime.
   Addison-Spectator.
5. The infallible test of a blameless style .... ... (is) its untranslatableness in words of the same language without injury to the meaning.
   S. T. Coleridge-Biographia Literaria.
6. Arnold గారు grand severe, grand simple అని రెండువిధములగు రీతులను చెప్పినారు. "Both these styles, the simple and severe, are truly grand.
   On translating Homer.
7. All style prosaic as well as poetic involves a consideration of the fact that words do these two different things-they convey meanings and they convey suggestions. R. M. Alden.

8. It has always been recognised that words do more than merely express meaning, they sound and they suggest.... .... John Sparrow.

9. Language may be divided according to its uses into two broad classifications (1) emotional, suggestive or evocative language .... .... (2) Symbolic language.
H. R. Huse.

10. Literary art therefore will always be in some degree suggestion; and the height of literary art is to make the power of suggestion in language as commanding, as far reaching as vivid, as subtle as possible.
Abercromby.

11. "Plato pointed out in the cratylus that long vowels a and β (e) suit the expression of largeness and length. P'(R) suggests motion & violence; λ (l) slipping and smoothness, the sibilants δ, ζ and ξ s, z, notions of seething, shivering and windy sounds, while the dentals δ and λ (d, t) express bending and rest. R prevails in descriptions of harsh noises generally."
Henry Bett.

రసానుభవము

కావ్యజన్యానందమునకు రసమని పేరు పెట్టినారు. విభావాను భావసంచారిభావసంయోగమువలన రసనిష్పత్తి యగునని భరత ముని సూత్రము తెల్పుచున్నది. భావములను సంచారిభావములనియు స్థాయిభావములనియు విభాగము చేసినారు. మానవుని హృదయమున స్థిరముగ నుండు భావములను, సహజముగ నుండు భావములను స్థాయి భావములనినారు. క్షణికములుగ నుదయించువానిని సంచారిభావము లనినారు. ఆధునిక మనస్తత్వశాస్త్రజ్ఞుల యూహాలు మన యాలంకారి కుల భావములతో సరిపోవునని విమర్శకులు తెల్పుచున్నారు. Mcdougall అను పాశ్చాత్యపండితుఁడు fear, dauger, positive self feeling, negative self feeling, laughter, disgust, tender emotion, wonder and lust అనునవి primary emotions అని తెల్పినాఁడు, ఇవి మనవారు తెల్పిన స్థాయిభావములకు సరిపోవు

చున్నవి. ఇంక విభావానుభావవిభాగము సరియైన దనుటకు సామాన్య విజ్ఞానమే చాలును. కాఁగా కావ్యనాటకాదుల వలనఁగలుగు నానంద ము బ్రహ్మానందసబ్రహ్మచారి యని మనవారు తెల్పినారు. కావ్యా నందము బ్రహ్మానందము కాదు. తత్సదృశము అనియే ఈ వాక్యమున కభిప్రాయము. మన యాలంకారికు లింతటితో నాగలేదు. ఈయానంద స్వరూప మెట్లుండునో వివరించినారు. ఇది "వీతవిఘ్నా" అనినారు. అనగా ఏ విధమైన విఘ్నములును లేని అనుభవము. ఈ స్థితిని పొందు టకుఁ బూర్వము ప్రేక్షకుని మనస్సున నెట్లు క్రమపరిణతి కల్గునో యభినవగుప్తుఁడు వర్ణించినాఁడు. అభినవగుప్తాదుల వాక్యములను, పాశ్చాత్యపండితుల వాక్యములను పరిశీలించువారికే, మనపూర్వుల ప్రతిభ హృదయమునకు గోచర మగును.

రసప్రతీతి కేడు విఘ్నములు గలవని యభినవగుప్తులు తెల్పి నారు.

"విఘ్నాశ్చాస్యాం సప్త, (1) ప్రతిపత్తావయోగ్యతా సంభావ నావిరహోనామ (2,3) స్వగతత్వపరగతత్వనియమేన దేశకాలవిశేషా వేశః (4) నిజసుఖాదివివశీభావః (5) ప్రతీత్యుపాయవైకల్యస్ఫుటత్వా భావః (6) అప్రధానతా (7) సంశయయోగశ్చ, ఈవిఘ్నములు తొలఁగి నపుడే యానందము కల్గును. ఇవి తొలఁగుటకు నటుల వేషరచనాదులు కొంతవఱ కుపకరించును.

"అయ మత్ర సంక్షేపః. ముకుటప్రతిశీర్షకాదినా తావన్నటబుద్ధి రాచ్ఛాద్యతే. గాఢప్రాక్తనసంవిత్సంస్కారాచ్చ కావ్యబలానీయమా నాపి నతత్రరామధీ ర్విశ్రామ్యతి. అతఏవోభయదేశకాలత్యాగః లో మాంచాదయశ్చ భూయసా స్తరతిప్రతీతికారితయా దృష్టాస్తాపి లౌకి కాదేశకాలానియమేన తత్రరతిం గమయన్తి। యస్యాం స్వాత్మాపి తద్వాసనావత్త్వా దనుప్రవిష్టః అతఏవ తటస్థతయా రత్యవగమః, నచ, నియతకారణతయా, యేనార్జనాభిష్వంగసంభావనా, నచనియతపరా త్మకగతతయా యేనదుఃఖద్వేషాద్యుదయః తేన సాధారణీభూతా,

సన్తానవృత్తే రేకస్యా ఏవవాసంవిదః గోచరీభూతా రతిః శృంగారః సాధారణీ భావనాచ విభావాదిభిరితి—" అభినవభారతి.

"విఘ్నబహులేభ్యో విలక్షణం నిర్విఘ్నప్రతీతిగ్రాహ్యం సాక్షాదివహృదయేవివిశమానం, చక్షుషోరివ విపరివర్తమానం భయానకోరసః" అభినవభారతి.

పాశ్చాత్యపండితుల యభిప్రాయమును పరామర్శింతము. పాశ్చాత్యపండితు లందఱును Universality అనునది కావ్యానందహేతువని తెల్పుచున్నారు. Universality అనునది మన యాలంకారికులు తెల్పిన సాధారణీకరణమునకు సరియైన పదము. స్కాపెన్హార్ పండితుఁడీయానందానుభూతి నిట్లు వర్ణించినాఁడు. "He who is sunk in this perception is no longer individual, for in such perception the individwal has lost himself but he is pure, willess, painless, timeless subject of knowledge."

స్టర్జ్‌మూర్ "Sturge Moore" అను పండితుఁడు Armour for Aphrodite అను గ్రంథమున నీభారతీయసిద్ధాన్తమును, యోగసిద్ధాన్తమును తిరస్కరించి దూషించినాఁడు. ఆ వాదమును నిరూపించి ఖండించుటకిచట తావు చాలదు. కాని యాతని కీభారతీయ సిద్ధాన్తము అర్థము కాలేదని మాత్రము తెలుపవలసియున్నది. ఈ విషయము నొక ప్రత్యేకవ్యాసమున నిరూపింతును.

స్టర్జ్‌మూర్ గారు సౌందర్యము,సౌందర్యానుభూతియు దృశ్యాత్మకమని వాదించినారు. మనయాలంకారికు లీవాదము నంగీకరింపరు. కాని పాశ్చాత్యులలో గూడ స్కాపెన్హార్ వలెనే, సౌందర్యము కేవలము దృశ్యాత్మకము గాదని వాదించు వారనేకు లున్నారు. ముఖ్యముగ పై స్టర్జ్‌మూర్ గారి సిద్ధాన్తములను Richards గారి సిద్ధాన్తములను విమర్శించుచు G. Rostrevor Hamilton గారు Poetry and contemplation. (A new preface to poetries) అను గ్రంథమును వ్రాసినారు. కొలది భేదమున్నను, వీరు మనసిద్ధాన్తములతో సదృశములగు సిద్ధాన్తముల నిందు వివరించినారు.

"An aesthetic experience is emphatically not a whole made up of separable parts."

Neither beauty nor fine organization can be attributed to the bare image but only to the aesthetic object, that is to the object of the developing aesthetic experience, which experience is highly objective."

"What is the aesthetic attitude? .... .... It may be described as the altitude of pure disinterested attention. It is partly to be defined by negation. Thus it lacks both curiosity and practical interest."

"We shall rightly say then that beauty does exist in the object of aesthetic experience. In the consummation of such experience we forget ourselves, the distinction between subject and object almost vanishes, we lose ourselves in the object. We enjoy the ecstacy of contemplation far from action far from reflection however soon they may follow."

ఇక నొక్కయంశముతో ముగింతును.

భరతుని హాస్యరసలక్షణము

అథహాస్యోనామ, హాసస్థాయి భావాత్మకః. సచ వికృతపరవేషాలంకారధార్ష్ట్యలౌల్యకుహకాసత్ప్రలాపవ్యంగదర్శనదోషోదాహరణాదిభిర్విభావైరుత్పద్యతే.............. .......... ................
అత్రానువంశ్యే ఆర్యే భవతః

"విపరీతాలంకారైర్వికృతాచారాభిధానవేషైశ్చ
వికృతైరంగవికారైః హసతీతిరసః స్మృతో హాసః

ఈలక్షణమును చూచి, ప్రసిద్ధవిమర్శకుఁడగు Max Eastman పల్కిన వాక్యములివి.

To my mind the old philosophers of India approached this problem wisely. They approached it as a laughing infant must, impersonally. "The comic" they said "in which the permanent condition is mirth may arise from the fun of distorted shapes, words, dresses, gestures etc. That

is the simple truth, in the permanent condition called mirth and called by us the play attitude."

ఇట్లు సామాన్యసూత్రములలోఁ జూచిన ప్రాచ్యపాశ్చాత్య సాహిత్యసిద్ధాన్తములు పరస్పరభిన్నములు కావనియు నందుచే నొకరు మఱియొకరిని నిందింప నక్కఱలేదనియుఁ దెలియుచున్నది. ఒక కావ్యమును గాని, నాటకమును గాని గ్రహించి అదిపాశ్చాత్యుల దృష్టిలో నేదిగొప్పదైనదో, ప్రాచ్యవిమర్శకుల దృష్టిలో నదియేల యుత్తమ కావ్యమైనదో మనము పోల్చి చూచితిమేని రెండు విమర్శనములును సదృశములుగనే యుండును. కాకున్న నొకవిషయమును మాత్రము గమనింప వలయును. ప్రాచ్యపాశ్చాత్యుల తత్త్వశాస్త్రములలో భేద మున్నది. పాశ్చాత్యుల యాధ్యాత్మికదృష్టి ప్రాచ్యులదృష్టికంటె భిన్నమైనది. ఈభేదచ్ఛాయలుమాత్రమాయాసిద్ధాన్తములలోఁగన్పడు చుండును.

[సూచన—ఇది నేనురచించిన "హృదయదర్పణమను" అముద్రితగ్రంథములో నాల్గవ యధ్యాయమున నొకభాగమునకు సంగ్రహరూపము. ఏనాఁడో నేను ధ్వన్యాలోకము ననువదించినప్పుడే, ఈగ్రంథ స్వరూపమును సూచించియు, నీనాటివఱకును, ముద్రణకు వలయు సౌకర్యములులేకుండుటచే నాగ్రంథమును వెలువరింప లేకుంటిని. ఆగ్రంథమున నేకదేశమైనను, ఈరూపమున వచ్చుట కుపకరించిన ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక వారికి కృతజ్ఞుడను ]

భాగవతుల కుటుంబరావు.

---

# గ్రంథస్వీకారము

(1) అరుంధతీవసిష్ఠము:—పద్యకావ్యము—ఆశ్వాసములు మూఁడు-పుటలు 64. కావ్యకర్త శ్రీవిద్వాన్ బులుసు వేంకటేశ్వరులు గారు, బి. ఏ. రామారావుపేట, కాకినాడ. వెల రు 1—0—0.

కోనసీమలో సనాతనధర్మపరాయణతకు విశ్రుతిగన్న వైదిక కుటుంబమున జనించిన యీ కవి కుమారునకు, ఆర్షసంస్కృత్యభిమానము, గురుభక్తి తత్పరత సహజగుణములు; అందుచేఁ దద్విశేషములు వీరి రచనముల కాలంబమగుట స్వతస్సిద్ధము- ఇట్టి సంస్కృతి సంపన్నతతో నింతకుమున్ను వీరు ప్రకటించిన "అహల్యాగౌతమము" వంటిదే ప్రకృతకృతి- కర్దమప్రజాపతితనయ యరుంధతి తన యనుపమ భక్తిమహిమమున వసిష్ఠబ్రహ్మర్షిని మెప్పించి, వరించి, పతివ్రతాతిలకమై వఱలిన చరితమిందలి యితివృత్తము- ఉమామహేశ్వరులు, లక్ష్మీనారాయణులు వలెనే, అరుంధతీవసిష్ఠులు జగంబున కాదర్శకమయిన పురాణదంపతులు- అరుంధతీపాతివ్రత్య మద్వితీయశోభాయమానము_ సీతారాముల పునస్సమాగమమునకు భవభూతిమహాకవి తన యుత్తర రామచరితమున అరుంధతీవచః ప్రామాణ్యమునే ప్రబలసాధకముగాఁ గొనియుండుట సర్వవిశ్రుతము.

ఇసుకతో నన్నపానీయముల ఘటింపఁగల్గుశక్తిమున్నగు విషమ పరీక్షలలో నుత్తీర్ణయై యరుంధతీదేవి వసిష్ఠునిఁ జేపట్టుట, ఆతనితోఁ గాఁపురము సేయుకాలమున గంగాతీరమునఁ దమ యాశ్రమమున కవతలియొడ్డున వసించు అగస్త్యమహర్షి కాతిథేయము నొసంగి వచ్చు దినములలో నొకనాఁడు నది పొంగిపొరలుచుండఁగా నిజాశ్రమము నుండి వెడలునపుడు సదా బ్రహ్మచారి పనుపనియు, అగస్త్యాశ్రమము నుండి మరలివచ్చునప్పుడు నిత్యోపవాసి యానయనియు మనవిసేయ నామె కానదీమతల్లి తెరువిచ్చుటయు నీ కావ్యమందలి ప్రధానాంశ

ములు- క్రీ॥ శ॥ 1020 ప్రాంతమందుండిన తేడరదాసిమయ్యయను శివభక్తవరుని వరించుసమయమున దుగ్గళవ్వయను భక్తురాలిట్టులే యిసుకతో నన్నమునువూర్చు పరీక్షకు లోనయి యాతనిని జేపట్టెనని వీరశైవవాఙ్మయమున నొక యైతిహ్యమున్నది. ఏ కాలమందయినను అచంచల పతిభక్తి సంపన్నలగు పతివ్రతామణుల కసాధ్యమైనది లేదు. గురుప్రసాద లబ్ధమయిన యీ కృతికర్త కవితాధారకు ప్రసాదసౌకుమార్యములు సహజాలంకారములవుటచేఁ గావ్యమంతయు మృదుమధుర శైలితో నలరారుచున్నది. మచ్చున కొకపద్యము-

మ. మునిమూర్ధన్యుఁడు భక్తిమ్రొక్కి పరమా ♦ మోదంబునం జేతఁ గై
కొని నేత్రంబుల కద్దికొంచు శుచియై ♦ ఘోరాఘసంతానముల్
కనిదావవ్వలనుండి పాఱఁగ జగ ♦ త్కల్యాణ దంబై యవి
ద్యను నాశంబొనరించు నక్షసరముల్ ♦ దాల్చెన్ మహోత్సాహియై.
(ఆ 3 ప 60)

అందందుఁ గొన్ని విశేషప్రయోగములు, యతివిశేషములు నీలఘుకృతియందుఁ గానవచ్చుచున్నవి. మచ్చునకుఁ గొన్ని.

1. జగ జెట్టికిఁ బుట్టువులనీఁగు సిరిమంతునకున్ (ఆ 1 ప 23)
2. సృష్టిగా నామె చేడ్పడి చూడనతఁడు (ఆ 1 ప 95)
3. ముద మొప్పన్ విహరించుచున్ వెలయు పూవుంబోఁడి (ఆ 2 ప 48)
4. లకోరులుమటినమ్మి ముత్తయిదులున్ సమకూర్చి గృహప్రవేశమున్. (ఆ 3 ప 10).

(2) శ్రీమహర్షి జీవితకథామృతము- 3 వ భాగము- వచనము- పుటలు 103. వెల రు 1—0—0.

దీని కర్తకూడ శ్రీ వేంకటేశ్వరులుగారే. వీ రింతకుమున్ను ప్రకటించిన యొకటి రెండుభాగములలో ఇరువదియిద్దఱు మహర్షుల చరితములున్నవి. అంగిరసుఁడు, ఔర్వుఁడు, కండుఁడు, కణ్వుఁడు, కర్దముఁడు, గర్గుఁడు, గౌరముఖుఁడు, జాబాలి యనెడి మఱియెనమండ్రు మహా

ర్షుల చరితములు ప్రస్తుతభాగమున వివరింపఁబడినవి. ఆర్ష సంస్కృతి భారతీయులలో నడుగంటుచున్న నేఁటి కాలమున నిట్టి గ్రంథములు రచించి దాని కుజ్జీవనము గలిగింపవలసిన యావశ్యకత యెంతేని యున్న దని చెప్పనక్కఱలేదు. వైదికపౌరాణికవాఙ్మయములఁ బరిశోధించి వేర్వేఱు తావులనున్న మహర్షి జీవితచరిత విశేషముల సంకలన మొనర్చి యొక్కచోఁ జేర్చికూర్చెడి వీరి యుద్యమము ప్రశంసనీయము. పద్యశైలివలెనే వీరి వచనరచనగూడ లలితమయి మనోహరముగ నున్నది. తక్కిన భాగములఁగూడఁ ద్వరలో బ్రకటించుటకు వలసిన యాదరప్రోత్సాహముల గ్రంథకర్త కాంధ్రలోక మొసంగుఁగాక !

గురుభక్తితత్పరులగు వీరు పై రెండు కృతులనుగూడఁ దమ సద్గురుమూర్తికే యంకిత మొనర్చుట ముదావహము.

(3) వీరశైవాంధ్రవాఙ్మయము- వచనము- పుటలు 400. వెల 5-0-0 కర్త శ్రీ శిష్టా రామకృష్ణశాస్త్రిగారు, M. A. B. O. L. ప్రకాశకులు:- శ్రీ వేంకటేశ్వరప్రాచ్యపరిశోధనాలయము- తిరుపతి.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తువారు 1947 సంవత్సరమున "సర్. ఆర్. వేంకటరత్నము రీసర్చి మెడలు" ప్రదానమున కయి నియమించిన విషయము "వీరశైవాంధ్రవాఙ్మయము". అప్పుడు దానికయి యభ్యర్థులు పంపిన వ్యాసములలో (Theses) బహుమతి నొందిన తమ వ్యాసమునే గ్రంథకర్తలు కొన్ని మార్పులు, చేర్పులుగావించి ప్రస్తుతగ్రంథ రూపమునఁ బ్రకటించి యున్నారు. తెలుఁగులో శైవవాఙ్మయము పురాణములు, ప్రబంధములు, చరిత్రలు, శతకములు, స్తుతులు, మాహాత్మ్యములు, గద్యలు, రగడలు, యక్షగానములు, వచనములు- ఇత్యాది శాఖోపశాఖలుగా నున్నది. భారతీయుల మతములలో శైవము చాలఁ బ్రాచీనమయినది. శ్రుతిస్మృతిపురాణములు, శివాగమములు, ఉపనిషత్తులు దీనికిఁ బ్రమాణగ్రంథములు. ఈ మతమునందు శివాగమములలోఁ గొన్నిట నాలుగు, మఱికొన్నిట ఏడు, పది యవాంతరభేదములు చెప్పఁబడియున్నవి. వీనిలోఁ గేవలము ఇష్టలింగధారణ

ము విహితముగా విధింపఁబడినది వీరశైవము. దశవిధావాంతరభేదము లను సూక్ష్మముగఁ బరీక్షింపనివారు కొందఱు, ఇష్టలింగధారణ మానుషంగికముగాఁ గల శ్రౌతమార్గశైవములను గూడ స్థూలదృష్టితో వీరశైవముక్రిందనే గణింతురు. వీరశైవులకు విశిష్టములయిన అష్టావరణములలో (భూతి, రుద్రాక్షు, మంత్త్రము, గురువు, లింగము, జంగమము, పాదతీర్థము, ప్రసాదము) మొదటి మూఁడు తదితరశైవులకుఁ గూడ విహితములవుటచేతను, వాని మాహాత్మ్యవర్ణనాదికములు సాధారణముగా శైవవాఙ్మయమందంతట నుండుటచేతను, శైవ, వీరశైవవాఙ్మయ విభాగమును సరిగా నిర్ధరించుట కష్టమే యగును. శివాగమపరిజ్ఞానము, వీరశైవసంప్రదాయజ్ఞత తగినంత లేక గ్రంథకర్తలు కేవల మితరులందందుఁ బ్రకటించిన వ్యాసములను, గ్రంథములను, పీఠికలను, అవలోకించి వాని సాయమునఁ బ్రకృతగ్రంథమును గూర్చుటచేఁ బూర్వోక్తవిభాగముననేమి, వీరశైవమతచరిత్ర తత్త్వనిరూపణముననేమి కొన్ని లోపము లిందు దొరలినవి.

ఇందు మొదటి 33 పుటలు ఉపోద్ఘాతమునకు నియుక్తమయి, తక్కిన గ్రంథభాగము, మల్లికార్జునపండితారాధ్యుఁడు, పాలకురికి సోమనాథుఁడు, పిదప ర్తి కవులు, శైవమతము, పురాణములు, మాహాత్మ్యములు, ప్రబంధములు, శతకములు, యక్షగానములు, పరిశిష్టము, అను పది ప్రకరణములుగ విభక్తమయినది.

"ప్రస్తుతవిషయము కేవలము వీరశైవాంధ్రవాఙ్మయమగుటచే సామాన్యశైవమునకు సంబంధించిన నన్నెచోడ కుమారసంభవము, శ్రీనాథుని గ్రంథములు మొదలైనవానినన్నిటిని పరిహరించితిని" అని పీఠికలో గ్రంథకర్త లుగ్గడించినారు. కాని యట్టివేయగు శ్రీశైల మాహాత్మ్యము, శివరహస్యఖండము, (అక్కనార్యుని) శివరాత్రి మాహాత్మ్యము, నవనాథచరిత్రము, ఒడయనంబివిలాసము, మలహణ చరిత్రము మున్నగు నితరకృతు లనేకములు పరిగ్రహించి గ్రంథవిస్తర మొనర్చియున్నారు. మల్లికార్జున పండిత, శ్రీపతి పండితుల చరితములు

గల పండితారాధ్య చరిత్ర, ధర్మగుప్తాభ్యుదయకృతులను గైకొనియు, ఉద్భటారాధ్యునిగూర్చి తెనాలిరామలింగకవి రచించిన ప్రబంధమేల విడనాడిరో తెలియకున్నది. ఇట్లే తా ముదాహరించిన పయి నిర్వచనమునకే భిన్నముగా, అవసరములయిన కృతులు కొన్ని పరిహరించుట అనవసరములయినవి కొన్ని పరిగ్రహించుట జరిగించియున్నారు.

ఇఁక వీరశైవతత్త్వవిషయమున శ్రౌతమార్గశైవ, వీరశైవ విభేదములను, వీరశైవపంచాచార్యులయుఁ దత్పీఠములయుఁ ప్రాచీనతను గుర్తింపక మల్లికార్జునపండితాది మార్గశైవులు వీరశైవపంచాచార్యుల సంప్రదాయమునకుఁ జెందినవారని తలంచుట మున్నగు భ్రమప్రమాదములకు లోనయి తదనుగుణముగ సత్యేతరములగు నభిప్రాయములు కొన్ని ప్రకటించియున్నారు.

గ్రంథము మొదటి మూఁడు ప్రకరణములు తన్నామముల బట్టియే వీరశైవాంధ్రవాఙ్మయనిర్మాతలలోఁ బ్రధానులయిన మల్లికార్జున పండిత, పాలకురికి సోమనాథ, పిడుపర్తి బసవనసోమనాథాదుల చరిత్ర కృతివివరణములకై వినియుక్తమగుట విస్పష్టము. విమర్శకలోకమున వివాదగ్రస్తములుగ నున్న పాలకురికి సోమనాథుని కులకాల విషయకచర్చలలో నీ గ్రంథకర్త లోక పక్షమునకుఁ జెందినవారు. అనుభవసారము సోమనాథుఁడు బాల్యమున రచించిన ప్రథమకృతియని వీ రంగీకరించియు నందాతఁడు వీరశైవసంప్రదాయ సిద్ధముగఁ జెప్పికొన్న భృంగిగోత్రజత్వము శివకులీనత్వము నాతని సహజవీరశైవత్వమునకే సాధకములు కాఁగలవని గ్రహింపకుండుట యుక్తిసహము కానేరదు. "అనుభవసారరచనాకాలమునకు సోమనాథుఁడు బసవని పేరయిన వినియుండఁడు" అని వీరు వ్రాసిన వాక్యము సత్యమనుటకు వీలులేదు. మల్లికార్జునపండితుని శివతత్త్వసారమును లెస్సగాఁ జదివి యా గ్రంథమును బండితునిఁ బ్రత్యేకముగా మూఁడు పద్యములలో అనుభవసారమున నుతించిన సోమనాథునకు మల్లికార్జునపండితునిచే శివతత్త్వసారమున మూఁడు పద్యములలోఁ బ్రశంసింపఁబడిన బస

వేశ్వరునియొక్కయు, మఱికొన్ని యితరపద్యములలో స్తుతింపఁబడిన తత్సమకాలీనులగు మఱికొందఱు భక్తులయొక్కయు నామములైన నెఱుఁగరావని విజ్ఞులెవరు చెప్పనేర్తురు ? పిన్నతనమునఁ గూర్చిన కృతి యవుటచే అనుభవసార రచనాకాలమునాఁటికి సోమునకుఁ గొంతవఱ కాంధ్రగీర్వాణభాషాజ్ఞానమే గాని, కర్ణాటభాషాపరిచయము, ఆభాష లో బసవేశ్వరుఁ డుత్కృష్టధర్మ, సత్య, వేదార్థప్రతిపాదకములుగ రచించిన కృతులయొక్క పరిజ్ఞానము, తన్మూలకమయిన బసవభక్తి పారవశ్యము కలుగలేదని తలంచుటయే సత్యసమ్మతముగ నుండును.

సోమనాథుఁడు తాను పండితారాధ్యకృపాసముద్గతుఁడగు కరస్థలి సోమనాథునివలన బసవపురాణ కథాసూత్రముల గ్రహించితినని చెప్పి కొనుట, పండితారాధ్యుని సమకాలీనుఁడయిన బెలిదేవ వేమనారా ధ్యుని మనుమని శిష్యుఁడనని వ్రాసికొనుట, పండితారాధ్యచరిత్ర రచనాకాలమునాఁటికి సజీవులైయున్న పండితారాధ్యుని పౌత్రులఁ జేరొక్కని వారి నాశీర్వదించుట, సహజసరళ సక్రమమార్గముల సమన్వ యించినచో నాతఁడు రెండవ ప్రతాపరుద్రుని కాలమునకుఁ బూర్వుఁ డనియే గోచరింపఁగలదు. పండితారాధ్యకృపాసముద్గతుఁడనఁగా పండి తారాధ్యునిచే హస్తమస్తకసంయోగ పూర్వకలింగదీక్షనొందిన శిష్యుఁ డనుటయే సంప్రదాయసిద్ధమయిన యర్థము. దీనికి "పండితు నుపా సించుటచే (జనకులకు) పుట్టినయని యర్థము చెప్పవలయును" అని వీరు గావించిన నిర్వచనమును, సోమనాథుని ప్రయోగసంప్రదాయ ములను, మతసంప్రదాయములను గుర్తించినవా రంగీకరింపఁజాలరు. ఇట్లే స్వపక్షసమర్థనమునకయి వీరు సోమనాథుని కాలవిషయమున వెలువరించిన సంగతులు సత్యసహములనుటకు వీలులేకున్నది.

ఈగ్రంథమున నుదాహృతములయిన పూర్వకృతులనేకము లముద్రితములు - ప్రాచ్యలిఖిత పుస్తకాలయ మందలి తాళపత్త్రప్రతుల బట్టి గ్రంథకర్తవాని నిందు వివరించుటచేఁ దదూపకముగ నిదిపాఠక లోకమున కత్యంతోపకారకమని చెప్పనక్కఱలేదు. ఆంధ్రభాషలో

వివిధరూపములనున్న వీరశైవవాఙ్మయస్వరూపమును గుర్తింపనెంచు వారికీ గ్రంథము మిక్కిలియుపయోగించును— గ్రంథాంతమునఁ జేర్చిన (1) వీరశైవాంధ్రకవులు; వారిగ్రంథములు (2) వీరశైవాంధ్రద్విపద గ్రంథములు; తత్కర్తలు; (3) ఏకకథావిషయము నాశ్రయించి చేసిన వివిధరూపకరచనములు; తత్కర్తలు, (4) కర్తృనామములు తెలియని గ్రంథములు; (5) నష్టగ్రంథములు; తత్కర్తలు, అనెడియనుబంధ ములుగూడఁజాల నుపయుక్తమయినవి.

వీరశైవాచార సంగ్రహకర్త శివరామలింగకవి గోకర్ణమఠాధీశ్వరుఁడయిన సోమశేఖరదేవుఁడనివీరు వ్రాసినదిసరిగాదు. ఆకృతిచివరిగద్యవలన నాతఁడుగోకర్ణమఠాధీశ్వరుఁడుగాక యామఠమునకుఁజెందిన శిష్యుఁడనియేస్పష్టమగును. శివ అనుబంధములో ప్రభులింగలీలకృతికర్తలలో పిడుపర్తిసోమనపేరు పద్యకావ్యములక్రిందను, పిడుపర్తి బసవప్ప పేరు ద్విపదలక్రిందను తారుమారుగ నుదాహృతములయినవి. ఇట్టిలోపములుగూడ నందందుఁగలవు. ప్రకాశకులయశ్రద్ధచే అచ్చుతప్పులుగూడ హెచ్చుగా దొరలినవి. శుద్ధపత్రికయైనను జేర్పలేదు.

గ్రంథము పునర్ముద్రణమొందుచో గ్రంథకర్త ప్రకాశకులు గూడ గ్రంథసంస్కరణ విషయమున విశేషశ్రద్ధవహింపఁదగును.

---

శ్రీ వేంకటేశ్వరస్తుతి రత్నమాల:—ద్వితీయసరము, పుటలు 88+33 (పీఠిక). వెల రు 2-0-0

ఇదిగూడ శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాలయ ప్రచురమే; పూర్వాంధ్రకవుల గ్రంథములలో శ్రీతిరుపతి వేంకటేశ్వరస్వామిస్తుతి పరముగా నున్నపద్యములఁ గొన్నిటిని కీ. శే. శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారు సంకలన మొనర్పఁగానవి యీపేరితోనే యీపరిశోధనాల యమువారే యిదివఱలోఁ బ్రథమసరముగాఁ బ్రకటించి యున్నారు. ప్రభాకర శాస్త్రిగారి యనంతరము వారిపదవియందు నియుక్తులైన శ్రీకోరాడ రామకృష్ణయ్య ఎం. ఏ. గారు, ఇట్టిపద్యములను మఱికొన్ని టినిగూర్చి ప్రకృతగ్రంథమును సంఘటించినారు. శ్రీకృష్ణ దేవరాయలు రచించిన "ఆముక్తమాల్యద" మొదలుకొని క్రీ. శ. 1500-1850 మధ్య రచింపఁబడిన పందొమ్మిది కృతులనుండి యేర్చిన శ్రీ వేంకటేశ్వరస్తుతి రత్నము లిందుఁగలవు. వేర్వేఱు కాలములందలి యాంధ్రకవులు గావించిన శ్రీవేంకటేశ్వర స్తుతిపద్యముల నొకచోఁజదివి యానందించుట కిట్టి సంకలనగ్రంథములు భక్తులకు మిక్కిలి యుపకరింపఁగలవు. వేంకటాచలము నచ్చట వెలసిన వేంకటేశ్వరస్వామిగూర్చినప్రశంసలు,స్తుతులు, ఆంధ్రకృతులలోఁ బదు నాల్గవ శతాబ్దికి ముందు గానరాకుండుటకుఁగల కారణములనుగూర్చి శ్రీరామకృష్ణయ్యగారు పీఠికలోఁగొంతచర్చించి యున్నారు. చరిత్ర జిజ్ఞాసువులకిది యుపయుక్తము.

ఇందుఁగైకొనిన కృతులలో తాళ్లపాక అన్నమాచార్యుని కుమారుఁడు పెదతిరుమలయ్య రచించిన"వేంకటేశశతక"మొకటి. అందలి పద్యము లాఱెందుచామృతములయినవి. ఈకవి క్రీ. శ. 1500-1530 ప్రాంతమువాఁడు. ఈసీసపద్యశతకములోని

"పదుగురాడెడిమాట పాటియై ధరఁజెల్లు । నొక్కఁడాడినమాట యెక్కఁదెందు
నటకయుండినవాని కూర్లెల్ల నోపదు । నిజముముందరకల్ల. నిలువదెపుడు"

అను పద్యపాదముల కనువాద రూపకమయినదొకటి వేమనపద్యములలోఁ గలదు. గుంటుపల్లి ముత్తనామాత్య (క్రీ.శ.1623) ప్రశంసనున్నగు నాధారములతో, వేమన కొండవీటి రెడ్డిరాజకుటుంబ ములోని వాఁడుగాక క్రీ.శ.-1700 ప్రాంతమందుండిన కర్షకకుటుంబము నకుఁ జెందిన రెడ్డికులజుఁడని నిర్ణయించువారికి, పై పద్యముగూడ సాధకము కాఁగలదు.

# రసము కిన్నిష్ఠము?

దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ. (ఆనర్సు).

కావ్యమునకుఁ బరనిర్వృతి కారణమైన రసానందమే పరమ ప్రయోజన మని సంస్కృతలాక్షణికు లెల్ల రంగీకరించి యున్నారు. ఈయానందము రసానుభవహేతుక మైనట్టిది. బ్రహ్మసృష్టివలెనే కావ్యసృష్టియుఁ బంచభూతాత్మకమై యుండును. కవి, వస్తువు, భావము, శబ్దము, పాఠకుఁడు అను నైదును గావ్యసృష్టికి సంబంధించిన పంచభూతములు. ఇందు వస్తువు, నాయకాదులు, తద్వ్యాపారము అని రెండువిధములు. భావము, శబ్దము, నాయకాది వ్యాపారభూతమైన వస్తువు అనునవి రసానుభవమునకు సాధనము లైనవే. కాని సాధకము లైనవి కావు. ఇంక మిగిలిన కవి నాయక పాఠకాదులలో రసము ననుభవించువా రెవ్వరో నిర్ణయింప వలెను. భట్టతౌతుఁడు కావ్యకౌతుకమున "నాయకస్య కవేః శ్రోతు స్సమానోఽనుభవ స్తతః" అని పై మువ్వురును సమానమైన యనుభవమునే పొందుదు రని చెప్పి యుండెను. కాని యితర లాక్షణికులు పలువురు రసము పాఠక (సామాజిక) నిష్ఠ మనియే యభిప్రాయ పడియుండిరి.

సంస్కృత లాక్షణికులలోఁ దొలుఁదొల్త రసవిషయకమైన చర్చ కావించిన వాఁడు భరతముని. ఆతఁడు నాట్యశాస్త్రములో "విభావానుభావ వ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః" అనియొక సూత్రమును వివరించెను. ఇందు రసమునకుఁ బూర్వరూపమైన స్థాయిభావము ప్రసక్తియే లేదు. పైఁగా నిందలి సంయోగనిష్పత్తి పదము లస్పష్టార్థములుగా నున్నవి. ఈసూత్రము నాధారముగా గ్రహించి పలువురు లాక్షణికులు రసపరిణామ ప్రకారమును వివరింప యత్నించిరి. వారిలో భట్టలోల్లట, శ్రీశంకుక, భట్టనాయక, అభినవగుప్తులు నలుగురును నాలుగు భిన్నవాదముల నావిష్కరించి యుండిరి. వానికిఁ గ్రమముగా నుత్పత్తి, అనుమితి, భుక్తి, అభివ్యక్తి వాదములని పేరు. వానిని బరిశీలించినచో రసము యద్గతమో తెలియవచ్చును.

పై నలువురు లాక్షణికులలో లోల్లట శ్రీశంకుక భట్టనాయకుల గ్రంథము లిప్పు డుపలభ్యమానము లగుటలేదు. అభినవగుప్త మమ్మటాదులు భరతరససూత్రమునకు వ్యాఖ్యానము చేయుసందర్భమున స్వమతముఁ బ్రతిష్ఠించుచు విమర్శన పూర్వకముగా పై వారి వాదములను సూచించి యుండిరి. వా రుద్ధరించిన వాక్యములను బట్టియే రసవిషయమునఁ బై లాక్షణికులకుఁ గల యభిప్రాయములను మనము గ్రహింపవలయును.

భట్టలోల్లటుని మతమున రసమ నుకార్యనిష్ఠమైనది. అనుకార్యులనఁగా నా యా కావ్యములందు నాయకులైన రామాదులు. ఆలంబన విభావములైన సీతామారాదుల చేతను, నుద్దీపనవిభావములైన యారామాదులచేతను, నాయకులైన రామాదులందు రత్యాదులగు స్థాయిభావము లుదయించి, కటాక్షభ్రూవిక్షేపస్మితాదులగు ననుభావములచే స్పష్టత్వమునొంది, నిర్వేదగ్లాన్యాదులగు వ్యభిచారిభావములచేఁ బరిపుష్టమై రసముగాఁ బరిణమించును. నాటకకర్త నాటకమున రామాది నాయకుల ప్రేమను లలితోచితములైన శబ్దములతో వర్ణించును. నటుఁడు వారి భావములను, వ్యాపారములను గడుంగడు మెలఁకువతో నభినయించును. అభినయసందర్భమున నటులు ప్రదర్శించు నైపుణ్యముచే సామాజికులు రామాదులగు ననుకార్యుల మానసిక ప్రవృత్తులే వారియందును నున్నట్లు భ్రమింతురు. అనఁగా వారు నటులందు రామత్వాదు లారోపించి వారే రామాదులని భ్రాంతి నొందుదురు. అప్పుడు నిజమునకు రామాద్యనుకార్యుల యందే యుండు రసము వారిభూమిక ధరించి నటించు నటులయందు లేకున్నను ఉన్నట్లే భాసించును. అట్టి నటుని దర్శించుటవలన రామాది నిష్ఠమగు రసము స్ఫురించుటయుఁ దజ్జన్యమగు 1. చమత్కారము వశమున సామాజికు లానందిం

1. "నటేతు తుల్యరూపతానుసంధానవశా దారోప్యమాణః సామాజికానాం చమత్కారహేతుః" అని ప్రదీపకారుఁడును "సహోభయోరపి ముఖ్యయా వృత్త్యా రామాదావనుకార్యేఽనుకర్తరి చ నటే రామాదిరూపతానుసంధానబలాదితి" యని అభినవ గుప్తుఁడును జెప్పుచున్నారు.

చుటయు సంభవించును. నటునియందుఁ గలుగు ననుకార్యభ్రాంతి సామాజికుని కానందము కలిగించుటకు రజ్జువును జూచి సర్ప మని భ్రమించి భీతినొందు మానవుల వ్యాపారము దృష్టాంతముగాఁ జూపఁ బడినది. ఈవాదము ననుసరించి రసము రామాదులం దుత్పన్న మగు చుండుటచే దీని కుత్పత్తి వాదమను పేరు కలిగినది.

ఈవాదమునఁ గార్యకారణములకు సామానాధికరణ్యము లేక పోవుట ప్రధానదోషము. రామాద్యనుకార్యగతమైన రసము వారికా నందము కలిగించును గాని సంబంధము లేని సామాజికుల కెట్లానం దము కలిగింపఁ జాలునో యిందు స్పష్టముగా వివరింపఁ బడలేదు. సీతాదులు రామాదులకే విభావములుకాని సామాజికులకు విభావ ములు కారు గదా? రామాదుల యానందమును జూచి యానందము నొందు సామాజికులు వారు దుఃఖము నొందు నప్పుడు దుఃఖము కూడఁ బొందుదు రని చెప్పవలసి వచ్చును. అందుచేఁ గరుణము ప్రధానరస ముగాఁ గల నాటకాదులు సామాజికుల కానందము నెట్లొసంగునో యిట వివరింపఁ బడియుండలేదు. ఇచ్చట దృష్టాంతముగాఁ జూపఁబడిన రజ్జుసర్పభ్రాంతికిని నటనాయకభ్రాంతికిని బోలికలేదు. మొదటిదాని యందు భ్రాంతికారణము, భయము కార్యము. ఈకార్యకారణములు రెండింటికి నాకరమైన వారొక్కరే. రెండవ దానియందు స్థాయిభా వము కారణము, ఆనందము కార్యము. కారణ మనుకార్యుని యం దుండఁ గారణము సామాజికునియందుఁ గానవచ్చుటలో సామంజస్యము లేదు. ఈవాదమున సామాజికుఁ డనుభవించునది చమత్కార జనిత మైన యానందమేకాని రసము కాదు.

శ్రీశంకుకుని మతమున రస మనుమితివిషయమైనది. నటు లభిన యమునందుఁ దమకుఁగల నేర్పుచే నాయకాదుల వ్యాపారములను జక్కఁగా ననుకరింతురు. అప్పుడు సామాజికు లాయనుకరణమును జూచి నటులే యనుకార్యులని (నటులు నాయకాదులకంటె భిన్నులు

కారని తలంతురు. నటులభినయించు విభావానుభావవ్యభిచారులయొక్క సంయోగమువలన తార్కికవ్యాప్తి ననుసరించి వారు నటులయందుం గూడ రత్యాదుల ననుమానింతురు. ధూమ మున్నచోట నగ్ని యుండు ననియు, ధూమములేనిచోట నగ్ని లేదనియు ననుకొనుటకుం దార్కిక వ్యవహారమున వ్యాప్తి యనిపేరు. ఈవ్యాప్తి ననుసరించి సామాజికులు నాయకాభిన్నులుగా గ్రహింపఁబడిన నటులందు రత్యాదు లుండుటచే రసము కూడ నున్నదని యనుమానింతురు. తరువాత నటులందలి రత్యాది స్థాయిభావములనే వా రనుభవించి యానందింతురు. ఈమతమున నటుఁడొనరించు నిపుణమైన యనుకరణముచే సామాజికుఁడు చిత్రతురగన్యాయము ననుసరించి నటులే నాయకాదులని విశ్వసించుచు నాయకాదు లందలి రసముకూడ నటనిష్ఠమై యున్నట్లనుమానించును. అందుచేతనే దీని కనుమితివాద మని పేరు కలిగినది.

భట్టలోల్లటుని మతమునవలెనే యిందుఁగూడఁ గార్యకారణములకు సామానాధికరణ్యము కానఁబడదు. నాయకాదు లందుండి నటులందనుమానింపఁబడిన రసము సామాజికుల కెట్లానందము కలిగించునో యిట వివరింపఁ బడలేదు. చిత్రతురగన్యాయ మిచ్చట సరిపడదు. చిత్రము నందలి తురగ మెంతనిపుణముగాఁ జిత్రింపఁబడినను యథార్థ తురగమువలె నుండునే కాని నిజముగాఁ దురగము మాత్రము కాఁజాలదు. మఱియుఁ బ్రత్యక్షజ్ఞానము చమత్కారమును గలిగించునట్లనుమానజ్ఞానము గలిగింప నేరదు. రసమును బ్రత్యక్షముగా ననుభవించుచున్నానను మాట లోకమున నుండఁగా సామాజికుఁ డనుమానజ్ఞానముచే రసము ననుభవించుచున్నాఁ డనుట స్వభావవిరుద్ధము. తా మెన్నఁడును జూడని నాయకాదుల వ్యాపారములను నటు లనుకరించుటయు, వానిని జూచి సామాజికులు నటులే నాయకాదులని యనుమానించుటయు విశ్వసనీయవిషయములు కావు. ప్రఖ్యాతనాయ

---

"ఏతదస్యహృదయగ్రాహి యతః ప్రత్యక్షమేవజ్ఞానం సచమత్కారమ్, నానుమిత్యాదిరితి లోకప్రసిద్ధి మవధూయాన్యథాకల్పనే మానాభావః". కావ్యప్రకాముపై ప్రదీపము.

కుల వ్యాపారములను గ్రంథస్థితవర్ణనాదుల ననుసరించి నటు లనుకరింపఁ జాలినను గల్పిత నాయకాదుల వ్యాపారములను గూడ వారను కరించి రనుట హాస్యాస్పదము గానుండును.

భట్టనాయకుని మతమున రసము ప్రతీయమానము కాని, ఉత్పాద్యమానము కాని, అభివ్యజ్యమానము కాని కాదు. "కావ్యనాట్యములం దభిధాశక్తి కంటె భిన్నమును, విభావాదిసాధారణాత్మకము నగు భావకత్వవ్యాపారముచే భావ్యమానమై స్థాయిభావము సత్త్వోద్రేక ప్రకాశానందమయసంవిద్విశ్రాంతి సతత్త్వమగు భోగముచే భుజ్యమాన మగుచున్న దని భట్టనాయకు నభిప్రాయమైనట్లు కావ్యప్రకాశము నుడువు చున్నది. రసాస్వాదము పరబ్రహ్మ సాక్షాత్కార తుల్యమైన దనియుఁ బరబ్రహ్మవలెనే రసముకూడ నానందమయ మైన దనియు భట్టనాయకుఁడు తలంచెను. ఈతని మతమున శబ్దమున కభిధాశక్తి కాక భావనాభోగీకృతు లను మఱి రెండు వ్యాపారములు కూడ నుండును. వీనికే భావకత్వవ్యాపారము, భోగకృత్త్వవ్యాపారముననినామాంతరములు. 1. అభిధావ్యాపార మలంకారశాస్త్ర నిర్దిష్టమైనదే. ఇది శబ్దముయొక్క వాచ్యార్థమును బోధించును. ఇది ముగిసిపోఁగానే భావకత్వవ్యాపార మారంభించును. ఇది శబ్దము యొక్క రసాదులను బోధించును. (శృంగారరస సందర్భమునఁ బరుషపద ప్రయోగ ముచితము కాదనుట యీ వ్యాపారము చేతనే. పరుష శబ్దమునకైనను లలిత శబ్దమునకైనను వాచ్యార్థమాత్రబోధకమైన యభిధావ్యాపారము సమానమే) ఈవ్యాపారముచే సీతారామాదులగు విభావములు తమ ప్రత్యేకతను గోల్పోయి సామాజికునికి సామాన్యములుగా గోచరించును. అనఁగా సీతాదులు సాధారణస్త్రీత్వముతోడను రామా

1. అభిధా భావనా చాన్యా తద్భోగీకృతి రేవచ
అభిధాధామతాం యాతే శబ్దార్థాలంకృతీ తతః
భావనాభావ్యఏషోఽపి శృంగారాదిగణోమతః
తద్భోగీకృతిరూపేణ వ్యాప్యతేసిద్ధిమా న్నరః
అను శ్లోకముల నభినవగుప్త హేమచంద్రాదు లుదాహరించిరి.

దులు సాధారణ పురుషత్వముతోడను గోచరింతురు. ఇట్లు విభావములు సాధారణములుగాఁ జేయఁబడుటచే సాధారణీకరణ మనిపేరు. దీనివలన సామాజికునకు నాయకాదులతో నభేదత్వ మావహిల్లును. ఇంతటితో భావకత్వవ్యాపారప్రభావ మవసితమగును. అంత మూఁడవది యైన భోగకృత్త్వ (భోజకత్వ) వ్యాపారము పనిచేయ మొదలిడును. దీనిచే సాధారణీకృతములైన రత్యాది స్థాయిభావములు సామాజికులచే ననుభవింపఁబడును. అప్పుడు వా రానందమయ మైన యొకానొక స్థితిని బొందుదురు. ఇదిసాధారణము లైన యనుభవములకంటెను స్మృతులకంటెను విలక్షణమై పరబ్రహ్మాస్వాదతుల్యమై, స్వసంవేద్యముగా నుండును. ఈస్థితిలోఁ జిత్తమునకు ధృతి, విస్తారము, వికాసము అను ధర్మము లేర్పడును.

భోగకృత్త్వవ్యాపారముచే సామాజికు లందలి రజస్తమోగుణము లడంగి వారిహృదయముల సత్త్వోద్రేక మతిశయించును. అప్పుడు వారానందమగ్నులై పరిసరములనే కాక తమ్ముఁగూడ మఱచి వినుచున్న లేక చూచుచున్న వస్తుదృశ్యములతో నేకీభావము నొందుదురు. ఈమతమున విభావాదులు భోజకములును, రసము భోజ్యము నగుటచే దీనికి భుక్తివాదమని పేరు కలిగినది.

భట్టనాయకుఁడు తనమతమునఁ గార్యకారణములకు సామానాధికరణ్యము లేకపోవుట యను దోషమును బరిహరింప యత్నించెను. కాని భావకత్వవ్యాపారముచే విభావములును రత్యాదులును సాధారణీకృతములైనను సామాజికులు మొట్టమొదటఁ దమయందు బీజరూపముగానైన లేనట్టి స్థాయిభావముల ననుభవించుటయు నాయకాద్యభేదము నొందుటయు నించుక యసంగతములుగా నున్నవి. అదిగాక భట్టనాయకుఁడు శబ్దమున నుండునని చెప్పిన యభిధాభిన్నములైన భావకత్వభోగకృత్త్వవ్యాపారములు కేవల కల్పితములైన వగుటచేఁ బ్రామాణికసమ్మతము లైనవి కావు. వ్యంజనయే భావకత్వవ్యాపారము నిర్వహించుచుండ దానికై యొక క్రొత్తవ్యాపారమును గల్పించుట

యనవసరము. అభినవగుప్తుఁడీవ్యాపారము విభావాదులదే యని చెప్పెను. తా ఏవ పరిహృతవిశేషా రసహేతవః అని భరతముని చెప్పిన వాక్యముకూడ నీవిషయముననే బోధించుచున్నది. విశ్వనాథుఁడు విభావాదులకు సాధరణీకృతి యను పేరుగల యొక వ్యాపార మున్నదని స్పష్టముగాఁ జెప్పియుండెను.

లోచనకారుఁడు చెప్పిన దానిని బట్టి భట్టనాయకుఁడు కూడఁ గావ్యమునకు రసమే యాత్మ యనియు నది వ్యంగ్యముగా నుండుననియు విశ్వసించినట్లు తెలియుచున్నది. "నచ కావ్యవ్యాపారైకగోచరో రసధ్వని రితి. నచధ్వని రేవేతి. సఏవ ముఖ్యతయాత్మేతి" కాని యాతఁడు రసాస్వాదము వర్ణింప నలవికాని దనియుఁ గావ్యమున కాత్మభూతమైనది రసధ్వని యొక్కటే కాని వస్త్వలంకారధ్వనులు కావనియు నభిప్రాయపడియుండెను. ధ్వని మతమునకును నాతని యభిప్రాయము నకును గలభేద మింతే.

భట్టనాయకుఁడు రసము సామాజికనిష్ఠమని యే చెప్పెనుగాని దానికి బీజములు స్వల్పముగానైన సామాజికులం దుండునని యంగీకరింపలేదు. అభినవగుప్తుని మతమున రస మభివ్యక్తము సహృదయుల హృదయములందు రత్యాదులు వాసనారూపమున నడఁగి యుండుననియు నవి విభావానుభావాదికములచే సముల్లాసితములై రసములుగాఁ బరిణమించుననియు నాతని వాదము. ఈతని మతమున నీవాసన లేనిచో రసాస్వాదము కలుగదు. అందుచేతనే వైయాకరణులకును మీమాంసకులకును రసాస్వాదము కలుగదని ధ్వనికారుఁడు చెప్పియుండెను. వాసనారహితులైన సామాజికులకు రసాస్వాదనము మృగ్యమనియు, నట్టివారు రంగాంతఃస్థితకాష్ఠకుడ్యాశ్మసన్నిభు లనియు ధర్మదత్తుఁడు వివరించి యుండెను. వ్యంజనాశక్తి ప్రభావముచే రస

1. వ్యాపారోఽస్తి విభావాదేర్నామ్నా సాధారణీకృతిః.

మభివ్యక్త మగుననియు రసాస్వాదమును వివరించి వర్ణింపవచ్చుననియు నభినవగుప్తుఁడు నుడివియుండెను. ఆతఁడు భట్టనాయకుని భావకత్వ వ్యాపారమును బూర్తిగా నుజ్జగించెను. రసభోగమని చెప్పక యాతఁడు రసప్రతీతియనియు రసచర్వణ మనియు నుడువుచుండును. ఈతనివాదము ననుసరించి సహృదయుల హృదయములందు వాసనారూపముననున్న స్థాయిభావములనే విభావాదులు వ్యక్తము చేయుననియు నావ్యక్తము లైన స్థాయిభావములే రసము లనియు స్పష్ట మగుచున్నది. అందు చేతనే దీని కభివ్యక్తి వాదమని పేరు వచ్చినది. అభివ్యక్తి యనఁగా నున్నదానిని వ్యక్తము చేయుట. భట్టనాయకుని మతమున నీ వాసనాప్రసక్తియే లేదు. భుక్త్యభివ్యక్తివాదములందలి ముఖ్యభేదములలో నిదియొకటి.

ఈవిధముగా రసము సామాజికనిష్ఠమని తేలినది. సామాజికుఁడు విభావాదుల ననుసంధించుకొని చర్వణము చేయు చున్నంత కాలమును రసానందము ననుభవించుచునే యుండును ఈచర్వణ మెప్పుడు ముగియునో రసాస్వాదనము కూడ నప్పుడే ముగియును. కేవలానందమైన బ్రహ్మానందము శాశ్వతమైనది. విభావాదికారణమైన రసానందము తాత్కాలికమైనది. అందుచేతనే దీనిని బ్రహ్మానంద సహోదరమని చెప్పుదురు.

అభినవగుప్తుని మతమున భరతుని సూత్రము నందలి సంయోగపదమునకు వ్యంగ్యవ్యంజకభావ మర్థము. నిష్పత్తి యనఁగా నభివ్యక్తి. రత్యాదులగు స్థాయిభావములు వ్యంజకములగు విభావానుభావాది భావములచే వ్యంగ్యములై రసము లగును.

భరతుఁడు ముఖ్యముగా దృశ్యకావ్యములను మనసున నుంచుకొని రససూత్రమును వివరించెను. లోల్లటాదులును నాదృష్టితోనే దానికి వ్యాఖ్యానము కావించిరి. ధ్వనికారుఁడైన యానందవర్ధనుఁడు రససిద్ధాంతమును శ్రవ్యకావ్యముల సందర్భమునఁ గూడ సమన్వయిం

చెను. దృశ్యకావ్యములందు నటులమూలమున విభావాదులు ప్రత్యక్షమగుచుండును గాన సామాజికులు నాయకాభేదమును బొంది యానందము ననుభవింతురు. శ్రావ్యకావ్యములలో నాయకాదులు ప్రత్యక్షము కారు కావున సామాజిక స్థానీయులైన పాఠకులు నాయకాభేదము నొంది రసానందము నెట్లనుభవింతురని సందేహము కలుగవచ్చును. వాక్యపదీయకారుఁడైన భర్తృహరి "పాఠకులు శబ్దోపహితరూపములు గల్గి బుద్ధివిషయత్వము నొందిన కంసాదులను ప్రత్యక్షములైన వారినివలె సాధనములుగా గ్రహింతురు" రని తెల్పి యాసందేహమును నివారించినాఁడు. అనఁగా శ్రావ్యకావ్యములందుఁ గవులు వాడు శబ్దములచేతను జేయు వర్ణనాదులచేతను నాయకాదులు రూపమును బొంది, పాఠకుల హృదయములు చొచ్చి, ప్రత్యక్షముగా గోచరింతురు. వారు రంగమునఁ జర్మచక్షువులచేఁ జూచు నాయకాదులనే శ్రవ్యకావ్యమును విను సందర్భమున హృదయరంగమున మనోనేత్రముచేఁ దిలకించి, తదభేదమునొంది రసానందము ననుభవింతురు.

---

1. శబ్దోపహితరూపాంస్తాన్ బుద్ధేర్విషయతాం గతాన్
ప్రత్యక్షానివ కంసాదీన్ సాధనత్వేన మన్యతే.

# శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు.

-0 —

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమ సంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 930 పుటలుగల మూఁడవసంపుటమును, 950 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాదియందుఁగల సంస్కృతాంధ్రశబ్దములన్నియుఁగలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'ఙ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'తృ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' మొదలు 'న' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమమయినది. ఈ పుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు ననుతలంపుతో నీ క్రింది వెల నిర్ణయింపఁబడినది.

క్యాలికో బైండింగు ఒక్కొక్క వాల్యూము రూ 6 లు

# విజ్ఞానశాస్త్రపు సరిహద్దులు.

డాక్టరు. యస్. భగవంతంగారు.

ప్రపంచమునందు మనకు గోచరించు ప్రకృతి బహుముఖములుగ విస్తరించి యున్నది. ఒకవైపున మహత్సృష్టివర్గమునకుఁ జెందిన సూర్యమండలములు, నక్షత్రములు, తేజోమేఘములు మనల నెదిరించుచున్నవి. మఱియొకవైపున సూక్ష్మాతిసూక్ష్మములైన అణువులు, పరమాణువులు, వీనిస్వరూపగుణధర్మములు మన సాధనకు లోఁబడక తప్పించుకొనుచున్నవి. ఇట్లు బహుముఖప్రదర్శనము అనాదిగాను అనంతముగాను మనయెదుట ప్రదర్శించుచున్న ప్రకృతియొక్క రహస్యములను, ముఖ్యముగా ప్రత్యక్షముగాఁ గనిపించుచున్న సృష్టిలోని నిత్యవికారమును, అట్టి పరిణామములలోని కార్యకారణపరంపరలను విచారించి వానిలోనున్న సత్యము నన్వేషించుటయే విజ్ఞానమనఁబడినది. విజ్ఞానమనెడి పదమున కర్థము పాశ్చాత్యపరిభాషలోఁగాని మన దేశపరిభాషలోగాని కొంచె మించుమించుగా నిదేయని చెప్పవచ్చు. ఈసత్యాన్వేషణ, సృష్టికి సంబంధించినది గనుక సృష్టివలెనే అనంతమైనది కనుక విజ్ఞానము జీవనదివలె నిరంతరము పాఱుచున్నది. విశ్వవిజ్ఞానమునకుఁగాని, అట్టి విజ్ఞానసాధనకుఁగాని, ఆద్యంతములున్నట్లు కనఁబడదు. సృష్టిలో మానవుఁడు ఒక ప్రత్యేక వస్తువుగా జన్మించినాఁడు. సృష్టిలోని యితర జీవులకులేని యొకప్రత్యేకత మనుష్యునిలో నున్నది. అది యేమనఁగా, తనచుట్టునున్న ప్రకృతిని గొంతవఱకు నర్థము చేసికొని ప్రకృతిలో నుండి ఉద్భవించు శక్తిని తనకొఱకును తనతోపాటు జీవించియున్న యితరజీవుల యుపయోగమునకును వినియోగపఱచుకొనుటకుఁ దగిన బుద్ధికుశలతయే. అట్టిప్రయత్నములలో మానవుఁడు వివిధములైన ప్రయోగములను వివిధములైన పద్ధతులను, దృక్పథములను అనేక కాలములయందు, అనాదిగా భిన్నభిన్నసిద్ధాంతముల సాహాయ్యముచే నుపయోగించినట్లు కనఁబడును. ఉదాహరణ

మునకు తత్త్వవిచారము, తార్కికపరిభాష, యిత్యాదు లొకవైపున చెప్పవచ్చును. ఈపద్ధతిలో ముఖ్యదృక్పథము ఊహావాదము, తార్కికచర్చయును. మఱియొకవైపున విజ్ఞానశాస్త్రములను జెప్ప వచ్చును. పదార్థవిజ్ఞానము, రసాయన శాస్త్రము, ఖగోళ శాస్త్రము మొదలైనవి యుదాహరణములు. వీనిలో స్వల్పప్రత్యేకత ఒక్కొక్క దానిలో నున్నను మొత్తము మీఁద నీశాస్త్రములలోని దృక్పథము ముఖ్యముగా మనకు అనఁగా మానవశరీరములోని సర్వేంద్రియములకే గాక యితరమానవకల్పిత పరికరసహాయములతో కూడినప్పుడుగూడ నింద్రియములకు గోచరమగు సృష్టిలోని ప్రదర్శనవిశేషము లన్నిటిని క్రోడీకరించి వాని భావమును సాధించుటయే యగును. కొంచె మించు మించుగా రెండులక్ష్యములు నొక్కటే. పద్ధతులు వేఱు. పరిభాష వేఱు. ఎన్నిమార్గము లవలంబించినను, ఎన్నిశాస్త్రము లుపయోగించి నను, ఏయేపరికరములు సృష్టించినను, ఎట్టి వాదములలోఁ బొల్గొన్నను జివరకు ప్రకృతి పరిణామరహస్య మెఱుఁగుటయే పరమావధి యని చెప్పవలసివచ్చును. పరమావధిని జేరుకొనుటలో శతాబ్దములుగా మానవుఁడు శ్లాఘనీయమైన కృషి నెంతో జరిపినట్లు కనఁబడును; గాని, అట్టి ప్రయత్నములలో తాను జెందిన వైఫల్యముల, నిప్పటికిని తన వంతుచిక్కని విషయములను ప్రకృతిలోఁ దాను క్రోడీకరింపలేని కార్య ముల నొకసారి సింహావలోకనము చేసినచో; వాని ముందర తనకుఁ దెలిసిన విషయములు, తాను గ్రహించిన సూత్రములు, క్రోడీకరించిన సిద్ధాంతములు,చాల స్వల్పముగాను సంకుచితముగాను, కనబడఁ గలవు. సంపాదించిన విజ్ఞానము ముందర, తాను కూడఁబెట్టిన యజ్ఞానము తాను సాధింపలేకపోయిన రహస్యములు మహాసముద్రములవలెఁ గను పించును. అందు కొన్ని అభేద్యముగాను,అనంతముగాఁగూడ స్ఫురించును.

ప్రస్తుతము విజ్ఞానముయొక్క పరిస్థితి యిదియని నిరూపించు టకు నేశాస్త్రము నైన నెత్తుకొని నేను సాధారణ ప్రశ్నలు కొన్ని ఉదాహరణములుగాఁ జూపఁగలను. మనము ఎందువలన నవ్వెదము? నవ్వుటయెట్లు కలుగును? ఏడుపు ఎందుకు వచ్చును? వచ్చు ముందర

శరీరములో జరిగెడిమార్పులు ఏమి ? ఇవి సాధారణ ప్రశ్నలు. ఈప్రశ్నలకు జవాబులు ప్రయోగమానసిక శాస్త్రములో దొరకఁగలవు. కాని యాజవాబులను నేనిప్పుడు మీకు విశదపఱచిన యెడల వానిని విని మీలోఁ కొందఱు ఇంత అజ్ఞానమా అని నవ్వెదరు. కొందఱు ఇంత స్వల్పవిషయమున కింత అర్థముకాని పరిభాషయా అని ఏడ్వను గూడ వచ్చును.

ఇదే విధముగా నితర శాస్త్రములకు సంబంధించిన ప్రశ్నల నేకముల నుదహరించవచ్చును. మనుష్యుల తలవెండ్రుక లెందుకు చిన్న వయస్సులోనే నెరసిపోవుచున్నవి ? వెండ్రుక లన్నియు రాలిపోయి తలలు బోడియగుటకుఁ గారణమేమి ? ఈరెంటికిని సరియైన జబాబుగాని, ఆయావ్యాధులకు తగు చికిత్సలు కాని కనుఁగొనఁగలిగిన యెడల ఆవ్యక్తి అధికధనసంపాదన చేయఁగలఁ డన్నమాట అందఱకును దెలిసిన విషయమే. కాని చేయలేముకదా.. ఈసృష్టిలో నిత్యానిత్య వస్తువుల మధ్య భేదమేమి; జీవకోటికి మృత్యువు తప్పదా ? అణుశాస్త్ర రహస్యములు కనుఁగొనఁ గలము గాని యాప్రశ్నకు జబాబు చెప్పలేము. స్త్రీ పురుష భేదమునకుఁ గారణమేమి. ఎట్టి మార్పులు ప్రయోగశాస్త్రరీత్యా కలుగఁజేసిన యెడల సృష్టిలో స్త్రీత్వమును కాని పురుషత్వమునుకాని మార్చఁగలము. ఇవి క్లిష్టమైన సమస్యలు. అంత క్లిష్టమైన సమస్యల నుదాహరించి కొంతవఱకు విజ్ఞానము యొక్క దుర్బలతను నిరూపించితినే గాని యీసమస్యలన్నియుఁ గూడ విజ్ఞానముయొక్క పరమావధి అనగా సృష్టిలోను ప్రకృతిలోను ఉన్నమూలసూత్రములు, వాని ననుసరించికొని యున్న సత్యాన్వేషణలోనివే. ఈప్రశ్న పరంపరలకు జబాబులు సమకూర్చు ప్రయత్నము లెప్పుడు జరుగుచునే యున్నవి. కొన్నింటికి ఏదోవిధమైన జబాబు దొరుకుచునే యున్నది. అట్టి విజ్ఞానాభివృద్ధి యీనాఁటిగాధ కాదు. అనేక శతాబ్దములుగా జరుగుచున్నది. ఇంకను అనంతముగా జరుగనున్నది. తత్ఫలితముగా ననేక విచిత్రసంఘటనలు సామాన్య విషయములుగా తేటపడుచున్నవి. ఒకప్పుడు ఏడురంగుల యింద్ర

ధనుస్సు అనఁగా Rainbow నుచూచి అది మానవాతీతమైన దృశ్యమని భావించెడివారము. ఈరోజున దానికిఁ గారణము సులభముగా నర్థము చేసికొని కొన్ని ప్రయోగముల నుపయోగించి అట్టిధనస్సునే కృత్రిమసృష్టి చేయవచ్చును గదా. ఒకప్పుడు తేనెటీఁగ అంత తెలివిగా తేనె యెక్కడనున్నదో కనుఁగొని ఆజ్ఞానము నితరతేనెటీఁగల కందఁజేసి విచిత్రముగా నతిత్వరితముగా నా తేనె యంతయు నెట్లు తుట్టెలోనికిఁ జేర్చుచున్నదో తెలియక వైజ్ఞానికులు బాధపడిరి. ఇప్పుడు తమకృషిచే దీనిని సాధింపఁగలిగిరి. ఇవియే కాదు. ఇటువంటి వనేకవిషయములను తెలిసికొనఁగలిగిరి. ఈ వివిధశాస్త్రాన్వేషణములో అనేకప్రయోగములను సృష్టించి వానిని తమసౌకర్యముల కుపయోగించుకొనుచున్నారు మానవులు.

కాని యీశాస్త్రజ్ఞులను కొంత ఫక్కీమార్చి కొన్ని ప్రశ్నలు అడిగిచూచిన యెడల కొంత రసాభాసమై జబాబులు దొరకవు. దొరికినను ఆపరిభాష అడిగెడివాని ఊహాలతో సమన్వయము కాదు. అందుకొన్ని యుదాహరణము లేమనఁగా మానవుని చుట్టు ప్రపంచమంతయు నావరించియున్న యీసృష్టియొక్క అర్థమేమి? ఈనాటకమంతయు నెందుకు జరుగుచున్నది? ఒకవ్యక్తి మరణించిన తరువాత నేవిధమైన పునఃసృష్టి యున్నదా? ఈప్రశ్నలే కాదు. ఇట్టివి యింకను జాల అడుగవచ్చు. కేవల విజ్ఞానశాస్త్రఫలితముగా నీప్రశ్నలకు జబాబులు దొరకు నవకాశము కనఁబడదు. అట్టి వైఫల్యమునకుఁ గారణములు కొంత విచారింపవలెను. ఆధునికవిజ్ఞానపద్ధతులలోనే అవి యిమిడియున్నవి. ఆధునికవిజ్ఞానము, ముఖ్యముగా ప్రయోగప్రమాణసిద్ధము. వైజ్ఞానికులు ప్రయోగేతరప్రమాణము లంతగా విశ్వాస ముంచరు. ప్రతిసిద్ధాంతమును ప్రయోగించి చూచి తమ హేతువాదములతో బంధింపఁబడిన ప్రాకారములో నిముడకపోయిన యెడల దానిని నిరాకరించెదరు. అనఁగా వైజ్ఞానికుఁడు ఊహాప్రపంచములో మేడలు కట్టుటకు వీలులేదు. తనకు వ్యక్తమగు విషయములను సత్యమని నమ్మవలెను. అనిత్యమని, మాయయని త్రోసివేయుటకు

వీలులేదు. ఈనిబంధనలతోఁ గూడుకొన్న శిక్షణ వైజ్ఞానికునకు ఆయువుపట్టు. జగదుత్పత్తికి మూలకారణ మేమి అను మహత్తరమైన ప్రశ్నను సాధించినప్పుడైనను, సూర్యాస్తమయకాలమందు సూర్యుఁ డెఱ్ఱనిరంగు ధరించుటకు కారణమేమి అను స్వల్పవిషయమును సాధించినప్పుడైనను, వైజ్ఞానికుఁడు తన శాస్త్రములకు పునాదులైన కట్టుదిట్టములకు, పద్ధతులకు లోఁబడియే తనబుద్ధికుశలత వలన విజ్ఞానసౌధమును నిర్మించవలెను. అట్టి కట్టుదిట్టము లెప్పుడంగీకరింపఁ బడ్డవో, వెంటనే కొన్ని విధములైన ప్రశ్నలు విజ్ఞానశాస్త్రములకు లొంగఁజాలవని విశదము కాఁగలదు.

నానావిధములుగ విస్తరించియున్న యీజగత్తులో, అనఁగా ఒకవైపున మహత్తరమైన జ్యోతిర్లోకములోని గ్రహసంపుటులు వాని కూటమి వలన ఉద్భవించిన యితర ప్రపంచకములలో నుండిగాని; మఱియొక వైపున సూక్ష్మాతిసూక్ష్మములైన అణులోకములలో నుండిగాని, ఏవిషయము నైనను ఉదాహరణమునకు దీసికొని, ఆవిషయమును విమర్శించిన యెడల రెండువిధములైన ప్రశ్నలు ఏర్పడఁ గలవు. ఒకటి ఆవిషయ మెందులకు సంఘటించినది. రెండు అది ఎట్లు సంఘటించినది. ప్రత్యేకించి చెప్పినయెడల ప్రతిదినము నిర్విఘ్నముగా సూర్యోదయ మెందుల కగుచున్నది అన్నది యొక్క ప్రశ్న. దీనికి ప్రత్యుత్తరము విజ్ఞానశాస్త్రి మీఁయలేదు. ఆసూర్యోదయమే యిన్ని నిమిషములకు ఎటు వైపున నెట్లవుచున్నది అన్నది యింకొకప్రశ్న. దీనికి చక్కని ప్రత్యుత్తరము ఖగోళశాస్త్రములో దొరకును. ప్రకృతిలో సృష్టి యెందుకు జరుగుచున్నది. ఏవ్యక్తియొక్క ఆనందము కొఱకు ఏవ్యక్తియొక్క కోరిక మీఁద జరుగుచున్నది. అట్టి ప్రశ్న విజ్ఞానశాస్త్రపు సరిహద్దులలోనిది కాదు. విజ్ఞాన శాస్త్రములో తన అభివృద్ధికి మూలసూత్రములుగా నేర్పఱుచుకొన్న నిబంధనల ఆవరణలో నున్నంతకాల మట్టిప్రశ్నలను శోధింపలేదు. కాని సృష్టి యేవిధముగా జరుగుచున్నది. పద్ధతులేమి. సూత్రములేమి అను ప్రశ్న

లకు వివిధశాస్త్రములలోనుండి కొంతవఱకు సంతృప్తికరమైన జబాబులు దొరకఁగలవు. అనఁగా విజ్ఞానములోని వివిధ శాస్త్రములు చాలవఱకు జగత్సృష్టిని, అందుగోచరమగు చిత్రవిచిత్రములను మన అనుభవసిద్ధమగు ప్రమాణములుగా తీసికొని అవిఎందుల కీవిశాలమైన జగన్నాటకములో నిమిడినవో ప్రశ్నించక, అవి పొందు పరిణామ మేకారణముల ఫలితములో అవిమట్టుకే విచారించి, క్రోడీకరించి కొన్ని ముఖ్యసూత్రములను నియమించి విజ్ఞాన సర్వస్వమును చేకూర్చుచున్నవి. ఈనిబంధనల ననుసరించి పదార్థమునకును, శక్తికిని గల అన్యోన్యాశ్రయము విమర్శించెడిది పదార్థవిజ్ఞానశాస్త్రము. అట్లే ఖగోళనిర్మాణపరివర్తనపద్ధతులను సాధించెడిది ఖగోళ శాస్త్రము. ఇంకను భూశాస్త్రము, ఖనిజశాస్త్రము, ఎన్నియో శాస్త్రములు గలవు. కాని వానికి పునాదియైన సూత్రములు, నిబంధనలు పైనఁజెప్పినట్లు కొన్నిరకములైన ప్రశ్నలకే ప్రత్యుత్తరములు సమకూర్చుటకు ప్రయత్నించగలవు కాని, ఆశాస్త్రము లేర్పఱచిన నిబంధనల కతీతమైన ప్రశ్నలను పరిశోధింపలేవు. మానవుని మనస్సు పరిపరివిధముల పనినెట్లుచేయునో, పదార్థవిజ్ఞాన శాస్త్రములోని సూత్రములతో నిరూపింపలేము గదా. అట్లే ప్రకృతిలోని చిత్రములెందుకు ప్రదర్శితము లగుచున్నవో, వాని యొక్క ప్రయోగ పద్ధతులనే విమర్శింపఁ గలిగిన శాస్త్రసహాయములచే అర్థము చేసికోలేము. అట్టి శాస్త్రముల కవి అందరానివి.

Radio Talk Broadcast from Hyderabad on
9—9—1952 at 8—15 p. m. ]

# కళాసమీక్ష

చిలుకూరి వీరభద్రశాస్త్రి

నిరుపాదానసంభార మభిత్తావేవ తన్వతే
జగచ్చిత్రం నమస్తస్మై కళాశ్లాఘ్యాయ శూలినే॥

ఆకర్షకము హృద్యము నయిన కల్పనతో నిండిన రచన— "కళ" అనినఁ జాల దూరము వఱకు కళానిర్వచనము పొసఁగు నట్లు కనిపించుచున్నది.

ప్రపంచములో అందమయిన వస్తువులు చూచి, సొంపైన ధ్వనులు విని, ప్రతివాఁడు అది యెంతకళగా నున్నది. ఎంత అందముగా నున్నది యని యనును. కళాస్వరూపమును "అందముగా నున్నది" అను మాటలలోఁ దెలియఁ బఱచుచున్నాఁడు. అయినను 'అందము, కళ' ఒకటే కాదు. అందముగా ఉన్నదనినఁ గళతో నిండియున్న దని తెలియ నగును. కనుక అందమును ఇచ్చునది, అందమును దెచ్చునది కళాస్వరూప మన వచ్చును, లక్షణ మనినను అంత తగవు లేదనుకొనవచ్చును.

ముందుగ అందము వస్తుగతమా? భావుకునిఁబట్టియా? చూపఱుఁబట్టియా? అనునది పెద్దచర్చనీయాంశము. కొందఱకు లోకములో నున్న ప్రతివస్తువు అసహ్యముగాఁ గనఁబడును. వీతరాగులకంటెను వీరు మహానుభావులు.

నాత్రాతీవ తు కర్తవ్యం దోషదృష్టిపరం మనః
దోషా హ్యవిద్యమానోఽపి తచ్చిత్తానాం ప్రకాశతే॥

అట్టి పుణ్యభాగులమాట వదలిన, ఒక్కొక్కనికి ఒక్కొక్క వస్తువు అందముగాఁ గన్పట్టును. అదివాని కమృతాయమాన మగును.

కావ్యం సుధా రసజ్ఞానాం కామినాం కామినీ సుధా
ధనం సుధా సలోభానాం శాంతిః సన్యాసినాం సుధా.

వేద మిష్టమయిన వానికి గానము రోదన మనిపించును. చిత్ర కారునకు చిత్రకళ ఇంచినట్లు మఱియొకటి రుచింపదు.

పరివ్రాట్కాముకశునాం ఏకస్యామేవ యోషితి
కుణపః కామినీ భక్ష్యం ఇతి తిస్రో వికల్పనాః

వస్తువు ఒకటే అయినను వారి రుచినిఁ బట్టి మఱియొక రీతిగఁ గనఁబడును. ఇష్టము లేనిది వికృతిగఁ గాదు రోఁతగాఁ గన్పడును. "భిన్న రుచి ర్హిలోకః". ఇంతకు వస్తుగతము కాదనినప్పుడు భావుకుని మనస్సు అందము తెచ్చునని యనవలయును. అప్పుడు అన్నిటికిఁగళ ఉన్నదన వలసి వచ్చును. అటుల అనుట మంచిదికాదు. అనరు కూడ. ఏకొందఱికే నీయిష్టము లేకపోయినను సమాజమున కెల్ల రుచించినదని పరీక్షించుకొని ఆవస్తువు సమాజములో మెప్పు వడసిన దానికిఁ గళాముద్ర వేయవచ్చును.

వస్తువు లోకేమాదిరిగా నున్నను అందము కొన్నిటికే యుండును. కన్నులు, ముక్కు, చెవి, నోరు, కరచరణాద్యవయవములు స్త్రీలందఱకు లెక్కకుండినను "ఈఆడుది అందముగా నున్నది" అని కొందఱినే ఒప్పుకొందుము. అటులనే వస్తునిర్మితికి సామగ్రి ఒక్కటయినను, సృష్టింపఁబడు ఒక్కవస్తువే అందముగా నుండును. అన్నియు నుండవు. అందఱు చేసినవస్తువులు నందముగా నుండవు. ఒక్కఁడు చేసినదియే అందగించును. చీరల నందఱు నూలితోనే నేయుదురు. చీరలకందఱు నంచు నుంతురు. ఒక్కొక్కఁడు నేసిన దానికే అందము వచ్చును. అందఱకు నందముగా నేయుట యలవడదు. చీరలకు నూలు ఒక్కటయినను, అంచువల్ల అంచునకేకాక చీరకంతకు నందము వచ్చినట్లు అలంకారాదు లుండినను

ఒక్కొక్క ఆడుదానికే అందముండునట్లు కొన్నివస్తువులే అందముగా నుండును. ఆ అందమును తెచ్చునదే "కళ" అనఁగా—

ప్రతీయమానం పునరన్యదేవ వస్త్వస్తి వాణీషు మహాకవీనాం
యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం విభాతి లావణ్య మివాంగనాసు.

అది కావ్యములో వ్యంగ్యార్థము వంటిది.

కళ ఒక స్త్రీ వంటిది. పురుషుఁడు స్త్రీకి సొగసు తీసికొనివచ్చుటకు ప్రయత్నించునట్లు, కళకు, కళతోఁగూడిన వస్తువులకు సొగసు తీసికొనివచ్చుటకుఁ బ్రయత్నించుట కళాకారుని కర్తవ్యము. అందఱు కళాకారులు తమ కళాసృష్టిలో నిమగ్నులయి, ఏకాంతముగా నాలోచించి భావనతో మేళగించి, వివిధ సామాగ్రితో నింపుటకుఁ బ్రయత్నింతురు, నింపుదురు. కళ కుద్బోధక సామగ్రులను ధ్యానింతురు. పరిశీలింతురు, రూపొందింతురు. తమ కళలో తాము నిమగ్నులయి ఆనందింతురు బాగున్నదనుకొని పీఠికిఁ దెత్తురు అంత వఱ కళాకారుని కర్తవ్యము.

కళ మానసిక సృష్టి కుమ్మరి కుండలకుఁ గ్రొత్తరూపు తీసికొని వచ్చినను, కవి కావ్యరచనలోఁ గ్రొత్త పోకడలు తీసికొని వచ్చినను, చీరలు కంచువేయుటకు ముద్రలు చెక్కినను, మనస్సులో ముందు భావించికాని బయటి కభివ్యక్తి చేయఁజాలఁడు. తన మనోభావములను మానసిక రూపములను పైకి వెలువఱచుటకు వస్తువులనియు, రంగులనియు, శబ్దములనియు, స్వరములనియు, ఏవేవియో తీసికొని కళను రూపొందించుటకయి ప్రయత్నించును. తనకు సామగ్రి లోటయినను, బూర్ణముగ వ్యక్తీకరింపఁ జాలఁడు. (భావనాబలము లోటయిననేమియు వ్యక్తపఱుపఁ జాలఁడు. కాని ఒకరీతి క్రొత్తదనమును దీసికొని వచ్చును. కొందఱు వారిసృష్టిలో బాగున్నదని మెత్తురు. కొందఱు

మెచ్చను. వెక్కిరింతును. వెక్కిరించినను బాధచెందక నాయిష్టము నాకు నచ్చినది. మీకు భావుకత్వము లేదు. నాకళ యింతేను అను వాఁడు కళాకారుఁడే కాని "కళ కళకొఱకే" అను వాఁడగును.

కళోత్పత్తికి మనస్సు కారణమయినట్లుగ కళమనస్సులోనికిఁ, జొచ్చుకొనిపోవుట యవసరము. కళ మనస్సులో వెలుపడి, రూపొంది అభివ్యక్తమయి బాహ్యేంద్రియములద్వారా మనుజు నాకర్షించి, ఇంద్రియతుష్టిని కల్పించి తద్ద్వారా భావుకుని మనస్సులోఁ ప్రవేశించి మనోరంగములోఁ జిరకాలము నటింపఁగలిగిన నదియ్యది సరియైన కళ కాఁగలదు.

పెద్దపెద్ద పట్టణములలో రేడియోలు, గ్రాంఫోన్లు, ఆకాశవాణులు శబ్దయంత్రము వీధివెంబడిఁ బడి అంకోపిక్రయశాలలనంటి రాగాలు పెట్టుచున్నను, సినీమాలలో భక్తిమార్గము తెలియఁ బఱచుచున్నను, వానికేమియు విలువలేనట్లు మనుచరిత్ర వెలువడ వ్రాసబడి ననేక ప్రబంధములు తత్సమములు ఇంచుమించు వందలకొలఁది చరిత్రలు వెలువడినను వానిపైపునకైనఁ జూడనటులు గాంధీ శిలావిగ్రహమొకటి అందమయినది మొదట వెలువడ నిప్పుడు ప్రతిగ్రామములో తద్రూపము కొంచెమైనను లేని వేలకొలఁది విగ్రహములు వెలుపడి అడుగడుగునకు నున్నను వానిపైకి దృష్టిని సారించనటులు, కళ ఆకర్షకము కాకపోవుట యటుండ రోఁతకల్పించు ననినచో కళ తన ఉత్పత్తిలో, నిలకడలో, ఉపయోగములో ఉండవలసిన స్థితిలో నున్నపుడే చిరకాలము స్థాయిగ నుండఁగలదు. ఇంతకు కళ మానసిక పరివర్తనము చేయఁగలగ వలయును.

కళకు క్రొత్తమార్గములు, క్రొత్తనడకలు, క్రొత్తవస్తువులు దిగుమతి అయివచ్చిన యీదినములలో, కనువేదులు, వినువేదులు, ఎదవేదులు అగునట్లు కళలు వెలువడుచున్నవి. అనఁగా నిద్రి

ప్రాకర్షకములగునట్లు అభివ్యక్తమగుచున్నవి, కాని యివి ఇంద్రియములకెంత ఆకర్షకములగుచున్నవో బాహ్యముగ నంతగా మనుజునిపై తమ యధికారమును జూపుచు చపలునిగా నొనరించుచున్నవి. మనుజునిమీఁద నధికారము చేయుట యనఁగా మనస్సునకు హత్తుకొని స్థిరప్రాపము నిచ్చుట మంచిదియు. వానివల్ల వచ్చు ననుభూతి ఆనందము స్థిరముగ నుండఁగలదు. ఇంద్రియములు తమ అనుభూతిని మనస్సునకుఁ బంపును. "ఆత్మా మనసా సంయుజ్యతే. మన ఇంద్రియేణ, ఇంద్రియమర్థేన తతః ప్రత్యక్షం" అని మనఃప్రవృత్తి చేసికొని దప్పనది. బాహ్యజగత్తు అనుభూతి ఆనందము నిచ్చును. మనస్సులోఁ బస చేయును. అయినను ఈయానందము "రాజసిక" "తామస" ఆనందములలోనికిఁ బరిణమించు చున్నది. అందువలననే యిప్పటిది మనుజుని చపలునిగా నొనరించుచున్నది. వానికే దలమొత్తించి క్షణములో దినపత్రికవలె సోఁత కల్గించు చున్నది. ఈ రాజసికానందము కల్గించుటయో, యీ తామసానంద మనుభవించుటయో యిప్పటి కళాకారుని లక్ష్యము, కళా పరిణామము అయియున్నది.

మఱికొందఱు కళకుఁ బ్రయత్నించి సొంపుపూర్వ నవసరము లేదు -ప్రకృతికి - పర్వతము, నదులు, సముద్రములు, చెట్లు, లతలు, మేఘములు, ఆకాశము, ఇంద్రధనుస్సు, పచ్చికబయళ్లు, ఋతువులు, రేయింబవళ్లు, సూర్యుఁడు, చంద్రుఁడు, చీఁకటి, వెన్నెల, వెలుతురు, నీడ, పశువులు, పక్షులు, సరీసృపములు, ప్రాణులు -కళాసంపద స్వాభావికమయినట్లు, ఉన్నది యున్నట్లుగాఁ జిత్రించి, ఉన్నది యున్నట్లుగా వర్ణించి నగ్నముగాఁద యాదుచేయుటయే కళాసంపదకు మిక్కిలి పరాకాష్ఠ అందము ననియెదరు (ప్రకృతి చిత్ర) మెంతవఱకు నవసరమో. ఏ కళలోఁ బ్రకృతి చిత్రణమవసరమో యాయూయి ఘట్టము

బాగోఁ తెలుపుదురు) కాని యది చంద్రరేఖావిలాపప్రబంధమునకె యుండును. అట్టి కళను ఒక్కఁడే ఏకాంతముగాఁ జూచుకొని యానందింప గలఁడు, అనుభవింపఁ గలఁడు. నగ్నదృశ్యముల నిద్దఱు పురుషులు కలిసి చూడలేరు. అట్టివారు తమకు సమాజమునకు సంబంధము వదలుకొనఁ గలుగుసమర్థులు కాఁగలరు.

కళ సమాజమునకుఁ జెందినదికాని ఒక్కనికిఁ జెందినదికాదు. సమాజమే కళాకారుని పరీక్షించి సీటునిచ్చి ఉన్నతస్థితికిఁ దీసికొనివచ్చును. సమాజము కళాకారునకు స్థానమునిచ్చును. తన కిచ్చునట్టి స్థానమును మొదటి యత్నములోనే చిరస్థాయిగాఁ జేసికొని తన్నెల్లప్పుడును స్మరింపఁ జేసికొనఁగలిగినవాఁడే నాఁ డుత్తమకళాకారుఁడు కాఁగలఁడు. ఏ కళాకారుఁడైనను తా నాదర్శకళాకారుఁడు కావలయుననియును, తనసృష్టి "నభూతో న భవిష్యతి" అనిపించుకొనవలయుననియు దీక్ష యుండవలయును.

వాల్మీకి, కాళిదాసు, భవభూతి, దండి, భట్టబాణుఁడు, నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, శ్రీనాథుఁడు, మొదలగువారిమాట వదలివేయుదము. వారిదే అగ్రాసనము. ఏనాఁడు వ్రాసినాఁడో పెద్దన "ఆనందో బ్రహ్మ యటన్న" సుకుంబుగల పద్యములను. తెలుఁగువారిప్పటికి నాలుగువైపుల నుండి ఆ పద్యములను వినిపించెదరు. అనఁగా మనుచరిత్ర పట్టనివా రుండరు. సత్యభామకోపము "ఏమేమీ" యనిరాఁగ అది తగ్గించుటకయి మ్రొక్కు- "జలజాతాసన" ఘట్టమునందలి పద్యములు తెలుఁగునాఁట రానివా రుండ రనిన నతిశయోక్తి గాదు, ముద్దులొలుకు పలుకులు కనుక. "సతిసాహిత్యరహస్యము" "చిలిరుఁజొంపము" "ఆజాబిల్లి" ఈ పద్యములు ముట్టక పోవుట అరుదు. చెవిని బడకపోవుట విచార్యము. బాగు మని యెప్పిది భట్టుమూర్తి గారిది అనిన వసుచరిత్ర చదువని వా రుండరు "ఈ

కడజాతి వారికి హీనవే" అన్న కైవారివారిని జూచినవారుండరు. "కనకకశిపేణి గోపులు, తమిపురాధీశల" అను సత్పెశవాక్యములుగల పింగళివారి బంగారుముక్కలు లేదను వారుండరు. గాన మనుసప్పటికి త్యాగరాజుల మొక్కసివారు, "అప్పరాను భక్తి యెంత" అనుకీర్తన రాసి వారుండరు."

పైకళలన్నియుఁ గళాదృష్టిలో వెలువడినవి. ఉత్తమకళాకారుల చేతిలో సృష్టమయినవి, "అమరావతీ, అజంతా, ఎల్లోరా" గుహాలలో వెలువడిన శిల్పకళ కళలన్నిటిలో నేడు సేకరింపబడి వెలుగొందుచున్నది. ఈ కళలన్నియు నాకర్షకములు, మానసోల్లాసదాయకములు. శాశ్వతానందదాయకమై యభివ్యక్తమయినవి. ఈరీతి కళలన్నియు నానందము కలిగించును.

ఆనందము కలిగినప్పుడు, ఆనందము కలిగించునప్పుడు మనుజుఁడు తనమనస్సును మార్చుకొనును. ఆనందము కలిగించిన దాని నొప్పుకొనియుదినా మతము. నాయిష్టమని యనును. అప్పుడే తన భావములు నిష్టరూపమును పొందును. ఇంతకు కళ ఆనందమును గలిగించుచు మనుజుని నొక మార్గమునకుఁదీసికొని వెడలునని యొప్పుకొనవలసియున్నది. ఆనందము కలిగించుట కళల కన్నిటికి సమానమని యనుకొంటిమి.

కళాదర్శనమువలనఁ గలుగు నానందము చిరస్థాయిగా నుండుట కళమీఁద నాధారపడి యుండును. అయినఁ గళలు తా మిచ్చు నానందమునుబట్టి రెండువిధములుగనున్నవని యనుకొనవలయును. వృత్తికళలు– లలితకళలు– అని. వృత్తికళలన్నియు "Art for markets sake" "కళ అమ్మకము కొఱకు" అను ధోరణిలో చలామణి అయిపోవును. వాని కుపదేశకత్వముతోఁ గాని, నీతితోఁ గాని, సంబంధబాంధవ్యము లనవసరము అట్టి కళ క్షణకాలములోఁ దమూసగును దానికై కళా

కావునను గల్పనావశ్యకత యున్నది కాని లలితకళలను సృష్టించు టెక్నిక్ నున్నంత జంజాటము మఱలేదు. దానికి వచ్చుమెప్పు విద్యార్థుల సనమువంటిది. ఆర్థికముగ నున్నతి యుండిన నుండవచ్చును. నాల్గు రోజులుమాత్రము వానిని చూచి "బళా" అని యందురు. వారమురోజు లయినతరువాత "పోసమ్మ" అనిన నందురు. అట్టి వృత్తికళానిర్మాతలు నిర్మించుకళకు "నేర్పు" అను నిర్వచనము సరిపోవునేమో యనిపించును. ఈనేర్పునకు మానసిక భావనాపరంపర యక్కఱలేకయే చేష్టలోను, క్రియలోను నెక్కువ అవసరమును దీసికొనును. ఈ కళాకారులకు లలితకళాకారుల కున్నంత స్థిరోన్నతి, శాశ్వతకీర్తి, సంఘాంకనము, నుండదు. కనుకనే యీకళాకారుడు సృష్టించుకళ స్థిరానందము నీయ లేదు. దీనివలనఁ గలుగు నానందము మనస్సులోనికిఁ జొరలేదు. చొచ్చి నను క్షణికముగ నుండును. అమరావతి శిల్పసౌందర్యము, మీనాక్షి మూర్తికళాసౌష్ఠవము, మాలలకు నంగరాగాదులకు రానేరదు.

వృత్తికళ-లలితకళా ప్రస్తావము వచ్చినది కావున ప్రాచీనకాలమునుండియు "కళ" లని పరిగణింపఁ బడిన వెన్నియో ఇట స్మరించుట మంచిదని యీదిగువ వ్రాయుచుంటిని.

౧ గీతము, ౨ వాద్యము, 3 నృత్యము, ౪ నాట్యము, ౫ ఆలేఖ్యము, ౬ విశేషకచ్ఛేద్యము, ౭ తండులకుసుమ బలివికారము, ౮ పుష్పాస్తరణము, ౯ దశనవసనాంగరాగము, ౧౦ మణిభూమికాకర్మము, ౧౧ శయనరచనము, ౧౨ ఉదకవాద్యము, ౧3 ఉదకఘాతము, ౧౪ చిత్రాయోగము, ౧౫ మాల్యగ్రథనవికల్పము. ౧౬ శేఖరాపీడయోజనము, ౧౭ నేపథ్యయోగము, ౧౮ కర్ణపత్త్రభంగము, ౧౯ గ్రంథయుక్తి. ౨౦ భూషణయోజనము, ౨౧ ఇంద్రజాలము, ౨౨ కౌచిమారయోగము ౨3 హస్తలాఘవము, ౨౪ చిత్రశాకా

పూపభక్ష్య వికారక్రియ ౨౫ పానక రసరాగాసవయోజనము ౨౬ సూచీవాపకర్మము ౨౭ సూత్రక్రీడ ౨౮ ప్రహేళిక ... ౨౯ ప్రతిమాల ... ౩౦ దుర్వాచక యోగము ౩౧ పుస్తకవాచనము ౩౨ నాటకాఖ్యాయికా దర్శనము ౩౩, కావ్యసమస్యాపూరణము ౩౪, పట్టికావేత్ర వాణవికల్పము ... ౩౫ తర్కుకర్మ, ౩౬ తక్షణము, ౩౭ వాస్తువిద్య, ౩౮ రూప్యరత్నపరీక్ష, ౩౯ ధాతువాదము, ౪౦ మణిరాగజ్ఞానము, ౪౨ వృక్షాయుర్వేదయోగము, ౪౩ మేషకుక్కుటలావక యుద్ధవిధి, ౪౪ శుకశారికా ప్రలాపనము, ౪౫ ఉత్సాదనము, ౪౬ కేశమార్జన కౌశలము, ౪౭ అక్షరముష్టికాకథనము, ౪౮ మ్లేచ్ఛితకవికల్పము .... ౪౯ దేశభాషాజ్ఞానము, ౫౦ యంత్రమాతృక ..., ౫౧ పుష్పశకటికా నిమిత్తజ్ఞానము, ౫౨ ధారణమాతృక ..., ౫౩ సంపాఠ్యము, ౫౪ మానసకావ్యక్రియ ౫౫ క్రియావికల్పము. ౫౬ చలితకయోగము ౫౭ అభిధానకోశచ్ఛందోజ్ఞానము, ౫౮ ద్యూతవిశేషము, ౫౯ ఆకర్ష క్రీడ, ౬౦ బాలకక్రీడనము, ౬౧ వస్త్రగోపనము, ౬౨ వైనాయిక విద్యాజ్ఞానము, ౬౩ వైజయిక విద్యాజ్ఞానము. ౬౪ వైతాళిక విద్యాజ్ఞానము, అని అఱువదినాలుగు.

## కళ — అనుకరణ.

కళాజీవి స్వతంత్రుఁడై క్రొత్తగాఁ గళను సృష్టించిననాఁడే కళాకారుఁడు గాఁగలఁడు. అనుకరణ చేసినచో నాదొంగతనము తాత్కాలికముగాఁ గనపడకపోయినను, ఏకొలదియైన నందముగాఁ గన్పట్టినను, పైమెఱుఁగు వలె కొంతకాలమునకు నాపూఁత అణఁగిపోయి, నిజవస్తువు బయటఁబడును. కళ శోభాహీనమగును.

అనుకరణ పనికిరాదనుటకుఁ గారణము కళ పరిణిష్ఠితత్వమును బొందనేరకుండుట అనుకృతి కనుక, ప్రతిభ లేమిచే నేడెనాకే యుంగముమీఁద

దృష్టి హెచ్చుగాలున్నమయి కళ తయారగును. ఒకకన్ను, ముక్కు-ఇత్యాదియే అందముగానుండి మిగిలిన అవయవములు వికృతముగా నున్నయెడల దానికన్ను మాత్రమే అందముగా నున్నదని యనియెదరు. ఒక్కమాఱుమాత్రమే ఆ అనుటయును. అందముగాఁ దయారుచేయుటకు యున్నను, సామాగ్రియున్నను బ్రతిభ లేకపోవుటచే నంతటితో సృష్టి కల్పన ఆగిపోయినది. సిద్ధహస్తుఁడు చేయునంతటి ప్రయత్నముచేసినను వికృతముగాఁ దయారయినది. అందము వికారము ప్రతివస్తువునను మిశ్రితమయియే యుండును. వికృతి ప్రతిభ తక్కువయైనఁ గలిగినప్పను. ప్రతిభ యెక్కువైన నందగించును. అందమయినది, ప్రతిభాస్పష్టమయినది చూచి తలలూఁచిన మనుజులు అనుకరణవస్తువులను చూచి ఆనందింపఁ జాలరు. దినపత్రికను జార్చి వేసినట్లు జార్చివేయుదురు. ఈ అనుకరణము వృత్తికళలకుఁ గూడఁ బనికిరాదు. ఈ అంధానుకరణము దానికున్నచో "Art for markets sake" అను ప్రయోజనముఁ గూడ ఉండదు.

లలితకళలకు ననుకరణము పనికిరాదు. ఈ అనుకరణమును సర్వథా పరిత్యజించుట ఎవ్వనితరము కాదు. అయినచో ననుకరణ మెన్ని విధములుగ నున్నవో ఆవిషయము ననుకొనినఁ దేలు నీవిషయము. అక్షరముల ననుకరింప కుండను పదముల ననుకరింప కుండఁగను నెవ్వండును కావ్యము వ్రాయఁజాలఁడు "నహివాచస్పతినా ప్యక్షరాణి పదానివా కానిచిదపూర్వాణిఘటయితుం శక్యంతే" అని ధ్వనికారుఁడు ఇవి రెండు ననుకరించుట సంగీతములో సప్తస్వరములనే ప్రతిగాయకుఁడు స్వీకరించినటులు. ఒకవిధమయిన రాగములనే గ్రహించినటులును.

ఇంక నొకఁడు చేసిన స్వరకల్పమునే మఱియొకఁడు చేసి ఒకఁడు పాడినపాట నన్ని విధముల నదేవిధముగ. హిందీ చలనచిత్రస్రష్టలు ఒక

పాటకొక్క శైలి కల్పించిన నావెంట తెలుఁగు చిత్రములకుఁ బాటల కవ్యాదియే శైలితీసికొని వచ్చురీతిని; పాడిన శ్రీనాథుఁడుంచిన భావములనే, వాక్యములనే కథావస్తువులనే పెద్దనయుంచఁగ పెద్దన్న ఉంచినవే తరువాతివారు నుంచిన నయ్యది అసహ్యామగును. ఒక్కొక్కచోట భావములు కొన్ని ఒకేరీతి నుండవచ్చు. దానిని దనకళచే స్థగితము చేయవచ్చును; కాని మొదటినుండి తుదివఱకు నొకేయాకారము, ఒకేశైలి, ఒకేవస్తువు ఒకే భావములు, ఒకరీతిగనే వర్ణనము, ఒకేరీతిగఁ బాత్రపోషణ మున్నచో నయ్యది సంవాదముకాదు. విసంవాదము అయ్యదికళ కాదు, కాకళ. ఒక్కొక్కపద్యము ఒక్కొక్కశ్లోకము సర్వాత్మనా సమమైనది అనేక ప్రబంధములలోఁ జూచుచుంటిమి. భావమొక్కటిగా నున్నను కళకట్టినవి చూచుచుంటిమి. అటులఁగాక వస్త్వైక్యత, కల్పనైక్యత, భావైక్యత, వాక్యైక్యత, పదైక్యత లాగినచోఁ జూడఁజాలము, వినఁజాలము. ఆ అనుకరణము ప్రతిబింబానుకరణము వంటిది. భావములలో నైక్యత యున్నను ఈక్రిందిపద్యములు కళతో నిండియుండుటచే నొంపు నొనఁగూర్చుచున్నవి—

శ్రీనాథుఁడు కాశీఖండము—

కొనరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చినభంగి నేడ్చె న
బ్జసరుహ నేత్రి కొండచఱిఁ బెద్దయెలుంగున వెక్కివెక్కి నె
క్కసమగు మన్యువేగమునఁ గాటుకకన్నుల నీరుసోన లై
యుసిరికగాయలంతలు పయోధరముల్ దిగువాఱునట్లుగాన్,

పెద్దన-

పాటునకింతులోర్తురె కృపారహితాత్మక నీవు సేసిన ని
ష్ఠాటపు భవన్న ఖాంకురము సోఁకెఁగనుంగొను మంచుఁజూపి యు

పలలగంధి వేదన నెపంబిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చుగుబ్బచనుమిట్టల సమ్రోలుచిందు పందఁగన్.

తిమ్మకవి

ఈసునఁబుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీ సఖమైన మోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠ, కలకంఠ వధూకలకాలలీధ్వనిన్.

భట్టుమూర్తి —.

ఆజాబిల్లి వెలుఁగువెల్లికల డాయన్ లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమునఁబటాగ్రం బొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూ రాజత్కరాంభోజ కాం
భోజీమేళవిపంచికారవ సుధాపూరంబు తోరంబుగాన్.

గోదనమును ।అందఱుఁదీసికొన్నను అందము దీసికొనినాఁ గలిగా రా! అటుల నుండవచ్చు కాని ఒకరాజు. రాజు వనవిహారమునకుఁ బోవుట. అచట ఒక స్త్రీని గాంచుట చాటుననో మాటుననో, ప్రత్యక్షముగనో పరోక్షముగనో, ఒండొరులు బద్ధానురాగులగుట. కలసియో, కలయకయో విడిపోవుట, ఉభయులకు విరహవేదన, శిశిరోపచారములు, ఒకరికొకరు వార్తలందించుకొనుట, వివాహము, పుత్రోత్పత్తి. ఆ పుత్రుఁడుఁ గూడఁదనకుఁ బుత్రోత్పత్తి పర్యంత మటులనొనర్చుట. ఇట్టి యవస్థ, ఈకథసాఁగులోపల, మొదట పట్టణవర్ణము, తరువాతకోట, ఆ వెంట హస్త్యశ్వరథ పాదాతివర్ణనము, చాతుర్వర్ణ్యము, గణికావర్ణనము, వివాహమునకు పయనమై వెళ్ళునపుడు గాని, వివాహమయి వచ్చునపుడు గాని నాగరస్త్రీలందఱు దిదృక్షాసంభ్రమములో గోప్యాంగ విస్మరణవర్ణము, ఆపాదమూడముగ నొకమాఱు, లేక రెండు మాఱు

లో ఒకస్త్రీ వర్ణనము. ఈరీతి నొక కావ్యము వెలుపడిన జన్మకవికూడ నివియున్నియు వర్ణింపఁ వలసినదే. నక్షత్రకథలయందు పుస్తకవలె నన్నియు నొక్కకీతిగ నుండవలె నన్నంత వెఱ్ఱి యీ యనుకరణమునకు ఇదియే ప్రతిబింబానుకరణ. ఇది యొకటి.

రెండవది ఆలేఖ్యముఁ ప్రతికృతి, ఫోటో, వంటిది. దీనికి వైశిష్ట్య మంతగ నేరదు కాని అనుకార్యయుపలెఁ దయారగును. వ్యక్తిత్వముండును. దీనికి వస్త్వైక్యత లేకపోయినను, స్వరకల్పన ఒక్కటయి మిగిలిన కృతినంతయు మార్చినట్లు, శైలినిమార్చినట్లు భావము లోకే తీరుననుండి చాలవఱ కనుకరింపఁబడిన దీనికిఁ జెందును. "ఇయ్యది ఫలకముమీఁద నొక మనుజుని యాకృతి తయారయినది. రంగులలో స్పష్టమయినది. అదియు బాగుగనే యున్నది. దాని అందము దీనికిఁ దీసికొని రాఁగలిగినాఁడు శిల్పి" అని మాటిమాటికిఁజూచి అందముగా నున్నదియని ఆనందించెదరు. ఆమనుజుఁడే ఇయ్యది యని తెలియుచునే యుండును. ఇయ్యది యాలేఖ్యానుకరణము.

మూఁడవది మనుజుని బోలిన మనుజుఁ డున్నట్లు, ఒకమనుజుని మనస్తత్వము వేఱు, వాని యభిరుచులు వేఱు వాని క్రియలు వేఱు, రెండవవాని మనస్తత్వము, ఆయాయి చేష్టలు, అభిరుచులు అన్నియును వేఱే మొదటివాని శరీరాకృతి వీనికి నీ యాకృతి వానికి మాత్రము న్నట్లు లీయనుకృతియుండును. ఈరీతి అనుకరణ ఉండవచ్చు, ఉండును, ఉండవలెను. అనఁగా నొకకీర్తనకు రాగముండును. పల్లవి యుండును. స్వరకల్పన యుండును; అన్నట్లు లీయనుకృతి. ఉత్తమకళాస్రష్ట కావ్యలక్షణమును స్వీకరించి, అక్షర- పద-వాక్య-అభిధేయలక్ష్య-వ్యంగ్యములకు అర్థములను-గుణ-రీతి-వృత్తి- పాక- శయ్యాదులను- అలంకారాదులను స్వీకరించుటలోనే మఱొకరితో సంవాదముందినటు లీయను

కరణము దీనికి చైతన్యము ఆత్మ ఉండును. ఈ అనుకరణమునకే "దేహి" అనుకరణ - మనుజునిఁబోలిన మనుజుఁ డుండినట్లుండును

ఇతర కళాసామగ్రి నిర్భరముగ నున్నచో వస్త్వైక్యతయున్నను కళకు లోఁటు వాటిల్లనేరదు కాని వస్తువునే తెచ్చి అద్యాది శుష్క-సామగ్రితో గ్రుచ్చి కథ నడిపితిమి కదా అనురీతిలో 'కళ' ఉన్నను యైనచో నద్యాది యంథానుకృతి. వస్తువు నిఁకొకఁడు చూపినది మఱియొకఁడు చూపినను దానికి కళాపరిణిష్ఠితి యుండవలయును. తాను వస్తుకల్పన చేయఁ జాలనినాఁడు ఇతిహాసములనుండి యావస్తువును దెచ్చుకొనవచ్చును. తనకళతో స్థగితముచేసి యితిహాసమును నడిపెనను మాటలేకుండ మఱపింప వలయును. ఇది కళకట్టినదని అనినఁ జాలు.

అక్షరాదిరచనేవ యోజ్యతే యత్ర వస్తురచనా పురాతనీ
నూతనే స్ఫురతి కావ్యవస్తుని వ్యక్తమేవ ఖలు సాన దుష్యతి.

అని పురాతనవస్తురచన యందు బాధలేదఁట. అందముగా నున్నదియా? లేదా? నూత్న లావణ్యముల్లసిల్లినచో దానిని "కళ" అని ఒప్పుకొనవలసిన నాఁడు అనుకృతి అయినను సరే

యదపి తదపి రమ్యం యత్ర లోకస్య కించిత్
స్ఫురితమిదమితీయం బుద్ధిరభ్యుజ్జిహీతే
అనుగతమపి పూర్వచ్ఛాయయా వస్తుతాదృక్
సుకవిరుపనిబధ్నన్ నింద్యతాం నోపయాతి ॥

భావుకులుగాని లౌకికులుఁ గూడఁ జూచి యానందించి నప్పుడు బిఱ్ఱబిగిసి నీవొక్కఁడవు నిందించినను నతఁ డుత్తమ కళాకారుఁడే అగునని నాఁడు ధ్వనికర్త.

త్యాగరాజు, సూరదాసు, తులసీదాసు మొదలగు ప్రసిద్ధ గాన కళాచతుర్ముఖులు, వాగ్గేయకారకులు, రామాయణమునే తీసికొనిరి.

భాగవతమునే గ్రహించిరి. తమ గానకళా ప్రతిపాద్య విషయము త్యాగయ్యమాట తెలుసుకొనిన నతఁడు గానకళాబ్రహ్మ అని ఒప్పుకొనదే. అట్టివారే సూరదాసు, తులసీదాసు. వారి సమయములోనే గానకళ పెంపొందినవి, నూతనసృష్టి నందిన దని అందఱు నొప్పినవిషయము. ఉన్న సప్తస్వరములనే, పరిమితవస్తువునే, ప్రచలితరాగములనే, ప్రసిద్ధ తాళములనే చిత్రాతిచిత్రముగా మిళితము చేసిరి నాదబ్రహ్మోపాసన చేసిరి. నాదబ్రహ్మమును దేశమంతటను వ్యాపింపఁ జేసి లోకము గుర్తించిరి.

ఒకమాట– ప్రకృతి ననుకరించుట కావ్యకళాకారులకు నొం వటి కనివార్యము. ప్రకృత్యనుకృతి నానావిధములుగా నుండును. జడవస్తువులను జూచి వానిని యథాతథముగ వర్ణించుట. తన మనో భావములను జడవస్తువులతో మేళవించి వర్ణించుట ప్రపంచములోని జడవస్తువులను జూచి అసహ్యించుకొందుము. చెట్లు, డొంకలు రోఁత కొన్నియునిపించును. ఆ వస్తువులే కవికవితలోని కెక్కి వానిరోఁతను వదలి కొని తమ జాడ్యమును వీడి అందమునందును.

తులసీ॥ దామినిదమక రహీం ఘనమాహీం, ఖల కే ప్రీతి యథా థిరనాహీం,
ఛుద్రనదీ భరి చలి ఉతరాఈ, జసథోరేధన ఖలబౌరాఈ,
ఉదిత అగస్త పంథజలసోఖా, జిమిలోభహిం సోఖసంతోషా,
బూంద అఘాతసహైంగిరికైసే, ఖలకే వచన సంతసహజైసే॥

ఇచ్చట ప్రకృతి వర్ణనము రెండు విధములుగా సాగినది. ప్రకృతిలో నున్న మనోభావములను ఒకరీతిలో వర్ణించి జడ పదార్థములను చిత్రించినాఁడు.

ఖలునకుఁ బ్రీతి యేవస్తువుల యందు స్థిరముగా నుండనట్లు, మేఘములో మెఱుపు క్షణికముగా విలసిల్లును. ఖలునకు సంపదల

లవడిన మిడిసి పడునట్లు చిన్ననది ఒక్కసారి వెల్లివిరియును. లోభగుణము హెచ్చిన దానికి సంతోషము ఎండిపోవునటుల అగస్త్యనక్షత్రోదయము కాఁగానే (శరదృతువు వచ్చుటతోడనే) మార్గములలో బురద యెండును సత్పురుషులు దుష్టుల నిష్ఠురవచనములను సహించునటుల పర్వతములు జలబిందు నిపాత బాధను సహించును. అని వర్ణించినాఁడు,

కేవలము జడవస్తువులనే వృక్షలతాగుల్మాదులను, నదీనదముల, పర్వతాదుల, ఋతువుల, ఋతువులలో ప్రత్యేకధర్మముల వర్ణించి, ఒక సరస్సునే వర్ణించి, ప్రపంచ జడవస్తువులనే యథాతథముగా వర్ణించు ప్రకృత్యుపాసన లేకపోలేదు. కళాపూర్ణోదయములో ఋతువర్ణనము. చంద్రసూర్యోదయవర్ణనమును వీని కుదాహార్యములు. శృంగార రస భేదము లనంతములు ధ్వనికారుఁడు చెప్పెను లోకములోనున్న ప్రతి వస్తువు నేదియో యొకరీతిని ఉద్దీపన విభావమగు నని యనినాఁడు. కావున జడవస్తువులన్నియు కవికి వర్ణనీయములే అగును.

మఱియొకరీతిని శ్రోతకు చెప్పవలసిన విషయమును చెప్పుచు దానినెదిరికి బోధించుటకై లోకములోఁ బ్రసిద్ధిగానున్న యవి, అందమయినవి, అందఱకు ననుభవవిషయములైనవి తీసికొని ఉపమానవస్తువులుగా నిక్షేపించి చెప్పుట ప్రకృత్యనుకరణమే. ఈరీతిఁ గవితలోఁ బ్రసిద్ధి కెక్కినవారు. వాల్మీకి, కాళిదాసు, మొదలగు ప్రసిద్ధకవులు వారి కవితలో నీయుపమ కనఁబడుచునే యుండును. గంగా, యమునా సంగమము రఘువంశమున నిచట నుదాహార్యము.

మఱియొకరీతిని బ్రకృతి చిత్రణము సాగుచుండును. ఒక వాస్తవము, ఐతిహాసికము, నగు కథను దీసికొని దాని సాఁగించినపుడు లోకములోనున్న క్రియల ననుకరింప వలయును. క్రియారూపమునఁ గాని వెలువఱచుట పొసంగనేఱదు. "ప్రియవరయూథిపుల" ఘట్టము, "కోలా

ఈనామములును బహుప్రకారముగ నున్నవి. వీనికి ప్రవృత్తి నిమిత్తము లగు జాతి, గుణ క్రియాద్రవ్యము లనంతములుగ నుండు టచే నామములు గూడ ననంతము లైనవి. ఉదా. ఘటము, పట మను నవి జాతిశబ్దములు. "తెలుపు నలుపు" ఇవి గుణశబ్దములు. పాచకుఁడు వంటవాఁడు లేక వంటచేయునతఁడు, పాఠకుఁడు (చదువునతఁడు) ఇవి క్రియాశబ్దములు. దండి (దండముగలవాఁడు) విషాణి (కొమ్ములుగలది పశువు) అనునవి ద్రవ్యవాచకశబ్దములు.

కొంద ఱాచార్యులు (శాకటాయనులు - నిరుక్తకారులు) ఈ శబ్దము లన్నిటికిని, క్రియ యొకటియే ప్రవృత్తినిమిత్తమగుట వలన నివి యన్నియుఁ గ్రియాశబ్దములే యని యందురు- ఘటము (కుండ) మొదలగు శబ్దములు తమ యర్థమును దెల్పుటకు, ఘటనము మొద లగు క్రియలనే, యన్వయవ్యతిరేకముల వలన, [ఘటన మనుక్రియ యున్నపుడే ఘటము సిద్ధించును - ఇది యన్వయము. ఘటనక్రియ లేనపుడు ఘట ముండదు ఇది వ్యతిరేకము] ప్రవృత్తి నిమిత్తముగా నవలంబించు చున్నవి. ఘటత్వము మొదలుగాఁ గల సామాన్యమును (జాతిని) ప్రవృత్తి నిమిత్తముగా గ్రహించుట లేదు. ఈఘటన మను క్రియ, ఘటత్వ మనెడు సామాన్యముతో (జాతితో) కలిసి యుండ వచ్చును లేకుండవచ్చును. అంతమాత్రమున (ఘటత్వముతో సంబంధిం పకున్నను) ఘటనాదిక్రియ ఘటశబ్దమునకుఁ బ్రవృత్తినిమిత్తము కాక మానదు. ఏలన ఘటత్వమను సామాన్యమున్నను, ఘటనక్రియ లేకయే ఘటము రూపొందకయే, యొకవస్తు వేదియైనను ఘటమని వ్యవహా రింపఁ బడదుగదా! ఘటనక్రియ లేకున్నను, ఘటము సిద్ధింప వచ్చు నందురేని, పటము (వస్త్రము)ను గూడ ఘటమని యేల పిలువరు?- ఘటనక్రియ లేకుండుట వలన నందురేని యీవిషయము రెండుచోట్లను సమానమే.- తెలుపుఁదనము నందని వస్తువును తెల్లని వస్తువని యెప్పు డైన నందుమా? పచనమను క్రియ లేకయే పాచకుఁడు గాఁడు గదా !

కావున "ఘటన క్రియాకర్తృత్వము" అను లక్షణముగల ఘటత్వమే ఘట శబ్దమునకుఁ బ్రవృత్తి నిమిత్తమగునుగాని, కేవలము ఘటత్వ మను జాతిమాత్రము, ప్రవృత్తి నిమిత్తముగాదు. ఇట్టి లక్షణముతోఁ గూడిన ఘటత్వమునే, యీశాస్త్రమునందు ఘటనమని వ్యవహరించు చున్నాము—

ఆక్షేపము—"ఘట" అనుధాతువునకు, ఘటించుట యను నర్థమున "అచ్" మొదలగు ప్రత్యయములఁ జేర్చుట వలన ఘట శబ్దము రూపొందినది. కావున "ఘటన" మను క్రియయే ఘటశబ్దమునకుఁ బ్రవృత్తి నిమిత్తమని మేము నంగీకరించుచునే యున్నాము. ఇటులే మిగిలిన శబ్దముల విషయమునఁ గూడ నంగీకరించు చున్నాము. కావునఁ బై యుపన్యాసము వ్యర్థమని మాయభిప్రాయము.

సిద్ధాంతము—సత్యమే, మీరు నంగీకరించుచునే యున్నారు. కాని మీరు చెప్పు "ఘటనము"-అనుక్రియ ఘటశబ్దమునకు.*వ్యుత్పత్తి నిమిత్తమేగాని, ప్రవృత్తి నిమిత్తముగాదు.- ఈరెండును పరస్పరము భిన్నములే. ఎటులనఁ గొందఱి (ఉపాధివాదుల) మతమున గోవు మొదలగు శబ్దములకు "గమనము" మొదలగు క్రియలు వ్యుత్పత్తి నిమిత్తము. ఈగమన క్రియయు, గోత్వ మనుధర్మమును సమవాయ సంబంధముచే "గోవు" అను నొకేదవ్యము నందుండుటచేత గోత్వమ నునది ప్రవృత్తి నిమిత్త మగుచున్నది. అందువలననే నడుచుచున్నను, నడువకున్నను, గోవునుఁ దెల్పుటకు గో శబ్దము నుపయోగించు చున్నాము.

---

*వ్యుత్పత్తినిమిత్తము—ఒకశబ్దమే ధాతువు నుండి, యేప్రత్యయముఁ జేర్చుట వలన నుత్పత్తి నొందినదో తెలుపు నది వ్యుత్పత్తి నిమిత్తము. అనఁగా నొకశబ్దము యొక్క యుత్పత్తికి ఏధాత్వాదులు మూలము లను విషయము నిది తెల్పును- అట్లు త్పన్న మైన శబ్దము లోకములో నొకయర్థమును దెల్పుట కే ధర్మము నిమిత్త మైన దియో యది ప్రవృత్తి నిమిత్తము. సామాన్యముగఁ దెలియవలయునన్న-పంకజశబ్దము నకు- పంకము నందుఁ బుట్టుట యనునది వ్యుత్పత్తినిమిత్తము, పంకజత్వ మనునది ప్రవృత్తి నిమిత్తము. దీనినే యుపాధియనియు నందురు.

ఇటులే ప్రస్తుతముగూడ, ఘటాది శబ్దములకు, చేష్టాది క్రియలే వ్యుత్పత్తి నిమిత్తములని తేలుచున్నది. ఈఘట శబ్దమునందలి "ఘటన మను" క్రియకంటె పూర్వకాలత్వమును నిర్దేశించుట కయియే "విపచ్య ఘటో భవతి" (కాలి, కుండ అగుచున్నది) అను ప్రయోగమున "విపచ్య" అనుచోట క్త్వా ప్రత్యయము (ల్యప్) ప్రయుక్తమైనది.- "విపచ్య" అనుశబ్దము నందలి విపాకక్రియ, ఘటనక్రియ కంటె ముందైనదని తెలియవలెను. "అధిశ్రిత్య పాచకో భవతి" (పొయి మీఁద పెట్టి పాచకుఁ డగుచున్నాఁడు) అనునపుడు గూడ నధిశ్రయణమను క్రియ పచనక్రియ కంటె ముందైన దని తెలియవలెను. ♦ విపాకాధిశ్రయణక్రియల యందలి పూర్వకాలత్వము భవన క్రియాపేక్షము గాదు. భవతి (అగును) యను క్రియాశబ్ద మవశ్యము ప్రయోగింప నక్కఱలేదు. ప్రయోగింపకున్నను, ప్రతిపదార్థమునందును, "సత్తౌ" తప్పకయుండుటచే భవతి ప్రయోగము వలనఁదెలియవలసిన భవనక్రియ ప్రతీయమాన మగుచునే యుండును. అంతమాత్రమున, విపాకాది క్రియాపౌర్వకాల్యము భవతి క్రియాపేక్ష మనఁజెల్లదు. భవతిక్రియ విపాకాదిక్రియకు బహిరంగ మగుటయే గాక, యర్థము కూడ కుదుర కుండుటయే ఇందుకు హేతువు. క్త్వా ప్రత్యయముచే సూచిత మగు పౌర్వకాల్యము, సాధారణముగ ప్రయుజ్యమానమైన క్రియ నపేక్షించియే యుండును గాని ప్రతీయమానక్రియాపేక్షమై యుండదు. ఇట్లు కానిచో

---

♦ ఒకే కర్తగల క్రియలు రెండున్నచో, అందులో, నేక్రియ పూర్వకాలమునకు సంబంధించినదో, ఆక్రియకు క్త్వా ప్రత్యయము సంస్కృతమునఁ జేర్పఁబడును. ఆక్రియావాచక శబ్దమునకు పూర్వ ముపసర్గయున్నచో క్త్వా కు బదులుగ ల్యప్, వచ్చును- ప్రస్తుతము విపచ్య ఘటో భవతి అనునపుడు విపాకము, ఘటనము, భవనము (అగుట) అనుమూఁడు క్రియలు మూఁడు శబ్దములలో నున్నవి. ఇందు విపాకక్రియ ఘటన క్రియకే ముందైన దని తెలియ వలెనే గాని, భవన క్రియకు ముందని గాదు. అటులే అధిశ్రిత్య పాచకోభవతి అనునపుడు, అధిశ్రయణక్రియయొక్క పూర్వకాలత్వము పచనక్రియాపేక్షమే గాని, భవనక్రియాపేక్షముగాదు.

శ్రుత్వాపి నామ బధిరో, దృష్ట్వాప్యన్ధో,జడో విదిత్వాపి
యో దేశకాల కార్యవ్యపేక్షయా పండితస్స పురుషః.

మొదలగు ప్రయోగము లన్నియు ననుపపన్నములగును—

పై శ్లోకతాత్పర్యము:—దేశకాలకార్యముల ననుసరించి, యెవఁ డొకవిషయమును వినియు చెవిటివాఁడో చూచియు గ్రుడ్డివాఁడో, తెలిసికొనియు జడుఁడో యా పురుషుఁడే పండితుఁడు-

ఇచట "శ్రుత్వాపి బధిరో భవతి" "దృష్ట్వా ప్యన్ధో భవతి" వినియు బధిరుఁడగునో కనియు నంధుఁడగునో-యనునపుడు, భవతి యను క్రియ (=అగును) ప్రతీయమాన మగుచునే యున్నది. అయినను వినుట యనుక్రియ వినలేకుండుట (బాధిర్యము) అనుక్రియకే పూర్వకాలము గలది యగును కాని "అగును" (భవతి) అను క్రియ కంటెఁ బూర్వకాలపుది కాదు. అట్లే యగుచో "పని యగును," అనగా నెవడు వినునో వాడు పండితుఁడగును అను నర్థము వచ్చును. ఈయర్థ మసంగత మగును గదా! బాధిర్య మనుక్రియ కంటెఁ బూర్వకాలతనే "శ్రుత్వా" యనుక్రియలోని క్త్వా ప్రత్యయము తెలుపుచో నీ యసంగతత్వము పోవును.

అనేక క్రియ లొకచో నున్నపుడు, పూర్వపూర్వక్రియల పౌర్వ కాల్య ముత్తరోత్తర క్రియాపేక్షమే యగును. స్నానముచేసి, తిని, త్రాగి వెళ్లుచున్నాడు (స్నాత్వా, భుక్త్వా, పీత్వావ్రజతి) యనునపుడు స్నానము చేయుట, తినుటకంటెను; తినుట, త్రాగుట కంటెను; త్రాగుట, వెళ్లుటకంటెను; బూర్వకాలమున జరిగిన దని తెలియవలెను. ఇటులే "విపచ్య ఘటో భవతి" యను నపుడు గూడ,విపచనము, ఘటనము, భవనము అను క్రియ లనేకము లున్నవి. ఇందు పచన క్రియ యందలి పౌర్వకాల్యము, ఘటనక్రియాపేక్షమే యగును. "ఘటః" "అనునపుడు" "అచ్" ప్రత్యయమును, భవతి యనునపుడు "తిప్" ప్రత్యయమును, ఈ రెండును కూడ కర్తనే సూచించును. ఈయంశములో ఘట శబ్దమునకు, భవతి శబ్దమునకును భేదములేదు కావున నుత్తరోత్తర క్రియాపేక్షమే పూర్వపూర్వక్రియ పౌర్వకాల్యమనుట యుక్తము.

అన్ని తావులయందు దిక్కే యున్నను, ఈవిషయము గుర్తింపఁబడుట లేదు. కృత్ప్రత్యయము కర్తను తెలియఁజేయును. శబ్దమునందు ప్రత్యయార్థమునకే ప్రాధాన్య ముండును. ప్రకృత్యర్థ మప్రధానము. అట్లగుటచే కృత్ప్రత్యయనిర్దేశ్యమైన కర్తకు, ప్రకృత్యర్థమైన క్రియ యుపాధిభావమును పొందినదై, స్ఫుటముగఁ గన్పింపదు. అప్పుడు వ్యాఖ్యాతలు చాలమంది ఇచట క్రియలు భిన్నకర్తృకములని భ్రమపడుచున్నారు.

ఉదాహరణమునకు—

"శిశిరకాల మపాస్య గుణోస్య నః క ఇవ శీతహరస్య కుచోష్మణః
ఇతి ధియాస్తరుషః పరిరేభిరే ఘనమతో నమతోఽనుమతాః ప్రియాః"

శిశుపాలవధ.

తా. అది శీతకాలము- నాయికలకు రోషము కలిగినది. నాయకులు వారికి పాదాక్రాంతులైనారు. నాయిక లాలోచించినారు. ఈశీతకాలమును వదలివేసినచో, (శీతకాలము వెళ్లిన తరువాత) మన కుచముల వెచ్చఁదనమువలన ప్రయోజనమేమి? ఈయాలోచనతో, రోషము పోఁగొట్టుకొని, యంగీకారమును సూచించుచున్న తమప్రియులను గట్టిగఁ గౌఁగిలించుకొనినారు—♦

ఇచట "అపాస్య" యనునది ల్యబన్తము. "వదలి" అనునర్థము వచ్చును. "వదలుట" యను క్రియయందలి పౌర్వకాల్యమును ఈ ల్యప్ ప్రత్యయము సూచించును. ఏక్రియకంటె బూర్వకాలమును సూచించును? "శీతరహస్య" యనుపదమున, హరించుట యనుక్రియ పైఁదెల్పిన రీతిని, కర్తకుపాధిభావము నొందియున్నది. ఈహరణక్రియకంటె వదలుట యనుక్రియ పూర్వకాలమునకు సంబంధించినదని తెలియ

♦ శిశిరకాలం = చలికాలమును, అపాస్య = వదలి. శీతహరస్య చలి నిపోఁగొట్టు, నః = మనయొక్క, కుచోష్మణః = స్తనములవెచ్చఁదనమునకు, గుణః కః = ఫలమేమి? ఇతి ధియా = అనుబుద్ధితో, అస్తరుషః = పోయిన రోషముకలవారై, ప్రియాః = ప్రియురాండ్రు, నమతః = నమస్కరించుచున్నట్టియు, అత ఏవ= అందువలననే, అనుమతాన్ = అంగీకరింపఁబడినట్టియు, ప్రియులను, ఘనమ్= గాఢముగా పరిరేభిరే = కౌఁగిలించుకొనిరి. —ఉత్ప్రేక్ష-అలంకారము.

వలెను. వదలుట శైత్యమును హరించుట యనుక్రియలకు రెంటికిని "కుచోష్మణో" స్తనముల వెచ్చఁదనమే కర్త యగుటచే నిందు, పూర్వకాలికక్రియ యగు వదలుటను తెల్పు అప అస్ క్రియకు ల్యప్ ప్రత్యయమును చేయుట సమంజసముగనే యున్నది ఈవిషయము నిట్లు గుర్తింపక వ్యాఖ్యాతలు కొందఱు అపాస్య యనుక్రియయు, శీతహరణ క్రియయు, భిన్నకర్తృకములని భ్రమించిరి. భిన్న కర్తృకము లైన పుడు పూర్వకాలిక క్రియకు క్త్వా ప్రత్యయము వచ్చుట ప్రమాదమని తలఁచి యాదోషమును వారించుటకై 'అపాస్య' యనునది క్త్వాన్తరూ పక్రియ కాదనియు, ల్యబన్తమును పోలిన నిపాతమనియుఁ దెల్పిరి. మఱికొందఱు, అపాస్య, విద్యమానస్య, కుచోష్మణః యనిచెప్పకొన వలయుననియు 'విద్యమాన'యనుక్రియావాచక పద మిచట ప్రయుక్తము కాకున్నను ప్రతీయమాన మగుచున్నదనియు, నపాస్య యనుక్రియ యందలి ల్యప్ ప్రత్యయము, విద్యమాన క్రియాపేక్షమనియు సమర్థించిరి. కాని పై విధమున, శీతహరస్య యనుచో హరణక్రియను గుర్తించుచో, ఈభ్రమ కవకాశము లేదని యిపుడు దెలియఁ గలదు.

మఱియొక యుదాహరణము—

• నిరీక్ష్య సంరంభ నిరస్తధైర్యం, రాధేయ మారాధిత జామదగ్న్యమ్
అసంస్తుతేషు ప్రసభం భయేషు, జాయేత మృత్యోరపి పక్షపాతః॥

కిరాతార్జునీయమ్.

తా. కర్ణుడొకసారి కోపించెనా, శత్రువుల ధైర్యము సడలి పోవును. ఆతఁడు పరుశురాము నారాధించి యనేకాస్త్రములను పొందినాఁడు. అట్టికర్ణుని జూచినచో, మృత్యువునకు (యమునకు) కూడ

• (1) సంరంభ=కోపముచేత, నిరస్త = పోఁగొట్టఁబడిన, ధైర్యం = ధైర్యము కలిగినట్టియు (సంరంభ నిరస్తధైర్యమ్) ఆరాధిత జామదగ్న్యం = సేవింపఁబడిన పరశురాముఁడు కలిగినట్టియు, రాధేయం = కర్ణుని, నిరీక్ష్య = చూచి మృత్యోరపి= మృత్యువునకునైతము, అసంస్తుతేషు = పరిచయములేని, భయేషు = భయముల యందు ప్రసభం = బలాత్కారముగా, పక్షపాతః = పరిచయము. జాయేత = పుట్టును మృత్యువునకు భయసంబంధము లేకున్నను, నున్నట్లువర్ణించుటచేత నతిశయోక్త్యలంకారము,

నింతకు పూర్వ మపరిచితములైన భయములయందు బలాత్కారముగనే (తప్పక) పక్షపాతము (పరిచయము) కల్గును.

ఇందు, చూచుట (నిరీక్ష్య) భయపడుట, (భయేషు), పరిచయము కలుగుట (పక్షపాతః) అనుక్రియలకు మూఁటికిని మృత్యువే కర్త. అనగా, మృత్యువే కర్ణుని చూచును, భయపడును, ఆభయములందుఁబడును. (పరిచితుఁడగును). ఇందు, భయపడుట యనుక్రియ కంటె, నిరీక్షణక్రియ ముందుజరుగును. కావున, "నిరీక్ష్య" యని ల్యప్ ప్రత్యయము ప్రయుక్తమైనది. ఇఁక భయమునొందుట, (పక్షమున) పడుట యనుక్రియలు విషయవిషయిభావసంబంధమున నుపాత్తములైనవి. అనగా, భయవిషయకమైన పతనమగుటచే, పతనము, విశేష్యముగను, భయము విశేషణముగను న్వయించును.

మఱియొక దృష్టాంతము.

• "యాం దృష్ట్వాపి సముత్సుకే మనసి మే నాన్యా కరోత్యాస్పదమ్"

తా॥ ఆమెను చూచిన తరువాత, నామన సెంతయుత్కంఠతో నున్నను, నామనసునందు వేఱొకస్త్రీకి స్థానము చిక్కుటలేదు. నామన సామెనే ధ్యానించు చున్నదని తాత్పర్యము—

ఇచట దర్శనక్రియకును, కుతూహలపడుట యనుక్రియకును, మనసను నదొకటియే కర్త. మనసామెను ముందు చూచి తరువాత నుత్కంఠను పొందుచున్నది. అందుచే పూర్వకాలికమగు దృశిక్రియకు, క్త్వాప్రత్యయము చేర్పఁబడినది. - ఈమనసు, అన్యస్త్రీకర్తృకమైన "ఆస్పద" క్రియకు (వేఱొక స్త్రీయుండుట యను క్రియకు) అనధికరణమైనది. (స్థానముకాలేదు) ఇట్టి మనసునకు విశేషణముగా నౌత్సుక్యము, (ఉత్కంఠపడుట) యనుక్రియ యుపాత్తమైనది (కుతుకము గలమన సనునప్పుడు కుతుకము విశేషణముగ నున్నదిగదా!)

• (2) యాం = ఏ వాయికను, దృష్ట్వా = చూచియు, సముత్సుకేపి = కుతుకము గల్గియున్నను, మే మనసి = నామనసునందు, అన్యా = వేఱొకతె, ఆస్పదం = స్థానమును, నకరోతి = చేయుటలేదో.

ఒకప్పుడీక్రియ, కర్తకు సంబంధించినదై భ్రమ హేతువగుచున్నది.

ఉదా॥ "స్మరన్, సంస్మృత్య, న, శాన్తి, రస్తి, మే"

ఓమన్మథుడా, సంస్మృత్య=ఆమెను స్మరించియు, మే=నాకు, శాన్తిః=లేదు నే నామెను స్మరించి శాంతినొందుట లేదని భావము. - ఇచట "నేను" అనునదికర్త. స్మరించుట, శాంతినొందుట యనునవి రెండును క్రియలు. ఇందు పూర్వకాలికమైన స్మృ (స్మరించు) క్రియకు, ల్యప్ప్రత్యయము చేరినది. ఇచట "మే"యనుపదము"నాయొక్క"యను నర్థమును తెల్పును. ఇది సంబంధవాచకము. "నాకు సంబంధించిన శాంతిలేదు" అనునర్థము సామాన్యముగ స్ఫురించి, శాంతి యనునది, అస్మదర్థముతో (మే) సంబంధించిన నామమేగాని, క్రియ కిచట ప్రసక్తి లేదనుభ్రమను కలుగఁ జేయును.

కొందఱు, కర్తృవాచక పదమును, క్రియావాచకపదమును గూడ ప్రయోగింపకుండుటయు, ఈభ్రమకు హేతువులని తలఁచు చున్నారు.

ఉదా॥

నను సర్వ ఏవ సమవేక్ష్య క మపి గుణమేతి పూజ్యతామ్

♦ సర్వగుణవిరహితస్య హరేః పరిపూజయా కురునరేన్ద్ర! కో గుణః

ఇచట, సమవేక్షణము=చూచుట లేక, ఆలోచించుట యను క్రియకును, పూజించుటకును, రెండుక్రియలకును "లోకము" అనున దొకటియే కర్త. కాని "లోకము" అనుపదము ప్రయుక్తము కాలేదు. సామర్థ్యము వలన ప్రతీయమాన మగుచున్నది. "పూజ" యనుక్రియ "పూజ్యతాం" అను పదమున నుపాత్తమైనను, కర్మార్థ ప్రయోగముననుండి, యప్రధానమైనది. అందుచే నిట భ్రాంతి కలుగు చున్నది.

---

♦ కురునరేన్ద్ర - ఓధర్మరాజా, సర్వఏవ=లోకమంతయు, కమపిగుణం= ఏదియో ఒక గుణమును, సమవేక్ష్య=చూచి, పూజ్యతాం=పూజింపఁబడుటకు అర్హతను ఏతి=తెలిసికొనును - సర్వగుణవిరహితస్య, హరేః=ఏగుణములును లేని విష్ణువు యొక్క, పరిపూజయా=పూజించుటచేత, కో గుణః=ఏమిఫలము ?

క్రియావాచకపదము లోపించుట వలన భ్రాంతికలుగుట కుదాహరణ

♦ (1) అకృత్వా పరసంతాపం అగత్వా ఖలనమ్రతామ్
అనుత్సృజ్య సతాం మార్గం యత్ స్వల్పమపి తద్బహు"

తా॥ ఇతరులకు సంతాపమును కలిగింపక, దుర్మార్గులకు వినీతుఁడుగాక (లొంగక) సత్పురుషుల మార్గమును వదలక, ఏస్వల్పమును సంపాదించినను, నదియే యెక్కువ. – ఇచట "యత్ స్వల్పమపి లభేత" అని యుండవలెను ; కాని "లభేత" అనుక్రియ లేదు. గమ్యమగుచున్నది. అందుచే, అకృత్వా, అగత్వా, అనుత్సృజ్య అనుత్సృజ్య అనుక్త్వాంతములు, భిన్నకర్తృకములని భ్రమగలుగుచున్నది. వాస్తవమున నీక్రియలును, "లభేత" యను క్రియలును నేక కర్తృకములే. అందుచేతనే లభేత అనుక్రియ కంటె పూర్వకాలికములైన క్రియలకు మూఁటికిని, క్త్వా ప్రత్యయము చేర్పఁబడినది.

♦ (2) పైవిషయములన్నియు పూర్వోతే సంగ్రహముగఁ జెప్పినారు వాని వాని తాత్పర్యమిది.

స్వాతంత్ర్యమైన కర్తకు, విశేషణముగఁ గాని, సంబంధించినట్లు గాని చెప్పుటచేతనో, కర్తృభిన్నమైన కర్మాదుల కుపసర్జనముగా నుండుటచేతనో, లేక, కర్తృ క్రియా వాచకపదములను ప్రయోగింపకుండుటచేతనో, క్త్వా ప్రత్యయమునకు ప్రకృతియైన క్రియ భిన్నకర్తృకమని భ్రమ కలుగుచున్నది.

ఇఁక క్రియల పౌర్వాపర్యమునందు రెండువిధములు గలవు. ఒకటి శాబ్దమైన పౌర్వాపర్యము. రెండవది వాస్తవమైన పౌర్వా

---

♦ 1. పరసంతాపం=ఇతరులకుబాధను, అకృత్వా=చేయక, ఖలనమ్రతాం= దుర్మార్గులను వినయముగనుండుట అగత్వా =పొందక ; సతాం= సత్పురుషుల యొక్క మార్గమును, అనుత్సృజ్య= వదలక, యత్ = ఏ, స్వల్పమపి=కొంచెమైనను (లభేత =పొందునో) తత్ =అదియే, బహు= ఎక్కువ.

2. కర్తురుపాధితయోక్తా, కృద్వ్యాచ్యతయా, గతాన్యగుణతాం వా
క్త్వో భిన్నకర్తృకత్వ భ్రమాయ భవతి క్రియాఽవచశ్చ తయోః
పౌర్వాపర్యే క్రియాణాం యత్ వాస్తవం తదపేక్షిణి
క్త్వః పౌర్వకాల్యే కిం తాసాం ప్రాధాన్యేతర చింతయా.

పర్యము —అందు ప్రధానక్రియకును, నప్రధానక్రియలకు గల పౌర్వాపర్యము శాబ్దమనఁబడును —గుణక్రియ (అప్రధానక్రియలకు) లకు వానిలోవానికి పరస్పరము సంబంధ ముండ దనియు, నివి యన్నియును ప్రధానక్రియనే సంబంధించి యుండుననియు నొక శాస్త్ర మర్యాద యున్నది. దీనిని శాబ్దపౌర్వాపర్య మని యందుము. ఈపద్ధతి యందు, గుణక్రియ లన్నిటికిని పూర్వకాలత, ప్రధానక్రియాపేక్ష మయియే యుండును గాని వానికిఁ గల క్రమమును బట్టి వానిలో వానికి పూర్వకాలత్వ ముండదు.

వాస్తవమగు పౌర్వాపర్య మాయా శబ్దములయొక్క స్థితి ననుసరించియే కలుగును. ఆపేక్షికమైన గుణప్రధానభావ మీగుణక్రియలకును సిద్ధించును. «పశ్యమృగో ధావతి" «చూడుము, మృగము పరుగెత్తుచున్నది" అనునపుడు చూడుము - పరుగెత్తుచున్నది అను క్రియలు రెండును ప్రధానములే యైనను వానికి గుణప్రధానభావము కుదురునట్లే (మృగము బరుగెత్తుటను చూడుము. అనునపుడు చూచుటయను క్రియ ప్రధానము, బరుగెత్తుట యప్రధానక్రియ) గుణక్రియలకుఁ గూడ పరస్పరము గుణప్రధానభావము కుదురును. అపు డీగుణక్రియలలో నేది ముందుగ నుండునో దానికి పౌర్వకాల్యము సిద్ధించును. ఇట్లు వాస్తవమగు పౌర్వకాల్యమును మనసున నుంచుకొనిన నాడు, పూర్వ ముదాహరించిన శ్లోకములలో క్త్వా ప్రత్యయప్రయోగము కుదురుచునే యున్నది-అప్పుడిది ప్రధానక్రియ, యిది యప్రధానక్రియ యని విచారించుట వ్యర్థము—

పైని తెల్పిన వాదము యొక్క సారము నంతయు వ్యక్తివివేక కర్త యీ సంగ్రహశ్లోకములలో నిచ్చుచున్నాఁడు.

ఘటతీతి ఘటో జ్ఞేయో నాఘటః ఘటతా మియాత్
అఘటత్వా విశేషేణ పటోఽపి స్యాత్ ఘటోన్యథా (8)
ఘటనం చ, తదాత్మత్వాపత్తి రూపా క్రియా మతా

మూలంచ తస్యా శ్చిత్రార్థా భాసావిష్కృతి రీశితుః (9)
యః కశ్చిదర్థః శబ్దానాం వ్యుత్పత్తౌ స్యా న్నిబన్ధనం
ప్రవృత్తౌ తు, క్రియైవైకా సత్తాసా దనలక్షణా (10)
తస్యామేవ క్విబాద్యాశ్చ విధేయాః కర్తృమాత్రతః
స తూపమానాదాచారే, తయోరర్థాత్ ప్రతీతితః (11)
యథా హ్యశ్వతి గాలేయ ఇత్యత్రోఽర్థః ప్రతీయతే
అశ్వత్వమాసాదయతి ఖర ఇత్యర్థతః పునః (12)
అశ్వతుల్య సమాచారః ఖర ఇత్యవసీయతే
న తత్త్వాసాదనం యుక్తం తదతుల్య క్రియస్య హి (13)
సత్తాయాం వ్యాపృతి శ్చైషా చిత్రత్వ పరినిష్ఠితేః
సంగచ్ఛతే జడస్యాపి ఘటాదే ర్ఘట నాదివత్ (14)
నామ్నః సత్వప్రధానస్య ధాతుకారోఽతఏవ హి
శబ్దవక్త్రైక దేశాదేః ధాత్వర్థత్వ మహోచత (15)

ఏవం చ విపచ్య ఘటో భవతీతి క్త్వోస్య పూర్వకాలత్వమ్
ఘటనాపేక్షం జ్ఞేయం భవనాపేక్షన్తు నాసమన్వయతః (16)
బహిరంగత్వాచ్చ యథా భవత్యధిశ్రిత్య పాచకోఽయమితి
అత్ర హి పాకాద్యపేక్షాధి శ్రయతేః పూర్వకాలతావగతిః 18)
తస్మా న్నామపదేభ్యో యః కశ్చిదర్థః ప్రతీయతే
న, స, సత్తామనాసాద్య శబ్దవాచ్యత్వ మర్హతి (18)
ఇత్థం చాస్తి భవత్యాది క్రియాసామాన్య ముచ్యతే
నాన్తరంగ తయాఽవశ్యం, వక్తార స్తత్ ప్రయుంజతే (19)
క్రియావిశేషోయ స్త్వన్యః పాకాది ర్వ్యభిచారభాక్
బహిరంగతయా తస్య ప్రయోగోఽవశ్య మిష్యతే॥

వీనియర్థమిది.

ఘటత్వమును లేక ఘటాత్మతను పొందుట యను క్రియ యున్నప్పుడే, ఘటము సిద్ధించును. ఆక్రియ యుండుటవలననే అది ఘటమని

తెలియఁబడుచున్నది. ఘటనము లేనిదే ఘటత్వము సిద్ధింపదు. ఘటనక్రియాకర్తృత్వరూపమగు ఘటత్వము లేకున్నను, ఘటపదార్థముఁ సిద్ధించుచో, ఘటత్వము లేకుండుట యనెడు ధర్మము, పటమునందు గూడ నుండుటచే, పటమును గూడ మనము ఘటమని వ్యవహారింపవచ్చును. అనఁగా నేవస్తువైనను ఘటవ్యవహార యోగ్యమే యగును -కావున ఘటనమున్నప్పుడే ఘటపదార్థము సిద్ధించును. ఘటన మనఁగా ఘటత్వాపత్తిరూపక్రియ (ఘటమునకు ఘటస్వరూపము నిచ్చుక్రియ) -అనఁగా ఘటన క్రియయందు కర్తృత్వమును గలిగి యుండుట అచేతనమగు ఘటమునకు, చేతన ధర్మమగు కర్తృత్వము సిద్ధించుట యెట్లందుకేని, —విచిత్రములైన వస్తువులను (లేక విచిత్రవస్తువులవలె కన్పడునట్లు —సృష్టింపవలెనను నీశ్వరేచ్ఛయే యిందుకు మూలము. అనఁగా వీనిసృష్టియం దీశ్వరేచ్ఛయే కర్త యగుచున్నది. ఈ యీశ్వరేచ్ఛాకర్తృత్వ సంబంధముచే, నీశ్వరచైతన్యావేశ మీ జడపదార్థములయందు కలిగి వీనికిఁ గూడఁ గర్తృత్వము గలుగుచున్నది. —శబ్దముల యొక్క వ్యుత్పత్తి యందు క్రియ నిమిత్తము కావచ్చును. అది యేదైనను, శబ్దము యొక్క ప్రవృత్తి నిమిత్తమునందు మాత్రము సత్తాసాదన లక్షణమగు (ఘటరూపమున ఘటసిద్ధి కలుగఁ జేయు) క్రియయే నిమిత్తమగును. ఇటువంటి క్రియను తెలుపు శబ్దమునకే, అనఁగా నీక్రియకే, కేవల కర్తకంటె, క్విప్ మొదలగు ప్రత్యయములను విధింపవలెను —అట్లుగాక, “ఉపమానాదాచారే” అను వ్యాకరణసూత్రము ననుసరించి, ఉపమానవాచక శబ్దముకంటె, ఆచారార్థమున క్విప్, క్యచ్ మొదలగు ప్రత్యయములను విధింపగాదు. ఉపమానార్థము, ఆచారార్థమును నర్థబలమున (అర్థాపత్తిన్యాయముచే) సిద్ధించుచునే యున్నవి. “అశ్వాతి వాలేయః” అనునప్పుడు వాలేయము (గాడిద) అశ్వత్వమును పొందుచున్నది అనునర్థము లభించును. అశ్వము నందలి క్రియ వంటి క్రియ (చేష్టలువంటి చేష్టలు) లేనిదే,

ఖరమున కర్తృత్వప్రాప్తి యనుచిత మగుటచేత, ఖర మశ్వతుల్యసమా చారము గలది (అశ్వము నందలి క్రియల వంటి క్రియలుగలది) యగు నని తెలియుచునే యున్నది. ఇచట ఖరమున కర్తృత్వ మెట్లు కలుగునని సంశయము రావచ్చును. పూర్వము జడమగు ఘటమునకు ఘటన క్రియాకర్తృత్వము లభించినట్లే, ఖరాదుల కర్తృత్వము గూడ, నా యీశ్వరుని చిత్రాభాసావిష్కృతి వలననే లభించు నని తెలియవలెను. ఇట్లు, శబ్దముల కన్నిటికిని క్రియయే ప్రవృత్తి నిమిత్తమగుట చేతనే, సత్వప్రధానములగు నామములకుఁ గూడ ధాత్వర్థత్వమునే తెల్పినాఁడు. [అనఁగా ధాతుపాఠమునందు, "అణ, రణ, భణ శబ్దార్థాః అనియు, "గడి వదనైకదేశే" అని, రణ, భణ, శబ్దములను గడి శబ్దమును, పఠించినాఁడు. "అణ" అనున దొక నామము. గడి (కపోలము- వదనైక దేశము) యనునదియు నొకనామమే. ఇవి సత్త్వ ప్రధానములు (లింగ సంఖ్యాన్వయము గలిగి యుండుట సత్త్వము అయినను, వీనిని గూడ ధాతువులుగ పఠించుటచే అణ, రణ యను నామములకు. అణరణ యను శబ్దమగుట యనియు, గడియను పదమునకు కపోల రూపము నొందుట యనియు క్రియ, లేక క్రియాకర్తృత్వమే యర్థ మగునని తెలియుచున్నది.] కావున "వినచ్య ఘటో భవతి" మొదలగు స్థలము లందు క్త్వా ప్రత్యయము తెల్పు పూర్వకాలత్వము, ఘటనక్రియాపేక్షమే యనియు, భవనక్రియాపేక్షము గాదనియుఁ దెలియవలెను. భవనక్రియ, బహిరంగమగుటచే, పచన క్రియతో నన్వయింపదు. అధిశ్రిత్య పాచకో భవతియనునపుడునిట్లే తెలియునది. కావున నామపదములు తెలుపునేయ ర్థమైనను, సత్తారూపమైన క్రియను పొందకయే భాసింపదు, శబ్దవాచ్య మును గాదు. ఈవిధముగ 'అస్తి, భవతి' మొదలగు సామాన్యక్రియ లంతరంగము లగుటచే సామాన్యముగ ప్రయోగింపఁ బడవు. విశేష క్రియలగు పచనము మొదలగునవి, నియమముగనుండి తీరవలసిన

యక్కఱ లేకుండుటచే నవి బహిరంగము లగును. అందుచే వానిని ప్రయోగించి తీరవలయును. *

ఆఖ్యాతము భావప్రధానము (క్రియా ప్రధానములు) - ఉపసర్గలు, నిపాతలు, కర్మప్రవచనీయములును సత్త్వములగు వానిని (లింగసంఖ్యలులేని) తెల్పును. అనఁగా నవి యద్రవ్యవాచకములు. ఉపసర్గలన్నియు నసత్త్వములే యైనను, వ్యాపారప్రయోగ నియమముల ననుసరించి, మూఁడువిధములుగ విభక్తము లైనవి. ఉదా॥ క్రియ యొక్క స్వరూపము నం దతిశయమును తెలియఁజేయు "ప్ర" మొదలగునవి యుపసర్గ లగును. ఇవి ధాతువులకుఁ బూర్వమే ప్రయోగింపఁబడును. —ఇటులే క్రియలకును, ద్రవ్యములకును వానిలో వానికి గల భేదమును తెల్పు "చ" మొదలగునవి నిపాతలగును. "పచతి పఠతి, చ" వండును, మఱియు చదువును. ఇచట "చ" అనునది రెండుక్రియలును పరస్పరభిన్నములని తెల్పును. అటులే రామః కృష్ణశ్చ అనునపుడు, రామునకు కృష్ణునకు గలభేదమును "చ"కారము తెల్పును. ఈనిపాతలు భావములకు, ద్రవ్యములకు, రెంటికిని భేదమును తెల్పుచునే వాని సముచ్చయమును గూడ తెల్పును, ఈచకారాది నిపాతలు, సముచ్చేతవ్యములైన భావద్రవ్యములకు తరువాత ప్రయోగింపఁబడును. - క్రియావిశేషములవలన పుట్టిన కార్యకారణభావాది సంబంధములను నిశ్చయము

---

* ఈవాదమున మహిమభట్టారక నూతన సమన్వయమార్గమును జూపుచున్నాఁడు.

1. వైయాకరణులు, వాచ్యములగు క్రియలకంటె పౌర్వకాల్యమును క్త్వాప్రత్యయము తెల్పుననిరి. ఈతఁడు, కృదంతాదులలో ప్రతీయమానమగు, (అంతర్భావము నొందియున్న) క్రియకంటెఁ గూడ పౌర్వకాల్యము కుదురు ననుచున్నాఁడు.

2. అశ్వతి = అశ్వ ఇవ ఆచరతి—అనునపుడు, వైయాకరణులు అశ్వశబ్దమునకు "అశ్వసదృశము"నను లక్షణను చెప్పుకొందురు. ఇతఁడశ్వశబ్దమునకు ముఖ్యార్థము నందే క్విప్ మొదలగు ప్రత్యయములను విధింపవచ్చుననియు, లక్షణ యక్కఱ లేదనియుఁ దెల్పును.

అశ్వశబ్దమునకు "అశ్వత్వాపాదనరూప క్రియయే" ముఖ్యార్థమని యీతని మతము ఇపుడు "ఉపమానాదాచారే" యను సూత్రమే వ్యర్థమని యీతనిభావము.

చేయునవి కర్మప్రవచనీయములు "జపమను ప్రావర్షత్" అను నప్పుడా "అను" అను కర్మ ప్రవచనీయము జపమునకును, వర్షమునకును గల కార్యకారణ భావ సంబంధమును తెల్పును. ('అను'న దిచట ఉపలక్షణార్థము.) నిపాతములవలె నివియును శబ్దమునకు తరువాతనే ప్రయోగింపబడును.

• 1. కొందఱు పదములు సుబన్తములు, తిజన్తములు నని రెండువిధములే యనిరి. కొందఱి మతమున నామాఖ్యాతోపసర్గలని పదములు నాల్గువిధములు. మఱి యితరుల మతమున "నామాఖ్యాతోపసర్గనిపాతకర్మ ప్రవచనీయము"లని అయిదు విధములు. –వైయాకరణ దర్శనమునందు వాక్యము నుండియే అర్థము తెలియును. "రామ" అనుపదమునుండి, రమ్ అనునది ధాతువనియు, ఘఞ్ ప్రత్యయమనియు, నెట్లు విడదీసి చెప్పుచున్నామో, యటులే, వాక్యమునుండి గూడ పదములను విడఁదీసియే చెప్పుచున్నాము. వాక్యమునుండి గూడ పదములను విడఁదీయుటను గుఱించి ముందు తెల్పెదము.

వాక్యమునందు క్రియయే ప్రధానము కావునను, ఆక్రియ యొకటియే యగుటచేతను, వాక్య మొకవిధమే. పూర్వులు నీవిషయము నిట్లేచెప్పిరి.

• 2. పూర్వుల మతమున వాక్యలక్షణ మిది. అఖండవాక్యమును, విడదీసినప్పుడు, ఆవాక్యావయవములైన పదములన్నియు, సాకాంక్షములై యుండవలెను. అఖండముగనే యున్నప్పుడితర శబ్దాకాంక్షయుండదు. –క్రియయే ప్రధానమై యుండును. క్రియాకారక విశేషణములతో కూడియుండును. (లేదా కారకములన్నియు ప్రధాన

---

• 1. "ద్విధా కైశ్చిత్ పదం భిన్నం చతుర్ధా పంచధాపి వా
అపోద్ధృత్యైవ వాక్యేభ్యః ప్రకృతి ప్రత్యయాదివత్"

• 2. "సాకాంక్షావయవం పరానాకాంక్షశబ్దకమ్
క్రియాప్రధానం గుణవదేకార్థం వాక్యమిష్యతే"

క్రియతో నన్వయించును - మొత్తమున కొకే యర్థము ప్రధానముగ నుండును. ఈ లక్షణములు గలది వాక్యమగును.

శబ్దము వలెనే, అర్థముకూడ రెండు విధములు - వాచ్యము - అనుమేయము. శబ్దవ్యాపారమునకు విషయమైన యర్థము వాచ్యార్థము. అదియే ముఖ్యార్థ మనఁబడును. - ఈవిషయమునే యీశ్లోకము చెప్పును.

"శ్రుతిమాత్రేణ యత్రాస్య తాదర్థ్యమవసీయతే
తం ముఖ్యమర్థం మన్యన్తే, గౌణం యత్నోపపాదితమ్"

ఒకశబ్దమును వినిన వెంటనే, ఆశబ్దమే యర్థమును స్ఫుటముగ, ప్రధానముగ తెలుపునో, ఆయర్థమును వాచ్యార్థమందుము. అదియే ముఖ్యమైన యర్థము. ఆశబ్దమునకుఁ గల ముఖ్యార్థము కుదురనపుడు, సామర్థ్యమువలన ముఖ్యార్థమునకు సంబంధించిన మఱియొక యర్థమును చెప్పుకొందుము. అది గౌణార్థము లేక యముఖ్యార్థ మందుము. (ఈ యముఖ్యార్థము నితరులు లక్ష్యార్థ మందురు. వ్యక్తివివేకకర్త, దీనిని యనుమేయార్థ మనును) - ఈవాచ్యార్థము నుండి గాని, వాచ్యానుమితమై, హేతువుగ నుండు నర్థమునుండి గాని, యేయర్థాంతరము సిద్ధించునో, అది యనుమేయార్థము. (వ్యక్తివివేకకారుని మతమున, లక్షణావ్యాపారము, వ్యంజనావ్యాపార మనునవి యనుమితి వ్యాపారము నందే యంతర్భావము నొందును. లక్షణావ్యంజనావ్యాపారముల నితఁ డంగీకరింపఁడు) - ఈ యనుమేయార్థము మూఁడువిధములు. - కేవల వస్తువు, అలంకారము, రసాదులు నని. అందు, వస్త్వలంకారములు వాచ్యములుగఁ గూడ నుండును. రసాద్యర్థము మాత్ర మనుమేయమే. అందు పదముయొక్క యర్థము వాచ్యమేగాని యనుమేయము గాదు. పదమునం దవయవవిభాగము లేకుండుటచే, నందు సాధ్యసాధనభావము కుదురకుండుటయే ఇందుకుఁ గల హేతువు.

శ్రీ భాగవతుల కుటుంబరాయశాస్త్రి, ఎం. ఏ.

# ఏకాదశస్కంధము

—హరిభట్టారకుఁడు.

కం. మాయగల వారి నొయ్యన
మాయలఁ బొందించు నట్టి మనుజవరుఁడు తా
మాయను వినిపింపుఁడు వి
రాయుతవాక్ప్రౌఢి మెఱసి హర్షం బొదవన్. 68

జనులకు సంసారతాపనిస్తారకం బగు
తత్త్వసారోగమున కౌషధం బగుచుఁ
దనరు భగవదీయ నామామృతంబుఁ గ్రోలి
తృప్తిఁ బొందని కథ లానతిండు మీరు। 69

వ. అనిన విని యంతరిక్షుం డిట్లనియె. 70

భవ్యనిర్గుణ పరబ్రహ్మంబు నందును
దనకు విపర్యయ జనకమైన
జ్ఞానంబు దోఁచును సర్వేశుఁ డేమాయ
చేతను జగము విఖ్యాతముగను
నిర్మించి యందుమీఁద నిశ్చితుఁడై యుండి
విహరించు నదియు శ్రీవిష్ణుమాయ
ఇంద్రియార్థభ్రమం బిదియ జాగ్రదవస్థ
మానసభ్రమము దుస్స్వప్నముల కెప్పను
స్వప్నజావస్థ మఱియుఁ దద్వాసనలకు
సూచకంబగు బీజంబు సుషుప్త్యవస్థ
వనుసఁ బరమేశు తోడ నన్వయము సేయు
నదియు పరికింప నాల్గవదగు నవస్థ॥ 71

బరమహితులు చూడ నివె భాగవతోజ్జ్వల ధర్మపద్ధతుల్ ॥ 78

ఒకవేళ బరమేశు హేతులందు నెయ్యముల్
చేయుచు హరికథల్ సెప్పుకొనుచు
పులకాంకురంబులం బొదలి బాష్పాక్షులై
యొకవేళ సంతోషయుక్తులగుచు
నొకవేళ భాషింతు రొకవేళ నాట్యంబు
సలుపుచు రధిక విస్తంద్రులగుచు,
నొకవేళ బరమాత్మ నూహింతు రాత్మలో
నొకవేళ జూతురు సకల జగము
నివ్విషయంబున వర్తించు భవ్యమతుల
చేత దరియింపనచ్చు విశ్వేశుమాయ.
నన్యమతులవరించు నట్టివాడు.
మెప్పు దాటంగనోపు నుర్వీశ్వరేశ ॥ 79

వ. అనిన విని నరపాలపుంగవుండు వారల కిట్లనియె. పరమభాగవతోత్తమా! సకల లోకపాలకుండగు నారాయణాభిధానంబు గల పరమాత్ముని నిష్ఠ వినవలయు నానతిండని పలికిన నందు పిప్పలాయనుం డిట్లనియె ॥ 80

సురసంఘములకు సన్నుత
నరులకు హృదయంబులో నివాసుండగునా
పరమాత్మ నిష్ఠ చెప్పెద
సరసత నాలింపవయ్య సౌభాగ్యనిధీ ॥ 81

వ. మఱియు సకలలోకస్థిత్యుద్భవలయ కారణంబై స్వప్న జాగ్రత్సుషుప్త్యవస్థల యందుం గలుగుచున్న దేహేంద్రియ ప్రాణంబు లెవ్వాని చేత సంజీవితంబు లగు నదియు పరంబు జ్వాలలు దిరుగ నగ్ని

యందుఁ బ్రవేశింపనీ రీతి నింద్రియంబు లాత్మయందుఁ బ్రవేశింపవు. శబ్దంబు బోధక నిషిద్ధం బగుటం జేసి యుష్ఠోకముఁ జెప్పెను. మొదలను సత్త్వరజస్తమోగుణంబులను మహదహంకారరూపంబుగాఁ జెప్పెదను. మఱియు జ్ఞానక్రియార్థఫలరూపంబు గల దగుటం జేసి జీవంబుగాఁ జెప్పెనును. ఇది సదసద్రూపంబునం బర్యవసించు. దీనికిఁ బెరయైనది పరమాత్మగా నెఱింగి బ్రహ్మములు సన్నుతింతురు. ఇట్టి పరమాత్మ స్థావరజంగమాధిష్ఠితంబై సృష్టి క్షయంబులం బొందక యుపలబ్ధి మాత్రమై యుండు నిఖిలకాలములందు జీవంబుల బాసి తన్మాత్ర్యంబున వేఱయై వర్తించు. మఱియు నధ్యాత్మ సర్వేంద్రియావృతంబగు నాకారంబు నష్టంబైన మనంబునం బాసి స్మృతి లేక వర్తించు నిర్మలదృష్టిగలవానికి సూర్యప్రకాశంబు దోఁచినగతి జ్ఞానసంతోషంబు హరిభక్తి చేత సంకర్మోద్ధితంబులైన చిత్తదోషంబులం బరిత్యజించి భగవత్పదంబు చేరునని చెప్పిన రాజిట్లనియె. 82

క. పురుషుం డేకర్మము లా
చరించు మనోవాసిచేత సత్కృతుఁడై శ్రీ
హరిపాదము లెటు చేరునొ
దురితంబులఁ బాసి సంతతోత్సాహమునన్ ॥ 83

వ. అనిన విని యావిర్హోత్రుం డిట్లనియె॥ 84

కర్మంబె కర్మనికర్మంబులగు వేద
వాదంబు లౌకిక వర్తితంబు
వేదసంఘములు సర్వేశురూపము గాన
మొనసి విద్వాంసులు మోహపడుదు
రట్టి వేదంబు కర్మాచారమునె చెప్పఁ
బరమరతి కర్మమోక్షంబు కొఱకు

విష్ణుమూలంబుగా వేదోక్తకర్మంబు
లాచరింపక ఫలంబందువాంఛ
సేయు వారలు వివిధ జన్మాయుతములఁ
బొందు చుందురు మోక్షంబు నొందఁగోరు
వాఁడు తంత్రోక్త మార్గాన వనజనాభు
పూజ సేయంగ వలయు సమ్మదము తోడ ॥ 85

వ. ఆపూజా ప్రకారం బెట్టి దనిన. 86

సీ. శుద్ధాత్ముఁడై దేహశోధనం బొనరించి
శ్రీనాథ సమ్ముఖాసీనుఁ డగుచు
పూజాది చిహ్నంబు పూతంబుగాఁ జేసి
ప్రకటలబ్ధోపచారముల చేత
నభినవద్రవ్య ధూపాత్మలింగంబుల
సంప్రోక్షణముఁ జేసి చక్రధరుని
కాసనంబును నర్ఘ్యమాచమనీయంబు
పాద్యంబు భక్తి సమర్పణఁ జేసి
పుష్పగంధాక్షతల చేతఁ బూజచేసి
భక్తి శోభిత దీపధూపంబు లొసఁగి
బహువిధాన్నంబు లారగింపంగఁ జేసి
గరిమ జేయంగవలె నమస్కారములను ॥ 88

ఈరీతిని బరమాత్మను
శ్రీరమణుని భక్తిఁ బూజ సేయుచు నతఁడున్
నిరాస్తిక్యర్తుం విధులం ?
దారయు శిక్షించు నతఁడు హరిఁజేరు నృపా ॥

వ. అని పలికిన విదేహుం డిట్లనియె ॥ 89

క. ఈశ్వరుండవు విష్ణుఁడవేమి కర్మంబు
లాచరించెద నాకు నాన తిండు
కోరెద యుష్మదీయ సూక్తులు విని నాదు
చిత్త మంతకంత చెంగలించె

వ. అని పలికిన నందు ద్రమిళుం డిట్లనియె. ౯౦

క. భూరేణు వెన్నవచ్చును
నే రీతినైనఁ ద్రిభువనేశ్వరు గుణముల
(భూరితరా) నెఱుఁగుదు మను
వారలు పో బాల బుద్ధివారు నృపా ॥ ౯౧

సీ. ఆత్మసృష్టంబులై యధికమైన పంచ
భూతసంఘంబుచేఁ బుర మొనర్చి
యా పురంబందు నిజాంశంబుచేఁ జొచ్చి
నారాయణాభిధానంబుఁ గలుగు
నట్టి సన్మూర్తి యను నాదిదేవుఁడు వొందె
నీ దేహ మాశ్రయం బీడగాను
తే. పుటోచ్ఛ్వాసి రసేంద్రియముల చేత
నీ దేహధారుల నింద్రియములు
పాలితములయ్యె మఱియు భూభాగమునను
జగము రక్షింప నిర్మింప సమయఁ జేయ
చాలి గుణనిష్ఠుఁడై రాజసంబు మెఱసి
దివిజగణములు మెచ్చ వరించు నతఁడు ॥

గీ. రాజసంబున బ్రహ్మయై రమణ మెఱసి
సత్త్వగుణమున విష్ణుఁడై జగము నిలిపి

తామసంబున నుగ్రుండై తనయుఁ బరమ
ప్రమోదుఁ డొక్కఁడు త్రిగుణసంప్రాప్తుఁ డగుచు ||

వ. అట్టి నారాయణ చరిత్రంబుఁ జెప్పెద నాకర్ణింపుము. 94

ధర్మరాజునకుఁ గాంచె దక్షపుత్రి మూర్తియందు
నారాయణాభిధానంబు గలుగు
శాంతుఁడైన మునిశ్రేష్ఠు నాతఁ డొనరించె
నైష్కర్మ్యమగు లక్షణంబు మిగుల
సకల సుజ్ఞానియై యఖిల సన్మునివంద్యుఁ
డగు మునీశ్వరు నమరవిభుఁడు
వీక్షించి శంకిలించి యచ్చరలఁ బిలిచి
యతఁడు మత్పదవిఁ గోరెఁ జెఱుపుఁడంచు
ననుచు మదనుని రప్పించి యమరలోక
కామినులఁ గూర్చి వారి వేగంబ కోడ
నిమ్మహాత్ముని సామర్థ్య మెఱుఁగలేక
నియమభంగంబు సేయను బదరికాశ్రమమునకును. 95

వ. ఇట్లు ప్రయోగింపఁబడిన మదనుండు నిజబలంబులఁ గూడి నారాయణాశ్రమంబుఁ బ్రవేశించె నంత || 96

చ|| వనమునఁ గల్గు భూజములు వర్తితపల్లవ పుష్పఫలా
భినుతములయ్యె షట్చరణ బృందనినాద మనోహరంబులై
యనవరతంబుఁ గోకిల కలారవ సంకులమయ్యె నాశ్రమం
బనయము గామినీ సహితుఁడై మదనుండు చరించె నంతటన్ || 97

క. మరుఁడాయత సంతసమున
సురకాంతల చూపు లనెడి సునిశిత బాణా

త్రిగుణములను భేదపఱచెను
దిరముగ నాహూని హృదయము దేశం బధిపా ॥ 98

క. జలచరకేతన మాయెను
దలకక హృదయంబులోనఁ దాత్పర్యము తో
బలభిన్ముఖుని బుషి దాఁ
దెలిసి కనుంగొనియె నచటి దేవాంగనలన్ 99

వ. అంతట నారాయణమునీంద్రుఁ డకాలవసంతాగమము సకి
క్షించి మనంబున దిరంబు దప్పక కాంతాజనసహాయుండైన మదను
నాలోకించి యిట్లనియె. 100

క. వెఱవకుము మత్స్యకేతన
సురకాంతా జనములార సొంపున నిచటన్
కరమొప్పఁ గ్రీడ సల్పుఁడు
పురుహూతుని యాజ్ఞ చేసి పూజితు లగుచున్ ॥ 101

వ. అని నారాయణ మునివరుం డొసఁగిన యాజ్ఞానమిత కంధ
రులై సురకామిను లిట్లనిరి. దేవా! పరమపదంబు కోఱకు సమ్యక్ జ్ఞాన
భరితులై నిశ్చలంబున పుత్రదారాప్త గృహ పశుద్రవ్యంబుల యందా
సక్తి వర్జించి పరమపద నివాసంబు కోఱకు తపం బొనరించు పరమ
పుణ్యులకు సురకృతంబులైన విఘ్నంబులు ప్రాప్తంబగుఁ గాని బర్హిస్సు
లందు సుభాగంబులైన బలులం బెట్టెడి కర్మనిష్ఠులకుఁ దత్కృతాంతరా
యంబులు చెందవు. క్షుధయు, తృష్ణయుఁ ద్రికాలగుణంబులును పంచ
వాయుతంబులును జిహ్వోపస్థహాన వికారంబు లనెడి మహాసముద్రము
లును పరమయోగి మనోవికారగుణంబులగు మమ్మును వరియింపలేక
క్రోధవశులై తపంబును దిగనాడి గోష్పదోదకంబు నందె మునుంగు
దురు. మునిపుంగవా! నీ తపోమాహాత్మ్యం బచింత్యంబు భువనేశ

గుణంబులు సన్నుతింప బ్రహ్మరుద్రాదులుగాని మదీయవాచాగోచరంబు గాదు. మావలని యపరాధంబులు సహింపవలయునని దండప్రణామ పూర్వకంబుగా సన్నుతించి సమ్ముఖంబుననిలిచి యున్న సమయంబున: 102

క. ఆ మునివరుఁడు సృజించెను
కామినులను నూఱుకోట్ల ఘనభూషణులన్
ఆ మానినులను జూచిరి
వేమఱు సురలోకసతులు విస్మయ యుతులై. 103

వ. ఇట్లు నారాయణమునీంద్రుఁడు నిజశరీరంబు వలనఁ గాంతల సృజించి యంత 104

గీ. వీరిలోన నొక్క నారీశిరోమణిఁ
బ్రేమతోడ నీవు పేర్మిఁ గొనుము
నారివి నమ్రులైన సురలోకకాంతల
కానతిచ్చె మునివరాగ్రవరుఁడు. 105

వ. అని మునీశ్వరుఁ డివ్విధంబున నానతిచ్చిన దేవతలా వనిత నటులందు మిక్కిలి వర్ణితంబగు నూర్వశింగొని దివంబున కేగి యాకథ గోత్రభేదను పెద్ద కొల్వునఁ దగ విన్నవింపఁ జిత్తములోన నింద్రుఁడు బెగ్గలెన్ ॥ 106

క. ఈ నారాయణ చరితం
బేనరుఁడుఁ బఠించు నాతఁ డిహలోకమునన్
మానిత సంపత్సహితుం
డై నరహరి పదముఁ జేరు నటుమీఁదఁ దగన్ ॥ 107

సీ. పరమహంసుని స్వరూపంబున ఋషభుని
కాత్మయోగముఁ జెప్పి యచ్యుతుండు
ధారుణిలో జగద్భారావతరణంబు

కిశోరుఁ బలంబుగొల్వ నటు దేవగణంబులు సన్నుతింపఁగా
దశవదను వ్వధించెను ప్రతాపముతోడుత సానుజాతుఁడై । 112

క. విదితాయువుల వధింపను
సదయుండై దివిజ నరుల సంరక్షింపన్
ఉదయింపఁ గలఁడు కృష్ణుఁడు
యదుకులమున కృష్ణరాముఁ డనియెడి పేరన్ ॥ 113

క. మతిమోహ బుద్ధరూపమ్మై కర్మయోగ
మునఁ బ్రవర్తించు వారల మోహపఱచు
కలియుగాంతంబు నందును కల్కి యగుచు
సకల దుష్టాత్ములఁ జంపఁగలఁడు. 114

వ. అని యిట్టివంబున ననంతంబులైన భగవజ్జన్మ కర్మంబులఁ
జెప్పిన విని విదేహనరపాలకుఁ డిట్లనియె. 115

క. హరిపాద యుగళసేవా
పరతంత్రులు గాక తమను పరమార్థములన్
జరియింపఁ జేయుచుండెడి
నరులకు గతి యేది మానినాథమునీంద్రా ॥ 116

వ. అని పలికిన నందు చమసుం డిట్లనియె ॥ 117

క, శ్రీరమణీశుని ముఖబా
హూరు పదాబ్జముల వలన నుద్భవమయ్యెన్
ధారుణి నాశ్రమములతో
సారెపడన్ భూసురాది జాతులు నవనిన్ ॥ 118

క. వినరులం చెప్పెద శ్రీ
మానినిపతి పాదసేవ మనుగడ తెలిసి

యానవుఁడు నరకరూపము
లోన పడున్ గూలుహీనలోకస్థితుఁడై ॥ 119

చ. కలియుగమందు శూద్రులును గామినులున్ హరిపాదభక్తి సం
కలితులు గాన వారు హతకల్మషు లెచ్చటనైన భూసురా
దులు యజనంబు సేయుచును దుర్మదులై కమలాధిపాథభ
క్తుల దర్శించి నవ్వుదురు దూరమునన్ ఘనకర్మ సంగులై॥ 120

క. సుదతులుఁ బురుషులు దఱచై
సదనంబులయందుఁ గ్రీడసల్పుచు నటన
మ్మదమునఁ బరసంఘము జం
ప్రదు రవిధానంబు తోడ భూసురు లనఘా ॥ 121

క. సిరిచేతఁ గులముచేతను
సరసంబగు విద్యచేత జాగముచే దు
ష్టనరులు మదంబున గానక
హరిభక్తుల నవ్వుచుందు రతిగర్వమునన్ ॥ 122

గీ. ఆకసంబుమాడ్కి నఖిలజీవులయందు
పూర్ణుఁడైన పరమపురుషు కథలు
వినక కోర్కులందు వితతప్రయుక్తులై
ఖలులు చనుదు రంత్యగతుల కడకు

క. ఘనధర్మైకఫలంబగు
ధనమును జ్ఞానంబు పుత్రదారాప్తులచే
తను బూర్ణమైన గృహమం
దును నిలుచుచు నెఱుగ రాత్మ దుర్మృత్యువులన్ ॥ 123

సీ. బహువిధానములచేఁ బ్రారంభితంబగు
శాస్త్రీయమైన పశ్వాదిహింస

వరుస శ్రోత్రుతం బ్రత్యవాయకరంబుగా
దదికర్మమార్గ మర్యాద జూడ
శాస్త్రంబు వర్జించి సద్విధానము లేక
దుర్జనుల్ పశువులఁ దునుముచుండు
రాఖలుల్ పరమేశు నందు రోషించుచు
దుర్గతిఁ జెందుచుందురు నృపాల
పొలుపుగాఁ ముక్తిమార్గంబుఁ బొందలేక
జ్ఞానహీనతఁ బొంది యజ్ఞాన మొదవి
దుష్టాత్మకులన
కాలమృత్యువు సమయించుఁ గరుణ లేక ॥ 124

శా॥ ఆప్రత్యక్షము విముక్తమార్గమని విద్యాగర్వసంపన్నులై
విప్రుల్ గొందఱు దారపుత్ర సమితిన్ వీక్షించి విత్తార్థమై
యప్రామాణ్య పదంబున న్దిరుగుచున్ యజ్ఞానగుప్తోల్లస
త్సుప్రాజ్ఞాగహితాత్ములై నిలుతు రస్తోకాగతిన్ మాధవా॥ 125

సీ॥ కామార్తులై మీఱఁ గాంక్ష పరకీయ
కామిని కుచనేత్రకచము లందు
కరబాహుమూల వక్త్రాబ్జపాదాధర
ప్రకటకుంతలతనుప్రభల యందు
గండద్వయోదార ఘననితంబము లందు
వర్ణితోరుద్వయవర్ణ మందు
భూషణాంబరరమ్యభాషణంబుల యందు
తీపులఁ బచరించు చూపు లందు
మమత సేయుచు హరిభక్తి మఱచి కాల
మనుదినంబును గడుపు చున్నట్టి నరులు

బహువిధాంతర ఘనపాశ బద్ధులగుచు
ఘోరనరకములలోనఁ గూలువారు॥ 126

క. సుతులందు గృహములందును
సతులందును మమతఁ జేసి సర్వేశునకుం
దలిదినము విముఖు లగు దు
ర్మతులకు నరకంబుఁ గలుగు మానవనాథా! 127

వ. అని మునివరుం డానతిచ్చిన విదేహుం డిట్లనియె॥ 128

సీ. ఏ యుగంబునందు నేరీతి వర్తించు
నెట్టిరూపు వాఁడు నేవిధాన
మున నుతింపఁ బడును ముని దేవగణముచే
విష్ణుఁ డవ్యయుండు విశ్వవిభుఁడు. 129

క. నానాకారంబులలో
దానవులను సంహరింప ధరణీస్థలిలో
శ్రీనాథుఁ డుద్భవించును
మానితమై ప్రతియుగమున మహనీయుండై 130

వ. మఱియు నప్పురాణపురుషుండు కృతయుగంబు నందు శుక్ల వర్ణుండై చతుర్బాహుండై జటావల్కల కృష్ణాజినోపవీత జపమాలా దండకమండలధరుండై నిర్వైరులై శాంతులై తపోధ్యాననిష్ఠులై తద్యుగ సంభవులైన మనుష్యులచే హంసయు సువర్ణుండును నమలుండును ఈశ్వరుండును పురుషుండును పరమాత్ముండును ననంబరగు దివ్యనామంబుల చేత సన్నుతింపంబడు; త్రేతాయుగంబునందు రక్తవర్ణుండై బాహు చతుష్క విరాజమానుండై మేఖలాత్రయ సహితుండై హిరణ్యకేశుండై స్రుక్స్రువాద్యుపలక్షణుండై విష్ణువు యజ్ఞపురుషుండును, పృశ్నిగర్భుండును సర్వదేవమయుండును, వృషాకపియు, జయంతుండును,

నునుగా యుండు నని బ్రహ్మావాదులచేత వినుతి సేయంబడును; ద్వాపర సంభవుండై పరమేశ్వరుండు శ్యామల దేహుండును పీతాంబరధరుండును బాహుద్వయోపశోభితుండును దివ్యనిజాయుధధరుండును శ్రీవత్స కౌస్తుభవనమాలా విరాజమానుండును మహారాజోపలక్షణుండును నై వాసుదేవ సంకర్షణానిరుద్ధ ప్రద్యుమ్న నారాయణ మహాపురుష విశ్వేశ్వర విశ్వరూప సర్వభూతాత్మ కాదినామంబుల వెలయుచు నరపాల పుంగవులచేత సన్నుతింపఁబడు. కలియుగంబందు కృష్ణవర్ణుండై పీతాంబరధరుండై దివ్యనిజాయుధ శ్రీవత్స కౌస్తుభ వనమాలా కిరీట ధరుండై హరి- రామ- నారాయణ- నృసింహ- కంసారి- నలినోదరు నామంబుల వెలయుచు భక్తరక్షకుం డగు పుండరీకాక్షుండు బ్రహ్మ మునీంద్రులచే యజ్ఞ సంకీర్తనలచే వినుతిసేయంబడు ననిచెప్పి మఱియు నిట్లనియె॥ 131

క. హరి కమలాసన చింత్యము
పరిభవహరణంబు భక్తపాపఘ్నము సు
స్థిరపద సంధాయక మగు
హరిపాద జలంబుఁ దలతు ననురాగమునన్ ॥ 132

సీ॥ సకల దేవ బృంద సంప్రార్థితంబైన
రాజ్యలక్ష్మి విడిచి రమణి కోర్కి
కై మృగంబు వెంట నడవిలోఁ దిరుగాడు
నట్టి మూర్తిఁ దలఁతు నాత్మలోన ॥ 133

క. ఈరీతిని బ్రతియుగమున
నారాయణుఁ డవతరించి నరముఖ్యులచే
శౌరినృసింహుఁడు హరికం
సారన పిన్నుతింపఁ బడుచుఁ బరఁగు నత్తఱోడన్ ॥ 134

# ప్రాస్తావిక పద్యావళి

మచ్చ లక్ష్మీనారాయణకవి.

తే॥ గీ॥ సతులు పరదేశగతు లగు పతుల రాకఁ
గూర్చి వెతఁ జెందఁ గదట! శకునము చెప్పి
తండులంబులు గొనియెదు దంభచర్యఁ
జిక్కి తెలుఁగవె మంచుల చేసె రాక. 86

ఉ॥ బంగరురంగు రంగసికృపాకరిమం గను వంగపంచపు
ల్గాం గని తత్ప్రభాస్ఫురణఁ గోరి సతీకుచసన్నసన్నిశా
సంగసరస్తటాంబువుల స్నానముసేసెను మష్య నెట్లు వ
చ్చుం గను నీచనీలుచిని నొప్పడి యుంచిన నీకుఁ గాకమా 87

తే॥ గీ॥ వృద్ధులకు బాలురకుఁ గొల్ల నిడి భుజించు
నట్టి మధురపదార్థంబు లపహరించుఁ
జెనఁటి కాకి య టందురి నిన్ జ్ఞశక్తి
బాయువారల కుపకృతిఁ జేయఁ జనదె. 88

తే॥ గీ॥ అందఱిని నేకదృష్టి గా నరయు నిన్నుఁ
గేకరుండ వ టంచును గేలిగొందురి
వసుధ జనులకు నిజ మెంతవారి కైన
వాయసాధిప! మెప్పించ వశము గాదు. 89

కం॥ లోకులు మూ వా రనుచున్
గాకాధిప! వారి నొక్కకంటఁ గనెడి నిన్
గేకరుఁ డని యుడికించెద
రీకలికాలమున న్యాయ్య మేది తలంపన్. 90

కం॥ మాటలుఁ బాటలు నాటలుఁ
బాటిగ శుక, పిక, మయూర, పాళికిఁ దగు నీ
బోటికి నెంగిలికాఁడే
యేటికి మాకళీ! యనూనపు వృథ యేమి యిఁకన్ 91

## 24 — సరటాపదేశము —

ఉ॥ ఏకఁ బయోధి దాఁటె రఘువీరుని పంపున నాంజనేయుఁడం
చాకడఁ దత్కథం జదివి యాన్యుఁ డొకండు వచింప నవ్వి బల్
శోకిలు గల్గుమాకులములోపల నే రికి సాధ్య మంటివో
పోకిరితొండ! పల్వలము పోయిది యంబుధి కేమి దాటుమా॥92

కం॥ మాటికి మాటికిఁ దల నీ
వేటికిఁ బంకించి తెలుఁగవే తరములు నీ
బోటులకు డేగ వెఱచునె
యాటోపము చాలుఁజూడవా నను దొండా, 93

మ॥ అనిలో నొచ్చి గుహాన్ నృపాలకుఁ డొకండార్తి న్వసింపంగ వే,
తనపత్కీర్తిలతావితానములో నాఁదద్వారముస్ దంతులన్
గన రాకుండఁగ నేని లూతయతనిన్ గావన్ శిరస్సంజ్ఞ నా
తనిఁ బ్రత్యర్థికి నప్పగించు సరటాధ్యక్షుండ వీవేకదా 94

## 25 — నారికేళాపదేశము. —

ఉ॥ పొట్టకుఁ దృప్తిగా నిడెదు భోజనమంతకు మున్నె దాహము
న్నెట్టనఁబాఱఁ దోలెదవు నీర మొసంగి మహోన్నతుండ వా
పట్టి వదాన్యశేఖరుని నేఁగనఁ గొబ్బరికాయ తేడ! హా
కొట్టకమున్నె యిచ్చు వదిగో యదె కూడదు నీదు వేడెదన్. 95

తే॥ గీ॥ పాపము జలోదరము నీకు, బనసపంటి
కిరయుఁ గా గజ్జి, పెనుగోగ మబ్బె గరక
ఫలమునకుఁ, జాతమునకును బల్లి, నారి
కేళఫలరాజమా! పిలుపాలఁ బడదె? 94

26 — చకోరాప దేశము—

కం. ఇత్తిరువీథిని వెలిఁగెడు
మత్తాబునుగాంచి చంద్రమండల మనుచున్
దత్తరమునఁ దిరఁజేరితె
మత్తచకోరంబ! తొలఁగు మడియుదువు గదా. 95

27 — వృషభాప దేశము—

ఆ॥ వె॥ ఏల బుజ్జ నూప నెద్దా! సివంబు నీ
కేచట నుండి వచ్చె నేలవట్టె
నప్పఁడెఁడో యెఱుఁగుదా వెళ్లిసకియ నీ
కంటె నెద్దునమ్మ కాళ్ళగడిగె. 93

మ॥ నవమాసంబులు మోసి నిన్ గనుతలిన్ గండంబొకండబ్బ శ్రీ
ధవుచే రక్షిత యాచు వత్సలత దుగ్ధంబిచ్చి పోషించు, మా
త వయఃకాలము రాగ పీడితివి యెద్దా! గడ్డిపోచెననీ
యవుగా నెన్నఁడు నీకృతఘ్నుతకునే నా శ్చర్యముం బొందితిన్ 90

28 మకరాప దేశము

మ॥ సుకుమారాంగలతాన్వితామల మహాశుద్ధాంత సీమంతినీ
ప్రకరంబున్ గనినాఁడ నుత్సవములన్ వారేలయట్లుంచుగం
డకవాహద్విషశల్యఘోణివర కాంతాసంతతిన్ గల్పనీ
మకరేంద్రాత్మజ! కోమలావయవసంపత్స్నిగ్ధకాంత్యున్నతిన్ 100

## 29 నాగోపదేశము

కం॥ సరసస్తుత్య మది గోరినఁ
బరమసుఖకరంబు నొప్పు వైకము చెను నీ
యురగాధ్యాసి మత మిదె
పురుషుండు దన్మార్గవలన నవి లభియించున్ 101

తే॥ గీ॥ అహిప శేషావతార మీరాచనఘుఁడితని
పాదకైంకర్య మబ్బిన బ్రహ్మకైన
గాని సన్నిధియే చాలు గలుగు ముక్తి
జనుఁడ పసలక యోవెజ్జ్మనుజులార. 102

కం. వనముల మెలఁగుచు వాయువుఁ
దినుచును గుబుసము ధరించి దిపిజాంతకుప
ద్వనజాంకము చే వెలుఁగుచుఁ
జనునే క్రోధమును గెలువఁజాల వురగమా. 103

ఉ॥ కోపము సున్న; లేదు పగ కోయు; నుళక్కి-; !ద్విజిహ్వాభావ మా
హా! పరికింప వర్తనమెయున్నను దిన్ననిదేను; దన్ని నన్
బాపము తేటిచూడ పటువంటి నిన్నహిగా వలంతు రీ
చాపలయుక్తులా నసలజా డది సుమ్ము ద్విజోత్తమోత్తమా 104

శా॥ కాలందొక్కిన నూరకుందురె యిసీ కాకోదరస్వామి; యి
బ్బేలల్ నీఘనశౌర్యమున్ దలఁప కబ్బే మందవుసుండుభం
బా లా కేత్వము దాకకొమ్ము రమ నాగాయుండు లే లే విష
జ్వాలాభీలమహోగ్రదంష్ట్రిల పటిష్ఠత్వంబదిం కేటికిన్. 102

చం॥ తిరముగ బత్తిఁ గోడ వినుతింపుచు భావిసుభాగ్యసుస్థితి
సిరు లొసఁగెంచి మీరు భవదగ్రముఁ గాకఁ దొలంగ నిల్చునో
సరకర్లేంద్రుగోష్ఠ రుత్తే నుపరిభు శేఖరులార యుష్మదు
ర్ఘరవదఘోగ్రదండహతిఁ బాపఁగఁజేయుఁడు నెమ్మనఁగ వేఁడితున్, 106

ఆ॥ గీ॥ మాఱులు గలుగుటంత ఘనులయి పోయిగే
చేయిఁ జాప భయము; వేయునోళ్లఁ
బ్రతికియుండుదైన ఫలమేమి? మీకంటెఁ
బలుగురాలు మేలు పాములార. 107

ఆ॥ గీ॥ పెరిమఁ బాలుపోసి పెంచి ముద్దిడువారి
గఱచి చను మహోపకారి వహహ!
యట్టినీవు దనము చుట్టి వేడెదనుమ్ము
వెడలఁ దీయుటంత వెట్టిగలదె 108

30 — పల్వలాపదేశము —

మ॥ సరసాగ్రేసరుఁ డౌట ధీరుఁ డవుటన్ సంతోష మేపార నం
బరమందున్ గని సత్కళాన్వితుఁడు రాఁ బ్రాంచద్గతిం బొంగి యీ
ధరనర్థ్యంబగుటన్ సముద్రుఁడు భళీ తాదృగ్విధుల్ వానికే
పరగున్ బల్వలమా! భవాదృశులకా ప్రాపించు దౌర్భాగ్యముల్.

31 — మేఘాపదేశము —

చం॥ విసువక సర్వజీవుల కభీప్సిత మిచ్చినదానశూరు నీ
రసఘన నిన్నె కాని కవిరాడ్భయదాకృతి దాన మిచ్చుచోఁ
గనుట మానవా వెనుకఁ గాంచెను వెల్లఁదనంబు వేడెదన్
హసనము గాదు తత్క్రియ ఘనా! ఘనమా త్యజింపుమా

32 — కతకాపదేశము

తే॥ గీ॥ పంకసంకరమగునట్టి వారి కమల
పానపత్త్రంబు సమకూర్పఁ బాలువడుచు
నాత్మహానికి నోర్చినయట్టివానిఁ
గతక దేశిక! నీవుఁ దెక్కఁ గాన నిప్పుడు. 111

33 మూషకాపదేశము.

తే॥ గీ॥ ఒప్పు నెవ్విధినైనను నుర్వి గడన
యనుచుఁ గాపులసొత్తును నపహరించి
గడకు ఖనఖన కొసఁగి మేన్ గ్రద్దకొసఁగి
కాంచితివె సౌఖ్య మెల్ల! రాకప్పు నవ్వ. 112

34 — ఖడ్గాపదేశము.

చం॥ అరసె మహోజ్జ్వలప్రభ నహర్పతి మించెను నీయసిశ్వరుం
దరిదరిఁ జేరి భీతి సభయంబును గోరిన లేక వీక సం
గరమును గోరినన్ దెగువఁ గైకొని నాకపదంబు గూర్చు ను
ర్వరవరదానశౌరుల కవశ్యము తద్విధులే కలాపముల్. 113

తే॥ గీ॥ స్వప్రతాప మగ్ని వారిపైఁ జూపిన
నాతిపోవు ఖడ్గమా యెఱింగి
రాతి నఱక జన దరాతులు వేఱొక
తల్లి మీఁద వాడిచెల్లు నెట్లు. 114

35 బకోటకాపదేశము—

శా॥ చంచత్స్వైర తరంగిణీలి హరికాస్నానంబుఁ దత్కూర్చనో
దంచన్నవ్యమృణాలఖాదనముఁ దచ్ఛైత్యాచ్ఛసన్మారుత్తి కా
కించత్త్రైకలిసు ప్తిసౌఖ్యము జనుల్ గీర్తింప మున్మ్రొట్టు రా
యంచం జెందుట కో బకోటమ! యసూయాబుద్ధి నీ కేటికిన్. 115

36 — పుష్యరాగోపదేశము—

ఉ॥ పేరిన నాఘనుం డగుచు జేలమై యుండిన వాని గాని యీ
ఘోరరణంబునన్ రిపులఁ గూల్చెడు నీ పరాక్రమంబు గ
న్నారఁగ జూడ సంశయము లౌర పయోధర కీర్తి వామనో
దారాక్షలావశోభనము యశోధన శోభన మింక నేటికిన్. 116

శా॥ కాంతుల్ ప్యానము పద్మరాగపతి! నీకున్ శోణనామంబు ప్ర
ఖ్యాతం బై తగె దాని కర్థముగ నాభీలోరుశుంభోళిధా
రాతిప్రావ్యతచంపతోమహితాకస్వైరధానాధిప్రౌ
ఢిశోభం జనుదెంచు నెంచ వలదే యేలా స్పృహాటోపముల్. 117

కం॥ శోణత్వము నీకొదవెన
పాయకశోణితలకది యుపఘ్నము తగునీ
జారత్వము చోరత్వము
సారము లవి వాని విడువఁ జనుఁ గృకవాకూ. 118

37 — దుగ్ధసముద్రోపదేశము—

మ॥ పటుగాంభీర్య మఖండధీరతయు శుంభద్దానధారేయసా
త్కటభావంబును నీకు సొమ్ములు యథార్థంబౌ యశోరాశి కీ
పట తారాకృతి మయూరె యట్టిది కదా యంచత్కళాశాలి రా
కట ఘోషించెదు నీ కవర్ష మరయంగా క్షీరవారాన్నిధీ. 119

38 — వజ్రోపదేశము—

ఆ॥ గీ॥ బ్రహ్మజాతియందుఁ బ్రభవించి కీర్తికిఁ
బోల్పఁ బనుచు దేజమును వహించి
పురుషరత్నమనఁగ సరవి వజ్రమ నీవు
వాయు వేల గరళభావ మకట. 120

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## కాకినాడ



దేశభాషలందుఁ దెలుఁగు లెస్స

సంపుటము ౪౨

సంచిక ౧-౨

# సంపాదకవర్గము

ప్రధాన సంపాదకుఁడు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. యల్.

సహాయ సంపాదకులు :

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.
శ్రీ విద్వాన్ వేఁకల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. ఆనర్సు., బి. ఇడి.
శ్రీ విద్వాన్ బులుసు వేంకటేశ్వరులుగారు, బి. ఏ.
శ్రీ సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
శ్రీ బండారు తమ్మయ్యగారు

---

# విషయసూచిక

శ్రీ

# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

కాకినాడ

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

( Journal of the Telugu Academy )

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయిలు.

సంపుటము ౪౨. { విజయ సంవత్సరము చైత్ర—ఆషాఢములు } సంచిక ౧-౨

## అఖిలాంధ్ర సాహిత్య పరిషత్తు

కొంతకాలము క్రిందట భారత ప్రభుత్వమువారు అఖిల భారత సాహిత్యపరిషత్తు నొకదానిని స్థాపింపఁ దలపెట్టినట్లు ప్రకటించిరి. దేశభాషల నభ్యున్నతస్థితికిఁ దెచ్చుట, దేశభాషలలో పరస్పర సహకార సామరస్యములఁ బెంపొందించుట, దేశభాషలకు ప్రపంచభాషలతో సన్నిహితసంబంధముల నెలకొల్పుట- మున్నగునవి దానిలక్ష్యములుగా వివరించిరి. ఆంగ్లభాషా ప్రాబల్యముచే నుత్సన్నప్రాయములై యున్న వివిధదేశ భాషలకీవార్త యమృతోపమ మయ్యెను.

అన్నిప్రాంతములవారు తమతమ దేశభాషలఁ బోషించుకొనుటకు నేఁడుత్సాహ పడుచున్నారు. మన యాంధ్రదేశమునఁ గూడ నట్టి సంచలనము లేకపోలేదు. క్రొత్త క్రొత్తభాషా సంఘములు నేఁడు నలుదిక్కుల బయలుపడుచున్నవి. అందొకరు మండలమ్మున కొక్కరు చొప్పున తమప్రతినిధుల నిలువఁబెట్టి మాసంఘమునకు సంఘులాంధ్ర దేశ ప్రాతినిధ్యముగలదు. కావున భారతపరిషత్తు ఆంధ్రభాషా వ్యవహారము లన్నియు మా సంఘమూలముననే జరుపవలెనని ప్రచారము చేయుచున్నారు. కొందఱు మిన్నకున్నారు. కొందఱు అఖిలాంధ్ర

సాహిత్యపరిషత్తు నొకదాని నెలకొల్పి యాంధ్రదేశము నందలి యఖిల భాషాసంఘముల ప్రాతినిధ్యము వడసి తన్మూలమున నాంధ్రభాషావ్యవహారముల నిర్వహింపఁ బ్రయత్నించుచున్నారు.

అఖిలాంధ్ర సాహిత్యపరిషత్తు నొకదానిని నెలకొల్పుటయే నేఁడు సమంజసముగాఁ గనఁబడుచున్నది. ఆంధ్రదేశములో నితర వ్యవహారములలో మన పొరపొచ్చెములు చూపుచున్న యనేకత్వమిందుఁ జూపక యేకముఖమున కార్యసాధనమునకుఁ గడంగుట శ్రేయస్కరము. మా సాహిత్యపరిషత్తు ఆంధ్రదేశమునఁగల భాషాసంస్థలలో ప్రప్రథమమైనది. అనేకవిధముల నిదివఱకు ఆంధ్రభాషాసేవ చేసినది. నేఁడు తనకూపిన కొలఁది చేయుచునేయున్నది. మాలక్ష్యములకు భంగము వాటిల్లనిచో యఖిలాంధ్ర సాహిత్యపరిషత్తు నిష్పక్షపాత బుద్ధితో, న్యాయదృష్టితో కార్యకలాపముల నిర్వహించుచో మాపరిషత్తు దానితోఁగలసి పని చేయుట కెట్టియభ్యంతరము లేదు. మాయంగీకారమును సూచించుటకై త్వరలో నెల్లూరులో జరుగనున్న యఖిలాంధ్రావసరసభకు మాప్రతినిధులను గూడ పంపుచున్నాము.

నేఁడు ఆంధ్రదేశమును కలవరపరచుచున్న భాషా సమస్యలు రెండు. మొదటిది భాష, కొకవ్యవస్థితి లేకపోవుట. మొన్న మొన్నటి దాకసరియైన వ్యవస్థలేని హిందీభాష యొకవ్యవస్థ నేర్పఱచుకొని ముందునకు సాగిపోవుచుండ మనము ఉన్న వ్యవస్థను కూడ పాడుచేసికొని భాషనధమస్థితికిఁ దెచ్చుచున్నాము.

రెండవసమస్య "సారస్వతాభిరుచి" నేఁడిది సరిగా పాటింపఁబడుటలేదు. శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు చెప్పినట్లు నేటి కావ్య రచన యడ్డదిడ్డముగా నున్నది. పనికిమాలిన గ్రంథములెన్నియో కావ్యములుగాఁ బాటింపఁబడుచున్నవి. గ్రంథముల యందలి గుణగౌరవమునకు విలువలేదు. గ్రంథ బాహుళ్యమునుబట్టి మహాకవి యనిపించుకొనుటకై ప్రయత్నములు జరుగుచున్నవి. సత్కావ్యము లేవియో, అసత్కావ్యము లేవియో సరిగానిర్ణయించుట కెవ్వరు పూనుకొనుటలేదు. భాషాభివృద్ధికది యెక్కువ యవసరము.

# రస సమీకరణము (ఏకోరసః)

దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ., (ఆనర్సు)

రసములసంఖ్యను సూచించుచు నాట్యశాస్త్రమున భరతముని చెప్పిన శ్లోకమునకుఁ బాఠాంతర మేర్పడుటచే రసము లెనిమిదియా తొమ్మిదియా యను విషయము వివాదాస్పదమైనది. ప్రాచీనాలంకారికులలోఁ గొందఱెనిమిదియను పక్షమును మఱికొందఱు తొమ్మిదియను పక్షమును నవలంబించి వాదించిరి. శృంగారాదిరసములలో శాంతము ను జేర్చుటయా, చేర్చకపోవుటయా యను నదే యీయభిప్రాయభేదమునకుఁ గారణము. ఈభేద మిట్లుండ నర్వాచీనులైన కొందఱాలంకారికులు శాంతరసముతోఁ గూడిన నవరసములను మఱికొన్ని క్రొత్తరసములు చేర్చి రససంఖ్యను బదమూఁడింటి వఱకును బెంచియుండిరి. ఇట్లు వివిధరసభావములకుఁగల సూక్ష్మాతిసూక్ష్మభేదములను గుర్తించి రసముల సంఖ్యను బెంప యత్నించువారికిఁ బ్రతియోగముగాఁ బ్రకృతిరస మొక్కటే యనియు, మిగిలినవన్నియు దానివికృతులనియుఁ జెప్పి రసములకైక్యము కల్పించినవారు కూడఁ గొందఱు కలరు. వీరిలో నైత మందఱు నేకకంఠముగా నొకేరసమునకుఁ బ్రకృతిత్వ మూపాదించినవారు కారు. ఒక్కొక్కరొక్కొక్క రసము నారాధించి, దానికిఁ బ్రాధాన్యము నిరూపించియుండిరి. ఇట్టి వారిలో నాలంకారికులేకాక కవులు కూడఁ బలువురు గలరు.

భవభూతి మహాకవి కరుణరసమునకుఁ బ్రకృతిత్వము నొసంగుచు,

"ఏకోరసః కరుణ ఏవ నిమిత్తభేదా
ద్భిన్నః పృథక్పృథగివ శ్రయతే వివర్తాన్
ఆవర్తబుద్బుదతరంగమయాన్ వికారా
నంభో యథా సలిలమేవ హి తత్సమస్తమ్."

అని యుత్తరరామచరిత నాటకమున ఘోషించి యుండెను. వాసంతీ సీతారామ ప్రభృతులందుఁ గరుణరస మొక్కటే వివిధరూపములతోఁ బరస్పర విలక్షణావస్థావిశేషములను భజించుచున్నదని తమస సూచించుట నాటకకథాసందర్భముగఁ బై శ్లోకముయొక్క పూర్వార్థమునకుఁ బ్రయోజనము. కాని భవభూతియందు రసవిషయమునఁ దనకుఁగల యభిప్రాయమును గూడఁ బరోక్షముగా వ్యక్తము చేయుచున్నాఁడు. ఒక్క నీరే యావర్తబుద్బుదతరంగ మయములైన వివిధ వికారములను బొందుచున్నట్లు కరుణరస మొక్కటే నిమిత్తభేదమువలన శృంగారాద్యన్యరూపములను బొందుచున్న దని యాతని యభిప్రాయము. కరుణరసము ప్రకృతి యనియు, శృంగారాదులు దాని వికృతులనియు నిందలి భావము. దీనినే వ్యాఖ్యానకర్తయైన వీరరాఘవుఁడు "ఇదమత్ర కవేర్మతమ్. యద్యపి శృంగార ఏక ఏవ రస ఇతి శృంగారప్రకాశకారాది మతం, తథాపి, ప్రాచుర్యాత్ రాగివిరాగి సాధారణ్యాత్ కరుణ ఏక ఏవ రసః అన్యే తు తద్వికృతయః" అని స్పష్టీకరించెను. ఈవివరణమున నతఁడు లోకమున నితర రసములకన్నఁ గరుణరసము ప్రచురతరముగా గోచరించుచుండుటయు, నది రక్తచిత్తులైన లౌకికులకును విరక్తచిత్తులైన యోగులకునుగూడ సాధారణమై యుండుటయు భవభూతి యారసమునకుఁ బ్రకృతిత్వము కల్పించుటకు హేతువులుగా నుగ్గడించెను. కావ్యనాటకాదులు కలిగించు చిత్తసంవాదము కరుణరసము విషయమున సమగ్రస్ఫూర్తి వహించుట యనుభవసిద్ధమే. రసము లన్నియు సహృదయ హృదయావర్జకత్వమున సమాన శక్తికములే యయ్యుఁ గరుణరస మావిషయమున నించుకశక్తిమత్తరముగా గోచరించును, అదిగాక కరుణరసమయములైన కావ్యములే యధికమాధుర్యోదంచితములై యుండునని యనుభవజ్ఞులు నుడువుదురు. కరుణరసోద్రేకమే సంస్కృతమునందలి యాదికావ్యమావిర్భవించుటకుఁ గారణము. మఱియు 'రసేషు కరుణో రస' యను నానుడి చిరకాలమునుండి యనుశ్రుతముగా వచ్చుచున్నది. ఆనందవర్ధ

నుడు హృదయమార్ద్రీభావహమైన మాధుర్య గుణము కరుణరసమున నతిశయించి యుండునని ధ్వన్యాలోకమున నుడివియున్నాఁడు. (మాధుర్యమార్ద్రతాం యాతి యతస్తత్రాధికం మనః) ఆరసమునకు భవభూతి ప్రాధాన్యమొసంగుట కిదియే కారణమైయుండును. కాని యాతనివలెఁ గరుణరస ప్రకృతిత్వ ముపపాదింప యత్నించిన వా రాలంకారికులలో నెవ్వరును గానరారు.

సరస్వతీ కంఠాభరణ-శృంగారప్రకాశాది గ్రంథకర్తయైన భోజుఁడు తాను గల్పించిన నూతనమైన "శృంగారమునందే" సర్వరసభావములును లీనములై యుండునని వచించెను. ఆత్మగుణమును, పూర్వజన్మకృత సుకృతములకు ఫలముగాఁ గలుగునట్టియు నహంకారమే సర్వభావములకును మూలబీజమని యాతనియభిప్రాయము. ఇది సాధారణముగా మనము గర్వ మనునర్థమున వాడు నహంకారము కాదు. దీనికే శృంగారము, అభిమానము అని మాఱుపేర్లు. తనయందును నితరులందును నితర పదార్థములందును మానవుఁడు ప్రీతిగలిగి వర్తించుట కిదియే కారణము. ఈయర్థమున నిది 'యాత్మరతి' యనఁబడును. నిజమున కిది యొక్కటే రసము. రతిహాసాదులు దీనినుండియే జనించును. ప్రకర్షప్రాప్తములైన వీనిచే నర్చిశ్చయములచే నగ్నివలెఁ బ్రకాశించుచు, నిది "శృంగారవంతులకే" రుచించుచుండును. ('తత ఏతే రత్యాదయో జాయన్తే తైశ్చాయం ప్రకర్షప్రాప్తైః సప్తార్చిరర్చిశ్చయైరివ ప్రకాశమానః శృంగారిణామేవ స్వదత ఇతి). దీనినిబట్టి రతిస్థాయికమై భరతాదులచే రససమూహమున నాద్యముగాఁ బేర్కొనఁబడిన శృంగారరసమునకును దీనికిని సంబంధమే లేదని తెలియవచ్చును. భోజునిమతము ననుసరించి యేరసభావము లనుభవించుటకైన నాతని యంహాకార శృంగార మావశ్యకమై యుండును. శాంతముకూడ నీయహంకారమునకు లోఁబడినదేయని యాతనియూహ. రతివలెనే శమముకూడ నహంకారజన్యమైనట్టిదే.

రసమనునది యనిర్వచనీయమైన యానందానుభవము. "ఇది శోకము, ఇది రతి, ఇది హాసము" అని స్థితిజ్ఞానము కలిగియుండు నంత వఱకు సామాజికులు భావనావస్థలో మాత్రమేయున్నవారని చెప్పవలయును. రస మీయవస్థ కతీతమైయుండును. దీనినే భోజుఁడు

'అభావనోదయ మనన్యధియా జనేన
యో భావ్యతే మనసి భావనయా స భావః
యో భావనాపథ మతీత్య వివర్తమానః
సాహంకృతౌ హృది పరం స్వదతే రసో౽సౌ'

అని చెప్పియుండెను. శృంగారవీర హాస్యాదులు నిజమునకుఁ గేవలము భావావస్థలేయనియు రసమనున దేకైక మనియు, రసమనుట తక్కుదాని నింకొకవిధమునఁ జెప్పఁగూడదనియు భోజుని యభిప్రాయము.

అహంకారశృంగార రసైకత్వమును బ్రతిపాదించుచునే భోజుఁడు ప్రేమరసప్రకృతిత్వమునుగూడ నిరూపించియుండెను. ఈ రెండింటికిని సన్నిహితమైన సంబంధ మున్నది. రతిస్నేహభక్తి ప్రముఖములైన భావములకెల్ల నహంకారమునలెనే ప్రేమయు మూలప్రభవమై యుండుననియుఁ, దమ హృదయములం దణఁగియున్న యొకానొక ప్రీతిని దృప్తిపఱుచుటకే మానవు లేకార్యము లైన నాచరింతు రనియు భోజుని యభిప్రాయము. ఎవ్వరైన నవ్వినచో వారికి నవ్వుటయందును, యుద్ధ మొనరించినచో నా యుద్ధ మొనరించుటయందును వారికిఁ బ్రీతియున్నదని మన మూహింపవలయును. ఆ ప్రీతి లేకున్నచో వారాకార్యముల నొనరింపనే యొనరింపరు. భోజుఁడు ప్రతిపాదించిన యీ ప్రేమరసమునకుఁ బూర్వకోటి, మధ్యమావస్థ, ఉత్తరకోటియని మూఁడవస్థ లున్నవి. మొదటిస్థితిలో నదియొక్క యహంకారమే; రెండవదాని నా యహంకార మేకోనపంచాశద్భావములుగా మాఱుటయు నవి విభావానుభావాదులచేఁ బరిపుష్టినొందుటయు సంభవించును. తృతీయావస్థలో నీ భావములన్నియుఁ బ్రేమగాఁ బరిణమించి మరలఁ బ్రథమా

వస్తును అనఁగా నేనైనమైన యహంకారరసము ననుభూతికిఁ దెచ్చును. అలంకారకౌస్తుభమునఁ గవి కర్ణపూరుఁడు కూడఁ బ్రేమరసప్రకృతి మునే ప్రతిపాదించెను

'ఉన్మజ్జన్తి నిమజ్జన్తి ప్రేమ్ణ్యఖండరసత్వతః
సర్వే రసాశ్చ భావాశ్చ తరంగా ఇవ వారిధౌ.'

అనియు "ప్రేమరసే సర్వే రసా అంతర్భవన్తి" యనియు నతఁడు నిరూపించియుండెను.

అగ్నిపురాణమున నైతము భోజప్రతిపాదితమైన యహంకార ము ప్రస్తావింపఁబడినది. కాని తదుక్త యభిప్రాయము ననుసరించి యహంకారమునుండి యభిమానమును, దానినుండి మొదట రతియును జనించును. ఈ రతియే పరిపోషము నొంది వ్యభిచార్యాది సామాన్యము వలన శృంగార మని చెప్పఁబడుచున్నది. హాస్యాద్యన్యరసము లన్నియుఁ దద్భేదములే. (అభిమానా ద్రతిస్సా చ పరిపోష ముపేయుషీ, వ్యభిచా ర్యాది సామాన్యాత్ శృంగార ఇతి గీయతే, తద్భేదాః కామ మితరే, హాస్యాద్యా అప్యనేకశః) భోజుఁ డట్లుగాక, రత్యాదిభావము లన్నియు నహంకారజన్యములే యని యభిప్రాయపడి యుండెను. పరబ్రహ్మమున కానందము సహజమైనదనియు, నది యొక్కొక్కపుడు వ్యక్తమగుచుండు ననియు, చైతన్యము, లేక చమత్కారము, లేక రసము, అనునదియే దాని వ్యక్తరూపమనియు, నాద్యమైనదాని వికారమే యహంకారమని యు నగ్నిపురాణ మహంకారస్వరూపమును వివరించియున్నది. స్వల్ప భేదమున్నను భోజుని యహంకారశృంగారమునకును నగ్నిపురాణప్రతి పాదితమైన రతిశృంగారమునకును దగ్గఱసంబంధ మున్నది.

అభినవగుప్తుఁ డభినవభారతిలో శాంతరసప్రాధాన్యమును బ్రతి పాదించెను. ఆలంకారికులలో నేదో యొక రసమునకుఁ బ్రకృతిత్వమును మిగిలినవానికిఁ దదంతర్భూతత్వమును సూచించిన ప్రథమాచార్యుఁ డితఁడే. శాంతము పురుషార్థములలో నత్యుత్తమమైన తురీయపురుషా ర్థమునకు సంబంధించియుండుటయుఁ, గావ్యజనితమైన రసానంద మైహి కానందభిన్నమును, నతిలోకమును, ననంతమునునై యొప్పారుచు,

శాంతముతోడి సంపర్కమును సూచించుచుండుటయు నాతఁడా రసమునకుఁ బ్రాధాన్యము కల్పించుటకు హేతువు అదిగాక, శాంతమునకు స్థాయియైన యాత్మ సర్వమానసవ్యాపారములకును మూలభూతమై, శృంగారాదివృత్తిరూపముల వహించు చిత్తమునకు వికాసము చేకూర్చుచుండును. అందుచేతనే యిది స్థాయితమమనియు దీని పరిణామమైన శాంతము ప్రకృతిరసమనియుఁ జెప్పఁబడుచున్నది.

ఇప్పుడు లభించుచున్న నాట్యశాస్త్రప్రతులలో శృంగారరసము మొదటిరసముగాఁ జేర్కొనఁబడుటచే దానిని కూర్చిన చర్చయే మొదటఁ గానవచ్చుచున్నది. కాని, యభినవగుప్తుఁడు చూచిన చిరంతనప్రతులు కొన్నింటిలో శాంతరసవివరణమే ముం దొసఁగఁబడినదఁట! భరతుఁడు శాంతమునట్లు ముందు వివరించుట దాని ప్రాధాన్యమును సూచించియే యని తలంపవలయును. దీని కుపబలముగా శాంతము నవమరసముగాఁ బ్రతిపాదించు శ్లోకములుగల పాఠములో♦ "రత్యాదులగు భావములు వికారములు. శాంతము ప్రకృతియైనట్టిది. వికారములు ప్రకృతి నుండి పుట్టి యందే లయమొందుచున్న" వని స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది.

విశ్వనాథుఁడు సాహిత్య దర్పణమున నారాయణోపజ్ఞముగా నద్భుతరసప్రాధాన్య సిద్ధాంతమును జేర్కొనెను. ఆసందర్భమున నాతఁడుదాహరించిన ధర్మదత్తుని శ్లోకము "రసమున సారమైన చమత్కారము సర్వత్ర అనుభవింపఁబడుచున్నది. చమత్కారసారత్వము వలన నద్భుతరస మెల్లెడను గలదని చెప్పవచ్చును. అందుచే నారాయణుఁడద్భుతమే రసమని, నుడివియుండె" నని తెల్పుచున్నది. రసాస్వాద రూపమని చెప్పఁబడు చమత్కార మద్భుతరసమయమైనట్టిదే మఱియు రసాస్వాదము నందలి లోకోత్తరత్వ మద్భుతరస ప్రాధాన్యమును సూచిం

♦ భవా వికార రత్యాద్యా. శాంతిస్తు ప
వికారః ప్రకృతేర్జాతః పునస్తత్రైవ లీయతే.

చుచున్నది. శృంగారాదిరసములం దన్నిట నద్భుత మంగముగా గోచ
రించు ననియు, నదియే యంగిగానున్నప్పు డద్భుతరసమని చెప్పఁబడు
చున్న దనియు, రసతరంగిణిలో భానుదత్తుఁడు వివరించియున్నాఁడు.

కావ్యములందు రసవస్త్వలంకారములు మూఁడింట నద్భుతరస
ము వ్యాపించియే యుండును. రసప్రతీతి పరాకాష్ఠ నొందునప్పు డన్ని
రసములందు నద్భుతము గోచరించుట యనుభవసిద్ధమే. అద్భుతము
కొన్ని యితరరసములకుఁ బుష్టిచేకూర్చుననుట సత్యదూరము కాదు.
శృంగారరసపోషణమున కద్భుత మెక్కువగాఁ దోడ్పడును. వీరరసము
నద్భుతమున కెక్కువ ప్రసక్తియుండుటచేతనే భరతుఁడు దానిని వీర
రసజన్యమని పేర్కొనెను ఇంక, హాస్యమునకును నద్భుతమునకునుగల
సంబంధము వేఱే చెప్పనక్కఱలేదు. నాటకప్రయోగసందర్భమున
సామాజికమానసముల నావర్జించుట కద్భుతరసమున కపారమైన శక్తి
కలదు. అందుచేతనే భరతుఁడు నాటకకథయందలి కొన్ని యంశము
లను వెల్లడించుచుఁ గొన్నిటిని నిగూఢ మొనరించుచుఁ బ్రతిక్షణము
సామాజికుల హృదయములకు విస్మయ మావహిల్లునట్లుగా వస్తువు
ననుసంధింపవలెనని చెప్పియుండెను. వస్తుసంవిధానమున సంధ్యంగము
లకుఁగల యొక ప్రయోజన మద్భుతమును చేకూర్చుటయే. మఱియుఁ
గథనుచితరీతిఁ గ్లిష్టముగానొనరించి యంతముననందలి గ్రంథులనన్నింటి
విడఁదీసి సామాజికుల కద్భుతము కలిగింపవలసిన యక్కఱ కలదని భర
తుఁడు సూచించెను. అందుచేతనే యాతఁడు నాటకకార్యము గోపుచ్ఛా
గ్రాకారమై యుండవలెననియు గోపుచ్ఛమునకుఁ జివర వాలగుచ్ఛ
ముండునట్లు కథాంతమున నద్భుతసన్నివేశముల సమాహారము కాన
రావలెననియు వచించియుండెను. నిర్వహణ మద్భుతరసమయమై
యుండవలె ననుట కిదియే యర్థము. ఇంక నలంకారవిషయమున దండి
భామహులు లతిశయోక్తిని బ్రధానముగాఁ బేర్కొని యలంకారాంతర
ములు దాని వివిధరూపములని చెప్పుట యద్భుతరసప్రాధాన్యమును

సూచించుచునే యున్నది. అతిశయోక్తికిని నద్భుతమునకును గల సంబంధమే యిందుకుఁ గారణము. ఆనందవర్ధనుఁడును నభినవగుప్తుఁడును గూడఁ గావ్యములం దతిశయోక్త్యద్భుతములకుఁ గల ప్రాముఖ్య పాటవములను వివరించియున్నారు.

శక్తిభద్రవిరచితమైన యాశ్చర్యచూడామణి యద్భుతరస ప్రధానమై యా రసముయొక్క ప్రాముఖ్యమును బలువిధములఁ బ్రకటించుచున్నది. కృత్యారావణ మను నాటకము కూడ నాశ్చర్య చూడామణివలెనే యద్భుతరసప్రాధాన్యమును బ్రకటించునట్టిదే యఁట! మహాదేవ విరచితమైన యద్భుతదర్పణమున గాముఁ "డద్భుతైకరసాస్పృత్తి రంశోక్తిలయతీవమా" యని పల్కుటయు నా కవి కద్భుతరస ప్రాధాన్యమునఁ గల ప్రత్యయమును జాటుచున్నది.

రసప్రదీపకారుఁడైన ప్రభాకరు డద్భుతరసప్రాధాన్యవాదమును ఖండించుచు "నారాయణుఁ డద్భుతమొక్కటే రసమని వాకొనెను. ధర్మదత్తాదు లాతని ననుసరించిరి. కాని యది యుక్తము కాదు. అనుభవమున నది విలక్షణముగా నుండుటయే యిందుకు హేతువు. వ్యభిచారులందు స్థాయికివలె రత్యాదులందు విస్మయమున కనుగమము లేదు. శ్లోకాదు లిందు కుదాహరణము" లని పలికెను. అతఁ డలంకారరహస్య మను గ్రంథమును రచించెననియు నందద్భుతరసము సర్వాన్యరసాంతర్భూతమై యుండుననను సిద్ధాంతమును బూర్తిగా ఖండించెననియుఁ దెలియుచున్నది. కాని యా గ్రంథ మిప్పు డుపలభ్యమానము కాదు.

శృంగారాదులగు కొన్ని యితరరసములందుఁ గూడ నద్భుతాంశము గోచరించుచున్నమాట సత్యమేయైనను బ్రభాకరుఁడు వచించినట్లు కరుణమున దానికి స్థానమే లేదు. రసాస్వాదము చిత్తసంవాదమేయైనను ఆచిత్తసంవాద మన్నిరసముల సందర్భమునను విస్తారరూపమునే

వహింపదు. అది కొన్ని కొన్ని రసముల విషయమున భిన్నరూపములు వహించుచుండును కరుణ శృంగారముల విషయమున నది ద్రుతిరూప మును భీభత్సము విషయమున సంక్షోభరూపమును వహించుట యిందుకు దృష్టాంతము. మఱియు శృంగారకరుణము లందలి ద్రుతి భీభ త్సభయానక రౌద్రాద్భుతములందించుకయుఁ గానిపింపనే కానిపింపదు. దీనిని బురస్కరించుకొని చూచినచో నొకరసముననే యితరరసము లన్నియు నంతర్భూతములై యుండునను సమీకరణ వాదము లోప భూయిష్ఠముగా గోచరించును. శాంతశృంగార సమీకరణ వాదములే యితరములైన వానికంటెఁ గొంత మెఱుగు.

ఏకైకరసప్రకృతిత్వము నీవిధముగా. నంగీకరించుట కష్టమే యైనను అనిర్వాచ్యానందరూపమైన రసమొక్కటేయని చెప్పుటకు సందే హింపఁబనిలేదు. ఆలంకారికులు పలువురు దీనినంగీకరించి యుండిరి. దానికి రసమని యొక్కటే పేరు. బ్రహ్మమువలె నది యేకైకమౌ యద్వితీ యము. అందుచే శృంగార వీరాద్భుతాది నామములును వాని వైవిధ్య మును యథార్థములుకావు అవి యేకమైన యంగిరసముయొక్క వివిధ భాగములు. అందుచేతనే భరతుఁడు నహిరసాదృతేకశ్చిదర్థః ప్రవర్తతే యనుసూత్రిమున రసశబ్దము నేకవచనముగా నుపయోగించెనని యభి నవ గుప్తుఁడు చెప్పుచున్నాఁడు. ఏక ఏవ తావత్పరమార్థతోరసః సూత్ర స్థానత్వేనరూవకే ప్రతిభాతి. తస్యైవపునర్భాగదృశావిభాగః. అను భవమునఁగూడఁ జిత్తవిశ్రాంతిరూపమును ననిర్వచనీయమును నగు రసాస్వాద మన్నిరసముల విషయమునను సమానముగానే గోచరించు చున్నది. భోజుని సరస్వతీ కంఠాభరణమునకు వ్యాఖ్యానము చేయుచు భట్టనరసింహుఁడు సర్వరసములకును గూటస్థమైన స్వాదాత్మయొక్కటే యనియు రసములన్నియుఁ దద్విశేషములనియు నుడివియుండెను. ఈసి ద్ధాంతము నభినవగుప్తుఁడు సూచింపకపోయినను ఇది యాతనికి విరు ద్ధము మాత్రముకాదు.

కవి కర్ణపూరగోస్వామి యలంకార కౌస్తుభమున నీవిషయమునే చక్కఁగా నిరూపించియుండెను. 'రజస్తమోహీనమై శుద్ధసత్త్వస్వరూప మగు మనస్సున కాస్వాదాంకురకంద యనుధర్మముకలదు. ఆయానందమే యేకైకమగు రసమునకు స్థాయియని విజ్ఞులు చెప్పుదురు. అదియే విభావ వైవిధ్యమువలనఁ బృథగ్విధత్వమును బొందుచున్న" దని నుడివి యుండెను. స్థాయి రూపమైన యాధర్మమొక్కటే యైనచో నొక్కటే స్థాయికి వీరరసమున నుత్సాహత్వమును, గరుణరసమున శోకత్వమును నద్భుతరసమున విస్మయత్వమును నెట్లుకలుగఁ జాలునను ప్రశ్నమునకు వ్యాఖ్యానమున నిట్లు సమాధాన మొసంగఁబడినది. ఆధర్మ మొక్కటే యైనను ద్వివిధమైన విభావము యొక్క భేదములచే భిన్నమైకానవచ్చు చున్నది. ఒకే స్ఫటికము జపాకుసుమాది నానాపదార్థముల సంగము వలన నొకప్పుడు రక్తముగను నొకప్పుడు పీతముగను, నొకప్పుడు శ్యామమును నై వివిధాకారముల నొందునట్లే స్థాయిరూపమైన యొకే ధర్మము వీరరసాది పోషకములైన నానావిధవిభావముల సంగమువలన నొకప్పుడుత్సాహ రూపమును నొకప్పుడు విస్మయరూపమును నొకప్పుడు శోకరూపమును బొందుచున్నది.

శృంగారాదిరసములు నామభేదముచే వేర్వేఱుగాఁ గనఁబడినను వానివలన మానవులు పొందు నానందమొక విధమైనట్టిదే. రసము కూడ నొక్కటే. దానికి స్థాయియానందము. రత్యాదులైనయుపాధుల భేదముచే దానికి నానాత్వము కలుగు చున్నది. పలువిధములైన పాత్ర ములందుండు జలమున భేదమున్నను వానియందుఁ బ్రతిఫలించు సూర్యుని ప్రతిబింబ మొక్కటే. అట్లేరత్యాదులందుఁ దారతమ్య మున్నను ఆనం దమొక్కటే. భేదము కేవల ముపాధిగత మైనదే.

# వ్యక్తివివేకము

భాగవతుల కుటుంబరాయశాస్త్రి, ఎం. ఏ.

వాక్యార్థము:— (1) వాచ్యార్థము (వాక్యార్థము), వాచ్యమనియు ననుమేయమనియు రెండువిధములు. అందు, వాచ్యార్థమున నంశపరికల్పనముఁ జేసినప్పు డాయంశములలో నొకటి యుద్దేశ్యాంశమును, మరియొకటి విధేయాంశము నగును. అందులో విధేయాంశము ప్రసిద్ధము కావచ్చును, లేక యప్రసిద్ధము గావచ్చును. విధేయాంశము ప్రసిద్ధమయ్యేనేని, విధేయార్థమును మనము సమర్థింప నక్కఱలేదు. అనఁగా విధేయ ముపపాదన (సమర్థనము) నపేక్షింపదు. ఈవిధేయార్థమే యప్రసిద్ధమయ్యేనేని సమర్థన మక్కఱ యగును. కావున విధేయార్థము 1 ఉపపాదనసాపేక్షమనియు, 2. నిరపేక్షమనియు రెండు విధములుగ నుండును.

విధేయాంశము ప్రసిద్ధమైనప్పు డుపపాదనము (సమర్థనము) నపేక్షింపదు. అయినను నుద్దేశ్యము విధేయము మాత్రము కన్పడుచుండును. ఉదాహరణము:

'అస్త్యుత్తరస్యాం దిశి దేవతాత్మా హిమాలయో నామ నగాధిరాజః''

అర్థము: ఉత్తర దిక్కునందు, దేవతాత్మమైన హిమాలయ మను నగాధిరాజు కలఁడు. ఇచట హిమాలయ ముద్దేశ్యము. ఈ హిమాలయము నుద్దేశించి అస్తిత్వము (ఉండుట) విధింపఁబడుచున్నది. హిమాలయ ముండుననువిషయము ప్రసిద్ధమే. ఉన్నదనువిధేయార్థమును సమర్థింప నక్కఱలేదు.

విధేయమగునర్థ మప్రసిద్ధమగునపుడు, ఉద్దేశ్యమునకును విధేయమునకును, నవినాభావసంబంధము -(ధూమాగ్నులకువలె నిత్యసాహచర్యము) ఉన్నదని తెలియుటచే, సాధ్యసాధనభావసంబంధ ముండును. అపు డుద్దేశ్యము సాధనమగును. విధేయము సాధ్యమగును.

త్రివిధప్రమాణములు:- ఈసాధ్యసాధనభావము గూడ ప్రమాణమూలముగ నుండవలయును. ఈప్రమాణములు 1. లోకము 2. వేదము 3. అధ్యాత్మము నని మూఁడు విధములు-

లోకప్రమాణము - లోకప్రసిద్ధార్థవిషయము లోకప్రమాణము.

ఉదాహరణము:

'కయాసి కామిన్! సురతాపరాధాత్, పాదానతః కోపనయాఽవధూతః
♦ యస్యాః కరిష్యామి దృఢానుతాపం, ప్రవాలశయ్యాశరణం శరీరమ్''

(కుమారసంభవమ్, 3.౮.)

తా. తారకాసురుని సంహరించుటకై, దేవసైన్యములకు నాయకుఁడుగ నుండు నతఁడు పార్వతియందు శివునకుఁ బుట్టవలయు నన్న. మన్మథునిసాహాయ్య మపేక్షిత మని తెలిసికొని యింద్రుఁడు మన్మథుని స్మరించినాఁడు_మన్మథుఁడు వచ్చి, తన్ను స్మరించుటకు హేతు వేమి యని యింద్రు నడుగుచున్నాఁడు-కాముకుఁడవగు నోయింద్రా! గోత్రస్ఖలనాది రూపమగునపరాధములను వేరినైనను జేసి, యాయపరాధమును మన్నింపుమని వేఁడుచు, నేప్రియురాలి పాదములమీఁద నైనఁబడినను నామె కోపస్వభావము గలదియై. నిన్ను త్రోసివుచ్చినదియా ? _ ఆమెయనురాగానుగ్రహముల నపేక్షించి నీవు బాధ నొందుచుంటివా ? తెల్పుము-ఆమె కిపుడే విరహతాపముఁ గల్గునట్లు చేసి, చిగురుటాకుల శయ్యయే గతి యగునట్లు చేసెదను- ఆమెకోపము సడలి నీకై పరితపించునట్లు చేసెదను - సెలవిమ్ము.

---

♦ కామిన్ = కాముకుఁడవగు నో యింద్రుఁడా! (స్త్రీలటుండ) కయా కోపనయా = కోపముగల యేవనిత చేత, సురతాపరాధః = గోత్రస్ఖలనాది రూపమైన క్రొత్తయపరాధము గలవాఁడవై. పాదానతః = ఆమె పాదములమీఁదఁ బడినవాఁడ వయ్యు, అవధూతః = తిరస్కరింపఁబడితివి - యస్యాః = ఏవనితయొక్క, శరీరం = శరీరమును, దృఢానుతాపం = గొప్పతాపము గల్గునట్లుగను, ప్రవాలశయ్యాశరణం= చిగురుటాకులశయ్య యే గతియగునట్లుగను, కరిష్యామి = చేయఁగలనో ___ ఇంచు సాపరాధత్వము, కోపనత్వము నుద్దేశ్యములు - పాదపతనము, తిరస్కృతి యనునవి విధేయములు. వీనికి సాధ్యసాధనభావసంబంధము లోకసిద్ధము.

ఇచట నింద్రుఁ డపరాధముఁ జేసినవాఁ డగుటచేతనే ప్రియా పాదములపై వ్రాలినాఁడు - ఆమె కోపస్వభావ యగుటచేతనే తన పాదములపై వ్రాలినప్రియుని దిరస్కరించినది. ఇందు సాపరాధత్వమునకు, పాదావనతికిని, కోపస్వభావత్వమునకుఁ దిరస్కారమునకును కార్యకారణభావసంబంధ మున్నది. ఈసంబంధము లోకస్వభావసిద్ధ మగుటచే, నిచట లోకమనుప్రమాణ మున్న దనియుఁ, దన్మూలమైన సాధ్యసాధనభావమే యిచటఁ గలదనియుఁ దెలియునది.

మఱియొక యుదాహరణము.

'చన్ద్రంగతా పద్మగుణాన్ న భుంక్తే, పద్మాశ్రితా చాన్ద్రమసీ మభిఖ్యాం
ఉమాముఖం తు ప్రతిపద్య లోలా, ద్విసంశ్రయాం ప్రీతి మవాప లక్ష్మీః'
(కుమారసంభవము, 1. ౪౩)

తా. పార్వతీముఖవర్ణనము సందర్భము_ పద్మము పగటి సమయముననే వికసించును. చంద్రుఁడు రాత్రిసమయముననే ప్రకాశించును కాంతిసౌన్దర్యాభిమానిదేవతయగు లక్ష్మి, పగటిసమయమునఁ బద్మము నధివసించెడిది. అప్పుడామె పద్మసౌగన్ధ్యము ననుభవించెడిది. కాని చంద్రుని గుణమగు శోభ యప్పుడామె కుండెడిది గాదు. రాత్రిసమయమునఁ జంద్రు నాశ్రయించి శోభాగుణము ననుభవించినను, పద్మసౌగన్ధ్యానుభవ మామెకు లేదు. కావున శోభాసౌగన్ధ్యములను క్రమముగ ననుభవింప వలసినదే గాని, యొక సమయముననే, యారెండు గుణముల ననుభవింప లక్ష్మికి వీలు గాలేదు. అందుచే లక్ష్మికి వాంచ

♦ లోలా=చంచలయగు, లక్ష్మీః = కాన్త్యభిమానదేవత, చన్ద్రం గతా = (రాత్రియందు) చన్ద్రునియం దుండి, పద్మగుణాన్ =పద్మమునందలిపరిమళము మొదలగు గుణములను, నభుంక్తే =అనుభవింపదు -పద్మాశ్రితా=[పగటిసమయమున] పద్మముల నాశ్రయించినదై, చాన్ద్రమసీం = చన్ద్రసమ్బన్ధమగు. అభిఖ్యాం = శోభను నభుంక్తే=అనుభవింపదు. ఉమాముఖం = పార్వతిముఖమును, ప్రతిపద్య=పొంది ద్విసంశ్రయాం=పద్మచంద్రులను నిద్దఱ నాశ్రయించిన, ప్రీతిమ్= సంతోషమును, అవాప=పొందెను.-

ల్యము పోలేదు. స్థిరత యనునది చిక్కలేదు. పార్వతీజననమైన పిదప నీపరిస్థితి మారినది. పార్వతీముఖమున శోభాసౌగన్ధ్యములు రెండు నున్నవి. ఈగుణము లీమెముఖమున నహోరాత్రములు నుండును. అందుచే లక్ష్మి యీమె ముఖ మాశ్రయించినది. శోభాసౌగన్ధ్యగుణములను రెంటి నొకసమయముననే నిరంతర మనుభవించుటకు వీలగుటచే లక్ష్మి చంచల యను నపకీర్తి యామెకుఁ దొలఁగిపోయినది.

ఇచట, పద్మముయొక్కయు చంద్రునియొక్కయు గుణముల నొకసమయముననే యనుభవింప లేకుండుటకు హేతువులు పద్మము రాత్రిసమయమున ముకుళించుకొనుట, చంద్రుఁడు పగలు ప్రకాశింపకుండుటయు నగును. కాని యీకారణములు వాచ్యముగాఁ బైశ్లోకమునఁ జెప్పఁబడ లేదు. అయినను నవి లోకప్రసిద్ధములే. అందుచే నవి యుపాత్తము కాకున్నను దోషము లేదు. లోకప్రసిద్ధమైనదానిని తిరిగి చెప్పుటయుఁ దగదు.

వేదప్రమాణము — శాస్త్రమాత్రప్రసిద్ధార్థవిషయము వేదరూపప్రమాణమగును. ఇతిహాసధర్మశాస్త్ర పురాణములు వేదమూలములే యగుటచే వేదశబ్దము వీనికిఁగూడ నుపలక్షణము. అనఁగా నితిహాసాది మాత్రసిద్ధార్థవిషయము గూడ వేదప్రమాణమే యగును. ఉదాహరణము.

♦అయాచితారం న హి దేవమద్రిః సుతాం ప్రతిగ్రాహయితుం శశాక
అభ్యర్థనాభంగభయేన సాధుః మాధ్యస్థ్యమిష్టేప్యవలంబతేఽర్థే"
(కుమారసంభవము. 1. ౫౨)

---

♦ అద్రిః = హిమాలయపర్వతము. సుతాం = కూఁతురగు పార్వతిని, అయాచితారం = అడుగని (యాచింపని) దేవం = ఈశ్వరుని, ప్రతిగ్రాహయితుం = స్వీకరించునట్లుగా. (ఈశ్వరుఁడు గ్రహించునట్లుగాఁ జేయుటకు) నహి శశాక = సమర్థుఁడుగా లేడుకదా! సాధుః = సాధువైనవాఁడు[సత్పురుషుఁడు-అభిమానవంతుఁడు] అభ్యర్థనాభంగభయేన = తన ప్రార్థన సఫలము కాదేమోయను భయముచే, ఇష్టేప్యర్థే = ఇష్టమైన విషయమునఁగూడ, మాధ్యస్థ్యమవలంబతే = తటస్థభావమును (ఔదాసీన్యమును) అవలంబింతురు.

తా. పార్వతి శివునకు భార్య కానున్నదను విషయము శివునకుఁ దెలియును. అగుచో శివునకు పార్వతినిచ్చి యెందుకుఁబెండ్లి సేయలేదు? అని ప్రశ్న రాఁగా, కాళిదాసకవియే సమాధానముఁ జెప్పుచున్నాఁడు- శివుఁడువచ్చి పార్వతిని తన కిమ్మని యడుగనిదే హిమవంతుఁడు పార్వతిని గ్రహింపుమని శివునకుఁ జెప్పుట కిష్టపడలేదు.- ఏలన? అభిమానవంతుఁడైనవాఁడు,తనప్రార్థన వ్యర్థమగునో యేమో యను భయమున తనకిష్టమగువిషయమునఁగూడ నుపేక్షచేయును.

ఇచట నీశ్వరుఁడు ప్రతిగ్రహీత- అతఁడు యాచింపకుండుట కారణము; హిమవంతుఁడు తనకన్యనీయకుండుట కార్యము.

(కన్యాగ్రహణాశక్తత్వము=ఈశ్వరుఁడు పార్వతిని గ్రహించునట్లు చేయు లేకుండుట యనునది కార్యము) వీనికిఁ గల యీకార్యకారణ భావసంబంధము- అడుగని వానికిఁ గన్య నీయఁగూడదనుట, శాస్త్ర సంప్రదాయసిద్ధము. - ఈవిషయమునఁ బ్రమాణవాక్యమిది-

"అయాచితాని దేయాని సర్వద్రవ్యాణి భారత
అన్నం విద్యా తథా కన్యా అనర్థిభ్యో న దీయతే"

అన్నివస్తువుల నితరు లడుగకున్నను నీయవచ్చును - అన్నము, విద్య కన్య యను వీని నడుగనిదే యితరుల కీయరాదు-(యాచకులు గానివారి కీయరాదు'- అర్థిలేక యాచకుఁడను నీతనికి,వ్యాకరణశాస్త్రమున సంప్రదాన మను సంజ్ఞకలదు.—ఆసంప్రదాన సంజ్ఞకు వారిట్లు లక్షణముఁ జెప్పినారు.-

"అనిరాకరణాత్ కర్తు స్త్యాగాంగం కర్మణేప్సితమ్
ప్రేరణానుమతిభ్యాం వా లభతే సమ్ప్రదానతామ్"

దాతయగు నతఁడు సువర్ణాదుల నెవని కీయ నభిలషించునో యాతఁడు సమ్ప్రదాన మగును (అర్థి యగును) అతఁడు లేకున్నఁద్యాగమే కుదురదు కాన నతఁడు త్యాగమున కంగ మగుచున్నాఁడు——ఈప్రతి

గ్రహీంతలు మూఁడు విధములుగ నున్నారు.—నిరాకరింపనివారు (దేవతలవలె) ప్రేరకులు (యాచకులవలె) అనుమతి నిచ్చువారు.
(దానమును గ్రహించుట కంగీకరించు నుపాధ్యాయాదుల వలె).

ప్రస్తుతము హిమవంతుఁడు యాచకుఁడు కాఁడు-యాచింపనిదే కన్య నీయఁగూడదు. కావున హిమవంతుఁడు, పరమేశ్వరుఁడు కన్యను గ్రహించునట్లుగాఁ జేయలేకపోయెను. - అను కార్యకారణభావము తేలుచున్నది. ఇచట నగ్ని లేకుండుటచే పొగయును లేదను రీతిని, ఈశ్వరుని యాచన లేకుంటచే హిమవంతునికిఁ దన కన్యనిచ్చు శక్తి లేకున్నది అను యనుపలబ్ధిరూపమైన ప్రమాణము సిద్ధించుచున్నది ఇచట నున్న యర్థముయొక్క బలముచే నీయనుపలబ్ధిప్రమాణము సిద్ధించుచున్నదని యుఁ దెలియవలయును.

ఆధ్యాత్మిక ప్రమాణము.— ప్రత్యక్షమగు విషయమే ప్రమాణ మగును-ఉదా—

♦"పశుపతిరపి తాన్యహాని కృచ్ఛ్రాదగమయదద్రిసుతాసమాగమోత్కః
కమపర మవశం న విప్రకుర్యుః,విభుమపి తం యదమీ స్పృశన్తి భావాః"
కుమారసంభవము, 6-౯౫.

తా॥ ఈపార్వతియందు శివున కనురాగము గల్గినది. సప్తర్షుల ముఖమున హిమవంతునకుఁ దన ప్రార్థనను దెలియఁ జేసినాఁడు వారా

♦అద్రిసుతాసమాగమోత్కః = పార్వతీ సమావేశమునం దుత్కంఠగల, పశుపతిరపి = ఈశ్వరుఁడుగూడ తాన్యహాని = ఆదినములను మూఁడుదినములను; కృచ్ఛ్రాత్ = ఎంతయో కష్టముతో, అగమంత్ = గడపెను. తం విభుమపి = సర్వశక్తిమహైశ్వర హరుఁడగు నా యీశ్వరునిఁగూడ, అమీ భావాః = ఈవిరహము, ఉత్కంఠ మొదలగు భావములు, స్పృశన్తిఇతియత్ = స్పృశించుచున్నవనఁగా, అవశం = ఇంద్రియనిగ్రహములేని, కమ్ అపరమ్ = ఏయితరుని, ఈభావములు, నవిప్రకుర్యుః = చిత్తవికారమునకు విషయ మగునట్లుగాఁజేయవు?

విషయమును హితునంతునకుఁ దెల్పి యతని యంగీకారమును బడసెను. ఇఁక మూఁడుదినములో ముహూర్తమునకు వ్యవధాన మని తెల్పి శివుని కడకుఁ దిరిగి వచ్చులోపలనే శివుఁడెంతయో విరహపీడితుఁడైనాఁడు-'' ఇచట విరహార్తియనునది కారణము, శివుఁడాదినముల నెంతయో కష్టముతోఁ గడిపెననునది కార్యము. ఈకార్యకారణములకుఁ గల సంబంధము ప్రత్యక్షవేద్యము. అనుభవైకవేద్యము. అందుచే నిచట ప్రత్యక్షప్రమాణమని తెలుపవచ్చును.

ఈసాధ్యసాధనభావము శాబ్దము, ఆర్థము నని రెండువిధములు.

యథా, యతః హి మొదలగు (ఎట్లన, ఏలన) హేత్వర్థక శబ్దములున్నచో శాబ్దమగును అట్టి శబ్దము లేమియు లేకయే అర్థబలలభ్యమగుచో నార్థ మగును వీనిలో నొకొక్కటి పదార్థవాక్యార్థరూపమున రెండువిధములు-ఇందు పదార్థము తిరిగి జాతి, గుణ, క్రియా, ద్రవ్యము లనెడు భేదము ననుసరించి నాల్గువిధములుగను, ధర్మధర్మిభేదము ననుసరించి రెండు విధములుగ నుండును ఇందులో ధర్మము సమానాధికరణమనియు, వైయధికరణ మనియు రెండువిధములుగ నుండును.

వాక్యార్థము క్రియాప్రధానముగ నుండును. కారణము లనేకములున్నవి. ఈకారకవైచిత్రి ననుసరించి వాక్యార్థము ననేకవిధములుగ నుండును. ఇవి యన్నియు పరస్పరము కలియుచో నీసాంకర్యము వలన ననంతములైన భేదములు పుట్టును. వీని నిచట క్లుప్తముగ నుదాహరించు చున్నాము.

కేవలధర్మము హేతువుగ నుండి శాబ్దమగు సాధ్యసాధన భావమున కుదాహరణము—

ప్రజానాం వినయాధానా ద్రక్షణా ద్భరణాదపి
స పితా పితరస్తాసాం కేవలం జన్మహేతవః-

రఘువంశము (౧. ౨౪.)

ప్రజానాం=ప్రజలకు; వినయాధానాత్=వినయ మలవర్చుట వలనను, రక్షణాత్=వారిని రక్షించుట వలనను, భరణాత్=పోషించుట వలనను, సః=ఆదిలీపమహారాజు; పితా=తండ్రియయ్యెను;- తాసాం=ఆప్రజలయొక్క, పితరః=తల్లిదండ్రులు, కేవలం జన్మహేతవః=కేవలము వారిపుట్టుకకుమాత్రము కారణమైరి.

ఇందు దిలీపుని యందు ప్రజాపితృత్వము సాధ్యము. -వినయాధానకర్తృత్వము, రక్షణ భరణకర్తృత్వమును, సాధనములు. వినయాధానాత్ రక్షణాత్, భరణాత్, అని పంచమీవిభక్తి హేతు వాచకమగుటచే నిచట సాధ్యసాధనభావము శాబ్దమైనది. వినయాధానాది ధర్మముల నాధారముఁ జేసికొని ధర్మియగు పిత (పితృత్వము) సాధింపఁ బడుచున్నాఁడు ఇచటవినయాధానము ప్రజలయందున్నది. పితృత్వము రాజు నందున్నది. సాధ్యసాధనములిట్లు విభిన్నాధికరణముల యందుండుటచే నిది వాని వైయధికరణ్యమున కుదాహరణమైనది.

సమానాధికరణమగు ధర్మమున్న స్థలమున కుదాహరణము—

"ద్విషతాము దయః సుమేధసా, గురురస్వ న్తతరస్తు మృష్యతే
న మహానపి భూతిమిచ్ఛతా ఫలసమ్పత్ప్రవణః పరిక్షయః."

కిరాతార్జునీయము.

భూతిమ్=ఐశ్వర్యమును, ఇచ్ఛతా=కోరుచున్న, సుమేధసా = ప్రజ్ఞావంతునిచేత, ద్విషతాం=శత్రువులయొక్క, అస్వన్తతరః=శుభాంతము గాని, ఉదయః=అభివృద్ధి, గురురపి=గొప్పదియైనను, మృష్యతే=ఉపేక్షింపఁబడును. తు=కాని, ఫలసమ్పత్ప్రవణః=గొప్ప సంపదలనెడు ఫలము నిచ్చు. పరిక్షయః=వినాశము, మహానపి=గొప్పదియేయైనను, నమృష్యతే=సహింపఁబడదు (ఉపేక్షింపఁబడదు.)

ఇచట శత్రూదయమునందున్న సుమర్షణత్వము, (ఉపేక్షింపఁదగియుండుట) సాధ్యము. ఇందుకు హేతువు "అస్వన్తత్వము."

ఇవియును, శత్రూదయమునందే యున్నది. అటులే ఫలసంప్రాప్తివణత్వ మనునది సాధనము. అమర్షణత్వమనునది సాధ్యము ఈసాధ్యసాధనములు రెండును, శత్రుక్షయమునందే యున్నవి. ఈవిధముగ, పై రెండు వాక్యములందును, సాధ్యసాధనములొకే యధికరణము నందుండుటచే, వీని కిచట సామానాధికరణ్య మున్నదని తెలియవలెను. ♦

పై రెండు వాక్యములందును, "అస్వాస్తతరః" "ఫలసమ్ప్రాప్తివణః" అనుపదములు హేతువును తెల్పుచున్నవని తెలిసికొనినాము. కాని యీహేతుత్వమునుఁ దెల్పుటకు పంచమీవిభక్తిలేదు. కేవల మర్థసామర్థ్యమువలననే, యిచట హేతు, హేతుమద్భావము, తెలియుచున్నది. అందుచే నిచట సాధ్యసాధనభావము "ఆర్థ" మని యందుము.

ధర్మధర్మిభావములేకయే, పదముయొక్క యర్థము మాత్రము సాధనమై, శాబ్దమైన (శబ్దప్రతిపాదితమైన) సాధ్యసాధన భావమున్న స్థలము కుదాహరణము.

'దుర్మన్త్రాన్నృపతిర్వినశ్యతి, యతిస్సంగాత్' సుతో లాలనాత్,
విప్రోఽనధ్యయనాత్, కులం కుతనయాత్, శీలం ఖలోపాసనాత్
హ్రీర్మద్యా, దనవేక్షణాదపి కృషిః, స్నేహః ప్రవాసాశ్రయాత్
మైత్రీ చాప్రణయాత్, సమృద్ధిరనయాత్, త్యాగాత్ప్రమాదాద్ధనమ్'.

తా॥ దుష్టులగు మంత్రుల యుపదేశమువలన నృపతి నశించును. అటులే యతియగునతడు విషయసుఖసంగమువలనను, లాలించుటవలనఁ గుమారుడును, అధ్యయనము లేకుండుటచే విప్రులును, దుష్టుఁడగు తనయునివలనఁ గులమును, ఖలుల నుపాసించుటవలన శీలమును, మద్యపానమువలన సిగ్గును, శ్రద్ధగాఁ జూచుకొనకుండుటవలన కృషియు, దూరదేశవాసమువలన స్నేహమును, ప్రేమలేకుండుటచే

♦ ఇందు — ద్విషదుదయము ధర్మి — అస్వంతత్వ, సువర్ణత్వములు రెండును ధర్మములు-ఈధర్మములలో నొకటిసాధ్యము, మఱియొకటి సాధనము లైనవి ఇటులే యిందలి రెండవ వాక్యమునఁగూడఁ దెలియునది.

మిత్రత్వమును, అవినయమువలన సంపదలును త్యాగప్రమాదముల వలన ధనమును నశించును.

ఇందు, దుర్మంత్రమునకును, వినాశనమునకును ధర్మధర్మిభావ సంబంధము లేదు. కాని సాధ్యసాధనభావ మున్నది. అందును సంగాత్ మొదలగు పదములయందు పంచమీవిభక్తియున్నది. అది హేతుత్వ మును దెల్పును. అందుచే నిచట సాధ్యసాధనభావము శాబ్దము-పైని నిరూపించినయర్థమునకు లోకమే ప్రమాణమగుటచే నిది లోకప్రమాణసిద్ధ మనఁబడును.

ఈవిధముగనే వాక్యార్థవిషయకమగు సాధ్య సాధనభావము వాక్యార్థమున శాబ్దమగు సాధ్యసాధనభావముగూడ, శాబ్దమనియు నార్థమనియు రెండువిధములుగ నుండును. అందు శాబ్దమున కుదాహరణము.

"సరస్యామేతస్యా ముదరవలివీచీ విలులితం
యథా లావణ్యామ్భో జఘనపులినోల్లంఘనపరమ్
యథా లక్ష్యశ్చాయం చలనయనమీనవ్యతికరః
తథా మన్యే మగ్నః ప్రకటకుచ కుంభస్స్మరగజః.

అర్థము. ఏతస్యాం=ఈసరసునందు (నాలుకయందు), ఉదరవలి వీచీవిలులితం=పొట్టమీఁదనున్న ముడుతలనెడు తరంగములచేఁ గదల్పఁ బడిన, జఘన పులినోల్లంఘపరమ్=కటిప్రదేశమనెడు నిసుకతిన్నె నతిక్ర మింపనున్నదై, లావణ్యాంభః=లావణ్యరూపమగు జలము, యథా= ఎందువలన, లక్ష్యః=కన్పడుచున్నదో, అయం చలనయన మీనవ్యతి కరః=చలించుచున్న నేత్రములనెడు చేపలసంబంధము, యథాలక్ష్యః= ఎందువలనఁగన్పడుచున్నదో, తథా=అందువలన, ప్రకటకుచకుంభః= బాగుగాఁ గన్పడుచున్న కుచములనెడు కుంభస్థలములుగల, స్మర గజః=మన్మథుఁడనెడు నేనుఁగు, మగ్నః=మునిగియున్నదని (నాయికా రూపమైన సరస్సునందలి సమన్వయము) మన్యే=తలఁచెదను.

తా॥ ఇచట నాయికయే యొకసరస్సు — ఆమెయుదరవలులు (పొట్టపై ముడుతలు) తరంగములు—ఆమెలావణ్యమే నీరు, కటిప్రదేశమే యిసుకతిన్నెలు. నయనములుచేఁపలు; కుచములేనుఁగు కుంభస్థలములు—మన్మథుఁడే ఏనుఁగు. పైకి, లావణ్యమనెడునీరు, స్తనముల నెడు కుంభస్థలములు కన్పడుచుండుటచే, నిచట మన్మథుఁడనెడు గజము తప్పక యుండి తీరవలయునని తాత్పర్యము— ఈవనితయనెడు సరస్సునందు, మన్మథుఁడనెడు గజము, మునిఁగియుండుసను వాక్యార్థము సాధ్యము.

'ఉదరవలివీచీవిలులితమును, జఘన పులినోల్లంఘనపరమునగు లావణ్యజలము, చలించుచున్న నయనములనెడు మీనసంబంధమును కన్పడుటచేత'' యను వాక్యార్థము సాధనము, "యథా''=ఎందువలన (ఏవిధముగ) అను హేతువాచకపద మిచట నుండుటచే నిందలి సాధ్యసాధనభావము శాబ్దమని తెలియవలెను.

వాక్యార్థమున నార్థమగు సాధ్యసాధనభావమున కుదాహరణము,

"నివార్యతామాలి ! కిమప్యసౌ వటుః
పునర్వివక్షుః స్ఫురితోత్తరాధరః
న కేవలం యో మహతోఽపభాషతే,
శృణోతితస్మాదపి యస్సపాపభాక్ ''.

కుమారసంభవము,

అర్థము. హే ఆలి= జ సఖి! స్ఫురితోత్తరాధరః=కదలుచున్న పై పెదవిగల,అయం వటుః=ఈబ్రహ్మచారి, పునః=తిరిగి,కిమపి వివక్షుః—ఏమియోచెప్పఁదలఁచుకొనినాఁడు, నివార్యతామ్=అడ్డగింపుము, యః=ఎవఁడు, మహతః=పెద్దలను, అపభాషతే=నిన్దించునో, న స కేవలం పాపభాక్=వాఁడొకఁడేకాదు పాపమునుపొందునది; యస్మాత్ శృణోతి సోపిపాప భాక్=అతనిని వినువాఁడును పాపాత్ముఁడేయగును.

బ్రహ్మచారిరూపముననున్న శివుఁడు, పార్వతితో ప్రసంగించుచు, శివునాక్షేపించినాఁడు. ఆయాక్షేపములకు పార్వతి సమాధానముఁదెల్పి

నది. కాని బ్రహ్మచారి తిరిగి యేమియో తెలుపఁబోవుచున్నాఁడు.—
అపుడు పార్వతి పల్కిన వాక్యములివి.

పెద్దలను నిందించువతఁడును, ఆనిందను వినువతఁడును, నిరువు రును పాపాత్ములే యగుదురు. (ఇది సాధనమును తెల్పు వాక్యము) అందుచే నీతనినిఁక మాటాడకుండునట్లుచేయుము. (ఇది సాధ్యమును దెల్పువాక్యము). ఇచట హేతుబోధకవాక్యమునందు, పంచమీవి భక్తిగాని, యథా, యతః అనుశబ్దములుగాని లేకుండుటచే నిందలి సాధ్య సాధనభావము, శాబ్దముగాదనియు, నార్థమేయనియుఁ దెలియవలెను. మఱియొక యుదాహరణము.

"దివం యది ప్రార్థయసే వృథాశ్రమః
పితుఃప్రదేశా స్తవ దేవభూమయః
అథోపయన్తారమలం సమాధినా,
న రత్నమన్విష్యతి మృగ్యతేహి తత్''.

కుమారసంభవము.

మాయాబ్రహ్మచారి, పార్వతితో ప్రసంగించుచు, నీవు తపస్సుఁ జేయుట వ్యర్థమని నిరూపించుచున్నాఁడు —

అర్థము. ఓపార్వతి! యది, దివం ప్రార్థయసే=నీవు స్వర్గమును కోరుచుంటివా? (అగుచో) శ్రమః=నీయొక్క కష్టము, వృథా=వ్యర్థమే (ఏలన) తవపితుః ప్రదేశాః=నీతండ్రియగు హిమవంతుని ప్రదేశములే దేవభూమయః=స్వర్గములు, స్వర్గమనునది, ఎచ్చటనో దూరమున నున్నదిగాదు—పరాధీనమునుగాదు—నీతండ్రియగు హిమవత్పర్వత ప్రాంతములే స్వర్గమగుటచేత, దగ్గఱగను, స్వాధీనముగనేయున్నది. అందుచే నీతపశ్శ్రమ వ్యర్థమనిభావము)—అథ=అట్లుగాక, ఉపయన్తా రం ప్రార్థయసేయది=వరునభిలషించి తపస్సుచేయుచుందువేని, సమా ధినా అలం=తపస్సుచాలును—(ఏలన) రత్నమ్ = రత్నము, న అన్వి ష్యతి=తన్నెవరుగ్రహింతురాయని వెదకదు —తత్ మృగ్యతే హి= అదియే వెదుకఁబడునుగదా!—(నీవును స్త్రీరత్నమవు. అందుచే నిన్ను

వెదకుకొనుచు వరుఁడు రావలసినదియేగాని నీవు వరు నన్వేషించుటు యుచితముగాదని భావము)

ఇందు స్వర్గముకొఱకై తపస్సువ్యర్థము-ఇదిసాధ్యము-నీతంఁడ్రి ప్రదేశములే స్వర్గము-ఇదిసాధనము; వరునికొఱకు తపస్సువ్యర్థము-ఇది సాధ్యము-స్త్రీరత్నమైన నీవు వెదుకఁబడవలెనేకాని, వరుని నన్వేషింప రాదు-ఇది సాధనము-ఇచటగూడ హేతుత్వమునుఁ దెల్పుటకు పదము లుగాని పంచమ్యాది విభక్తులుగాని లేవు. అందుచే నిందును నార్థమైన సాధ్యసాధన భావమేగలదు.

ఇంతవఱకుఁ దేలినది. పదముయొక్క యర్థము వాచ్యమే యగును. గాని యెప్పుడును నను మేయము గాదు. కావ్యార్థము వా చ్యమును నను మేయమును నగును. ఇందు వాచ్యమగు వాక్యార్థము నందు సాధ్యసాధనభావ మెట్లెన్నివిధము లుండునో చూచినాము. అనుమేయార్థమున కుదాహరణము.

"సువర్ణపుష్పాం పృథివీం చిన్వన్తి పురుషాస్త్రయః
శూరశ్చ కృతవిద్యశ్చ యశ్చ జానాతి సేవితుమ్"

అర్థము:- శూరశ్చ=వీరుఁడును, కృతవిద్యశ్చ=విద్యయందుఁ బరిపూర్ణుఁడును, యశ్చజానాతి సేవితుం=ఇతరులను సేవించుట నెఱిఁగిన వాఁడును, అనుత్రయః పురుషాః=ముగ్గురుపురుషులు, పృథివీం=భూమిని, సువర్ణపుష్పాం=బంగారుపూవులఁ బూయుదానిగా, చిన్వన్తి=చేయు చున్నారు-

ఇందుశూరాదులకు, సంపదలన్నియెడలను సులభములే యను నీ యర్థ మనుమేయమే యనువిషయము ముందు నిరూపింపఁబడును.

అనుమితానుమేయార్థము:-

"పత్యుః శిరశ్చన్ద్రకలామనేన స్పృశేతి సఖ్యా పరిహాసపూర్వమ్
సా రంజయిత్వాచరణౌ కృతాశీః మాల్యేన తాంనిర్వచనం జఘాన॥
కుమారసంభవము,

సందర్భము:-పార్వతియొక్క నెచ్చెలి, పార్వతి పాదములకు లాక్షారస మునుఁబూసి యామెతోనిట్లు పరిహాసోక్తులాడుచున్నది-

అర్థము:- సఖ్యా=సఖిచేత, చరణౌ, రంజయిత్వా=పాదములకు లాక్షారసము బూయఁబడిన తరువాత, అనేన=ఈపాదముతో, పత్యుః= భర్తయొక్క, శిరశ్చన్ద్రకలాం=శిరసుననున్న చన్ద్రకలను, (సురత సమయమునందు) స్పృశ=స్పృశింపుము (తన్నుము) ఇతి=అని, పరిహాస పూర్వం=ఎగతాళిగా, కృతాశీః=ఆశీర్వదింబఁబడిన, సా=పార్వతి, తాం=ఆసఖిని, మాల్యేన=పుష్పమాలతో, నిర్వచనం=మౌనముగ నుండియే, జఘాన=కొట్టెను.

ఇచట పాదములకు లాక్షారస రంజనమైనతరువాత, సఖి, పార్వతిని పరిహాసపూర్వముగ నాశీర్వదించినది-ఇది విభావము. పార్వతి తిరిగి పలుకకయే, పూలమాలతో నాచెలికత్తెను కొట్టినది-ఇట్లు సేయుట, యామెయందలి శృంగారరసమున కంగమగు ♦ "విహృతము"అను ననుభావమును తెల్పును.

ఈవిహృతమను ననుభావమువలన, పార్వతియందలి కౌతుకము, ఔత్సుక్యము, ప్రహర్షము, లజ్జ మొదలగు వ్యభిచారిభావ సంపద యనుమేయ మగుచున్నది-అనుమీయమానమగు నీవ్యభిచారిభావ సమ్పద నుండి తిరిగి, ఈశ్వరునియందుఁ బార్వతికిఁగల"రతి" యనుమేయమగును. ఇట్లిచట, మాల్యతాడన రూపమగు విహృతమను ననుభావమునుండి కౌతుకాదివ్యభిచారి భావములును, వీనినుండి. శివవిషయకరతియు ననుమేయము లగుచున్నవి.

మఱియొకయుదాహరణము:-

"ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ
లీలాకమల పత్రాణి గణయామాస పార్వతీ".

సందర్భము:-శివునియాజ్ఞ ననుసరించి, సప్తర్షులు, పార్వతిని శివుని కొఱకు యాచించుటకై హిమవంతునిదగ్గరకు వెళ్ళినారు. అందులో

♦ విహృతము:— "విహృతం ప్రాప్తకాలస్య వాక్యస్యాకథనం హ్రియా" సిగ్గుచే నవసరోచితమగువాక్యమునుపలుకక యూరకుండుటను విహృతమనియందురు"

నంగిరోమహర్షి హిమవంతునకు తమ యభిప్రాయమును జెప్పినాఁడు. శివపార్వతుల దాంపత్య మెన్నఁదగినదిగ నుండుననినాఁడు-ఈవాక్యములను వినుచున్న తండ్రి ప్రక్కనేయున్న పార్వతిని కవి వర్ణించుచున్నాఁడు.
అర్థము:- దేవర్షౌ = అంగిరోమహర్షి, ఏవం వాదినిసతి = ఇట్లు చెప్పుచుండఁగా, పితుః పార్శ్వే = తండ్రిప్రక్క (నున్న) పార్వతీ = పార్వతి, అధోముఖీ = తలవంచుకొనినదై, లీలాకమలపత్రాణి = ఆడుకొనుటకుఁ దెచ్చిన కమలపత్రములను, గణయామాస = లెక్కపెట్టెను.

ఇచట దేవర్షి యిట్లు పలుకుటయు, తండ్రి ప్రక్కనుండుటయు విభావములు. (కారణములు) పార్వతి తలవంచుకొనుటయు, లీలాకమల పత్రములను గణించుటయు ననుభావములు (కార్యములు)- వీనివలన ననుమేయమైనది, లజ్జయనెడు వ్యభిచారిభావము- ఈ వ్యభిచారి భావమునుండి, తత్సాహచర్యమువలన "రతి" యను స్థాయిభావ మనుమిత మగుచున్నది.

మఱియొక యుదాహరణము.

ప్రయచ్ఛతోచ్చైః కుసుమాని మానినీ, విపక్షగోత్రం దయితేన లంభితా
న కించిదూచే చరణేన కేవలం లిలేఖ బాష్పాకులలోచనా భువమ్.

సందర్భము—నాయికానాయకుల జీవితములో నొక సంఘటనము.

అర్థము—మానినీ=సహజముగ నభిమానవంతురాలగు నొకతె, ఉచ్చైః కుసుమాని=ఎత్తుననున్న పుష్పములను (ఆమె కందకపోవుటచే, తాను కోసి యిచ్చుచున్న) ప్రయచ్ఛతా=ఇచ్చుచున్న, దయితేన=ప్రియునిచేత, విపక్షగోత్రం లంభితాసతీ=సవతిపే రుచ్చరింపఁబడుటనుఁ దెలిసికొని, నకించిత్ ఊచే=ఏమియును పలుకలేదు- బాష్పాకుల లోచనా=కన్నీటితో నిండిన నీరుకలదియై, భువం=భూమిని, లిలేఖ= గీఱెను.

ఇచట, గోత్రస్ఖలనము విభావము. మౌనము వహించుట, కన్నీరుదయించుట, భూమిని గీఱుట- ఇవి యనుభావములు- వీనివలన అసూయ, అనుతాపము, లజ్జమొదలగు వ్యభిచారిభావము లనుమేయ

ము లగును- ఇవి తత్సాహచర్యమువలన- ఈర్ష్యావిప్రలంభమను మేయమగును.

అనుమాపకానుమేయముల క్రమత :—

పైని నిరూపించిన దానివలన, సాధ్యసాధనభావార్థముగల వాక్యార్థమున, సాధ్యార్థప్రతీతికిని, సాధనార్థప్రతీతికిని క్రమము గన్పట్టుచునే యున్నది. ఇటులే, వస్త్వలంకారరసములలో, వస్త్వలంకారములనుమేయములగునపుడు గూడ, సాధ్యసాధనములకు, (లేదా అనుమాపకానుమేయములకు) క్రమము, గన్పడుచునే యుండును. ఇక రస, భావ, రసాభాసము, లనుమేయము లగునపు డనుమాపకానుమేయములకు క్రమతయున్నను, గుర్తింపవీలుకాని దగుటచే, నానందవర్ధనాదులచట క్రమతలేదని భ్రాంతినొందినారు. గమ్యగమకములు రెండు నొకే సారి మనకు గోచరించునని యెంచినారు. అందుచే గమ్యగమకములకు వ్యంగ్యవ్యంజకభావమును వా రంగీకరించినారు. ఈ వ్యంగ్యవ్యంజకభావమునకే ధ్వనియని నామకరణముఁ జేసినారు. కాని యీ ధ్వని యను నామకరణ మిచ్చుట యౌపచారికమే (అప్రధానమే) యగును గాని, ముఖ్యముగాదు. ఈ నామమిట ముఖ్యముగనే యున్నదని నాదించుట కూడదను విషయమును ముందు నిరూపింతుము. అగుచో నది వ్యంగ్యముకాని దాని యందు వ్యంగ్యమను ప్రయోగము నుండుట వలన ప్రయోజనమేమి? యను శంక కలుగవచ్చును. సహృదయులకు చమత్కారము గల్గుటయే యీ ప్రయోజనము.

వ్యంగ్యవ్యంజకభావమునకు ముఖ్యస్థలము, వ్యక్తివిషయములగు చిత్రపుస్తకాదులు. అనఁగాఁ జీకటిలోనున్న చిత్రపటముగాని, మఱి యొక చిత్తరువుగాని, ప్రదీపాదిప్రకాశమువలన నభివ్యక్తము లైనపు డొక్కసారిగ నాశ్చర్యచమత్కారములు గల్గును. అటులే యింతకుఁ బూర్వ మనభివ్యక్తములై యున్న శృంగారాదిరసములు, కావ్యనాట్యములయందు దభివ్యక్తములై, యానందము నిచ్చుటచే, రసాదులయందు గూడ నీవ్యంగ్యవ్యంజకభావసంబంధ నిమిత్తమగు ధ్వనియను నామ మౌపచారికముగ ప్రయుక్తమైనదనియే తెలియవలెను.

హాలకు క్త్రిమతీ''ఘట్టము, రెండు రసాభాసములే. అయినను ఆడువి యచట బలవంతము చేయుటలోను, మగవాడు బలవంతము చేయుటలోను గల క్రియలు లౌకికక్రియానుకృతములు. ఈ రీతి క్రియానుకృతియు నడచును.

ఇంకొక రీతిగను ప్రకృత్యనుసరణము జరుగును. ఒక ఘట్టమును, ఒక దృశ్యమును వర్ణించునపుడు ఒకవ్యక్తిని మన మనస్సులోఁ బ్రవేశింపఁ జేయ వలసినయెడల లోకములో నున్నవారి మానసికవృత్తు లెట్లుండునో అట్టి మానసిక వృత్తులను గావ్యములో వర్ణింప వలయును. నారదతుంబురుల గానస్పర్ధ కనిన నియ్యాదితెల్లము.

శ్రీకృష్ణసత్యలు తుంబురుని గానము నేకాంతముగా వినుచుండిరి. నారదుఁ డనును.

క. మ మ్మెల్లఁ దోలి యొక్కని
నిమ్మెయిఁ బిలిపించి హరియు నిందిరయుఁ గడున్
సమ్మదమునఁ దుంబురుగా
నమ్మును వినుచుని కి విని మనం బెరియంగన్.

ఏనొక్క మఱుంగునం గొంత తడవు గనిపెట్టుకొని యుండ,

సీ. అనిపెనా యేమిచ్చె ననుచును సంభ్రమం
బున సందడించుచు మూఁగువారు
సర్వేశ్వరుండు శ్రీసతితోడ గానంబు
వినుసఁట యదుగనే లనెడివారు

గదునను గ్రహము నెక్కడ లేని యీ యాగి
పనయఁదెల్పెను నంచుఁ బలుకువాఁడు
నీవొక్కఁడవొ మఱి యెవ్వారలైన
నరమ్యేడనుండిరో యని యడుగువారు
ఆ. నగుచు సురలు మునులు నరుదంద మేపూఁత
డంబుతోడ వచ్చెఁ దుంబురుండు
కడలవారిని గనకస్నాన మాడించు
పదకమును సునేత్రపటముఁదాల్చి.
క. ధగధగయను పదకంబున
నిగనిగయను క్రొమ్మెఱుంగు నేత్రపటమునన్
భుగభుగయను మేపూఁతన్
భగభగ యనిపించె నతఁడు నాహృదయంబున్.
సీ. తనుఁగ్రమ్మఱంగ బిల్చిన వేళయందనా
తో విచారింపక పోవు టెట్లు
పోయెఁబో నసుఁబిల్వఁ జేయక తానొక
నెఱజాణమై విద్య నెఱపు టెట్లు
నెఱపెఁబో ప్రభువు మన్నించినాఁడని
మీఁదు పరికింపకే సొమ్ము పట్టు టెట్లు
పట్టెఁబో దొంగఁ దేల్గుట్టిన ట్టివి దాఁచి
కొంచుఁ బోవక మెఱయించు టెట్లు
గీ. లేఁడు తగవరి యెందును మూఁడి చొచ్చి
వాత వెడలెడు వాఁడె యెవ్వాఁడు నంచుఁ
బాపి ! తుంబురుఁడా ? యంచుఁ బండ్లు కొఱుకు
కొంచుఁ లోలోన నుడికితిఁ గొంతతడవు.
ఇంతవఱకుఁ దుంబురుని యసూయ, ఈర్ష్యాగుణములు వర్ణితమయినవి.

చ. తలఁగక యిప్పు డిట్లు సముదగ్రతఁ జేసిన యీర్ష్యాబుద్ధి లో
పలన యడంచి మైత్రి గనుపట్టఁగ నింకను గొంతకాల మో
కలు ఘటియించి యే నతని గానములో గుణదోషవర్తనల్
తెలియుట నీతి యీతెలివి లేకగునే జయ మంచు నెంచితిన్.

అని దొంగవాకిటికి మంచము వేసి, తుంబురుఁడు వీణ మేళవించి లోనికిఁ జనినపుడు నారదుఁ డేఁగి వీణ వాయించి చూచి దాని యపూర్వశ్రుతి రామణీయకత కచ్చెరువడి అంతరంగములో నిట్లు భావించెను.

మ. కడుఁ బ్రావీణ్యధురీణుఁ డీతఁ డయినం గాంధర్వసంపూర్తి నె
ల్లెడఁ బ్రఖ్యాతి వహించునాకు నకటా యీతుంబురుం డంతె యె
క్కుడుగాఁ గానము నేఁటిదాఁక నని సంక్షోభించుచుం దాఁ డీడ
న్నెడు వానిం దలఁ దన్నువాఁడు గలఁ డన్వేషింప నం చెన్నితిన్.

చ. అట మును చెల్మి పెంపు దనరారఁగ నేనును దాను నప్పట
ప్పటికిని గూడి పాడుదుము పద్మభవాదులయొద్ద నప్పుడె
చ్చటఁ దనకింత గానకళ సంపదకల్మి యెఱుంగనీఁడ ము
చ్చటపడి యిట్లు విష్ణుఁడు ప్రసన్నతఁ దాఁ బిలిపించునంతకున్.

క. తను విద్య నెవ్వ రేమా
త్రము గనఁ జాలుదురు వారిదండను దన్మా
త్రమ ప్రకటింతురు బుధు లు
త్తములమహిమ నీరుకొలఁ దిఁదామర సుమ్మీ.

క. ఇటుగాక విను జనంబుల
పటిమకు నెక్కుడుగ విద్య పచరించుట య
క్కట విఫలముగాదే యె
చ్చటఁ జెవిటికిఁ బట్టినట్టి సంకును బోలెన్.

ఈ రీతిగ లోకములోఁ బ్రతిస్పర్ధుల మనోభావములు, మనఃప్రవృత్తులను అనుకరించుట కలదు. మూర్తికళలోను, చిత్రకళలోను ప్రకృత్యనుకరణ సంపూర్తిగా నుండియుండు ననునది యీప్రస్తావమున వ్రాయుదును.

ఒకరి నొకరనుకరింత మనుదృష్టి లేకయే ఒకేరీతిగ నుండుకళ వెలువడినను అయ్యదియు హృద్యముగ నుండును. వారు సృష్టించిన కళలో నెయ్యది గొప్ప దనునది నిర్వచింపలేము. అటుల నుండుట యాకళకు ఘనత. పింగళి సూరనార్యుఁడు పదునాఱవ శతాబ్దిలోనివాఁడు రంభాప్రతిరంభలను సృష్టించి భారతదేశములోఁ గళ నావిష్కరించి ఆనందింపఁ జేసిననాఁడే బ్రిటన్‌లో షేక్‌స్పియర్ Much ado about nothing. అను నాటకములో నిద్ద ఱన్నదమ్ముల నొక యాకృతి వారలను వారియొక్క సేవకుల నొకే యాకృతివారల సృష్టించి కయ్యము లాడించి కళ కట్టించినాఁడు. అందఱు నీనాఁడును "బళా" అనుచుండిరి.

ఒకే వర్ణ్యాంశమును వర్ణించుచు,

శ్లో. స్విన్నం మండల మైందవం విలులితం స్రగ్భారనద్ధం తమః
ప్రాగేవ ప్రథమానకైతకశిఖా లీలాయితం సుస్మితం
శాంతం కుంతలతాండవం కువలయద్వంద్వం తిరోమీలితం
వీతం విద్రుమసీత్కృతం నహి తతో జానే కిమాసీదితి,

అని కాళిదాసు రచింప,

శ్లో. ముక్తాభూషణ మిందుబింబ మజని వ్యాకీర్ణ తారం నభః
స్మారం చాప మపేతచాపల మభూ దిందీవరే ముద్రితే
వ్యాలీనం కలకంఠమందరణితం మందానిలై ర్మందితం
నిష్పంద స్తబకా చ చంపకలతా చా భూ న్న జానే తతః.

అని భవభూతియు నాతీరుననే వర్ణించియున్నాఁడు. ఎయ్యది యందముగా నున్న దనునది నిర్ధారించుట సభ్యులకుఁ గష్టప్రాయమయినది. వాగ్దేవికూడఁ గలుగఁజేసికొన వలసివచ్చినది. (ఇది లోకాయతికులు, లౌకికులు, నగు నిదానీంతనై తిహాసికు లొప్పరు.)

అహో! మే సౌభాగ్యం మమచ భవభూతేశ్చ ఫణితౌ
ఘటాయా మారోప్య ప్రతిఫలతి తస్యాం లఘిమని
గిరాం దేవీ సద్యస్స్ఫుట ఘటిత కల్హారకలికా
మధూళీమాధుర్యం క్షిపతి పరిపూర్త్యై భగవతీ.

ఈరీతి సంవాదములు, అనుకరణలునుండిన నుండవచ్చునుగాని, అంధాను కరణము మాత్రము పనికిరాదు అని తేల్చుకొంటిమి.

## లలితకళలు—సాహితి

అనుభవము రెండువిధములుగ లోకములోఁ గలుగును. ఇంద్రియములు బాహ్యప్రపంచములోఁ జరించుచు నాయాయివిషయముల తోఁ గలసి తమ విషయముల నందఁజేయఁగా మనస్సు నా విషయముల ననుభవించును. ఇది యొకరీతి. ఇట్టి బాహ్యవిషయసంపర్క మక్కఱ లేకయును అనుభూతులు కలుగును. వానికి నిత్యము వస్తువులతో సంబంధ మవసరము లేదు. ఒక్కసారి మనస్సులో ముద్రపడిన నాయను భూతులే క్షణక్షణమును స్మృతిపథములోఁ బడి యానందమును గలిగించును. మనస్సు నానందపరవశముగాఁ జేయును. ఆరీతిగఁ గలుగుట కష్టము. అతఁడు సహృదయుఁడు. ఆరీతి నానందము కలిగించు కళ సృష్టి మగుటయుఁ గష్టము. ఒక్కసారి గోచరించి సదాతనముగా హృదయ కుహరములో నినదించుచు స్థాయ్యానందము నిచ్చు కళాప్రభావ ముచ్చకోటికిఁ జెందినది. ఆరీతి కళాకారుఁడు గొప్పవాఁడు కావుననే, అట్టి కళాకారునిచే సృష్టమయిన కళ లోకోత్తరమయినది. కావుననే ఆ కళవల్లఁ గలుగు నానందము విలక్షణమయినది కావుననే ఆ కళలను లలితకళ లని యందురు. ఆకళలు తమ యాశ్రయములోను తమసామగ్రి లోను, తమ సృష్టిలోను, తాము కలిగించు నానందములోను, తమ యుపయోగములోను లాలిత్యము, కోమలత, కలిగియుండును; గావుననే "లలితకళ" లని పిలువఁబడుచున్నవి. ఆలలితకళలలో మొదట సాహితీ కళకు వత్తము.

ఈ కవితాకళకు అందము పరాకాష్ఠ దేనియందున్నదని అనేకులు కళాస్రష్టలు, కవులు, ఆలంకారికులు విమర్శించి, భిన్నభిన్నముగా రుచించి చెప్పిరి అయ్యదియ కావ్యమున కాత్మ యెద్ది అను పేరుతో

వెలువడినది. కొందఱు రచనాగత మనిరి. మఱికొందఱు గుణగత మనిరి. అలంకారములలో, వక్రోక్తిగత మని, ఉదాత్తగత మని, శ్లేషగత మని, అనిరి. రీతిగత మనినవారు, వృత్తిగత మనినవారు లక్షణాగత మనినవారును గలరు.

చమత్కారము కావ్యసామగ్రిలో దేనియందుఁ గలదను ప్రశ్న మూలముగా నీ విమర్శయంతయు బయలు వెడలినది. తుదకు రసము ప్రధాన మని రాద్ధాంతీకరించిరి. రసము ప్రధానము ఆత్మ అనిరి. మిగిలినవి శరీరము వంటివి ఆనంద మనుభూతులవలనఁ గలుగును. కావ్యము వలన ఆయనుభూతి, రసపరిణామము. రసచర్వణవలన మనస్సులో జరుగును ఆ యానందానుభూతిని వెల్లడించుటకు సాధనసామగ్రులు కావ్యములో నక్షరములు, పదములు, రీతులు, వృత్తులు, గుణములు, అర్థము, తద్భేదము, విభావానుభావాదులు, అలంకారములు మొదలయినవి లోకములో మనుజునకు శరీరము, తత్తదవయవములు, ఆయా యియలంకరణములు, మానసికవృత్తులు, మానసిక పరిస్పందములు, బాహ్యజగత్తునఁ గల వస్తువులు ఉద్దీపకములయి రసచర్వణకు సాయపడి, ఆత్మనిష్ఠమగు నానందమును వెల్లడించునట్లు రసజననము, రసచర్వణ తద్ద్వారా ఆత్మనిష్ఠానందాభివ్యక్తికిఁ గారణము. కావ్యసామగ్రి యంతయు నని అచటికి వచ్చి ఆఁగిరి. ఇంతకు రసము నభివ్యక్తిచేసి ఆనందమును గలిగించుటయే కవితలోఁ గళ యని చెప్పఁబడును.

సాహితీకళకు సామగ్రి అందఱికవులకు నొక్కటియే. అది శబ్దరూపము. శబ్దము పంచాశదక్షరాత్మకము. అక్షరము లొక్కటియైనను పదము లందఱకు ఒక్కటియైనను వానిలోనుండి వెలువడి ధ్వనించు నర్థము హృదయాహ్లాదము కలిగించును; మైమఱపించును. విగళితవేద్యాంతరమయి బ్రహ్మానందసబ్రహ్మచారిగా నుండు నానందమును గలిగించును. స, రి, గ, మ, ప ద, ని లను నేడక్షరలలో నిమిడియే సంగీతము వెలువడును. ఈయేడు స్వరములు ప్రసిద్ధకళాకారునికి లొంగి

ఆరోహణావరోహణక్రమములనొందును. అర్థస్ఫూర్తి అక్కఱ లేకయే, వెనుకటి కళవలె నానందము కలిగించును. కావ్యకళకుఁ బంచాశదక్షరములు, గానమునకు సప్తస్వరములు, అందఱకు నుపాదేయము లయి నట్టులనే చిత్రకారునకు రంగులుగూడ నేఁడు నుపయుక్తములయి రసనిష్యందమును అర్థాభివ్యక్తి యపేక్షలేకయే ఆనందమును గలిగించును. ఇయ్యవి యన్నియుఁ బ్రసిద్ధకళాకారునిచే నావిష్కరింపఁబడినప్పుడే దృశించు పదార్థము, అభివ్యక్తమగురసము, ఉన్నసామగ్రికంటె విలక్షణము. అన్ని సామగ్రులు కళ కుండవలసినవి యున్నను రసస్ఫూర్తి చేయలేని నాఁడు, కళ కాదని త్రోసివేయవచ్చు ననినారు రసగంగాధరకారుఁడు ధ్వనికారుఁడును.

ప్రతీయమానం పున రస్యదేవవ స్త్వస్తి వాణీషు మహాకవీనాం
యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం విభాతిలావణ్యమి వాంగనాసు, అని.

సాహిత్యాకాశములలో ననేకములగు గ్రంథతారలు లేచినవి. వానిలోఁ గొన్నిమాత్రమే ధ్రువతారలవలె మెఱయుచున్నవి. కొన్ని మిన్కు మిన్కుమనుచు నున్నవి. అద్దియులేక అణఁగిపోయిన వున్నవి. దానికిఁ గారణము ఒకే యంశముపై దృష్టినిడి దానికై తనధీసామగ్రిని వెచ్చించుటచేఁ గళకు పూర్ణరూపములేక అందము చూర్ణమయిపోయి హస్తిపాదమువలె నొకచోటఁ గేంద్రీకృతమయి వికృతిగాఁ దయారు కాఁగలదు. అనఁగాఁ గొందఱు కథ నడపుటలోనే రచనాశక్తిని వెచ్చింతురు. కొందఱు యమకాదులలోనే బుద్ధిని గోల్పోదురు. కొందఱు భావగుప్తిలోనే మణఁగిపోదురు. కావ్యలక్షణము లన్నియు నుండవలెనని యన్నిటి నతిగా వర్ణించి, వర్ణన లుండఁగూడదని దుష్టముగాను నగ్నముగాను వర్ణింతురు. అలంకారములే అందమిచ్చునని అలంకారము లన్నియుఁ గావ్యశరీరమునిండఁ గప్పివైతురు. ఎవరియిష్టము వచ్చినట్లు

వారు తమ సొత్తుగాఁ గళ నొనర్చుకొని వారి శక్తికొలఁది కళాసృష్టి యొనరించి "కళకట్టితి మనిపించుకొనుటయే, కళకు వలయు నూత్న రామ ణీయకత కాని, ప్రతిపద్యములోను చాతురిగాని, రచనాసిద్ధహస్తతత కాని కల్పనానైపుణిగాని, లేకపోవుటచే వారు మేము కళాకారుల మను కొనినను కళాకారు లనిపించుకొనలేరు ఇట్లు వారికళ వీధికిరాక వారిలో లీనమయిపోయినది.

కళాప్రయోజనము.

కళాకారుని దృష్టిభేదముచేతఁగూడఁ గళకు మార్పులు వచ్చును. కావ్యకళవిషయ మాలోచించిన దాని యుద్దేశము చమ త్కారముగా నర్థతత్త్వమును వెలువఱిచి భావుకాంతరంగమున నిలు చుట సహృదయహృదయాహ్లాదము చేయుట యని జగన్నాథరాయలు.

శ్లో. యద్వేదా త్ప్రభుసమ్మితా దధిగతం శబ్దప్రధానా చ్చిరం
యచ్చార్థప్రవణా త్పురాణవచనా దిష్టం సుహృత్సమ్మితాత్
కాంతాసమ్మితయా యయా సరసతా మాపాద్య కావ్యక్రియా
కర్తవ్యే కుతుకీ బుధో విరచిత స్తస్యై స్పృహాం కుర్మహే.

"రమణీయార్థప్రతిపాదకశ్శబ్దః కావ్యం" అనుదాని విస్తృతరూప మియ్యది. వేదమునందు రాజశాసనముగాఁ జెప్పఁబడిన "ధర్మం చర అనునది.

యాంతి న్యాయ ప్రవృత్తస్య తిర్యంచోఽపి సహాయతాం
అపంథానంతు గచ్ఛంతం సోదరోఽపి విముంచతి.

"రామాది వద్వర్తితవ్యం; న రావణాదివత్" అని మిత్త్రునివలె పురాణ ము బోధింప నద్దానిని శుష్కమయినదానిని విషయమును జూచునరికి భయపడువారలకుఁగూడ, సరళముగా సరసముగా, ఉపాదేయముగా నొనరించి, కావ్యము హృద్గతము గావించును. ఆరీతిని కావ్యముఖము నుండి వెలువడినది స్థిరముగ నిలుచును. కావ్యోద్దేశ మటులుండఁ గావ్య ప్రయోజన మేమియో చూతము.

శ్లో. కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతా సమ్మిత తయోపదేశయుజే.

(మమ్మట

చతుర్వర్గఫల ప్రాప్తిః సుఖా దల్పధియామపి
కావ్యాదేవ యతస్తేన త త్స్వరూపం నిరూప్యతే. )

(విశ్వనాథ కవిరాజు)

కీర్తి, వ్యవహారజ్ఞానము, ధర్మ, అర్థ, కామ, మోక్షములు కావ్యము వలనఁ గలుగును. ఉత్తమానందప్రాప్తి కలుగు నని కవితాకళాస్రష్టల నిశ్చితి. కావ్యకళ కని విభాగము లేకుండఁగఁ గళాసామాన్యమునకుఁ బ్రయోజనము లాలోచించిన—

౧. Art for arts sake కళ కళకొఱకు.

౨. Art for lifes sake కళ జీవితముకొఱకు.

౩. Art as an escape from life జీవితములోని వాస్తవపరిస్థితినుండి తప్పించుకొనుటకు కళ.

౪. Art as an escape into life నీరస వ్యవహారములనుండి తప్పించుకొని ఆనందములోనికి వెళ్లుటకు.

౫. Art for service sake సేవకొఱకు కళ.

౬. Art for self realisation కళ ఆత్మానుభూతికొఱకు.

౭. Art for joy కళ ఆనందము కొఱకు.

౮. Art as recreation కళ వినోదమునకు.

౯. Art as creative necessity సృజనప్రవృత్తిని తృప్తిపఱచుకొనుటకొఱకుఁ గళ.

౧౦. Art for markets sake అమ్మకమునకుఁ గళ.

౧౧. Art for vulgaritys sake అశ్లీలముకొఱకుఁ గళ.

౧౨. Art for dissipation's sake అవినీతికొఱకుఁ గళ

అనవలపివచ్చును.

కళ కళకొఱకు, అనువారిని సమాజమేమియు నడుగ నక్కఱలేదు. అడిగినను నాయిష్ట మందురు. కళకు నాశము నియమము లున్నపుడు, ఒరు లేమియేని యడుగుదు రేమోయను భీతియున్నపు డగునని వారనియెదరు. సరే! నియమనీతు లుల్లంఘించినతరువాత కళాసృష్టి యెంతవఱకు జరిగినది? ఎంతవఱకు నానందమును సంపాదించినది? అది యెంత యున్నతస్థితిలోనికి వచ్చినది? ఆరీతిని వెలువడినకళ, "కళ కళ కొఱకే" అను ప్రయోజనమునైనను బొందినదా? అని ఆ కళాకారు లను బ్రశ్నించిన నదియుఁగూడ మన్ముల నడుగవలవనియే వారి యూహ. ఇతరప్రయోజనములతో వెలువడిన కళ కొంతవఱకునైనఁ బెంపొందినది. పూర్ణతను బొందిన దనవచ్చును. నేను కళ నీ ఒక్కని కొఱకు సృజించుచుంటిని. నీకు నేను గళ నొసంగిన నీవు నా కేమిచ్చెద వనిన రోజునకు Art for market's sake అను రోజునకు కళ పూర్తిగా విలయమొందినది. కొన్ని దృష్టిభేదములచేఁ గళ కున్నస్థితి నశించినది.

ఇంతకును గావ్యము ఆత్మానందమును బైకి రేపి శరీరమంతయు నిండింపఁగలదు. ఇట్టి ఆనందదాయకమగు కళకు వలసినసామగ్రిలో ముఖ్యముగ శిల్పిగత ప్రతిభావైశద్యము, కల్పనావైదగ్ధ్యము ఈరెండు చేసిన ఒక ఘట్టమును జూతము. కల్పితవిషయమును గూర్చి పింగళి వారిని బలుకరింతము.

సీ. మెఱుఁగెక్కి బిగువులై మీఁటిననవియున
    ట్లింపొందు గుబ్బపాలిండ్లతోడ
కడుఁ గృశత్వంబునఁ బిడికిటిలోపల
    నడఁగెడు బడుగునెన్నడుముతోడఁ
జిఱునవ్వు తెలినిగ్గు చిలుకుచుఁ దనరారు
    తళుకులేఁజెక్కుటద్దములతోడ
జగతి నెందును లేని చక్కఁదనాన సొం
    పగు చిన్నిముద్దు నెమ్మొగముతోడ

గీ. కరము విలసిల్లు సకలాంగకములతోడ
రహిఁ దనర్చునలంకార మహిమతోడ.

ఇంతవఱకు నడచిన నడకనుబట్టి ప్రబంధ స్త్రీ అనియెదము. కాదు. పింగళి వారి కావ్యములో శిల్పరచన యిది. ఆఁడుదే కాని ప్రతిమ యిది.

ద్వారశాఖలదండ నింపారుచున్న
ప్రతిమ నొక్కటిఁ జూచె భూపాలచంద్ర !

సుగ్రహుఁడు చూచుచుండఁగా నింతలో నొక సన్యాసి "హరిహరి" యనుకొనుచు మందిరము చేరుకొనినాఁడు.

సీ. ఆయతీశ్వరుఁడంత నతిరమ్యమైనయా
లెప్పంపుఁ బూబోఁడి యొప్పుఁజూచి
ఒళిర! శిల్పకులేంద్ర ! బ్రహ్మను మీఱి తే
పగిదిఁజేసితిర ! యీ ప్రతిమ ననుచు
తన మదిఁ గడుమెచ్చి తలయూఁచుచును నిట్టి
పడఁతులు గలరొకో పుడమి ననుచు
నిట్టిది సన్యాసి కీక్షింపఁ దగదని
మార్గమ్ముఁ బెట్టుచు మఱియుమఱియు

గీ. నిచ్చఁగ్రమ్మఱఁ జూచుచు నేమిచెప్ప
నతనువిక్రుతికి లోనయ్యె......

అనుచు నాలింగించుకొను నా ప్రతిమను. సుగ్రహుఁడు "కికాకిక" నవ్వెను. తన యవకరపుఁబనిని సన్యాసి తెలిసికొనును.

"తత్ప్రతిమాలింగనం బొక యదృచ్ఛాచేష్టావిశేషంబునుగాఁ గల్పించుటకుఁదాత్కాలికయుక్తి నద్దేవాలయంబున వెండియుం గల ద్వారికాదిప్రతిమల నట్ల యాలింగనముచేయుచు నమస్కరించి తత్ప్రదక్షిణంబు సేయం దొడంగిన."

సుగ్రీవుఁడా కపటచేష్టను గనిపెట్టును. తుదికి సన్యాసిచే శపింపఁబడును. అంతఃకొనియెద మనినను నీషుట్టనుఁ జనువుచున్న మనకు నవ్వాఁగదు. సుగ్రీవుని యవస్థ యా సన్యాసి యిప్పుడున్నచో మనకుఁగూడఁ నప్పదు. మనము నవ్వకతప్పదు. ఇది శిల్పిప్రతిభ. రచనాశక్తి. ప్రతిభా కౌశలము. అని నిర్ణయమునకు రావలయును. చమత్కారము, కల్పనలో, పాత్రపోషణములో రసముల అభివ్యక్తిలో నున్నది కనుక—

కల్పించువస్తువులు, చరితలు, వాస్తవములన వలయు నను నియమము లేదు. అటుల నియమించిన కళ కానేరదు. ఒక్కటిమాత్ర మున్నది. వాఁడు కల్పించునది కావున, ఆ కల్పితవస్తువులు ప్రత్యంశములు కళావిలసితములై, ఇంద్రియముల ద్వారా ఆత్మానుభూతిని వెలువరించునవై యుండవలెను. దానిలో నేలోటు వచ్చినను పానకములోఁ బుడకవలెఁ గష్ట మనిపించును. ఒక్కసారి ఏవగింపు కలిగించును. "శ్వేత్రే జై కేన దుర్భగం" అన్నట్లు.

కల్పనలో నిమగ్నుఁడయి కళను సృష్టించి లోకమున కందించినవాఁడు, కళనే సర్వస్వముగా నెంచినవాఁడు కళాకారుఁడని పేరొందును. వాఁడు కళను దనవశ మొందించుకొనఁగలుగును. తాను కళ నెట్లు సృష్టింపవలెనన్న నటుల సృజించును. కళ వానికి వశమైయుండును. కళకు వాఁడు మున్నే లొంగియుండును. అట్టి ఉత్తమకళాకారుఁడు గీటునకు వచ్చును. అంతియకాని నాదియే కళయని బిభీషికలు చూపఁడు. అట్టివాఁడు సమాజమునుగూడఁ జూడఁగలుగును. వారిని గూడఁదలలూఁపింపఁగలఁడు. అటులఁ జూచినవాఁడు సమాజమును బాగుపఱచును. సమాజమును జూడవలయునని, సమాజము బాగుపడవలెనని యూహ కలిగిన యుత్తమకళాస్రష్టను దాను చేరవలసినవాఁడు సమాజము ధన్యాతిధన్య మగును. ఎందువలననిన కళవలన సమాజములోఁ గలుగుమార్పు, వేదములు కరఁగిపోసినను, శాస్త్రము లుద్ఘోషించినను, చర్చలు వినిపించినను, రానేరదు. దీనికిఁ దార్కాణముగ బౌద్ధమతము

ను దీసినఁ దెలియును. ఆ మతకర్తలు శిల్పకళతో, సాహిత్యకళతో, సంగీతకళతో దేశదేశాంతరములలో వ్యాప్తినొంది, సమాజముల సన్నిటిని నొకే సూత్రమునకుఁ దీసికొని రాఁగలిగినారనిన నాఁటికి నేఁటికిఁ గళాప్రభావమే.

## కళ—నీతి—ఉపదేశకత

ఇంతకు సమాజమును బాగుచేయు నీతినుపదేశకత కావ్యమున కబ్బిన, కళకున్నచో; బంగారమునకుఁ దావి యబ్బినటులే. అట్టి కళాకారుఁ డగ్రస్థాన మందఁగలఁడు. మాకు సమాజముతో సంబంధము లేదనియు, కళను మా యిష్టము వచ్చినట్లు నడుపుదు మనువారిని గొందఱు మాత్రమే కళాకారులనుగా నొప్పుకొనియెదరు. మఱికొందఱు "వారు కళాకారులు కానేరరు. ఉత్తమసామగ్రి లేకపోవుటవలననే యటు లందురు" అని యనుటకు సాహసింతురు.

శృంగారరస మందఱకు సాధారణముగా ననుభవగోచరము. ఆ రసమన్న నందఱకు నిష్టమే. ఆఁడుది యనినను ఆఁడుదాని వర్ణన యనిన నందఱకు మైమఱపు గలిగించును. అటువంటి కావ్యములు వెలువడిన నందుకుఁ బ్రీతియే. అవియనినఁ గొట్టుకుపోదురు. అట్టితఱి నావిధమయిన కావ్యములు. (కావ్యములు, నాటకములు, నవలలు, నిబంధములు, గేయములు) శిల్పములు వెలువడిన నట్టికళ నెంటనే కళకట్టును. తెలుఁగునఁ బ్రబంధయుగమంతయు నీ రసముతో నిండియే నడచినది. అంతకంటె మించిన దీయుగము శృంగారముతో మిశ్రితమయి. అయిన నీ కాలమున వెలువడు ప్రబంధములు, కావ్యములు, వెనుక గుంఫితముగా వ్యంజనావృత్తిలో మిళితమయి వెలువడినకావ్యములు సామాజికలోకములో తమ యధికార మెంతవఱకుఁ గలిగియున్నవని, ఎంతవఱకు నాకర్షకములుగా నున్నవియని విమర్శించిన "గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్" అనిపించును. ఇప్పటి కళాకారు లయ్యది ఒప్పుకొనుచుండిరి.

అనఁగా వెనుకటి కళాకారుఁడు తనకళ నావిష్కారము చేయుటలోఁ దొందఱపాటులేక కళారచన సర్వాంగసుందరముగా నుండునట్లు భావించి, దానిని బోషించి, వికృతిని దూరీకరించి, లోటుపాటుల గణించి, ఔచిత్యానౌచిత్యములఁ బాటించి వ్యక్తపఱచెడివాఁడు. ఇప్పటి కళావిష్కార మాకాలికము. ఈకాలములోఁ గళయావిష్కృతమగుటఱకుఁ గళాకారునకు త్వరయే. కళకుఁ దొందఱ. భావుకుల కంతకంటెఁ ద్వర. కళను మఱఁగి కరగిపోవుటలోను ద్వరయ. అన్నియుఁ జంచలలీలల చాంచల్యమలవఱచుకొనినవి.

అట్టి చంచలానందమును గళ సృష్టించిన నా కళకు స్థాయిత్వము సున్న. లలితకళల కిట్టి చాంచల్యము పోయి, చపలత సన్నగిలి, స్థిరత రావలెనన్న నీతి ఉపదేశకత్వము లోఁబఱచుకొనినప్పుడే రాఁగలదు. కళ కుపదేశకత్వము, నీతి ఉండవలెనుగదాయని ప్రతిపద్యము ఉపదేశకము, నీతిబహుళము అయిన నవి యానుశాసనికపర్వము లయిపోవునుగాని కావ్యములు గానేరవు. వేదము లగును గాని కాంతాసమ్మితములగు కావ్యములు కానేరవు. కంచుగోడలతో నిర్మింపఁబడి అగమ్యగోచరములగు దుర్గములయిపోవును. దానిని కళ అనుటకంటె శాస్త్రము లనవలసివచ్చును, కళకుండవలసిన సౌష్ఠవముతో నిండి, తన పరిస్థితిని భావుకాంతరంగమున ముద్రించి, కళాపోషణమునకుఁ బనికివచ్చునట్లు నీతి ఉపదేశకత్వము ఉండిన నట్టినీతి, ఉపదేశకత్వము, చదువువానినాకర్షింపఁగలదు. ఆ రీతిగ నేది చెప్పినను హృద్యము, హృద్గతమగును. రామరాజభూషణుఁడు గిరికావసురాజుల కలయిక (శృంగారరసమును) ను వర్ణించిన ఘట్టమున,

మ. సతి సాహిత్యరహస్య మీశునలనఁ సాధించి తోడ్తోనఁ ద,
త్పతికిం బ్రత్యుపదేశమిచ్చె నతులపౌఢిన్ ధ్వనివ్యక్తిఁ ద
ద్ద్యుతికిం జొన్పుచు లోచనాంజనరసప్రోన్మేషముల్ తన్ముఖో
ద్గతముల్ సేయఁ గరంబలంకరణమాఖర్యంబు దీపింపఁ గన్.

ప్రకృతమునకు సరిపడునట్లుగాఁ జెప్పి కళకట్టించి భావుకులను తనపై

పునకాకర్షించుకొని ఆవెంటనే వేఱొకశక్తితో కావ్యలక్షణము. సాహిత్యలక్షణము నుపదేశించెను. సాహిత్య రహస్యవేత్త రచనలోఁ బ్రాప్తి, ధ్వని, ధ్వనిలో రసపోషణము. కలుగఁజేయవలెను. రసచర్వణకడ్డంకి లేకుండ, నుద్దీపకమగునట్లు ప్రీతి అలంకారముంచినను ఉంచవచ్చును కావ్యముఖమునుండి మాత్రము రసము వెలువడఁ జూడవలయును. అని చెప్పుచు నాయర్థము నుపదేశించుచున్నట్లు కానరాకుండఁ జెప్పెను. ఈరీతిగనతనిది మఱియొక పద్యముఁజూచి ప్రకృతమునకు వత్తము.

శా॥ భూనాథాగ్రణికి స్వధామణికి సంభోగాంతసౌఖ్యంబుబ్ర
హ్మానందానుభవంబుఁదెల్పె ననవద్యంబై యవేద్యాంతరం,
బై నిశ్లేషకలాపమై క్రమవిముక్తానేకబంధాను సం,
ధానంబై యపునర్భవప్రభవఖేదంబై విజృంభించు నుఁ.

ఇది సంభోగాంతవర్ణనము. అది ప్రాకృతము. అది అయినతరువాత దానిలో మోక్ష తత్త్వోపదేశముఁ జేసియున్నాడు.

"బ్రహ్మానందానుభవములో గర్హ్యత యుండదు. ఇతర వస్తు భానముండదు. ఏవిధమయిన బంధము లుండవు. అనావృత్తి శ్శబ్దాత్" అనువైయాసికసూత్రమును బట్టియు నపున రావర్తతే అను నుపనిషడ్డిండిమ మునుబట్టియు జన్మరాహిత్యము కలుగును. పునర్భవక్లేశ ముండదని చక్కనిరీతినిఁ జెప్పియుండెను. ఆరీతి నీత్యుపదేశకత్వము న్నను కళాపోషణ చక్కఁగ జరిగినది. ఈధోరణిలో సాఁగినకావ్యము చతుర్వర్గ ఫలప్రాప్తిని గలిగించు ననినను తగియేయుండును. అప్పుడు సాహిత్య దర్పణకారుం డనిన "చతుర్వర్గఫలప్రాప్తిః సుఖా దల్పధియా మపి కావ్యాదేవ"

అనునది వాస్తవమే యని యనిపించును. కావ్య మెప్పుడును మోక్షదము అర్థదము, ధర్మదము, కామదము కానేరదు. కావ్యము బోధించిన మార్గము నవలంబించినప్పుడే యేది కలిగినను. ఆరీతిగ నుపదేశకత్వము నీతి కళకుఁ గలిగించుట కష్టసాధ్యము.

## కళ — అలంకారములు.

కావ్యమునకు సొంపులు తీసికొని వచ్చుటకుఁ గొన్ని పరికరములు వాంఛనీయము లగును. వానినే శబ్దసామగ్రి, అర్థసామగ్రి, వ్యంగ్య సామగ్రి, అలంకారసామగ్రి, ఇంకను నెయ్యదియో యని పేరిడిరి. అన వలెనుకూడ. పై పద్యములు చమత్కరించినవి కావున నా పద్యములలో నందముండెనని ఒప్పుకొనవలయును. అట్టి ఆనందమును వినినాము. ఆనం దములోనికి వెళ్ళితిమి. విశిష్టముగా నాయానందానుభవ మగుచున్నంత సమయము నా పద్యములలో, నక్షరములున్నవో? పదములున్నవో? వాక్యములున్నవో? వాక్యార్థమున్నదియో? వ్యంగ్యార్థమున్నది యో? అలంకారములున్నవియో? ఏవియున్నవియో? అని విమర్శ కలుగదు. కలుగుట కవకాశము లేదు.

రసో వాక్యార్థ స్సన్ విలసతి పదార్థాః పునరమీ విభావాద్యాయస్మి
న్నిఖల దధతి విశ్రాంతి ముచితాం. "వాక్యస్ఫోటో ఽ తి నిష్కర్షః"

అనురీతిగ రసచర్వణ కలిగినది. ఆ యలౌకికానందము బ్రహ్మానందస బ్రహ్మచారికాని బ్రహ్మానందము కాదు; కావునఁ గొంతకాలము రసాను భూతి అయినతరువాత లౌకికదృష్టిలోనికి వచ్చి ఈ పద్యమున కింత సొంపుకూర్చినది యెద్ది? అను విమర్శ (ఆపరేషన్ హాలులోనికి వచ్చి, ఆపరేటర్సుతో ముక్కలక్రింద విడఁగొట్టి) మొదలిడి, ఆ ఆనందమిచ్చిన దానికి నలుగురకుఁ దెలియఁ జెప్పుటకయి లక్షణము కట్టి, ఇటులఁ జేసి నది వ్యంగ్యమనియో, శ్లేషయనియో, ఉపమ యనియో, వక్రోక్తి యనియో, ఉదాత్తమనియో, ఏదియోయొక సాంకేతికము నొనర్చిరి.

ఇట్టి సామగ్రి ఉన్నప్పుడు ఒక్కొక్క ఘట్టము చాల యంద గించును. ఒక్కొక్క పద్యమే కావ్యముచేయునంతటి చేతశ్చమత్కృ తిని జేయఁగలదు :— వసుచరిత్రలో శుక్తిమతీకోలాహలు లిద్దఱు జడప్రకృతులు. జడములకు రెండిటికి కవి చైతన్యము పోసెను.

# భీమేశ్వరపురాణము-కొన్ని స్థల విశేషములు

## దక్షారామము

శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రి.

భీమేశ్వర పురాణమునందు శ్రీనాథుఁడు ప్రధానముగాఁ గొనియాడినది భీమనాయకుని మహిమ. ఈవిషయమునే కాశీఖండము కృత్యాదిని "ప్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొనియాడితి భీమనాయకుని మహిమ" యని వాకొనియున్నాఁడు. ఆభీమనాయకుఁడు నెలకొనిన 'దక్షారామము' మహిమను గూడ సవిశేషముగనే చిత్రించియున్నాఁడు. ప్రాసాదపంచాక్షరీ మంత్రోపాసకుఁడై కవితాప్రతిభను జేపట్టిన శ్రీనాథునకు, పరమేశ్వరునకుఁ బ్రధాననిలయమై, పంచారామములలోఁ బ్రధానారామమై, దక్షిణ కాశియనఁ బ్రసిద్ధినొందిన దక్షారామమును వర్ణించుట మిక్కిలిగ నాశాస్యము, కృతినాయకుఁడగు బెండపూడి అన్నామాత్యునకుఁగూడ దక్షారామము భోగమోక్షనిలయము గావునను విశేషముగ వర్ణింపవలసివచ్చియుండును. శ్రీనాథుని కాలమునాఁటికి దక్షారామ మాతఁడు వర్ణించినంతటి మహావిభవముతోఁ దులతూఁగియుండిన నుండవచ్చును. నాఁటికంటె నేఁ డెంతయువన్నె తఱిగియున్నను ఆతఁడు వర్ణించిన విభవవిశేషములు కొన్ని మిగిలియే యున్నవి. నేఁటి కైదువందలయేండ్ల క్రిందటి దక్షారామ విభవము నొకమాఱు స్మరించి నేఁడు మిగిలియున్న వేమో కొంచెము వివరించెదను.

ఉ. ఏదెసఁ జూచిన న్విబుధు లేదెసఁ జూచిన మౌనిమండలం
బేదెసఁ జూచిన న్హరిదధీశ్వరవర్గము వాసవాది యం
దేదెసఁజూచిన న్మహేశ్వరమూర్తులు శ్రీనికుంభకుం
భోదర తండు భృంగిరిటి హూహుక హూహులు దక్షవాటికన్.

భీమ. ౧-౧౦౩.

ఇందుఁ జెప్పఁబడినట్టు దక్షారామమునం దేదిక్కునఁ జూచినను విబుధులు లింగస్వరూపులై గానవచ్చుచునేయున్నారు. ఇంద్రాది

దేవతావర్గము, ఈశ్వరునకుఁ జేదోడు వాదోడుగా నుండునికుంభకుంభోదరాదులు మాత్రము గానరారు. దక్షారామము పశ్చిమపుదిక్కున గోగులమ్మ, ఉత్తరమున మండతల్లి, తూర్పుదిక్కున నూకాంబ, దక్షిణపుసీమలో ఘట్టాంబికయు నుండినట్లు వర్ణించియున్నాఁడు. పేరులు సరిగా తెలియరాకున్నను నేఁడును గ్రామదేవత లట్లే నిలిచియున్నారు. నూకాంబ ఘట్టాంబికలను గూర్చి తెలిసియున్న వారు మాత్రము కొందఱేగలరు. ఈనలుగురు గ్రామదేవతలను శ్రీనాథుఁడు నాలుగుపద్యములలో వర్ణించి యున్నాఁడు. ౧-౯౮.. ౧౦౦

భారతదేశమునందలి యష్టాదశయోగపీఠములలో మాణిక్యాంబికా శక్తిపీఠ మొకటి. ఆమాణిక్యాంబిక దక్షారామభీమేశ్వరుని సన్నిధిని సర్వశృంగారయుతయై ప్రేమతో వెలసియుండి సకలకళ్యాణదాత్రియై యుండె ననినాఁడు.

పృథివిఁ బదునెనిమిది యోగపీఠశక్తి
గణములో నెంచ సర్వశృంగార యగుచు
భీమనాథుని సన్నిధిఁ బ్రేమ వెలయు
మాణికాదేవి సకల కల్యాణమూర్తి.

ఈ మాణిక్యాంబికి భీమేశ్వరునిమ్రోల వెలసిన విషయమును గూర్చిన యైతిహ్యమొక్కటి మాణిక్యాంబాదండకమను పేర నాప్రాంతమున నెలకొనియున్నది. దానిలోని యితివృత్త మిట్లున్నది. మాణిక్యాంబిక యొక వేశ్యావనిత. ఆమె దక్షారామముననే యొక వేశ్యకు జనించి పెరిగి పెద్దదియగుచుండెను. దక్షారామమున భీమేశ్వరుఁడు ప్రతిపర్వమునందు నందివాహనారూఢుఁడై యూరేఁగుచుండెడివాఁడు. ఒకనాఁడు భీమనాథుఁ డట్లూరేఁగుచుండఁగా, మేళతాళాదుల ధ్వనులను విని యది యేమియని తల్లినడిగెను. ఆమె భీమేశ్వరుఁడు వైభవోపేతుఁడై గ్రామమునఁ బర్యటించుచుండెనని బదులు చెప్పెను. నే నాతని వరించి పెండ్లాడెద నని మాణిక్యాంబిక తల్లితోఁ దెలిపెను. నీకుఁ దగినవానిని సొమ్ములువిరివిగ నిచ్చువానిని జతగూర్చెదను. దేవు నేల వరింతువని యెన్నివిధ

ములుగనో చెప్పిచూచెను. కాని యామెబోధనల నేపాటియుఁ జెవిఁ బెట్టక, యాభీమేశ్వరుని వెంబడివచ్చి, భీమేశ్వరునే తన భర్తగ వరించి యాతని యాలయమునఁ బరమేశ్వరుని కెదురుగ నిలిచిపోయెను. ఆనాఁటినుండియు మాణిక్యాంబిక సర్వోపాస్యమైన దేవత యైనది. నేఁటికిని వేశ్యలకు మాణిక్యాంబిక కులదేవత. వేశ్యలు ప్రత్యేకముగ నాపరమేశ్వరికి మొక్కుకొని, మొక్కులు చెల్లించుచు నుపాశింతురు. ఆగ్రామమునందును పరిసరములందును వేశ్యలలోఁ బలువురు ఆమెపేరును గూడఁ దాల్చినవారై పేరెక్కినవారు గలరు. ఈమెభీమనాథున కుత్తరముగ తిరుచుట్టుమాలలో నెలకొని యున్నది.

ద్వాదశక్షేత్ర వికచపత్త్రములతోడి
దక్షవాటిక యనెడి కెందమ్మివిరికి
సప్తగోదావరాంబు నిర్ఝరము తేనె
నడుమ రాయంచ శ్రీభీమనాయకుండు.

దక్షవాటమువికసించిన రక్తపద్మమువలె నుండ దానిచుట్టును పండ్రెండు క్షేత్రములు వికసించిన యాపద్మదళములవలె నుండును. ఈద్వాదశ క్షేత్రములు ప్రాగాదిదిక్కులలోను విదిక్కులందును గలవు ఈక్షేత్రములున్న తావులం దెల్ల నొక్కొక్క తీర్థ ముండెడిది. నేఁటికిని గొన్ని తీర్థములు గలవు. కొన్ని లోపించినవి.

1. ఇంద్రేశతీర్థము. ఇదిభీమనాథుని ఆలయమున కెదురుగ తూర్పు దిక్కునందున్న సప్తగోదావరతీర్థములోఁ గలిసి యున్నది. ఒడ్డున నింద్రేశ్వరుఁడు గలఁడు. ఈయింద్రేశ్వరునకు ఆలయముగూడఁ గలదు.

2. సిద్ధేశ్వర తీర్థము. ఈతీర్థసవిధభూమిని సిద్ధేశ్వరుఁడు.దక్షుని యజ్ఞము జరిగినపు డిది ప్రాగ్వంశమున్న చోటఁట. లింగముమాత్రము గలదు. తీర్థముమాత్రము గానరాదు.

3. యోగీశ్వరము. ఇచటి యీశ్వరుఁడు యోగీశ్వరుఁడు

4. యమేశ్వరము. అచటి యీశ్వరుఁడు యమేశ్వరలింగము. ఇదిదక్షిణదిక్కునందున్నది. లింగము తీర్థము రెండును గలవు. దీనికే యజ్ఞతటాక మనియుఁబేరు.

5. కాళేశ్వర తీర్థము. ఇచటి యీశ్వరుఁడు కాళేశ్వరుఁడు.

6. వీరభద్రేశ్వరతీర్థము. ఈశ్వరుఁడు వీరభద్రేశలింగము.

7. బ్రహ్మేశతీర్థము. ఈశ్వరుఁడు బ్రహ్మేశ్వరుఁడు.

8. కుక్కుటేశ తీర్థము. లింగము కుక్కుటేశ్వర లింగము.

9. కపాలేశ్వరతీర్థము. కపాలేశ్వరుఁడు.

10 సోమనాథేశ్వరము. లింగము సోమేశ్వరుఁడు

11 మహేశ్వర తీర్థము.

12 సప్తగోదావరము.

ఈ తీర్థములలోఁ గొన్ని నేఁడు లోపించిపోయి సాగుబడియగుచున్నభూములుగా మాఱినవి. లింగములు మాత్రి మటనట నెట్టులో తలదాఁచుకొనియున్నవి. నామముమాత్రము చెడకుండ నిలిచియున్నది సప్తగోదావరతీర్థ మొక్కటిమాత్రమే. దాని ప్రాశస్త్యమును శ్రీనాథుఁడిట్టు లుగ్గడించియున్నాఁడు.

శ్రీ భీమేశ్వరపాదపీఠవిలుఠ ద్వీచిసప్తగోదావర
వ్యాభుగ్నోర్మిపరంపరా ఘుమఘుమప్రారంభ కోలాహల
క్షోభోద్వేజితపాతకౌఘము జగచ్చూడావతంసంబు ల
క్ష్మీశుభ్రద్రాసన మొప్పు దక్షనగరీక్షేత్రింబు ధాత్రీస్థలిన్.

సప్తగోదావరము భీమేశ్వరుని పాదపీఠము మ్రోల వెలయుచునే యున్నది. కాని యాతేఁడు వర్ణించినట్టు లూర్మిపరంపరలు గాని, ఘుమఘుమార్భటులు గాని యచటఁ గానరావు. తత్సమీపమునం దనవరతము త్రైర్థికుల కోలాహలము మాత్రిము వినవచ్చుచునే యుండును. ఈ సప్తగోదావరము, గోదావరి సప్తశాఖలను సప్తర్షులు అంతః ప్రవాహరూపముగాఁ గొనివచ్చుటచే నేర్పడినది, సప్తర్షుల తపః ప్రభావము

చేఁ గొనిరాఁబడిన తీర్థమగుటచే నిది గంగానదికంటెను మిన్నయను భావమును శ్రీనాథుఁ డెంతయుఁ బ్రౌఢముగను ధ్వనిప్రధానముగను వర్ణించియున్నాఁడు.

గీ. రాజవంశజుఁడగు భగీరథుని వెంటఁ
బారుదెంచిన చదలేరు పాటియగునె
సప్తమునిరాత్రపతాప సంప్రాప్తమైన
సప్తగోదావరంబుతో సారమహిమ.

మఱియొకచో నీ సప్తగోదావరమును మణికర్ణికతో సదృశముగాఁ జిత్రించి యున్నాఁడు. దానితోపాటు దక్షవాటమును దక్షిణకాశిగను వర్ణించియున్నాఁడు.

సీ. జహ్నుకన్యాతీర్థ సన్నివేశమునకు
దక్షిణాంభోరాశి తటముసాటి
కమనీయమణి కర్ణికా ప్రవాహమునకు
సప్తగోదావర జలముసాటి
కటకరక్షకుఁడైన కాలభైరవునకుఁ
బ్రకట పాతాళభైరవుఁడుసాటి
విశ్వాధిపతియైన విశ్వనాయకునకు
భీమనాథేశ్వర స్వామిసాటి
మోక్షవిభవంబునకు సాటి మోక్షలక్ష్మి
భోగమహిమంబునకు సాటి భోగమహిమ
వారణాశికి శ్రీ దక్షవాటమునకుఁ
దారతమ్యంబుఁ జర్చింప ధర్మ మగునె.

సప్తగోదావరము మణికర్ణికాతీర్థమునకు సాటి యనుట దాని పవిత్రతకు సర్వథా తార్కాణము. గంగానదీతీరమున నెలకొనిన కతమున విశ్వేశ్వరున కెంతటి ప్రసిద్ధియో భీమనాయకున కంతటిమహిమ యేర్పడినది. కాశిలోఁగల విశేషములన్నియు దక్షిణకాశియగు దక్షారామమునందును గలవని యీ భీమేశ్వరపురాణమునఁ బలుతావులందుఁ జెప్పఁబడెఁ

బడినది. దక్షారామమను దక్షిణకాశియనుట క్రింది పద్యము పరికింపుఁడు.

క. దక్షిణకాశీనగరము దక్షారామంబు...

గీ. గౌరి యొక్కతె యాకాశగంగ యొకతె
కాశి యొక్కతె దక్షిణకాశి యొకతె
నలుగురును శంభునకు లోకనాయకునకు
రాణివాసంబు లనురాగరసము పేర్మి.

కాశిలో నుండిన దైవతము లిచటఁగూడ నేర్పడియుండుటచే దీనికి దక్షిణకాశీనగర మనునామము సార్థకమని యిట్లు వివరింపఁబడినది.

సీ. భీమేశ్వరేశ్వర శ్రీ మహాదేవుండు
హిమధామమౌళి విశ్వేశ్వరుండు
సప్తగోదావర సలిలప్రవాహంబు
సాక్షాత్కరించిన జహ్నుకన్య
తిరుచుట్టు మాలెలోఁ దిరమైన గణపతి
యేకాంతఢుంఠి విఘ్నేశ్వరుండు
దక్షిణంబున నున్న దండపాణీశ్వరుం
డూహింప దండపాణీశ్వరుండు
భైరవస్వామి శ్రీ కాలభైరవుండు
నంది నందీశ్వరుం డేమి నందియంబు
దక్షవాటంబు కాశికాస్థలము కాదె
తీవ్రకరతేజ సత్యవతీతనూజ !

ఈ పద్యమున కాశీక్షేత్రమునందలి విశ్వేశ్వరునకు సాటిగ దక్షారామమునందలి భీమేశ్వరుఁడు సప్తగోదావరతీర్థము దక్షవాటమునం దవతరించిన జాహ్నవి. భీమనాయకునకు క్రింది భాగమున చుట్టు నుండెడి దేవతామాలికలో నెలకొనియున్న గణపతియే కాశిలో నవతరించిన ఢుంఠివిఘ్నేశ్వరునకుఁ బ్రతిగ నున్న ఢుంఠివిఘ్నేశ్వరుఁడు. సాధారణముగ విఘ్నేశ్వరుని విగ్రహములం దెచ్చటనైనను తుండము కుడిచేతి

మీఁదికిఁ బ్రసరించి యుండును. కాశిలో నుండెడి ఢుంఠివిఘ్నేశ్వరునకు భీమేశ్వరుని ఆలయములో నుండిన యీ ఢుంఠివిఘ్నేశ్వరునకును తుండము వామహస్తమునఁ బ్రసరించి యున్నవి. ఢుంఠివిఘ్నేశ్వరుఁ డిచ్చటను గలఁ డనుట కిదియే తార్కాణము. కాశిలో దండపాణీశ్వరుఁడు నెలకొని ప్రసిద్ధి కెక్కియున్నాఁడు. ఇచటను భీమేశ్వరునకు దక్షిణముగ దండపాణీశ్వరుఁడు గలఁడు. కాశిలోఁ గాలభైరవుఁడు ప్రధానముగ నారాధ్యుఁడు. ఇచటను అష్టభైరవులు నెలకొనియున్నారు. అచట నిచటఁ గూడ నందీశ్వరులు గలరు. కావున కాశిలో నుండెడి ప్రధాన దైవతము లందఱు నిచ్చటనుగూడ నెలకొనియుండుటచే దక్షారామము కాశి కేపాటియుఁ దీసిపోదనియు, అన్ని విధముల దానికిఁ దుల్యమే యనియు నీపురాణమునఁ దెలుపఁబడియున్నది.

గంగానదీతీరమునందలి పుణ్యక్షేత్రములలో సర్వదేవతా నిలయమగుటచేతను, విశ్వేశ్వరుఁడు నెలకొనిన తావగుటచేతను గాశి కెంత ప్రాధాన్యమో, దక్షిణదేశమున—అందును ఆంధ్రమండలమున భీమేశ్వరుఁడు, వివిధ దేవతానిచయమును నెలకొనియుండుటచే దక్షారామమునకును నాఁడంతటి ప్రాధాన్యమే. వెనుకటి శతాబ్దులలో మహారాజులెందఱో యీ భీమేశ్వరుని బరమదైవతముగా నెంచి యుపాసించిరనుటకు నా దేవాలయమునందలి శిలలలో ఖచితమైన వందలకొలఁది వారి వారి శాసనములే తార్కాణములు. భీమేశ్వరుని నిత్యపూజావిధులకు, భోగములకు, వారిచ్చిన సొమ్ములు భూములు మనకీ నాఁటికిఁగూడ వారికి భీమేశ్వరునియెడలఁ గల మహత్త్వావేశమును జాటును. ఈ విషయమును భీమనాయకుని వైభవము నుగ్గడించు ప్రకరణమున శ్రీనాథుఁ డొక సీసపద్యములో వ్రాసియున్నాఁడు.

సీ. గజచర్మ మెన్నఁడోకాని నిచ్చలుఁగట్టు
పసిఁడికమ్ముల పట్టు పచ్చడంబు
భసిత మెన్నఁడొకాని ప్రతిదినంబు నలందు
మలయజంబు కురంగమదముఁ గూర్చి

సిడుద పాములరాజు తొడవు లెన్నఁడో కాని
తారహారములు నిత్యము ధరించు
సృకరఁకరుండమాలిక లెన్నఁడోకాని
ధరియించుఁ గహ్లారమాల యెపుడు
కాట నడుచక్కి నెన్నఁడో కానియుండు
దక్షవాటి సువర్ణసౌధములమీఁద
నెన్నఁడో పిశాచులనుగాని యిందుముఖుల
నెల్లకాలంబు దలఁచు భీమేశ్వరుండు. భీమ. ౧-౮౧౫.

శ్రీనాథుని ప్రౌఢకవిత కలంకారమగుటచే విశ్వలోకకుటుంబి భీమేశ్వరుఁడు దక్షపురిసానికూతులఁ దవిలినవాఁ డయ్యెను. శ్రీనాథునకా పరమేశ్వరునియెడల నట్టి చనవుండుటచేతనే భీమేశ్వరుని ధూర్తప్రకారంబుగా సానివాడ కనుపుచు భృంగిరిటి తండు నికుంభులను కయిదండ యిచ్చినాఁడు. అర్ధరాత్రిమువేళ నంతఃపురాగనలం గన్నుమొఱంగి యీశ్వరుఁడును కదలవలసినవాఁ డయ్యెను. ఆ తెలుఁగు నీ పద్యమునం దిట్లు చిత్రించినాఁడు.

ఎనయంగల్గినకూర్మి భృంగిటిఁగానీ తండుఁగానీ నికుం
భునిఁగానీ కయిదండ పట్టుకొని సంభోగేచ్ఛ నంతఃపురాం
గనలం గన్నుమొఱంగి యప్పురమునం గన్నెఱు కాఁదారి ప్రొ
ద్దున భీమేశుఁడు సానివాడ కరుగుక్ ధూర్తప్రకారంబునక్.

అంతటితోఁ బోక పదునాలుగు మహాయుగముల ముదుసలియగు భీమనాయకునకు దక్షారామమహిమమున సానిపెండ్లి యెప్పుడును మొగచాటుకాదని వివరించియున్నాఁడు.

పదునాల్గు మహాయుగముల
ముదుకగు భీమేశ్వరునకు మొగచాటై యుం
డదు సానిపెండ్లి యెప్పుడు
నది దక్షారామ మహిమమగునో కాదో.

మఱియు బెండపూఁడి అన్నయామాత్యుఁడు కట్టించిన మొగసాలవాకిటి మహోత్సవ మంటపమునందుఁ బేరోలగంబుండి నృత్తగీతవాద్యాదులు

భీమేశ్వరుఁడు నాఁడవధరించెనని తెలుపుచు శ్రీనాథుఁడు సానికూఁతుల నెంతేని యొయ్యారముగఁ జిత్రించియున్నాఁడు.

"వెండియు భీమేశ్వరుఁడు పండువు పండువునను నఖండవిభవంబున నా ఖండలాది విబుధమండలంబు పరివేష్టించియుండ,......నిలింప గంధర్వాప్సరోజాతులగు సానికూఁతులు గొలువ,......కుండలీలాసక ప్రేరణీ ప్రేంఖణ సింధుకందుకధమాళి చేలమతల్లీ హల్లీస కాదినృత్యంబు లవలోకించుచు, పంతంబు లవధరించుచు, మేలంబు లాలకించుచు... వినోదించుచుండు." ఆనాఁడు భీమేశ్వరుఁడు పండువు పండువునను గాంచెడి వేశ్యాలాస్యాదికము లీనాఁడును శారదా నవరాత్ర్యుత్సవసమయములఁ దిలకించుచునే యున్నాఁడు. ఉత్సవసమయములలో భీమేశ్వరుఁడు నేఁటికిని అన్నయామాత్యుఁడు గట్టించిన మహోత్సవ మండపముననే కొలువుదీర్చుచుండును. పట్టణవైభవ మించుక పరికింతము.

ఉ. వీటికి నాల్గువంకలను వెన్నెలతోఁటలఁ బోలు నీళ్లతో
హాటకపద్మమండితము లైనకొలంకులు చూడ నొప్పగుఁ
జీటికి మాటికిఁ హరుఁడు జృంభితలీల నటింప మాళిమి
న్నేటికృపీట నిర్ఝరము లింతటనంతటఁ జిందెనో యనన్. ౧-౯౬.

ఈ నాఁటికిని దక్షవాటికకు నాల్గువంకలను పద్మములతో నిండిన కొలఁకులు చూడ నొప్పుగనే యుండును. కాని దక్షపురియొద్ద సప్తగోదావరము నెంతటి డంబరముతో వర్ణించినాఁడో యాసారంతగఁ గానరాదు.

సీ. వేదండవదన శుండాదండ చుళికిత
ప్రోజ్ఝితాంభశ్ఛటాప్లుతనభంబు
దేవగంధర్వాప్సరోవధూటీ స్తన
స్థాసక శ్రీగంధ ధవళితంబు
కనకసౌగంధిక గంధోత్తమాగంధ
సారనిష్పందపుష్పంధయంబుఁ
జటులవీచీ ఘటాఝూట డోలారూఢ
హంసనంసన్నినాదాలసంబు

భూరితీరావనీ ఘుసీభూతచూత
జాతివకుళవనీ సమాచ్ఛాద్యమాన
బహుళసింధు ధునీవనబకమరాళి
దక్షపురియొద్ద సప్తగోదావరంబు.

ఈ నాఁడు సప్తగోదావరము పరిమితమైన జలపాతము మాత్రమే గలిగి యున్నది. ఆనాఁ డొకప్పుడు ఏనుఁగు లీఁదుటకు సరిపడిన నీరుండెడి దేమో? అచ్చటి నీరు దేవగంధర్వాప్సరసలు జలకమాడఁగా నాఁటి వారల స్తనముల పూఁతగంధములచేఁ దెల్లనగుచుండెనఁట. ఈనాఁ డెవ్వరేని తైర్థికులు పోయి పుణ్యము వచ్చునని మాత్రమే యాయుద కమున స్నానము చేయవలసిన స్థితిలో నున్నది. నేఁడు నాచు తూటు కాడ యధికముగాఁ గానవచ్చుచున్నది. కాని తుమ్మెదలు మూఁగు పద్మములు నామమాత్రమునకైన నచటఁ గానరావు. తీరభూమియందు శ్రీనాథుఁడు వర్ణించినతోఁట లేమియుఁ గానరావు గాని,పరిసరములందు మాత్రము వివిధములయిన తోఁట లున్నవి. పరిసరభూమియంతయు సారవ తరమైనదియే. నాగవల్లీలతలతో నిండిన భూములు పెక్కులు గలవు. దక్షారామము తములపాకుల కీప్రాంతమునఁ బ్రసిద్ధమే. నాఁటి హంసలు క్రౌంచములు మచ్చునకైన నీనాఁడు గానరావు.

దక్షారామమునందలి వస్తుజాతములో శ్రీనాథుఁ డన్నిటికంటె నెక్కుడుగా వర్ణించినది వేశ్యల సౌందర్యము. అట్టు లధికముగా వర్ణించుటకుఁ గారణము—కృతిపతియైన బెండపూడి యన్నామాత్యునిఁగోరి పంచారామములందుఁ బల్లెలలోను పట్టణములందును ప్రౌఢేందుబింబాననలు దూతికలకు భూషావళులు లంచం బిచ్చుట. యీ విషయ ము సిట్టులు శ్రీ నాథుఁడే యుగ్గడించియున్నాఁడు.

శా. కాంచీకంకణతారహారకటక గ్రైవేయభూషావళుల్
లంచం బెత్తురు దూతికాతతికి లీలన్ బెండపూడన్ననిన్
బంచాస్త్రోపముఁ జారతారకవయున్ బ్రార్థించి లోలోపలన్
బంచారామములందుఁ బల్లెలఁ బురిం బ్రౌఢేందుబింబాననల్.

ఈతని కుతూహలము మెఱయించుటకుఁ బోలె దక్షారామమున మరు

నిచే నిక్షుచాపము ననయము మొఱయింపఁజేయుచు ముజ్జగంబులు గెలుచు ప్రూనికను గలిగించినాఁడు. మఱియు దేవేంద్రుఁడు భీమేశ్వరున కరణముగా నిచ్చిన గంధర్వాప్సరోభామినీ చరణ నూపురఝంకార ములతో ముజ్జగంబులు జంకింప నుంకింపఁజేసినాఁడు, అతి చెప్పుచున్నది.

మ. మొరయించు స్మరుఁ డిక్షుచాప మనిశంబుం దక్షవాటీమహా
పురమధ్యంబున ముజ్జగంబు గెలువన్ బుత్తెంచులీలం బురం
దరవిశ్రాణిత దేవతాభువన గంధర్వాప్సరోభామినీ
చరణాంభోరుహ నూపురస్వనములన్ జంకించు ఝంకారముల్.

ఆగంధర్వాప్సరసలు సాయంకాలసమయములందు దక్షారామ సమీప మునం దుపవనములలోఁ గల్పద్రుమముల నీడలందుండి, గంధర్వోప నిషద్రహస్యములను వక్కాణింతురఁట భీమేశ్వరుఁడు. దక్షారామమునఁ బ్రతిష్ఠితుఁడైనపుడు దేవేంద్రుఁ డాతనికి భీమమండలమును ధారాద త్తముగా నిచ్చుచు, నాఱువందల వారవధూటులను గూడ నిచ్చియుం డెను. ఆవిషయమును శ్రీనాథుఁడిట్లు వివరించి యున్నాఁడు.

చ. సురపతి మార్గశీర్షమున శుద్ధచతుర్దశినాఁడు రోహిణిం
బొరసిన సిద్ధయోగమున భూతల మిచ్చెఁ బయోధిగౌతముల్
గరుసుగఁదుల్యభాగయును గండ్రెడు లోనుగ దక్షవాటికా
వరునకు భీమనాథునకు వారవధూత్రిశతీద్వయంబుతోన్.

దేవేంద్రుఁడు దక్షవాటీశ్వరుఁడగు భీమేశ్వరునకు ధారాదత్తముగ నిచ్చిన భూమికి నెల్లలు ప్రాగ్దక్షిణములందు సముద్రము. పశ్చిమము నకు మహాగౌతమి. ఈ మండలమునకు మధ్యభాగమునందు గండ్రేడు (ఇది దక్షారామమున కొక యోజనము దూరమునం దున్నది) తుల్య భాగానదీతీరమును గలవు. ఈయెల్లలనడుమ నుండిన భూమిని దానము చేయుచు, నాఱువందల వేశ్యాంగనలను గూడ నిచ్చెనని యీపద్యము వలనఁ దెలియుచునే యున్నది. నాఁటికి నేఁటికిని దక్షారామమున వేశ్యవాటికలు హెచ్చుగనే గలవు.

శ్రీనాథుఁడు పెదకోమటి వేమారెడ్డి యాస్థానియందు విద్యా ధికారియై పెక్కు శాసనములను రచించియుండెను గావున భీమనాథు

నకు దేవేంద్రునిచే భీమమండలము దానము చేయించునపుడును నాఁటి మర్యాదల నన్నిటిని నీ దానశాసనమునఁ గ్రమబద్ధముగఁ జేసి యున్నాఁడు. దానముచేసిన సమయము—మార్గశీర్ష మాసమున శుక్ల చతుర్దశినాఁడు చంద్రుఁడు రోహిణీనక్షత్రముతోఁ గూడిన శుభయోగము. ఈ దానమున సర్వసమృద్ధి యేర్పడె నని యిట్లు వాకొని యున్నాఁడు.

గీ. తుల్యభాగాతరంగిణితోడఁ గూడఁ
గణ్వవాహినితోఁగూడఁ గనకరత్న
దివ్యపరిధాన సహితంబు దేవభర్త
ధరణి భీమేశ్వరున కిచ్చె ధారపోసి.

గీ. దాత త్రైలోక్యభర్త వృద్ధశ్రవుండు
దేయ మంభోధి గౌతమీతీరభూమి
త్రిపురవిధ్వంసనుండు ప్రతిగ్రహీత
యింత యొప్పునె పరికింప నీ సమృద్ధి. భీమ. ౫.౭౪,౭౫.

సాధారణముగ నాఁటికాలమునం దేప్రభువైన నొక్కనికి భూదానము చేయునపుడు పరిసరమందలి ప్రజానీకమును బిలిచి, వారి కాదానవిషయముల నెఱిఁగించి, వారిని హెచ్చరించుట పరిపాటి. ఈభీమమండల దానసందర్భమునందు సైతము నాపరిపాటియే పాటింపఁబడినది. కనుఁడు-

సీ. ఓమహాజనులార భీమమండలమహా
గ్రామఖండికభట్టి కాద్రదైక
వాస్తవ్యులార విశ్వాసపూర్వకముగా
సావధానమనస్కులై వినుండు
ప్రాగ్దిశకును యామ్యపశ్చిమంబులకును
నంభోధిగౌతము లవధిచిహ్న
లుత్తరమున మూఁడుయోజనంబుల తుద
పొలిమేఱ యిది చక్రవలయ రేఖ

యీమహాక్షేత్ర మేను సర్వేశ్వరునకు
నిందుధరునకు దక్షవాటీశ్వరునకు
నిచ్చితిని ధారవోసి భీమేశ్వరునకు
నాసుధాకరతార కాహస్కరముగ.

ఆ. ఏలుకొందుగ్రి మీరలే పురాంతకునకు
పృథివియాగి బిడ్డ బిడ్డతరము
బ్రతుకఁ డాళ్రియించి ఫణిరాజకుండలు
భీమనాథ దేవు భూమిజనులు.

బృహస్పతి సదుపదేశమున దేవేంద్రుఁడు పురశాసనుండగు శ్రీభీమేశ్వర శ్రీమన్మహాదేవరకు నంగరాగాది భోగవైభవ వినోదార్థంబుగా గజాశ్వ దాసదాసీ గాణిక్యమాణిక్యగోధేనుసహితంబుగాభీమమండలంబు దక్షారామ సమేతంబుగా సమర్పింప, నాభీమనాథుఁడును తనకు సామంతులుగను, ఇరుగుపొరుగువారిగను చాళుక్యభీమేశ్వరుని భైరవుని పల్లవేశ్వర మృకండేశ్వరులను గావించుకొని యీభీమమండలిని బరిపాలించె నఁట. ఆపరిపాలనాక్రమ మరయుదము.

మ. వరిసామంతుఁడు శ్రీకుమారవనికాచాళుక్య భీమేశ్వరే
శ్వరదేవుం డుపకంఠబాంధవుఁడు శ్రీసంవేద్యరాడ్భైరవుం
డిరువుంబొర్వును బల్లవేశుఁడు మృకండేశుండుగా నేలె ని
ద్ధరణీమండలి భీమనాథుఁడు నిరాతంకప్రతాపోన్నతిన్.

శ్రీకుమారారామ వాసియైన చాళుక్యభీమేశ్వరుఁడు, దక్షారామభీమేశ్వరునకు సరియైన సామంతరాజఁట. దక్షారామ భీమేశ్వరలింగము, కుమారారామ (సామర్లకోట) భీమేశ్వర లింగమును ఆకారమునందును ఔన్నత్యమునందును సమానములే. ఆలయ ప్రాకారశిఖరాదులు రెండిట నుండినవి యొక్కతీరయినవి; ఒకేవిధమయిన రాళ్లతో, ఒకజాతి శిల్పులచే నొకేతీరుగ నిర్మింపఁబడినవి. చాళుక్యభీమునిచే నివి నిర్మింపఁ జేయఁబడిన వని యైతిహ్యము. చాళుక్యుల కొకప్పుడు రాజధానిగ నుండిన భీమారామమునకు సమీపమున కుమారారామ భీమేశుఁడు వెలసి యుండుటచేతను, చాళుక్యభీమునకు భీమేశునెడ భక్తితాత్పర్యము

లేర్పడి ఆలయ ప్రాకారాదుల నిర్మాణమున కాతఁడు మూలభూతుఁడగు టచేతను,ఆభీమేశుఁడు చాళుక్యభీమేశుఁడయినాఁడని తోఁచును. ఈవిషయ మును శ్రీనాథుఁడేయీభీమేశ్వరపురాణమునఁ బంచారామములను గూర్చి వివరించు పట్టున నిట్లు తెలిపియున్నాఁడు. "చాళుక్య వంశరాజధాని యగు చాళుక్యభీమవరనామగ్రామంబునఁ గుమారరత్నంబైన కుమార స్వామిచేతఁ బ్రతిష్ఠితంబగుటం జేసి కుమారభీమలింగంబునఁ బ్రఖ్యాతి నొందిన భీమారామంబును"

ఇది యిట్లుండ చాళుక్యభీముఁడు తన పేరిట దక్షారామము నను కుమారారామమునను లింగములను స్థాపించి, భీమేశ్వరుఁడను నామ ముల నాలింగములకు వెలయించె నని చరిత్రజ్ఞులు కొంద ఱూహలుచేసి యున్నారు. వారు చేయునది యూహామాత్రమే కాని దానికి ప్రమాణ మిసుమంతయుఁ గాన రాదు. అంతకుముందు భారతదేశమున లింగములే లేవని మఱికొందఱ యూహ.అది యవిచారమూలకమే యగును గాని ప్రమాణము కానేరదు. నేఁడు భూగర్భపరిశోధనలు గావించు తఱి క్రీస్తు నకుఁ బూర్వమందుండెడి లింగములు గూడ బయలుపడుచున్నవని తద్ జ్ఞుల యభిప్రాయము. చాళుక్యభీముఁ డని శ్రీనాథుఁడనిన మాత్రమున చాళుక్యభీముఁడు తనపేరఁ బ్రతిష్ఠించిన లింగము భీమేశ్వరుఁ డనిన, శ్రీనాథుని పూర్వోత్తర వాక్యములే విరోధించును. కావున దక్షారామ భీమేశ్వరునితో సమానవైభవము గలిగి, భీమమండలికి ఉత్తరదిక్సీమలో నెలకొనియున్న కుమారారామ భీమేశ్వరుఁ డాతనికి సమానుఁడగు సామంతరాజుగ నుండెననుట.

సంవేద్యమునకు రాజయిన భైరవేశ్వరుఁడు దక్షారామభీమేశ్వ రునకు సమీపమున నుండెడి బంధువు. ఇట సంవేద్యమనఁగా భీమేశ్వ రుని యాలయమునకుఁదూర్పుగ నిరువది నాలుగు మైళ్లదూరమున బ్రహ్మసంవేద్యము అను తీర్థమొక్కటిగలదు. అచట గోదావరీ శాఖ లగు గౌతమి భారద్వాజి వృద్ధగౌతమియు సముద్రమునఁ గలియును. అచట నెలకొనిన యీశ్వరుఁడు భైరవేశ్వరుఁడు. ఆసమీపమున భైరవ పాళెము అను పల్లె యొక్కటిమాత్రమే గలదు. ఈభైరవుఁడు భీమేశ్వ

రున కుపకంఠబాంధవుఁడై నాఁడు. ఈనదీసాగర సంగమమునందలి సముద్ర తరంగముల నుత్ప్రేక్షించుచు, కవి యీ[illegible]వేశ్వరుని మాహాత్మ్యమును గూర్చి వేఱొకచోట నిట్లు లుగ్గడించియున్నాఁడు.

శా. కాశిం జచ్చినయంతఁగాని పడయంగారాని కైవల్యమ
క్లేశంబౌనటు వేద్యనాయకునిచే లీలాగతిం జేకు రా
రో! శీఘ్రంబున మర్త్యులార! యను నాహూపంబునం బ్రోయు నా
కాశాస్ఫాలన గౌతమీజలధి సంగక్లేశకల్లోలముల్. ౬-౬౩

ఈపద్యమున కాశీపట్టణముకంటెను గౌతమీ జలధిసంగమక్షేత్ర మాహాత్మ్యము నతిచమత్కారముగఁ జిత్రించియున్నాఁడు. ఇవి పరోక్షముగ నాంధ్రదేశ ప్రాభవమును వ్యక్తముచేయుచున్నవి.

ఇరుగుపొరుగువారు పల్లాలేశ్వరుఁడు, మృకండేశ్వరుఁడును. పల్లాలేశ్వరుఁ డనఁగా పలివెల గ్రామమునందున్న కొప్పులింగేశ్వరుఁడు. ఈతఁడు దక్షారామ మేశ్వరునకు మూఁడుయోజనముల దూరములోఁ గౌంతేయీనదీతీరమున (కౌశికి నదియొడ్డున) వెలసియున్నాఁడు. ఈపల్లాలేశ్వరునిగూర్చి మఱియొకచోట నీరీతిగ వర్ణించియున్నాఁడు.

వాఁడె మాయింటివేల్పు పల్లాలపురమునఁ
గొప్పులింగంబు ఫణిరాజకుండలుండు. ౬. ౭౭.

అటులనే పొరుగున పశ్చిమదిక్కునలో మృకండేశుఁడు వెలసియున్నాఁడు. మృకండేశుఁ డనఁగా రాజరాజనరేంద్రనగరమున పుండరీకాద్రి (పుష్కరగిరి) పరిసరమున నెలకొనియున్న మార్కండేయస్వామి. ఈపరమేశ్వరుని శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణమునఁ బలుతావులందు స్మరించియున్నాఁడు.

అదె పుండరీకాద్రి యచట మార్కండేయు
నిలువేల్పుముక్కంటి వెలసెఁ దొల్లి

రాజమహేంద్రవరము వర్ణించుచు — ౩. ౭౭.

కమలాచలాగ్ర మార్కండేయ శివశిర
శ్శశిచంద్రికా ధౌతసౌధవీథి
గోదావరీపుణ్యకూలంకషాజల
స్ఫారిత శ్రీరుద్రపాదయుగళి

......సాంద్రవిభవంబు రాజమహేంద్రవరము. ౧. ౫౨

అనినాఁడు. కమలాచలాగ్రమున (పుష్కరగిరి శిఖరమున) నెలకొనిన వాఁడు మార్కండేయ శివుఁడనియు, గోదావరీపుణ్యజలములచే సలంకరింపఁబడు నాస్వామి సమీపదేశమును రుద్రపాదక్షేత్రమనియు వాకొనుట విదిత మగుచున్నది.

ఈవిధముగ తనతో సమానులయిన నీశ్వరమూర్తులతోఁగూడి భీమేశ్వరుఁడు దక్షవాటికామహాక్షేత్రె సింహాసనారూఢుఁడై భీమమండలిఁబాలించె నని పైపద్యము తెలుపుచున్నది. శ్రీనాథునికాలమునందు దక్షారామ వైభవము మహోన్నతమని యీభీమేశ్వరపురాణము తార్కాణించుచున్నది. ఆనాఁడు దక్షారామమునందు, దక్షాధ్వర ధ్వంసముజరిగిన సంఘటనలనుగూర్చి చెప్పుకొనుచుండెడివా రుండిరనుట నిట్లు వివరించినాఁడు.

సీ. ఎచ్చోటఁ దాఁ బాఱె నిఱ్ఱిరూపముఁదాల్చి
నతిసాధ్వసంబుతో నధ్వరంబు
పాటిల్లె నెచ్చోట భాషావధూటికి
నతిజుగుప్సిత మైన యంగవికృతి
యెచ్చోట ముచ్చిచ్చు నేడేసి నాల్కలు
కొండనాల్కలు బాఁకఁ గోఁతవడియె
నెచ్చోట నులివేఁడి యెండఁ బండులు రాలి
పూషార్కవదనంబు బోసివడియె
దక్షుఁ డెచ్చోటఁ బొట్టేలితల ధరించెఁ
జిందువందయ్యె నెచ్చోట నిందుఁ డనుచుఁ
జెప్పుదురు వీరభద్ర విజృంభణంబు
భీమమండలి నందు బ్రాఁబెద్దమునులు.

దక్షాధ్వరధ్వంసము జరిగినచోటనున్న కొలనుమాత్రము దక్షకుండమని యచ్చటిజనులు వ్యవహరింతురు.మిగిలిన చిహ్నములేవియు నచటఁగానరావు.దక్షుఁడు యజ్ఞాగారమగుటచే నాప్రదేశమునకు దక్షారామ మని పేరువచ్చినట్టులుమాత్ర మీభీమేశ్వరపురాణమున స్పష్టముగనున్నది.

# ఏకాదశ స్కంధము

హా భట్టారకుఁడు —

క. నలినాక్షుని కీర్తనమునఁ
గలుగును మోక్షం బటంచు ఘనులైన మునుల్
కలియుగమున వినుతింతురు
కలదే మాఱి లాభ మింతకన్న నృపాలా. 135

క. వినుతింపఁ గృతయుగాదుల
ఘనులగు నరవరులు కలియుగంబున దఱచై
జననంబుఁ గోరుచుందురు
వనజాక్షుని లోకమందు వసియించుటకై. 136

సీ. ద్రవిడదేశంబునఁ దామ్రపర్ణి నది
కావేరి యను పేరఁ గలుగు పుణ్య
దివ్యవాహినియుఁ దోతెంచి మహానది
ప్రవహించుఁ దజ్జలపాన మెవ్వ
రొనరింతు రాజను లుర్వీశ పితృదేవ
మునిఋణంబులవలన ముక్తు లగుదు
రచట దీపంబు నిత్యంబు సేయుచు విష్ణు
పాదాబ్జముల భ బరగువారి
నఖిలలోకేశుఁడైన శ్రీహరి పరేశుఁ
డాదిశూన్యుండు శ్రీనాథుఁ డవ్యయుండు
నిఖిలజీవాంతరంబుల నిలుచువాఁడు
చెడని యాత్మీయపదమునఁ జేర్చు మిగుల. 137

వ. అని యివ్విధంబున ఋషభకుమారులైన భగవత్ప్రతిబింబంబులైన యోగివరులు విదేహనరపాలకునకు నవ్యయపద ప్రాప్తికరంబులైన భాగవత ధర్మంబుల నుపదేశించి తత్పూజితులై యంతర్ధానంబు

నొందిన విస్మయంబంది యమ్మిథిలేశ్వరుండు కర్మానుష్ఠానంబు సమాప్తించి జ్ఞానయోగం బవలంబించి తన్మూలంబునఁ బరమపదంబునకుం జనియె; నీయుపాఖ్యానంబుఁ బఠించిన వినిన నరులు హతకిల్బిషులై విష్ణులోకనివాసు లగుదు రని నారదుండు వసుదేవున కీవృత్తాంతం బెఱింగించి మఱియు నిట్లనియె. 138

క. భగవద్భక్తికి సాధన
మగు నీ ధర్మముల వినియు హతకలుషుఁడవై
సుగతికిఁ జనియెద వీవు
జ్జగములు వినుతింప విగతసంగుఁడ వగుచున్. 139

క. నీకీర్తులు నిర్మలమై
లోకంబులఁ బూర్ణమయ్యె లోకోత్తర యీ
శ్రీకాంతుఁ డుద్భవించెను
మీకుం దనుజాతుఁ డగుచు మేదినిలోనన్. 140

క. శ్రీహరిపైఁ దనుజాత
స్నేహం బొనరించి వర్ణనీయం బగుమీ
దేహములు శుద్ధిఁ బొందెడు
నాహారాలింగనోజ్జ్వలాలాపములన్. 141

క. పగఁగొని శిశుపాలాదులు
భగవంతుని నతివిలాస భావస్మరణం
బొగిఁ జేయుచు ననుదినమును
సుగతికిఁ జని రెచట నిట్టిచోద్యము గలదే. 142

క. ఎడపక రిపుల వధింపను
బుడమిని నవతీర్ణుఁడైన పురుషోత్తముపైఁ
గొడు కనియెడి మోహం బది
విడువుము వసుదేవ సర్వవిద్యార్థజ్ఞా. 143

గీ. భూమిపతులఁ జంపి భూభారమొగి మాన్పఁ
బంచి సుజనరక్షణంబుకొఱకు
నవతరించి కృష్ణుఁ డమరులు వొగడంగ
నిలిపెఁ గీర్తి దిశల నెమ్మితోడ. 144

వ. ఇట్లు నారదుండు భగవద్భక్తికరంబులగు జయంతోపాఖ్యానంబుఁ జెప్పిన విని విస్మయంబంది దేవకీవసుదేవులు వాసుదేవు నందుఁ బుత్రమోహంబు విసర్జించి, పరమాత్మగాఁ దలంచుచు వర్తించి రని శుకయోగీంద్రుఁ డానతిచ్చిన విని పరీక్షిన్నరపాలపుంగవుం డిట్లనియె.

గీ. ఏమిచేసె కృష్ణుఁ డిటమీఁద యదువుల
నేవిధంబు తోడ నే పడంచె
భక్తజనులచేతఁ బ్రార్థితంబై నట్టి
పదము నెట్లు వొందె భవ్యచరిత. 146

వ. అని పలికిన రాజవరునకు యతివరుం డిట్లనియె. 147

సీ. మునిగణంబులతోడ మొనసిన బ్రహ్మయు
గణములు గొలువ శంకరుఁడు దేవ
బృందంబుతోనఁ ద్రిభేదనుం డాదిత్యు
లశ్విను లవ్ వసువులు నంగిరసులు
ఋభువు లప్సరసలు రుద్రులు సాధ్యులు
గంధర్వసిద్ధనాగమునులఁ గూడి
కింపురుషుల్ పితృ కిన్నర వర్గముల్
సంఘమై కృష్ణ దర్శనముఁ గోరి
ధరణి దివములఁ గల పదార్థములచేతఁ
బొలుపు మీఱుచు విభవసంపూర్ణ మైన
ద్వారకాపురి దేవకీతనయుఁడైన
విష్ణుఁ గాంచిరి వేదాంత వేద్యు నచట. 148

క. సుర లిట్లు వాసు దేవుని
మరుజనకుని దివ్యమైన మాల్యంబులచేఁ
గర మొప్పఁ బూజ చేసియుఁ
బరువడి వినుతించి రమరపంక్తులు సుజనా! 149

దం డ క ము

శ్రీమన్మహేంద్రాది మౌళిస్థలీకీలి తానేకరత్నచ్ఛటాపుంజ సంరంజితాంఘ్రి ద్వయోదార లక్ష్మీస్మకుచద్వంద్వ నిక్షిప్తకస్తూరికా వాసితాత్మీయ వక్షస్థలాలంబి సత్కౌస్తుభోద్భాసితా నేకయోగీంద్ర హృత్పద్మపంకేరుహాంతర్నివాసా జగన్నాథ నీదాసవర్గంబుచే నెల్లకాలంబు బుద్ధీంద్రియప్రాణ వాక్చిత్తసంఘంబుచేఁ జింతితానేక దేహుండవై యుందు; దీశా మహామాయచే దుర్విభాగుండవై ధాతృభూతేశ లక్ష్మీశభావంబులం బొంది తత్తద్గుణస్థుండవై సర్వలోకోద్భవస్థిత్యపాయాది హేతుండవై యుందు; వీదేహి యుష్మత్పదాంభోజ భక్తిన్ విసర్జించి విద్యాశ్రుతధ్యాన దానక్రియాకర్మతంత్రంబుచే శుద్ధిఁబొందంగ లేఁడచ్యుతా మాకు యోగీంద్ర హృచ్చింత్యమైనట్టి నీపాద మెల్లప్పుడున్ మంగళార్థం బవుంగాక; నారాయణా! నీవు సుజ్ఞానసంపన్నులై యున్న సన్మౌనిసంఘంబుచే ముక్తి సంప్రాప్తికై వ్యూహాలం దర్చితాకార విభ్రాజమానుండవై యుందు వాయ్వగ్ని నాజ్యాదుల న్వేదసన్మంత్రజాలంబుచే వేల్చు భూదేవసంఘంబుచే నాత్మజిజ్ఞాసులైనట్టి యోగీంద్ర బృందంబుచే వందనీయుండవై యుందు వెంను న్విచారింప నీ మాయగాదే సురేశా వసుశ్రీగృహాపత్యవిత్తాది సంజాత దుర్మోహులై మర్త్యులాశా మహాపాశ సద్బద్ధులై బుద్ధిమార్గంబు వర్జించి విద్యాకులాచార లక్ష్మీమదోద్రేక సంపన్నులై కన్నులం గాన కత్యంత లాభంబునం జేసి నీపాదభక్తి న్విసర్జించి హీనంబులైనట్టి జన్మంబులం బొంది తప్తంబులై యుండు సంఘాతకూపంబులం దుందు రత్యాహహాహా మహారూప నీ

కంఠికంబైనదామంబుతోఁగూడిసంస్పర్ధియైలక్ష్మి వక్షఃస్థలంబందు నిత్యం
బు వర్తించు ముక్తిప్రదా పద్మజాతాదిబృందారకానీకముల్ గోప
గోగోపికారూపముల్ దాల్చి నీపాదభక్తిం బ్రవర్తింతు రత్యంతముం
జూడ మాయామహాపూరుషాస్యంబులై యున్న కాలస్వరూపంబు
దానైన నీపాదకంజంబు మాకెప్పుడు న్మంగళార్థంబవున్గాక; పద్మోద్భవుం
డాది నిర్మించె హేమాండ మూర్వీధరారణ్యరూపాభిరామంబుగాఁ జక్రి
హస్తా జగత్స్వామివై నీవు మాయాగుణోత్థంబులై నట్టి యర్థంబులం
బొంది తద్గ్రాహివై పద్మపత్త్రంబులో నీటిచందానలిప్తుండవుంగాక
వర్తింతు వింద్రాదివంద్యా సమస్తావనీభార నిర్వాపణార్థంబు నై దేవకీ
దేవి గర్భాబ్ధిలో నుద్భవంబంది సంసారిదేవారి సంఘంబుల న్మర్త్యరా
జన్యవర్గంబులన్ మొత్తి యత్యంత హర్షంబుతో నల్లరేపల్లెలో గొల్ల
వారిండ్లు శోధించి చోరాధినాథుండవై బాలగోపాలురం గూడి తోడెట్టు
పాలందులో మీఁగడల్ వెన్నలున్ మెక్కి యొక్కుమ్మడిన్ వమ్ముగా
కుండ క్రీడింతు వాశావిషాధీశతల్పా మనోజాత బాణానలాభీల కీలాభి
సంతప్తులై యున్న యాషోడశ స్త్రీసహస్రంబులున్ యుష్మదీయేంద్రి
యక్షోభ సేయంగ లేరైరి నీపాదతీర్థంబులోకత్రయంబున్ బవిత్రంబుగాఁ
జేగు సర్వాత్మకా ! సర్వవంద్యా నమస్తే నమస్తే నమస్తే నమః. 150

క. ఈ రీతిని వసుదేవకు
మారకుఁడై వెలయునట్టి మధుసూదనునిన్
నీరజభవ భవముఖ బృం
దారకులు నుతించి రధికతాత్పర్యమునన్. 151

వ. అంత నాఖండలాది దేవతామండలంబున కధినాయకుండగు చతు
ర్ముఖుండు పుండరీకాక్షునకు వెండియు నిట్లనియె. 152

ఆ. పూర్వమందు నీవు పుడమి భారము మాన్ప
నవతరించి దిశలయందుఁ గీర్తి
సత్యసంధులందు సకలధర్మము నిల్పి
నవడి నొంది తసురనివహములను. 153

సీ. యదుమహావంశమం దవతరించిన నీవు
దివ్యతేజంబునఁ దేజరిల్లు
వెరవున సద్ధామ వృత్తకర్మంబుల
నఖిలరక్షణకునై యాచరించి
జగములు నిలిపితి సజ్జనుల్ కలియందు
నీనామకీర్తన నెమ్మిఁ జేసి
సత్పథంబునకునై చనుదు రుజ్జ్వలరూప
మేదిని నీవు జన్మించి నూట
యిరువదేనగు వర్షమ్ము లిచటఁ జనియె
నమరకార్యంబు సాధితం బయ్యె విప్ర
శాపమున స్రుక్కి యాదవుల్ సమయువారు
పరమపదవీథి జను మింక పద్మనయన ! 154

వ. అని యివ్విధంబునఁ బంకజాసనాదిబృందారకసంఘంబు లమంద హర్షంబున ననేకవిధముల సన్నుతించిన వారలం జూచి వాసుదేవుం డిట్లనియె. 155

చ. ఎఱుఁగుదుఁ జిత్తమందు విబుధేశ్వరు లిక్కడి కీరాక మున్న నే
ధరణిభరంబు మాన్ప ఘనదానవులన్ వధియించినాఁడ దు
ష్కరమదగర్వసంపదలఁ గన్నులుగానని యాదవక్షమా
వరులను నేపడంచి యిదె వచ్చెద ముక్తికి సత్వరంబునన్. 156

క. వీరి వధింపక యేఁ జన
వారిధి దన మేరదప్పి వచ్చినక్రియ దు
ర్వారులగు యాదవులచే
భారంబగు దిరుగ భూమి భాగంబునకున్. 157

క. అని పలికి వాసుదేవుం
డనిపిన జలజాతపద్మభవాదులు వేడ్కన్
జనిరి నిజాలయములకును
మనమునఁ దత్పాదభక్తి మఱువక భూపా. 158

వ. అంత. 159

సీ. ఘూకసృగాలాది ఘోరజంతువు లెల్ల
పగలు విజృంభించి పలుకఁ దొడఁగెఁ
గాకకుక్కుటశుక క్రౌంచ శారికములు
రాత్రికూజితముల రమణ మెఱ
నశ్వవారంబులం దనలంబు వెలువడె
విలసితాన్నంబులు మొలకలెత్తె
నరువడిగృహములం దుత్పల లుదయించె
నొకజీవమునకు వేఱొకటి పుట్టె
కడకు నీరీతి ననుదైవికమ్ములైన
ద్వారవుకాపుర సంభవోత్పాతములను
హరి నిరీక్షించి వరుసతో నాత్మపాద
భక్తులగు యాదవులఁ జూచి పలికె నంత. 160

ఆ. పొందరాని యట్టి భూదేవశాపంబు
దగిలె వంశమునకుఁ దప్పదెచట
నిచట నుండవలవ దీరీతిగను మహో
త్పాతములు జనించెఁ బట్టణమున. 161

వ. అదిగాన సముద్రతీరంబున ప్రభాసతీర్థంబను పుణ్యతీర్థంబు గలదు. అందు దక్షుశాపదగ్ధుఁడై నిశాకరుండు స్నానముచేసి రాజయక్ష్మ వలన విముక్తుండై కళోదయంబు నొందె; నట్టి క్షేత్రంబునకుం జని భూసురపితృదేవగణంబులం దృప్తిఁబొందించిన మనకు సకల దురంతంబులు నివర్తించు; నని వసుదేవతనూభవుం డానతిచ్చిన యాదవులు సకలపదార్థపూరితంబులైన శకటంబులు సమకూర్చి పుత్రమిత్రకళత్రాది సమేతులై ప్రభాసక్షేత్రంబునకై ప్రయాణాభిముఖులైన సమయంబున. 162

ఆ. వె. పయనమునను వృష్ణిబలములఁ బరికించి
యుద్ధవుండు యోగయుక్తుఁ డగుచు
వేగ నరుగుదెంచి విష్ణు నీక్షణఁ జేసి
పాదయుగము నెరఁగి పలికె నతఁడు. 163

సర్వగ సర్వేశ సర్వజ్ఞ సన్నుత
సచ్చిదానంద విశ్వాధినాథ
సాహసాహితచక్రిసంహార సరసీరు
హాయతేక్షణ ఘనాద్యంతశూన్య
సనకాదియోగీంద్ర చారుమానస పద్మ
నిలయాతినిర్మల నిర్వికార
కంసచాణూరాది ఖండనాఖండల
ప్రముఖవందిత లసత్పాదయుగళ
సకల లోకైకనాయక చక్రిహస్త
కోటిమన్మథసమరూప కుంభినీశ
వామనాచ్యుత గోవింద వాసుదేవ
నిన్నుఁ దలఁచెద నేప్రొద్దు నిత్యచరిత. 164

దేవ యోగీశ్వర దేవేశ నీవిట
సకల యాదవ బలక్షయముఁ జేసి
మహిమీఁద నిలయంబు మాని కైవల్యంబుఁ
బొందుచున్నాఁడవు భువనవంద్య
నిశ్చయం బిది నేను నీపాదయుగళంబుఁ
బాసి యుండఁగలేను భవ్యరూప
కొనిపొమ్ము నీపదంబునకు న న్నచ్యుత
నీక్రీడ నరులకు నిఖిలపుణ్య
కారణముగాన వినుతించు ఘనులుదివ్య
లోకములఁ బొందుదురు పద్మలోచనాఢ్య
చతురశయ్యాసనాటన స్నానభోజ
నాదులందును విడువలే నసఘ నిన్ను. 165

సీ. భవదుపభుక్తపుష్పములచే గంధాంశు
కములచే విరచితాకారయుతుఁడు
నగుచు నీయుచ్ఛిష్ట మనురాగమతితోడ
భుజియించు వాఁడను భువనవంద్య
నీమాయఁ దరియింప నేర్తునే శ్రీవణాది
మునులు నీభక్తిచే ముక్తికరిగి
రది గానఁ గర్మవిఖ్యాత మార్గంబున
ననయంబు వర్తించి యాదరమున
నిన్నుఁ దలఁచుచు మనమందు నీగుణంబు
లనుదినంబును వర్ణించు నట్టివాకు
దుస్తరంబగు నీమాయ దు.........
.కోణపాధీశ కువలయేశ. 166

వ. ఇవ్విధంబునఁ బ్రియసేవకుండగు నుద్ధవుండు పల్కిన దరహాసవిక
సితవదనుండై వసుదేవతనయుఁ డిట్లనియె. 167

క. ఏమాట నీవు పల్కితి
వామాట నిజంబు ముక్తి కరిగెదు కొఱకై
దామరసనంభవాదులు
వేమఱు నను వేఁడి రటకు, వేగమ చనుదున్. 168

సీ. బ్రహ్మాదిసురలచేఁ బ్రార్థింపఁ బడియు నే
నంశంబుతోడుత నవతరించి
దేవకార్యంబు సాధించితి నిటమీఁద
యదువంశ నాశనమగు మునీంద్ర
వారాసి యేడవవాసరంబునకును
ద్వారావతిని ముంచుఁ దడవులేక
మాచేత సంత్యక్త మగుచు నీలోకంబు
కలిసమాక్రాంతమై బలిమి చెడుచు

అంతఁ గలియుగ మాసన్నమైన పిదప
జను లధర్మంబుచేతనే జరుగువారు
గాని నిజబాంధవప్రీతి మాని నీవు
సముఁడవై భూమిఁ జరియింపు సంతసమున. 169

క. మానసవాగక్షిశ్రుతి
మానంబుల గృహ్యమాణ మగువస్తువు వి
న్నాణముగ నాశహేతువు
గా నెఱుఁగుము హృదయమందు గతజాడ్యుఁడవై. 170

క. పురుషునకుఁ నానార్థాం
తర సంజాతభ్రమంబు తద్దయు నతి దు
ష్కరనిజగుణదోషమ్మగుఁ
బరికింపఁగ నింద్రియములఁ బట్టఁగవలయుఁ. 171

వ. అది గాన నిరంకుశవ్యాపార పారీణంబులగు నింద్రియంబుల గుదియంగఁ దిగిచి మనోవికారంబుల నిగ్రహించి విత్తదారసుత బాంధవ ప్రీతి విసర్జించి సుఖదుఃఖములయందు సమత్వం బంగీకరించి ఈజగం బాత్మాధిష్ఠితంబుగా నెఱుంగుము, గుణదోషనిషేధంబులేక మదీయార్పితమానసుండవై విశ్వంబు మదాత్మకం బని నిశ్చయించి వర్తింపవలయు నని కృష్ణుండు పల్కిన నుద్ధవుండు భక్తిపూర్వకంబున వాసుదేవునకు దండప్రణామం బాచరించి బద్ధాంజలియై యిట్లనియె. 172

సీ. యోగీశ్వరేశ్వర యోగసంభవ కృష్ణ
నిశ్శ్రేయసార్థమై నీవు నాకు
నానతిచ్చినయట్టి యఖిలసన్న్యాస ల
క్షణము దుష్కరము నిష్కాము లైన
నాచరింపంగ లేరఁట భవన్మాయచేఁ
బూరితం బైన సంసారమందు
నా లక్షణముచెప్పు మది యథార్థంబుగా
నాచరించెద భృత్యుఁడైన యేను

దేహధారులై బ్రహ్మాది దివిజవరులు
బాహ్యవస్తువులందు సంభ్రాంతు లగుచుఁ
దిరుగుచున్నారు నీమాయఁ దెలియలేక
సంతతంబును మోహిత స్వాంతు లగుచు. 173

క. ప్రాక్తను మాయను నీపద
ప్రాక్తులు దెలియంగలేరు పలుమఱు దానిన్
యుక్తులచే వివరింపను
శక్తులె శక్రాబ్జజాత శంకరులైనన్. 174

గీ. గృహముఁ గట్టుకొన్న గృహిణి గృహస్థుల
కైన యతులకైన ననుదినంబు
సర్వపాపహరము సత్సంగమంబు స
త్కీర్తనంబు లోకసమ్మతంబు. 175

క. అదిగాన సర్వలోకా
స్పదహృదయ ! సమస్తలోకపావన ! నిను నే
ముదమొదవ శరణమొందెద
సదయుఁడవై యానతిమ్ము సర్వం బధిపా. 176

వ. ఇవ్విధంబునఁ బ్రియసేవకుండగు నుద్ధవుండు పలికిన కంసమర్దనుం
డిట్లనియె. 177

క. తఱచై భూతలమునఁ గొం
దఱు మును లశుభాశయప్రధానం బగుసం
సరణమువలన నిజాత్మను
దెరువున జన నాత్మచేతఁ దిగుతురు విప్రా. 178

క. పురుషుం డాత్మకు నాత్మయ
గురువని మనమందుఁ దెలిసి కుపథంబులపైఁ
బరువులువెట్టక నిలిచినఁ
బరమంబగు మన్నివాసభవనముఁ జెందున్. 179

గీ. సర్వమూలశక్తి సహితుఁడనగు నన్ను
సాంఖ్యయోగవిధులు సంతసంబు
భావమందు పురుషభావంబు గా విచా
రించి తలచుచుందు రెట్టి యెడల. 180

సీ. పరగ నేకద్విత్రి బహుపాదముల తోడ
వర్తించు జీవులు వరుసఁ బెక్కు
లాజీవకోటిలో నభిమతం బైనట్టి
నరవరాకారంబు నాకుఁ బ్రియము
గాన యోగీంద్రు లేకాలంబు సంతత
ధ్యానయోగంబున దనివిమెఱసి
యనుమానములచేత నగ్రాహ్యుఁ డగునన్ను
ఘనలక్షణగ్రాహ్య గా నెఱింగి
స్వాంతపంకజమధ్యమ స్థానమందు
జీవపరమాత్మ భేదంబు నేవగించి
శంఖచక్రాబ్జకౌస్తుభ శార్ఙ్గఖడ్గ
సహితుఁగఁ దలఁతు రనయంబు సంతసమున. 181

వ. మఱియు నవధూతసంవాదంబు నాఁ బఱగునొక్క పురాణేతిహాసంబుఁ
జెప్పెద నాకర్ణింపుము. 182

క. యదువను పేరఁ గల మా
పదునాలవ తాతయతఁడు పావనమూర్తిన్
సదయుని భయరహితుని జన
విదితుని నవధూతఁ జూచి వెస నిట్లనియెన్. 183

సీ. యోగీంద్ర యెచ్చోట నుండి యేతెంచితి
రీలాగు బాలుని లీలమీఱి
రూపవిద్యాజ్ఞాన రూఢమూలుండవై
జడుని చందంబున జడతఁబొంది

కామలోభదవాగ్ని కలితులై జను లెల్ల
సంతప్తదేహులై సంచరింప
పవమానసఖువల్లఁ బాసి గంగా జల
స్థితమైన కరిరాజుగతిని బొల్చి

తాప మందక ఘనపదార్థముల యందు
వాంఛ వర్జించి యానందవశుఁడవైన
కారణం బెయ్య దిది నాకుఁ గ్రమము తోడ
నాన తీయంగవలయు విఖ్యాతచరిత. 184

వ. అని పలికిన యదునరునకు నవధూత యిట్లనియె. 185

క. గురువులు గల రిరువదినలు
గురు నాకును వారివలన గుణమొక్కొకటిన్
బరికించి చూచి పొందితిఁ
బరమజ్ఞానంబు నుభయపావనచరితా. 186

చ. అని యవధూత పల్కిన మహాద్భుతవృత్తి దలిర్ప వానికి
ట్లనియె యదుప్రభుండు వసుధామర యెవ్వరికైన నొక్కఁడే
వినుతగురుండు గాని పదివేవురు లేరట నీవు నాకుఁ జె
ప్పిన వచనంబు చాల విని పెద్దవిచారము దోఁచె నామదిన్. 187

వ. ఇట్లు యదుపుంగవుండు యుక్తియుక్తవచనంబులు పలికిన యతి
వరుం డిట్లనియె. 188

గీ. అడిగినట్టి మాట కనువుగా నుత్తరం
బీయకున్న జ్ఞానహీనుఁ డండ్రు
గాన నుత్తరంబు క్రమముగాఁ జెప్పెద
. రమణ నీవు సేయు ప్రశ్నలకును. 189

వ. విను మింక నీ వడిగిన వచనంబులకు సవిస్తరంబుగా నుత్తరంబు చెప్పెద; భూమియు ననిలంబును, నాకసంబును, ననలంబును కళానిధియును, భానుండును, కపోతంబును నజగరంబును సముద్రంబును శలభంబును, ద్విరేఫంబును, గజంబును, మధుమక్షికయు, హరిణంబును, మత్స్యంబును, పింగళయును, కమఠంబును, బాలకుండును, కుమారికయును, శరాకారుండును, సర్పంబును, నూర్ణనాభియు, కణుందుటీఁగయు ననఁబఱగువీరి వలన నొక్కొకగుణం బంగీకరించి పుత్రదారాది మోహంబు విసర్జించి జగం బనిత్యంబుగాఁ దలంచి పరమపద నివాసంబు కొఱకునై హరినామస్మరణంబు సేయుచు వసుధాతలంబున సంచరింతు నది యెట్లనిన. 190

గీ. భూతధాత్రిభంగి భూతావృతుండయ్యు
దనమనం బులోన ధైర్య మొదవ
సత్త్వమార్గమందుఁ జలన మించుక లేక
చనునతండు సత్య సమ్మతుండు. 191

క. పరిమళము దెచ్చి వాయువు
పరులకు సౌఖ్యంబు జేయు పగిదిఁ బదార్థ
స్థిరచిత్తుఁడగుచు వాంఛా
విరహితుఁ డగువాఁడె యోగి వీక్షింపంగన్. 192

గీ. అరయఁ బార్థివంబు లైనట్టి దేహంబు
లందు జొచ్చి తద్గుణాశ్రయుండు
నగుచు వానిగూడి యలసి తిరుగక యాత్మ
నాత్మతోడఁ గూర్చు నతఁడె యోగి. 193

క. అరయఁగ నంత ర్బహిరా
వరణంబుల యందు జీవ వర్గములందున్
బరము విధంబున నాత్మను
బరిపూర్ణునిగా నెఱుంగు భావమువలనన్. 194

క. ఆయాకాశము విభుఁడై
వాయు సహాయంబులైన వనదంబులచే
నేయెడ లిప్తముగా వె
ట్లాయోగి చరింపవలయు నగుణస్థుండై. 195

గీ. స్నిగ్ధ మధుర యుక్త జీవనంబులరీతి
నరులయోగి పావనంబు సేయు
ప్రేక్షణంబుచేతఁ బృథుకర స్పర్శచే
నయము మీఱఁ గీర్తనంబుచేత. 196

గీ. కాంతి గలిగి తపము కతన సందీప్తుఁడై
యుదర భాజనత్వ ముడుగ కెప్డు
సర్వభక్షుఁడైన సప్తజిహ్వునిభాతి
నిర్మలాత్ముఁ డగుచు నిలువవలయు. 197

క. అజమాయాసృష్టంబగు
త్రిజగంబునఁ గలసి సర్వదివ్యాకృతియై
యజరామరణుండై పం
కజనాభుఁడు సమిధ నగ్నికరణి వసించున్. 198

శా. భావింప న్ప్రభవాప్య యాదులగు నీభావంబు లెల్లప్పుడున్
దేవాధీశునకైన దేహగుణముల్ దేహంబువడ్డప్పుడే
జీవుం డన్యశరీరమధ్యగతుఁడై చేష్టావశస్వాంగుఁడై
జీవించున్ యతి సూక్ష్ముఁడై తనరురాజీవారి చందంబునన్. 199

క. ఈచందంబున దేహం
బాచంద్రార్కంబు నిల్వ దని యెఱిఁగి మదిన్
యోచింపక యోగీంద్రుఁడు
భూచరణము సేయవలయుఁ బొదలిన వేడ్కన్. 200

మ. తిరమై భూరుహాగుల్మ పర్వత జలాదివ్యక్తిసంక్రాంతుఁడై
పరిపూర్ణుండగు నాత్మఁదద్గతునిగా భావింతు రజ్ఞుల్ సము
ద్ధురసుజ్ఞాన పరాయణుల్ తదితరస్థుల్ గావిచారించి వే
మఱుసప్తాశ్వునిరీతిఁ జూతురు మనోమార్గంబుచే నిత్యమున్. 201

ఉ. దారలయందు పుత్రధనధాన్యములందున నేకభంగులన్
గూరిమిఁజేసి మర్త్యుఁ డతి ఘోరవియోగజ దుఃఖమగ్నుఁడై
నేరుపు దక్కి చిక్కువడి నీతివివేకవిహీనుఁడై మహా
భారముతోఁ గపోతమను పక్షివిధంబునఁ బోవు నష్టమై. 202

వ. అది యెట్లనిన 203

సీ. ఎలమి నవ్వనములోపలఁ గపోతంబొక్కఁ
డనుకూలభార్యాసహాయుఁ డగుచు
ననువుతో భూరుహంబునఁ గూడు నిర్మించి
మేలిమియగు మేఁత మేసి యందు
గరిమ నన్యోన్యాంగకముల సంస్పర్శన
మాచరించుచుఁ జిత్తమందుఁ గూర్మి
నలుపుచు నేర్పొప్పు సంతనంబును బొంది
గొనకొని విహరింపఁ గొంతకాల
మునకుఁ గాంచెను దత్పత్ని ముదముతోడ
నండములు మూడుఁ నాల్గింటి నవియుఁ గొన్ని
యహరహంబుల కవిసి సర్వాంగకములు
లావుసమకూరి పిల్లలై లేవఁ బొదలె. 204

ఉ. ఆరయ నొక్కనాఁడు వనమందుఁ జరించుపుచులుబ్ధకుండునా
భూరుహమెక్కి పక్షులటువోవఁగఁ జూచితదీయమాంసవాం
ఛారమితాత్ముఁడై మిగుల సంతసమందుచు గూటివాకిటన్
నూరువిధంబులౌనురులనూఁది తెలంగిన యంతలోపలన్. 205

గీ. కడుపునిండ మేసి కవగూడి మున్నాడి
వచ్చి పతగకాంత వైపుదప్పి
యురులలోనఁ జిక్కి యున్నట్టిపిల్లలఁ
జేరబోవ దాన చిక్కువడియె. 206

# ప్రాస్తావిక పద్యావళి

మచ్చ లక్ష్మీనారాయణకవి.

42. (శేషము)—మేఘాపదేశము—

క. అతిగోప్యము దానం బని
మతి నెఱుఁగవె ఘోరగర్జ మాన వొసఁగుచో
వితరణశీలురు నగ ను
న్నతుఁడవు దగునా ఘనాఘనా యది విడుమా. 126

చ. అరు దనఁగాఁ ద్రిలోకపతి కంగవిభుం డిడె వస్త్రదాన, మా
సిరిగలవాని కిచ్చెను నశేషముగా బలి భూమిదాన, మీ
విరవులులేనిపక్షులకు నిచ్చెదు జీవనదాన మా బళా
స్థిరమతితోడ మీనములె నీ మెరమెచ్చులదాత లో ఘనా! 127

43. వాతాపదేశము

క. శ్లాఘార్హ్యముగా జనుల క
మోఘపరాంబుప్రదాన మొసఁగ మాన్పె ద
మ్మేఘుని కడ్డుగవచ్చి, యి
దే ఘనమా? వాత పాతకీ! నీ యనరే 128

44. డుండుభాపదేశము

చ. అమలసువాసనాన్వితలతాంతశతాంచితకుంజపుంజయుగ్
భ్రమరనినాదముఁ వినుచు భవ్యపటీరమహీజకోటరాం
తముల వసించుభోగికులనాథుఁడు గ్రోలఁగ జేరుఁ గాక మ
త్సమహితతుంబగానసుధ శుంఠవు డుండుభ! నీవు చేరదే 129

45. వకుళాపదేశము

సీ. కరలాలనంబుచేఁ గడునను రాగిల్లుమాకందవిటశిఖామణిని గనవొ
చారుతరాపాంగసారదృగ్వీతతిచే నలరెడు దిలకాభికాఖ్యుఁ గనవొ
ఆలింగనంబుచే నధికశోభను జెందు కురువకకాముకోత్తరుని గనవొ
స్వాదుగానసుధారసంబుచేఁ జెలఁగుప్రేంకణపాంథభోగికంకణుని గనవొ

తే. గీ. వకుళకులపల్లవాధమా ! వనిత లుమియ
నరుసమును జెందు దది యేమి సరస మరయ
సఖులు దన్న నశోకభుజంగ, శంకు
కర్ణుఁబోలితి నగుబాటుగాదె జగతి 130

## 46. క్రమేళకాపదేశము

ఉ. నీనగుమోముదమ్మిసిరి నీచిఱుబింబముఁబోలు మోవియున్
నీనిడువాలుఁగన్నుఁగవ నీఖుఫ్ఫురంబునమీఱు కంఠముఙ్
నీనెఱియంటియాకుకరణిందగువెన్నును నీయొయారపుఙ్
యానము గోలువుచ్చె సభ నందఱ నుష్ట్రికుశీలవాధమా 131

చ. సలలితమాఘుకిమ్మృదులసన్నిజనూత్నదళాధరంబు లు
జ్జ్వలమగునీ రదక్షతల భాసిలియుంటకు నేమి నోచిరో
తలఁచ ముర్కటక్రియలతానలినాక్షులు వారి దేకదా
యిలఁ గన భాగ్యమన్నను సహీనమహాంగభుజంగపుంగవా. 132

క. హరిపతులను నరపతులను
గరిపతులను నరసినాఁడఁ గర మరుదగు నీ
సురచిరవరరూపముతో
హరి హరి సరివారలౌదురా యుష్ట్రపతీ ! 133

చ. అరరె ! సుధాసుధారలకు నాస్పదమౌ నిజపల్లవాధరం
బు రహిఁ భవద్రదక్షతుల బొల్పుగ నుంటకు నింబవల్లరీ
వరగణికాగ్రిగణ్య ! తొలిబాముస నెట్టితపంబుఁ జేసెనో
యరయఁగ దాని దే విభవమన్న మహాంగభుజంగపుంగవా. 134

ఉ. మానవకోటితావకసమంచితకంఠమనోజ్ఞసౌష్ఠవం
బే నుతి కర్హమంచు వచియించెద రయ్యది గొప్పతప్ప హా
నీనగుమోమునీరజమొ నీయధరోష్ఠమొ నీదునాసయో
దేసికి నెద్ది తక్కువ మదిం బరికింపుమయూన్వయాగ్రణీ. 135

## 47. పూరేడనుపక్ష్యుపదేశము

ఆ. గీ. ఆడుదానిమీఁద నాలంపుమోపెత్తి
తారి తారి భీతిఁ బాఱిపాఱి
పొదల నొదిఁగె దీవు పూరేటిపంద నిన్
జూడ సిగ్గు గాదె శూరతతికి 136

## 48. గోమయకీటకాపదేశము

మ. అపరిక్షీణ సుగంధబంధురమరందాసారసమ్మేళనా
బ్జపరాగగ్రహణప్రమేయచణచంచచ్చంచరీకాళిఁ జే
డపురుంగా! కనుఁగొంచుఁ దత్క్రియల ప్రౌఢత్వంబులం బెంచి పో
త్రప జీర్ణింపక స్వీయగోమయమహఃప్రాగ్భారమే చూచితే 137

## 49. భేకాపదేశము

ఉ. అప్పరమాణుమధ్యల గళామృతగీతకథాసుధాఝరిన్
గొప్పగు వల్లకీజనితకోమలగానరసాయనంబులన్
జెప్పక యేమితృప్తి నిటుఁ జెందెను మచ్ఛ్రుతు లింకఁ జాలుచాల్
గప్ప! త్వదీయమౌ బెకబెకల్ విన నొప్పవు విప్ప కాస్యమున్ 138

## 50. కూర్మాపదేశము

చ. అడు గిడ లేను పైకి వినిమైన నఘంబులఁ బాప నెంచి ని
న్నడిగితి సర్వతీర్థగమనాతిచణుండవు తద్విశేషముల్
నుడివి కృతార్థుఁ జేయుము ననున్ గృప నేమియుఁ దాపఁ బోకునా
జడతను మాన్పు మ్రొక్కెద నజస్రము గూపగకూర్మనాయకా 139

## 51. స్వేదాపదేశము

ఉ. రక్కసి యొక్కఁడై నరురక్తము ద్రావఁగడంగునేని వే
ద్రెక్కనఁజేసి తత్క్రియను దీర్చు నొకప్పుడుఁ బ్రాణముంచియే
ప్రక్కను జేరి ప్రత్యహముఁ గాఱిగెడు నల్లను నల్లి! దీని నీ
వక్కటకంటె నాదుసుకృతాతిశయం బిదిస్వేదబిందువా 140

### 52. తురుష్కపితృదేవతాపదేశము

క. అల్లాకే యీయూరను
బెల్లము లే దనిన వెఱ్ఱిపీరా ! నీకా
తెల్లనిచీనాచక్కెర ?
వల్లా యీచోడిపిండి ఫాత్యా తిని పో 141

### 53. ధూమ్రిచ్ఛదాపదేశము

మ. కవులుం వందులు సూతులుం గథకులుః గానప్రవీణుల్ పురా
ణవిదుల్ హాస్యకరుల్ నృపాలసభలం బ్రావీణ్యముం జూప మా
ధ్య విరాజిల్లెడువాగవల్లిదళసంతానంబుతోఁ జేటికా
భవనప్రాంగణసీమ నొప్పెసఁగు నీవా సాటి ? ధూమ్రిచ్ఛదా 142

### 54. ఛాగాపదేశము

తే. గీ. గడ్డము విదల్చి కనులెఱ్ఱఁగా నొనర్చి
కొన్నిడాబులు గొట్టి యాకొండగుహను
దప్పితివి సింగమున కేనుదమ్మలికడ
సత్తిగుడి యిది చింబోత ! జొత్తువెందు 143

ఆ. గీ. ఆకుమేయవచ్చు నగములెక్కఁగవచ్చుఁ
బెద్దగడ్డములను బెంచవచ్చుఁ
గాముఁ గెల్వ రాదు కమలజుకైనను
డంబ ముడుగుఁడోతుభంబులార 144

### 55. సరఘాపదేశము

తే. గీ. పాటుపడకున్న దైవంబు నోట నెట్టు
వెట్టు నాహార మని యాత్మవృత్తి నెఱుక
పఱచి గర్వించె; దదె నక్క పట్టువడియె
యజగరమునోట నూరక యరయు సరఘ ! 145

56. క్షురకాపదేశము

ఉ. మంగలికత్తి! నీ తెగువ మాసినగడ్డముమీఁదఁ గాక సా
రంగశతాంగసద్భటతురంగమసంగతనైరివీరరాట్
పుంగవకంఠలుంఠనసముద్భటకార్యవిశృంఖలక్రియా
భంగధగద్ధగాయతకృపాణనిభం బగుదే రణావనిన్. 146

57. యూకాపదేశము

ఉ. భోగిపుఁ గంకణంబుగను బూనఁగఁ జాలెదె? కట్టెదే మహా
సాగరము న్నిషంగముగ? సౌరగిరిన్ విలుగాఁగఁ బట్టెదే?
యాగరమున్ హరించెదె? వియన్నగరంబులఁగువ్వఁ గూల్చెదే?
బాగు కుయూకమా! పునకఁ బట్టినయంతన సాంబమూర్తివే? 147

57 గోమారి

ఆ. గీ. పట్టుఁబట్టి చెంతఁ బాయకుండినఁ గాని
కోణుజ! నీవు పాలు గ్రోల లేవు
యొద్ద నుంచికొనిన యూధంబునకు బాధ
చూడ రోఁత తోలఁగు మేషకైన. 148

58. శిలీంధ్రాపదేశము

ఉ. కాలము సేసె జోక పయిఁగాల్వడునంతన పాముముట్ట హా!
బాలుఁడు రామ రామ యనిపాంథుఁడొకండొరుతోడఁదెల్ప మా
జోలికి రాఁబనేమి నరశుంఠల కంటిరి మొన్న; నిప్పుడీ
గాలపుముంటిఁగ్రుచ్చునపుఁగానరుగా నెఱగారుతాల్మియో. 149

59. పరోష్ణ్యుపదేశము (గబ్బిలము)

తే. గీ. పత్త్రఫలమాత్త్రముల దేహయాత్త్ర సలిపి
తరులఁ దలక్రిందుగా వ్రేలి దపము సేసి
పుడమి నడుగిడ నఘమని విడిచి రేయి
దిరిగి కలుద్రావె దుడుగ రాదే పరోష్ణి! 150

### 60. ఉపాంగాపదేశము

ఉ. నిద్దురవీడి రంగధరణీస్థలిఁ జేరిచి చంకదాల్చి వే
ముద్దులువెట్టిన న్వినక బోనము మెక్కక ఘోష నూను నా
మద్దెలఁబోలె నూయనెడుమాటికి మాటికి మానవేని నే
నద్దవిడిన్ భవద్గళము నొక్కుటనొక్కెదఁజూ, యుపాంగమా 151

### 61. ఘోటకాపదేశము

క. నాఁటికి నిటలాంబకుఁడే
హాటకచేలునిగుమారుఁడౌ మరుఁ గెలిచెన్
నేఁటికి నీవే భళిరా
ఘోటకవటుతిలక ! నిన్నుఁగొని యాడఁదగున్ 152

### 62. జంభలాపదేశము

క. ఓజంభలఫల ! ఫలకుల
మీజగమునఁబా జనించెనేల వృథా ఛీ
రాజులు సన్మానించెడు
నీజన్మమె జన్మమగును నిజ మరయంగన్ 153

### 63. కోకాపదేశము

క. లోకుల కెల్లర కీతని
రాకయె పెనుఁబండు వట్టిరాజు కటకటా !
మీ కతిభీప్రదుఁడగునో ?
కోకమ ! యది పంచితంబు గుందఁగ నేలా 154

### 64. సాముదాయలతాపదేశము

క. లతకూనలార ! మీకున్
మతిపోయెనె ? చెంత నున్నమాత్రంబున నీ
యతిజీర్ణకంటకాద్రుల
నతికితిరి మఱచితి రెట్లు హరిచందనమున్ 155

65. జ్యోతిరింగణాపదేశము

ఉ. భానువిభల్ నభః స్థలముఁ బర్వ నఖర్వసుపర్వపర్వతం
బాని పరిభ్రమించి జగదంధ్యము వంధ్యము సేయు నట్టియా
భానుని మ్రోల సాగునె? భవత్ప్రభ మాయును జ్యోతిరింగణం
బా! నళినారిసాంద్రకిరణాళియు నగ్నిశిఖాపరంపరల్ 156

66. దృష్టిప్రతిమాపదేశము

క. మెసఁగవు నేరికి నైనను
నొసఁగవు నిద్దుర నెఱుంగ వోహో! కావే
పసరము నొసఁగక పోయిన
మెసఁగును నీకంటె కనఁగ మేల్ వెఱబొమ్మా! 157

67. మనోపదేశము

చ. వల దని బుద్ధి బుద్ధి తెలుపన్ విన కక్కట! యీరికృష్టదృ
ష్టల సహవాసదోషమునఁ జొచ్చి తఘంబులు సేయ నిచ్చటన్
దెలిసినతేఁడు లేనియెడఁ దీవ్రకరాత్మజుఁ డచ్చటన్ గృధా
కలితమనంబునన్ మనమ! కాఁచియఁబెట్టఁడె ఘోరశిక్షలన్ 158

68. ఘుణాపదేశము

క. భారతకవివ్యాసుఁడు
గోరెఁగదా! విఘ్నపతిని గురులేఖకుఁడం
చారీతిని శుకకవి నిన్
గోరెను సంస్కారి వనుచు ఘుణ లేఖకరా! 159

69. భల్లూకకన్యాపదేశము

క. దీపవ్యయభయపీడన్
బాపెదనని పెండ్లియాడ భల్లూకసుతా
ప్రాపించితివె చపేట క
లాపవ్యయభయపిశాచలాభ మతనికిన్ 160

### 70. శ్వావిత్కన్యాపదేశము (ఏదుపందిపిల్ల)

క. శ్వావిత్కన్యామణీ! నీక
భావజపరతంత్రుఁడగుచుఁ బరిరంభణమా
భూవిభుఁడు సేసినది మొద
లేవనితల లోఁదలంపఁ డెంత సుఖదమో ? 161

### 71. సాముదాయకఫలాపదేశము

తే. గీ. దాడిమమునకు నెద ప్రీలె, మాడె మోము
కదళికిని, లాంగలికి నీరు గారెఁగంట,
గుండెలో రాయివడె మావిపండునకును,
సీమయాపిలు పట్టాభిషేక మనిన. 162

### 72. భారద్వాజాపదేశము

ఆ. గీ. ఎక్కడైను దుక్కిటెద్దు నయ్యాది నంది
యగునె! కోడెయైన గారియగునె?
యావు హరుఁడవగుదువే కకుత్స్థుఁడ [illegible]దె
యేలనెక్కపనులు పోలిగాడ. 163

### 73. ఛత్రాపదేశము

క. గొడుగా! నమ్మించకు నీ
వడుగారయ వేల యేల ? వర్షమొ యెండో
పిడుగా సీచే నాగును
జెడుగాలము నడువఁజేయు శ్వేతహయాఖ్యల్ 164

### 74. ఘూకాపదేశము

ఆ. గీ. పికకుహూరవంబు మకరాంకహయహేష
పావురము గుబాళ మీవెలంది
జంకఁజేయలేవు సఖుఁడబ్బెనేని ఘూ
త్కారమొకఁడు సేయుకాకవైరి. 165

## 75. ఘూక్యుపదేశము

క. త్రిభువనవసదబలాదృ
గ్విభవజయోద్యోగరాగ విలసనములు త
చ్ఛుభనేత్రము లట్టిఁడులను
నభినవకవి యీతఁడుల్కలనెను, నులూకీ! 166

క. ఘూకీమణి నీవదనని
శాకరునకు ముకురనీరజావళి యోడన్
డీకొనునే యీచెలి మొక
మాకడను బిడాలకన్య యాస్యంబేమో. 167

క. సురవారవధూముఖముల
నరయుదు నాకన్నదోయి యడసెఁ బేచకీ!
నరవారవధూముఖములు
సరిగా వవి నీదువదన సారసమునకున్. 168

## 76. కాకాంగనాపదేశము

ఆ. గీ. పుట్టుచాయకాక పెట్టుచాయ తిరంబె?
యీమె లోధ్రరజము మోమునిండఁ
జల్లికొనఁగనిమ్ము జతయానె నీమోము
దమ్మితోడఁగాకి తలిరుబోడి. 169

## 77. ఘూక్యుపదేశము

అ. గీ. మందగూబతనయ మా కోమటివరించి
వచ్చితీవు రూపవంతుఁడౌటఁ
దద్దినంబు మొదలు తడబాటది మొదలు
కనకరాశిగృహము గ్రాలె నహహా. 170

85. భుజంగ్యుపదేశము

ఉ. మేలు ! భళీ! భుజంగి! నిను మెచ్చితి బంధవిరోధలీలలన్
లోలునిఁగా నొనర్చి పలురోజులు వాతెఱఁగూర్చిపల్లవున్
గాలు గదల్ప నీవు కడకన్నులనైనను జూడ నీవు రం
భాలసగామినిస్కృతమై తగు వేత్రాకసుందరీమణీ 181

86. గజోపదేశము

ఉ. చేరలమించుకన్నుఁగవ,సింహవలగ్నము, మంచిమీసముల్
శారెముకర్ణఁగొర్ణఁ,గడుఁబచ్చనిబంగరురంగుగల్గి యీ
యూరినుగామ్యఁజేఁడోకఁడహో! చెఱలాడెనుఁజెప్ప నేల సిం
గారము నేడ నిక్కృపనిగాన జగాన నగోన్నతస్తనీ 182

87. మర్కటోపదేశము

క. ఘనుఁడవు వ్రణవైద్యమునం
దని విని నిను బిలిచికొనియె నది మేలయ్యెన్
వనచరభిషగ్వరా ! యీ
యన కీఁక నవ్యయసుఖంబు లాసన్నములౌ. 183

తే. గీ. పసరులెఱుఁగుదు శాస్త్రంబుపస యొకింక
యకట రుజయంటిమా సాధ్య మనఁగ రాదు
మనకు మిత్రత్వమావృత్తిమార్గమెఱిఁగి
సన్నికలుకొన్నఁగొను తిమ్మ ! మున్నగాను. 184

88. జంబుకోపదేశము

ఆ. గీ. ధూర్తవృత్తిగాక దోసంబె
హాదినంబైననేమి చర్మమంటఁజనదె
యురిని జిక్కినట్టియుష్ట్రింబుఁజంపింపఁ
దలఁచి నచ్చితీవె తప్పె? నక్క! 185

తే. గీ. పరమమిత్రుసింహనిర్బంధమోక్ష
మునకుఁ జాలియు విడికాకమునకు యశము
గూర్చె దివి కేగుపుణ్యాత్ముకొఱకు గూర్చె
మనమఁడవె జంబుకాన్వయమణీ! తొలంగు 186

### 89. అమన్యపదేశము.

చం. సితశుక జంభరపత్రతతి చెక్కునగాఁ జివురాకులన్ ఫల
ప్రకరము దేనెలున్ నొసఁగి తాల్చి ఘటోద్భవుఁ బాఱఁద్రేచి వా
నికి నెటులబ్బె ధీగరిమ? నిక్కము గాదన నేలనా
యకలుషుఁడైన మాధవుని యాశ్రయ మారయ రిత్తవోవునే. 187

### 90. హిమాచలాపదేశము

మ. ఘనసాంగత్యవిశేషమున్ గురుతయున్ గంగాజలామేయగా
హానపుణ్యంబు యశోనిదర్శనతయున్ హా! మంటిపాల్ సేతురే
చనునే సానులఁగూడి యుండెదవు నీచంగంబు బోధించె నే
మనఁగా నేర్తుము శీతభూమిధరవర్యా! ధైర్యధుర్యాగ్రణీ! 188

### 91. చాతకాపదేశము

ఉ. చాలుగసీధుపూరములొసంగుమతంగజుఁడొటపీడుచం
డాలుల......యనర్హమువిప్రవరాళిఁ జేర్చునే
యేలపరిగ్రహార్హమగునే యొకవేళ నొసంగెనేనియున్
జాలుదొలంగు వీడుము ఘనాఘనసంశయబుద్ధి మాంద్యమున్. 189

శా. తుంగానీలఘనాఘనాళిమదవత్తుండి ప్రభుభ్రాంతి సా
రంగంబుల్ గనుదవ్వునాకిటు దురాశం జేరె నం చీవు సా
రంగా నవ్వితి తద్ఘనాఘనపనభ్రాంతిన్ మదాభంగసా
రంగాళిం గనిచంచువుం దెఱచి చేరం బోతి వీవైదమో. 190

|పా:

## 92. ఆధారికాపదేశము

క. కోదండగణిక! నీకున్
బూదరగంగాజుఁగునకుఁ బొందు పొసఁగును గన నీ
చారులతాభుజములు నిం
పారం గౌఁగిలను జేర్చి యలరుము నెమ్మిన్. 191

## 93. భల్లూకాపదేశము

ఉ. ఎన్నఁడుఁ గైన ప్రాక్సుకృతిహీనతపోబలకారణంబునన్
సన్నిధిఁ జేర వాని నతిసాంద్రకృపామతి ముక్తికాంత కన్
సన్నకుఁ బాత్రుఁ జేయుదువ సాధ్యమె! తత్క్రియ యెంచి చూడఁగా
సన్నుతిగాదు నీదు నఖసాధ్యము తథ్యము ఋక్షదేశికా! 192

తే. గీ. పాఁపఁడైనఁ గైన దరి నగపడినఁ జాలు
బాఁటనుచుఁ బల్కరించి గుబాల్న లేచి
పెరిమఁ జేసాచి కూర్చుండఁబెట్టి యుత్తేఁ
ఒంపవాపైని భల్లూకపతివదాన్య. 193

## 94. నేత్రాపదేశము

క. గంజాధూమమహత్త్వము
నం జూచితి నంటిగాని నయనమ! మునిరాట్
కుంజరులైననుఁ బరమా
త్మం జూచిరె మాంసదృష్టి మున్నను నేఁడున్. 194

కం. (పాఠాంతరము)

క, గంజాధూమమహత్త్వము
నం జక్షువ! చూచి తంటి నలినజుఁడైనన్
నంజుడు కన్నులఁ బరమా
త్మంజూచె నె జ్ఞాననయనమున నే మొ కనన్. 195

## 95. భేకాపదేశము

ఉ. ఆటపుటుంగుగాంచి దృతినంతట గ్రుక్కను బెట్టఁబోవు బూ
రేటికి వచ్చుఁగీడు వివరించినమానక విఘ్నరాజుతో
సాటిగ బొజ్జఁబెంతునని చాగురె! యూపిరిఁ బట్టి నెట్టనన్
గాటికిఁబోవ నెంచితివి గానవు మీఁదుఁ బ్లవాధమాధమా 196

చ. అసదృశకౌశలంబున రసాగ్రణు లెంచఁగ వచ్చియీబిస
ప్రసవ సుగంధబంధురమరందముఁ బ్రత్యహమున్ హరించుచున్
భసలయ మేగుచుండఁగని పాయవు దాని నిదేమిలాభమో
విసువు జనింపదో మది వివేకములేదొ తొలంగు భేకమా! 197

## 96. నాగాపదేశము

మ. ఇలలోనంగల జంగమావళులఁ దాసృష్టించి మానోళ్లనే
ఖలుఁడై ఘోరవిషంబుగూర్చి నను మన్ గర్హింపఁగానేలయు
న్నలు మోముల్ గలసామి నోచిలువమిన్నా! యిన్నరౌఘంబులో
నిలువెల్లన్ విషమామహాత్మునకు వానింజూడు పేరేటికిన్ 198

మ. ఇలలో నంగల సర్వజీవులను దాసృష్టించి మానోళ్లనే
ఖలుఁడై ఘోరవిషంబుగూర్చెననుచున్ గర్హింపఁగా నేలయు
న్నలు మోముల్ గలసామి నోచిలువపిన్నా యిన్నరౌఘంబులో
నిలువెల్లంగల దాచలాలకకు దానింజూడు గన్నారఁ గన్
(పాఠాంతరము) 199

# శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు

—— o ——

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమ సంపుటమును, 955 పుటలుగల రెండవ సంపుటమును, 980 పుటలుగల మూఁడవ సంపుటమును, 950 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాదియందుఁగల సంస్కృతాంధ్ర శబ్దములన్నియుఁ గలవు రెండవ సంపుటమున 'క' మొదలు 'జ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'తృ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' 'న' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిదిసర్వవిధముల నుత్తమమయినది. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయునను తలంపుతో నీ క్రిందివెల నిర్ణయింపఁబడినది.

క్యాలికో బైండింగు ఒక్కొక్క భాల్యూము రూ 6 లు.

———

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

ప్ర తి ష్ఠా ప కు లు.

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారు సి. బి. ఇ., డి. లిట్., పిఠాపురం మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజా వారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజా వారు.

ఉ ద్ధా ర కు లు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు (జమీందారు, ఉయ్యూరు యెస్టేటు.)

అ ధ్య క్షు లు.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవి సమ్రాట్, ఇత్యాది బిరుదాంకితులగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

కార్యదర్శులు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. యల్.

శ్రీ సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ, చతుర్వేదుల సత్యనారాయణగారు, ఎం. ఏ., బి. ఒ. యల్.

కోశాధ్యక్షులు :

శ్రీ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి. ఎ, యల్. యల్. బి.

శ్రీ ఏలేశ్వరపు వేంకటరమణ సుబ్బారావుగారు, బి. ఏ. బి. యల్.,

కార్యనిర్వాహక సభాసభ్యులు :

శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు

రా. సా. మాదిరెడ్డి సీతారామయ్య నాయఁడుగారు, బి. ఏ, బి. యల్.

శ్రీ కొమ్మిరెడ్డి కేశవ రామమూర్తినాయఁడుగారు, బి. ఏ.

,, వేమల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

,, ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.

,, ఎండమూరి వేంకటరమణగారు, ఎమ్. ఏ., బి. యిడి.

,, విద్వాన్ బులుసు వేంకటేశ్వరులుగారు, బి. ఏ.

,, సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు

,, బండారు తమ్మయ్యగారు.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక



దేశభాషలందుఁ దెలుఁగు లెస్స

సంపుటము ౪౨

సంచిక 3

# సంపాదకవర్గము

ప్రధానసంపాదకుఁడు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. యల్.

సహాయ సంపాదకులు :

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు ఎం. ఏ.
శ్రీ విద్వాన్ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. ఆనర్సు., బి. ఇడి.
శ్రీ సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
శ్రీ బండారు తమ్మయ్యగారు.

# విషయసూచిక

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## కాకినాడ

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు.

సంపుటము ౪౨. { విజయ సంవత్సరము / శ్రావణ భాద్రపదములు } సంచిక 3

## తెలుఁగుల తేజు.

వద్దిపర్తి రాజారావు.

చ॥ సిరులకుఁ గాణాచంబు, కడుఁ జెల్వగు విద్దెల తావలంబు, పో
టరితనపుం గొటారు, వినడంబగు తేగవు టాటపట్టు, రా
చరికపుటిమ్మ, నేయెడను సాటియె లేని తెలుంగుఁదల్లి, నీ
మురిపెపు టడ్డుఁ దమ్ములకు మోదమ్ములు, బిడ్డల ముద్దు గాంచుమా.

మ॥ కలిగెన్ రాష్ట్రము నేఁడు; నాంధ్రులకు భాగ్యం బిద్ది చేకూరెఁ గాఁ;
గల తే నాఁటివొ నేఁడు బండె, నదిగో కాన్పించెఁ బ్రాచీదిశన్
దొలిభాగ్యంబుల వేగుఁజుక్క, పలికెన్ దొల్కోడి, మేల్కొనవయా.
తెలుఁగున్వెల్గుల భారతావనిని నుద్దీపింపఁగాఁ జేయఁగన్.

సీ॥ సంస్కృత భాషతో సంబంధ మెఱుఁగంగ
నన్నయ్య శ్రీనాథు నెన్నుమోయి
తెలుఁగునుడుల తేటతియ్యముఁ గనఁ దిక్క
యజ్వను దిమ్మన నడుగుమోయి
జిలిబిలిపలుకుల కులుకుందనం బెన్న
నెఱ్ఱన్నఁ బోతన్న నెన్నుమోయి
పాకంబునను బరిపాకంబుఁ గనఁ జేమ
కూరను నలసానిఁ జేరుమోయి

కల్పనాపాటవంబును గాంచ నంది
తిమ్మనను బింగళినిఁ జేరికొమ్ము; తియ్యఁ
దియ్య నుడికారముల పసల్ దెలిసి కొనఁగ
దేశభాషలఁ లెస్స యనా దెల్గుఁ గనుము.

సీ. ఒకనాఁడు నీసుతుల్ చకచక తేజును
దిక్కులఁ బఱపి పెం పెక్కినారు
విద్దెల నొకనాఁడు ద్వీపంబులకును గొం
పోయి యజ్ఞత కురి వోసినారు
ఓడల సంద్రాల నుఱికించి సరుకుల
దేశదేశంబుల దింపినారు
మన్నెఁడు లై రాచమర్యాదఁ బాటించి
నేల నాల్గుచెఱంగు లేలినారు
కళల నమరావతి మొదలు నెలవులందు
గిలకరించియు నిలు దిద్ది యలరినార
లెందునుం గూడ నీసుతు లింతవైనఁ
దీసిపోలేదు జగతినిఁ దెల్గుఁదల్లి.

సీ. తాగిన పాలమర్యాద నిల్పుమ యని
తనయుని నని కన్నెఁ దల్లి యోర్తు
వెన్నిచ్చి వచ్చిన వీరుఁడవా యని
పసుపుముద్ద నొసంగె భార్య యోర్తు
పగతుఱ కెల్లను బక్కలో బల్లెమై
ప్రజ బిడ్డ లన నేలెఁ బడఁతి, యోర్తు
నవరసంబులఁ గుల్కు నవతు లేని ప్రబంధ
మిచ్చి మించెను గవయిత్రి యోర్తు.
వీరమాతలు నీ సుతల్ వీరసతులు
కాకతీరిన రాజ్యాంగ కార్యచణలు
నతుల రస రమ్య కావ్య కళాఢ్య లగుదు
రాంధ్రిజనయిత్రి నీకు నీ వమ్మ సాటి.

# ఆంధ్ర వాఙ్మయారంభదశ

శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు

ఆంధ్రశబ్ద మిప్పుడు జాతిభాషాదేశములు మూఁడింటికిని సూచకముగా వాడఁబడుచున్నది. ఆంధ్రజాతి, ఆంధ్రదేశము, ఆంధ్రభాష యనునవి మనము తఱచుగా వినుచున్నమాటలే. ఈ మూఁడింటిలో భాషాదేశములకన్న జాతియే ముందాంధ్రసంజ్ఞితమై యుండినట్లు గోచరించుచున్నది. ఋగ్వేదమునకు సంబంధించిన యైతరేయబ్రాహ్మణమున విశ్వామిత్రుఁడు తన యాజ్ఞ నుల్లంఘించిన కుమారుల నేఁబది మందిని పుళిందులు, శబరులు, పుండ్రులు, మూతిబులు, ఆంధ్రులు కండని శపించినట్లు కలదు. దీనిని బట్టి యా బ్రాహ్మణము రచింపఁబడుటకుఁ బూర్వమే యాంధ్రు లను నొక జాతివా రుండినట్లు తెల్లమగుచున్నది. మహాభారత రామాయణములందుఁ బాండ్య చోళ కేరళులతోఁ బాటాంధ్రులు కూడఁ బేర్కొనఁబడియున్నారు. మౌర్యచంద్రగుప్తుని యాస్థానమునకు గ్రీకు రాయబారిగా వచ్చిన మెగస్తనీసప్పు డాంధ్రులు, బలవిషయమున మౌర్యుల తరువాత నెన్నఁదగినవారై యుండిరనియు, వారికిఁ బెక్కుగ్రామములును బ్రాకారావృతములైన ముప్పదినగరములు నుండెడివనియు, వారి రాజునకు 100000 పదాతులతోడను, 2000 రౌతులతోడను, 1000 ఏనుఁగులతోడను గూడిన సైన్యముండెననియుఁ దెలిపియున్నాఁడు. అశోకుని శాసనములలో నాంధ్రులాతని రాజ్యములోనివారై యాతని ధర్మబోధ ననుసరించిరని చెప్పఁబడినది. అశోకుని యనంతరము వారొక గొప్ప సామ్రాజ్యమును స్థాపించి, శుంగకాణ్వవంశము లంతరించినపిమ్మట మగధనుగూడ నాక్రమించుకొని యచ్చటనుండియే పరిపాలనము సాగించియుండిరనుటకు నిదర్శనములున్నవి. వాయుమత్స్య విష్ణుభాగవతపురాణములు శాతవాహనులు సుమారు నాలుగున్నఱ శతాబ్దులకాలము సామ్రాజ్యము

సాగించిరని నుడువుచున్నవి. భాగవతహరివంశములు చాణూరుఁడను నాంధ్రమల్లునిఁ బేర్కొనియున్నవి. ప్లినీయను చరిత్రకారుఁడు (క్రీ. శ. 77) 'ఆందర' జాతిని బేర్కొని తద్బలసంపదను వర్ణించెను. శాతవాహనుల తరువాత నాంధ్రదేశభాగముల నేలిన యిక్ష్వాకులు, విష్ణుకుండినులు, శాలంకాయనులు మున్నగు వారందఱు నాంధ్రులే. ఈ విధముగఁ జారిత్రయుగమునకుఁ బూర్వమునుండియు నాంధ్రజాతి బలవత్తరమై ప్రసిద్ధికెక్కియుండెనని చెప్పవచ్చును.

ఆంధ్రశబ్దము దేశపరముగా వాడఁబడుట క్రీ. శ. మూఁడవ శతాబ్ది నడిమిభాగమునుండిమాత్రమే కానవచ్చుచున్నది. శాతవాహను లాంధ్రులయ్యు నేలొకో తాము పాలించిన దేశ మాంధ్రదేశమని యేశాసనమునందును దెల్పుకొని యుండలేదు. పల్లవయువరాజైన శివస్కంధవర్మ ధాన్యకటకమును దనతండ్రి ప్రతినిధిగాఁ బాలించుచుండిన యధికారి కాజ్ఞాపత్రముగాఁ జెక్కించిన మైదవోలు తామ్రశాసనమున "ఆంధపతీయోగామో విజెపజిమ్" అను మాటలు కానవచ్చుచున్నవి. ఇం దాంధ్రదేశ మాంధ్రపథమని పేర్కొనఁబడినది. క్రీ. శ. 340 వ సంవత్సరమున మల్లదేవ నందివర్మ వేయించిన దానశాసనములో నాంధ్రమండలశబ్దము గోచరించుచున్నది. వరాహమిహిరుని బృహత్సంహితయందును హ్యూయెన్ త్స్యాంగు వ్రాఁతలందును నాంధ్రదేశము పేర్కొనఁబడియున్నది. క్రీ. శ. 6 వ శతాబ్ది నడిమిభాగమునకుఁ జెందిన హారహా, జవానుపూరు శాసనములం దాంధ్రపతి శబ్దముదాహరింపఁబడి యున్నది. క్రీ. శ. 1072 వ సంవత్సరమున యశఃకర్ణదేవునిచేఁ జెక్కింపఁబడిన ఖైరాతామ్రశాసనమున "ఆంధ్రాధీశమరంధ్రదోర్విలసిత"మ్మను మాటలో నాంధ్రదేశప్రశంస కానవచ్చుచున్నది. తరువాత నాంధ్రదేశమను మాట సుప్రసిద్ధమై పెక్కుశాసనములందును గ్రంథములందును గూడ వాడఁబడియున్నది. ఈరీతిగా నాంధ్రపదము మొదట జాతిపరముగాను బిమ్మట దేశపగముగాను బ్రచారమున కెక్కినట్లు గోచరించుచున్నది.

# ఆంధ్రవాఙ్మయారంభదశ

ఆంధ్రశబ్దమును భాషాపరముగా వాడిన మొదటివాఁడు నన్నయ భట్టే యని చెప్పవచ్చును. రాజరాజనరేంద్రుని నందంపూడిశాసనమున నతఁడు నారాయణభట్టును వర్ణించుచు "యస్సంస్కృత కర్ణాట ప్రాకృతపైశాచికాంధ్రభాషాసు గవిరాజశేఖర ఇతిప్రథితః సుకవిత్వే విభవేన" యని వ్రాసియుండెను అంతకుఁ బూర్వ మాంధ్రభాషయను పదము నెవ్వరైన వాడియుండిరేమో తెలియదు. నన్నయభారతమును రాజరాజు తన్నుఁ "దెనుఁగున రచియింపు"మని కోరినట్లుగాఁ జెప్పియుండెను. భారతాశ్వాసాంత గద్యలలో నాంధ్రభారతమను పదము కనవచ్చుచున్నది. అందుచే నన్నయకాలమున నాంధ్ర తెనుఁగు పదములు రెండును సమానార్థకముగా వాడఁబడుచుండెనని తెలియుచున్నది. తిక్కనయు నన్నయ నాంధ్రకవిత్వ విశారదుఁడని పేర్కొని హరిహరనాథుఁడు తన్నుగూర్చి "భారతమును నీవు తెనుఁగుభాషలో వినిర్మింపఁ బూనుట పురుషార్థతరు పక్వఫల"మని చెప్పినట్లు వర్ణించెను. దీనిని బట్టికూడ నాంధ్రభాష, 'కాంధ్రము' 'తెనుఁగు' అను రెండు పేర్లును నప్పుడు ప్రచారములో నుండినట్లు తెలియుచున్నది. బసవపురాణము నందుఁ దెనుఁగుభాష తెలుఁగను పేరుతోఁగూడ వ్యవహరింపఁబడినది. నన్నయ, యాంధ్ర తెనుఁగుశబ్దములను రెండింటిని భాషాపరముగా వాడియుండెను. గాన నాతనికిఁ బూర్వమే యీ భాషకా పేరు లుండియుండునని యూహింపవచ్చును.

సాధారణముగా నే భాషకైనను దేశమును బట్టి పేరువచ్చుట సహజము, ఆంధ్రులీదేశము నాక్రమించుకొనునప్పటి కిచ్చటిప్రజ లేదో యొక భాషను మాటాడుచుండిరనుకొనుటలో విప్రతిపత్తిలేదు. అదియే తెనుఁగు లేక తెలుఁగుభాష. ఆంధ్రుల పాలనము క్రిందికి వచ్చినతరువాత నీదేశ మాంధ్రదేశమయ్యెను. ఆంధ్రదేశమునందలి యీ తెనుఁగు భాషకుఁ దదనుగుణముగా నాంధ్రభాషయను నామ మేర్పడెను. ఆంధ్రులును దెనుఁగువారును గలసి యాంధ్రులైరనియు, నాంధ్రభాష మాత్ర

మట్లు రెండు భాషల కలయికచే నేర్పడినది కాదనియుఁ దెనుఁగే యాంధ్రు లీదేశము నాక్రమించుకొనిన పిమ్మట నాంధ్రమని పిలువఁబడెననియు శ్రీకోరాడ రామకృష్ణయ్యగారు వేంకటేశ్వర ప్రాచ్యభాషాసంస్థాపత్రికలో వ్రాసియున్నారు.

మూలద్రావిడభాషనుండి తమిళమువలెఁ దెనుఁగుకూడ క్రీస్తుపూర్వమే విడివడి క్రమపరిణామమును బొందియుండును. క్రీ. శ. 7 వ శతాబ్దమునఁ దెలుఁగుభాషలో వ్రాయబడిన మొదటి శాసనము కానవచ్చుచున్నది. అంతకుఁబూర్వ మట్టిభాషయే లేక యాశాసన మాకాలముననే హఠాత్తుగా రూపొందెనని చెప్పుట యుక్తియుక్తముగా నుండదు. అంతకుముం దెంతకాలమునుండి యీ భాష వాడుకలో నుండెనో పరిశీలింపవలసియున్నది. క్రీ. శ. మొదటి శతాబ్దికిఁ జెందిన యమరావతీ స్తూపమునందలి యొక రాతిపలకపై 'నాగబు' అను మాట కానవచ్చుచున్నది. ఆ మాట వాక్యగతమై కాక ప్రత్యేకముగా నున్నది. నాగశబ్దము సంస్కృతశబ్దమేయైనను దాని చివరఁగల 'బు' అను నక్షర మది తెనుఁగుభాషను సంబంధించినదే (తత్సమమే) యని స్పష్టముగాఁ దెల్పుచున్నది. ఈ 'బు' అను నక్షరమే తరువాత 'బు, మ్ము,' 'ము,' అను రూపములను జెంది చివరకు ప్రథమావిభక్త్యేకవచనమైనది. మనకుఁ దెలిసినంతవఱకు 'నాగబు' అనునదియే శాసనస్థమైన మొదటి తెనుఁగు మాటగాఁ గానవచ్చుచున్నది. కొంచెమించుమించుగా నా కాలముననే చెందిన హాలుని సప్తశతిలో నచ్చటచ్చట 'అత్త, అమ్మ,' పొట్ట వంటి తెనుఁగుపదములు కలవని తజ్ఞులు చెప్పుచున్నారు. వీనిని బట్టి క్రీ. శ. ప్రథమశతాబ్దినాఁటికే తెలుఁగుభాష తల్లినుండి వేఱయి వ్యవహరింపఁబడెననుటలో నాక్షేపమేమియుఁ గానరాదు.

శాతవాహనుల శాసనములన్నియుఁ బ్రాకృత భాషలోనున్నవి అప్పుడు రాజభాష ప్రాకృతమే. వారితరువాత నాంధ్రదేశమును

బాలించినరాజులు వేయించిన శాసనములు కొన్ని సంస్కృతమునను గొన్ని ప్రాకృతమునను నున్నవి. ఈశాసనములలోఁ బ్రధానముగా వాడఁబడిన భాష దెలుఁగు కాకపోయినను దత్తములైన గ్రామముల పేర్లును, వాని కెల్లలైన గ్రామముల పేర్లును దెనుఁగు పదములుగానే గోచరించుచున్నవి. సామాన్య ప్రజలకుఁగూడఁ దెలియుటకై యాశాసనములందా గ్రామముల పేర్ల నప్పుడు వ్యవహారమున నుండిన నామములతోఁ బేర్కొని యుందురు. అప్పుడు తెనుఁగుభాష వ్యవహారములో లేనిచో నాగ్రామనామములట్లు తెలుఁగుపదములుగా వ్రాయఁబడుటకవకాశము లేదు. ఈవిషయమును బలపఱచు వృత్తాంత మొకటి బృహత్కథ ననుసరించి వ్రాయబడిన కథాసరిత్సాగరములోఁ గానవచ్చుచున్నది. ప్రతిష్ఠాన పురమునందలి సాతవాహన రాజు నాస్థానమునను దిన గుణాఢ్యుడను పండితుఁడు ప్రత్యర్థియగు శర్వవర్మ యాఱుమాసములలో రాజును సంస్కృత భాషాపారగుని జేయఁగలిగిన యెడలఁ దాను నాఁడు వ్యాప్తిలోనుండిన సంస్కృత ప్రాకృత దేశభాషలను వదలివేసెదనని ప్రతినచేసినట్లావృత్తాంతము తెలుపుచున్నది. ఇందుఁ బేర్కొనఁ బడిన దేశి బహుశః అప్పటి సామాన్యజనుల వాడుక భాసయై యుండవచ్చుననియు, నదియే కాలక్రమమునఁ గొన్ని మార్పులు పొంది తెలుఁగు భాషగాఁబరిణమించి యుండుననియుఁ జారిత్రజ్ఞులు తలంచుచున్నారు. సాతవాహనుని రాజధానియై ప్రతిష్ఠాన పురము మహారాష్ట్ర దేశము ననుండుటచేఁ బై వృత్తాంతమునఁ బేర్కొనబడిన దేశి యప్పటి మహారాష్ట్రుల వ్యవహార భాషయే యైయుండును గాని తెనుగుఁవారి వ్యవహార భాషయై యుండదని కొందఱి వాదము. ఈవాదమును మన మంగీకరించినను నప్పుడు తెనుఁగుకూడ దేశభాషగా నుండెననుట కాక్షేపములేదు. ఏలయన మహారాష్ట్ర ప్రాంతముల మహారాష్ట్ర దేశ్యముండినట్లే తెనుగుఁదేశమునఁ దెనుగుదేశ్యము వాడుకలో నుండి యుండవచ్చును. లేనిచో నుత్తర శాతవాహనుల శాసనములలో గ్రా

మనామాదులు తెనుఁగు పేర్లతో వ్రాయఁబడియుండుటకుఁ గారణము కనబడదు. అందుచే క్రీ. శ. 1వ శతాబ్దికిఁ బూర్వమునుండియుఁ దెనుఁగేదోయొక రూపమున వాడుక లోనుండెనని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును.

చాళుక్య రాజు లాంధ్ర దేశమునకుఁ బాలకులుగా నేర్పడు కాలము వఱకును నాంధ్రరాజులైన శాతవాహనులు, ఇక్ష్వాకులు, బృహత్ఫలాయనులు, ఆనంద గోత్రికులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు మున్నగు వారును, నాంధ్రదేశము నందలి కొంత భాగమును పరిపాలించిన పల్లవులును, వేయించిన శాసనములన్నియుఁ బ్రాకృతముననో సంస్కృతముననో యున్నవి. అందచ్చటచ్చటఁ గానవచ్చు తెనుఁగు పదములు గ్రామనామాదులు మాత్రమే యగుటచేనవి భాషాచరిత్ర పరిశీలమున కుపకరించునే కాని యప్పటి వాఙ్మయ పరిస్థితిని గుర్తించుటకుఁ బనికి రావు. అందుఁగానవచ్చు వేపూరు, విరిపఱ, తన్ఱికొన్ఱ (తాంటి కొంట) ఒంగోడు, చెంచెరువ, కంబురాం చెరువ, కేకొన్ఱమ్, పెఱుకు పఱ్ఱు, కుండూరు మున్నగు గ్రామనామములు కొంచె మించుమించుగా ఊరు, పఱ్ఱుచెరువు. కొండ మున్నగు పదములతో ముగియుచుండు నిప్పటి గ్రామనామముల వలెనే గోచరించుచున్నవి. ఈగ్రామనామములకే కొన్నిచోట్ల, 'చెంచెరువే' మున్నగు దాని యందువలె సంస్కృత విభక్తులు చేర్పబడుట కానవచ్చుచున్నది. ఈశాసనములందు దాతృప్రతిగ్రహీతల పేర్లు దాహరింపఁబడి యుండుటచే నప్పటియుత్తమ జాతివారియొక్కయు విద్యాధికుల యొక్కయు నామముల స్వభావము నూహించుట కవకాశము కలుగుచున్నది. దేవశర్మ, యజ్ఞశర్మ శివదత్త మున్నగు నామములు కేవల సంస్కృత నామములే. గొలశర్మ, కొట్టిశర్మ, మున్నగు నామములందుఁ బూర్వార్థము తెనుఁగు పదమువలెనే కానబడు చున్నది.

శాలంకాయన వంశమునకుఁజెందిన నందివర్మ పెదవేగి శాసనమునందలి ( 6, A. D. ) చెఞ్ చెరువె, కంబురాన్ చెరువె అను పద

ములనుఁబట్టియు, విక్రమేంద్రవర్మ వేయించిన చిక్కుళ్ల (506) శాసనమునందలి విజయరాజ్య సంవత్సరంబుళ్ అను పదమును బట్టియు నప్పటికిఁ జాలకాలమునకుఁ బూర్వమే తెలుఁగుభాష ప్రచారమున నుండెనని చెప్పుటకు వీలగుచున్నది. మూల ద్రావిడ భాషయందలి కాదులైన పదములు కొన్ని తెలుఁగునఁ దాళవ్యీకరణమును జెంది చాదులుగాఁ గానవచ్చుచున్నవి. చెరువు శబ్దమట్టి వానిలో నొకటి. ఈశబ్దమితర ద్రావిడ భాషలలోనిప్పటికిని గాదిగానే కానఁబడుచున్నవి. విజయరాజ్యసంవత్సరంబుళ్ అనుపదము చిక్కుళ్లశాసనమున సంస్కృత వాక్య మధ్యమున గోచరించుటచే నాకాలమున వాడుకలో నుండిన తెనుఁగుభాషను బాగుగానెఱింగిన శాసన లేఖకుండు సంస్కృత విభక్తికి బదులుగా సంవత్సర శబ్దములకుఁ దెలుగు విభక్తి చేర్చిలిఖించి యుండునని పండితు లూహించుచున్నారు. ఆతం డేకారణముచే నటు లిఖించినను నప్పటికే సంవత్సరాది సంస్కృత శబ్దములను దెనుంగునఁ దెనుఁగు ప్రథమావిభక్తి బహువచన రూపముతో వాడు పరిస్థితియేర్పడెనని చెప్పవచ్చును. ఈపరిస్థితియుఁబైని పేర్కొనఁ బడిన తాళవ్యీ కరణమును జరుగుటకుఁ దెనుఁగుమూల ద్రావిడము నుండి విడివడిన పిమ్మటఁ జాలకాలముబట్టి యుండును. అందుచే దీనిని బట్టి తెనుఁగు శాసనముల కాలమునకుఁ బూర్వమే దేశమున వాడుకలో నుండెనని నిర్వివాదముగాఁ జెప్పవచ్చును. పల్లవరాజైన విష్ణుగోపశర్మ చూరదాన శాసనమున మయ్యూర్ కూటువయను పదము కానవచ్చు చున్నది. మూఁడు, ఊరు, కూటువ అను మూఁడు తెనుఁగు శబ్దముల కలయికచే నేర్పడిన సమాసమిది. ఇట్లే మూయెలకూడువ, చెఱచెరువు, ఒన్కోడు కురువాడ మున్నగు సమాసము లితర శాసనములందు గోచరించుచున్నవి. ఈసమాసముల ఘటనముకూడ భాష యంతకుఁ బూర్వము చాలకాలమునుండి ప్రచారమున నుండెననుటకుఁ దార్కాణముగా నున్నది.

ఈ శాసనము లన్నింటిలో చణ్డవర్మ, నన్దివర్మ, వేఙ్గిపుర, చెన్చెరువు అను వానివలె ననుస్వారమునకు బదు లనునాసికమే వాడఁబడి

యున్నది. ద్రావిడభాషకు సొంతమైన 'ఱ' కారమును, శకటరేఫమును వ్రాతలో గోచరించుచున్నవి. విజయరాజ్య సంవత్సరంబు ల్ అను దానిని బట్టి ల్ బహువచన సూచక ప్రత్యయముగా వాడఁబడుచుండె ననియు, నిప్పటి ము అను నక్షరమునకు బదులు బిందుపూర్వక బుకారము వాడఁబడుచుండెననియుఁ దెలియుచున్నది. క్రీ. శ. ఏడవ శతాబ్ది వఱకును గల తెలుఁగుభాషను గూర్చి యింతకంటె నెక్కువగా నేమి చెప్పుటకును నవకాశము లేదు. అప్పటి రాజుల యాస్థానములఁ దెలుఁగు కవిత వర్ధిల్లకపోవుటకును, వారు శాసనములనైనఁ దెనుఁగుభాషలో వ్రాయింపకపోవుటకును వారికా భాషపై నాదరము లేమియే కారణమై యుండును.

దేశీయులైన చాళుక్యు లాంధ్రదేశములను బాలింప నారంభించినదాది తెలుఁగునకు గౌరవప్రపత్తులు హెచ్చెను. వారు తమకుఁ బూర్వముండిన రాజులవలెనే కొన్ని శాసనములను సంస్కృతములోఁ గూడ తెలియఁజేసినను గొన్నింటిని దెలుఁగుభాషలోనే వ్రాయించిరి. పులకేశి సోదరుఁడును దూర్పుచాళుక్యవంశమునకు స్థాపకుఁడునైన కుబ్జవిష్ణువర్ధనుఁడు క్రీ. శ. 624 నుండి వేంగీరాజ్యమును బరిపాలించెను. ఈతని కాలమునుండి నన్నయకాలము వఱకును దెలుఁగున వ్రాయింపఁబడిన శాసనములను గద్యశాసనములు, గద్యపద్యశాసనములు, పద్యశాసనములు అని మూఁడు విధములుగా విభజింపవచ్చును. గద్యశాసనములలో మొదటిది కుబ్జవిష్ణువర్ధనుని కుమారుఁడైన జయసింహవల్లభుని కాలమున వ్రాయింపఁబడిన విప్పర్ల శాసనము (641) పై రాజుచే వేయింపఁబడినవే. మఱిరెండు శాసనములును, పశ్చిమచాళుక్య విక్రమాదిత్యుని కాలమునకు (సుమారు 655) జెందిన నొక శాసనమును, చేజెర్ల కపోతేశ్వరదేవాలయ మండపస్తంభముననుండి రెండవ విష్ణువర్ధనుని కాలమునకుఁ జెందినదని యూహింపఁబడిన దొక శాసనమును గలవు.

వీని తరువాతఁ గనవచ్చు గద్యశాసనములలో మఱి దొగరాజు కాలమున వ్రాయింపఁ బడిన (క్రీ॥శ॥ 630) లక్ష్మేశ్వపుర శాసనమును, క్రీ॥శ॥ 740ప్రాంతమునాఁటి దని యూహింపఁబడుచున్న అహదనకర శాసనమును, కడపమండలములో లభించిన సత్యాదిత్యుని మాలెపాడు శాసనమును, మూఁడవ విజయాదిత్యునినాఁటి (క్రీ॥ శ॥ 850) దియు, మల్లికార్జున స్వామి యాలయమున లభించినదియు నగు ధర్మవరపు శాసనమును చాళుక్య భీముని కొరవి శాసనమును (క్రీ॥ శ॥ 9 వ శతాబ్దిచివర) ముఖ్యములైనవి. గద్య పద్య మిశ్రితములైన వానిలోఁ జాళుక్య భీము మహారాజు ధర్మవరపు శాసనమును (840) పండరంగుని అద్దంకి శాసనమును (క్రీ॥శ॥ 850) పేర్కొనఁ దగినవి. యుద్ధమల్లుని బెజవాడ శాసనమును, కందుకూరి రామస్వామి దేవాలయమునఁ గట్టఁబడిన మూఁడవ విజయాదిత్యుని కాలపు శాసనమును కేవల పద్యమయములై నట్టివి.

ఈ పై శాసనములన్నింటిలోను; ఎఱుంబొది, అన్నెటి నాకుబణి సేసిన, మూటికి, చెరువు, పుట్టు, తూర్పు, తాఱితోంట, ఇచ్చిరి, పదు వారంబు, వచ్చినవారు, నేల, కళరేని, చెప్పిన, వేవురు, ఇచ్చిన, ఊరు, మున్నగు దేశ్యపదములు విరివిగానే కనవచ్చుచున్నవి. కాని క్రీ. శ. 9వ శతాబ్దికిఁ బూర్వము వ్రాయఁబడిన గద్య శాసనములలోఁ బ్రాకృత భాషా ప్రభావ మెక్కువగాఁ గానఁబడుచున్నది. అహదనకర శాసనములోనిది మఱియు నెక్కువగా నున్నది. ళకారాంత బహువచన రూపములును (కనడి రజుళ్, కొణ్డ్రుకళ్) దొగ, ప్రితయు, బారణాసి, సప్తలోకాశ్రియ మహా సత్త్వళ్, సర్వబాదపరియారువు మున్నగు రూపములును నిందుకు నిదర్శనము. ఈ ప్రాకృత భాషాపద బాహుళ్యముచేతనే పూర్వశాసనములు కొంతవఱకు దురవగాహములుగాఁ గానిపించును. తరువాత వ్రాయఁబడిన గద్య పద్య మిశ్రితములును, కేవల పద్య రచితములు నైన శాసనములలోఁ బ్రాకృతప్రభావముకంటె సంస్కృత ప్రభావమే హెచ్చుగాఁ గోచరించును. వాని యందలి దీర్ఘ

సమాసములు కొన్ని నన్నయ కాలపు భాషను దలఁపించుచున్నవి. కొఱవి శాసనము లందలి వచనమునకును, బాపట్ల గణేశ్వరస్వామి యాలయములోని యాహవ మల్ల దేవుని కాలమునకుఁ జెందిన శాసనము నందలి వచనమునకును భేద మంతగా లే దనియే చెప్పవచ్చును. దీనిని బట్టి చాళుక్యుల కాలములో మొదటఁ దెలుఁగు ప్రాకృతభాషా సంప్రదాయముల నవలంబించినను దరువాతఁ గ్రమముగా దానిని విడిచి సంస్కృత సమముల నెక్కువగాఁ దనలోఁ జేర్చుకొని నన్నయ కాలమున కాతని భారతభాషకు సన్నిహితమైన రూపము నొందిన దని తలంపవచ్చును. ఈ కారణముచేతనే చాళుక్య పరిపాలనపు టుత్తరకాలమునందలి శాసనములు కొన్ని వికృతి రూపములతోఁ గూడియున్నను మనకు సుబోధములై యుండుట సంభవించినది. విజయాదిత్యపాదభ్రమరాయమాణ, సమస్త రాజ్యభర నిరూపిత మహామన్త్రాధిపతి, దేవబ్రాహ్మణ గురుభక్తిసనాథ, త్రిభువనాభరణుండు, శివ పద వరరాజ్య నేవితుండు మున్నగు నప్పటి శాసనములలోని సమాసరూపములకు నిదర్శనములు.

నన్నయకుఁబూర్వము గల శాసనముల భాషలోఁ బ్రధానముగా నీ క్రింది లక్షణములు 'నవచ్చుచున్నవి. 'ఱ' యను వింత యక్షర మొకటి వానిలో నధికముగా గోచరించుచుండును. ఈయక్షరమును దాని ధ్వనియు నన్నయ నాఁటికే తెనుఁగున విరళములై పోయినవి. అది తెనుఁగునఁ జాలచోట్ల'డ''ళ' కారములలో నొక యక్కరముగా మాఱిపోయినది (రామవిభుతోఁట నెడరిన, చోఱమహారాజు) కన్నడమున దీనికి రళ మని పేరు. ఇది ప్రాచీన కన్నడమున నుండెను. గాని తెలుఁగునవలెనే తరువాత నందుఁగూడ ళ కారముగా మార్పు చెందినది. తమిళమున నది ప్రాచీన కాలమునుండియు గానవచ్చుచునే యున్నది. వ్యవహారమున మాత్ర మందును నిది మాఱి వేఱువేఱు ధ్వనులతో నుచ్చరింపఁబడుచున్నది. ణకార ళకారములతోఁ గూడిన పదములు లం శాసనములలో నధికముగాఁ గానఁబడును. తెలుఁగునఁ గ్రమముగా'నల' కారములు వీనిస్థాన

ము నాక్రమించినవి. కాని తమిళ కర్ణాటకములలో నిప్పటికిని గొన్నిచోట్ల నవి మార్పు చెందక యట్లె యుండిపోయినవి. (గొణిగ, కళకేళి, బనిగొని సంవత్సరంబుళ్, ఏళువేళు) సంస్కృత పదములలో ణకార ముండవలసిన చోటఁ బెక్కెడల నకారము వ్రాయఁబడినది. తెనుఁగున మూర్ధన్య ణకారము ప్రచురణముగా నుండుటచే సంస్కృతమున దంత్య నకార ముండునని యప్పటి లేఖకులు భ్రమపడి యుందురు (భ్రమర యమున, హీనపురము) ఇప్పుడు సాధురేఫముతో నుండు రూపములు పెక్కప్పుడు శకటరేఫములుగా వ్రాయఁబడియున్నవి. సంయుక్తాక్షరములలోఁ గ్రిందను మీఁదను గూడ శకట రేఫములు కానవచ్చుట మఱియొక విశేషము. (తూర్పు, వైదుంబవోలు, వాన్ఱు) రేఫముతో మఱొక హల్లును సంయుక్తముగా వ్రాయవలసిన చోట్ల నప్పుడిప్పటివలెఁ గాక యా యక్షరమును ద్విరుక్తముగా వ్రాసి రేఫమునకు బదులు వలపలగిలక వ్రాయుచుండిరి. ఈ యాచార మిప్పటికిని వృద్ధుల వ్రాఁతలలోఁ గానవచ్చును. (శమ్మ్ర సవ్వ్ర) ! ఇప్పటి నిండుసున్న లప్పుడు వర్గపంచమాక్షరములుగా వ్రాయఁబడుచుండుటచే ననునాసికములతోఁ గూడిన సంయుక్తాక్షరములు విరివిగాఁ గానవచ్చును. (వేంగిరాష్ట్ర, చెఞ్చన, చమ్పిన రెణ్డు) అప్పుడఱసున్నలకు బదులు నిండుసున్నలే వ్రాయఁబడుచుండెను. నిండుసున్నలుండవలసిన చోటఁగొన్ని యెడల హల్లునకు ద్విత్వము కానఁబడుచున్నది ఇట్లు హల్లు ద్విరుక్తమైన చోట్ల ననుస్వారము నెఱసున్న యనియుఁ బెఱచోట్ల నఱసున్న యనియు నెఱుంగనగును. నేఁడా దీర్ఘము లున్న చోట్ల హ్రస్వములును, బరుషము లుండుచోట్ల సరళములును, నప్పుడు విస్తారముగా గోచరించును 'శషస'లొండొంటితోఁ దాఱుమాఱగుచుండుట తఱుచు. ఇందుఁ గొన్ని యప్పటి శాసనలేఖకుల పొఱపాట్లు కూడఁ గానవచ్చును (సక్షి, రాజులాకు, తీనికి, దప్పినవారు) ఇప్పుడు ప్రథమావిభక్తి 'డు' ప్రత్యయ ముండుచోట నప్పుడు సబిందు నిర్బిందుక బువర్ణములు రెండును గోచరించును (వక్రిబు, వక్రింబు) నేటి బహువచనములు

ప్రత్యయ మప్పుడు వివిధరూపములతోఁ గాన వచ్చుచున్నది. లు, ళు, గళ్, గళు, కొళు, మున్నగున వట్టి వానిలోఁ గొన్ని. సాధారణముగా దత్సమ పదముల చివర ళ కారము. దేశీయపదములతరువాత కళ్ గళ్ అనునవియుఁ గనవచ్చుటచే నప్పటివా రనుచిత విభాగముచే కళ్ గళ్ అనువానిలోని చివరి యక్షరమును మాత్రమే బహువచన ప్రత్యయముగా భావించి మొదటిదానిని బదభాగముగానే తలంచుచుండి రని తెలియుచున్నది (కొణ్డుకళ్) తరువాత నీ ళకారము లు అనురూపమును బొంది భాషలో స్థిరపడినది. ఊళ్లు, రట్టళ్లు మొదలగు బహువచనాంతరూపములుఁగూడ నచ్చటచ్చట గలవు. ఈ శాసనములలో సమాపక క్రియలరుదుగా వాడఁబడుచుండెను. కాని యట్టి క్రియారూపము లసలు లేకపోలేదు. క్రొచ్చె, ఇచ్చిరి, చేసిరి వంటి భూత కాలరూపములును, గొణ్డురి, అగు మున్నగు భవిష్యదర్థక తద్ధర్మ రూపములును గొన్ని కానవచ్చుచున్నవి, ఎత్తిఞ్చె, కట్టిఞ్చె వంటి ప్రేరణార్థకరూపములును, అగు అను తద్ధర్మక్రియాజన్య విశేషణమును (అగునేణ్డు) వెల్వారించినన్ వంటి చేదర్థకములును, కట్టిఞ్చి, విడిచి, పడి, మెచ్చక, ఎఱుంగక వంటి క్త్వార్థక వ్యతిరేకత్వార్థక రూపములును, పట్టం కట్టబడియె, కట్టబడినవాన్రు అను రెండు మూఁడు కర్మార్థక రూపములును గూడ నం దచ్చటచ్చట నున్నవి.

ఈ శాసనములలో రెండచ్చుల వ్యవహితములై వచ్చినప్పుడు సంధి లేకపోవుటయే తఱుచు. సంధి లేనిచోట ఇచ్చిన యూరి (650) రచ్చయిల్లు (650) కొనియుండు (890) మున్నగు కొన్ని స్థలముల యడాగమము కాన వచ్చుచున్నది. సంధి కావలసినచోటఁ గూడ యడాగమముతోఁ గూడిన స్థలములు కొన్నిగలవు. (సంవత్సరంబుల్ యేనగు (650) కుడుచు వారు యిళ్లు) బణిసేసిన, దయసేసి (అహదనకర) పురము సొచ్చె (చాళుక్య భీమరాజు) మున్నగు స్థలములందు గసడదవాదేశ సంధి కానఁ బడుచున్నది.

ఈ చాళుక్యుల శాసనములలోఁగూడ నంతకుఁ బూర్వమునందలి వానివలెనే యచ్చమైన సారస్వత మని చెప్పఁ దగిన రచన మృగ్యము.

ఇవన్నియు దానవిషయములతోడను, దానిని జెఱచినచోఁ గలుగు పాపముల వివరముల తోడను, దానకర్తల బిరుదావళుల తోడను గూడి యున్నవి. 9వ శతాబ్దికిఁ బూర్వమున్న వచనశాసనములోఁ గొన్నిపద ములే తప్ప వాక్యము లేవియుఁ బూర్తిగా నర్థమగుటలేదు. అందుఁ బ్రాకృతభాషాసంపర్క మెక్కువ యుండుటయు, దేశీయపదము లైనను బ్రాచీనరూపములతోఁ గూడియుండుటయు నిందుకుఁగారణము. ఈ శాసనములు చాళుక్యరాజుల కాలమునఁ దెలుఁగునకు గౌరవము హెచ్చె ననియు నది జనులచే విరివిగా వ్యవహరింపఁబడు చుండె ననియు మాత్రము సూచించుచున్నవి. పద్యశాసనములను బట్టి యా కాలపు ఛందోవిశేషములఁ గొన్నింటి నెఱుఁగ వీలగుచున్నది. యుద్ధమల్లుని బెజవాడ శాసనములలో నన్నియు మధ్యాక్కరలే కలవు. మూఁడవ విజయాదిత్యుని కాలమునందలి రెండుశాసనములలో సీసపద్యమును, పండరంగుని అద్దంకి శాసనమునఁ దరువోజయుఁ గలవు. ఈ పద్యము లన్నియు దేశీయము లైనవే. సంస్కృత వృత్తములను వాడు నాచార మప్పటి కింకను బ్రచారము నొందియుండ లేదు. ద్విపదములును వానివలెనే దేశీయము లైన వృత్తములును మాత్రమే యప్పుడు వాడుకలో నుండినట్లు కానవచ్చుచున్నది. ద్విపదలను వ్రాయునప్పు డిన్ని పాదములను వ్రాయవలె నను నియమము లేదు. వ్రాయ వలసిన వస్తువు విస్తృతిని బట్టి యందలి పాదములసంఖ్య నియ మితమై యుండును. రెండు ద్విపద పాదము లైనచో నొక తరువోజ పాద మగును. ఇందు యతిప్రాసములతోఁ గూడిన యిట్టి పాదములు నాలు గుండును. మధ్యాక్కరలలోఁ గూడ యతిప్రాసలు కలవు. అవియును జతుష్పాదములే. ఒకప్పుడివి కూడ ద్విపదలవలెనే యనియమితసంఖ్యగల పాదములతోఁగూడి తరువాతఁ గ్రమముగాఁ జతుష్పాదు లై యుండును. ఇట్లువి మాఱుటకు సంస్కృతవృత్తముల ప్రభావమే కారణమై యుండును. అక్కరలు కన్నడమునఁ గూడఁ బూర్వము విరివిగా వ్రాయఁబడినవి.

కాని 13వ శతాబ్దికిఁ బిమ్మటఁ బూర్తిగా సంతరించినవి. తెలుఁగులోఁ గూడ నన్నయతరువాత మధ్యాక్కఱలను వ్రాసినవాఁ డొక్కఁ డెఱ్ఱాప్రెగ్గడమే. సీసము కన్నడములో లేదు. తెలుఁగున మాత్ర మున్నది. అప్పకవి సీసము లేదు విధములని చెప్పినాఁడు. వీనిలో యతియో ప్రాసయతియో వాడు నాచార మప్పు డుండెను. నన్నయతరువాత నీ యాచారము మాఱిపోయినది. ఒక్క సమసీసము మాత్రమే భాషలో నిలిచినది. కన్నడమున నన్నయకుఁ బూర్వమే సంస్కృత వృత్తములు విరివిగా నుపయోగింపఁ బడినవి. అంతకు ముందములోఁ గూడ నక్కరాది దేశీయవృత్తములే యుండి యుండును. కన్నడమునవలెనే తెలుఁగునఁ గూడ నన్నయతరువాత దేశీయ వృత్తములకుఁ బ్రచారము తగ్గుటయుఁ గ్రమముగా సంస్కృత వృత్తములు వాని స్థానము నాక్రమించుటయు సంభవించినవి. శాసనము లందలి యీ పద్యములను బట్టి నన్నయకు రెండు శతాబ్దులకుఁ బూర్వమే దేశీయ వృత్తములతోఁ గూడిన పద్యరచన యుండె నని విశద మగుచున్నది.

పండరంగుని యద్దంకి శాసనమునను, చాళుక్య భీమమహారాజు ధర్మవర శాసనమునను, వృత్తములతోఁ బాటు కొంత వచనము కూడ నున్నది. గద్య పద్యములతోఁ గూడిన యీ పద్ధతికే చంపూపద్ధతి యని పేరు. నన్నయాదులు భారతము నీ పద్ధతినే వ్రాసిరి. కన్నడకవులు కూడఁ దమరచనములలో నీ పద్ధతినే యవలంబించిరి. దీనిని బట్టి యీ చంపూకావ్యపద్ధతి నన్నయ క్రొత్తగాఁ దెచ్చిపెట్టినది కా దనియు నీతనికి రెండుశతాబ్దులకుఁ బూర్వమే దేశమున వాడుకలో నుండె ననియుఁ దెలియుచున్నది. సంస్కృతమున నీ చంపూకావ్య రచనాపద్ధతి క్రీ. శ. 10వ శతాబ్దికిఁ బూర్వ మున్నట్లు కానరాదు. అందీ పద్ధతిని మొట్టమొదట నవలంబించినవాఁడు చంపూరామాయణ కర్త యైన భోజుఁడే యని తోఁచుచున్నది. ఈ చంపూపద్ధతి తొలుత దేశభాష లందే ప్రచారమున కెక్కె ననియు, నం దుండియే సంస్కృతమునకుఁ బ్రాఁకె ననియుఁ గొందఱు తలఁచుచున్నారు.

పైని పేర్కొనఁబడిన శాసనమువలన నన్నయను రెండుశతాబ్దులకుఁ బూర్వము నుండియుఁ దెలుఁగున దేశీయ వృత్తములును బద్యరచనయు నుండె నని తెలియుచున్నది. నన్నయకుఁ బూర్వ మందలి కావ్యము లేవియు మనకుఁ గానఁబడుట లేదు. అసలు నిర్మింపఁబడెనో లేదో కూడఁ దెలియదు. శాసనస్థము లైన పద్యములకంటె భిన్నమైన వాఙ్మయ మేమైన నప్పు డుండెనా? ఉండినచో నది యే రూపమున నుండెను? అను ప్రశ్నలను మనము విచారింపవలసి యున్నది. మానసమున సంతోషవిషాదాదులకు వేనికి సంబంధించిన వైనను నిశితము లైన భావములు కలిగినప్పు డవి సాధారణముగా లయాన్విత మైన భాషలో వ్యక్తము లగుచుండుననివిమర్శకులు నుడువుచున్నారు. సంస్కృతమున నాదికవి యైన వాల్మీకి హృదయమున నుప్పతిల్లిన శోకమే శ్లోకత్వమును బొందె ననుట సుప్రసిద్ధ విషయమే. నన్నయకుఁ బూర్వము నందలి తెలుఁగు వారికి వివిధసమయములం దట్టి నిశితభావము లుప్పతిల్లి యుండు ననుటలో సందేహ మేమియు లేదు. అప్పుడు వా రా భావములను బాటలలోనో పద్యములలోనో వ్యక్తము చేసియుందురు. అవి మన కిప్పుడు లభ్యములు కాక పోవుటచే వానిస్వరూపమును నిర్ణయింపఁజాలకున్నాము, పాల్కురికి సోమనాథుఁడు (క్రీ. శ. 13వ శతాబ్ది) పండితారాధ్య చరిత్రమున శ్రీశైలమునకుఁ బోవు భక్తులు తుమ్మెద పదములు, ప్రభాతపదములు, పర్వతపదములు, ఆనందపదములు, గొబ్బిపదములు, వెన్నెలపదములు మొదలగునవి పాడుచుండి రని వ్రాసియుండెను. మఱియు నాతఁడు బసవ పురాణమునఁ బ్రాచీనశివభక్తుల చరిత్రములను బురాతన గీతములను బట్టి రచించితి నని చెప్పుకొనెను. పైని పేర్కొనఁబడిన పురాతన గీతములును బదములును నన్నయకు సమకాలముననో లేక పూర్వముననో రచింపబడి ప్రచారమున నుండె నని చెప్పుట కవకాశ మున్నది,

పండితారాధ్య చరిత్రమున సోమనాథుఁడు "అనియతగణైః, ప్రాసో వా, యతి ర్వా యని సంస్కృతోక్తులను మూఁడింటి నుదాహరిం

చినాఁడు. యతిప్రాసముల విషయమును అనియతములైన మాత్రా గణముల ప్రస్తావమును నిం దుండుటచే నివి తెలుఁగు ఛందస్సునకు సంబంధించిన సంస్కృత సూత్రములై యుండు ననియు, వీనితోఁ గూడిన ఛందోగ్రంథములు బహుశః నన్నయ కర్వాచీనము కాఁగూడ దనియు కీ. శే. వే. ప్రభాకరశాస్త్రిగా రభిప్రాయపడి యున్నారు. దీనిని బట్టి యంతకుఁ బూర్వమే మాత్రాగణబద్ధములై యతియో ప్రాస యో కలిగియుండు రచనలు విరివిగా నుండు నని తెలియుచున్నది. ద్రావిడ భాషలోఁ బదొకండవ శతాబ్దికిఁ జెందిన యాప్పిరంగలమ్ అను ఛందో గ్రంథ మొకటి యున్నది. ఆగ్రంథకర్త యందు తెలుఁగు కర్ణాట ఛ్ఛందములఁ గూర్చి ప్రస్తావించుటయే కాక వాంచియ రచించిన తెలుఁగు గ్రంథమును జూచి తా నాగ్రంథమును వ్రాసినట్లు చెప్పుకొనెను. (వాంచి యార్ శెయిద వడఘు చందన్నం) వాంచియ వ్రాసిన తెలుఁగు ఛందో గ్రంథ మేదియు మనకుఁ గానవచ్చుటలేదు. ప్రాచీన లిపిపఠన నిపుణులు కొందఱు వాంచియర్ అనుపదమును రేచియర్ అని చదివియుండిరి. అగుచో నాఛందోగ్రంథము రేచన (రేచియ) రచించిన కవిజనాశ్రయ మై యుండును. రేచన జైనుఁడు. యాప్పిరంగలమ్ కర్తకూడ జైనుఁడే. అందుచే నాతఁడు రేచనగ్రంథమును వ్రాసి యుండె ననుకొనుటలో నసందర్భ మేమియు నుండదు. అతఁడు రేచన యైనను గాకున్నను ఆ తెలుఁగు ఛందము నన్నయకు సమకాలికుఁడో యించుకపూర్వుఁడో యైన యాప్పిరంగులమ్ కర్తకుఁ బూర్వుఁడనుటలో సందేహము లేదు. అతఁడు ఛందోగ్రంథము వ్రాసె ననఁగా నంతకుఁ బూర్వమే తెనుఁగున వివిధములైన ఛందములును, తద్రచితము లైన పద్యములును నుండె నని మన మూహింప వచ్చును. పైని పేర్కొనఁబడిన నిదర్శనములను బట్టి నన్నయకుఁ బూర్వము పాటలు, రగడలు, ద్విపదలు, మంజరులు, అక్కరలు, సీసములు మొదలైన ఛందోవిశేషములు విరివిగా నుండె నని చెప్పవచ్చును. వీనిలో రచింపఁబడిన యప్పటి కవిత్వము లభింపక పోవుట దురదృష్టము.

నన్నయకుఁ బూర్వముండిన కవిత్వముయొక్క పరిస్థితిని దెలిసికొనుటకు నన్నెచోడుని కుమార సంభవము నందలి యీ క్రింది పద్యము కొంత యాధార మగుచున్నది.

మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవిత పుట్టించి తెనుం
గును నిలిపి రంధ్రవిషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలగు పలువుర్.

కుమారసంభవమును మొదట ముద్రించినపుడు శ్రీ మా. రామకృష్ణకవిగా రీ పద్యమునందలి చివరి పాదమును జనసత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్ అని ముద్రించియుండుటచేఁ బలువురు దాని నాధారము చేసికొని నన్నెచోడుని నన్నయకంటెఁ బూర్వునిగా నిరూపింప యత్నించిరి. కుమార సంభవమునకుఁ దాళపత్రప్రతియొక్కటి తంజాపురపుస్తక భాండాగారముననే కల దనియు, నందీ పాఠముకాక చాళుక్యరాజు మొదలగు పలువురను పాఠమే యున్న దనియు, నందుచేఁ గవిగా రొసఁగిన పాఠమును గ్రహింప వీలులే దనియు శ్రీప్రభాకర శాస్త్రిగా రుద్ఘాటించి యున్నారు. పై పద్యమునందలి చాళుక్యరాజు రాజరాజ నరేంద్రుఁడే యనియు నాతఁడే యాంధ్ర దేశమున దేశికవిత పుట్టించె ననియుఁ జెప్పుకొనుట కాక్షేప ముండదు. ఏల యనఁ దెనుఁగున మొదటి కావ్యమైన భారత మాతని కాలముననే యాతని యాస్థానముననే యాతని ప్రేరణముననే రచింపఁబడియున్నది.

పై పద్యమున రాజరాజ నరేంద్రునకుఁ బూర్వము లోకమున మార్గకవిత నెలసి యుండె నని తెల్పఁబడినది ఈ మార్గకవిత యే దను ప్రశ్నకు సమాధానము నరయు నపుడు మన మా కాలమున నుండెడి భాషాపరిస్థితులను బాగుగాఁ బరిశీలింపవలయును. ఆంధ్రదేశమున నప్పుడు విద్యయన్నను బాండిత్య మన్నను సంస్కృతమునకు సంబంధించినదే. సంస్కృతభాషాపండితులే యప్పుడు గౌరవింపఁబడుచుండిరి. ఆకారణముచేఁ బలువురు ప్రతిభావంతు లాభాషనే చదివి యందే

కవిత్వము చెలాయించుచుండిరి. అప్పుడు దేశభాషలయందలి కవిత్వమును పండితులు మిక్కిలి లఘుభావముతోఁ జూచుచుండిరి. అప్పుడే యీ నేల తరువాత నాలుగైదు శతాబ్దులవరకును దేశభాషాకవిత్వమున కా హైన్యము తొలఁగించి యుండలేదు

విలసద్భావ రసాద్యలంకృతులచే విఖ్యాతి గీర్వాణ భా
షల కబ్బంబుల కెన్ని మంచితనముల్ సంధిల్లు నాచందమై
వెలయుం బ్రాసమునంత కగ్గములై వర్తిల్లు సత్కావ్యముం
దెలుఁగంచున్ జెవిఁ బెట్టలేమి యుడుపం దేఁ గల్గునే మందిలన్.

అవి విన్నకోట పెద్దన వ్రాసిన పద్యమును బట్టి తెలుఁగున భారతాది మహాకావ్యములు విలసిల్లిన యాతని కాలమునఁ గూడఁ బండితులకుఁ దెలుఁగు కవిత్వ మన్న నేవగింపుగనే యుండె నని తెలియుచున్నది. బహుశః సంస్కృతాంధ్రములు రెండింట నిరాఘాట పాండిత్యము వహించి, రెడ్డిరాజుల యాస్థానమున విద్యాధికారియై తెలుఁగున బహు ప్రబంధములు రచించిన శ్రీనాథుని కాలమునకును దెనుఁగున కా దుర్గతి దూరమైయుండదు. ప్రధానముగాఁ దెనుఁగు నకవియై శ్రీనాథుఁడు సంస్కృతమున నుద్దండ పండితుఁడైన డిండిము నోడించి యాతని కంచుఢక్క పగులఁ గొట్టించి కనకాభిషేకమును బొందుట యంతకుముందు సంస్కృత మధిష్ఠించిన సింహాసనమును దెనుఁ గాక్రమించుటకు నిదర్శనముగా నున్నది. నన్నయ తెనుఁగున భారతమును వ్రాయఁబూని నప్పు డాతని నాక్షేపించిన వారు, నిరసించిన వారు విరోధించినవారు పలువు రుండి యుందురు అప్పు డాతనికి సంస్కృత పండితులతోఁ గలిగిన వాదోపవాదములలో నతని సహాధ్యాయుండును బహుభాషావిశారదుఁడును నగు నారాయణభట్టు చేదోడు వాదోడై వర్తించియుండును. నిశ్చలమైన ధైర్యమును నంతకంటెను బ్రోత్సాహకరమైన రాజాశ్రయమును లేనిచో నన్నయ యా కాలమున నాంధ్రమును వ్రాయఁ జాలక పోయియే యుండును. ప్రతిభావంతుఁ డగుటచే నాతఁడు తన రచనలో సంస్కృత సమములనే హెచ్చుగా

వాడి యొకవంక దేశభాషాకవితో ద్దారకుఁడైన రాజునకును సంస్కృత భాషాభిమానులగు పండితులకును గూడఁ బ్రీతి కలిగించుటకు యత్నించి యుండును. కన్నడ భాషలలో నంతకు ముందే యట్టి రచనాపద్ధతి కలదు. నారాయణభట్టు దాని నాదర్శముగాఁ జూపుట చేతనో లేక తానుగూడ స్వయముఁగాఁ గన్నడగ్రంథములను జదివి యుండుటచేతనో నన్నయ ధైర్యము వహించి యీ పద్ధతి నవలంబించి యుండును.

దీనిని బట్టి నన్నయకుఁ బూర్వముండిన మార్గకవిత్వ మేదియను ప్రశ్నకు సంస్కృతమే యని సమాధానము చెప్పవలయును కాని దీనికిని నన్నెచోడుని కుమారసంభవము నందలి యొక విషయము బాధకముగా నున్నది. అతఁ డొక పద్యమున మార్గకు మార్గ మనియు, దానిని విడువ మన సొప్పక దుర్మార్గపదవర్తు లనఁదగు మార్గకవులం దలంప నలఁతి మహి సుకవుల కనియు మార్గకవితాపద్ధతిని దెగనాడి యుండెను. సంస్కృత భాషామహాకవుల నాతఁడు తనకావ్యమున భక్తిపూర్వకముగాఁ బేర్కొని సన్నుతించియే యుండెను. అందుచే నాతఁడు మార్గకవిత్వ మని పేర్కొన్నది సంస్కృతకవిత్వము కంటె భిన్నమైన దేదో మఱి యొకటై యుండవలయును. అది యేది ?

పాల్కురికి సోమనాథుని వృషాధిపశతకములో నొక్క తెలుఁగు పద్యములే కాక సంస్కృతము, కన్నడము, మహారాష్ట్రము, అరవము మున్నగు భాషలందు రచింపఁబడిన పద్యములు గొన్ని కలవు, ని న్నీభాషతో సంస్తుతించెను, ఈభాషతో నుతించెద నని చెప్పుచు నా శతకమున నాతఁడు వివిధభాషావాక్యములతోఁ గూడిన పద్యములు గొన్ని వ్రాసెను. ఆ సందర్భమున మణిప్రవాళశైలి యొక్క యెడ నవలంబింపఁ బడినది. మణులును బ్రవాళములును గలసియుండు నట్లా శైలిలోఁ దెలుఁగు పదములును సంస్కృత విభక్త్యంతములగు పదములు గలసి యుండును. ఇట్టి శైలీ సంప్రదాయము మళయాళమున విస్తారముగా గోచరించు నని చెప్పుదురు. అట్టిశైలి తన కాలమున బ్రచారమున నుండిన కతముననే సోమనాథు డందుగూడ నొక

పద్యమును వ్రాసి నృపాధిపుని సంస్తుతించి యుండెను. క్రీ. శ. 23 వ శతాబ్దిలో నివసించిన కేతన యాంధ్రభాషా భూషణమున నట్టి శైలి పరిహార్య మని సూచించియుండెను. నిజముగా నట్టి సంప్రదాయ మొకటి దేశమున నుండనిచో దానిని సూచించి యాతఁడది వర్జ్యమని చెప్పవలసిన యక్కఱ యుండదు అట్టి రీతి నన్నయకుఁ దరువాత విరళమై క్రమముగాఁ నంతరించి పోయినను, అంతకు బూర్వము కొంత ప్రచారము గాంచి యుండు ననుట కవకాశము కలదు. అప్పుడు పండితులు సంస్కృత భాష యందుండిన యతిప్రీతిచే దానిని విడువఁ జాలక, సంస్కృత శబ్దములను సంస్కృత సమములుగా కూర్చకుండ సిద్ధ రూపములతోనే తెలుఁగు మాటలతోఁ గలిపి వాడుకొనుచుండి యుందురు. ఇట్టిమణి ప్రవాళశైలితో వ్రాయఁబడిన కవిత కూడఁ గొంత యప్పు డుద్భవించియుఁ దరువాత మిక్కిలి దుష్టముగాఁబరిగణింపఁబడుటచే రూపుమాసి యుండును. అచ్చటచ్చటఁ దెలుఁగు మాటలుకూడ నుండినను జాలవఱకు సంస్కృత పదములతోడనే కూడి యుండిన యాశైలికవిత్వము చే నన్నెచోడుఁడు మార్గకవిత్వమని పేర్కొని యుండవచ్చును. అందుచేతనే యాతఁడు దానిని నింద్యముగాఁబరిగణించి యుండును. ఈ విధముగాఁ జెప్పుకొన్నచో నాతని వ్రాఁత కొక విధముగా సమత్వయము కుదుర్చుకొనవచ్చును. కాని శాసనము లందెచ్చటను ఆశైలిని రచింపబడిన పద్య మొకటియుఁ గానరాకుండుట యీయూహ నించుక బలహీనము గావించుచున్నది.

మార్గకవిత్వము సంస్కృత కవిత్వమైనను అది ప్రచారమున నుండగా రాజరాజు దేశికవితకు అనఁగా దెలుఁగు భాషలో భారతము రచించుటకుఁ బ్రోత్సాహ మొసంగి యుండును. నిజముగా నప్పుడు రాజరాజువంటి దేశ భాషాలాలసుఁడైన రాజే యుండనిచోఁ దెలుఁగు నిలువకయే యుండెడిదని చెప్పవచ్చును. అగుచో రాజరాజునకు ముందే శాసనాదులలోఁ బద్యములు గానవచ్చుచుండగా నాతఁడే దేశికవిత పుట్టించె ననుట సమంజసముగా నుండునా? ఆతనికి ముందు

తెనుఁగున నొక రకమైన కవిత యుండె నని యొప్పుకొనక తప్పని మాట నిజమే కాని యది దేశీయ వృత్తాదుల తోడను ద్విపదల తోడను నిబద్ధమై కావ్య గౌరవమునకుఁ జాలక సామాన్య జనులలో మాత్రమే పరిచారముఁ బడయుచు బండితుల యాదరమునకు బాత్రమై యుండక పోవచ్చును. జను లా పాటలను, బదములను దేశీయగీతములను నుత్సాహము జనించినపుడు పాడుకొని యానందించి యుందురు. వానిని రచించినవారు కూడ సంస్కృత భాషాపండితులు కాక సామాన్యులై యుందురు. అట్టివి సామాన్యముగా గ్రంథస్థము లగుటయే యరుదు. అయినవి సైత మప్పటి మత వైషమ్యములకు ఫలితముగా మతాంతరావలంబులచే నడఁగింపఁబడియుండును. కాఁగాఁ దెనుగునఁ బండితాదరమునకు బాత్రమై కావ్య మనిపించుకొనఁదగిన మొదటి రచనకుఁ గారకుఁడైన వాఁడు రాజరాజనరేంద్రుఁడే యై యుండును అందు చేతనే దేశికవిత పుట్టించి తెనుంగును నిలిపిన మహా గౌరవ మాతనికి దక్కినది.

ఈ దేశికవిత్వము కూడ నప్పుడిరు తెఱంగులుగా నున్నట్లు కానిపించుచున్నది. అందుఁ దత్సమ పద బాహుళ్యమును దీర్ఘసంస్కృత సమాస ప్రాచుర్యమును గలిగిన దొకటి. తత్సమ పదవైరళ్యము తోడను నాచ్ఛిక పద బాహుళ్యము తోడను గూడినదొకటి. ఈరెండు పద్ధతులును గూడ నన్నయకుఁ బూర్వముండిన శాసనముల రచనలోఁ గానవచ్చు చున్నవి. ఇందు మొదటి దానినవలంబించి భారతమునందే రచించి నన్నయ దాని కతిప్రచారము కలిగించెను. తరువాత కవులలో నల్ప సంఖ్యాకులు తప్ప మిగిలినవారందరును దానినే యనుసరించి యనేక కావ్యములును రచించి యుండిరి, శ్రీనాథుఁడును బ్రబంధకవులును నా పద్ధతికి మఱింత ప్రాచుర్యము చేకూర్చిరి. ఈ నాఁటి వఱకుఁ గూడ నా పద్ధతియే నిరాటంకముగా సాగుచున్న దని చెప్పవచ్చును. ఇంక నన్నయకుఁబూర్వ ముండె నని భావింపబడు దేశీయవృత్త మాత్రాచ్ఛందోనిబద్ధము లైన పదాదులలో నా రెండవ పద్ధతి యవలంబింపఁబడియుండును, దాని నప్పటి పండితు లంతగా నాదరించి యుండ

లేదనియు నందుచేతనే నన్నయ సంస్కృతపద భూయిష్ఠ మయిన శైలి నవలంబించి యుండె ననియు జెప్పి యుంటిమి. నన్నయ తరువాతఁ బ్రసిద్ధి నందిన శైవకవులు సంస్కృతపదభూయిష్ఠ మైన శైలి సర్వ సామాన్యము కా దనియు బ్రసన్న మైన జాను తెనుఁగు కావ్యరచనకు దగిన దనియు భావించి తా మా జాను తెనుఁగుననే తమ కావ్యములను రచించి నట్లు చెప్పుకొని యుండిరి. ఈ జాను తెనుఁగు బహుళవిరళ సంస్కృత పదఘటిత మైన యా రెండవ పద్ధతి బరిణామరూపమే కావచ్చును. పాల్కురికి సోమనాథుఁడు వృషాధిపశతకములోఁ జాను తెనుఁ గని పేర్కొన్న 'బలుపొడతోలు సీరయును' నను పద్యము తరువాత వెలువడిన యచ్చ తెనుఁగు కావ్యములలోని పద్యమును బోలి యున్నది. అందు సంస్కృతపద మొక్కటియును లేదు. దీనినిఁబట్టి సంస్కృతపదరహిత మైన యచ్చ తెనుఁగునే శైవకవులు జాను తెనుఁగుగా భావించి రనుటకు వీలు లేదు. ఏల యన వారి కావ్యములలో నన్నయ భారతమున వాడినన్ని సంస్కృతపదములు లేక పోయినను అవి యసలు లేకపో లేదు. కుమార సంభవమున దీర్ఘసంస్కృత సమాసఘటితము లైన పద్యము లెన్నో కలవు. ద్విపదరచితము లైన బసవపురాణ పండితారాధ్య చరిత్రలలోఁ గూడ తత్సమపదములును సంస్కృత సమాసములును విరివిగానే కానవచ్చుచున్నవి. అందుచే సాధ్యమైనంతవఱకు సంస్కృత పదములు తగ్గించి, దేశీయపదములతోడను జాతీయపదములతోడను, జాతీయప్రయోగములతోడను గూర్చిన కవిత్వమునే వారు జాను తెనుఁ గని భావించి రని తలంపవచ్చును. ఒక విధముగా జూడఁ దిక్కన రచించిన భారతమున దేశీయపదఘటిత మైన శైలి శైవ కవులరచనముల కంటెను బ్రస్ఫుటముగ నుండు ననియు బైని పేర్కొనఁబడెను. రెండవపద్ధతికిఁ జెందిన దేశికవిత యాతని భారతముననే పరిణతి నొందిన దనియుఁ జెప్పవచ్చును. తరువాత బయలుదేఱిన పదవాఙ్మయమును పాటలును వ్యాకరణాది సంస్కారహీనము లైనను గొంచె మించుమించుగా నీ పద్ధతినే రచింపఁబడి

యున్నవి. నన్నయ భారతమును గూడ నిట్టి శైలితోఁగూడిన పద్యము లెడనెడ లేకపోలేదు. అందుచే నన్నెచోడుఁడు చాళుక్య రాజు దేశి కవిత పుట్టించె నన్నప్పుడీ యిరుతెలుఁగుల దేశికవితా పద్ధతులను మనసునం దుంచుకొనియే చెప్పి తన కందు రెండవది ప్రీతిపాత్ర మగుటచే దానినే యవలంబించె నని తలంప వచ్చును.

పద్యములు శిలాక్షరములై శాసనములలోఁ గానవచ్చు చుండఁగాఁ, బదములు పాటలు మున్నగు వానితోఁ గూడిన వాఙ్మయము కొంత తప్పక నన్నయకుఁ బూర్వ ముండి యుండు నని యూహించుట కవకాశ ముండఁగా, నన్నయ నాంధ్రమున నాదికవి యనుటకు సులక్షణమైన భాషలో నుదాత్తమైన కావ్యమును బండితాపండితజనప్రమోదముగా మొట్టమొదట నాతఁడుఁ వ్రాయుటయే కారణము. కాని వేఱు కాదు. ఆతనికి ముం దుండిన వాఙ్మయము నప్పటి పండితులు కవిత్వ మని యాదరింపలేదు. దాని కవితాపాటవమును బరిశీలించుట కది తరువాత లభ్యము కాలేదు. నన్నయ దివ్య కవితా తేజము ముం దది వివర్ణమై రూపము గోల్పోయి మినుకు మినుకు మని సన్నగా వెల్గివచ్చు చు నిప్పుడిప్పుడు కొంత దోహదము లభింపఁ గాంతిసంతానమును బరగింప నారంభించుచున్నది.

దివాకర్ల వేంకటావధాని. ఎం. ఏ. ఆనర్సు.
AI/ 559 నల్లకుంట.
జామియా ఉస్మానియా P. O. హైదరాబాదు (Dn.)

# గ్రంథ సమీక్ష

జ్ఞానసింధువు—మోహ వివేక యుద్ధ సారసంగ్రహము:—

గ్రంథకర్త: గొల్ల శివప్పగారు- పెద్దహోతూరు, ఆస్పరిపోస్టు, బళ్లారిజిల్లా.

కన్నడమున శ్రీ చిదానందులవారు షట్పదులలో రచించిన జ్ఞానసింధువను జ్ఞానప్రబోధకగ్రంథమును గ్రంథకర్త ఆంధ్రపద్యకావ్యముగా ననువదించియున్నారు. అందు 48 తరంగములు- 1500 పద్యములు గలవఁట. అది యింకను నముద్రితము. తన్ముద్రణమునకయి యుదారహృదయులగు భాషాభిమానుల ధనసాహాయ్యము నర్థించుచుఁ బ్రకృతమా గ్రంథమందలి యొక తరంగములోఁ "మోహవివేక యుద్ధసార సంగ్రహ"మను విషయమేఁబదిపద్యములు గలది మచ్చుతునకగా గ్రంథకర్త 1947 సంవత్సరములో బ్రకటించినారు. నామమును బట్టియే యందలి విషయస్వరూప మెఱుంగనగును. సదాశివుఁడు షణ్ముఖునకు బోధించినట్లుగా, నిది చెప్పఁబడినది. మాయా లలన తనయుఁడయిన మానసునకు, కామ్యా-కామ్యక లను భార్యలం దుదయించిన మోహుఁడు. వివేకుఁడు నను సవతిసోదరులకు దేహరాజ్యాధికారమునకయి జరిగిన పోరాట మిందభివర్ణితము. సంస్కృతభాషయందలి ప్రబోధచంద్రోదయాదికృతులు శ్రీ చిదానందస్వామి కర్ణాటమూలగ్రంథమునకు స్ఫూరకములుగా గోచరించును. మోహుఁడు నాతని పరివారము పశుబలము నెఱపి వివేకునిఁ దదనుచరులను మొదటఁ గొంతకాలము పాఱదోలి రాజ్య మాక్రమించియుఁ దుదకుఁ గాలాంతరమున నాదాయాదులకు లోఁగి పదభ్రష్టులగుట ప్రకృతప్రకటిత గ్రంథభాగమందలి యితివృత్తము, ఆంధ్రీకరణము ధారాళముగ లలితశైలితో నలరారుచున్నది. మచ్చున కీక్రిందిపద్యము చూడనగును.

"ఏమీ! మోహుఁడు దేహరాజ్యమును దా నేలంగ నూహించెనే !
కామాద్యాప్తులతోడఁగూడి; మనలో క్షాత్రంబు బెండయ్యెనే ?
సామర్థ్యంబు దలంపఁడించుక; బలిష్ఠంబైన సత్త్వాననే
భూమిం దాఁగినఁబట్టి ముంతమురణాం, భోరాశిలోఁ గూలంగన్". (ప 34)

బండారు తమ్మయ్య

# భీమేశ్వరపురాణము—కొన్ని స్థలవిశేషములు

## దక్షారామము

చిలుకూరి పాపయ్య శాస్త్రి

క. దక్షుని సవనాగారము
దక్షారామంబు శివుఁడు తన్మధ్యమునన్
సాక్షాత్కరించియుండుట
మోక్షము భోగంబు బ్రాఁతె ముజ్జగములకున్.

భీమ. ౨-౧౬

ఈ దక్షారామము మహత్త్వమును, మఱియొక పద్యమునం దిట్లు లుగ్గడించియున్నాఁడు.

భీమనాథేశ్వరుని కన్నఁ బెద్దవేల్పు
దక్షవాటంబుకంటె నుత్తమపదంబు
సప్తగోదావరముకంటె సకలతీర్థ
సారమగు తీర్థరాజంబు జగతి లేదు.

౨-౧౭

భీమలింగంబు త్రిభువనస్వామి యెప్పుడు
సన్నిధానంబు గైకొనియున్నకతనఁ
దీర్థములలోన నుత్తమతీర్థ మయ్యె
దక్షిణానందవనవాటి దక్షవాటి.

౬-౧౬

దక్షవాటమునందు పరమేశ్వరుఁడు సాక్షాత్కరించియుండుటకును, అది భోగమోక్షనిలయమగుటకును గారణము పరమేశ్వరుని నోట మహర్షుల ప్రార్థనపై నీతీరుగ ననిపించియున్నాఁడు.

గీ. ఎల్లకాలంబు నుండెద నిచట నేను
మొదలి మామామ యారామపదమునందు

వెండిగుబ్బలిపై వేడ్క వీడుకొలిపి
మేరునగరాజుపైఁ జాల మెచ్చు వదలి.

౬-౧౧

దక్షవాటమున శివగంగ రుద్రగంగ యను తీర్థములు రెం డుండినట్లు భీమేశ్వరపురాణము చాటుచున్నది.

ఘనత శివగంగయును రుద్రగంగ యనఁగఁ
గూపములు రెండు దక్షవాటీపురమున
మొదలియది పాపముల నెల్ల నుడుకఁజాలు
నొకటి పితృదేవతలఁ దృప్తి మనుప నోపు.

౬-౧౨

వీనిలో రుద్రగంగ యీనాఁడు నిలిచియున్నది. ఇది యొకకూపము. భీమేశ్వరాలయప్రాకారమునందు ఈశాన్యభాగమున భైరవునియాలయమునకు వెనుక నుండినది. దానికి నెదురుగా నాయాలయ ప్రాకారమునందే నైరృతి భాగమున శివగంగ యను కూపము కూడ నుండవలయును. అది మాత్రము గానరాదు.

పరమేశ్వరుఁడు త్రిపురాసుర సంహారంబు గావించినపిదపఁ దనకుఁ జేదోడు వాదోడునైన దేవతల నందఱ నాయా స్థానముల కనిపి, త్రిపురదైతేయులకుఁ గులదైవతంబైన యద్దివ్యలింగంబును పంచఖండంబులుగా ఖండించి, పంచారామములందును పంచదివ్యలింగంబు లుండునట్లు గావించుచు మొదలిమామయగు దక్షప్రజాపతి కునికిపట్టయిన యారామంబగుట దక్షారామంబున శివసన్నిధానంబై దానుండునట్లుగా నెంచి తాను మున్నేటితటంబున విశుద్ధస్ఫటిక సంకాశంబును దివ్యలోకభామినీ విలోకన చ్ఛాయాగుళుచ్ఛాచ్ఛ జ్యోత్స్నాభిషిక్త యుక్తాంగంబగు శ్రీభీమేశ్వర లింగంబునం దధివసించెను. నేఁడు దక్షారామములోని భీమేశ్వరలింగము నేలమీఁదినుండి పదియడుగులకు హెచ్చుగు నెత్తున నుండును. లింగము తెల్లనియాకృతి గలిగి స్ఫటికనిర్మితమైనట్లుండును. మనకు

నేలమీఁదఁ గానవచ్చెడిభాగమున చుట్టుకొలఁత యెనిమిది యడుగుల వఱకు నుండును. లింగాగ్రమునమూఁడడుగులు సుమారుగ నుండును. మూలభాగమునందు చుట్టును మూఁడు ఆవరణలు గలవు. అదియంత యు చీకటితో నిండియుండును. ఆయావరణలోని గోడలందు జాతిబొమి కలు గానవచ్చును. అచట పూర్వము రత్నదీపము లుండెడివని చెప్పుదురు.

ఈస్ఫటికకాంతిగల లింగమునకు క్రిందినుండి మీఁదివఱకు నల్లని చారలు జాతిలోనే గానవచ్చును. అవి పరమేశ్వరుని వ్యాఘ్రచ ర్మాంబరధారణమునకుఁ దార్కాణ మని వాకొందురు. ఇవిగాక లింగ మునకు శిరోభాగమునకు ముందు వెనుకలలో రెండు గోతులు వంటివి గలవు ముందుండెడి దానిని పార్థపరిహార మనియు వెనుకనుండుదానిని చీల యనియు నందురు. భీమేశ్వరుని సమీపమున సతీదేవియు పార్వతీ దేవియును గలరు. ఇరువురు పరమేశ్వరునిరాణులు నొకచో నుండుటయు నపూర్వమైన విషయమే. ఆ యాలయమున నీశ్వరున కభిషేకముగాని పూజగాని చేయవలయునన్న ప్రాసాదముమీఁదికిఁ బోవలయును. ఆయుచ్ఛ్రాయమును శ్రీనాథుఁ డిట్లు అగస్త్యుని ముఖమున వెల్లడించి యున్నాఁడు.

అదె సంవేద్యము కోటిపల్లె యదె దక్షారామ మన్పట్టణం
బదె యభ్రంకష సౌధకూటఘన 'హేలావాస ముచ్ఛ్రాయసం
పద సొంపారెడి భీమలింగము మహాప్రాసాద భూమీధరం
బిదె సప్తర్షినదీ ప్రవాహ మిదె సంవీక్షింపు మేకాగ్రతన్.

3.౫౭,

దక్షారామ భీమేశ్వరునకు యోజనము మేరలో నున్నది కోటిపల్లి. గౌతమీ నదీతీరమునం దున్న క్షేత్రములలో నిదియు నొక ప్రసిద్ధమైన శివక్షేత్రము శివరాత్రినాఁ డిప్పటికి నిచట గొప్పయుత్సవము జరుగును. పెక్కురు భక్తులానాఁ డచటికిఁ జేరుదురు. భీమేశ్వరుఁడు దక్షారామమున

ప్రతిష్ఠితుఁడైనసమయమునకు అభిషేకమునకు గోదావరీప్రవాహమును గొనితెచ్చుటకై సప్తర్షులు రాజమహేంద్రవరమునకు (అఖండ గౌతమీ నదీతీరమునకు) పయనించిరి. ముహూర్తము తప్పిపోకుండ పరమేశ్వరుఁడు భీమలింగమునఁ బ్రతిష్ఠితుఁడుగానె యుండఁగ నభోమణి మీఁదినుండి కాంచి, తాను భీమేశ్వరునకుఁ బ్రతిష్ఠ గావించెను. సూర్య ప్రతిష్ఠితమైన లింగములకుఁ జుట్టును సోమప్రతిష్ఠిత మైన లింగము లన్ని దిక్కుల యందు నుండుట పరిపాటి. కావున నీభీమేశ్వర లింగమున కన్నిదిక్కులందును సోమేశ్వరులు గలరు. వారిలో నొకఁ డీకోటిపల్లి యందలి సోమేశ్వరుఁడు. ఈసోమేశ్వర లింగములన్నియు దక్షారామునకు యోజనము మేరలో దిక్కులందును విదిక్కులందును గూడఁగలవు.

తూర్పున— కోలంక యను గ్రామమున సోమేశ్వరుఁడు. ఆత్రేయీనదీతీరమున.

ఆగ్నేయమున—దంగేరు గ్రామమున—కణ్వానదీతీరమున.

దక్షిణమున—కోటిపల్లి సోమేశ్వరుఁడు-గౌతమీనదీతీరము.

నైరృతమున—కోరుమిల్లిగ్రామము. "

పశ్చిమమున—పులుగుర్త సోమేశ్వరుఁడు—పిడపర్తి గ్రామమునందున్నాఁడు. ఇది తుల్యానదీతీరము నంటియున్నది.

వాయవ్యమున—వెల్లగ్రామమున— "

ఉత్తరమున చోల్లంగి సోమేశ్వరుఁడు. తుల్యానదీతీరమున.

ఈశాన్యమున—పటవలిగ్రామమున ఆత్రేయీనదీతీరమున

ఈవిధముగ దిక్కులందును విదిక్కులందును అష్టసోమేశ్వరులు నెలకొని యున్నారు. భీమేశ్వరుఁడు స్వయముగ నావిర్భవించి చండభానుప్రతిష్ఠితుఁడై మహోన్నతి వెలయుచుండె ననియు, దక్షారామము సకలకళ్యాణనిలయంబు ననుట నీక్రింది గద్యము తాఁగాణించుచున్నది.

"వెండియుఁ జండభాను కృతప్రతిష్ఠుఁడును, ఆఖండలముఖ నిఖిల బర్హిర్ముఖ శిఖామణి మయూఖకిమ్మీరిత చరణారవిందుండును, సప్త పాతాళ భువన విష్కంభ నిర్భేదనసమాదితావిర్భావుండును, అమృతస్వయంభూర్జ్యోతిర్లింగమయ మూర్తిధరుండునైన భీమేశ్వరుండు భోగమోక్షప్రదాన దీక్షాధరుండై యందు వసించియుండు... అమ్మహాదేవుచేత నప్పుణ్యక్షేత్రంబు... మహాక్షేత్రంబన మహాలింగస్థానంబన దక్షిణకాశియనఁ గల్యాణ నిలయంబన నసైశ్వర్య మహైశ్వర్యంబును నప్రతిమనైభవంబును, నవాఙ్మానసగోచరంబును నసంఖ్యాత ప్రమథగణ సమాకీర్ణంబునై యశేష కల్యాణనిలయంబై యొప్పును."

భీమ. ౩.౧౬.

మఱియు నీ క్రింది గద్యమున భీమనాథుని మహత్త్వము నుగ్గడించుచు, దక్షారామమున వెలసిన పరివార దేవతలను, దాని పరిసరమున నెలకొనిన తీర్థములను, భీమనాథుని సాక్షాత్కారమున భీమమండలికిఁ గలిగిన ప్రాశస్త్యమును, ఇతర క్షేత్రములకంటె దీనికిఁ జేకుఱిన గొప్పతనమును పరమేశ్వరముఖమున నిట్లు వెల్లడించియున్నాఁడు.

"అనిశం గరుణాసామ్రాజ్య పట్టాభిషిక్తుండగు నా జగజెట్టి వేల్పు బ్రహ్మాండగోళంబునకు మిక్కుటంబుగాఁ బెరిగిన దేహంబుఁ బొట్టిచేసి, తిరుచుట్టుమాలికలోన[1] గౌరీజనార్దన రుద్రకేశవ వినాయక దుర్గా తాండవేశ్వర నృత్యభైరవులను దేవతాసప్తకంబు పరివేష్టింప, సకల లోకానందకర పరదారగమనపాపహరేశ్వరులు నైరృతిభాగంబున నధివసింప[2] అంతర్గర్భగృహంబులోపల మాణిక్యాదేవీసహితుండై,[3] సలిలనిధి వృద్ధగంగా కాంతేయసరి త్తుల్యభాగాహేలానదీ సప్తగోదావర

1. ఇచటఁ జేర్కొనిన దేవతాబృందము భీమనాథుని లింగమునకుఁ బార్శ్వమునఁ గల యావరణములో నెలకొనియున్నది.

2. ఈ తిరుచుట్టు మాలికలోనే మాణిక్యాంబికయుఁ గలదు.

3. ఇందుఁ జేర్కొనిన తీర్థము లన్నియు భీమమండలిలోఁ గలవు.

మాతృకాపరిత్రృతమండలంబున మధ్యమలోక భాగధేయంబును, విబుధ గర్వపతాకావేదియు, ...[4] మఖకుండికాతటాక సముద్దండపుండరీకషండ మకరందబిందు గండూషావ్యగ్రసముదగ్ర మధుపమండలాహంకార ఝుంకారకోలాహల కరంబిత మకరధ్వజభుజాదండ మండలీకృతకుసుమ కోదండ శింజినీరంకారంబును, ఆఖండలాది దిక్పాలక భరితగోపురప్రాంగణంబును, పాదుకాఖడ్గఘుటికా రసరసాయన మూలికాంజనాకర్షణాదృశ్యాది విద్యాసిద్ధిక్షేత్రంబును,[5] అత్ర్యాత్రేయ...వాలఖిల్యాద్యష్టాశీతి సహస్ర సంయమిసమాకీర్ణంబును, కర్ణికారాంబికా కరకమలపుటఘటిత కనత్కనక మణిమయడమరుక ఢమఢమధ్వాన పర్జన్యగర్జాసముజ్జృంభిత గుహశిఖండితాండవంబును,[6] మార్కండేశ్వర, కుండలాముఖ సంవేద్యాంతర్వేది చాళుక్యభీమేశ్వర ప్రధాన నానావిధశాఖోపశాఖాతీర్థసంబాధసంభరితంబునునై, యఖిల భువనభవనాభిరామంబైన దక్షారామంబును కైలాసమేరుమందరంబులకంటెను గాంచీచిదంబర కాళహస్తి శ్రీశైలాదిమహాస్థానంబులకంటెను, సేతుకేదారంబులకంటెను నతిశయంబుగాఁ జేసి నా క్షేత్రంబును మరగి, గరళకూట కృపీటభవ జ్వాలావష్టంభంబు సంస్తంభించి, త్రిపురదైతేయ మదవతీగండభాగమకరికాపత్త్రభంగంబులు దొలంగించి, భీమలింగంబు సర్వమంగళాదేవియుం దానును లోకరక్షణార్థంబుగా నధిష్ఠించియుండు.''

భీమ. ౬-౭౫

---

4. యజ్ఞకుండము నేటికిని పద్మషండములతో నిండియే యుండును.

5. దేవేంద్రుఁడు మున్నగు దేవతలు వసిష్ఠాది మహర్షులును గోపురప్రాంగణము నందు నేఁడును గానవచ్చుచునే యున్నారు. వ్యాసభగవానుఁడు ప్రాసాదము నందలి యొక స్తంభమున నెలకొనియున్నాఁడు.

6. మార్కండేశ్వరతీర్థము = రాజమహేంద్రివరము. కుండలాముఖము = కుండలేశ్వరము. సంవేద్యము = వృద్ధగౌతమీసాగరసంగమము. అంతర్వేది = వసిష్ఠా సాగరసంగమము. చాళుక్యభీమేశ్వరము=కుమారారామము.

దక్షారామమున భీమేశ్వరుని సాక్షాత్కారముతోపాటు సకల దేవతాబృందము మహర్షి వర్గము, వివిధతీర్థకదంబము సమకూడి యుండుటచే దీని మహత్త్వ మితరతీర్థములన్నిటికంటెను గొనియాడఁ దగినది యని శ్రీనాథుఁడీ గద్యమునం దుగ్గడించియున్నాఁడు. భీమనాథుని మాహాత్మ్యమున కియ్యది పరాకాష్ఠ.

దక్షారామ మాహాత్మ్య మీపురాణమునందుఁ బలుతావులఁ బలురీతులను వ్యక్తమైయున్నది. అగస్త్యుఁడు వ్యాసునితో దక్షారామముతో సరియైన భోగమోక్షధామము వేఱొకటి లేదనినాఁడు. అందులకుఁ గారణములు—ఆ పట్టణము దక్షప్రజాపతి యజ్ఞదీక్ష వహించిన పుణ్యదేశమగుట, బ్రహ్మవిష్ణుపురందరాది దేవతలు మహర్షులును సభదీర్చిన చోటగుట, సతీదేవి శరీరమునుండి బయలుదేఱిన యోగాగ్నిని ప్రజ్వలింపఁజేసిన పవిదేశమగుట, వీరభద్రుని పరాక్రమవిహారవిలాసములకది నాట్యరంగమగుట, అమృతమయుఁడై దివ్యతేజస్సమేతుఁడై స్వయముగ నావిర్భవించిన శాంతమూర్తియగు భీమేశ్వరుని స్థానమగుటయును. ఈ విషయము నీ తీరున శ్రీనాథుఁడు వివరించినాఁడు.

సీ. దక్షప్రజాధినాథ మహాధ్వరక్రియా
దీక్షాధిగమ పుణ్యదేశమునకు
బ్రహ్మవిష్ణుపురందర ప్రధానసుపర్వ
పరమసంయమి సభాభవమమునకు
దాక్షాయణీయోగ దహనార్చి రున్మేష
సామిధేనీమంత్ర జాతమునకు
వీరభద్రభుజావిహార హేలాసమా
రంభనాటక నాట్యరంగమునకు
సమృతమయ దివ్యతేజస్స్వయంభులింగ
శాంత భీమేశ్వరేశ్వర స్థానమునకు

దక్షవాటంబునకు మోక్షధామమునకు
భోగజన్మస్థలమున కే పురము సరియె ?

భీమ. 3-౧౨

ఇట్లు భోగమోక్షనిధానమగు దక్షవాటిలో సప్తగోదావరమున స్నానము చేసి "త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషం" ఇత్యాది మంత్రముచే నభిమంత్రించిన విభూతిని మూఁడు రేకల ధరించి, మొదటి ప్రాకారము దాఁటి లోనికిఁ జొచ్చి, క్రిందిభాగమున నందీశ్వరుని, మీఁదనున్న విఘ్నుని జూచి, మణిఖచితమైన సోపానమార్గమున భీమేశ్వరుఁడు నెలకొనిన మేడనెక్కి, సప్తపాతాళములను భేదించి వెడలిన జ్యోతిస్స్వరూపుఁడగు భీమేశ్వరస్వామిని గొలుచు మహేశ్వరభక్తునకు ముక్తికి లోప మేముండును ?

సీ. నేదిష్ఠమున సప్తగోదావరంబున
నఘమర్షణస్నాన మాచరించి
త్ర్యాయుషమంత్రాక్ష రాభిమంత్రితమైన
విమలభూతి త్రిపుండ్రముగ ధరించి
మొగలివాకిలిఁ దాఁటి దిగువ నాక్వరరాజు
నగరిపై వెన్నుని నమువుఁజూచి
మణిశిలాసోపాన మధ్యమార్గంబుగా
నభ్రంకషంబైన హర్మ్య మెక్కి

సప్తపాతాళభువన విష్కంభములను
దెఱచి వెడలిన జ్యోతిః ప్రదీప్తమూర్తి
శంభు భీమేశ్వరేశ్వర స్వామిఁ గొలుచు
పరమ మాహేశ్వరున కేమి ప్రాఁతి ముక్తి.

భీమ. ౧-౧౧౮

ఈ పద్యమున శ్రీనాథునకు భీమనాథునియెడఁ గలభక్తి తాత్పర్యములు, వ్యక్తములగుచున్నవి ప్రథమాశ్వాసములోని పద్యము లన్నియు శ్రీనాథుఁడు మూలానుసరణము లేకుండ స్వయముగ ననుసంధానించినవి. ఈ పద్యమున మాహేశ్వరుఁడు భీమేశ్వరు నెట్లు గొలువవలయునో యా తీరునుగూడ వివరించినాఁడు.

అగస్త్యుఁడు వ్యాసునితోఁగూడి భీమేశ్వరాలయమును బ్రవేశించె నని తెలుపుచు, నా యాలయప్రవేశమునఁ గ్రమముగ నేయే దేవతల నెట్లు సంభావింపవలయునో యను క్రమము నుగ్గడించుటయు హృద్యముగనే యున్నది. అగస్త్యవ్యాసులు అంతర్భవనమునఁ బ్రదక్షిణ మాచరించుచు తిరుచుట్టు మాలికయందు నెలకొనియున్న హిమవద్భూధరరాజతనయయగు భీమనాథునియంతఃపురాంగనను సేవించి, ఢుంఠివిఘ్నేశ్వరుని గొలిచి, దుర్గామహాదేవికి నమస్కరించి, వటుకభైరవుని జూచి, విష్ణునకు, బ్రహ్మకు, ఇతర దేవతలకు నమస్కృతులు ఘటించి భీమనాథుని దర్శించుటకై హార్మ్యము నెక్కిరఁట. ఈ పరివార దేవత లందఱును క్రింది యావరణలో నుండినవారే. వారిని దర్శించిన వెనుక భీమనాథుని దర్శింపవలయు ననుటయు నిందు వ్యక్తమగుచున్నది.

సీ. వణఁకు గుబ్బలరాచవారి కూరిమికన్య
భీమయ్యశుద్ధాంతభామఁ గొలిచి
కంధరంబుననుండి గంధసింధురమైన
గుజ్జువేల్పుఁ గుమారగురునిఁ గొలిచి
కైవల్యనిధికి దుర్గామహాదేవికి
సర్వమంగళకు నంజలి ఘటించి
యాశాతటీపటలీ శాటికాకటు
వటుకభైరవు నిష్టవరదుఁ జూచి
నలువ సేవించి యిందిరానాథుఁ గాంచి
యితరపరివార దేవతావితతి కెల్ల
నేటకోళ్ళిచ్చి యెక్కి రమ్మోటిమునులు
మృడుని హాటకశైలంబు మీఁదనిలువు.

అగస్త్యుఁడు వ్యాసునితో దక్షారామమునందలి విశిష్టతను గూర్చి తెలుపుచు, కార్తికశుద్ధపూర్ణిమనాఁడు భీమనాథుని యాలయ ముమ్రోల వెలిఁగెడి జ్వాలాతోరణము క్రిందినుండి యొకమాఱు దూఱినచో నాతనికి ప్రాణమును విడుచుసమయమున యమపురద్వా రమును దూఱునక్కఱ యుండదని వక్కాణించి యున్నాఁడు.

గీ. కార్తికిక వేళ భీమశంకరునినగరఁ
దూఱు నెవ్వాఁడు చిచ్చఱతోరణంబు
నతఁడు దూఱఁడు ప్రాణనిర్యాణ వేళ
ఘోరయమపట్టణ ద్వారతోరణంబు.

ఈ జ్వాలాతోరణమహోత్సవము నేఁటికిని భీమనాథుని యాల యము మ్రోల జరుగుచుండును. ఎందఱో భక్తులు భీమనాథుఁ డాజ్వాలాతోరణమును దూఱునపుడు భక్తితోఁ దామును దూఱుచుం దురు. ఆ తోరణమునకై కూర్చిన గడ్డిని దెచ్చుకొని పశువులకుఁ దినిపించిన పాడిపంటలు సమృద్ధిగ నుండునను నమ్మకముతో పెక్కుఱు హాలికులుకూడ నీ యుత్సవమునఁ బాల్గొనుచుందురు.

సప్తగోదావరమున స్నానముచేసి, భీమేశ్వరుని యాలయము మీఁది పసిఁడికలశమును గాంచి, పంచాక్షరీమంత్రమును బఠించు శివ యోగికి సంసారపు జంజాటము మరలఁ గలుగదని వివరించియున్నాఁడు.

ఉ. ఏట మునింగి లేచి పరమేశ్వరుమందిర సౌధవాటికా
హాటకకుంభముంగని షడక్షరమంత్రము జిహ్వఁ గూర్చి వా
చాటత సత్యతత్త్వఁడగు శాంభవయోగివరేణ్యుఁ డేల జం
జాటపు సంసృతిం బొరలి చచ్చుచుఁ బుట్టుచునుండుఁ బార్వతీ.
౬.-౨౩.

## వ సం తో త్స వ ము

భీమనాథుఁడు, దక్షారామమున నెలకొని భీమమండలిని నిరా తంకముగఁ బాలించుచుండఁగా నరుదెంచిన వసంతసమయమున వసం తోత్సవము వైభవముతో జరిపించెనని మహోల్లాసముతోఁ జిత్రించి

యున్నాఁడు. వసంతోదయమైనంతనే ఋతుచక్రవర్తి, భీమేశ్వరునకు కుసుమవిసరము కానుకఁ గొని తెచ్చెనఁట. దక్షారామమధ్యమున విసరిన వాయువు లెంతయు నామోదభరము వెదచల్లినవఁట. ఏతావునంద్రైనను శ్రీనాథునిగంటమున గాలులు రేఁగినా యవి వింతయొయ్యారము సూపుచుఁ గొనసాగును. అందును వసంతసమయమైనచోఁ జెప్పనేల ?

శా. హేమంతావధిసంప్రబోధగురువుల్ హృజ్జాతతేజోఽగ్నిధా
య్యాసుంతాంత్రిక్షరముల్ పటీరగిరి వన్యామంద వాతూలముల్
వేమాఱుం గలశీతనూభవవధూవేణీ భరాంతఃప్రసూ
నామోదగ్రహయాళువుల్ పొలసె దక్షారామమధ్యంబునన్.

ఈపద్యమున మలయగిరి మందమారుతముల నెంతయుఁ బ్రౌఢముగఁ జిత్రించుచుఁ దనకుఁగల సంస్కృతవాణీ ప్రయోగలాఘవమును బ్రదర్శించియున్నాఁడు. మలయగిరిమీఁది వనసమూహము నుండి బయలుదేఱిన మందమారుతములు హేమంతసమయావధిని బోధించు గురువులై మన్మథాగ్నిని ప్రజ్వలింపఁజేయు సామిధేనీ మంత్రాక్షరములై, అగస్త్యుని రాణియగు లోపాముద్ర వేణీభారము లోఁ జొనిపిన పూలతావిని గొనివచ్చు నిచ్ఛగలవై దక్షారామమధ్యంబున వీచినవఁట. ఈ పద్యములో నాతఁడుపయోగించిన పదములు ధాయ్యా, వన్యా, గ్రహయాళువు అనునవి సంస్కృతభాషలో మాఱు మూలవి. 'ధాయ్యా' అనఁగా అగ్నిహోత్రుని ప్రజ్వలింపఁజేయుటకై యజ్ఞములందుఁ జదివెడు మంత్రము. దీనినే సామిధేనీమంత్ర మనియు నందురు. అమరసింహుఁడు ఈ పదమునకు వివరణము నిట్లు చేసి యున్నాఁడు. "సా సామిధేనీ ధాయ్యా ఋక్ యాస్యా దగ్నిసమింధనీ" అనఁగా అగ్నిని మండింపఁజేయు ఋఙ్మంత్రము 'ధాయ్యా' యనియు సామిధేని యనియు ననఁబడును. దీని యర్థమును దెలిసికొనవలయు నన్న శ్రౌతసంప్రదాయమేనిఁ దెలియవలెను. లేకున్న నమరము నెమరునకైన వచ్చియుండవలయును. 'వన్యా' యనఁగా వనసమూహము. 'గ్రహయాళువులు' గ్రహించెడి స్వభావముగలవి. ఈ రెండుపదముల యర్థమును గుర్తించుటకు సంస్కృతవ్యాకరణపరిపాటిని ప్రకృతి

ప్రత్యేక విభాగము దెలియుట యావశ్యకము. ఇక నీపద్యములో భావ గర్భితముగఁ బ్రవేశపెట్టిన యంశము ఆమందమారుతములు వేమాఱుం గలశీతనూభవ వధూవేణీభరాంతః ప్రసూనామోదగ్రహయాళువు లగుట. కుంభసంభవుని భార్యయగు లోపాముద్రాదేవి కొప్పులోపల నుండిన పూవుల పరిమళములను గ్రహించు స్వభావముగలవానినిగాఁ గాలులను జేసి, లోపాముద్రకుఁగల ప్రసూనధారణప్రీతిని సాకూతముగ కవి వెల్లడించినాఁడు. లోపాముద్రకు పూవు లన్న మిక్కిలియాస్థ యు న్నట్టు లీక్రిందివిషయము స్పష్టముచేయుచున్నది. లోపాముద్ర కాశిలో మల్లెతీఁగలు నాఁటినట్లును, అవి పుష్పించి విశ్వేశ్వరుని పూజ కుపయో గించుచుండెనా యని యగస్త్యుఁడు వ్యాసుని క్షేమవార్తలడుగుటయు నీవిషయమున కుపోద్బలక మని తోఁచుచున్నది.

వ్యాసుఁడు, విశ్వనాథుని యాగ్రహమునకుఁ బాత్రుఁడై కాశిని బాసి దక్షిణకాశియగు దక్షారామమునకు వచ్చుచు మార్గమధ్యమున తుల్యభాగానదీతీరమున పీఠాపుర యాత్రకుఁ బోవుచున్న యగస్త్య మహర్షిని జూచెను. అగస్త్యుఁడు వ్యాసుని యోగక్షేమములు దెలిసి కొను సంధర్భములో లోపాముద్ర కాశిలో నాఁటినమల్లీవల్లులను గూర్చి యిట్లు ప్రశ్నించెను.

క. కాళీనందన కంఠే
కాలుల శిరములకు విరులు కల్పించునొకో
లీలావనాంతరమునను
మాలోపాముద్ర యిడిన మల్లీవల్లుల్.

ఇది లోపాముద్రకుఁ గల సుమనోవినోదమును దెలియఁజేయు చున్నది. తనయిల్లాలు వారణాసిలో నాఁటిన మల్లెల యేపునుగూర్చి ప్రశ్నించినయగస్త్యునకుఁగూడ నాపూవులమీఁద నాదర మెంతగలదో యీపద్యము చాటుచున్నది. ఈ విషయము నంతటిని స్మరింపఁ జేయుటకే శ్రీనాథుఁడు దక్షారామమునందలి వాయువులను 'కలశీత

నూభవ వధూవేణీభరాంతః ప్రసూనగ్రహాయాళువు' లనుగా సమ కూర్చియున్నాఁడు.

మఱియు నిచట వీచిన మలయగిరి వాయువులకు ముఖ్యముగ నుండవలసిన శైత్యము (చల్లఁదనము) మాంద్యము (మెల్లఁదనము) సౌరభ్యము (పరిమళము) కూడియుండెననుటకే యీపద్యము కొంత పోడిగినది. హేమంతకాలావధిని దెలుపు గురువులగుటచే నీవాయువులు వేఁడిమి లేక చల్లఁదనము వహించియుండె నని తెలియుచున్నది. మలయగిరి మీఁది వనసమూహమును దట్టి వచ్చుటచేతనే యవి మంద మారుతము లయినవి. ఇఁకలోపాముద్రాదేవి కొప్పులోనికిఁ జొచ్చి యచటి పూలతావిని గొనివచ్చుటచే మారుతముల కొక విశిష్టమైన పరిమళము చేకుఱినది. ఇట్టి విశిష్టగుణములు గలిగిన మందమారుతములు దక్షారామమధ్యంబునఁ బొలిసినవి; గావుననే యవి మన్మథాగ్ని నుజ్వలింపఁ జేయుటకు సామిధేనీ మంత్రాక్షరములుగా శ్రీనాథుని గంటమున వెలసినవి.

ఆవసంతోదయమున లతలన్నియుఁ బుష్పించినవి. తుమ్మెదలు చెలరేఁగి ఝుంకారములు చేయఁదొడఁగినవి. అచ్చరలు మందార ద్రుమవాటిలో పూలమద్యములు గ్రోలుచు త్రిలోకాధిపతియగు భీమ నాథుని హిందోళమునఁ బాడిరఁట. మన్మథుని మూలసైన్యము దండెత్తుటను దలఁపించుచు, తుమ్మెదల కోలాహలములు, చిలుకపలుకుల యుద్రేకములు, గోరవంకల సల్లాపములు, ఉద్యానవనములలో గండు కోయిలల కంఠములనుండి వెడలిన కోమలకుహూకారములును జత గూడినవి. శ్రీనాథుఁ డేవనములలోఁ బడినను కలఘంపోక్కిలకంఠ కోమల కుహూకారములను వినిపింపఁజేయక మానఁడు.

ఆవసంతసమయమున దక్షవాటికలో నచ్చరలు వారుణీరసాస్వాదమున మత్తిలి వీణలు మీఁటుచుఁ బాడిరఁట. అదియూతని నాఁట జాతరలలోఁ గానవచ్చు పరిపాటి.

ఉ. జాదుర జాదురంచు మృదుచర్చరి గీతులు వారుణీరసా
స్వాదమదాతిరేకములఁ జంద్రికఁ గాయఁగ దక్షవాటికా
వేదులమీఁదటన్ గనకవీణలు మీటుచుఁ బాడి రచ్చరల్
మోదమెలర్పఁగా భువనమోహన విగ్రహు భీమనాథుపైన్.

భీమ. ౫-౧౦౨.

ఈనాఁడును దక్షారామ పరిసరములందు గ్రామదేవతల జాతరలు జరుగుచుండును. పెక్కురు వారుణీరసాస్వాదముచేసి వివిధమయిన వాద్యములతోఁ బాటలు పాడుచుండుటయు జరుగుచుండును. శ్రీనాథుని నాఁటి యచ్చరలు భీమనాథుని సేవించెడి వారవధువులై యుండ నోపును.

అంతట భీమనాథుఁడు కేళీవిహారముల కందఱకు నాజ్ఞ వాటించి యందులకు వలయు గంధకర్పూరకస్తూరికాది ప్రశస్తవస్తువుల నొసఁగె నఁట. వానిని గైకొని వేషభూషాదులతోడఁగూడి దేవతాస్త్రీలు భీమనాథుని కొలువవచ్చిరఁట. విఘ్నేశ్వరుఁడు పాతాళభైరవుఁడు వీరభద్రుఁడు బ్రహ్మాదిదేవతలు ఇంద్రాది దిక్పాలురు ప్రమథులు దేవతాగణంబులును గూడవచ్చి యాయుత్సవమునఁ బాల్గొనిరఁట.భీమనాథుఁడు వచ్చినవారినందఱను సౌహార్దముతోఁ జూచి కనుసన్న చేసినంతనే, యచటఁ జేరిన వారందఱును వావివరుసలనుబట్టి స్త్రీపురుషు లొండొరులపై గంధము పసుపు కస్తూరి కర్పూరము మున్నగు ద్రవ్యములు గలిపిన జలములఁ జల్లుకొనఁదొడఁగి రని శ్రీనాథుఁడిట్లు చిత్రించియున్నాఁడు.

సీ. హేరాళముగఁ జల్లె నెలనాగ యొక్కర్తు
కుంభోదరునిమీఁదఁ గుసుమరజముఁ
గుటిలకుంతల భృంగిరిటి మోమునం దొర్తు
తాకించె నోలగందంపుఁ బసుపు
వక్షంబు లక్షించి వైచె గందపుటుండ
వీరభద్రునినొక్క నీరజాక్షి
చెవిలోనఁ బాఱంగఁజిమ్మె గొజ్జఁగనీటఁ
గాలభైరవు నొక్క కలువకంటి

కొమ్మ యందంద నొక్కత కొమరసామి
యాదలలయందు జవ్వాదియసలు గలిపెఁ
బునుఁగు మణికుంభమున నించి పోసె నొకతె
పొలఁతి విఘ్నేశ్వరునికుండ బొజ్జమీఁద.

ఈవిఘ్నేశ్వరుని మండూకజఠరుఁ డందురు. ఈగజాననుఁ డీనాఁడు భీమేశ్వరాలయమున దక్షిణద్వారముముంగలివాకిట నున్నాఁడు.

శ్రీనాథునికాలమునాఁటను వసంతోత్సవములలో విలువగల యీసుగంధద్రవ్యములు గలిపిననీటి నొకరిపై నొకరు చల్లుకొనుట యుండవచ్చును. ఈనాఁడును దక్షారామసమీపప్రదేశములలో దేవతాకల్యాణములు జరుగునప్పుడు పసుపుకుంకుమము గంధము కలిపిననీటిని స్త్రీపురుషు లొండొరులపైఁ జల్లుకొను పరిపాటి గలదు. వీరిలో పురుషు లెవ్వరేని యుద్రేకముతోఁ జిమ్మటగొట్టము చేకొని నీరును జిమ్ముచు వచ్చిన నాయుత్సవములలోఁ బాల్గొను వనితలు తప్పుకొనిపోవుటయుఁ గానవచ్చును. ఆదృశ్యమును శ్రీనాథుఁడు దక్షవాటిలోఁ గాన్పింపఁ జేసినాఁడు.

ఘట్టితరోద్ధతిం గరిముఖంబునఁ బీలిచి గౌతమీనదిం
బుట్టిన సత్ప్రవాహజలపూరముఁ బ్రస్సన నూఁదుచుం బురీ
హట్టమున న్మహోత్సవవిహారము సల్పను గౌరిదేవితో
ల్పట్టి గణేశ్వరుండు సురభామిను లోలమునం దొదుంగఁగన్.

విఘ్నేశ్వరుఁ డుద్రేకముమీఱఁ దుండముతో గౌతమీనదీజలము పీల్చి త్రుస్సుమనియూఁదుచు వీధిలో విహారముచేయుచుండఁగా దేవతాస్త్రీలు చాటున కొదిగిరఁట. అట్టివసంతోత్సవసమయములలో సాధారణముగ వావివరుసలుగలవారిమీఁదనే చల్లుట పరిపాటి. ఆవిషయమునే శ్రీనాథుఁడు క్రిందిపద్యమునఁ దెలిపినాఁడు.

అచ్యుతునిమీఁద జల్లె దుగ్ధాబ్ధికన్య
భారతీదేవి పద్మజుపైనిఁ జల్లె
శచి మహేంద్రునిఁ జల్లె వసంతకేళి
గంధకర్పూర కస్తూరికాజలంబు.

దక్షారామమునందలి మహోత్సవసమయములలో సాని యీశాని వేషము దాల్చి, చేత చంద్రకాంతపాత్రి ధరించి భిక్షాటనము సేయు వేళలఁ జూపించు నృత్యము లోకముల మత్తిల్లఁజేయునఁట. ఆ సాని వేషమును శ్రీనాథుఁ డెంతయుఁ జిత్రముగఁ జిత్రించియున్నాఁడు. పూల దండలతో నిండిన వేణీభరము పొంకముగాఁ బిరుదులపైఁ బొరలి యాడినది. కాలిని దొడిగినయందెల ఝణత్కారము వ్రేళ్లకుఁ బెట్టిన మట్టెల చప్పుడుతోఁ గూడి యింపునింపినది. అందమై కుదురునిండిన పయోధరములమీఁద ముత్యాలపేటలు మురిసియాడినవి. చెవుల వ్రేలాడు తాటంకముల వజ్రకాంతులు లేఁతవెన్నెలను క్రిందుచేసినవి. ఇట్టి యపురూపమైన విలాసములతోఁ గూడినవారవనితలు నృత్యములు సేయు పరిపాటిని శ్రీనాథునినోట వినకుండ నుత్సవ మెట్లు సాఁగును.ఆకవి నోట వినవచ్చిన సొంపుఁ బరికింతము.

సీ. విరులదండలతోడి వేణికాభారంబు
పొంకంబు పిఱుఁదులఁ బొరలియాడ
మణితులా కోటికోమల ఝణత్కారంబు
రవలి మట్టెలమ్రోఁత యవఘళింపఁ
గుదురునిండిన చిన్ని గుబ్బచన్నుల మీఁద
ముత్యాలత్రిసరంబు మురువుఁజూప
వలమానతాటంక వజ్రాంకురచ్ఛాయ
లేఁతవెన్నెలఁ బుక్కిళించి యుమియ
సాని యీశానియై మహోత్సవమునందుఁ
గేల నవచంద్రకాంతంపు గిన్నెఁ బూని
వీథి భిక్షాటన మొనర్చు వేళఁజేయు
మరుల నృత్యంబు జగముల మరులుగొలుపు. భీమ. ౧-౧౦౮

శ్రీనాథునకు దక్షారామమున నిట్టి వేశ్యాంగనా నృత్యము లానాఁడు గానవచ్చి యుండును. దాని నీ పద్యమునఁ దాను మరులు (మోహము) గొని జగములు మరులుగొనునని యతిశయింపఁ జేసినాఁడు.

వాచ్యార్థమునందు విధినిషేధాదు లుండును. ఈవిధినిషేధములే కావ్యాభిధేయములైనపుడుగాని, యనుమేయములైనపుడుగాని కలుగు చమత్కార, మివి, వాచ్యములైనపుడు కల్గదు. ఇది యర్థములకుఁ గల స్వభావమే గాని యితరముగాదు.

కాక్వభిధేయమగు నర్థమున కుదాహరణము.

మథ్నామి కౌరవశతం సమరే నకోపాత్ దుశ్శాసనస్య రుధిరం నపిబా మ్యురస్తః
సంచూర్ణయామి గదయా న సుయోధనోరూ సన్ధిం కరోతు భవతాం నృపతిః పణేన,

వేణీసంహారము.

సందర్భము:—పాండవులకును గౌరవులకును సంధి ప్రయత్నములు జరుగుచున్నవనియు, నిఁక కౌరవపాండవుల వైరము సమసిపోవు ననియు నర్థమునిచ్చు వాక్యములను విని, కోపించిన, భీముడు,సహదేవునితో నిట్లను చున్నాఁడు.

అర్థము:—కౌరవశతం = నూర్గురు కౌరవులను, సమరే = యుద్ధమునందు,కోపాత్ = కోపమువలన, న మథ్నామి = మథింపను; దుశ్శాసనస్య = దుశ్శాసనునియొక్క, ఉరస్తః = వక్షస్థలమునుండి. రుధిరం = రక్తమును, న పిబామి = త్రాగను. గదయా = గదతో సుయోధనోరూ = దుర్యోధనుని తొడలను, న సంచూర్ణయామి చూర్ణము సేయను భవతాం = మీయొక్క. నృపతిః = ప్రభువగు ధర్మజుడు, పణేన = అయిదూళ్ళనెడు పణముతో సంధిం కరోతు= సన్ధినిఁజేయుగాక.

ఇచట వాచ్యమగు నర్థము "నేను మథింపను; రక్తమును ద్రాగను మొదలగు వాచ్యార్థములంగూడ నిషేధరూపముగ నున్నది. కాని యిచట "నమథామి" మథింపను మొదలగుశబ్దములను కాకుస్వరముతో నుచ్చరింపవలయును. అపుడు వాచ్యార్థమునకు విపరీతముగ "నేను మథింతును" అను నర్థముస్ఫురించును.—ఇట్లుకాకుస్వరమువలన స్ఫురించునపుడే యీవిధిరూపముగనున్న యర్థము చమత్కారావహముగ నుండును. అట్లుగాక "కౌరవశతం సమరే కోపాత్ మథ్నామి" యని కేవలము విధిరూపార్థము వాచ్యమైనపు డీ చమత్కారము గలుగదు.

మఱియొక యుదాహరణము.

లాక్షాగృహానల విషాన్న సభాప్రవేశైః ప్రాణేషు విత్తనిచయేషు చ నః ప్రహృత్య
ఆకృష్టపాండవవధూపరిధానకేశాః ; స్వస్థాః భవంతు మయి జీవతి ధార్తరాష్ట్రాః

సందర్భము:—కురురాజసుతులు సభృత్యులు స్వస్థలగుదురుగాక" యను రెండర్థములనిచ్చు వాక్యమును విన్న భీముని పలుకులివి.

అర్థము:—లాక్షాగృహానల విషాన్నసభాప్రవేశైః = లక్కయిల్లుకాల్చుట, విషాన్న ముఁదినిపించుట, ద్యూతసభయందుఁ బ్రవేశపెట్టుట మొదలగువాని చేత నః = మా

యొక్క, ప్రాణేషు=ప్రాణముల యందును, విత్తనిచయేషు చ = సంపదలయందును, ప్రహృత్య = కొట్టి [అనగా మమ్ముల నన్నివిధముల నాశనముచేసి యనియర్థము] ఆకృష్టపాండవవధూపరిధానకేశాః = ద్రౌపదియొక్క వస్త్రముల నపహరించి, యామెకేశములను పట్టిలాగిన. ధార్తరాష్ట్రాః = కౌరవులు మయిజీవతి = నేను బ్రతికి యుండగనే, స్వస్థాః భవన్తు = క్షేమముగ నుందురుగాక !

స్వస్థాభవన్తు మయిజీవతి ధార్తరాష్ట్రాః" యను వాక్యమును కాకుస్వరముతో జదివినచో గౌరవులు జీవింపరు అనునర్థము సిద్ధించును. నిషేధరూపమైన యీయర్థము కాకుస్వరలభ్యము. ఇదియే శబ్దవాచ్యమైనపు డీ చమత్కారము నీయదు.

రెండు ప్రతిషేధములచే ననుమితమైనపుడు విధేయార్థమునకు గల చమత్కారము, స్వశబ్దవాచ్యమైనపుడు గలుగదు. ప్రతిషేధము రెండు విధములు-(1) సుబన్త విషయము, (2) తిఙన్త విషయము. ప్రతిషేధద్వయానుమితమైన విధిరూపార్థమున కుదాహరణము.

"అథాంగరాజాదవతార్య చక్షుర్యాతేతిజన్యామవత్ కుమారీ
నాసౌ న కామ్యో న చ వేదసమ్యక్ ద్రష్టుం న సా భిన్నరుచిర్హిలోకః"
[రఘువంశము.]

ఇందుమతీ స్వయంవరము సందర్భము—

అర్థము:—అథ=అటుతరువాత, (అంగదేశపురాజును చూచినతరువాత) సా=ఆ యిన్దుమతి, అంగరాజాత్=అంగదేశపు రాజునుండి, చక్షుః=కన్ను, అవతార్య=తొలగించి, యాత = కదలుడు, ఇతి = అని, జన్యాం = సఖియగు నిన్దుమతిని, అవదత్ = పలికెను, అసౌ = అంగాధిపతి. న కామ్యః = కోరదగనవాడు, న = కాదు. (అని) న = కాదు- సా = ఆ యిన్దుమతి, సమ్యక్ = బాగుగా, ద్రష్టుం చూచుటకు (తెలిసికొనుటకు) న వేద (ఇతి) న = తెలియనిదనియును గాదు— (మఱియును-లోకః=లోకము, భిన్నరుచిః = భిన్నమైనకోరికలు గలదిగనుండును-(ఒకరికి రుచించిన వస్తువు మఱియొకరికి రుచింపదు)

సంభావ్యమైన (ఊహింపనైన) నిషేధమును, నివర్తింపఁ జేయుటయే, ప్రతిషేధద్వయమున కర్థము. ఇచట "అసౌ నకామ్యః న"- అనునపుడు నిషేధవాచకములగు "నఞ్" శబ్దములు రెండున్నవి. వీని వలన "ఇతడు కామ్యుడే" యను విధి రూపార్థమే యనుమేయమగును. ఇది "కామ్య"అనునది సుబన్తమగుటచే (నామము) సుబన్త విషయమైనది. అటులే "న, వేద, న" యనునపుడు, "వేద" యనునది తిఙన్త (క్రియ)మగుటచే, తిఙన్త విషయక ప్రతిషేధద్వయానుమితమగు విధి రూపార్థమునకిది యుదాహరణమైనది.

# వ్యక్తివివేకము

భాగవతుల కుటుంబరాయశాస్త్రి, ఎం. ఏ.,

ధ్వనికర్త యిట్లు తెల్పినాడు:—"సారరూపమగు నర్థము, స్వశబ్ద వాచ్యముగాక యే, ప్రకాశితమైనపు డధికముగ శోభనొందును. సహృదయసమాజములయం దభిమతతరమగు వస్తువు, వాచ్యముగఁ గాక వ్యంగ్యముగనే ప్రకాశింపఁబడు నను విషయము సుప్రసిద్ధమే."

ధ్వనికర్త మతమునసుసరించి, ధ్వనులని వ్యవహరింపఁబడువానిలో మొదటి రెండునగు వస్త్వలంకారధ్వనులలో వాచ్యము వ్యంగ్యము నను నర్థములయొక్క (వ్యక్తికర్తమతము ననుసరించి సాధ్యము సాధనమునను వానికి) ప్రతీతియందుగల క్రమము బాగుగఁ గన్పడుచునే యున్నది. ఈ విషయమున భ్రాన్తియనునదియే లేదు. అందుచే నీరెంటి విషయమునను "వ్యంగ్య" మని వ్యవహరించుట కాధారమే లేదు. వాచ్యమగు వాక్యార్థమునందు సాధ్యసాధన ప్రతీతులకుఁ గ్రమము కన్పడుచుండుటచే వ్యంగవ్యవహారము లేనట్లే, యిచటఁగూడ వస్త్వలంకారములకు వ్యంగ్యవ్యవహారముండదు.

ఇట్లు క్రమము, బాగుగఁ గన్పడుచుండుటచేతనే, శ్రూయమాణములై, ధ్వనియని వ్యవహరింపఁబడుచున్న (వ్యంజకములని యనబడుచున్న) శబ్దములకును, వాని యందుండి, స్ఫోటమని పిలువఁబడుచున్న (వ్యంగ్యము) యర్థమునకును, వ్యంగ్యవ్యంజకభావము కుదురకుండుటచే వ్యంజకత్వమను సామ్యము నాశ్రయించి (గమ్యము, గమకమునకు సమానధర్మముండుటనే) శబ్దార్థోభయరూపమైన కావ్యమునకు ధ్వనియను నామకరణము చేయుటయు ననుపపన్నమే. ఇచటఁగూడ వీనికి శబ్దార్థములకు, వ్యంగ్యవ్యంజకము లనఁబడువానికిఁ గార్యకారణభావమూలమైన గమ్యగమకభావమున్నది. కార్యకారణభావ మున్నపుడెల్ల క్రమము సులక్ష్యమే. అగునపుడు, సహభావముండుట కుదురదు. సహభావము లేనపుడు, వ్యంగ్యవ్యంజకభావముండుట యుక్తిసిద్ధముకాదు. కావున వస్త్వలంకార ధ్వను లను వ్యవహారమే నిష్ఫలమని తెలియవలెను.

ప్రశ్న.

విభావాదిప్రతిపాదకమగు వాక్యార్థము భాసించుకాలముననే రతి, హాసము మొదలగు స్థాయిభావములప్రతీతియును గల్గుననుట యందఱకును నిశ్చయాత్మకముగఁ దెలిసినదియే. విభావాదివాక్యార్థ ప్రతీతికిని, రత్యాదిభావ ప్రతీతికిని మధ్యవానికిఁగల కార్యకారణభావాది రూపమగు సంబంధమును స్మరించుట మొదలగు విఘ్నము లున్నవని యెవరు ననుకొనుటలేదు. రెండు ప్రతీతులకును మధ్య వ్యవధానమను నదియే లేదే.

రత్యాది ప్రతీతియే రసాది ప్రతీతియగుటచే, నచట వ్యంగ్యవ్యంజక భావము ముఖ్యార్థమునందే కుదురును. ప్రదీపఘటములకు వలె నిచటఁగూడ గమ్యగమకభావ ముపపన్నమగును. ఈ విషయమును ధ్వనికర్తయే తెల్పినాడు.

"వ్యంజకత్వ మార్గమునందన్నచో, యొక యర్థము, మఱియొక యర్థమును బ్రకాశింపఁజేయునపుడు, ప్రకాశమగు వస్తువు, తనరూపమును బ్రకాశింపఁజేసికొనుచునే మఱియొక వస్తువునుఁగూడ ప్రకాశింపఁజేయును- దీపమే యిందులకు దృష్టాన్తము.♦

కావ్యమునందుఁ గూడ నీక్రింది వాక్యార్థమే యుదాహరణమగును. "లీలాకమల పత్రాణి గణయామాస పార్వతీ" ఇచట నాకారగోపనమను లక్షణముగల "యవహిత్థ" మనుభావము వ్యంగ్యము. లీలాకమల పత్రగణనము వ్యంజకము. ఇందు వ్యంజకము భాసించుచునే వ్యంగ్యార్థమును భాసింపఁజేయును.

---

♦లక్షణావ్యాపారమునకును, వ్యంజనా వ్యాపారమునకును భేదముదెల్పు సందర్భమున నీవాక్యము లున్నవి. లక్షణయందు, వాచ్యార్థమే తనను లక్ష్యార్థముగ మార్చుకొనును, ఉదా:—గంగయాం ఘోషః అనునపుడు గంగాశబ్దమునకు గల ప్రవాహరూపమగు వాచ్యార్థమే, గంగాతీరరూప లక్ష్యార్థముగ మారును. లక్ష్య లక్షకములకు భేదము గన్పడదు. వ్యంజక స్థలమున నట్లుగాదు. ప్రదీపమే ఘటము గాదుగదా యని భావము.

(వ్యంగ్య వంజకములు రెండుగా సమకాలముననే ప్రతీయమా నము లగును. ఇట్లులక్ష్యలక్షకములు విభిన్నములుగఁగన్పడవని భావము) ధ్వనికర్తయే తెల్పిన మరియొక ప్రమాణవాక్యమును గూడనిచ్చు చున్నాము. వ్యంగ్యార్థము భాసించునపుడు, వాచ్యార్థజ్ఞానము పోదు. వాచ్యార్థముతో నవినాభావము గల్గియే యది ప్రకాశించును. అందుచే నారెంటికిని ఘటప్రదీపన్యాయ ముపపన్నమగును. ప్రదీపసాహాయ్య మున ఘటప్రతీతి కల్గినతరువాత, ప్రదీపప్రకాశము పోనట్లే, వ్యంగప్రతీ తికాలమునందును వాచ్యార్థప్రతీతి పోదు. (అందుచే వాచ్యవ్యంగ్యము లకు నిమిత్త నిమిత్తి భావములేదని ధ్వనికర్తమతము.)

సమాధానము.

వాచ్యప్రతీయమానార్థములు క్రమముగనే భాసించునుగాని సమకాలమున భాసింపవు. వాచ్యవ్యంగములకు గమ్యగమకభావము న్నది- అను నీవిషయమును ధ్వనికర్తయు వ్యంగ్యవ్యంజక స్వరూప మును నిరూపించునపుడు తెల్పియేయున్నాడు. ఆయన తెల్పిన విషయ మునే మేమిచటఁ బై బ్రశ్నలకు సమాధానముగ నిచ్చుచున్నాము.

"విభావానుభావవ్యభిచార భావములే రసమని యొకరి మతము గాదు. అందువలననే రసాదిప్రతీతి, విభావాదిప్రతీత్యవినాభావిని యగుటచే నారెంటికిని కార్యకారణ భావముండుటవలనఁ గ్రమముఁ గూడనున్నదని యవశ్య మంగీకరింపవలెను. అయినను ఆక్రమము చాలశీఘ్ర మైనదగుటచేఁ గన్పడదు. కావున, నలక్ష్యక్రమము లయియే, రసాదులు వ్యంగ్యములని చెప్పితిమి."

ధ్వనికర్తయే తిరిగి యిట్లుగూడఁజెప్పినాఁడు- "అందువలన నభి ధాన ప్రతీతికిని, నభిధేయ ప్రతీతికిని నిమిత్త నిమిత్తిభావ మున్నట్లే వాచ్యార్థ ప్రతీతికిని వ్యంగ్యార్థ ప్రతీతికినిఁ గూడ నిమిత్త నిమిత్తిభావ

ముండును, నిమిత్తనిమిత్తిభావ ముండుటచే వానికిఁ గ్రమముగూడ నవశ్య ముండవలయును. కాని, పూర్వము చెప్పిన క్రమము ననుసరించి యాక్రమమొకచోఁ గన్పడును. మరియొకచోఁగన్పడదు"—

వాచ్యార్థమునకును వ్యంగ్యార్థమునకును ముందుఁ దెలుపనున్న రీతిని.♦ లింగలింగి భావమున్నదని సమర్థింప వచ్చును. అందుచే ధ్వని భేదములన్నియు ననుమానమునందే యన్తర్భావము నొందును. ధ్వనికంటె ననుమానము మహావిషయమగుటయు నిందులకు హేతువు "ధ్వని"కి లక్ష్యములు కాని పర్యాయోక్తము, గుణీభూతవ్యంగ్యము సమాసోక్తి మొదలగు వానియందును ననుమానము వ్యాపించి యుండును. ఇట్లు ధ్వనికి లక్ష్యములైన వానియందును, లక్ష్యములు కాని వానియందునుఁ గూడ ననుమానము వ్యాపించి యుండుటయే యనుమానమనునది ధ్వనియను దానికంటె మహావిషయమనుటకుఁ గారణమగును.

ప్రశ్న.

అనుమాన మనునది కేవలము స్వప్రయోజనకము. అనఁగా, పర్వతముపై ధూమమునుఁ జూచి యిచట నగ్నియున్నదని యెవఁడను మానించునో, యతనికే యా జ్ఞానము కల్గును. ధ్వనివిషయమున నట్లు గాదు. రచయితకంటె భిన్నుఁడైన పాఠకునకు లేక శ్రోతకుఁగూడ నీ జ్ఞానము కలుగుచున్నదిగదా! ఇట్లు ధ్వన్యనుమానములకుఁ బరస్పరము భేదములేదా ?

సమాధానము.

సత్యమే. ధ్వనియనునది స్వప్రయోజనకము గాదు. అంత మాత్రమున మా వాదమునకు హానిలేదు. అనుమానమనునదియే

♦లింగము=హేతువు. సాధనము, లింగి-సాధ్యము.

రెండు విధములు. స్వార్థానుమానము, పరార్థానుమానము- అందు కేవలము స్వార్థానుమానమునందు వచనవ్యాపార మక్కఱలేదు. (అనఁగా శబ్దములతో రచనను జేయనక్కఱలేదు.) వచనవ్యాపార పూర్వకమగు రచన మెప్పుడున్నదో, యప్పుడే యది పరార్థానుమాన మని తెలియవలెను. పక్షసత్త్వము, సపక్షసత్త్వము, విపక్షవ్యావృత్తత్వము నను మూఁడు రూపములుగల లింగమును (హేతువును) శబ్దవ్యాపారపూర్వకముగఁ దెల్పుటయే పరార్థానుమానమునకు లక్షణము. ఇందువలన వచనవ్యాపారపూర్వకమగు వాఖ్యానమే (చెప్పుటయో, రచించుటయో) పరార్థానుమానమగును గాని కేవల లింగజ్ఞానము పరార్థానుమానము కాదని తెలియవలెను. తర్కశాస్త్రసంప్రదాయము దెలియనిలోక మీ విషయమును దెలిసికొనుట లేదు. అందుచే ధ్వన్యనుమానములకు భేదమును గుర్తించుటలేదు. ఇచట నీవిషయమును గుర్తింపవలయును.

తర్కశాస్త్రము ననుసరించి, అనుమానము రెండు విధములు, స్వార్థానుమానము, పరార్థానుమానము.

స్వార్థానుమానము

ఒకఁడనేక పర్యాయములు మహానసాదులయందు (వంటశాల యందు) ధూమాగ్నులు కలిసియుండుటఁ జూచి, "యత్రధూమః తత్రాగ్నిః" ఎచ్చట ధూమముండునో యచ్చట నగ్నియుండును. అని ధూమాగ్నులకు సాహచర్యనియమరూపమైన వ్యాప్తిని గ్రహించినాఁడు. అతని కా యనుభవము గల్గినదనినమాట. తరువాత నాతఁడొక పర్వతము దగ్గఱకు వెళ్ళినాఁడు. ఈ పర్వతమున నగ్నియున్నదా? యని సందేహించుచుండగా ధూమమతనికిఁ గన్పడినది. ఇప్పుడు ధూమాగ్నులకుఁ గల "వ్యాప్తి" యాతనికి జ్ఞాపకము వచ్చినది.

---

ఇచట నీ విషయమును గుర్తింపవలయును.

"వహ్నివ్యాప్య ధూమ వా నయం పర్వతః".

అను జ్ఞానము కల్గినది. దీనినే లింగపరామర్శమని యందురు. తరువాత "పర్వతో వహ్నిమాన్" ఈ పర్వతమునం దగ్నికలదు." అను ననుమితి కల్గును. అనగా ధూమాగ్నుల భూయోదర్శనము, ధూమాగ్నులకుఁగల వ్యాప్త్యనుభవము, పర్వతమున నగ్నిని సందేహించుట, ధూమమును జూచుట, వ్యాప్తిస్మృతి, పరామర్శము, అనుమితి" అనునవి క్రమముగ నాతని మనసునఁ గల్గును. ఇది స్వార్థానుమానరీతి.

ఇఁక స్వయముగ ధూమముండుటచే నగ్ని ననుమానించి, యితరులు గూడఁ దెలిసికొనుటకై పంచావయవముగు వాక్యమును బ్రయోగించుట యనెడిది పరార్థానుమానము. పర్వతో వహ్నిమాన్=పర్వతమునం దగ్నియున్నది; ధూమవత్త్వాత్=పొగయుండుటవలన; యోయో ధూమవాన్ ససోఽగ్నిమాన్, యథామహానసః=ఎచటనెచట ధూమముండునో యచట నచట నగ్నియుండును, మహానసమునందువలె; తథాచాయం; ఇచట నట్లే ధూమమున్నది. తస్మాత్తథా=అందుచే నిచట నగ్నియున్నది. ఈ వాక్యములను బ్రయోగించుటచేత నితరునకుఁ గూడ పర్వతమున నగ్నియున్నదని తెలిసికొనును. అందుచే నిది పరార్థానుమానము ఇందు ప్రతిజ్ఞాహేతూదాహరణోపనయన నిగమనములను నైదవయవములున్నవి. పర్వతో వహ్నిమాన్=ప్రతిజ్ఞ, ధూమవత్త్వాత్=హేతువు. యోయోధూమవాన్ ససోగ్నిమాన్ యథా మహానసః= ఉదాహరణము. తథాచాయం = ఈ పర్వతమునఁగూడ వహ్నివ్యాప్యమగు ధూమమున్నది = ఉపనయనము తస్మాత్తథా=నిగమనము- ఇవి పంచావయవములు.

ఇందులోనే "యన్నైవంతన్నైవం యథాహ్రదః" ఎచట నిట్టి ధూమముండదో యచట నగ్నియుండదు. సరసువలె అని విరుద్ధదృష్టాంతమును గూడఁ జెప్పుదురు.

పక్షసత్త్వము.

సందిగ్ధసాధ్యముపక్షము- ఎందు సాధ్యమైన యగ్నియున్నదా లేదాయని యనుమానించుచున్నామో యది పక్షము. ప్రస్తుతము పర్వతము- పక్షమైన పర్వతమునందు లింగమగు ధూమముండుట పక్ష సత్త్వము.

సపక్షసత్త్వము.

నిశ్చితసాధ్యవాన్ సపక్షః- అగ్నియున్నదని నిశ్చయముగఁ దెలిసినస్థలము సపక్షము- ప్రస్తుతము మహానసము- అచట ధూమముం డుట సపక్షసత్త్వము.

విపక్షవ్యావృత్తత్వము.

నిశ్చితసాధ్యాభావవాన్ విపక్షః- సాధ్యమైనయగ్ని యెచట లేదని నిశ్చయముగఁ దెలియునో యది విపక్షము- ప్రస్తుతము సరస్సు. అచ్చట నగ్నిలేదు. అగ్నిలేని యచట ధూమములేకుండుట విపక్షవ్యా వృత్తత్వము.

సద్ధేతువులకీ మూఁడురూపములగు లక్షణములు నుండవలయును. ఈ త్రిరూపలింగమును, శబ్దరూపమునఁ బ్రతిపాదించుట యెప్పుడున్నదో యపుడు పరార్థానుమానమే యగును. ఇతరులకుఁ జెప్పవలసిన యవ సరములేనపుడు శబ్దరచనమే యక్కఱలేదుగదా! కావున ధ్వనిస్థల మునఁ గూడ సాధ్యసాధనభావ మెప్పుడు శబ్దనిరూపితమైనదో యపుడే యది పరార్థానుమానమున నంతర్భావముఁ జెందినదనియే తెలియ వలెను. అందుచే ధ్వనిస్థలమున స్వార్థానుమానలక్షణము (స్వప్రయో జనము) లేకుండుట దోషముగాదని నిర్ణయము.

వాక్యార్థమునందంతటను సాధ్యసాధన భావము నిర్భిన్నతమై యుండుననియే గదా మీరుచెప్పునది. అగుచో నీవాక్యార్థములయందు

సాధ్యసాధనములు రెండునున్నట్లే, దృష్టాన్తముగూడ నుండనక్కఱ లేదా? వ్యాప్తిసాధనమునకు దృష్టాన్తముగూడ నవశ్యమపేక్షణీయమే గదా? కాని ప్రస్తుతము మనము బరిశీలించిన వాక్యార్థమునందు దృష్టాన్తములు లేవే!

సమాధానము.

దృష్టాన్త మన్ని తావుల యందు నవశ్యముండవలయు నను నియమము లేదు. ఒక్కొక విషయమును సాధించుటయందొక్కొక సాధనముప్రసిద్ధమైయుండును. ప్రసిద్ధసామర్థ్యమగు నట్టిసాధనమును మనము గ్రహించి నపుడా సాధనముయొక్క సామర్థ్యమువలననే, సులభముగనే సాధ్యసిద్ధి కలుగును. అట్టి తావులందు దృష్టాన్త గ్రహణమక్కఱ లేదు. ఈవిషయమును పూర్వులు చెప్పినారు.

"తద్భావ హేతుభావౌహి దృష్టాన్తే తదవేదినః
ఖ్యాప్యేతే విదుషాం వాచ్యో హేతురేవ చ కేవలః

[తదవేదినః=సాధ్యసాధన భావము తెలియని వారికి, దృష్టాన్తే =దృష్టాన్తమును తెల్పువాక్యమునందు, తద్భావహేతు భావౌ=సాధ్యసాధన భావములు, ఖ్యాప్యేతే=తెలియఁ జేయబడుచున్నవి. విదుషాం= సాధ్యసాధన భావము తెలిసినవారికి, హేతురేవ కేవలఃవాచ్యః= హేతువునొక్క దానిని మాత్రమే చెప్పినఁజాలును.

ఇంతవఱకుఁ దేలిన దేమన?—రసవిభావాది ప్రతీతులు సమకాలికము లను భ్రమచేతనే, ధ్వనివాదులు వ్యంగ్యవ్యంజక భావము నంగీకరించినారు. వాస్తవమున రసవిభావాదులకు వ్యంగ్య వ్యంజక భావమనునది యౌపచారికమేగాని ముఖ్యముగాదు. ఈవిషయము నిక ముందుఁ గూడ నిరూపింతుము.

# ఏకాదశస్కంధము

— హరిభట్టారకుఁడు —

క. ఈరీతి నురులఁ జిక్కిన
దారాపత్యములఁ జూచి తత్పతి దుఃఖా
పూరితనిజమానస సం
ప్రేరితుఁడై యిట్లు పలవరింపఁ దొడంగెన్. 207

సీ. పరమపాతివ్రత్యపావనురాలైన
భార్యయుఁ బ్రాణమై పరఁగుసుతులు
నురులచేఁ జిక్కువడుచున్నారు. నాకింక
నెయ్యది దిక్కు, నే నెట్లునిలుతు
నొకటి విచారింప నొక కర్మమే తెంచె
దైవికయత్నంబు దప్పదెచట
వీరలఁ బాసి నే ధీరత నెట్లుందు
దిగనాడి చనఁచున్న దిటుకఁటుంబ

గీ. మనుచు బెగ్గిలి విరహాకులాత్ముఁడగుచు
బెక్కువిధముల విలపించి బీరముడిగి
పాయరానట్టి కూరిమిఁ బాయలేక
తగులువడె నందుఁ బతగంబుఁ దత్తరమున. 208

క. తగిలిన పతగంబుల నా
యగచరుఁడు వధించి చిక్కమం దిడుకొని, వాఁ
డగణిత హర్షసముజ్జ్వలుఁ
డగుచుం జనె నిలయమునకు యదువంశనిధీ. 209

క. ఈరీతి మోహవశమున
దారాపత్యాదులందుఁ దత్పరుఁడై, స
ర్వారంభ హీనుఁడగుచును
జేరువ నరకంబులందుఁ జెందునరుండున్. 210

క. ఏనరుఁడైనను గానీ
మానవలోకంబుఁ బొంది మతిమంతుండై
శ్రీనాథుని మదిఁ దలఁపని
యానరుఁ డారూఢపతనుఁ డనఁగాఁ బరఁగున్. 211

ఆ. పట్టె డంతయైనఁ బరిపూర్ణమైనను
రుచివిహీనమైన రుచ్యమైన
కణఁకఁ గోర్కిలేక గ్రాసంబువచ్చిన
నజగరంబుమాడ్కి నందవలయు 212

గీ. జీవనంబుగల్గి చేవ మీఱినవేళఁ
బూని జీవనంబు లేనివేళ
నుబ్బుస్రుక్కు లేక యుండంగవలయును
సాగరంబుమాడ్కి యోగయుతుఁడు 213

క. శలభము సంతత దీప
జ్వలనంబున సమయునట్లు వామాక్షులయు
జ్జ్వల భూషాంబర వాంఛా
కలితుండగు నరుఁడు వొందు ఘననరకంబుల్. 214

క. జవమునఁ దుమ్మెద పుష్పా
సవపానము సేయురీతి శాస్త్రాంతర సం
భవ సారములను మునిపుం
గవుఁ డాచరణంబుసేయఁ గల్గును సుఖముల్. 215

క. దారువినిర్మితకాంతా
కారములును ముట్టనేని ఘనుఁడగు యతి తా
నేరుపు చెడి బద్ధుండగు
గారవమునఁ గరిణిఁజేరు కరిచందమునన్. 216

క. అధికాసవసంగ్రహమున
మధుమక్షిక మడియుకరణి మహిలో యతి దు
ర్విధమున భిక్షాసంగ్రహ
మథమంబుగఁ జేసెనేని హతపుణ్యుఁడగున్. 217

ఆ. జనులచేత దుఃఖసంచితంబై యుప
భోగములకు రాక పోవుధనము
కూర్మి జుంటియీఁగ కూర్చు తేనెయుమాఢ్యు
పోలుపుమీఱి యన్యభోగ్యమగును. 218

క. నెలకొన్న వేడ్కయతి రా
మలగీతము వినఁగవలదు మాటికి, వినినన్
దలఁపెక్కి ఋష్యశృంగుని
వలెఁ దద్గతహృదయుఁ డగుచు వర్తన విడుచున్. 219

క. గీతము చెవులకు సోకిన
చాతురిఁ దనుమఱచి మృగము సమసినకరణిన్
గీతము విని యతి తద్వశుఁ
డై తా సుజ్ఞాన మూడిగి హతుఁడగు నధిపా. 220

క. రసమోహితులై మర్త్యులు
రసనాదోషంబువలన రాయిడి పడుచున్
దెసచెడి మీనంబులక్రియ
నసమాంతక పాశబద్ధులగుదురు దఱచై. 221

క. అనయము జిహ్వాచాపల
మున నింద్రియజయములేక ముక్తికిఁ బదిలం
బున జనెడి మార్గమెఱుఁగక
మనుజుఁడు నమవర్తిలోక మందువసించున్. 222

క. జిహ్వాచాపలసహితుఁడు
బహ్వాశాకలితుఁడగుచుఁ బతితుండగు, నా
జిహ్వాచాపల రహితుఁడు
బహ్వామరసమేతుఁడగుచు వడిఁ జను దివికిన్. 223

సీ. నెఱి విదేహమహావనీపురమునఁ రాజ
వీధిఁబింగళ యను వేశ్య గలదు
తన్మ్యాలమునఁ గొంత తత్త్వమే నెఱిఁగితి
నా కథావృత్తాంత మాదినుండి
విస్తరంబుగ నీకు వివరించి చెప్పెద
విను మాదరంబున విమలచరిత
యా వేశ్య యొకనాఁడు భావంబులో నర్థ
సంగ్రహార్థం బాత్మసఖుని మొఱఁగి

గీ. గరిమఁ గూరిమిసల్పు వాక్యములచేత
రాకపోకల వచ్చువారల మనంబు
లందు మన్మథభావంబు లాముకొనఁగ
రమణ వర్తించె నిజమందిరంబునందు. 224

క. ధనమిచ్చువానిఁ బిలిచెద
నని రాత్రిట నిద్రమాని యా మానిని వీ
థిఁగిఁ దిరుగాఁడఁగ దన్మన
మున నొక నిర్వేద మొదవె ముక్తిప్రదమై. 225

వ. ఇవ్విధమున నిద్రాసుఖము పరిత్యజించి విత్తాశాపరవశయై నిశాసమయంబున రాజమార్గంబునఁ దిరుగాడుచు నధికశ్రమంబు నొందిన యా వేశ్యాలలామ మానసంబున నిర్వేదంబు జనియించిన నాత్మలో నిట్లనియె. 226

క. రతిపతిత్రోడుశ సన్నైమై
రతిసేయఁగ నేర్పుగలిగి ప్రబలుండగు నా
పతిఁ గాదని, పరపురుషునిఁ
బతిగా మతిఁగోరు నాకుఁ బాపంబొదవెన్. 227

సీ. సర్వలోకేశుని సచ్చిదాకారుని
వాసుదేవుని భక్తవనజమిత్రుఁ
జింతింపనొల్లక చింతాశతంబుచే
స్రుక్కి విత్తాశచే నుక్కుమిగిలి
చర్మాస్థిరక్త మాంసావృతంబై నట్టి
కష్టదేహంబు విక్రియముసేసి
ధనసంగ్రహము సేయ మనమున నూహించి
వీథులఁ దిరుగాడి వెఱ్ఱినైతి

గీ. ననుచుఁ బింగళ రోసి, విత్తాశ మాని
హరిఁ బరేశునిఁ జిత్తాబ్జమందునిలిపి
చారుపుష్పాభినిర్మిత శయ్యమీఁద
బ్రియునితోఁ గూడ నిద్రించెఁ బ్రేమతోడ. 228

మ. గురుసంసారమహార్ణవాంతరనిమగ్నుండై, దురాశాపరం
పరచే నష్టవిలోచనుండగుచు, నాపత్పంకసంలిప్తుఁడై
వరుసన్ గాలమహాహిజిహ్వాతుదపై వర్తించు నీ జీవునిన్
హరిదక్కన్ బరులెవ్వ రోపుదురు సత్యాచార రక్షింపఁగన్. 220

సీ. దేహంబు నిజమని తెలివితోఁ జూచిన
బుద్బుదంబులరీతిఁ బోవునడఁగి
విత్తంబు నిజమని వీక్షింప నదిమోహ
జనకమై తొలఁగును దనకురాక

రూపంబు నిజమని రూఢితోఁ గొనియాడ
ఘనజరాపంచాస్య బాధితంబు
సంపద నిజముగాఁ జర్చించిపలికిన
మెఱుపుచందంబున మెఱసిపోవు

గీ. అరయఁ గాంతాత్మ సంజాతులవ్వ వారు
పూర్వకర్మంబు లనుభవంబునకు రాక
మాననేరవు గాన నీ మమత విడిచి
చింత సేయంగవలయు లక్ష్మీశపదము. 230

క. కురరంబొక్కటి మాంసము
కరమునఁ గొని మింటినెగయఁగాఁ జూచి మదో
త్కరమై పతంగసంఘ
మ్మఱిమిఁ దన్మాంసమునకు నరిగినపిదపన్. 231

గీ. బలిమితోడ మింటఁ బఱదెంచుపక్షుల
నీక్షసేసి మోహమెల్లమాని
మాంస మూడఁ దన్ని మది వాంఛసేయక
కురర మరిగె నెలవుగూఁటికడకు, 232

క. ఆకురరముచందంబున
శ్రీకాంతలయందు వాంఛసేయక, ప్రాప్తం
బే కోలఁది నా విధంబునఁ
బోకడఁ గని నరుఁడు దృప్తిఁబొందఁగవలయున్. 233

క. మానము నవమానము సరి
గా నూహయొనర్చి యేను గతకలుషుఁడనై
పూనిక నాత్మారాముఁడ
నై నయమున సంచరింతు నర్భకుపగిదిన్. 234

సీ. ఒకనాఁడు ధరణిలో నొక విప్రకన్యక
కౌతుకంబున నింటి కావలుండి
బంధువు లేతేర భక్తితో వారల
కతిముదంబునఁ బాద్య మర్ఘ్య మొసఁగి
తద్భోజనార్థమై ♦ తతి రాజనంబులు
వరుస దంపఁగ శంఖవలయపంక్తి
ఘల్లుఘల్లని మ్రోయఁ గనుసిగ్గువడిఁ జేత
నొకటి నిల్పఁగఁ బైచియున్నదాని

గీ. వరుసతో నొక్కటొకటి పోవంగఁ జేసి
నంత నొరయిక లేనిచో నారవంబు
లణఁగిపోయిన సంతోషమగ్గలింప
దంచె రాజనములు బాల ధన్యశీల. 235

ఆ. ఆ కుమారికంకణాళి చందంబునఁ
బెక్కుయతులుఁగూడ బెనఁగు జగడ
మొక్కఁడైన మాట లుడిగి నిశ్చలచిత్త
సహితుఁడగుచుఁబొందు సత్పదంబు. 236

మ. శరకారుండు శరంబుమీఁద నిజదృక్స్వాంతంబు లేకంబుగా
నెఱి సంధించి, దదేకనిష్ఠుఁడగుచున్ వీక్షింపుచో ముందఱన్
తురగంబెక్కినరాజు గాంచినక్రియన్ దోరంబుగా యోగిబా
హ్యారుచిజ్ఞానము♦ మాని చేర్పవలయున్ యజ్ఞేశుపైఁ జిత్తమున్. 237

♦ తతి=శబ్దమిచ్చట రహస్యము లేకయే కాంతము అనునర్థమునఁ బ్రయుక్తము-
మూలములో:—
తేషామభ్యవహారార్థం శాలీన్ రహసి పార్థివ! అవఘ్నంత్యాః ప్రకోష్ఠస్థాశ్చక్రుః శంఖాః స్వనం మహత్.

♦ పాఠాంతరము—రౌతు. కాని 'రాజు' పాఠము యుక్తమని తోఁచెడిని-
మూలములో యత్రైష కారోన్నృపతిం వ్రజంత మిషౌ గతాత్మా న దదర్శ పార్శ్వే.

క. చీమలు పెట్టిన పుట్టలఁ
బాములు సుఖియించునట్లు పరమజ్ఞానుల్
ప్రేమంబునఁ బరగృహమున
వేమఱు సుఖియింతు రధిక విభవముతోడన్. 238

చ. అరయఁగఁ నూర్ణనాభిహృదయమ్మునఁదంతువితాన మొప్పఁగా
బరువడితో రచించి యది భగ్నముసేసి గ్రహించునట్లు, వే
మరు హరి భూతపంచకసమన్వితసృష్టి సృజించి దాని సం
హరణముసేయు నంత్యమున నక్షయరోషకషాయితాత్ముఁడై. 239

ఆ. నరుఁడు కూర్మినైన నతిరోషముననైనఁ
జిత ♦ మేమిటందుఁ జేర్చునేని
నతఁడు తత్స్వరూప మగుచుండుషట్పదా
క్రాంతమైన కీటకంబుకరణి. 240

వ. ఇవ్విధంబున నేను భూమివలన క్షమయును, వాయువు వలనఁ బరోప
కారంబును, ఆకాశంబువలనఁగాలసృష్టగుణాసంగమంబును, జలం
బువలన నిత్యశుచిత్వంబును, అనలంబువలన నిర్మలత్వంబును, నిశాక
రునివలన నధికాల్పసమత్వంబును, సూర్యునివలన జీవనగ్రహణ
మోక్షణంబులును, కపోతంబువలనఁబుత్రదారాదిస్నేహవిసర్జనం
బును నజగరంబువలన స్వేచ్ఛాసమాగతాహారభోజనంబును,
సముద్రంబువలన నుత్సాహశోషణపరిత్యాగంబును, శలభంబు
వలన శక్త్యనుకూలకర్మాచరణంబును, షట్పదంబువలన సార
గ్రహణ సామర్థ్యంబును, గజంబువలన కాంతావైముఖ్యంబును,
జుంటీఁగవలన సంగ్రహణార్జవంబును హరిణంబువలన నిశ్చలచిత్త
ప్రచారంబును, మీనంబువలన జిహ్వాజయంబును, పింగళవలన
యథాలాభ సంతుష్టియును, గురరంబువలన మోహత్యాగంబును

♦ ఏమిటందు = ఈశబ్దము 'దేనియందైనను' అను అర్థమునఁ బ్రయుక్తము మూలములలో. 'యత్ర యత్ర మనోదేహీ ధారయేత్ సకలం ధియా స్నేహాద్ద్వేషాద్భయాద్వాపియాతి తత్తత్స్వరూపతాం'.

# రమ్యాలోకనము

## సముఖము వేంకట కృష్ణప్ప నాయకుని

## రాధికాసాంత్వన పీఠిక

రాయలనాఁటి రసికత నాయకరాజులనాఁటికిఁ బరకోటి ముట్టినది, పతనోన్ముఖము నైనది. అప్పటి యాంధ్రప్రబంధములు శృంగార రసపుఁబసకును గసకును బరమావధు లని చెప్పవలె. అట్టివానిలో సముఖము వేంకట కృష్ణప్ప నాయకుని రాధికా సాంత్వనము నొకటి. పౌరాణికప్రతిష్ఠ గల ప్రబంధనాయికలలో రసప్రసిద్ధమైన వ్యక్తిత్వము గల వారిద్దఱే రాధిక, సత్యభామ. సముఖము కృతిలో నాయిరువురు నాయికలును గలరు. రాధికది ప్రధాన భూమిక. సత్యభామ సవతి. రాయల నాఁటి ప్రబంధ రాధిక స్వీయ. సత్యభామ సరేసరి; ఎప్పుడును ఖండిత నాయికయే. అసలామె ఖండిత కాకున్నచో సొగసే లేదు. కాని దక్షిణాంధ్ర కవుల చేతిలోఁ బడఁగానే వారి వాలకములు మాఱినవి. నాటకములలో సత్యభామకును ప్రబంధములలో రాధకును ప్రాధాన్యము హెచ్చినది. రాధ పరకీయయు నైనది. పైఁగా సత్యభామ ఖండిత నాయికాత్వము నామెకు సంక్రమించినది. సంప్రదాయ సహజముగాఁ బ్రేమాభిరామములు గావలసిన యా నాయికల యాకృతు లప్పటి కృతులలోఁ గామక్రీడాభిరామము లై పోయినవి. అయినను సభిరమ్యత యన్న దొకటి మిగిలియున్నది కనుకనే వాని కావ్యత్వమున కింత నిలుకడ గలిగినది.

మన కిప్పు డుపలభ్యము లగు రాధికాసాంత్వనములు రెండు. సముఖము కృతి యొకటి, ముద్దుపళని దొకటి. ఇరువురి కవితలకును బోలిక లిరుగుపొరుగుగా నున్నవి. పద్యము లఱువది పై చిలుకు రెండింట యథాతథముగా నున్నవి.

సముఖము క్రీ. శ. 1704-1731 సం॥ ల మధ్య మధుర నేలిన విజయరంగ చొక్కనాథనాయకుని ముఖ్యసామాజికుఁడు. ముద్దుపళని క్రీ.శ. 1741-1764 సం॥ల మధ్య తంజావూరు నేలిన మహారాష్ట్ర ప్రభువు ప్రతాప సింహుని నాస్థానిని. విజయరంగని రాజ్య కాలముననే వేంకట కృష్ణప్ప వృద్ధుఁడై యుండెనను యూహకు నుపాధి గలదు. (చూ. ఆం. సా! పత్ర ప్రచురణ వచన జైమిని భారతమునకు జయంతి రామయ్యగారి భూమిక) ఎంతకాదన్నను సిరువురకును బది పదునైదేండ్లన నంతర ముండి యుండును. అదియుఁగాక యాంధ్ర సాహిత్య పరిషత్తునఁగల సముఖము కృతి తాళపత్త్రప్రతిచివర, 'కీలక నామ సంవత్సర మార్గశీర్ష బహుళషష్ఠి శుక్ర వారమునాఁడు బాగూరు రంగశాయికొమార్త అమ్మికి తంజావూరుకవి వేంకట స్వామినాయఁడు రాధికా సాంత్వనము సర్వము స్వహస్తలిఖిత ముగా నిచ్చినది', యని గలదు. ఆ కీలకనామ సంవత్సరము క్రీ.శ.1728 గా గుర్తింపబడినది. అది 1788 యైనను గావచ్చును. కాని యట్లయినచోఁ బ్రతాపసింహుని కాలమున ననఁగా నం తకు (1788 నాఁటికి) అధమ పక్షము యిఱువదినాలు గేండ్లకు (1764 నకు) బూర్వమే రచింపబడియుండు ముద్దుపళని కృతిని గాదని, లేఖకుఁడు వేంకటస్వామి యా రంగశాయి కొమార్త యొపర్తకో సముఖముకృతికిఁ బ్రతి వ్రాసి యీయవలసిన యగత్య మేమి? మీఁదుమిక్కిలి నాయఁసామియుఁ దంజావూరు కవియే యఁట. మఱి తల్లిపుట్టుక మేనమామ యెఱుఁగకుం డునా? కాఁబట్టి యా కీలక 1728 యని నిశ్చయించుటయే సమంజసము. అది విజయరంగని రాజ్యపాలన కాలమునఁ బడి నది. అప్పటికప్పుడే సముఖముకృతి ప్రతిష్ఠ తంజావూరు నకును బ్రాకిన దన్నమాట దానికి రంగశాయికొమార్త తంజావూరు కవిచేఁ బ్రతివ్రాయించు కొనుటయే తార్కాణ. సముఖము రాధికాసాంత్వనము విజయరంగని పరిపాలన

కాలముననే రచింపఁ బడె ననుట కందలి, 'ఇది శ్రీపాండ్య మండలాధీశ్వర— శ్రీవిజయరంగ చొక్కనాథ మహీనాథ కరుణా కటాక్ష సంపాదిత...' అను నాశ్వాసాంత గద్యయే ప్రబలాధారము. అసలు సముఖము గ్రంథరచన మంతయు విజయరంగని రాజ్యకాలముననే సాగినది. అతని ప్రతిగ్రంథాంతగద్యలోను విజయరంగని పేరు కనిపించును. ఆ గద్యయు నన్నింట నొక్క తీరుగనే యున్నది.

ఇఁక నీ రాధికా సాంత్వనము సముఖము కృతమే యనుట కాధారములు : సమకాలికుఁడైన కవి యొకఁడు ప్రతి వ్రాయుట, గ్రంథావతారికలోని

'తెలియ నభీష్టమిమ్మనుచు వేంకటకృష్ణ నృపాలశేఖరుం
డిల రసికావతంసులకు హృద్యముగా మృదుమాధురీరసా
కలిత చమత్క్రియాకలన కల్పనగా రచియింపనొప్పు ని
శ్చలమగు రాధికారమణి సాంత్వనమున్ గృతి సల్పుమం చనెన్.'

అను పద్యమును, అహల్యా సంక్రందనము నందును నించుమించుగా నొక్కతీరుగ నున్న గ్రంథాంత మందలి కృతిపతి (శ్రీరంగపతి) ప్రశంసా పద్యములుమూఁడు, నాగ్రంథమధ్యముననే నాయికా నాయకుల సమాగమ సందర్భమున నున్న పద్యములు మఱి మూఁడు నొకగద్యయును (చూ, రా. సాం. సంఖ్య వరుసగా 114 నుండి 120 వ పద్యము వఱకు)

ఏమైననేమి, ముద్దుపళని కృతి ముద్రితమై ప్రసిద్ధి కెక్కినది. సముఖము కృతి ముందు పుట్టినను మూలఁబడినది. కాని యతని కవితా నవనీతాస్వాదన ఫలము మనకు ముద్రిత గ్రంథమునుండి ముట్టనే ముట్టినది. అయినను నీకృతిని బ్రచురింపవలసిన యావశ్యకతయుఁగలదు. నిలుకడ మీఁద నైనను నిజము తేలవలెను గదా ! సముఖమువాని కృతిలో సరసముగాఁ గనిపించిన ప్రతిపద్యమును సంగ్రహించిపని ముద్దుపళని. అతని గ్రంథమున నున్నవే నూట యిఱువది గద్యపద్య

ములు. గద్యములు పోను నూటరెండు మాత్రమే పద్యములు. అందులో నలుబది మక్కికి మక్కిగా గ్రహించినది. (ఆపద్యములన్నియు గ్రంథమున కనుబంధమైన అకారాది పద్యసూచికలోఁ జుక్కగుర్తులతోఁ జూపించి యుంటిని) ముఖ్యముగా ముద్దుపళని కృతి మూఁడవ యాశ్వాసమున నీ యుద్యమ మెక్కువ. అదియే కథయొక్క కండపట్టు—చిలుక రాయబారము, నాయికా నాయకుల విరహము, తత్సమాగమము—అంతేకాక పద్యపాద, పదబంధముల తార్పుడు, భావముల మాఱుమనువులు నిట్టి యలఁతి యలఁతి మార్పులతో మఱి కొన్నింటికి ఛాయలు గల్పించినది.

ఉదా :

1. కొసరుపల్కులఁ బన్ని గోటికత్తులఁ జిమ్మి
కాసెలోఁ జెయివేసి కదియఁదీసి,
కన్నాతు లాగించి కౌఁగిట బిగియించి
సరిబిత్తరుల నొత్తి సాగనిత్తి
కల్లంబునకు వచ్చి కలికి యౌనని మెచ్చి
మెఱుఁగుఁజెక్కిలి కొట్టి కురులు పట్టి,
తొడకంబముల నాని తోఁపునూకులఁ బూని
సందు సేసుక నొక్కి చాలఁ దక్కి
యదలుపులుఁ బొగడికలు నెయ్యంపుఁ దిట్లు
గళరవంబులు దుడుకులుఁ జెలఁగ సత్య
మాధవుండును గడిదేఱి మరునిసాము,
చేసి చెలరేఁగి నెఱవాయిఁ జెంది మఱియు—29. (సముఖముకృతి)

'అలమి కౌఁగిటఁగ్రుచ్చి యల్లందులకుఁ జొచ్చి
కాసెలోఁ జెయి వేయు కౌశలంబు,
నుబికి పెందొడ లెత్తి యొడలు ఝుమ్మన హత్తి
హిత వొప్ప నెదురొత్తు లిచ్చుపైపు,
తళుకు లేఁ గవఁ దగ్గి తమి యుప్పతిల నొగ్గి
ధేనుకబంధంబు వానుజాతి,
చిఱచిఱఁ బై నెక్కి రవళి హెచ్చఁగ నిక్కి
పుంభావ మొనరింపఁ బూను సొగసు,

తరువుఁ జుట్టిన లతకూన హరువు మీఱి,
తనువు తనువునఁ బెనఁగొన ననువు దేరి,
వలపుతో నాగబంధంబు సలుపుదారి
దానికే కాని మఱిదేనికైనఁ గలదె'-III 117 (ముద్దుపళని కృతి)

ఇట సందర్భము నాయికా నాయకుల సంభోగ సంరంభము, రతిబంధముల వర్ణన కొంత శాస్త్రప్రకారముగా జేసినది పళని. సముఖము వృత్తిచే దండనాథుఁడగుటచేఁ గాఁబోలు కర్ణాతు,కల్లము సరిబిత్తరమునను మల్లబంధ విశేషములనే సందర్భసుందరముగా ననుసంధించినాఁడిచ్చట. పళని పద్యములో. 'నల్లందులకు జొచ్చి' యను ప్రయోగము ససారస్యమే గాని యదియు నాయకు నుచ్ఛిష్టమే. (చూ. స. రా సా. 117).

2. 'కాంత లిట్టుల రా నీక యంతు సేయ
నీటిచిమ్ముల కళుకక నిలుచు గంధ
సింధురం బన నిలఁబడి శ్రీధరుండు
పలికె వారలఁ గని నయభయము లమర'-(106 స-రా॥ సా॥)
'చెలిచెలు లిట్లు చేరి...రవ్వలిడఁగాఁగని శ్రీహరి యీ జపోటుల
గలఁగని గంధసింధుర మనంగఁ దొలంగక నిల్చి యి ట్లనున్.'
—(ము. ప-రా. సా॥ IV 16)

ఇందు ఛందస్సు మాఱినది గాని గంధ సింధుర మట్లనే యున్నది

3. సుదతి యిసుమంత కడకంటఁ జూచినంత
నింత అంతులు సేతురా యింతులార
మీరు నా మాఱు పదముల మీఁద వ్రాలి
కలయఁ గలయించి సుకృతంబు గట్టుకొనరె   స-రా॥ సా౦॥ 107
సుదతి యిసుమంత కడకంటఁ జూచినంత
నింత అంతులు చేతురా యింతులార
అలుక దీఱంగ దొరసాని కమరఁ బలికి
చెలిమి యొనరించి సుకృతంబుఁ బొందుఁ డనిన'
(ము-ప- రా॥ సా॥ IV 17)

ఇందు పూర్వార్థము లొకటే మోస్తరు. ఉత్తరార్థమున నున్న సముఖ స్వారస్యము పళనిపద్యమునకు రాలేదు.

4. ఇందు బింబాస్య నవ్వుల కెంచి చూడఁ
జంద్రకిరణవిలాసంబు సహజ మయ్యె,
నింతినునుగప్పుకొప్పున కెంచి చూడఁ
జంద్రకిరణ విలాసంబు సహజ మయ్యె—(స. రా॥ సా॥ 97)
'ఇందుబింబాస్య చిఱునవ్వు కెంచి చూడఁ
జంద్ర కిరణ విలాసంబు సహజ మయ్యె
నింతినునుగొప్పుకప్పున కెంచి చూడఁ
గాలమేఘంబు సరిసాటి గాదనంగ- (ము-ప-రా॥ సా॥ III 153)

ఇట పళని పద్యమున నాలవ పాదము పూర్తిగా మాఱిపోయినది. ఆమెను సముఖము పద్యములోని సభంగ శ్లేష యర్థము కాలేదేమో! ముద్దుపళనిగ్రంథము ముద్రిత ప్రతులు మఱి రెండిటఁ బై పద్యపు టుత్తరార్థమునకు మాత్రము 'తీవబోడి కనుల తీ రెంచి చూచిన, జలజపత్రపితతి సమము గాదు' అను పాఠాంతరము గన్పించుచున్నది. కాని యది యొక దోపుపుల్ల. పద్యపూర్వార్థము తేటగీతిలో నున్నది. పాఠాంతర మాటవెలఁది. కావున నది యపరిగ్రాహ్యము.

5. అపుడు వచ్చుట రాధ కంసారిరాక
చిలుకచే విని తన వద్ది చెలులఁ బిలిచి
వెన్నుఁ డిట కేఁగుదెంచిన విడువ వలదు
వాకిటనె నిల్పుఁ డని చెప్పి పనిచె నంత—స. రా॥ సా॥ 101

ఇటులఁ జనుదెంచు హరిరాక యెఱిఁగి చిలుక
చెప్ప విని రాధ తన యొద్ది చెలులఁ బిలిచి
శౌరి యిట వచ్చె నని నింటి సరగ వాని (మీరలతని-పా)
విడక నిల్పుఁడు మోమోట మిడక యుంచె—
ము. ప- రా. సా. IV -5

6 ఇటుల వాడిన మాటల కిముడఁ బలికి
రాజసము మీఱఁగా యదురాజవహాళి
బలిమి జులుముల సందడుల్ దొలఁగఁ ద్రోచి
చోరవఁ జేసుక లోపలఁ జొచ్చు వేళ—స, రా॥ సా॥ 104.

అను సఖీమణి వాక్యము లాలకించి
బలిమి జాలములు విలసిల్ల బలసి చొరవఁ
జేసి చూచెద ననుచు నా శ్రీధరుండు
నీవి చెలఁగంగ లోఁజొచ్చి పోవఁ గాంచి — ము. ప. రా॥ సా॥
IV 13.

7. ఈ వైన మానాఁటి కెటు పోయెనో యని
చెప్పి కరంబులు విప్పువారు — స. రా॥ సా॥ 109
ఈ బుద్ధి యీనాఁడె యెందుఁ బోయె నటంచు
విడనాడి చేతులు విచ్చె నొకతె — ము. ప. రా॥ సా॥ IV 18

పై యుదాహరణములలో నాడాడ మాటలే మారినవి కాని భావముల బండారము బయటపడుచునే యున్నది. 'ఈవైన'మిత్యాది స్థలములలో మూలగ్రంథము సొగసులు కొన్ని ముద్దుపళని గ్రంథమునకు రాలేదు. ఇక్కడే మఱొక్క మాట; ఆమె వెలిదిండ్ల, శేషము వేంకటపతులను గూడ పలుకరింపక విడువ లేదు. (చల్లకు వచ్చి ముంత దాఁచ నేల యని కాఁబోలు). ఇఁక సముఖములో రాయబార మెందులకు? వెంకటకృష్ణప్పయుఁ గవిత్వమున శేషముతో వియ్య మందినవాఁడే. అసలు వారిరువురు నాప్తసఖులు (చూ. అహల్యాసంక్రందనము-అవతారిక). ఆ వియ్య మహల్యాసంక్రందనమున నెక్కువ. రాధికాసాంత్వనమున నొక్కపోకడ.

తడవుఁ జూచిన దృష్టి తాఁకునో యని వాని
నును మోముఁ గనులారఁ గనఁగ నైతి
గబ్బి గుబ్బలు సోఁకఁ గందునో యని వానిఁ
గలసి నా మనసారఁ గలయ నైతి — స. రా॥ సా॥ 12
తడవు చూచిన దృష్టి తాఁకు నంచని వాని
సొగ సెల్లఁ దప్పక చూడ వెఱతు
మొన గుబ్బ లదిమి గ్రుమ్మినఁ గందు నని వాని
లేఁత మేనును గాఁగిలింప వెఱతు — తా. శ- IV - 42
(చూ. ము. ప - రా॥ సా॥ II—116 కూఁచి-తిమ్మన కృత్యను కృతులును గలవు. అవి స్థలాంతరమునఁ జూపఁబడినవి).

అన్నట్లు తాళ్ళపాక తిమ్మక్క వొకమూఁడు ముక్కలు వాఁడుకొన్నాఁ డని యీమధ్య నొక యమ్మక్కగారు చేమకూర నెత్తిపై నొక యభాండ మెత్తినారు; అది యొక మిషగాఁ బురుషకవుల నెల్లఁ దూర్పారఁబట్టినారు. మఱి దీని కేమందురో? దానిమాట కేమిగాని, సముఖము వాని కృతి నెంత యనుకరించినను ముద్దుపళని కృతికి దాని ప్రత్యేకత దానికున్నది. ఆమె తక్కువ తిన్న దామఱి? ప్రతాపసింహుని ప్రాపకమున శృంగారరసపు సరిహద్దులు చూచినది, కవితా భరత గంధర్వాది కళల కిటుకులు కనుఁగొన్నది. శతపద్యపరిమితమైన సముఖము కృతిని గ్రహించి, కించిదూనముగా నాలుగువందల గ్రంథమును దయారుచేసినది. తప్పక తదుపజ్ఞమైన గ్రంథమును రసికప్రశంసనీయమే. సముఖము గ్రంథములోనప్పుడే 'యిళ' సుద్దికొద్దిగాఁ బుట్టియున్నను నా ప్రతినాయిక పాత్రీకరణమునఁ జిత్రలేఖనపుఁ జమకుల నతిమాత్రమనోజ్ఞముగాఁ బ్రదర్శించినది పళని. సముఖముకంటె నెక్కువగా శృంగారరస రహస్యముల సూదంటు పనితనమునఁ దిమ్మనగారి యొరవడిని, పలుకుఁబళ్ళ మెలఁకువలలోఁ జేమకూరపాకమును సమర్థించినది. నాఁటికవుల కది యొక పరిపాటి.

సముఖము కృతి యేకాశ్వాస ప్రబంధము. కవి దీనినిఁ జాటు ప్రబంధమని పేర్కొనినాఁడు. గ్రంథాంతగద్యలో. పూర్వలాక్షణికు లుదాహరణ ముక్తకాది కావ్యభేద ములనే కాని యిట్టినిబద్ధకావ్యములను జాటుప్రబంధములుగాఁ బేర్కొనలేదు. కాని చాటుశబ్దమునకుఁ బ్రియోక్తియను నర్థముండుట చేతనో, ప్రబంధప్రక్రియ కంగభూతములగు అష్టాదశవర్ణనలిందు పరిహరింపఁబడుటచేతనో, అపగతసర్గ ముపకావ్యమను నాలంకారిక వచనముండుటచేతనో రసికప్రియము, రసప్రధానము, నేకాశ్వాసము నగు నీప్రబంధము చాటుప్రబంధమైనది.

కవి దృష్టిలో. అంతకుముందు నాఁటి విజయరాఘవ నాయకా దులును దమ యక్షగాన నాటకములను జాటుకావ్యము లని పేర్కొనుటయు నట్టి దృష్టితోనే యనుకొందును. వెనుకటికి శ్రీ వేటూరి ప్రభాకరులు దీని నేకాశ్వాస క్షుద్రప్రబంధ మనిరి. కాని యందు నిరసన లేదనుకొందును. కావ్యాలంకారసంగ్రహ కర్త చాటుప్రబంధముల నుదాహరించినచోట క్షుద్రప్రబం ధము లను బర్యాయముగా వాడెను. క్షుద్రశబ్ద మిట నల్పార్థ మునఁ బ్రయుక్తము. శృంగారము నరిగించుకోలేని వారి కెవ రికో యనర్థమున నిది క్షుద్రప్రబంధ మనిపింపవచ్చును. కాని దీనిని జాటుప్రబంధమనుటయే సమంజసము.

ఇందు సుప్రసిద్ధము సువిశాలము నైన రాధాకృష్ణుల పరిణయైతిహాసమున నేకదేశమగు ఘట్టమును గ్రహించినాఁడు కవి- రాధ పరకీయగాఁ జెప్పఁబడకపోయినను అత్తవారి పేర్కొనఁబడినది. సత్యభామయే ప్రతినాయికయైనను నామె పాత్ర రూపు కట్టలేదు. ఆమె ప్రత్యేకతయు రాధికనే యాశ్ర యించినది. ఆ సందర్భమునఁ దిమ్మనగారి పోకడలు బోలె డను కరింపఁబడినవి.

ఉదా :—

1. 'అమ్మారోమేమని చెప్పుదు — పారిజాత॥ I-75
   'తెలవా రేమని చెప్పుదు — రా॥ సా॥ 26
2. ఏమేమీ కలహాశనుండచటికై యేతెంచి
   యిట్లాడెనా - పారి॥ I-82
   'ఏమేమీ వెలపింత లేకనె భళాహేమాంగి
   యిట్లాడెనా—రాధి॥ 33
3. 'మాసిన చీరఁగట్టుకొని ...' పారి॥ I-99
   'జడవేఁగ వదలించి...' రాధి॥ 77
4. వెస వెసఁ గన్నుమాయుఁ గనువిచ్చు...పారి॥ I-101
   'ఊలుకును వెచ్చనూర్చుఁగడు మస్సరమ్... రాధి॥ 73,

ఇఁకఁ 'బికస్వరంబు'తో నేడ్చుట, "రాయను పింతపుట్టినదిరాయను" నిట్టివి సర్వప్రబంధసామాన్యములైనవే యిందునుగలవు. రాధయుఁ "జిలువకోమలి"యైనది. సవతి "నరకాలఁ బెట్టి నేలరాయకున్నను నా పేరు రాధగాదు" అని ప్రతినఁ బట్టినది. అయినను ముక్కుతిమ్మన, ముద్దుపళనుల నాయికలవలె నాయకునిపై నెడమకాలి నెత్తలేదు. మఱియు గతానుగతిక మగు ప్రబంధధోరణికి నీకావ్యమునకు నొక యంతరము గలదు. ఆవర్ణనల యూర్ణనాభస్వభావముగాని, యనుప్రాసల యట్టహాసములుగాని యిందు లేవు. పురవర్ణనాదులు లేవు సరి కదా విరహవర్ణనల సందర్భమునను జంద్రోపాలంభాదులు పరిహరింపఁబడినవి. కాని, చేసినతప్పు చెప్పకతప్పదు, చేయరాని వర్ణనయొకటి చేసినాఁడు కవి, అదియు సుదీర్ఘముగా— రెండుసీసములు (98 & 99). అందు "శృంగార యౌవన శ్రీరాబ్ధినడుమను"అను పద్యము ముద్దుపళని గ్రంథముద్రిత ప్రతులలోఁ గొన్నిటనున్నది, కొన్నిటలేదు. రెండవపద్యమెందును లేదు. దీనిఁబట్టిచూడఁగా, పళని యాపద్యములఁ బరిహరించెననియే తోఁచుచున్నది. అది యథార్థమేయైనచో, గ్రుడ్డిలోమెల్ల, ఆమె యుచితజ్ఞత కది కొంత యూపిరి. అసలు విజయనగర ప్రబంధములందు విప్రలంభశృంగారము, దక్షిణాంధ్రప్రబంధములందు సంభోగశృంగారమును ప్రాచుర్యము వహించినవి. అది యుగధర్మము.

సముఖముది జాతీయమై నుడిగారపు నునుపుదేఱిన రచన. అతని పలుకుఁబళ్లకుఁ గొన్నిమచ్చులు.

కనులఁ గప్పుక (23) ; దొంతర ముద్దులు (30), నురుసు పైసరములు (30), మానిసినిఁ జేసినందుకు (41), నంగనాచి (45), రుద్రాక్ష

పిల్లి (45), పాల మెఱుఁగని నిన్నటివళికె పడుచు (49,) తన్నుం దన మట్టు నెఱుఁగు (54), నమ్మినాసం బోసికొనియె (59), పదింబదియు గాను (60), తప్పుతంటలవు (62), వలపు వడ్డికిఁ బాఱన్ (114).

సామెతలు :—నిన్నఁగుప్పయు నేఁడాళ్లు (36), వ్రేలు వాచిన ఱోలంత చెఱఁగె ననిన, ఱోలువాచిన నది యెంతపోలు (39), అల్పునకుఁ గల్మివచ్చిన నర్ధరాత్రి, గొడుగు తెమ్మన్న కతగాను (52) కుట్టదేలుఁ, కుట్ట కున్నఁ గుమ్మర బూచి (62), తిరిపెం బెత్తేవానికిఁ బెరుగుంగూడేమి బ్రాఁతి (64). ఎల్లవారికి శకునంబు లెఱుఁగఁ బలికి, బల్లితాఁబోయి తొట్టిలోఁబడినరీతి (72). తగిలెనా తగిలెను, తప్పెనా తప్పెను, నాతి వెజ్జువాని చేతిజాయి (59).

ఇట్టివింకనుగలవు. సాభిప్రాయములైన ప్రయోగములు నొకకొన్నిగలవు.

ఉదా :— 1. శ్రీకృష్ణునిఁ దోడితెమ్మని రాధ పంపిన చిలుక పుల్లయ వేసుపరము చేసికొనివచ్చినది. తదుపమానము:—

'హరు నదుటి కంటి మంటల నఁట బెదరి
తుర్రిల్లి రాతును బడవైచి వెళ్లివచ్చు
తీయవిలుకాని సాంబ్రాణి తేజి' (19).

2. కృష్ణుఁడు రాఁడు; రాధకుఁ గూరిమిపోదు. 'అత్తకోక తొలఁగినటు' లున్నదఁట యాసందర్భము. అత్త సరుదు కోదు; సరుదుకొమ్మని యల్లుఁడు చెప్పలేఁడు (46) (ద్రావిడ భాషలో 'అత్తగారికచ్చ' యనునర్థముగల లోకోక్తి కలదఁట).

3. రాధాపదాక్రాంతుఁడైన కృష్ణు నావె యదొక గమ్మత్తుగా లేఁ నెత్తిపదట ఆ 'మెత్తినపట్టుపీడక' లేచినాఁడఁట యా రసజగత్సమ్రాట్టు (116 .

ఇట్టి ప్రయోగవైచిత్రి సముఖమునకే చెల్లినది. ఆస్వాదస్యరహస్యాభిజ్ఞత ముద్దుపళనికే చెల్లినది. సముఖము ప్రయో

గములలో నింకొక విలక్షణతయుఁగలదు. గుట్టుబాయియ్యాని, చూచేరు, మోవాని (మోపి+అని), నడిచే, నవ్వేటి, చేసుక, వద్ది మొదలగునవి. ఆప్రయోగము లాయుగసహజములు. 'అచ్యుత' శబ్ద మొకటి పాణినఘటితముగా నిందుఁ గన్ప ట్టుచున్నది. అదియు నాఁటి యపరూపవికృతివిశిష్టతలలో నొకటి(చూ॥ విజయరాఘవుని రఘునాథ నాయకాభ్యుదయము). ఆకవులకు వ్యాకరణము రాదనికాదు, వారు మహాకవులనికాదు, కాని వారికావ్యములం దప్రయత్నముగనో, యభినివేశపూర్వకముగనో దొరలినవా ప్రయోగములు. అంతే; అదియొక విలక్షణత! సముఖము ప్రయోగములు రసాపకర్షకములు కావే దనియే చెప్పవచ్చును.

రసికశేఖరుఁడగు విజయరంగచొక్కాలువు దక్షిణాంధ్రయుగ శ్రీనాథుఁడగు శేషము వేంకటపతి స్నేహము, తిమ్మన గారి యొరవడి, చేమకూర పలుకుఁబడి సముఖము నొక సరస కవిగాఁజేసినవి. రాధికాసాంత్వనము, అహల్యాసంక్రందనము మనకు దక్కినవి. ఉభయత్ర భావబాంధవ మున్నను శైలీభేద ము గన్పట్టుచున్నది. మొదటిదానిలోఁ దెలుఁగుసొలుపును, రెండవ దానిలో సంస్కృతప్రౌఢియు నెక్కువ. అహల్యాసంక్రందనమే యతని కవిప్రథకు మూలకందమైనను దాని కీలక మీ చిన్ని కృతి యైన రాధికాసాంత్వనమే.

ఆంధ్రవిశ్వకళాపరిషత్-
పరిశోధనశాఖ, వాల్తేరు.
1-అక్టోబరు, 1953

యస్వీ. జోగారావు
(బి. యే. ఆనర్సు).

# గ్రంథప్రచురణ.

ఈప్రచురణకు మూలము : ఆంధ్రసాహిత్యపరిషత్తులోని నం. 177 వ గల తాళపత్త్రప్రతి. లేఖకుఁడు తంజాపూరికవి వేంకటస్వామి నాయకుఁడు. అతఁడు వ్రాసినది కీలక మార్గశీర్షమున. ప్రతిస్థితియు, లేఖనవైఖరియు బాగుగనే యున్నవి. కాని వ్రాఁత తప్పులు లేకపోలేదు. అవి యీ దిగువ నుదాహరింపఁబడిన ముద్దుపళని ముద్రితప్రతులను సంప్రతించి సవరించితిని.

1. తిరుక్కూడియూరు కృష్ణారావుగారిచే—
   శ్రీధామ ముద్రాక్షరశాల ప్రచురణ— (1887 క్రీ. శ.)
2. ఎద్దనపూడి చెంచురామయ్యగారిచే—
   శ్రీ పారిజాత ముద్రాక్షరశాల మదరాసు (1908)
3. కె. జి. మూర్తి, శృంగార గ్రంథమండలి,
   మచిలీ పట్టణము— [1936]
4. శ్రీ సత్యనారాయణ పబ్లిషింగ్ హౌస్,
   రాజమండ్రి — [?]
5. వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.
   మదరాసు — (1950)

పై వానిలో 1,2 ప్రతులొకమాదిరిగను, 3,4 ప్రతులొకమాదిరిగను నున్నవి. ముద్రితప్రతులలో నవపాఠము లున్నచోట్ల మూలప్రతిపాఠములే స్వీకరింపఁబడినవి. ముద్రిత ప్రతుల కతీతమైన చోట్ల నున్న లేఖకప్రమాదము లర్థానుగుణముగా సరిచేయఁబడినవి. పాఠాంతరములు పుటల కడుగునఁ జుక్కగుర్తులతోడను జూపఁబడినవి, గ్రంథపాతములు ముద్రితప్రతుల సాహాయ్యమునఁ గుండలీకరణములలోఁ బూరింపబడినవి.

## గ్రంథ ప్రచురణ

చెన్నపుర ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నం R. 28 రు గల తాళపత్త్రప్రతి యొకటి కలదు. అదియు సముఖము రాధికాసాంత్వనమే. కాని యందలి వ్రాఁత యొకతీరు, తప్పులున్నవి, శైథిల్యము గలదు, గ్రంథపాతములు నెడ నెడఁ గలవు. అచ్చటనే నం 199 రు కాగితపుఁ బ్రతియు నొక్కటి కలదు; కాని దాని మాతృక పై శిథిలతాళపత్త్రప్రతియే. ఆంధ్రసాహిత్యపరిషత్తు ప్రతియే మేల్తరమైనది.

నాకీ గ్రంథ పరిష్కరణోద్యమమునఁ దోడ్పడిన యాంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శి శ్రీ చతుర్వేదుల సత్యనారాయణ శాస్త్రిగారికిని, మేనేజరు శ్రీ వద్దిపర్తి చలపతిరావుగారికిని, దక్కిన పారిషదులకును గృతజ్ఞుఁడను.

అభినవముగ నాంధ్రరాష్ట్రప్రభుత్వశుభోదయమైనది. ఇఁకనైన నిట్టి యమూల్య గ్రంథజాలము నాంధ్రప్రజ కందిచ్చు పరిషత్తువారి పూనిక నగ్గించి, ధనాభావముచే వెనుకపడియున్న పరిషత్తునకు శుభాక్షతలుగా విరాళముల నిచ్చిప్రోత్సహించి, తద్గ్రంథభాండాగారమునఁ దాళపత్త్రతనుకార్శ్యముతో ననూర్యంపశ్యలై పడియున్న కావ్యసుందరులను జూచుట కాంధ్రసాహిత్యసత్యవ్రతులు నోచుకొందురుగాక.

'యస్వీ'

# రాధికాసాంత్వనము

సముఖము వేంకట కృష్ణప్పనాయకుఁడు.

క. శ్రీ రాధామణిలోలా
ధారాధరనీలనీల దైత్యవిఫాలా
వారిధిశయన సుశీలా
శ్రీ రాజదుర్గోవిశాల శ్రీ గోపాలా. 1

చ. వెలయు నభీష్ట మి మ్మనుచు
వేంకటకృష్ణనృపాలశేఖరుం
డిల రసికావతంసులకు
హృద్యముగా మృదుమాధురీరసా
కలితచమత్క్రియాకలన
గల్పనగా రచియింప నొప్పు ని
శ్చలమగు రాధికారమణి
సాంత్వనముం గృతి సల్పు మం చనెన్. 2

గీ. అవధరింపుము స్వామి దివ్యగుణభూమి
యని పరీక్షిన్మహారాజుఁ గని శుకుండు
వినయసంభ్రమభయభక్తు లినుమడింప
నవలి వృత్తాంత మిట్లని యానతిచ్చె. 3

క. ఇంబై వనరుహజావా
సంబై ద్విజరాజవైశ్యజననివహంబై
డంబై తగు బహుబలసే
వ్యంబై ద్వారకపురంబు హరిధామంబై. 4

గీ. అచట నెప్పుడుఁ గాపుర మై వసించు
దేవదేవుండు శ్రీ కృష్ణదేవుఁ డగుచు
రాధికాసత్యభామలు రాజసమునఁ
బ్రేమఁ గొలువంగ జగదభిరాముఁ డగుచు. 5

గీ. ఇట్టు లుండంగ  త్తహా రేగుదెంచి
దేవకీతనయు సత్యను భావ మలరఁ
దోడుకొని పోవ వారలఁ ద్రోవఁ బనిచి
రాధ తన కేళికామందిరమ్ముఁ జేరి. 6

వ. చిలుకం గని

క. అచ్చట నడిచే వింతలు
ముచ్చట లెల్లయును దెలిసి ముద్దులు గులుకన్
అచ్యుతుని దోడి తెమ్మని
యచ్చిలుకను బనిచి రాధ యలమటపడఁగన్. 8

చ. చిలుకవజీరుఁ డత్తఱిని
జిందఱ వందఱ సేతు నంచు నా
చిలుకలకొల్కిపై, గదిసి
చివ్వల రవ్వ లిడంగ జాతిపెం
♦జిలుకులకోరికోల లటు
చెండెను దుమ్మెదనారి మ్రోయఁగాఁ
గలికిమెఱుంగుగుబ్బలను
ఖంగు ఖణేలు ఖచిక్కు రింగనన్. 9

క. ఇ ట్లేసిన మది ఝల్లనఁ
బ ట్లెల్లను సడలి రాధ భయ మందుచుఁ దా
నిట్లని పలుకఁదొడంగెన్
♦బొట్లంబై చుట్టునుండు పోఁతులతోడన్. 10

♦ చిలుకులకోరి } దుష్కంటక శరము
చిలుకుటమ్ము } చిలుకము — ఆంధ్రవాచస్పత్యము

♦ పొట్లము = గుంపు — శబ్దరత్నాకరము

ఉ. శౌరిని బిల్వఁగాఁ జనిన
            చక్కని కీర మదేల రాదొ, యే
దారిని జన్నదో నడుమఁ
            దాఁటెనొ చేరెనొ లేదొ గోపికా
జారునిఁ గానదో కనెనొ
            చక్కఁగ నా వెత విన్నవించెనో
సారెకు; లేక శౌరినుడి
            చక్కెరయుక్కెఱ మెక్కి చొక్కెనో. 11

సీ. తడవు చూచిన దృష్టి దాకునో యని వాని
            ముఖమోము గనులారఁ గనఁగనైతి
గబ్బి గుబ్బలు సోఁకఁ గందునో యని వానిఁ
            గదిసి నా మనసారఁ గలియనైతిఁ
(గదియ నొక్కిన నేడఁ గందునో యని వాని
            యధరంబుఁ దనివార నాననైతిఁ)
(దడవు చేసిన మేను బడలునో యని వానిఁ
            జెలఁగి నా మనసారఁ గలియనైతి)
గీ. నొచ్చు నం చని చెక్కిలి నొక్క నైతి
నలుగు నని మేను గౌఁగిట నలమ నైతి
నందసుతుప్రేమ సత మని నమ్మి యుంటి
నిప్పు డీ రీతి నడచు నం చెన్న నైతి. 12

సీ. తాను నా మో వాని తనమోవి బదు లిచ్చి
            తెఱవ నీదు ఋణంబు దీఱె ననును
నేను బైకొనఁ గాన తాను బైకొని యేలి
            యింతి యీడుకు నీదు నిదిగో ననును
నేను ముద్దిడఁగాన తాను ముద్దిడికొని
            మదిరాక్షి బదులుకు బదు లి దనును
నేను జెక్కిలి నొక్కఁ దాను జెక్కిలి నొక్కి
            చెలియ మేలుకు మేలు చేసి తనును

గీ. గడియ గడియకు నొక వింత గడనసేయు
వేళ వేళకు నొక్కొక్క లీల నుండుఁ
బార మెఱుఁగని ముద్దుల శౌరిచిన్నె
లెన్ని యెన్నని తలపోతు నెట్లు సైతు. 13

క. ఆ మాలిమి యా తాలిమి
యా మేలిమి యా వినోద మా గళరవముల్
ఆ మాటలు నా సీటులు
నా మీటులు నాటపాట లతసికె చెల్లుల్. 14

సీ. మదహస్తిపై నెక్కి; మావటీ ల్గాలువంక
విచ్చలవిడిఁ జొచ్చి వచ్చునటుల
సాంబ్రాణి తేజిపై; సాహిణీ ల్వాగడంగఁ
జట్టాను జేపట్టి వచ్చునటుల
పే టందలమ్మున[1]; విచ్చుకత్తులవారు
మెచ్చఁగా దులదుల వచ్చునటుల
గిలుకుపావలు మెట్టి; చెలికాండ్రు వెంటరాఁ
బావురంబును బూని వచ్చునటుల

గీ. పడతు లిరువంకఁ దెలనాకుమడుపు లీయఁ
గొనుచుఁ బెండెము ఘలుఘల్లు రనఁగ నాదు
పడుకటిలు సేరఁగా శౌరి వచ్చుదారి
తోఁచునే గాని మఱియేమి తోఁచలేదు. 15

సీ. కురు లంటఁగా రాకు గట్టు బొయ్యారనఁ
జీకాకుగాఁ దీసి చిక్కువఱచుఁ
గెమ్మోవి నొక్కకు గేలిసేయుదు రనఁ
గసిమీఱఁ బలుమొనగంటు సేయు

1. వేటందలమ్మున— తా. ప. ప్ర.

వలుదగుబ్బలు ముట్టవలదు నవ్వే రనఁ
గ్రొత్త నెత్తురు గ్రమ్మ గోరు లుంచు
సరగఁ బో వలె నింకఁ బరులు చూచెద రన
జాముల తరబళ్లు జాగు సేయుఁ

గీ. బలుకవ ద్దనఁ బాపురా పలుకు పలుకు
నత్త నే గాన యనఁ బ్రీతి హత్తె నను
అట్టి నా ప్రాణవిభుఁ బాసి యకట మేను
జీవములు పోక యల్లాడె సిగ్గు లేక. 16

సీ. విభునిఁ బాసితి నంచు విని సంతసం బందు
తోయజాక్షులబొమ్మ ద్రొక్కు నటుల
హామిక స్రుక్కెనా యనుచుఁ దలాడించు
మించుఁబోణుల తల ల్మెట్టి నటుల
హరి రాధ నేలుట యది యొక కథ యను
కొమ్మలనాలిక ల్గోసి నటుల
కరఁగు న న్గను గొని కనుగీఁటి నవ్వేటి
మోహనాంగుల కన్నుఁ బొడిచి నటుల

గీ. మాధవుని జేరి సామి ర మ్మనుచుఁ జీరి
గెలివి యొనగూర్చి నిండుఁ గౌఁగిటను జేర్చి
దయలు దయివాఱ యెడజేని తాప మాఱ
మేలిమిని గూడఁ గలదె యీ మేనితోడ. 17

వ. అని యిటుల జవరాలు విరాళిం జెందు సమయంబున. 18

గీ. హరునుదుటి కంటిమంటల నంటి బెదరి
త్రుళ్లి రాతును బడవైచి వెళ్లివచ్చు
తియ్యవిలుకాని సాంబ్రాణి తేజి యనఁగ
గగనమార్గంబునను దోఁచెఁ గలికిచిలుక 1

క. ఇటు లేతెంచిన చిలుకం
గుటిలాలక లేచి చూచి కులుకుచుఁ జిలుకా
యిటు రమ్ము ర మ్మటం చన
దిటవున ముంజేత వ్రాలె దీనత దోఁపన్. 20

గీ. అటులు ముంజేతిపై వ్రాలినట్టి ముద్దుఁ
జిలుక నటుదువ్వి చిలుకలకొలికి పలికె
మోవి గంపింప ముక్కెఱముత్య మదరఁ
గప్పుతావియు గుప్పునఁ గప్పుకొనఁగ. 21

ఉ. దేవకిచిన్నికుఱ్ఱ వసు
దేవునికూన యశోదపట్టి నా
దేవుఁడు నందుకందు బల
దేవుని తమ్ముఁడు గోపగోపికా
జీవనజీవనంబు యదు
సింహము శౌరి కిరీటిబావ శ్రీ
దేవియనుంగుజోడు వన
తి న్వసియింపఁగఁ గంటె కీరమా. 22

సీ. చుఱుకు చూచినఁ గందు సుకుమారు నెమ్మేను
విరహజ్వరంబున సొరుగకుండ
నిట్టూర్పు లోర్వని నీలవర్ణునిపైన
సోమరివలిగాలి సోఁకకుండఁ
జనుములుకు లాగని శౌరివక్షంబున
విరిశరంబులు చాల నొరయకుండ
మణితము ల్వినలేని మాధవు వీనుల
స్మరచాపటంకృతు ల్మొరయకుండ
గీ. నెన్నుఁ డిటువంటి కడగండ్ల నెఱుఁగనట్టి
విభుఁడు వెన్నెలచిచ్చులో వేఁగకుండ
కనులఁ గప్పక నాసామి మన సెఱింగి
సరసు నెనయునె కీరమా సత్యభామ. 23

గీ. ఎంతవేడిన బదు లాడ వేమి చిలుక
కాలగతు లెట్టు లున్నవో గడచినాము
కాఁగలవి కాక మానవు గాక తెలుపు
చల్ల గోన వచ్చి ముంత దాఁచంగ నేల. 24

వ. అనిన విని చిలుక యిట్లనియె. 25

క. తెఱవా యే మని చెప్పుదు
హరి యున్న గృహంబుఁ జేరి యటు చూతుఁ గదా
సురతోద్వ్యక్తుల సత్యా
మురహరులం జూచి ఖేదమోదములయ్యెఁ. 26

వ. అది యెట్లంటి వనిన. 27

సీ. పన్నీటి మేరువుల్ బాగాలతట్టలు
కలపంపుగిన్నెలు గందవొళ్లు
ముడిపూల పొట్లముల్ పునుఁగుఁగరాటముల్
జవ్వాజిగిండ్లు ద్రాక్షారసంబు
అద్దముల్ సొమ్ములు నత్తరుచెంబులు
కుంకుమపింగాండ్లు గుసుమతతులు
కపురంపుఁ గ్రోవులు గస్తూరిపిణియల్
గట్టువర్గంబులుఁ జుట్టుదనరఁ

గీ. జలువచప్పరకోళ్ల మంచమ్ములోనఁ
జెంపబిల్లలుఁ దలగడల్ చెలఁగుదిండ్లు
బటువు లొరుగులు గల పూలపాన్పుమీఁదఁ
దమకమున సత్య హరియును దగఁబెనంగి. 28

సీ. కొసరుపల్కులఁ బమ్మి గోటికత్తులఁ జిమ్మి
కాసెలోఁ జెయి వేసి కదియఁదీసి
కర్ణాతు[1] లాగించి కౌఁగిట బిగియించి
సరిబి త్తరుల నొత్తి సొగసెత్తి

1. కర్ణాతు=కన్నాత. మల్లయుద్ధములో నొక విన్నాణము—
శుద్ధాంధ్రపదపారిజాతము. ల నారాయణ నిఘంటువు.

కల్లంబు[2]నకు వచ్చి కలికి యహా నని మెచ్చి
మెఱుఁగుఁజెక్కిఁగి గొట్టి కురులు పట్టి
తొడగంబముల నాని తోపునూకులఁ బూని
సందు చేసుక నొక్కి చాల దక్కి
గీ. యదలుపులుఁ పొగడికలును నెయ్యంపుఁ దిట్లు
గళరవంబులు దుడుకులుఁ జెలఁగఁ సత్య
మాధవుండును గడిదేఱి మరునిసాము
చేసి చెలరేగి నెఱిపోయిఁ జెంది మఱియు. 29

సీ. కిలకిలనవ్వులు గిలిగింతలును బంధ
భేదపు రవములు వింతవగలు
పావురాపలుకులు వాతెఱనొక్కులు
చిగురుమకారముల్ జిలుఁగుఁదిట్లు
దురుసు పైసరములు దొంతరముద్దులు
బిగికౌఁగిలింతలు బేరజములు
కొనగోటిమీఁటులు గోరింపులుబుకులు
కొసరుఁగన్బొమముళ్లు కుఱుచనన్న
గీ. తార సేబాసు మేలు చల్లారె బాప
అహహా తడబడ కెడ మీకు నాయె నాయె
విడకు విడువకు నడు మని నుడువు లపుడు
చెల్లఁబో యేమి చెప్పుదుఁ గొల్లకొల్ల. 30

క. నానా విభవాకరమై
మానసంజాతజాతమహిమార్ణవమై
కైనికతరమై[1] యానుఖ
మానంద బ్రహ్మమైన హరి యేమఱచెఁ. 31

2. కల్లము —— మల్లబంధవిశేషము (శ. ర).

1. కానికతరమై-తా.ప.ప్రి.ము.ప్ర. కాని యామాట కర్థము లేదు. కైనికతరమై అని సవరణ. 'కీనము' మాహాత్మ్యము, వైచిత్ర్యము, ఆనందము, సంతోషము సంస్కృతశబ్దార్థ కల్పతరువు.

# రాధికాసాంత్వనము

## అకారాది పద్యసూచిక.

## రాధికాసాంత్వనము

సము. ముద్దు ఆ. ప.



సము. ముద్దు అ. ప.

## రాధికాసాంత్వనము

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపం బడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమ సంపుటమును, 955 పుటలుగల రెండవ సంపుటమును, 980 పుటలుగల మూఁడవ సంపుటమును, 950 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రియమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాదియందుఁగల సంస్కృతాంధ్ర శబ్దములన్నియుఁ గలవు. రెండవ సంపుటమున 'క' మొదలు 'జ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'తృ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' 'న' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటి కంటె నిది సర్వవిధముల నుత్తమ మయినది. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు నను తలంపులో నీ క్రిందివెల నిర్ణయింపఁబడినది,

క్యాలికో బైండింగు ఒక్కొక్క వాల్యూము రూ 6 లు,

## పరిషత్ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | ఆధునికాంధ్ర వాఙ్మయవికాసవైఖరి జయంతి రామయ్యపంతులుగారు | 1-8-0 |
| 2. | కాళిందీ కన్యాపరిణయము-అహోబలపతి ప్రథమ ద్వితీయభాగములు | 1-8-0 |
| 3. | చంద్రభానుచరిత్రము- తరిగొప్పుల మల్లనకవి | 1-0-0 |
| 4. | పరిషత్పుస్తక భాండాగారము | 1-0-0 |
| 5. | మన్నారు దాసవిలాసనాటకము - రంగాజమ్మ | 0-12-0 |
| 6. | రసార్ణవాలంకారము - ప్రకాశవర్షకవి | 0-8-0 |
| 7. | రఘునాథరామాయణము (ప్రథమభాగము) రఘునాథభూపాలుఁడు | 0-12-0 |
| 8. | రాయవాచకము - విశ్వనాథనాయని స్థానపతి | 1- 0-0 |

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారు సి. బి. ఇ., డి. లిట్., పిఠాపురం మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరు వారు (జమీందారు, ఉయ్యూరు యెస్టేటు)

అధ్యక్షులు.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవి సమ్రాడిత్యాది బిరుదాంకితులగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

కార్యదర్శులు :

శ్రీ సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ, చతుర్వేదుల సత్యనారాయణగారు, ఎం. ఏ., బి. ఓ. యల్.

శ్రీ ప్రతివాది భయంకర పార్థసారథిగారు, బి. ఏ., యల్. యల్. బి.,

కోశాధ్యక్షులు :

శ్రీ ప్రతివాది భయంకర పార్థసారథిగారు, బి. ఎ, యల్. యల్. బి.

శ్రీ ఏలేశ్వరపు వేంకటరమణ సుబ్బారావుగారు, బి. ఏ, బి. యల్.,

కార్యనిర్వాహక సభాసభ్యులు :

శ్రీ పురాణం భద్రియ్యనాయఁడుగారు, ఎమ్. ఏ, యల్. టి.

శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు.

రా. సా. మాదిరెడ్డి సీతారామయ్య నాయఁడుగారు, బి. ఏ, బి. యల్.

శ్రీ కొమ్మిరెడ్డి కేశవ రామమూర్తినాయఁడుగారు, బి. ఏ.

శ్రీ వేమూల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.

శ్రీ ఎండమూరి వేంకటరమణగారు, ఎమ్. ఏ. బి. ఇడి.

శ్రీ సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు

శ్రీ బండారు తమ్మయ్యగారు.

శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఎ.

శ్రీ ఏమూరి సీతారామారావుగారు, బి. ఎ.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక



దేవభాషలందుఁ దెలుఁగు లెస్స

సంపుటము ౪౨

సంచిక ౪

# సంపాదకవర్గము

ప్రధానసంపాదకుఁడు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఎ. బి. యల్.

సహాయ సంపాదకులు :

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.
శ్రీ విద్వాన్ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. ఆనర్సు, బి. ఇడి.
శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.
శ్రీ బండారు తమ్మయ్యగారు.

# విషయసూచిక

(శ్రీ)

# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

కాకినాడ

రెండు నెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు.

సంపుటము ౪౨ — విజయ సంవత్సరము ఆశ్వయుజ కార్తికములు — సంచిక ౪

## ఆంధ్రసాహిత్య పరిషత్తు.

### నలువదిరెండవ వార్షిక మహాసభ

30-31 తేదీల

ఈ సభ 1954 సంవత్సరము జనవరి మూఁడవవారములో జరుగఁగలదు. ఈ సభను విద్యామంత్రి యగు శ్రీ శ్రీ శ్రీ బలుసు ప్రభాకరపట్టాభిరామారావుగారు ప్రారంభింతురు. మొదటి దిన ముదయమునఁ బరిషద్వ్యవహారములు చర్చింపఁబడును. ఇం దఖిలాంధ్రసాహిత్యపరిషత్తే విధముగ నుండవలసినది, దానితో నాంధ్రసాహిత్యపరిషత్తున కెట్టి సంబంధ ముండవలసినది చర్చింపఁబడును.

ఈ సభకు మహామహోపాధ్యాయులు కళాప్రపూర్ణేత్యాది బిరుదాంకితులును, మా పరిషదధ్యక్షులు నగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగా రధ్యక్షులుగ నుందురు.

సాయంకాలము సారస్వతమహాసభ జరుగును. దానికి శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగా రధ్యక్షత వహింతురు పలువురు కవులుఁ బండితులుఁ దాము రచించిన వ్యాసములను బద్యములను బఠింతురు. మఱునాఁ డుదయము భాషావ్యాకరణమహాసభ జరుగును. ఇం దాంధ్ర

భాషకు సర్వసమ్మతమైనట్టియు, పర్యాప్తమైనట్టియు వ్యాకరణ మెట్లుండవలసినది చర్చింపఁబడును. ఈ సభకు శ్రీ గంటి జోగిసోమయాజులుగా రధ్యక్షత వహింతురు.

ఆ నాఁడు సాయంకాలము చరిత్రసంస్కృతి మహాసభ జరుగును. దానికి శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగా రధ్యక్షత వహింతురు. ఈ సభాంతమునఁ బండితసమ్మానము జరుగును. ఆర్థికమంత్రి శ్రీ తెన్నేటి విశ్వనాథముగా రీ సమ్మానము జరుపుదురు.

ఈ సభలమధ్య నుండు నవకాశములలోఁ గావ్యపఠనము, నవధానములు, నాశుకవిత్వము మున్నగునవి జరుగఁగలవు.

రాత్రి భోజనానంతరము సంగీత నృత్యాది ప్రదర్శనములుగలవు.

విచ్చేసినవారందఱికిఁ దగిన యన్నపానాదుల వసతులు నుచితముగఁ గల్పింపఁబడును. కావున నాంధ్రదేశమునఁగల కవులుఁ బండితులు భాషాభిమానులు, భాషాపోషకులు నీ సభకుఁ దప్పక విచ్చేయఁ ప్రార్థితులు.

---

# వ్యక్తివివేకము.

భాగవతుల కుటుంబరాయశాస్త్రి, ఎం. ఏ.

పూర్వపక్షము. "రసాదులు వాస్తవమున ననుమేయములే. కాని లక్షణావృత్తి నాశ్రయించి (ఔపచారికముగ) రసాదులు వ్యంగ్యములని యనుచున్నాము. ఇట్లు లక్షణావృత్తి నాశ్రయించినపుడు, ప్రయోజన ముండవలయును." "కావ్యాదులయందు, సుఖాద్యవస్థావిశేషము లగు రత్యాదులు వర్ణితములైనపు డుదయించునట్టియు, సచేతన చమత్కారి యగునట్టియు సుఖాస్వాద సంభవమే యిట్లు లక్షణావృత్తి నాశ్రయించుటకు ఫల"మనియుఁగదా మీరు తెల్పితిరి. కావ్యాదులయం దిట్టి సుఖాస్వాదము కలుగు ననుట యెట్లు పొసఁగును? లోకమున మన మొక వ్యక్తియందు శోకాదుల ననుమాన వ్యాపారమువలనఁ దెలిసికొనుచున్నపుడు మనకు సుఖాస్వాదలవమైనను గలుగుటలేదే! సుఖలేశమైనను సంభవింపకుండుటయే గాక, సాధువులకుఁగాని, యుదాసీనులగు వారికిఁగాని, భయము, శోకము దౌర్మనస్యము, దుఃఖము ననునవి యనంతముగఁ గల్గు నను విషయమును మన మెఱుఁగుదుము. ఇట్లు లోకమున నితరులయందు శోకాదులఁజూచినపు డుదయింపని సుఖాస్వాదము, కావ్యనాట్యములయందే యేల యుదయించును? లోకమునందుఁగంటె కావ్యమునఁ గల యతిశయ మేమి? లోకమున నెటువంటి, హేతువులు, కార్యములు, సహకారి కారణములు నున్నవో, యట్టివే హేతుకార్య సహకారిరూపములైన విభావాదులు గమకములై కావ్యమున నున్నవి. అవస్థావిశేషరూపము లగు నే రత్యాదులు లోకమున నున్నవో యవియే కావ్యమునందును గమ్యములై యున్నవి. విషయ మిట్లుండఁ గావ్యనాట్యములయందే సుఖాస్వాదోదయము గల్గు ననియు, లోకమునఁ గల్గదనియు ననుటలో నౌచిత్యము లేదు. కావునఁ బ్రయోజనమనునది లేదు. ప్రయోజనము లేకుండుటచే, రత్యాదులయందు వ్యంగ్యత్వోపచార ముపపన్నము కానేకాదు.

2. <u>సమాధానము</u>:— విభావాదిముఖమున (మూలమున) నెచట రత్యాదులు జ్ఞేయము లగుచున్నవో యచటనే, సహృదయులకు మాత్రమే సంవేద్య మగు రసాస్వాదోదయము కల్గును. ఇది యిట్లుండుట వస్తుస్వభావము- అందుచే, ప్రామాణికు లగు వారీ విషయమున ప్రశ్నించుట కవకాశము లేదు. విభావానుభావవ్యభిచారిభావ సంయోగమువలన రసనిష్పత్తి యగు ననునర్థము నిచ్చు- "విభావానుభావ వ్యభిచారిసంయోగాద్రస నిష్పత్తిః" యను భరతముని సూత్రమిందుకుఁ బ్రమాణము. ఈ క్రింది శ్లోకముగూడ నీ విషయమునే తెల్పును.

"భావసంయోజనావ్యంగ్యపరసంవిత్తి గోచరః
ఆస్వాదనాత్మానుభవో రసః కావ్యార్థ ఉచ్యతే ॥

తా॥ విభావానుభావ వ్యభిచారిభావముల సంయోగమువలన వ్యంగ్యమగునదియు, విలక్షణమగు జ్ఞానమునకు గోచరమగునట్టియు, నాస్వాదనారూపమగు ననుభవము కలిగినట్టియుఁ గావ్యార్థమే రస మని విజ్ఞులు చెప్పుచున్నారు. ఇచట విలక్షణ జ్ఞాన మనఁగా, లౌకిక ప్రత్యక్ష జ్ఞానము యుక్తులు, యుంజానులు నను రెండు తెగలకు సంబంధించిన యోగులకుఁగలుగు జ్ఞానములకంటె విభిన్న మగు జ్ఞాన మని యర్థముఁ దెలియవలెను.

లోకమునందున్న హేతు, కార్య, సహకారిరూపము లగు విభావాదులే కావ్యమునందును నున్నవనుట యుక్తియుక్తముగాదు. లోకమునందు విభావాదులుగాని రత్యాదిభావములుగాని లేనే లేవు. హేతు కార్యములు, సహకారి కారణములు మాత్రమే యున్నవి. విభావాదులును, హేత్వాదులును నొకటియే యని భ్రమింపఁగూడదు. అవి రెండును పరస్పరభిన్నములు. వాని లక్షణములే వేఱు.

భావములు :—లోకమున రామాదులయందు స్థిరముగ నుండు రతి మొదలగు నవస్థావిశేషములే కావ్యనాట్యములయందు వర్ణనార్థమై యాత్మానుసంహితము లగు నపుడు "భావయంతి తాంస్తాన్ రసాన్" (ఆయారసములను భావింపఁజేయును) అను వ్యుత్పత్తిచే భావములని వ్య

వహింపఁబడుచున్నవి. భరతముని "భావ" లక్షణము నిట్లు నిర్వచించి నాఁడు.

నానాభినయసంబద్ధాన్ భావయన్తి రసా నిమాన్
యస్మాత్తస్మా దమీ భావాః విజ్ఞేయా నాట్యయోక్తృభిః"
(భరతనాట్య శాస్త్రము. 7. అధ్యాయము. 4. శ్లో.)

యస్మాత్=ఏకారణమువలన, నానాభినయ సంబద్ధాన్=వాచి కాంగిక ముఖరాగాత్మకము లైనట్టియు, సత్త్వజనితము లగు కృతకబాష్పాది రూపము లైనట్టియు ననేకాభినయములతోఁ గూడిన (స్థాయిభావము లను పేరుగల యవస్థావిశేషములను) రసాన్=ఆస్వాదయోగ్యము లగు చిత్తవృత్తివిశేషములను, ఇమాన్=సామాజికులను గుఱించి, భావయన్తి=బుద్ధి విషయము లగునట్లు జేయునో (సామాజికులకుఁ దెలియఁ జేయునని భావము) తస్మాత్=అందువలన నివి భావాః= భావము లైనవని, నాట్య యోక్తృభిః=నాట్యప్రయోక్తలచేత, విజ్ఞేయాః= తెలియఁబడవలెను. ♦

♦ ఈసందర్భముననే, భరతముని యిచ్చిన భావశబ్ద నిర్వచనముల నితరము లనుగూడ నిం దిచ్చుచున్నాను.

"భావా నిదానీం వ్యాఖ్యాస్యామః" । అత్రాహ-భావా ఇతి కస్మాత్ కిం భవన్తీతి భావాః కిం వా భావయన్తీతి భావాః ఉచ్యతే.

వాగఙ్గసత్త్వోపేతాన్ కావ్యార్థాన్ భావయన్తీతి భావాః ఇతి. భూ ఇతి కరణే ధాతుః తథాచ భావితం వాసితం కృత మిత్యనర్థాన్తరమ్. లోకేపిచ ప్రసిద్ధ మహో హ్యనేన గన్ధేన రసేన వా సర్వ మేవ భావిత మితి తచ్చ వ్యాప్త్యర్థమ్. శ్లోకశ్చాత్ర

విభావై రాహృతో యోర్థో హ్యనుభావైస్తు గమ్యతే
వాగఙ్గసత్త్వాభినయైః స భావ ఇతి సంజ్ఞితః
వాగఙ్గముఖరాగేణ సత్త్వేనాభినయేన చ
కవే రన్తర్గతం భావం భావయన్ భావ ఉచ్యతే

ఇందు "విభావై రాహృతో భావో" అను శ్లోకాంతమువఱకుఁగల లక్షణము కవి నట శిక్షోపయోగి యనియు; "వాగఙ్గముఖరాగేణ" అను లక్షణమును, పైనఁ దెల్పిన "నానాభినయసంబద్ధాన్" అను లక్షణమును, సామాజికుల నుద్దేశించి తెల్పిన వనియు నభినవ గుప్తులు.

విభావము:— ఈ రత్యాద్యవస్థావిశేషములకు హేతువులగు సీత మొదలగువారే, కావ్యాదులయందభివర్ణితులైనపుడు, "విభావ్యన్తే ఏభిః (వీనిమూలమున వివిక్తముగ (స్పష్టముగ) తెలియఁబడుచున్నవి) అను వ్యుత్పత్తి ననుసరించి విభావము లని పిలువఁబడుచున్నవి.

"బహవోఽర్థా విభావ్యన్తే వాగంగాభినయాశ్రయాః
అనేన యస్మాత్తేనాయం విభావ ఇతి సంజ్ఞితః

వాగంగాభినయాశ్రయాః = వాచికాంగిక సాత్త్వికాభినయములే యాశ్రయముగాఁగల, బహవోఽర్థాః=స్థాయివ్యభిచారి భావాద్యనేకార్థములు, యస్మాత్=ఎందువలన, అనేన=దీనిచేత, విభావ్యన్తే=విశిష్టరూపముగఁ దెలియఁబడుచున్నవో, తేన=అందుచే, అయం=ఇది, విభావ ఇతి=విభావమని, సంజ్ఞితః=పిలువఁబడుచున్నది.

ఇచట నీ విషయమునుఁ దెలియవలెను. ఒకే యభినయ మనేక భావములను సూచింపవచ్చును. ఉదాహరణమునకు, బాష్ప మనునది యెండవలనను, ధూమమువలనను, రోగమువలనను, దుఃఖమువలనను గలుగవచ్చును. అపుడీ బాష్పమునకు హేతు వేమి యను విషయమున సంశయము కల్గును. విభావమును మనము తెలిసికొనినచో, మన కా హేతువు స్పష్ట మగును.

విశేషరూపమున, నీ యభినయము కరుణను సూచించుచు, ఈ యభినయము విప్రలంభమును సూచించు నను విధమున స్థాయిభావాదులను వ్యంగ్యము సేయుటచే విభావమైనది.

అనుభావము:-వీనికిఁ గార్యరూపము లగు ముఖప్రసాదాది లక్షణము లేవిగలవో యవియే కావ్యాదులయందు వర్ణితములైనపు డనుభావము లగును—"అనుభావయంతి తాంస్తాన్ భావాన్" అను వ్యుత్పత్తిచే ననుభావము లని పిలువఁబడుచున్నవి—భరతముని తెల్పిన లక్షణము.

"వాగంగసత్త్వాభినయై ర్యస్మా దర్థోఽనుభావ్యతే
వాగంగోపాంగసంయుక్తః సోఽనుభావ ఇతి స్మృతః.

యస్మాత్ = దేనివలన, వాగంగసత్త్వాభినయైః = వాచికాంగిక సాత్త్వికాభినయములచే, వాగంగోపాంగ సంయుక్తః అర్థః=వాగాద్యవ

వయములతోఁగూడినయర్థము (చిత్తవృత్తివిశేషము) అనుభావ్యతే= అనుభవవిషయ మగునట్లుగఁ జేయఁబడుచున్నదో, సః=అది అనుభావ ఇతి స్మృతః=అనుభావమని పిలువఁబడుచున్నది.

వ్యభిచారిభావములు :— మధ్యమధ్య నవాంతరహేతువుల వలన నుత్పన్నములై, యస్థిరములై, యుత్కాలికారూపములగు నే యవస్థావిశేషము లున్నవో యవియే, వానివాని విభావానుభావముల మూలమునఁ బ్రదర్శ్యమానములై "విశేషేణ అభిముఖ్యేన చరన్తి" అను వ్యుత్పత్తి ననుసరించి, వ్యభిచారిభావము లని వ్యవహృతము లగు చున్నవి.

స్థాయి, వ్యభిచారి, సాత్త్వికము లని, మూఁడు విధములుగ వర్ణితము లైన యీ 49 భావములును వ్యభిచారిభావములే. అయినను వానికిఁ గల ప్రత్యేకధర్మము ననుసరించి, వాని కాయా నామము లీయఁ బడినవి—ఎట్లన, స్థాయిత్వము లేక స్థిరముగా నుండుట యను ధర్మము స్థాయిభావములందే యుండును. వ్యభిచారి సాత్త్వికభావములయం దుండదు. అటులే వ్యభిచారిత్వ మనునది వ్యభిచారిభావములయందే యుండును. స్థాయి సాత్త్వికభావములయం దుండదు. ఈ విధముగానే సాత్త్వికత్వము సాత్త్వికభావములయందే యుండును. మిగిలినవానియం దుండదు. ఇందులో స్థాయిభావము లను వానికిమాత్రము స్థాయిత్వము, వ్యభిచారిత్వమును గూడ నుండుటచే, నవి స్థాయిభావములును, వ్యభిచారిభావములును గూడ నగును. అందువలన స్థాయిభావ మగు హాస్యము శృంగారరసమునకును, శోకము విప్రలంభ శృంగారమునకును, విస్మయము వీరరసమునకును, వ్యభిచారిభావములుగ మారినవి. వ్యభిచారి సాత్త్వికభావములు మాత్ర మెప్పుడును నిట్లు మారవు.—అవి యెప్పుడును వ్యభిచారిభావములే యగును గాని, స్థాయిభావము లెన్నడునుఁ గావు.

భరతనాట్య శాస్త్రమునందు, ఏడవది యగు భావాధ్యాయములో స్థాయిభావముల లక్షణములఁ జెప్పుటకు ముందు "ఇదానిం భావసామాన్యలక్షణ మభిధాస్యామః తత్ర స్థాయిభావాన్ వక్ష్యామః"

ఇపుడు భావసామాన్య లక్షణమును జెప్పెదను. అందులో స్థాయి భావ లక్షణమునుఁ జెప్పెద మని (భరతనాట్యశాస్త్రము ప్రథమ సంపుటము. 351 పుట) భరతముని ప్రతిజ్ఞ చేసినాఁడు. అందుచే నిచట నున్న లక్షణము వ్యభిచారిభావముగ నున్న స్థాయిభావమునకే గాని, తదతిరిక్తమైన, కేవల స్థాయిభావమునకుఁ గాదని తెలియవలెను. అగుచో స్థాయిభావలక్షణ మెచ్చటఁ జెప్పఁబడిన దని ప్రశ్నింపవచ్చును. సమాధాన మిది. స్థాయిభావానుకరణముతో రసములు. అవియే ప్రధానములు. వానిరెంటికిని బింబప్రతిబింబభావ ముండుటచే, రసస్వరూపము వర్ణించినచో, స్థాయిభావస్వరూపము వర్ణించినట్లే యగును. రసలక్షణముల నింతకుముందే భరతముని యాఱవ యధ్యాయమునఁ దెల్పినాఁడు. ఆ రసలక్షణ కథనముచే, స్థాయిభావలక్షణము గతార్థమే యగుచున్నది. అందుచే స్థాయిభావములకుఁ బ్రత్యేకముగ లక్షణకథనము లే దని తెలియవలెను.

స్థాయిభావములయందు, వ్యభిచారిభావములు పఠితములు కాలేదు. అట్లు, వ్యభిచారిభావములను గూడ స్థాయిభావములలో పఠించి యుండుచో వానికిని స్థాయిత్వమే వచ్చెడిది. అందువలనఁ దేలిన దేమనఁగా, వానివాని యోగ్యత ననుసరించి యీ భావములు స్థాయి సాత్త్విక వ్యభిచారి భేదమున మూఁడు విధములుగ గ్రహింపఁబడిన వని తెల్పుటకయియే వ్యభిచారభావములకు(స్థాయిభావలక్షణముఁ జెప్పుచో) స్థాయి భావ మను పేరీయఁబడినది. ఈ రహస్యము నెఱుఁగక కొందఱు, భరతముని యిచట స్థాయిభావలక్షణమునే చెప్పినాఁడని భ్రమించినారు. అప్రస్తుత ప్రసంగము నింకఁ జాలింతము.

విభావాదులు కృత్రిమములు. హేత్వాదు లకృత్రిమములు. విభావాదులు కావ్యమునందే యుండును. హేత్వాదులు లోకమున నుండును. కావున విభావములు హేతువులు నను నీరెంటికిని స్వరూపభేదమును, విషయభేదమును నున్నది. అందుచే వీని కేకత్వము సిద్ధింపదు. విభావాదుల నుండి యసత్యములే యగు రత్యాదిభావముల ప్రతీతి కలు

గును. ఈ రత్యాదిభావములు ప్రతీతిమాత్రసారములే. అందుచే నివి ప్రతీయమానము లనియుఁ గమ్యము లనియు ననుట ముఖ్యార్థమునందే సరిపోవును. ఈ ప్రతీతిపరామర్శమే, రసాస్వాద మనియు, నిది స్వాభావిక మనియుఁ దెలియవలెను.

ఎప్పుడును బరోక్షములే యగు రత్యాదుల మాట యటుండనిండు. మనకుఁ బ్రత్యక్షమగు విషయముగూడ, సత్కవి తనకార్యమునఁ బ్రతిపాదించినప్పు డెంతటి యానందము నిచ్చునో, యంతటి యానందమును బ్రత్యక్షముగ మనము తెలిసికొనినపు డీయఁజాలదు. - ఈ క్రింది శ్లోకమునఁ బ్రతిపాదిత మైనది.

"కవిశక్త్యర్పితా భావా స్తన్మయీభావయుక్తితః
యథా స్ఫురన్త్యమీ కావ్యా న్న తథాధ్యక్షతః కిల"

[కవి శక్త్యర్పితములైన రత్యాది భావములు, పఠితలకుఁ దన్మయమునఁ గలుగఁజేసి యెంతటి యానందము నిచ్చునో, యంతటి యానందమును బ్రత్యక్షముగ ననుభూతములైన రత్యాదిభావము లీయలేవు] కావ్యమునందుఁ గూడ నీ రత్యాదిభావము లనుమేయము లైనప్పు డంతకంటె నధికమగు నానందము కల్గును. ఇట్లుండుట వస్తుస్వభావమే యగుటచే నీ విషయమై తర్క మక్కఱలేదు. ఈ విషయమునఁ బ్రమాణము—

"నానుమితో హేత్వాద్యైః స్వదతేఽనుమితో యథావిభావాద్యైః
న చ సుఖయతి వాచ్యోఽర్థః ప్రతీయమాన స్స ఏవ యథా."

[విభావాదులచే ననుమితమైన విషయమునుండి కలుగు నానందము, హేత్వాదులచే ననుమిత మైనపుడు కలుగదు. ఒక విషయము ప్రతీయమాన మగునపుడు కలుగు నానంద మావిషయమే వాచ్యమైనపుడు కలుగదు]

ధ్వనికర్తయు నిట్లు చెప్పినాఁడు.

"సారరూపో హ్యర్థః స్వశబ్దానభిధేయత్వేన ప్రకాశితః సుతరాం శోభామావహతి" [సారరూప మగు విషయము వాచ్యము కానప్పుడే యెక్కువ శోభావహ మగును]

ఇప్పు డసత్యములగు విభావాదులనుండి కలుగు నసత్యములగు రత్యాదిభావముల యొక్క ప్రతీతులకు [illegible]లకుఁ గాని సామాజికులకుఁ గాని కలుగు ప్రయోజన మేమి? యని ప్రశ్నింపవచ్చును. అందుకు సమాధాన మిది. కావ్యాదులు ప్రతీతిమాత్రపరమార్థములే. విభావాదులును, రత్యాదులును నసత్యములే యగుగాక.

అయినను వానినుండి పాఠకులకు, విధినిషేధము జ్ఞానము కలుగుచునే యుండును. అందుచే రత్యాదిభావప్రతీతి సప్రయోజనమే యగును. భ్రమాత్మక మగు జ్ఞానముకూడ సంబంధమువలన, ననఁగా [illegible] యగుచోఁ బ్రమాణమే యగును. ఈ విషయమునే "భ్రాన్తిరపి సంబంధతః ప్రమా" అను వచనము తెల్పుచున్నది. ఈ క్రింది శ్లోకము కూడ నీ విషయమునే తెల్పును.

"మణిప్రదీపప్రభయోః మణిబుద్ధ్యాభిధావతోః
మిథ్యాజ్ఞానావిశేషేఽపి విశేషోఽర్థక్రియాం ప్రతి"

దీనిభావమిది—ఒకచో రెండుకాంతులు కన్పడుచున్నవి. అందొకటి మణినుండి వచ్చు కాంతి. రెండవది దీపమునుండి వచ్చుకాంతి. దూరమునుండి యీ రెంటినిఁ జూచినఁ యిరువురు పురుషు లీ రెండును మణినుండి వచ్చు కాంతులే యని తలఁచి యొక్కొక్కఁ డొక కాంతి పుట్టుచోటునకుఁ బరుగెత్తినారు. అందులో మణిప్రభనుచూచిన వానికి మణి దొఱకినది. రెండవవానికి మణి లభింపలేదు. ఇందులో మొదట నిద్దరకుఁ గలిగినజ్ఞానము గూడ భ్రమాత్మమే. కాని మణిప్రభను జూచి, యిది మణిప్రభయే యని యూహించిన వాని జ్ఞానము, మొదట ప్రమాణజ్ఞానమని చెప్పుటకు వీలులేకున్నను, నిజముగకు మణితో సంబంధించియుండుటచేతను, తుదకు మణియే లభించుటచేతను ప్రమాణజ్ఞానమే యగుచున్నది. ఇట్లు, సత్యవస్తు సంబంధమువలన, కార్యసిద్ధి గల్గుటచే భ్రమాత్మక జ్ఞానము గూడ ప్రమాణమే యగుచున్నది. అందుచే వారికిఁ గల్గినజ్ఞానములు రెండును మిథ్యాత్మకములే యైనను, మణిప్రభఁ జూచి పరుగెత్తు నతని జ్ఞానమునం దర్థక్రియా కారిత్వ మను నొక విశేష మున్నది.

# భీమేశ్వర పురాణము - కావ్యత్వము.

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

భీమేశ్వరపురాణమునకుఁ గావ్యత్వముద్ర నొసఁగినది శ్రీనాథుని ప్రతిభావిశిష్టమైన దృశ్య సాక్షాత్కృతిపద్ధతి. కథాకథన కౌశలమును. వానికి సరిపడిన ఘట్టములు సంస్కృత మూలమునం దీతనికి జతగూడినవి. సాధారణముగ శ్రీనాథుఁడు తనకవితాధార సరియైనతూఁగులో నడచుట కనువైన ఘట్టములనే యనువదింపఁ బూనుకొను. సంస్కృత భీమఖండము శ్రీనాథుని తెలుఁగు భీమేశ్వరపురాణమున కనువాద మని కొంద రందురు గాని, యది నిశ్చయ మనుటకుఁ దగినయుపపత్తులెందును గానరావు. సంస్కృత వాఙ్మయములో మధురమైన సామగ్రి యేది కంటఁబడినను దానిని తనగంటమున కంటించి తెలుఁగుసీసములఁ గఱగించి పోయుట యాతని కభిమతమైన విషయము. సంస్కృతకవితాసామగ్రి నంతయుఁ దనగ్రంథములలో నింపి, తరువాతివారికిఁ బథప్రదర్శకుఁడైన శ్రీనాథుఁడు సంస్కృతమును వీడి స్వతంత్రముగఁ దెలుఁగు సేతకుఁ గడఁగె ననుటకుఁ దగినయుపపత్తి బలమైనది గానరాదు. ఏదియో యొకమూల నుండిన దానిని తీర్చిదిద్ది మెఱుఁగు పెట్టుటయే యాతని పనివానితనము.

భీమేశ్వరపురాణమును ప్రబంధమును గావించుటకుఁ గూర్చిన వానిలో మూల మాధారము లేకుండ వెలసినది ప్రథమాశ్వాసమునందలివిషయ మంతయును. దీనిలోఁ గృత్యాది, షష్ఠ్యంతములు, దక్షారామపురవర్ణనమునుగూడ శృంగారరసవిషయము గావించుటకే "పర్యంతమందార పారిజాతకవనీ రమణీయకిన్నరీసముదయంబు" అని ప్రారంభించి, కృతినాయకునకుఁ దనివితీఱ భీమనాయకునియెదుట వేశ్యాంగనాభంగిమలు ప్రదర్శింపఁజేసినాఁడు. దక్షారామపురవరమును సర్వసంపత్సమృద్ధము నొనరించుచు "దక్షారామవిలాసినీతతుల సౌందర్యంబు వర్ణింపఁగాఁ జక్షుశ్శ్రోత్రకులాధినాయకునకే శక్యంబె?" యని యబ్బుర

పోయినాఁడు. అప్సరంబు వేశ్యలను, ప్రపంచ మంతయు సృష్టిచేసిన బ్రహ్మ గాక 'జాణ దేవర శ్రీపంచశరవిరించి' సృజియించె నఁట. కావు ననే వారిసౌరును గడుసున్నితముగఁ జిత్రించి పాలకడలిలోనుండి లేవ నెత్తినాఁడు—

సీ. ముదువంగ నేర్తురు మూలఁ గమ్మనితావి
గలుగు క్రొవ్విరులు లోఁ గందకుండ
మురియంగ నేర్తురు మోహనాస్పదమైన
మొగలివాకిటిచాయ నగరవీధి
వలపింప నేర్తురు వలరాజు గెలిచిన
పెద్దకాలము వేల్పు భీమనాథుఁ
బలుకంగ నేర్తురు పాటలాధరముల
ముల్కలేనగవులు ముద్దుగురియఁ
జందురునితోడఁ గల్పవృక్షములతోడఁ
దారతో లక్ష్మితో నమృతంబుతోడఁ
గౌస్తుభముతోడ మున్నిటఁ గలిగినారు
విబుధగంధర్వజాతా లవ్వీటిసతులు.

ఇట్లు నాఁటి వేశ్యల జడలతీరు, పిటుల వలపించు సౌరు, మాటల తీరు వర్ణించి యానాఁటి వేశ్యాంగనల దేవాంగనాజాతివారినిగాఁ జిత్రించినాఁడు.

శ్రీనాథుఁడు మందమారుతప్రసారమును గావింపఁజేసిన, నాగాలి యెక్కడెక్కడికో పోయి వెలితిపడి బయటఁబడును. అది పంచారామములందు బయలుదేఱెనా మఱి చెప్పఁబనిలేదు. దక్షారామమున బయలుదేఱినమలయమారుతము తిలకపుష్పముల తేనెలు, పోఁకపూవులపరిమళములు పుక్కిలించి వలపెక్కినది. కమలసస్యములఁ గాచు గోపికల చన్నుఁగవలమీఁది పైఁటలు తొలఁగించి, సప్తగోదావరతరంగములమీఁద జలవిహారముచేసి, దేవగంధర్వవిలాసినుల విహారహర్మ్యములలోనికిఁ దూఱి, ఆడుపాములు సేవింపఁగఁ వెలితిపడుచు మలయజ లత

ల గుబురులలో మెలఁగునఁట. ఇట్టి మలయమారుతము నొకవిటునిగఁ దయారుచేసి, యాతనిధూర్తచేష్టితములను వర్ణించి, బహుస్త్రీపరిషేవణమున శక్తి తఱిగి పొదలలోఁబడి తిరుగాడుట కడుహృద్యముగఁ జిత్రించినాఁడు కవి.

సీ. తిలకంబు బలు తేనియలఁ బోక మోకల
పువ్వుఁబాళలతావిఁ బుక్కిలించి
కలమగోపికల చక్కనిచన్నుఁగవలపై
వటపల్లవంబులు వాయఁదట్టి
సప్తగోదావరజలతరంగారోహ
కేలీసుఖంబు లంగీకరించి
దేవగంధర్వలీలావతీహాటక
ప్రాసాదవలభి గర్భములు దూరి
ప్రతిదినము దక్షవాటీపురంబునందు
మలయవేలావనీ మందమారుతంబు
గంధసారలతాకుడుంకముల మెలఁగు
చిలువతేమలు సేవింప వెలితిపడుచు.

భీమ. 1-౯౭.

ఇఁకఁ గుమారారామములో కుమారవనమారుతములు చేఁగినవి. వానిగమనభంగి వేఱు. అవికూడ విలాసవతీభవన మణిగవాక్షములలో దూరినవి. అచటి ప్రస్తావము కూడ నట్టిదే. ఆ వాయువులకును పరిమళము మాంద్యము శైత్యము జతగూడినవి. కాని యామారుతము లెన్నిటికో యుల్లాసమును గలిగించి యుపకరించినవి.కొమరేటియందున్నకమలములకుపరిమళ భరమునుగూర్చినవి.నాలికేళవనములోని క్రొత్త పూలమొగ్గలను వికసింపఁజేసినవి. అప్సరస్త్రీల విహారభవనములందలి ఇంద్రనీల మణి గవాక్షములలో దూరి వారికిఁ జల్లఁదనము కలిగింపఁజాలినవి. భీమేశ్వరుని విశాలవక్షమునం దొప్పుచున్న సర్పములకు భుక్తి పెట్టినవి. రాజనారాయణస్వామి రమ్యభవనమునీఁదనుండిన

గరుత్మంతునకు నాట్యమును నేర్పినవి. ఇందలి కిన్నియుపకృతు లొనర్చిన యాకుమారారామవాయువులు వ్యాసునిమీఁద వీచి యాతనికిఁ గల మార్గాయాసము నణఁచివేసినవి.

సీ. కొమరేటికల్యాణకమలషండంబుల
సౌరభ్యభారంబు సంతరించి
నారికేళాటవీ నవపుష్పకుహళికా
వితతి కన్నెఱికంబు వీడుకొలిపి
యప్సరఃకాంతావిహారహాటక హర్మ్య
శశికాంతమణి గవాక్షముల దూరి
భీమనాయకదేవు పేరురంబునఁ గ్రాలు
భుజగహారములకు భుక్తి వెట్టి
రాజనారాయణస్వామిరమ్యభవన
తార్క్ష్యకేతనపతికి నర్తనము గఱపి
పొలసె నధ్వపరిశ్రాంతి పొడవడంగ
మౌనివరుపైఁ గుమారవనానిలములు.

భీమ. ౨. ౬౨.

ఇచ్చటఁగూడ కుమారారామపవనములుధూర్తవిటకృత్యములు కొన్ని జరుపకపోలేదు. నారికేళాటవీనవపుష్పకుహళికావితతికిఁ గన్నెఱికంబు వీడుకొలిపిన వఁట. ఈకన్నెఱికమును వీడుకొలుపుటలోనే కావ్యకళ యుట్టిపడుచున్నది. వ్యంగ్యముగ నొకవిటుఁ డొకవేశ్యకుఁ గన్నెఱికము వీడుకొల్పినపరిపాటి నిది స్ఫురింపఁజేయుచు శృంగారభావమునఁ కొక ముద్రవేసినది. ఆ విటునే యప్సరఃకాంతావిహారహర్మ్యములలో గవాక్షముల దూరునట్లు చేయుటయు శ్రీనాథునిరసప్రవణదృష్టికి నిదానము. ఏమ్మటివన్నియు వాయువులకు సహజముగ నుండెడియుపకృతి సామగ్రీచిత్రణమునందే పర్యవసన్నములు. సౌరభ్యశీతలభారము వహించి, భుజగహారములకు భుక్తివెట్టుటచే వెలిబిపడి, మందగించిన వనవాయువులు గావుననే, కాశీవిప్రయోగఖిన్నమతియై యధ్వపరిశ్రాంతిచేఁ

దపించుచున్న వ్యాసునిమార్గాయాసమునకుఁ బొడవు సఱపఁగల్గినవి. ఇచట వ్యాసుని మార్గాయాసము తీర్చుటకు "యప్సరఃకాంతావిహార హాటకహర్మ్యశశికాంతమణిగవాక్షముల దూరి"రా నక్కఱలేదు. కాని శ్రీనాథుని గంటమున గాలులు రేఁగెనా మూలమూలలకుఁ బోయి కాని బయటికి రానేరవు. రహస్యస్థలములకుఁబోయి యొక క్రొత్తగుణమును దేకుండ నుండవు. కాని యాగుణమును గ్రహించుటకు పాఠకులకే వదలివేయుటలో నాతని కొక యుల్లాసము.

ఆంధ్రకవితకు ప్రబంధముద్ర నొసఁగిననాఁటి నుండియుఁ గవులు ప్రసంగము నెట్టులో కలిగించుకొని కొన్ని వర్ణనములు తప్పక చేయుచు వచ్చిరి. సూర్యోదయసూర్యాస్తమయములు చంద్రోదయచంద్రాస్తమ యములు నీవర్గమునకుఁ జెందినవియే. కాళిదాసాదికవులుకూడ లేమ శ్రవ్యదృశ్యకావ్యములలో వీని కొకప్రత్యేకస్థానము నొసఁగి,కల్పనలతోఁ బెంపొదించి చిత్రించియున్నారు. సంస్కృతపరిపాటిని దెలుఁగులోనికి సం పూర్ణముగ నవతరింపఁజేయఁదలఁచిన శ్రీనాథుఁ డావర్ణనముల నెట్లు విడనాఁడును. వ్యాసుఁడు కాశిని వదలి దక్షిణకాశికిఁ బయనము సాగించునపుడు వీనిని నాలిగింటి నొకచో గుదిగుచ్చి పెట్టినాఁడు. ఇది మూలములో లేకున్నను కావ్యత్వముద్ర నిచ్చుటకుఁ బనిపట్టి కూర్చి నదియే. కాని దీనఁ గవితాసౌష్ఠవ మెంతయు జతగూడినది.

సూర్యాస్తమయము కాఁజొచ్చినది. వెంటనే అన్నపూర్ణాదేవి సిద్ధవాహినినీటిలో జలకమాడి కై సేయఁదొడఁగినది. విశ్వనాథుని యం తర్భవనములో తాండవారంభమునకు మద్దెలలు మ్రోసినవి. కాలభైర వుఁడు మధుపానగోష్ఠికిఁ బ్రారంభ మొనరించినాఁడు. కుమారస్వామి వాహన మగునెమిలి కంఠము సాచి కొక్కొఱోకో యని క్రేంకార మొన రించినది. తుమ్మెదలు ముకిళింపనై యున్న పద్మములను వీడి దంతి విఘ్నేశుని చెక్కులమీఁది కుత్కంఠతోఁజేరినవి. రాత్రివేళ రానై యుండినంతనే కానవచ్చినవారి నందఱను రసికులను మధుపానమత్తు లను జేయునుత్కంఠ కలవాఁడుగావుననే శ్రీనాథుఁ డిట్టిచిత్తరువును దీసి నాఁడు. చరమాచలశిఖరమున దినకరుఁ డొక్కింత తడవు మసలినంతనే

శ్రీవిశాలాక్షిని చిఱుబంతిపసుపాడి కై సేయ సిద్ధముచేయించుటయందే శ్రీనాథుని భావుకత యిమిడియున్నది. ఈసీసపాదము ధ్వనిప్రధానమైన వాక్యము. దానిలో ప్రియసమాగమోత్కంఠను ధ్వనింపఁజేసినాఁడు కవి. కొమరుసామిరథము కంఠముసాచి క్రేంకారము చేసెననుట యెంతయు రచనలోని సౌకుమార్యమును జిలికించుచున్నది.

సీ. సిద్ధవాహిని నీటఁ జిఱుబంతి పసుపాడి
శ్రీ విశాలాక్షి గై సేయఁదొడఁగె
మొరసె నంతర్గేహమున విశ్వనాయక
తాండవారంభ మర్దలరవంబు
మందార తరుపుష్ప మధుపానగోష్ఠికిఁ
బ్రారంభ మొనరించె భైరవుండు
కొక్కొరో కో యని కొమరుసామిరథంబు
కంఠంబు సాఁచి క్రేంకార మిచ్చె
మొగుడఁ బాఱిన యరవిందములను బాసి
గములు గములుగ మత్తభృంగములు గూడి
డుంఠివిఘ్నేశు చెక్కుల నుత్కంఠఁ జేరె
నభినవంబైన యపరసంధ్యాగమమున.

భీమ. ౨. ౨౮.

ఇటులనే సూర్యోదయారంభమును గూడ తెలుఁగునుడికారపు సౌరుతో తీయఁగఁ గొనసాగించినాఁడు.

చ. వెలవెలఁబాఱెఁ జంద్రుఁడును విన్ననఁ దారకచక్రవాళముల్
పలపలనయ్యె దీర్ఘికలఁ బద్మవనంబుల షట్పదాంగనా
కలకలముల్ చెలంగె వెడకన్ను మొగిడ్చె లలిం గుముద్వతుల్
తెలతెలవాఱె జంభరిపుదిక్కునఁ దోఁచె ననూరురాగముల్.

భీమ ౨. ౪౮.

ఒక దృశ్యమును పాఠకులకుఁ గన్నులయెదుట సాక్షాత్కరించునట్లు చిత్రించుట కవితాశిల్పమున కొక పరాకాష్ఠ. శ్రీనాథుఁ డొక్కొకచో నట్టి శిల్పము నద్భుతముగఁ జిత్రింపఁగల దిట్ట. కాశినుండి వచ్చిన వ్యాసుని, తుల్యభాగానదీతీరమున నగస్త్యమహాని యెదుర్కొను నప్పటి దృశ్యము మిక్కిలి రమ్యముగ వెలసినది. ఆ దృశ్యములో నొక పరమమాహేశ్వరాచార పరాయణుని జిత్రించుచు వ్యాసభట్టారకుని మూర్తిని మనయెదుటఁ బెట్టినాఁడు. ఆతఁడు మూఁడు రేకలు తేరునట్లు నుదుట భస్మము దాల్చినాఁడు. మెడలో రుద్రాక్షమాలికలు దాల్చినాఁడు. మీఁది దేహమున యజ్ఞోపవీత కృష్ణాజినము లమరించినాఁడు. శిరమున చిగురుటాకులఁబోలిన జడలుదాల్చినాఁడు. ప్రేళ్ళయందొక దర్భపవిత్రము, మూపునందు నైష్ఠికబ్రహ్మచర్య సూచకమగు పాలాశదండమును. శరీరము వర్షాకాల మేఘమును బోలిన నీలిమతోఁ గూడి సాలవృక్షమువలె నెత్తుగ నున్నది. ఆతని యాకృతియే యాతఁడు పరమభాగవతుఁ డనియు, మాహేశ్వరాచారపరాయణుఁ డనియు, మౌనులలో నగ్రగణ్యుఁ డనియుఁ దెలుపుచున్నది. అట్టిపులినసంభవమునిని కలశసంభవముని పొడగాంచె నఁట. మాహేశ్వరాచారవీథిలో మెలఁగఁదలఁచినవాని కీవేషము, ఇట్టిస్వరూపము జతగూడవలె ననుటను నీవర్ణనము తెలుపుచున్నది.

సీ. భస్మత్రిపుండ్రాంక ఫాలప్రదేశుని
రుద్రాక్షమాలికారూఢవక్షు
నుపవీతకృష్ణాజినోత్తరాంగునిఁ బల్ల
వారుణాంచితజటాపటలధారుఁ
ద్రామపాత్రాంగుళీదర్భమూలపవిత్రుఁ
దరుణకింశుకలతాదండధారుఁ
బ్రావృషేణ్యవినీలపాథోధరశ్యాము
సాలవృక్షప్రాంశుఁ జారుదేహుఁ

బరమభాగవతోత్తమపరిథమగణ్యు
విమలమాహేశ్వరాచారవీథిపథికు
నఖిలనీవారముష్టింపచాగ్రివరునిఁ
బులినసంభవుఁ బొడగాంచెఁ గలశజుండు.

భీమ. ౨. ౮౩.

ఈమాను లిరువురును గలిసి, యొకరి నొకరు కౌఁగిలించుకొని, కుశలప్రశ్నములు చేసికొనుసప్పటి వైఖరియే, వ్యాసుఁడు కాశిఁ బాసిన కారణముఁ జెప్పుట కాముఖమైనది. వ్యాసుని ముఖమునందలి వికారము గుర్తించి కుంభసంభవుఁ డాతురతమీఱ నడిగినప్రశ్నలు కాశిలో నివసించుటకు సాధారణముగఁ గలిగెడివిఘ్నకారణముల నుగ్గడించునవి. ఆయడుగుటలో నగస్త్యునకు వ్యాసునెడఁ గలుగు నవ్యాజప్రేమ వ్యక్తమగుచున్నది. దానిని వ్యక్తముచేయుటలో శ్రీనాథునిపలుకులలోని తీయఁదనము తొలఁకిపడినది.

సీ. లోలార్కునకు నీకు లోలోన నేమేనిఁ
బోటి పుట్టదు గదా! మాటమాట
వెనకయ్య శ్రీడుంఠివిఘ్నేశ్వరస్వామి
ధిక్కరింపఁడు గదా! తెగువ నిన్ను
నాఁకొన్ననిన్న మధ్యాహ్నకాలంబున
సరయకుండదు గదా! యన్నపూర్ణ
నపమేమియును లేక నీయెడాటమ్మునఁ
బాటిఁ దప్పఁడు గదా! భైరవుండు
నెట్లు పాసితి మిన్నేటి యిసుకతిప్ప
యెట్లుపాసితి వాస్థలం బేనుగోను
లెట్లు పాసితి వవిముక్తహట్టభూమి
యెట్లుపాసితి విశ్వేశు నిందుధరుని.

వ్యాసునకుఁ గాశిపైఁ గోప ముదయించుటకుఁ గారణము వర్ణించునప్పటిగద్యము రసానుగుణ మగుశైలిలో నడచినది. శైలిలోని వేగమే కోపమునకుఁ గూడ నొకవేగమును గూర్చునదిగా సిద్ధమైనది.

వ్యాసుఁ డగస్త్యునితోఁ గాశిలోఁ దాను బడినయిడుములు తెలుపు చున్నాఁడు. "మధ్యాహ్నకాలం బగుట నిరూపించి, భిక్షాపాత్రింబులఁ గేలఁబూని, యతికఠోరజఠరక్షుధాగ్ని తాపంబునకుఁ దోడగుతపనమయ ప్రచండకిరణకాండప్రకాండంబులు నెత్తి మండింప, లేదు నడువుండు పొండు కూడ దనునిషేధవాక్యంబులు చెవులు నిండికొన విప్రవాటం బులఁ బ్రతిగేహంబును బరిభ్రమించి, విసికి విసిమాలి వేసరి యలసి యారటఁబొంది సొలసి జూఁకించి తూలి దూపటిలి యుల్లంబునఁ గ్రోధం బగ్గలించిన వ్యాసుండు క్రోధాంధకారముచేఁ గన్నులు చీక టులు గ్రమ్మఁగా, తన్నుఁ జూచెడి శిష్యులుభయభీతులగునట్లు లతివేగ ముతోఁ గేలఁదాల్చిన భిక్షాపాత్రమును నూఱుప్రక్కలగునట్లు ఱాతి మీఁద నడివీధిలో చితుకఁగొట్టెనఁట. వ్యాసునిరౌద్రోద్రేకము తదను గుణమైనబంధమున నడచినది.

శా. కుక్షిప్రోద్భవనిష్ఠురక్షుధితదుష్క్రోధాంధకారంబునన్
జక్షుల్ రెండును జిమ్మచీకటులుగా సంరంభసంభ్రద్గతిం
బ్రేక్షచ్ఛాత్రులు భీతిఁబొందఁ గడు నుద్రేకించి హట్టంబునన్
భిక్షాపాత్రము ఱాతిమీఁద శతధా భిన్నంబుగా వైచితిన్.

రౌద్రరసస్ఫూర్తికి సరిపడినవృత్తము, ఆరభటీవృత్తి, ఓజో గుణము, తదనుగుణమైన ద్వితీయచతుర్థవర్ణసంయోజనముతోఁ గూడిన సమాసములు, క్షకారప్రాసము నీపద్యమునం దమరినవి. పద్యము పూర్తియగునదికి వ్యాసుఁడు భిక్షాపాత్రము నిశ్చయముగఁ బగులఁ గొట్టినాఁ డనిపించుచున్నది.

ఆసమయంబున ప్రత్యక్షమైన విశాలాక్షిని శ్రీనాథుఁడు వచన శైలిలో నతిపచిత్రముగఁ జిత్రించినాఁడు. అన్నపూర్ణాదేవి శ్రీనాథుని హృదయములో వేదాంతవచోమహోపనిషదర్థమయి వృద్ధసీమంతిని

పంచాశద్వర్ష వయస్కయును. ఆమె వేణికాభారము పలితసారమై యొఱగినదఁట. ముదుసలిచక్రవాకంబులతో నెకసక్కెంబాడు వీఁగు చన్నులవ్రేఁగుఁదనంబున నామె తనూవల్లి జలదరించిన దని శ్రీనాథుఁ డనినంతనే వినువారిహృదయము జలదరించును. ఆమె బోరుతలుపు వాయఁదట్టి, తేరుగడపమోలం జరణపల్లవంబు సాఁచి చూచిన చూపులో నొకనాట్యభంగిమను జిత్రించిపెట్టినాఁడు. అప్పటియామె వెడఁదకన్నులు అనంగధ్వజపటకఠోరపాఠీనచ్ఛాయాదాయాదంబులై తలచుట్టును బలిసి పొలిచినవఁట. ఈయుపమానము, కన్నులవిస్తృతియు నిరుపమానములు. అప్పటియామెపెయెలుఁగు కలమధురవీణాక్వాణ పాణింధమమై వెలసినదఁట. ఇచ్చటి గద్యమున శ్రీనాథుని మధుర భావన భావుకులైనవారికి అనిర్వచనీయ మనిపించును. ఆమెను బరికించునప్పటికి వ్యాసునకేగాక పాఠకులకు సైతము భయసంభ్రమములు పొడమును. ఈభావములే కాశీఖండమునఁబద్యరూపమునఁ వెలసినవి. ఉదాహృతిగా నిచటివచనము నచటిపద్యములుకూడఁబరికింతము—

వ. ఆసమయంబునఁ గాశికానగరసోమవీథికాభవనవాటికామధ్యంబున నొక్కయింటిమచ్చికంటి, పంచాశద్వర్ష దేశీయ పలితసారంబైన వేణికాభారంబు కైసడ, ముదుసలిచక్రవాకంబులతో నెకసక్కెం బాడు వీఁగుచన్నుల వ్రేఁగుఁదనంబునఁ దనూవల్లి జలదరింపఁ, గంకణ ఝుణఝుణత్కారంబు దోరంబుగాఁ గ్రక్కున గోపురద్వారంబుబోరు తలుపు వాయందట్టి, యందియలగలిత్రోడం గూడి మట్టియలమ్రోఁత త్రిభువనంబుల నురుజగొనం, దేరుగడపమోలం జరణపల్లవంబు సాఁచి, యనంగధ్వజపటకఠోరపాఠీనచ్ఛాయాదాయాదంబులైన వెడఁదకన్నులు తలచుట్టునుం బలిసి పొలయఁ, గలమధురవీణాక్వాణ పాణింధమంబై యెలుంగు నెత్తి యోబ్రాహ్మణోత్తమా! శాపము సంహరింపుము.''

భీమ. ౩. ౧౧౦

సీ. వేసలి పాటపాట నరవెంద్రుకతోఁ దిలతిందులాన్వయ
శ్రీ నటియింపఁ గై వదలి శ్రేకనిచన్నులు పాలవంకలై
కౌ నసియార్చ వాలు తెలిగన్నులు కల్కితనంబు పీడ్కొనన్
మానినిహ స్తమూఁది యొకమంజులభాషిణి వచ్చెవీథికిన్.

ఉ. వేదపురాణశాస్త్రపదవీనదవీయసియైన పెద్దము
త్తైదున కాశికానగరహాటకపీఠశిఖాధిరూఢ య
య్యాదిమశక్తి సంయమివరా! యిటు రమ్మని పిల్చె హస్తసం
జ్ఞాదరలీల రత్నకటకాభరణంబులు గల్లుగల్లనన్.

ఈప్రకరణమున విశాలాక్షీదేవి వృద్ధసీమంతినియైనను విశ్వనాథుని శుద్ధాంతము గావుననే శ్రీనాథుఁడా మెరామణీయకమును మఱింత యందముగాఁ జిత్రించినాఁడు. ఇంతకు శ్రీనాథునకు స్త్రీమాత్రము గాన వచ్చిన నామె వేణీభరమును, యురోజములతీరును, కంకణక్వాణమును, అందియలరవళిని మట్టెలమ్రోఁతను వినిపింపకమానఁడు. కాని యవి యన్నియు వయసునుబట్టి యౌచితిని వహించియుండును.

అన్నపూర్ణాదేవి వ్యాసునితోందఱపాటు నణఁచి, "కాశి పరమేశ్వరునకు కూరిమిభోగపురంధ్రి; దానిపై నీకుఁ గోపింపఁ దగదు. ఇప్పటికే నీపైనిందుమౌళి కెంతకోపము వచ్చియుండునో! నీవు బ్రాహ్మణుఁడవుగావున నీవు చేసిన నేరము వెదుకఁగూడదు. మఱి మాటాడక నీవు భిక్షగొనుటకు రమ్మని వ్యాసుని నిగుత్తరునిగఁ జేసినది. ఆదేవిదాక్షిణ్యమునకు వ్యాసునిహృదయము కరగిపోయనది. విశాలాక్షికి మఱింత జాలికలుగునటులు ప్రసంగించినాఁడు. ఇచటి వ్యాసుని పరిసంగమును గవి యెంతయు సరసముగ నటింపించినాఁడు. పద్యమంతయు వాత్సల్య ముబికిపడునట్లు సాగినది.

శా. తల్లీ! యిన్నిదినాల కేనియు సుధాధారారసస్యందియై
యుల్లంబున్ సుఖయింపఁజేయు పలుకెట్లో వింటి మిల్వీటిలోఁ
బెల్లాఁకొన్నకతాన నే నొకఁడనే భిక్షానకు న్వత్తునో
యెల్లన్ శిష్యులఁ గొంచువత్తునొ నిజం బేర్పాటుగాఁ జెప్పుమా!

ఈపలుకులతో నాజగన్మాతహృదయము ద్రవించినది. శిష్యులు నీవుఁ గూడుకొని మాధ్యాహ్నికక్రియలు గంగానదిలోఁ దీర్చి వెంటనే రండు. ఇంతలో నే నింటిలో వంటకము చేయించి మీకందఱకుఁ దృప్తిగ భోజనముఁ బెట్టెద ననినది.

ఈభోజనప్రకరణ మంతయు శ్రీనాథుఁడు చాల వింతగను సంప్రదాయానుగతముగను నడిపించినాఁడు. కాశిలో నన్నపూర్ణాదేవి పెట్టించిన భోజనము లన్నియు, ఆంధ్రదేశములోని భోజనములై వెలసినవి. రాణివాసపుమర్యాద లన్నియు నేర్పడినవి. శంబళీజనఁబుచేత వ్యాసుని రాక యెఱిఁగించిన వెనుక, విశాలాక్షి బంగారుగోడుగుపావలు తొడుగుకొని, రెండవయసు తాంబూలకరండవాహినికై దండ పట్టుకొని యేతెంచి రండు విచ్చేయుం డని సగౌరవముగా లోనికిఁ దోడ్కొనిపోయి, వివిధోపచారసమేతమైన చతుశ్శాలాభోజనమందిరమున వృద్ధానుపూర్వంబుగ వ్యాసుని శిష్యులనుగూడ నుచితాసనంబులఁ గూరుచుండ నియమించినది. దీనిలోమునిమీఁది గౌరవము అన్నపూర్ణకుఁ గలరాచరికము తెల్లమగుచున్నవి.

ఆదేవియాజ్ఞచే దివ్యవనితలు వచ్చి అరటాకులు పెట్టిరి. ఆయరటాకులలో తెలుఁగుతన ముట్టిపడినది.

క. మొగి విరిసి కఱకు గూడక
పగులక వెడలుపును నిడుపుఁ బసిమియుఁ గలతేఁ
జిగురరటాకులు పెట్టిరి
దిగదిగ నద్దేవియాజ్ఞ దివ్యపురంధ్రుల్. ౧. ౧౨౬.

అగ్రిము లున్న అరటాకులు. చివరివఱకు విడిచి, పెళుసు లేకపగిలిపోక పొడవు వెడల్పు పచ్ఛదనము గల లేతయరటాకులు దివ్యపురంధ్రులచే వేయించినాఁడు కవి. పదార్థములకంటెను ఆకు లెంతయు నాకర్షకములుగా నుండినవి. ఇట్టి యరటాకులలో భుజించుట తృప్తికర మనెడి కవియూహాను మన కీపద్యము చెప్పకచెప్పుచున్నది. కావుననే శిష్యులకు వ్యాసునికిఁగూడ నాయరటాకులు చూచినంతనే గుండె ఝల్లనినది

పిమ్మటఁ బంక్తిపంక్తికి వచ్చి విశాలాక్షి గంధపుష్పధూపదీపముల నర్పించి పూజ లొనర్చినది. అందఱుఁ గూడి శాంతిసూక్తములు పఠించి యీశ్వరున కభిషేకములు చేయు మనినది. ఈయమృతాన్నములు ఈపదార్థములు మెల్లఁగ భుజింపుఁడు. మీభుక్తిచే విశ్వనాయకుఁడు తృప్తి వహించుఁగాక యని, నైదికాచారప్రపత్తు లన్నియు వెలయింపఁజేసినాఁడు కవి. క్రమముగా నందఱి నిట్లు ప్రార్థించుచు నామె యాపోశనములు పోయించినది. అరటాకులు వేసి, పదార్థములు లేకుండ నీయమృతాన్నములు మందగతిని భుజింపుఁ డనిన నెట్టివారి కయినను చింత గొలుపకుండునా? అట్టియబ్బురపాటునే కవి సహజముగఁ జిత్రించినాఁడు

ఉ. వండినచొప్పునం బొగపువాసనయుం బొగపాఱుచందమున్
భాండసమృద్ధిసంపదయుఁ బానవిభూతియు సర్వమంగళం
బండజయాన రిత్త ప్రియ మాడెడు నేఁడును భోజనంబు లే
కుండుట గాననయ్యె నసితోత్పలగంధియు నేమి మాయయో!

చ. చల్లని సౌమ్యదృష్టియుఁ బ్రసాదము మాధురియు న్వివేకము
న్నల్లదనంబు వహాగ్యమును నిర్మలినత్వముఁ జూడవచ్చినన్
గల్ల యొకింతయేనిఁ బొడగానఁగరా; దరటాకు చూచినన్
ఝల్లనె గుండె యోగిరము శాకములుం బొడగానరామికిన్.

—౨. ౧౩౩, ౧౩౪.

పాత్రశుద్ధి కాజ్యము చిలికి పదార్థములు వడ్డింప కుండుట యేమి చోద్యమా? యనుకొనిరి, కానియిన్నాళ్లవలెఁ గాక యీనాఁడు మన

లనందఱను బూజించి, మనచే దీవనలు గైకొని, యపోసానంబులు వడ్డించిరి. ఇది యంతయు వ్యర్థము కావచ్చునా యని తృప్తిపడిరి. ఆఁకలిచే నటమటించువారి కాపాటియూరట గలుగుటయు సహజముగనే యున్నది. ఎల్లవారికి నాపోశనములు పోసిరా? భుజింపుఁడు. లెండు. మీ కిది యమృత మగుఁ గాక. ప్రొద్దు పోయెను సుండీ. అని దోసిలి యెత్తి నమస్కరించుటయు, భోజనావసరములలో పూజ్యులకుఁ జేయు గౌరవపరిపాటి. ఈనాఁటికి నాంధ్రదేశమునఁ గానవచ్చునదియే.

“ఆముత్తైదువయాజ్ఞచే బ్రాహ్మణు లందఱు ఆపోశనములెత్తినంతనే అరటియాకునడిమికిఁ, బిండివంటలు దివ్యాన్నములు, షడ్రసములతోనిండిన పదార్థములు నొక్కపెట్టున నవతరించినవి” అని తెలిపిన శ్రీనాథుఁడే, వచ్చినపదార్థము లన్నిటి నొక్కొక్కటిగ మరల వివరించి తెలిపినాఁడు. ఈవివరించుట శ్రీనాథునకుఁ గలభోజనప్రియత్వమునకు, ఆతనినాఁ డాంధ్రదేశములో నుత్తమభోజనావసరములం దుపయోగించుపదార్థములును మనకుఁ దెలియుచున్నవి. లేకున్న పై వాక్యముననే పత్త్రిపాత్రీమధ్యంబున నవతరించిన పదార్థములజాతి యంతయుఁ దెలియుచునే యున్నది. ఈవివృతి యక్కఱయే లేదు.

ఉ. పప్పును బిండివంటలును బాయసముల్ ఘృతముల్ గుడంబులుం
గుప్పలుగాఁగఁ జుట్టునను గూర్పఁగఁ గూసిన యేకుఁబ్రాలతె
ల్గప్పురభోగివంటకము గమ్మని తాలెపుఁబ్రాజ్జెపిండితో
నొప్పులుగా భుజించిరి బుధోత్తము లాఁకటిచిచ్చుపెచ్చునన్.

ఈ తెలుఁగునాఁటి పిండివంటలను తెలుఁగునుడికారముతోఁ దెలిపినాఁడు.

శా. ద్రాక్షాపానకఖండశర్కరలతో రంభాఫలశ్రేణితో
గోక్షీరంబులతోడ మండెగలతోఁ గ్రొన్నేతితోఁ బప్పుతో
నక్షయ్యంబగు సేరుఁబ్రాలకలమాహారంబు నిశ్శంకతం
గుక్షుల్నిండఁగ నారగించితిమి యక్షుద్రక్షుధాశాంతికిన్

భీమ. ౨. ౧౩౯, ౧౪౧.

ఇది సంస్కృతశైలిలో నడచిన పదార్థవర్ణనపరిపాటి. ఇంతటితో సరి పెట్టక "ఇవ్విధంబున నాజ్యధారాప్రవాహంబును శర్కరాక్షోదసిక తాంచితంబును, పాయసాపూపసంపన్నంబును, కలమాన్నపూర్ణంబును, ద్రాక్షాగోక్షీరక్షౌద్రపుండ్రేక్షుఖండ మండితంబును, రంభానారికేళఫల శాకపాకసాకల్యకల్యంబును, పాడబరసావళీపానకప్రచురంబును, శర చ్చంద్రచంద్రికాధవళసమృద్ధంబు నైన భోజనోత్సవంబు...అస్మన్మ నోరథవిహారఘంటాపథంబునై ప్రవర్తిల్లె" నని తనివితీఱ మఱియొక మాఱు విపులీకరించినాఁడు. ఈవర్ణనములో తుదిని వ్యాసునినోట నని పించినాఁడేగాని నిజమునకు "అస్మన్మనోరథవిహారఘంటాపథము" అని తనకుఁ దృప్తిమైనభోజనమునే యుగ్గడించినాఁ డని చెప్పవచ్చును. శ్రీనాథుఁడు భోజనము నెవరిచే నెవరికిఁ బెట్టించినను ఖండశర్కర పాయ సము పెసరపప్పు కమ్మఁగాఁగాచిన ఆలనేయి పానకములు దధిఖండములు లేకుండఁ బోనీయఁడు. కృత్యాదిని లింగమంత్రిని నవీనరుక్మాంగదునిఁజేసి యాతనిచే ద్వాదశీపుణ్యవేళలందుఁగూడ నిట్టిభోజనమునే పెట్టించినాఁడు.

సీ. ఖండశర్కర జున్ను కండచక్కెరలు దో
సెలు వడ ల్సేవె పాసెములతోడఁ
కమ్మఁగాఁ గాచిన కఱిియాలనేతితోఁ
గమనీయపంచభక్ష్యములతోడ
సంభారములతోడి శాకపాకములతోఁ
బక్వమైన పెసర్పప్పుతోడఁ
దేనియధారతోఁ బానకంబులతోడ
శిఖరపాడబరసశ్రేణితోడ
నచ్ఛలవణాదికములతోడ నమృతఖండ
పాండరంబైన దధితోడ బ్రాహ్మణులకు
భోజనము నెట్టు ద్వాదశీపుణ్యవేళ
లింగమంత్రి నవీనరుక్మాంగదుండు. శ్రీను ౧. ౬౦.

ఇంతవఱకుఁ బోనేల! ఓరుగల్లులో పూటకూళ్లయింటిలోఁగూడ నొక రూక కిట్టిభోజనమునే పెట్టించినాఁడు క్రీడాభిరామములో.

ఉ. కప్పురభోగివంటకము కమ్మనిగోధుమపిండివంటయుం
గుప్పెడు పంచదారయును గ్రొత్తగఁ గాచిన యాలనే పెస
ర్పప్పును గొమ్మునల్లనఁటిపండులు నాలుగు నైదు నంజుడుల్
లప్పలతోడఁ గ్రొంబెరుగు లక్ష్మణవజ్ఝలయింట రూకకున్.

ఇట్టి యుదాహరణము లన్నియు శ్రీనాథునిభోజనప్రియత్వమునకే తార్కాణములు. ఈప్రకరణమునందది కొంత యతిమాత్రముగా నడచినది. అప్పుడు వ్యాసునకు శిష్యులకు నేర్పడినయాఁకలియు నట్టిదే.

తరువాత విశాలాక్షీవిశ్వేశ్వరులు మౌనిబృందమునెదుట సాక్షాత్కరించినప్పటి మూర్తివైభవము చిత్తాకర్షకము. ఇరువురకు సమానమైనభూషణాదికము గుణసంపదయుఁ గల్పించి కడు నొయ్యారముగ రంగస్థలముమీఁదికిఁ బ్రవేశపెట్టినాఁడు. ఆమూర్తివిభవము పరికింతము.

సీ. చంద్రబింబానన చంద్రరేఖామౌళి
నీలకుంతలభార నీలగళుఁడు
ధవళాయతేక్షణ ధవళాఖిలాంగుండు
మదనసంజీవని మదనహరుఁడు
నాగేంద్రనిభయాన నాగకుండలధారి
భువనమోహనగాత్రి భువనకర్త
గిరిరాజకన్యక గిరిరాజనిలయుండు
సర్వాంగసుందరి సర్వగురుఁడు
గౌరి శ్రీవిశ్వనాథుండు కనకరత్న
పాదుకలు మెట్టి చట్టలు పట్టుకొనుచు
నేఁగుదెంచిరి యొయ్యార నెసక మెసఁగ
విహరణక్రీడ మాయున్న వేదికపుడు.

భోజనములుపెట్టునపుడుపంక్తులనడుమఁ జరించునప్పటియన్నపూర్ణసౌభాగ్యము ప్రత్యేకముగ నొకదృశ్యమునఁ జిత్రించిప్రదర్శించును. ఆదృశ్యము వ్యాసునకేగాక మనకును భక్తిభావమును గలిగించును. ఆచిత్రణము లోని యొయ్యార మతిసరసము. మిక్కిలి సున్నితము. అన్నపూర్ణాదేవిపాదనూపురఝుళంఝుళనాదములు పద్యములో ప్రతిధ్వనించినవి.

వానికి గిరిక యను పుత్త్రిక యుద్భవింపనిచో జడము లనియే యను కొందుము. జడము లనుకొనిన జడములుగాను చేతనము లనుకొనినఁ జేతనములుగాను గన్పించునట్లు కల్పించియుండెను. వానిని గూర్చి చెప్పునపుడు మనలను జడములనుగాను, మధ్యమధ్య చేతనులను గాను మార్చి వేయును. చివరవఱకు జడప్రకృతిని జేతనచేష్టలను దీసికొనివచ్చును.

కోలాహలుఁడు నదియు దారిని దారసిల్లెదరు. నది యోరచేసికొని యపసరిల్లును. కోలాహలుఁడు తదచ్ఛస్వభావము, సరసత్వము, గభీరతకు నగ్గమయి మరల నదిని జేరును. ఆమెకు మనవిచేయును దన యంతరంగమునఁ గల భావమును.

ఉ॥ నావలనం బ్రియం బెఱిఁగి నన్నొకమాఱును బల్కరింపవే
నేవెన నోరఁజేసికొని యేఁగుదుఁ గాని సరిల్లలామ ! ని
న్నేవగఁ జేరవత్తు మది కింపగునీదు నవోదితామృతం,
బేవగఁ గ్రోలఁగాంతు నని యే నెపుడుం దలపోయుచుండెదన్.

ఉ॥ చెప్పెడి దేమి నాకుఁ గల జీవనమంతయు నీక కూర్చి యె
ల్లప్పుడు నిన్నుఁ బాయక ప్రియాచరణం బొనరింప నేర్తు నీ
చొప్పున కీవు నియ్యకొని చొక్కపుజక్కవగుబ్బలాడి మే
ల్దప్పక యంతరంగమునఁ దార్చి నన్ను నదీను జేయవే.

నవోదితామృతము వలయు నఁట. తనకుఁగల జీవితమంతయు నామె కిచ్చివేయునఁట. ప్రియాచరణముచేయునఁట. అంతరంగమునఁ దార్చి తన్ను నదీనునిగాఁ జేయవలె నని కోరును జడముగ.

నదియు నేను నీకుఁ దగ నని బోధించును దనజాడ్యముతో.

సీ॥ నిలువెల్ల నీచాతినీచోపసరణంబు
ప్రకృతి యెల్లను జాడ్యపరిణతంబు
పెంపెల్ల నియతగాంభీర్యమాస విహీన
మంతరం బెల్లఁ బంకావిలంబు

జీవనంబెల్ల నంచితబుద్ధ్యుదయప్రియ
ముదయమెల్లను దుర్దినోన్ముఖంబు
గతులెల్లఁ గుటిలపరికారకారణము లు
త్సేకంబులెల్ల భంగాకులములు

గీ॥ నిలుకడ హుళక్కి తావులు పొలుసువల్చు
నిట్టిమాబోంట్లతోఁ జెల్మి యెట్లు పొసఁగు
నచలితోత్తుంగధైర్యున కలఘుమతికి
ననఘమతికి నభంగశీలునకు నీకు.

ఉ. నావిని గట్టు ఱేఁడు వదనంబున విన్నఁదనంబు దోఁప నో
శైవలినీ శిఖామణి నిజంబు భవత్క్రమనీయ కాంతిధా
రావళిలో మునింగితి దయామతిఁ బ్రోవక సుళ్లఁ బెట్టెదో
నీవిఁకఁ గ్రుచ్చియెత్తి ఘననిర్వృతిఁ దెప్పలఁ దేల్చెదో యనన్.

చ॥ నెలనెలఁ బాఱి శుక్తిమతి వెండియుఁ గొండలఱేనిఁ బల్కు న
గ్గలమగు పంచసాయక వికారమునన్ నిజగౌరవోన్నతుల్
దలఁపవు గాని మాదృశజడస్థితిఁ దెప్పలఁ దేలుచున్న మీ
కులగిరికోటిలోఁ గడు లఘుత్వము గాదె! తలంచి చూడుమా?

అనుసరికిఁ దప్పించుకొనుట కియ్యది యత్నించుచున్నదని యేది యేదియో తెలిసి "సతి కమలాలివట్టు, ప్రబలతలదీర్ఘ భుజశాఖఁ బట్టుటయును.

ఉ॥ వేణి చలింపఁ గంపితనవీనగమ్మృణాల భుజాగ్రి కంకణ
శ్రేణి నటింప లోలశఫరీనిబిరీసకటాక్ష కాంతి వి
న్నాణము చూప హంసకగణక్వణనంబును మీఱ సైకత
శ్రోణి వివర్జితాబ్జముఖియై కడు సంభ్రమించినన్.

మ॥ నిలు వెల్లన్ నిరపాయశంబరమయోన్మేషంబుచేఁ బొంగు ఱాఁ
గలఁగూలంకషగాఢగర్వనిధులం గాతొచు కూల్యంబు బేఁ
దలమే నిల్పఁగ నంచుఁ బ్రతికూల్యపరుషోద్వృత్తిప్రౌఢిఁ గా కంచు
య్యలఘుం డాస్యము జేవురింప నిజకోపాటోప సంరంభియై

ఘట్టమంతయును సొంపుగ నడచినది. తత్రాపి "వేణి చలింప" అను పద్యమున కాసామగ్రి ఉత్తమకళాకారుఁ డగుటచేఁ దనంతట తానే అహమహమికగా వచ్చి యిమిడినది. శబ్దచిత్రములతోను, శ్లేషతోను,స్వభావోక్తితోను, ధ్వనితోను నడిచినవి పద్యములు.ఇంకను గొన్ని అలంకారములతో నందగించినవి పద్యములు. "వేణి చలింప" అనుపద్యము ఒక వ్యక్తిని భయభ్రాంతురాలిని, మానసికరంగములోనికి రప్పించి నటింపఁ జేసెను. ఆపద్యమునుండి యొక ధూర్తునిచే నిలువరింపఁబడి, దీనాతిదీనముగాఁ జూచుచున్న వ్యక్తి తొంగిచూచుచున్నట్లు చేసె నీకవి. ఈపద్యముతో నీఘట్టమునకు జాడ్యము వదలిపోయినది. చేతనమయినది. నటన భావుకాంతరంగములోఁ జేయుచున్నది.

భావా నచేతనా నపి చేతనవ చ్చేతనా నచేతనవత్,

వ్యవహారయతి యథేష్టం సుకవిః కావ్యే స్వతంత్రతయా.

జడములకైనను, చైతన్యముపోయఁగల శక్తి కళాస్రష్ట కున్నది. "వేణి చలింప" పద్యము జడార్థపరమయినపుడు రూపకాలంకార మని యెదరు. అప్పుడు అధికార మంతయును దానిది. చేతన మయినపుడుపమాలంకారముది రాజ్యమంతయు. శ్లేషకూడ వేణి చలింపమున్నగు తావులలోఁ గొలఁదిగఁ బాత్ర వహించినది. కనుకనే శుక్తిమతికిఁ బూర్ణాకృతి వచ్చినది. "బలే" అనిపించినది. ఈపద్యము సామగ్రియున్నది కదాయని యలంకారములతో నిండ వేసికొనలేదు. రసము పరిపుష్టమయినది. అలంకారములు శోభ తెచ్చినవి. కళ పరిపూర్ణరూపము నొందినది కాని యిప్పటికి నా యలంకారములకుఁ బరస్పరము శోభ తెచ్చిన దెవ రను విషయమును గూర్చి వివాదము జరుగుచునే యున్న దనుకొనియెదను.

## అలంకారములు - ఉపమ.

లోకములో యథార్థమగు సుందరవస్తువును జూచి ఆనందించుట సహజము. యథార్థవస్తువు లభింపనపుడు దానివలె నుండి, ఎక్కువగా

నవయవసాదృశ్యము కల వస్తువును జూచి సంతోషించుటయుఁ గలదు. ఇంకొకటి. తానొక వస్తువును జూచి యానందించిన యానందము నితరుల కెఱుకపఱచుటకు నెదిరికిఁ దనకు నిదివఱలో ననుభూతమయినది, ప్రసిద్ధమయినది, తలంపునకుఁ దీసికొనివచ్చుట, లోకములో నున్న యదియు. ఆ తీరునఁ దనకనుభూతమయిన వస్తు సాదృశ్యమును దెచ్చి చెప్పుట యున్నది. అటులఁ జెప్పునపుడే ఉపమాలంకార మని యందురు. అలంకారములు మొట్టమొదట యమక - ఉపమలే అనినవారు లేకపోలేదు. అప్పుడు ఒకటి అక్షరసాదృశ్యము, రెండవది వస్తు సాదృశ్యములోను నిమిడి, సాదృశ్యమూల మయిపోవును. క్రమముగ నలంకారములు హెచ్చిన నీ నాఁడుకూడ నుపమాలంకారమున కన్నిటిలో నించుమించ చధికార మున్నది. అలంకారములన్నియు దీనిమార్పులే. దీని వివర్తమే యనినను దప్పు గానేరదు.

శ్లో॥ ఉప మైకా శైలూషీ సంప్రాప్తా చిత్రభూమికాభేదాన్
రంజయతి కావ్యరంగే నృత్యంతీ తద్విదాం చేతః.
త దిదం చిత్రం విశ్వం బ్రహ్మజ్ఞానా దివోపమాజ్ఞానాత్
జ్ఞాతం భవతీ త్యాదా నిరూప్యతే నిఖిలభేదసహితా సా.

అని అప్పయదీక్షితులు వ్రాసిరి. "యేన విజ్ఞాతేన సర్వ మిదం విజ్ఞాతం భవతి" అను నద్వైతవాదులు నొపనిషన్మతానలంబులు నగు వేదాంతులు ప్రపంచమంతయు బ్రహ్మవివర్తమునది శాస్త్రములచేతను, పురాణముఖమునను, అనుభవముల ద్వారమునను నెట్లు నిర్వచించి చూపిరో యటులనే యీయుపమాజ్ఞానము వలన సాదృశ్యావలంబనము మూలమున నలంకారప్రపంచ మంతయు గతార్థమగుటయే కాక, ప్రపంచ మంతయు వీనితో సహకృతమయియే యుండునని యనినారు. ఇయ్యది తెలిసిన నలంకారప్రపంచ మంతయు గోచరించును. ఈయొక్క చోటనుండి యలంకార ప్రపంచమంతయుఁ దొంగిచూడవచ్చునని యనినారు. ఇదికొంతవఱకు వాస్తవమే యనిపించును. ఈ క్రింది యలంకారములను బరిశీలించిన యథార్థము తెల్లము కాఁగలదు. ఒక్కమాటలోనే యనుకొందము.

1 ఉపమ-చంద్ర ఇవ ముఖమ్
2 ఉపమేయోపమ-చంద్రఇవ ముఖమ్ ముఖమివ చంద్రః
3 అనన్వయము:—ముఖం ముఖమివ
4 ప్రతీపము:— ముఖమివ చంద్రః
5 రూపకము:— ముఖమేవ చంద్రః
6 పరిణామః— ముఖచంద్రేణ తాపః శామ్యతి.
7 సందేహము:— కిమిదం ముఖం ఉతాహోచంద్రః
8 భ్రాంతిమత్తు:— చంద్రఇతిచకోరాః త్వన్ముఖ మనుధావంతి
9 ఉల్లేఖము:— చంద్రఇతిచకోరాః కమలమితి చంచరీకాస్త్వన్ముఖ మనుధావంతి.
10 అపహ్నవము:— చంద్రోఽయం నముఖం
11 ఉత్ప్రేక్ష :— నూనం చంద్రః
12 అతిశయోక్తి:— చంద్రోఽయం
13 తుల్యయోగిత:— ముఖేన చంద్రకమలే నిర్జితే.
14 దీపకము:— నిశి చంద్రః త్వన్ముఖంచహృష్యతి
15 ప్రతివస్తూపమ:—త్వన్ముఖవాహం రజ్యామి. చంద్రఏవ చకోరా రజ్యంతే.
16 దృష్టాంతము:— దివి చంద్రః భువి త్వన్ముఖం.
17 నిదర్శన:— ముఖం చంద్రశ్రియం బిభర్తి.
18 వ్యతిరేకము:— నిష్కలంకం ముఖం చంద్రాదతిరిచ్యతే.
19 సహోక్తి:—ముఖంనేత్రాఁకరుచిరం స్మితజ్యోత్స్న్యావిజృంభితం
20 శ్లేష:— అబ్జేనసదృశం వక్త్రం హరిణాహితసక్తినా
21 అప్రస్తుతప్రశంస:—ముఖస్య పురత శ్చంద్రో నిష్ప్రభః

ఒకయందమగు ముఖమును జూచుటచేఁ దనకుఁగలిగిన అనుభూతిని, దానివలన వెలువడిన ఆనందమును అందఱకుఁదెలియఁ జేయుటకు చంద్రునిఁజూచినవాని కెట్టి యనుభూతి, ఆనందమును గలుగునో, అటులనే యున్నదని చెప్పుటకు, ఎవని కేరీతిని జెప్పిననచ్చుబా టగునో నాయాయివిధములఁ జెప్పుటకయి యిన్నివిధములఁ జెప్ప నవచ్చును.

అన్నిటిలోను సుఖానుభూతి చంద్రానుభూతివంటిదనియే. ఇన్ని మాటలలో నిమిడియున్న ప్రతిపాద్యమింతియ. చంద్రముఖసామ్యము. (ఉక్తి వైచిత్ర్యమునకును నియ్యది యుపయోగింతురు.)

సాధారణధర్మమగు సామ్యమును బట్టి అననుభూతవస్తు చర్వణకళ కుపమ తెచ్చునని యనుకొనవచ్చును. ఉపమను గూర్చి యింతగా వ్రాయుట యనవసరమే- వ్రాసినదికూడఁ దక్కువయే. కానికళాసామగ్రిలో నిదికూడ నొకయంగమే. అంగమే కాదు ప్రధానాంగము కావుననే యింతదూరము వ్రాయుట యుక్తము. కళఅనుభవమునకుఁజెందినది. అనుభవములో నుండియే కళ బయలు దేరును. అనుభవమును గలిగించును. అనుభవమును గలుగఁజేయు సామగ్రిలో నియ్యది యొకటి.

ఏ ఘట్టములోనైనను గలుగు ననుభూతిని, ఆ అనుభూతివలనఁ గలుగు నానందము ఎటులున్నదియో యథాతథముగ ఉన్నదిఉన్నట్లు చెప్పుటయే కవితరము కాదు సరికదా పరమేశ్వరుఁడుగూడఁ జెప్పఁ జాలఁడు. ఎవరికివారు తెలియునదియే.

శ్లో. ఘృతక్షీరద్రాక్షా మధుమధురిమా కైరపి పదై
ర్విశిష్యానాఖ్యేయో భవతి రసనామాత్రవిషయః
తథా తేసౌందర్యం పరమశివదృఙ్మాత్రవిషయం
కథంకారం బ్రూమః సకలనిగమాగోచరగుణే!

అనిరి శంకరులు. తేనెయెటులుండుననిప్రశ్నవైచిన దాని తీయందనము రసనాగోచరమైనది చెప్పఁజాలక ద్రాక్షపండువలె నున్నది యని యనవలసిన దే. ద్రాక్షతీపి యెటులున్నదని యడిగిన 'దేనెవలె నున్నదని యనవలసినదనియ. అటులనే కళాకారుఁడు తానను భవించిన అనుభూతిని, ఆవస్తువు కాల్పనికమయినను, దానినిదెలుపుటకై యుపమాలంకారమును దీసికొనవలసిన దే. దీని వివర్తరూపమగు నెద్దియే నలంకారమును దీసికొనవలసిన దే.

## అనుభూతి—ఉపమ.

ప్రత్యక్ష మెట్టి యనుభూతిని గల్గించునో అనుమానము నట్టి యనుభూతినిఁ గల్గించును. అనుమానమువలనఁ గలుగు ననుభూతికిఁ గారణసామగ్రిలో ముఖ్యమయినది కారణము. ఆ కారణము సరియైనదైనచో నయ్యది యథాతథానుభూతిని గల్గించును. అనుమానము ప్రత్యక్షము నెట్టి యనుభూతి కలిగించునో శబ్దమువలన నట్టి యనుభూతియే కలుగును.

"నసోఽస్తి ప్రత్యయో లోకేయ శ్శబ్దానుగమాదృతే" అన్నవైయాకరణుల యభిప్రాయములో ప్రపంచమంతయు శబ్దమునకుఁ లోబడినదనియే వారియభిప్రాయము. శబ్దమునకు నర్థమునకు ఘనిష్ఠతాదాత్మ్య సంబంధమున్నదనియు, శబ్దములేనిదే ఒకఅడుగైనను బెట్టలేమనియు శాస్త్రజ్ఞులు చెప్పియుండిరి. నిజమయ్యదియ. భాష మొదటలేదు చేష్టలే కాని అని, అను వారిమతములోననుండి, మన భారతజాతి మొదటినుండియు విజ్ఞాన సహకృతమయిన దను వారి మతములో నన్నను, కుఱ్ఱవానికి సజ్ఞనకు వ్యవహారమంతయు 'బోధచేయుటకు శబ్ద ముపయోగించి క్రియాద్వారముననే శబ్దార్థసంబంధము బోధించుచుంటిమి. అజ్ఞాతావస్థలో దూరముగానున్నవి ప్రత్యక్షము చేసికొనుటకు వలనుపడనట్టి విషయములను శబ్దమూలముననే తెలుపుచుంటిమి. అటులఁ జెప్పినపుడు అజ్ఞుఁ డజ్ఞాతవస్తువునుగూర్చి తానొకరీతిగ నొక ముద్ర వేసికొనును. తరువాత నింద్రియములచే సాక్షాత్కరింపఁజేసికొనుటకు వలనుపడు వస్తువును సాక్షాత్కరింపఁజేసికొనును. చెప్పఁగ వినినవిషయమును స్థూలారుంధతీన్యాయముగఁ దెలిసికొని దానివిషయమై యొక యనుభవమును బొందును. ఆ శాబ్దానుభూతి విషయవస్తువొకప్పుడు యథార్థవస్తువుతో భేదమొందినను కొన్నిటిలోఁ జాల సమముగనేయుండును. అనఁగా శ్రీకాశిక ఉత్తరదిక్కునందుఁగలదు. అచట గంగ ప్రవహించుచున్నది. విశ్వేశ్వరమందిరముకలదు. గంగ స్వచ్ఛముగనుండును. అని విన్నవిషయములనే యుండును

ప్రపంచములోనున్న వస్తుజాలమును, విషయముల నవగతము చేసికొనవలయుననిన నెవ్వనివశము గానేరదు. ఈశబ్దజ్ఞానమువలనఁ బరిమితమైనవస్తుజాతము ననుభవములోనికిఁ దెచ్చుకొనఁగలుగుచుండును, ప్రపంచవ్యవహారము నటులుంచి ఈశబ్దము ఇంద్రియగోచరములగునను భూతులనేకాక ఇంద్రియగోచరములుకాని విషయముల ననుభవములోనికిఁ దీసికొనిరాఁగలదని వేదాంతులనిర్ణయము. మీమాంసకులుగూడ దేవతలకు విగ్రహములేదని శబ్దమునందే యజ్ఞాదిక్రతువులకు ఫలజనకమగు శక్తి కలదనియు, దేవతలకు మూర్తి కలదని వర్ణించు వాక్యములు స్తానకములు, ప్రాశస్త్యబోధకములు, ప్రరోచకము లనియు ననిరి. అనఁగా శబ్దముననే ప్రత్యక్షము చేసికొనుటకు కాని యొక్క శక్తికలదనియనిరి. ఆశక్తిజనితవ్యాపారము క్రియాద్వారముననుభవగోచకము కాఁగలదని వారియభిప్రాయము. వేదాంతులుగూడ శబ్దము తాదాత్మ్యేన ఈశ్వరుని బోధించుననియు, ఆశబ్దమును. అనఁగా మహావాక్యములను, ఉపనిషత్సారములగు ఓంకారాదుల నుపాసించువారికి, బ్రహ్మసాక్షాత్కార మభేదముగాఁగలిగి ఆనందాభివ్యక్తి యగుననియు. ఆనందస్వరూపుఁడగు బ్రహ్మయే యగుననియు నుద్ఘోషించుచున్నారు. ఒక్క అక్షరము "ఓం" కారము బ్రహ్మ, బ్రహ్మయేకాదు సర్వాక్షరాత్మకము శబ్దరూపమున, సర్వప్రపంచాత్మకము అర్థరూపమున అనిఓంకార పరబ్రహ్మ ప్రతిపాదకమగు మాండూక్యోపనిషత్తును నీయభిప్రాయమును దెల్లముచేయుచున్నది. "శబ్దాదేవ ప్రమితః" అని బాదరాయణుఁడు. వాగర్థావివ సంపృక్తౌ అని కాళిదాసు. ఈరీతి శబ్దరాజ్యము ప్రపంచమంతయు నున్నయది.

కనుక శబ్దమువలన ననుభవము కలుగును. అనుభవమువలన ఆనందము కలుగును. కనుకనే ప్రాజ్ఞులు మహామంత్రోపాసనలతోఁ గాలము వెడలింతురు. యుగయుగము లుందురు. ప్రాజ్ఞులుమఱికొందఱు వేదశాస్త్రపురాణములతోఁ గడుపుదురు. విజ్ఞులు మాసిక సాప్తాహిక దైనిక, సాంవత్సరిక పత్రికలతో నానంద మొందుచుందురు. ఈరీతిగ నాబాలగోపాలము నీశబ్దము నాశ్రయించి, శాబ్దానుభూతికి లోఁబడియుందురు.

# ఉషాపరిణయము

## సంపాదకీయ భూమిక.

ఈ కావ్యమును రచించినది రంగాజమ్మ. ఇంటిపేరు పసుపులేటి. తండ్రి వెంకటాద్రి. తల్లి మంగమాంబ.

ఈమె తంజావూరాంధ్ర నాయకరాజు విజయరాఘవుని యాస్థానకవయిత్రి. సంగీతసాహిత్యము లొకటిగ నూపెత్తిన విదుషి. విజయరాఘవనాయకాంకిత జీవిత ప్రణయ కావ్య.

విజయరాఘవుని పాలనము. క్రీ. శ. 1633 నుండి 1673 వఱకు నని చరిత్ర. ఇతని రాజ్యత్వమున నాంధ్రభాష యొక వెల్లు వెల్గినది. ఎందఱో సంగీతసాహిత్యసరస్వతుల కితని కొలువు కూటమాటపట్టు. వారిలో రంగాజమ్మది యగ్రతాంబూలము.

ఒకనాఁడు కొలువు దీఱియుండఁగా విజయరాఘవుఁడు దన్ను హరివంశములోని యుషాపరిణయకథఁ దెనుఁగు గావింపుమని కోరినాఁడఁట. ఈ ప్రస్తావమున నీమె పూర్వగ్రంథ ప్రశంస కూడ నున్నది. మన్నారుదాసవిలాస ప్రబంధము; రామాయణ భారత భాగవత సంగ్రహములు; ఇవిగాక కొన్ని యితర మధురపదములు. దీనిని బట్టి యీ గ్రంథ మైదవ రచన యని తెలుచున్నది. మన్నారు దాస విలాస నాటకము కడపటిది. ఉషాపరిణయము దానికి ముందటిది.

మన్నారుదాస విలాస నాటక మింతకు ముందే యాంధ్రసాహిత్యపరిషత్తు ముద్రించినది. దాని పీఠికలో శ్రీ జయంతి రామయ్య పంతులుగారు, 'ఈనాటకము 1660 ప్రాంతమునఁ బుట్టియుండు నేమో' యని తమయూహ వెలిబుచ్చిరి. ఈ యుషాపరిణయ పీఠికాకారులు శ్రీ యస్వీ జోగారావు గారి నిర్ణయచమత్కారమునకుఁ బై యూహకు నెంతయో యంతరము లేదు. తన్ను నుషాపరిణయము వ్రాయఁ

ప్రస్తావించిన నాటి కొలువుకూటమున విజయరాఘవ పుత్రుఁడు మన్నారు దేవుఁడు, మన్నారుదేవుని పుత్రుఁడు చెంగమల దాసు గూడ నున్నట్లు రంగాజమ్మ వర్ణించినది. చెంగమల దాసు గూడ కొలువుదీఱి కూర్చుండు నంతటి వాఁడై యుండఁగా విజయరాఘవుని వయస్సు తృతీయపాదమున బడియుండును. ఒకవేళ చెంగమలదాసు పుత్రుఁ డన్న వాదము సరియైనను జిక్కులేదు. 'నిరవద్య చరిత్రులగు పౌత్రులును' అని పౌత్రు లెందఱో వాకొనఁబడిరి. వీరి విశేషణము గమనింపఁదగినది. చరిత్రప్రశంస వీరు బొత్తిగా బాలురు కాదనుటకు సాక్ష్యము. కావున నీకృతి 1650 పైనఁ బుట్టి యుండవలెను.

పై సందర్భమునసే శతక్రతు చతుర్వేది శ్రీనివాస తాతాచార్యులను, దండనాథుఁడు విజయవెంకటపతిని, తోడి కవయిత్రి కృష్ణాజమ్మను పేర్కొన్నది. అవతారికను, షష్ఠ్యంతములను బట్టి చూచిన, శ్రీనివాస తాతయాచార్యు లనిన విజయరాఘవ రంగాజమ్మలకుఁ బరమభక్తి యని తెల్లమగుచున్నది. రాజగోపాలస్వామి సరేసరి. వారి కులదైవము. విజయరాఘవుఁడు మన్నారు దాసుఁడు; కొడుకు మన్నారు దేవుఁడు; మనుమఁడు చెంగమల దాసు; గోత్రము మన్నారు; సభాభవనము రాజగోపాల విలాసము.

రంగాజమ్మ కృతిభర్త వంశావళిని మన్నారు దాస విలాస ప్రబంధములో వివరముగా విశేషించి యిచ్చుటచే నిందుఁ గ్లుప్తముగా నిచ్చుచుంటి నని, కృష్ణప్ప, తిమ్మ, తిమ్మప్ప, చెవ్వ, అచ్యుత, రఘునాథ, విజయరాఘవ నాయకుల వరుస నొకటిచ్చినది. ఇది పూర్వము నుండి యుత్తరోత్తరము పితృపుత్ర న్యాయముగ గ్రహింపవలెను. చివర విజయరాఘవ నాయకుని పుట్టుకను జాలఁ జమత్కరించి యున్నది. రఘునాథ నాయకుఁడు వసుదేవనందుల యాత్మ లఁట. చెంజి లక్ష్మ దేవకియుఁ, గళావతమ్మ యశోదయు నఁట. కస్తూరి రంగఁడు

చెంజిలక్ష్మి కలలోఁ గన్పడి యానాఁడు దేవకి కడుపునఁ బుట్టి యశోద యొడిలోఁ బెరిగితిని. ఈనాఁడు కళావతమ్మ కడుపునఁ బుట్టి నీ యొడిలోఁ బెరిగెదను; స్వీకరింపుము' అని మాయమైనాఁడఁట. ఆ కృష్ణుఁడే విజయరాఘవుఁడఁట.

విజయరాఘవుఁడు బహు గ్రంథకర్త. బహు కృతి భర్త. సంగీత సాహిత్య రసబ్రహ్మ.

దక్షిణాంధ్రయుగము తెల్గుభాషకు నొక యపూర్వ ఘట్టము. ప్రబంధములు గాక పదములు, యక్షగానములు, వచనములు నను విశిష్టతలతో నీ నాఁటి తెల్గు సాహితి త్రిస్రోతస్సుగాఁ బ్రవహించినది. తద్రస గంగాధరుఁడు విజయరాఘవుఁడు.

తొలిదొల్త దక్షిణాంధ్ర సాహిత్యమును గుఱించి యాంధ్రలోకమునకుఁ దెలియఁజేసిన దాంధ్ర సాహిత్యపరిషత్తే. ఈ యశస్సు శ్రీ జయంతి రామయ్యపంతులుగారిది. కాలక్రమమున నాంధ్రసాహిత్యపరిషత్తు మధురాతంజావూరాంధ్రకవుల రచనలు—వచన జైమినిభారతము, మన్నారుదాసవిలాస నాటకము, కవిజనోజ్జీవని, రఘునాథరామాయణము నిటీవల రాధికాసాంత్వనమును బ్రచురణ చేసినది

ఈ గ్రంథముద్రణకు నాంధ్రసాహిత్యపరిషత్తున నొక వ్రాతప్రతి మాత్ర మున్నది. ఇది తంజావూరి సరస్వతీమహాలు నందలి 283 సంఖ్యగల తాళపత్త్రమునుండి వ్రాయఁబడినది. ఈ తాళపత్త్రమున 110 పుట లున్నవి. తప్పులు లేవు. వ్రాత మంచిది. శైథిల్యము హెచ్చు. గ్రంథాంతమునఁ గొన్ని పత్త్రము లత్యంత జీర్ణములు. మూఁడాశ్వాసములు మాత్రము సమగ్రముగ నున్నవి. నాల్గవ యాశ్వాసము గొంతవఱకున్నది. గ్రంథపాత మున్నది. పరిషత్తున నున్న ప్రతి దీనికి యథా తథమే. దీని లేఖకు నిద్దరు. శ్రీ పి. బాలసుబ్రహ్మణ్యం,

టి. ఎస్. వెంకట రామయ్యగారు. ప్రథమమున ప్రారంభము నుండి 99 పుటలు వఱకు వ్రాసిరి. శేషమును ద్వితీయులు పూర్తి చేసిరి. సుబ్రహ్మణ్యంగారి లేఖనవైఖరి చాలఁ జక్కనిది. మన్నారుదాసవిలాస నాటకమును గూడ నాంధ్రసాహిత్య పరిషత్తునకు వ్రాసి యిచ్చినది వీరే. ఈ రెండు వ్రాత ప్రతుల ముఖపత్రమున నిట్లు వ్రాసియున్నది.

'నళనామసంవత్సర చైత్రశుద్ధ ౧ (ప్రతిపద్) భానువాసరం మధ్యస్థసేనాధురంధర రాజశ్రీ రామయ్య వరాహప్పయ్య దీక్షితులవారి ఆజ్ఞా ప్రకారం, పద్యకావ్యం'

తర్వాతఁ బ్రతి స్థితి వివరణ లివ్వఁబడినవి. ఆంధ్రనాయక రాజ్య మంతరించిన పిమ్మట, మహారాష్ట్ర పరిపాలనములో శరభోజీ ఫౌజుదారైన రామయ్య వరాహప్పయ్య దీక్షితులచేఁ గొన్ని తాళపత్ర గ్రంథములు సంపాదింపఁబడినట్లు శ్రీ జయంతి రామయ్యపంతులుగారు 'ఆంధ్రచరిత్ర పరిశోధనమండలి'పత్రికలో (సంపుటి 2 పుట 174) బ్రకటించిరి. ఈయన వేఁగినాఁటి బ్రాహ్మణుఁ డఁట. ఆయనయే యీయన యేమో.

ఇప్పు డీ యుషాపరిణయ ప్రబంధమును బ్రచురించి సహృదయుల కందఁజేయుచున్న పరిషత్కార్యదర్శులు బ్రహ్మశ్రీ చతుర్వేదుల సత్యనారాయణశాస్త్రిగారికి శ్రీమాన్ ప్రతివాద భయంకర పార్థసారథిగారికి, నితర సహృదయపారిషదులకుఁ, బీఠిక వ్రాసియిచ్చిన శ్రీ యస్వీ జోగారావుగారికి నా యభినందనములు.

ఆంధ్రసాహిత్యపరిషత్తు -
కాకినాడ
1- నవంబరు, 1953.

వద్దిపర్తి చలపతిరావు.
మే నే జ రు.

# ఉపన్యాసము

## రంగాజమ్మ

### ఉషాపరిణయ పీఠిక.

ఆంధ్రవాఙ్మయ చరిత్రమున దక్షిణాంధ్రయుగము కాలపరిమితిని (క్రీ. శ. 1600—1775) బట్టి సుదీర్ఘము, కవితా పరిణతిని బట్టి కడు విలక్షణము నైనది. ప్రక్రియావైవిధ్యము, కళావతుల కవితాకేళి, రసికశేఖరు లైన రాజకవుల పరంపర, శృంగారరసాధిదేవతారంగస్థలములు లలితకళాఫలభూములు నగు వారి యాస్థానములు నా యుగవిశిష్టతలు. అట్టి దక్షిణాంధ్రయుగ సాహిత్యవాహినీ తీరమునందు తీర్థభూతము లైన ఘట్టములు తంజావూరు, మధుర, పుదుకోట, మైసూరు- సంస్థానములు. అందు, తంజావూరా విశిష్టతల కెల్ల నెల్ల యైనది. అసలా యుగమున కుగాదిపండుగ జరిగినది తంజావూరిలోనే. నాయకరాజులకోవకు నాయకమణి యైన రఘునాథరాయ లా యుగావిష్కర్త. కాని యంతటి వాని యాస్థానకవయిత్రులు (రామభద్రాంబ, మధురవాణి) నేలకో గీర్వాణముతో నూరకుండిరి గాని యాంధ్రమున గ్రంథరచన గావింపరైరి. తరువాత నాతని కౌరసుఁడు, నంతకంటె సరసుఁడు నైన విజయరాఘవనాయకుని రాజ్యకాలమున (క్రీ. శ. 1633-1673) నాంధ్రగ్రంథరచన చేసిన కవయిత్రు లనేకులు బయలుదేరిరి. వారిలోఁ బేరుప్రతిష్ఠలు గలవారు పసుపులేటి రంగాజి, రావినూతల కృష్ణాజి. కృష్ణాజి యాంధ్రకవితానిష్ణాత యని వినికలిమే గాని యామె కృతుల కనుకలి యబ్బలేదు.

ఇఁక రంగాజిచరిత్రి రసికుల కొక ముచ్చట. ఆమె తండ్రి వేంకటాద్రి; తల్లి మంగమాంబ. ఇష్టదైవతము రాజగోపాలుఁడు, 'ఉరఫు' రాజమన్నారు. ఆ మన్నారుదాసుఁడు విజయరాఘవభూపాలుఁ డసలు తన పతి యనియే రంగాజమ్మ బడాయి కొట్టుకొన్నది గాని యది వట్టి మాటవరుస. అతఁ డామె కభీష్టకృతిపతి. అతని యాస్థానమున నామెకు పట్టమహిషులకును బట్టని యోగము పట్టినది. అది యొక గాథ. పత్రికాలేఖనము నందు, పదకవిత్వమునందు, రాజనీతియందు, బహుభాషావైదుషియందు నందెవేసిన చేయి యామెది. రంగాజి రాజసభలో నెప్పుడైన గజ్జె కట్టినదో లేదో గాని యభినయసంగీతాదికళామర్మములు నామె కచుంబితములు గావు. వెన్నతోఁ బెట్టిన విద్యలు సరేసరి. మన్నారుదాసవిలాసనాటకమున సాగిన శాస్త్రప్రసంగములనుబట్టి యామె వ్యాకరణజ్యోతిశ్శాస్త్రవిత్త్వమును విశద మైనది. ఇన్ని మాట లెందుకు—ఆమె విద్యల గజ్జెలగుఱ్ఱము, కళల కాణాచి. ఆమెయు నా దక్షిణాధీశు[1] ముత్యాలశాల దీనారటంకాలఁ దీర్థ మాడించినది. ఇతర పూర్వాంధ్రకవయిత్రు లెవ్వరు నింత పాండిత్యము గలవారు కారు; ఇన్ని కృతులు రచించినవారును గారు.

ఆమె కృతులు గ్రంథాంతగద్యలను బట్టి మన కెఱుకపడినవి యాఱు. అవి రామాయణ భారతభాగవతకథాసంగ్రహములు, మన్నారుదాసవిలాసము పేరిట నొక ప్రబంధము, నొకయక్షగాననాటకము, నీ యుషాపరిణయము. అందు మొదటి మూఁడు నిపు డుపలబ్ధములు గావు. మన్నారుదాస విలాస నాటక మాంధ్రసాహిత్యపరిషత్తుచేఁ బ్రచురింపఁ బడినది. అంతకు ముందే రచింపఁబడినను నా పేరింటి ప్రబంధ మిప్పు

1. మ. దా. వి. నాటకము 49 వ పుటలో విజయరాఘవపరముగ 'దక్షిణరాయ' యను సంబుద్ధి గలదు.

డప్పుడే తంజావూరి తాఁకితోఁపు దాటి వచ్చినట్లు లేదు. ఆ రెంటికి నడుమ రచింపఁబడిన యుషాపరిణయ మిదిగో యిన్నాళ్ళ కచ్చుమొగము జూడ నోచుకొన్నది. అదియు గ్రంథము సమగ్రముగా లభింపలేదు. కాని కథ తుదముట్ట వచ్చినది; అట్టే లోపించియుండదు. అసమగ్ర మని ముద్రింపక యుపేక్షించినచో నున్నదియు నుత్సన్నము కావచ్చును. అదియుఁగాక మనకున్న కవయిత్రిల కృతులే తక్కువాయె. అందును రంగాజికృతులందు నాయకరాజులకు సంబంధించిన చారిత్రికాంశములు గలవు. అందుచే మన్నారుదాసవిలాస ప్రబంధమును వెంటనే ప్రకటింపఁదగినది.

ఉషాపరిణయ రచనాకాలనిర్ణయమున కూహము వినా మఱి యుపాయము లేదు. మన్నారుదాసవిలాసనాటకమే రంగాజమ్మ చరమరచన. అందుఁ బై కృతు లన్నియుఁ బేర్కొనఁబడినవి. ఆ నాటకరచనా కాలమును గచ్చితముగాఁ జెప్పఁబడలేదు. కాని యేదే నొక కథాసందర్భమును బురస్కరించుకొని యే వివాహాదికసంకల్పపరముగనో, యనఁగాఁ బరోక్షపద్ధతిని, రచనాకాలమును సూచించుటయు నొక శిల్పవిన్యాసమే గనుక నాఁటి కవు లా పరిపాటిఁ బాటించిరి. రంగాజమ్మయు రాజగోపాలస్వామి ఫాల్గునోత్సవ శ్రీముఖమున (నాయక రాజులు తమ యిలువేల్పగు రాజమన్నారునకు 'పంగుని తిరునాళ్లు' జరిపించుట యాచారమై యుండెడిది) 'శుభకృ'త్సంవత్సరమును బేర్కొన్నది. అది విజయరాఘవుని రాజ్యపాలనకాలమున, క్రీ. శ. 1664 వ సం॥గా గుర్తింపఁబడినది. అదే మన్నారుదాసవిలాస నాటకరచనాకాలము గావచ్చును. ఉషాపరిణయము తత్పూర్వరచన కావున, క్రీ.శ. 1664 నకు ముందే రచింపఁబడియుండు ననిమాత్రము చెప్పవచ్చును.

రంగాజమ్మ రచనలలోఁ గ్రమమును బట్టి యైదవ దైనను (మొదటి నాల్గు నందు పేర్కొనఁబడినవి) గవితాగౌరవమును బట్టి యుషాపరిణయమే ప్రథమగణ్య మైనది. మన్నారుదాసవిలాసనాటకమును యక్షగానవాఙ్మయమున మిగుల విశిష్టమైనదే. విజయరాఘవున కతిప్రియమైన సాహిత్యప్రక్రియ యక్షగానమగుటచే నాఁడు ప్రబంధరచన వెనుకఁబడినది[1]. మన కిప్పుడు లభించు ప్రబంధము లతని నాఁటివి మూఁడే-చెంగల్వ కాళకవి రాజగోపాలవిలాస మొకటి, రంగాజమ్మవి రెండు. ఆ కొలఁదిపాటి ప్రబంధములలో రంగాజమ్మ యుషాపరిణయ మొక నిక్కంపు మంచి నీలమని చెప్పవచ్చును. కథావస్తువు, యథాప్రాబంధికమైన వర్ణనాఫక్కికయుఁ బరిచితపూర్వము లనుట తప్ప తత్సంవిధానమునఁ గాని రచనావైచిత్రియందు కాని యామె యొకరి ననుకరింపలేదు; ఆమె నొకరనుకరింప లేదు.

ఆమె కవితా చాతుర్యమునకు నికషప్రాయములగు కొన్ని సందర్భములు: కలవలని కలవరమునఁ జెలులచే శైత్యోపచారములు స్వీకరించుచున్న యుష యొకపరి కలఁ గలసిన వాఁడు కట్టెదుటఁ గనఁబడినట్లు భ్రమపడును. ఆ భ్రమ ద్వితీయాశ్వాసమున సుదీర్ఘముగా నాలు సీసములలోఁ జెప్పబడినది. చిత్రపటములో నుష కనిరుద్ధుఁడు చిక్కినాఁడు. కాని చిత్రరేఖ యామె 'మనం బరయుటకై' అబ్బో దవ్వులనున్న ద్వారకనుండి యనిరుద్ధునిఁ దెచ్చుట నావల్ల కాదనును; ఉష యుస్సు రనును. ఆ భ్రమలో నా యసురుసురులో భావోద్విగ్నమై యుషారమణి ముగ్ధాత్వము మూర్తికట్టినది. ఉషా

1 ప్రబంధములును, యక్షగానములుగాఁ బరివర్తింపఁ బడినవి నాఁడు. రంగాజమ్మ మన్నారు దాసవిలాసము, విజయరాఘవుని రఘునాథనాయకాభ్యుదయము నట్టివే.

నిరుద్ధుల సరసము రసోత్తరముగా సాగినది; అందు ప్రణయ కలహఘట్టమే పదిపద్యములు పట్టినది. అనిరుద్ధుఁ డదృశ్యుఁడైనప్పుడు రాణివాసమునఁ గలకలము పుట్టిన పట్టును రక్తి కట్టినది. యుద్ధఘట్టము నొక యాశ్వాసమున కాశ్వాస ముదాత్తముగా నడచినది. కొంత కొఱవడినది గాని పరిణయఘట్టమును సరసముగా నడచియుండును. (రంగాజమ్మ పెండ్లిలో నాడుటయే గాని పెండ్లాడి యెఱుఁగక పోవచ్చును. కాని యామె కావ్యమునఁ బెండ్లిండ్లు వర్ణించుటయందు మిగుల నేర్పరి. ఆ విషయము మన్నారుదాసవిలాస నాటకమువలన ఋజువైనది)- పలకబారిన పదబంధములతో హృదయ మూకొట్టు భావవ్యక్తులతో నుషాపరిణయమున, ప్రత్యేకముగా నుదాహరింపఁ బనిలేదు, పద్యము లెక్కడ పట్టినను మార్దవ ముట్టిపడుచుండును. ఆమె శయ్యాసౌభాగ్య మట్టిది. రంగాజమ్మ శృంగారరసాభిజ్ఞత యనుభవాత్మక మైనది. అసలు దక్షిణాంధ్రకవు లందఱు ననుభవసిద్ధులైన రసికులు. ముందు నాఁటి కవులందు శ్రీనాథ ధూర్జటి ప్రభృతులు కొద్దిమంది తప్పఁ దక్కిన కవుల శృంగారరసాభిజ్ఞతి యుపజ్ఞామూలకమైన యూహాగానమే. ఇంకొక విశేషము- తంజావూరికావ్యములలోఁ దఱచు సమకాలిక జాతీయజీవనప్రతిబింబనము గన్పట్టును. ఉషాపరిణయముననుు నట్టి సందర్భములు గలవు.

ఉదా :-

1. శ్రీకృష్ణుని కొలువుసింగారము, ననిరుద్ధుని యలంకరణము నాయకరాజుల నగరిముస్తీబుఁ దలపించుచున్నవి, నాఁడు మగవారికిని సిగలో సంపెగలు ముడుచుకొనుట యొక ముచ్చటయఁట !

వారి దుస్తులు : బురుసారుమాలు, బురుసాహిజారు, పసిఁడివ్రాఁత చెఱఁగుపట్టి, దుప్పటివలె వాటు మొ॥

వారి సొమ్ములు : చొక్కాలు, కంటసరులు, చేసరులు, తాళి, వంకి, బిరుదుపెండెము మొ॥

2. ఉషబాల్యక్రీడలు :

గుజ్జనగూళ్లు, బొమ్మలపెండ్లి, దాగిలిమ్రుచ్చులు, చెండుగోరింతము, గుజగుజరేకులు, పగడసాల, చదరంగము. ఇవియు నాఁటి పిల్లకాయల ఆటలే)

3. ద్వితీయాశ్వాసమున నుషాసఖుల సంగీతమేళ సందర్భమునఁ బేర్కొనఁబడిన వాద్యవిశేషములు :

దండె, తంబుర, స్వరమండలము, రబాబు, పేరిటుగజ్జెలు,ముఖవీణ, ఢక్క, చెంగు, కామాచి, ఉపాంగము, కిన్నెరవీణ, తాళము, పిల్లఁగ్రోవి, చిటితాళము, రమ, శేషనాదము, రావణహస్తము, చంద్రవలయములు, మురజము.

4. తృతీయాశ్వాసమున - వైతాళీయ గీతములు :

దేవగాంధారి, దేశాక్షి, మలహరి, గుండక్రియ, లలితగుజ్జరి మొదలగు నుదయరాగములలో సాగినవఁట. ఆ వాద్య రాగముల ప్రసక్తిలో నాయకరాజుల కొలఁవు భోగాల వారి సంగీతసాధనయే స్ఫురించుచున్నది

5. ఆ మేలుకొలుపులకు లేచిన రాచవారు చూచుకొను శుభశకునములు :

అద్దము, క్షీరకలశములు, అలరుసరులు, కపిలగోవు, విప్రయుగము.

ఆ దర్పణావలోకనాదికము నాయకరాజులకుఁ గర్ణాట ప్రభువులనుండి సంక్రమించిన సంప్రదాయము[1].

6. గ్రంథమధ్యమునఁ బ్రసక్తులైన నాఁటి రాజకీయోద్యోగులు :

అన్నగారులు, హెగ్గడికత్తెలు, అవసరాలవారు, గురిదొరలు.

7. 'తుంటవిల్ రాయల దాడి' నాయకరాజుల దండయాత్రల కొక సూచన :

8. చతుర్థాశ్వాసమున గరుడాళ్వారు ప్రశంస మూఁడు

1. చూ. రాయవాచకము (ఆం. సా. ప. ప్రచురణ)-2వ పుట

పద్యములలోఁ గలవు. గ్రంథారంభమునను గరుడస్తుతి గలదు. దానితోపాటు చెంగమలామన్నారుల, శేషవిష్వక్సేనుల, పన్నిద్దరాళ్వారుల, వేదాంత శ్రీనివాసదేశికుల ప్రశంసలును గలవు. మఱియు విజయరాఘవు నుద్దేశించి 'పరమతంబుల నెల్ల నిరసించి యే మేటి వైష్ణవమతమె శాశ్వతము జేసె' నని గలదు. నాయకరాజులకుఁ గులాచార రాజకీయవ్యవహారములతోపాటు వైష్ణవమును గర్ణాటప్రభువులనుండి వచ్చినదే. రంగాజమ్మ దెల్లను రాజుగారి నుతమే.

మఱికొన్ని విశేషములు : గ్రంథము సందు సీసపద్య ప్రాచుర్యమగుపించును. దక్షిణాంధ్రకవులకు సీస మన్న వల్లమాలిన మక్కువ[1]. 'అచ్యుత' శబ్ద మొకటి యిందుఁ బ్రాసఘటితముగాఁ బ్రయోగింపఁబడినది. అది యునా కవుల కభిమతమైన యొక వైకృతరూపము[2]. బీగముద్రలు బిక్కబీగములు, వద్దికి మొ॥ ప్రయోగములును గమనింపఁ దగినవి.

ఆంధ్రవాఙ్మయమున నుషాపరిణయకథ ప్రచురప్రచారము గల కావ్యవస్తువులలో నొకటి. అట్లగుట కా కథయందు మధురోదాత్త రసరాజములగు శృంగారవీరములు రెంటికిని విశేషప్రసక్తి గల్గుటయే కారణము. ఆ కథకు సంస్కృతమూలములు హరివంశము, భాగవతము. అవియుఁ దెనుఁగునకు

1. పద్యసంఖ్యను బట్టి శతకప్రాయమైన సముఖము వేంకటకృష్ణప్పనాయకుని రాధికాసాంత్వనము నందు పాతిక పద్యములు సీసములే.

2. ప్రాసఘటితముగనే "అచ్యుత" శబ్దమునకుఁ బ్రయోగాంతములు:
అ. సముఖము రాధికాసాంత్వనము (ఆం. సా. ప. ప్రచురణ)-8వ పద్యము
ఆ. రఘునాథ నాయకాభ్యుదయము (తంజావూరు సరస్వతీమహాలు ప్రచురణ), లో నైదు పర్యాయములు ప్రాసఘటితముగానే ప్రయుక్తమైనది. శ్రీ మల్లంపల్లివారి పీఠికలో నవి యెత్తి చూపఁబడినవి.

దిగినవి. అవి యెఱ్ఱన సోమనల హరివంశములు, పోతన భాగవతము. అందు సోమన యుషాపరిణయ ఘట్టముపైఁ బ్రత్యేక శ్రద్ధ చూపినాఁడు. అది రసబంధురమై ప్రబంధపాకమునఁ బడినది. పింగళి సూరనార్యుఁడును నుషాపరిణయగాథను మనస్సునందుంచుకొనియే ప్రభావతీప్రద్యుమ్నమును రచించెనని యభియుక్తుల యభిప్రాయము. అదిగాక యాంధ్రమునఁ గేవల మా గాథ నితివృత్తముగా గ్రహించిన గ్రంథములు పదికిఁ బైగా నున్న యాధునిక నాటకములు గాక పూర్వకవులవే నాలుగు ప్రబంధములు, నొక ద్విపద, యక్షగానము లొక 'దస్కము' నగుపించుచున్నవి. అందు ప్రబంధములలోఁ జెప్పఁ దగినవి రంగాజమ్మ కృతియు, కనుపర్తి యబ్బయామాత్యుని యనిరుద్ధ చరిత్రమును.

రంగాజమ్మ హరివంశకథానుసారముగ రచించెను. అబ్బయ భాగవతకథాసంవాదిగాఁ బ్రపంచించెను. రెండింటికిఁ గల భేద మిటఁ బ్రసక్తము. హరివంశమున నీ కథ విపులముగను, భాగవతమున సంగ్రహముగను గలదు. హరివంశమున నున్న శాంకరీవరప్రసక్తియు, ననిరుద్ధహరణోద్యోగమున నున్న చిత్రరేఖ నారదునితో మంతన మాడుటయు భాగవతమున లేవు, ఉషాస్వప్న మన్నిట నున్న విషయమే కాని యెఱ్ఱన హరివంశమున మాత్ర మనిరుద్ధుఁడు కూడ నుషవలెఁ గలఁ గాంచుట గలదు. రంగాజమ్మయు భాగ్యాంతరమున నీ విషయము నుట్టంకించినది. హరివంశ భాగవతములకుఁ గల యాయా భేదములే రంగాజమ్మ, అబ్బయల కృతులకును గలవు. కథైక్యఘటనమున రంగాజమ్మయుఁ, గవితాప్రౌఢి యం దబ్బయయు నధికులు. అబ్బయ రంగాజమ్మ కర్వాచీనుఁడే కాని యా కాలమునఁ దక్కిన

యుత్తరాంధ్రకవుల వలె దక్షిణాంధ్రకృతుల నెఱుఁగఁ దను కొందురు. శ్రీ కురుగంటి సీతారామయ్యగారు రంగాజమ్మ కృతిని ప్రశంసించుచు నది 'అబ్బయామాత్యుని యనిరుద్ధ చరిత్రకంటె సర్వవిధముల మే లని చెప్పుటకుఁ దగినదై యున్న' దని వక్కాణించిరి. రంగాజమ్మ కృతి ముక్కుమొగ మెఱుఁగకయో మఱియొకరు, సందు దొరకినఁ జాలు మగకవుల నగతాళి చేయువా రా మాట పట్టుకొని, యింకను నొక్కి వక్కాణించినారు. ఎవరి ప్రవృత్తికి సన్నిహితమైన కథపట్టున వా రొకరి నొకర తిశయించిరి. అంతమాత్రమున నట్లు 'సర్వ విధముల మే' లనుట వట్టి ముఖావాదము. కనుపర్తికవియు, 'చతురకవిత్వతత్త్వపటుసంపద యొక్కరి సొమ్ము గా' దని పంతము పట్టి వ్రాసినాఁ డనిరుద్ధచరిత్ర. అదిగాక, వసుచరిత్ర కొక మానసపుత్రి యైన శృంగారవత్చరిత్రను 'కవిరాజమనో రంజనము'గా రచించిన వాఁడతేఁడు. కాని యొక్కమాట-నాయిక పేరఁ బ్రసిద్ధమైన కావ్యవస్తువును గ్రహించి. నాయక నామ ముంచుట యంత సముంజసము గాదు.

కురుగంటివారు మఱి యొక మాటయు ననియున్నారు. రంగాజమ్మ కృతి 'రాధికాసాంత్వనము (ముద్దుపళని కృతియని వారి యుద్దేశమనుకొందును) కంటె సహృదయహృదయాహ్లాద కరమై, సభ్యమై యొప్పారుచున్న' దని. అంతకంటె సభ్యమై యున్న దనుట కభ్యంతరము లేదు. విషయాంతరతరప్రత్యయము నకే విప్రతిపత్తి. ముద్దుపళని కవిత్వమున నెంత యొంగిలిపడినను రసికత్వమున రంగాజమ్మకుఁ దీసిపోదు. అస లిరువురు నొక్క కోవలోని వారు - రసప్రసన్నకవనలు, రాజభోగైకజీవనలు.

# ప్రస్తావన

ప్రతి కృతికిని కొంత ప్రత్యేకత కలదు. తరతరాలుగా రసిక హృదయముల నాకర్షించుచుండుటయే తార్కాణ. ఈ యుషా పరిణయమునకును - తాళపత్త్రజీవితకాళరాత్రి గడచినది, ముద్రణ మను యుషఃస్ఫురణ గల్గినది. ఇఁక రసికప్రశంసోదయరాగరమణీయ మగుటయే తరువాయి. అదియు నచిర కాలమునఁ దీరునుగాక.

ఆం||
పరిశోధనశాఖ, వాల్తేరు
1- నవంబరు, 1953.

యస్వీ జోగారావు,
బి. ఏ. (ఆనర్సు)

బాలకునివలన చింతాపరిత్యాగసుఖంబును, కుమారికవలన సంగ త్యాగంబును, శరకారునివలనఁ దదేకనిష్ఠత్వంబును, సర్పంబువలన బరగృహనివాసంబును నూర్ణనాభంబువలన సంసారవినిహతజ్ఞాన విచ్ఛేదంబును, కీటంబువలన లక్ష్యగతజ్ఞానసంపాదకంబును, నభ్య సించి విరక్తుండనై యహంకార మమకారంబులు మాని పుర వనగ్రామ పర్వతంబులయందు సంచరింపుదు. మఱియును. 241

శా. జాయాపత్యధనాదులం దగిలి సంజాత భ్రిమోన్మత్తుఁడై
మాయామయాపశరీరమెత్తి భువిలో మర్యాదవర్జించి, య
న్యాయప్రాప్తి పదార్థ సంగ్రహములం దాసక్తుఁడై మోక్షగో
పాయంబుల్, వెనఁజింతసేయఁడు గుణభ్రాజిష్ణుఁడై మర్త్యుఁడుర్.

సీ. నేత్రముల్ పరకామినీరూపములయందు
రసన తియ్యని పదార్థములయందుఁ
సంగతి చర్మ మాలింగనాదులయందు
శ్రోత్రి మసత్కథాసూత్రమందుఁ
బరికింప నాసిక పరిమళంబులయందు
మానస మన్యాయమార్గమందు
ధీరవాక్యముల సత్కీర్తనంబులయందు
కర మన్యజనధనగ్రహణమందు.

గీ. దినదినంబున రూఢివర్తించుఁగాని
పొలుపుతోడుతలక్ష్మీశుఁబొందలేవు
కానమర్త్యుండు వీని నేకంబుజేసి
నలిననాభుని నేప్రొద్దుఁదలఁపవలయు. 243

సీ. ముదిమి దేహమ్మునపై మోపకరింపకమున్న
జోకమై రోగముల్ రాకమున్న
దిలమైన ( ? ) చీకటుల్ దృష్టిఁ గప్పకమున్న
పరుసనై నర లేరుపడకమున్న

మదిలోన బుద్ధులు చెదరిపోవకమున్న
యొడికమయినలావు చెడకమున్న
ఘనమారుతముల నంగములు దీయకమున్న
ప్రాణముల్ దల్లడ పడకమున్న

గీ. కంఠనాళంపుజాడపైఁ గ్రమ్మి శ్లేష్మ
మగ్గలింపకమున్న దేహాభిమాన
ముడిగి దేహంబు నిజము గాకుంట యెఱిఁగి
సేయవలయును బరలోకచింత నరుఁడు 244

చ. సరసిజ సంభవుండు నిజశక్తిని భూరుహ పర్వతాదులన్
బురపశుపక్షికీటములఁ బొల్పుగ ధాత్రి సృజించి వానిచేఁ
బరువడిఁ దుష్టిఁబొందక శుభంబున బ్రహ్మవిలోకనక్రియా
పరుఁడగు మానవోత్తమునిఁ బన్నుగఁజేసి తరించె వేడ్కలన్ 245

మ. వినుతింపన్ బహుసంభవాంతముల సద్విజ్ఞాన సంపన్నుఁడై
మనుజాకారముఁ బూనియందు వసుధామర్త్యత్వ మంగీకరిం
చినయాజీవుఁడు మృత్యువగ్గలికమై చెండాడుచున్నంతక
న్నను మున్నాఁడిఁ దలంపగాఁవలదె సన్మానమ్మతో మాధవున్

వ. అని యివ్విధంబున నయ్యవధూత నిజవృత్తాంతం బెఱింగించిన విని సంతసంబంది మత్పూర్వుండైన యదువు పుత్రదారధనాదులయందు మోహంబుఁ బరిత్యజించి సమ్యగ్జ్ఞానసమేతుండై పరమపదంబునకుఁ జనియె నని యీయుపాఖ్యానంబు వాసుదేవుం డుద్ధవునకు నానతిచ్చి మఱియునిట్లనియె. 247

క. కలిమిఁదుఁ బుత్రదారా
ప్తులయందు నయంబుఁగూర్మి పొదలుచునుంటల్
కలలోన రాజ్యమేలఁగఁ
గలిగినయట్లరసిచూడఁగా మునివర్యా 248

సీ. వరుసతో శత్రుషడ్వర్గంబుఁ బరిమార్చి
మాత్సర్యమందున మట్టుపడక
కల్లమాటలుమాని ఘనవిత్తసుత వధూ
బాంధవస్నేహంబుఁ బరిహసించి
ధర్మమార్గంబును దప్పి వర్తింపక
లోకమధ్యస్థ మంగీకరించి
ఆకారవిభవ విద్యాకులాహంకార
ములనిక్క మిక్కిలి మోసపోక

గీ. యొడలు వలియించి, నియమసంయుక్తుఁడగుచు
సంతతంబును బుణ్యదేశాశ్రమములఁ
దిరుగులాడుచు భక్తితో గురుపదాబ్జ
యుగము సేవింపవలయు న న్నుతముగ 249

క. బహువిఘ్నంబులఁ జెందక
సహజ జ్ఞానంబుతోడ సత్యవ్రతుఁడై
విహితాచారంబున నరుఁ
డహితాత్ముల యెడ సమత్వమందఁగ వలయున్ 250

సీ. వేద సూక్ష్మార్థంబు వీక్షింపనేరక
కర్మమార్గము మించుగాఁ దలంచి
బుధులుకొందఱు యజ్ఞములచేత నింద్రాది
దివిజులఁ దృప్తిఁబొందించి పిదప
దేవలోకముఁ బొంది దేవాంగనా జనం
బులఁ గూడి తద్గానమునను జొక్కి
వరుస గంధర్వ కిన్నరులు సన్నుతిసేయఁ
బుష్పకారూఢులై పొలుపుమీఱి

గీ. కొంతకాల మీరీతినిఁ గోర్కెదీర
సమరలోకస్థ సౌఖ్యము లనుభవించి
పుణ్యమంతయు క్షీణమై పోవునపుడు
దిరుగ జన్మింతు రుర్విపైఁ దేజముడిగి. 251

సీ. యజ్ఞాతులందు దుష్ప్రజ్ఞాన మేతులై
మహిని సర్వజ్ఞులమంచుఁ గొంద
ఱామ్నాయమార్గ గూఢార్థంబులెఱుఁగక
విధిలేక పశువుల విశసనంబు
నేసి యా పశుపురోడాశ ఖండంబుల
నగ్నిలోపల వేల్చి యఖిలభూత
భేతాళములకు సంప్రీతి తోడుతఁదృప్తి
సమకూర్చు జీవహింసకులు, మీఁద

గీ. నపునరావృత్తికరమైన యట్టి పదముఁ
జెంద నేరక యాత్మవంశీయులైన
యట్టి వారలతోఁ గూడి హర్షముడిగి
పడుదురతి ఘోర నరకకూపములలోన. 252

ఉ. నిర్మలుఁడైన నన్ను మదినిల్పక కొందఱు బుద్ధిహీనులై
కర్మములాచరించి యధికశ్రమ సంకలితాత్ములై మహా
ధర్మము సంగ్రహించి యటఁ దత్ఫలమందు విషక్తచిత్తులై
నిర్మలిభూమిలోన జననంబులఁ బొందుదు రెల్లకాలమున్. 253

ఆ. లోకపతులకైన లోకంబులకునైన
వనజభవునకైన మునులకైన
దివిజవరులకైన దిలముతో (?) నావల్ల
భయము కలిగియుండు భావమందు. 254

సీ. గుణములు కర్మమార్గోన్నతిఁ బుట్టించు
గుణములు సృజియించు గుణగణంబుఁ
గనుక నీజీవుండు గుణసమాకాంతుఁడై
బలిమిఁ గర్మఫలానుభవము సేయు
వరుసతోఁ దద్గుణ వైషమ్యమొందాఁక
నందాఁక నానాత్వమాత్మయందు
నానాత్వమొందాఁక నంతపర్యంతంబుఁ
బారతంత్ర్యంబునఁ బ్రబలియుండు
గీ. జీవుఁడెందాఁక స్వాతంత్ర్య భావమందు
నంతపర్యంత మాదినాయకునివలన
భయము గలదని నరుఁడు తత్వంబుఁ దెలిసి
వేడ్కతోఁ దుత నన్ను సేవింపవలయు, 255

వ. ఇవ్విధంబున వాసుదేవుం డానతిచ్చినఁ బ్రియసేవకుండగు నుద్ధవుఁ
డిట్లనియె. 256

ఆ. అరయ దేహజంబులైనట్టి గుణముల
యందు వర్తమానుఁడైన దేహి
తద్గుణంబుచేతఁ దగ్ధయు దృఢబద్ధు
డగునో కాడో నాకు నానతిమ్ము. 257

క. ఏవిధమున లక్షితుఁడగు
నే విధమునఁ గ్రీడసేయు నేవి భుజించున్
ఏ విధమునఁ జరియించును
జీవుఁడు గుణబద్ధుడగుచుఁ జిత్రచరిత్రా. 258

శా. విద్యావిద్యలు నా శరీరములుగా వీక్షించి యీ రెంటిలో
నాద్యంబై తనరారుచున్నయది మోక్షార్థ్యంబుగాఁ జూడుమా
విద్యానామకమైన వస్తువది సద్విజ్ఞానరూపంబు, త
ద్విద్యాన్యం బపవర్గబంధకరమై వేధించుసుజ్ఞానముల్. 259

వ. మఱియు బద్ధముక్తులకు వైలక్షణ్యంబుఁ జెప్పెద. విరుద్ధధర్మంబు గల రెంటిని నొక ధర్మంబందుఁ బ్రవర్తించువానిగా నెఱుంగుము. ఒక్క మహీరుహంబందు నన్యోన్య మిత్రత్వంబు బొటిల్లుచు నిజ నిలయంబందు సుపర్ణద్వయంబు వర్తించు నందొక్కటి పిప్పలాశి యయ్యె. తదితరంబైన యది యశనఖాదనంబు సేయక బలసమేతంబై యధికంబుగ వర్తించు. నం దవిద్యాసహితంబైనది నిత్యబంధనంబునఁ, విద్యాసహితంబైనది నిత్యముక్తంబయ్యును వర్తించును. ఇట్టి మాయా రూపంబైన మహీరుహంబును సమ్యగ్జ్ఞానంబున నెఱింగి యర్థంబుల నింద్రియములచేత గ్రహింపుచు వికార రహితుండై సంచరించు- పరమయోగి ముక్తుండగు దైవాధీనంబగు శరీరంబుచేఁ గర్మాచరణంబు సేయుచుఁ గర్తృత్వంబు భజియించి జీవుండు బద్ధుండగు ఇట్లు బద్ధముక్తలక్షణం బెఱింగి శయనాసనాటన మజ్జనదర్శనస్నానస్పర్శనాఘ్రాణభోజన శ్రవణాదిగుణంబుల నంగీకరింపని విద్వాంసుండు ముక్తుండగు, మఱియును, 260

సీ. పగగొని పఱదెంచు పశుఘాతకునియందుఁ
    బూజసేయఁగ వచ్చు పుణ్యునందు
రోషహర్షంబులు రూఢిగా వర్జించి
    సర్వమానవులందు సమతఁబొందిఁ
నెలగొని పరులపై నిందాస్తుతులు మాని
    పరపదార్థంబుల వాంఛవిడిచి
అర్థితోఁ బుత్రదారాదిమోహంబుల
    దిగనాడి మదిఁలోనఁ దెల్విగల్గి
గీ. శబ్దమయమైన బ్రహ్మంబుఁ జక్కనెఱిఁగి
తద్గతస్వాంతుఁడగుచు నత్యాదరమున
బాహ్యమంతయు మఱచి యభ్యంతరమున
సంతసంబందు వరయోగి సంతతంబు. 261

గీ. కాన మానవు డన్యమార్గంబునందుఁ
దెలివి వర్జించి రూఢి వర్తించెనేని
ధనము వాంఛించి, విధిలేని తావువెదకు
నతనిరీతిని విఫలత్వమందుఁబిదప.

సీ. క్రమమునఁ గర్మమార్గమున వర్తింపుచు
ఫలమంతయు మదర్పణము సేసి
మన్నామ మనయంబు మదిలోనఁ దలఁపుచుఁ
దుదిముట్ట మద్భక్తిఁ బొదలిబొదలి
సత్సంగతులఁ బొంది షడ్గుణైశ్వర్య సం
పన్నుండనౌ నన్నుఁ బరమయోగి
చిత్తాంబుజాంతర స్థితునిగాఁ దలపోసి
వితతమల్లక్షణాం కితుఁడవగుచు

గీ. మత్ప్రియంబుగ ధర్మకామముల నెప్పు
డాచరింపుచు మత్పరాయణుఁడవగుచు
నఖిలజగమును మద్రూపమని యెఱింగి
పుడమిలోపలఁ జరియింపు భూసురేంద్ర. 262

వ. అని యశోదానందనుండు మందహాసంబునఁ బలికిన ధరణీసురుం
డిట్లనియె. 263

క. ఏ విధమున నీ రూపము
భావంబునఁ దెలియవచ్చు, భక్తియనఁగ నే
భావంబున నుదయించును
శ్రీవర నాకానతిమ్ము చిత్రచరిత్రా. 264

చ. అనిన ధరాసురేంద్రునకు నావసుదేవకుమారుఁ డిట్లనున్
వినుము మునీంద్ర, భావమున వీక్షణసేయుము, నన్ను భక్తితోఁ
గనకమయాంశుకోజ్జ్వలునిగా, జలజాంబుజ ♦ శంఖనందకా
భినుతకరాబ్జుగా విమలబింబఫలాధరుగా నుదారతన్. 265

♦ ఈప్రయోగము తాళపత్రమున నిట్లనే యున్నది.

వ. మఱియు సఖిలజీవులయందు ♦ గృపాలుండవై సత్యంబు దప్పక సర్వదేహులయందు సమత్వంబు భజియించి పరోపకారబద్ధకచ్ఛుండవై కామాహత బుద్ధిసమేతుండవై నిత్యశుచిత్వంబు నొంది పరార్థవిత్తాదులయం దీహమాని మితాహారభోజనుండవై ధైర్యంబు దప్పక శత్రుషడ్వర్గజయంబు కలిగి మత్పరాయణుండవై మత్పూర్వకథిత కర్మంబుల నాచరింపుచుఁ దత్ఫలంబు మదర్పణంబుగాఁ జేయుచు వర్తింపుచు మద్భక్తుండు భాగవతజనదర్శన స్పర్శనార్చనంబులను, దత్పరిచర్యానుకీర్తనంబులను మజ్జన్మకర్మకథనంబులను, మత్కథాశ్రవణంబునను మత్సన్నిధానంబునం బ్రవర్తించు గీతతాండవవాదిత్రాదిమహోత్సవసందర్శనంబులనుం గోరుచు మచ్చేష్టుండై మచ్చరణుండై దేహపతనపర్యంతంబు పరిభ్రమించి యంత్యకాలంబున మద్రూపధరుండై మత్సాయుజ్యంబుఁ బొందు. నివ్విధంబున వైదికతాంత్రికరూపంబులైన మదీయవ్రతధారణంబును, మన్నిలయోపలేపన మార్జనరచనావిశేషంబులును భక్తిసమేతుండై చేయుచుండవలయును. భాస్కరుండును, నగ్నియు, విప్రుండును, ధేనువును, వైష్ణవుండును, నాకాశంబును, వాయువును, నుదకంబును, భూమియు, నాత్మయు నాఁబరఁగు నీ పదియును మత్పూజాస్థలంబులు, ఇందు వేదంబులచేత సూర్యమండలంబును, హోమద్రవ్యంబులచేత ననలంబును, నాతిథ్యంబున విప్రోత్తమును, బాలఘాసకబళంబులచేత ధేనువులను, సత్కారంబులచేత విష్ణుభక్తులను, ధ్యానంబుచేత హృదయాకాశంబులను, ముఖ్యబుద్ధిచేత వాయువును దోయపురస్కృతద్రవ్యంబులచేతఁ దోయంబును మంత్రాదులచేత స్థండిలంబులను, బూజసేయుచు శంఖచక్రశార్ఙ్గగదానందకాద్యాయుధధరుండవైన నన్ను ధ్యానంబు సేయుచు సంచరింపఁగవలయును.

♦ పాఠాంతరము -జీవంబులందు.

చ. పరవశుఁ డైన శౌరిఁ గని
పంకజలోచన రాధికామణిం
దొలఁగు మటంచు వేడికొనఁ
ద్రోయక నాథుఁ డొసంగె నమ్మికల్
పురుషుల కేటి సత్యములు
పూనిక లేదవి పుణ్య మెద్ది నీ
మరు లిటు కొండలై పెరుఁగు
మాత్రమె కాని కురంగలోచనా. 32

వ. అని యి ట్లాడు చిలుకను జూచి. 33

శా. ఏ మేమే వెఱ పింత లేక నె భళా
హేమాంగి యి ట్లాడెనా
యా మాట ల్విని మంచి దం చనియెఁగా
యా ధూర్తుఁడు న్నించె హా
రామా యట్లనె కాని, మంచిపని మే
లాయెఁ మఱే మాయె నా
భామారత్నము దాను గూడి సుఖమై
వర్థిల్లినం జాలదే. 34

సీ. మఱచెనో నా చేత మఱితోక్తు లన్నియుఁ
బలుక నేర్చిన నాఁటి పంజరింపు
ఎంచఁడో నా చేత నెలజంత్రిగాత్రింబు
లభ్యసించిన నాఁటి యనుసరింపు
తలఁపఁడో నా చేతఁ దగు దేసి గుజరాతి
వితి మెఱింగిన నాఁటి వేఁడికోళ్లు
పీడెనో నా చేత వెడవిల్తుశాస్త్రంబు
దెలియఁ బూనిన నాఁటి తెఱవుమఱువు

గీ. గణన సేయఁడో మరుసాము గవనములను
దాను నా చేతఁ బడిన బెత్తంపుఁ బెట్లు
బరులు గని గేరి నవ్వ దబ్బఱమురారి
మాయలకె పొంగె సత్యభామా లతాంగి. 35

గీ. నిన్నఁగుప్పయు నేఁ డొల్లు; నెలఁత తాను
కోరి నా మీఁదనే సేసె కారుబారు[1]
ముక్కుపచ్చలు మానక మునుపె బిరుదు
పెచ్చు పొల తోడఁ గొట్లాడ వచ్చినట్లు. 36

గీ. మంచి పామును బాలోసి పెంచినట్లు
యింత దెలియని దాని నే సంతరింపఁ
దాను పెంచిన పొట్టేలు తఱిమి తఱిమి
సన్నబడు సామ్య మాయెనే చిన్ని చిలుక. 37

అడుకులు దిన్నం తాయెనె ?
కడుపునఁ గు ట్టెత్తు నపుడు గానీ, తానే
కడఁ జనునో వంటయింటను
సుడివడు కుందేలు రేపె చూడుము చిలుకా. 38

గీ. పొల మెఱుంగని నిన్నటి[2] వళికె పడుచు
యింతసేసిన నేఁ జేయ నెంత కాను
వ్రేలు వాచిన ♦ ఱోలంత పెరిఁగె ననిన
ఱోలు వాచిన నది యెంత పోలు చెపుమ. 39

వ. అని మఱియుఁ జిలుకతో నిట్లనియె. 40

---

1. కారుబారు = వ్యవహారము, తొందర, ఇబ్బంది—బ్రౌణ్యమిశ్ర భాషా నిఘంటు.

ప్రయోగాంతరము: ‘కారుబారు సేయువారు గలరే ? నీవలె సాకేత నగరిని’ —త్యాగరాజు

♦ పిచ్చికల—అని తా. ప. ప్ర.

2. వళికె=దీపము—బ్రౌ॥ మి. భా. ని.

( ఱోలెంత పెరిఁగె నవిన — తా ప. ప్ర. పాఠము.

గీ. ఈవు చెప్పిన మాట యొక్కింత యైనఁ
జెవిని బెట్టక దాని నేఁ జేరఁ దీసి
మానిసిని జేసి నందుకు మగుడ నిపుడె
ఫలము తోడ్తోడఁ గైవసం బాయెఁ గదవె. 41

గీ. తన్ను గట్టను దారంబు తానె కొనిన
జాడ నిటు దెచ్చి గోపాలుతోడఁ గూర్చి
చాలఁ జేసిన దీనికి మేలి మెల్ల
బూదిలోఁ జేయు హోమ మై పోయెఁ గదవె. 42

గీ. చెలఁగి కాలిమెట్లు తల కెక్క చందాన
నాదు క్రింది బుడుత నన్ను మించె
వెలయ గ్రుడ్డు వచ్చి పిల్లను బెదరించె
గాన్గఁ ద్రుళ్లుబెద్దె గంత మోయు 43

గీ. కాని పదరకు మిఁక మీఁద దాని మోము
గాన వద్దని శౌరి నాఁకట్టు కట్టి
బింకములు గూల నఱకాలఁ బెట్టి; నేల
రాయు కున్నను నా పేరు రాధ గాదు, 44

గీ. ఒదుగుచును నంగనాచి యై యున్న దీనిఁ
దొలుత రుద్రాక్షపి ల్లని తెలియ నైతిఁ
దేలు నిప్పునఁ బడకుండఁ గేల నెత్త
మీట కుండునె విస మెక్కి మిట్టిపడఁగ 45

గీ. నక్క యురుల లోనఁ జిక్కకొన్న విధానఁ
గోరి మనము చేసికొన్న కతలు
ప్రేగు లోని తీఁట విధ మాయె; ననరాదు
అ తక్షోక తొలఁగి నటుల చిలుక. 46

గీ. అత్తవా రింటి కప్పుడే హారినిఁబంపఁ
దనకు గో రంత యైనను మనసు లేదు
నందు డనుపఁగఁ గని మన మందు కెల్ల
నుబికి తడ సేయ రా దని యుంటిఁ గాని. 47

వ. అని మఱియును 48

సీ. ఆశుకవిత్వంబు నల్లితేనే సరా
చిత్రప్రబంధంబు సెప్ప వలదె
పదచాళిరాగము ల్పాడితేనే సరా
హిత మొప్ప వర్ణంబు లెత్త వలదె
గోటిచేతను వీణె మీటితేనె సరా
కొంచక రాల్ గరఁగించ వలదె
అభినయదేశ్యంబు లాడితేనె సరా
యెత్తిన బిరుదు చెల్లింప వలదె

గీ. వింత వింతగఁ గలసిన యంత సరియె
యెమ్మెకాని మనోభావ మెఱుఁగ వలదె
యేమి నేరని నిన్నఁటి యింత మొటికె
నన్ను విడనాడఁ గోరెనా చిన్నిచిలుక. 49

క. అన విని శుక మిట్లనియెఁ
వనితా యే మందు దీని వగలో త్రుళ్లో
మినుకో గెలివో తెలివో
విను వెన్నకుఁ బండ్లు వచ్చు నిత మాయెఁ గదే. 50

గీ. చూపు లోపల నొక వింత చూపుఁదళుకు
నడుపు లోపల నొక వింత నడుపుబెళుకు
నుండు నునికిని నొక వింత యుండుకులుకు
వచ్చె గద వమ్మ మన యిళా వనిత కిపుడు. 51

గీ. లేని పట్టింపు లెల్లను బూని చాన
నేనె యెదురైన నింతైనఁ గాని చూడ
దల్పునకుఁ గల్మి వచ్చిన నర్ధరాత్రి
గొడుగు దెమ్మన్న కత గాను కోమలాంగి. 52

వ. అను కీరవాణుల కడ్డంబు వచ్చి మధురవాణియగు నొక్క విరి
బోణి మాధుపవేణి యగు దొరసానిం జూచి నెఱజాణతనం
బునం దల యూఁచి చెయి సాఁచి సమయోచితంబుగా ని
ట్లనియె. 53

క. ని న్నెఱుఁగు నెదిరి నెఱుఁగును
దన్నుం దన మట్టు నెఱుఁగు దామోదరుఁ డా
కన్నియకై నిను వేఁడెన
టన్నఁ గ్ మఱి శౌరి, నగరె యహాహా జనముల్ 54

గీ. తగరు కొండమీఁద దాకఁ గోరిన దారి
నెదిరిఁ దన్నుఁ దెలియ కింత పలికె
నింత మీను వచ్చి యెంత మీనును మ్రింగె
నువిదబుద్ధి వెనుక నుండుఁ గాదె. 55

గీ. కుట్టఁ దేలు; కుట్ట కున్నఁ గుమ్మరబూచి
త్రోసిరా జటంచుఁ జేసెఁ జెలియ
దాని వ్రేలు దీసి దాని కన్ను వొడిచి
నట్లు సేయ కున్న నడుగ రమ్మ 56

క. మును నీ విచ్చిన చనువున
నిను నిట్టుల దూల నాడె నేని న్వీనుమా
తన యింటి దీప మం చని
కని ముద్దులు వెట్ట మూతి కాలక పోనే 57

క. నిన్నంటే మానిసి నై
నిన్నే వెలి సేయఁ బూనె నెలఁత బళారే
కొన్నంగడి లోనే విను
మన్నాఁడే మాఱుబేర మవునే చెలియా 58

♦గీ. మాయదారిమాట మది నిజం బని యెంచి
పోలఁతి నమ్మె నానఁబోసికొనియె
తగిలెనా తగిలెను దప్పెనా తప్పెను
నాతి వెఱ్ఱివాని చేతిరాయి. 59

గీ. పడతి మునుదెల్పనా పదింబదియుఁగాను
దాని వినయంపుఁ బోకిళ్ళ తగ నెఱింగి
మానిసిని జేయ వలవదు దీనిఁ జేర్చి
తెలియు నిది మేఁకవన్నియపులి యటంచు 60

వ. అన విని రాధ యిట్లనియె. 61

గీ. దాని నింతయు నన నేల తగవు మాలి
తప్పుతంటల కొడఁబడు దానవారి
నన వలయుఁ గాని తెగనిండ దోనకుఁదీసి
వేయువాఁ డేయ, న మ్మేమి సేయు నమ్మ. 62

క. కలలో నైనను బాయక
కలకాలం బున్న విభుఁడు కసిగాయకు నై
పలుచన చేసె న ట న్నను
జెలియా మగవారి నెమ్మి చెడ్డది సుమ్మీ 63

క. నెఱతన ముడి గింటింటను
దిరుగుచు బతిమాలు హరికిఁ దెఱవలు గఱవా
తిరిపెం బెత్తేవానికిఁ
బెరుగుంగూ డేమి ప్రాతి విధుబింబాస్యా 64

♦ఈఁక తోఁక లేని శ్రీకృష్ణుమాటలు ము. ప్ర. పా॥

గీ. నందసుతుఁడు మున్ను నా మీఁది ప్రేమచే
నొకటి సేయఁ బూని యొకటి సేయు
♦ నత్తమీఁదఁ గన్ను లంగడిపైఁ జేతు
లాయె ననుచుఁ జెలియ లరసి నవ్వ. 65.

సీ. కీరవాణులచేతఁ గిళ్ళకుఁ బంపిన
శిరసా వహించు నో సరసిజాక్షి
నాతి యెవ్వతె యైన నా మేలు వేఁడినఁ
గను లెఱ్ఱసేయు నో కంబుకంఠి
ఎలమి నా కోసమై యెట్టివారల నైనఁ
దెగనాడఁ దలఁచు నో చిగురుఁబోఁడి
యేఁ జూచి చూడక యే మాట లాడిన
మాటాడ వెఱచు నో మందగమన

గీ. తడవు పైకొని పీఠాయితంబు సలుపఁ
జూచి సైరింపఁ జాలఁడో సుందరాంగి
అట్టి శౌరిట్లు కడగండ్లు పెట్టె ననినఁ
దిరుగ బ్రతుకాస వలెనటే తెలుపు మకట. 66

సీ. ఇటు లుండువారల కెడయికల్ వచ్చిన
దనువులు నిలుచునే యనినమాట
నిను బాసి యెట్టివారిని విలోకించినఁ
గను దాలి యుండ లే దనినమాట
నీ పొత్తు మాని నే నేడ భుజించిన
నాహార మింపు గా దనినమాట
యలుకువచే నీవు నవలి మో మాయినఁ
గనులకు నిదుర రా దనినమాట

♦అత్తనెత్తిఁ జేతు లంగడిపైఁ గన్ను. ము. ప్ర. పా.

గీ. కరుణ దైవాఱ బిగిమీఱఁ గౌఁగిలించి
మానినీమణి వేయి జన్మాల కైన
వినుము నీ మేలు మఱువ లే నని నమాట
మఱచెనో శౌరి తగు నిళామాయ మీఱి 67

క. అను వనితామణి పలుకులు
విని కీరం బిట్టు లనియె విమలాంగి వినే
వనజాక్షుని విత మెఱుఁగవె
కని తెల్పిన భారతంపుఁ గతలై పెరుఁగుఁ౯ 68

గీ. దొరకనటువంటి రత్నంబు దొరకినట్లు
బొమ్మునేగాని, దించఁ డే యెమ్మె నైనఁ
గౌఁగ లెడలినఁ బ్రాణముల్ కదలు ననుచుఁ
గట్టి కాచుక యున్నాఁడు కదల నీఁడు 69

గీ. మగువ యిది గాక యిఁక నొక మాట గలదు
వినుము వలపుల దొరసాని యనెడు పేరు
దాని కిచ్చెను నిను బిల్వఁబో ననంగ
నెటులు నో రాడెనో శౌరి కెఱుఁగ వమ్మ 70

వ. అన విని చిలుకం జూచి రాధ యి ట్లనియె. 71

గీ. ఎల్లవారికి శకునంబు తెఱుఁగఁ బలికి
బల్లి తాఁ బోయి తొట్టెలోఁ బడిన రీతి
నొకరి నని నేనె ♦ మోసపో తిఁక నదేల
వెనుక చింతించు టెల్లను వెఱ్ఱితనము. 72

గీ. నీవు పోయిన పనికి రానీవు కొదవ;
పట్టి పల్లార్చి దేవకిపట్టి నిటకుఁ
దోడుకొనివత్తు వనుచు నీ తోడు చిలుక
నమ్మికను నెమ్మనంబున నమ్మియుంటి. 73

♦ మోసపోతి (న్) + ఇఁక—ఇట నుత్తమ పురుషైకవచనక్రియా—
'ఇ' కార సంధివిలక్షణతయు, నిర్బిందుక సబిందుక ప్రాసయతియు గమ
నింపదగినవి.

వ. అన విని శుకం బి ట్లనియె. 74

క. తల కెక్కిన వలపున హరి
యలుకుచు దాసానుదాసుఁ డై మెలఁగంగాఁ
గలవే యిఁక నడియాసలు
కలిఁ బోసిన వెనుక నుట్టి కనుఁగొను రీతిన్. 75

వ. అనిన విని దురంత చింతాభరంబున విరహవేదనా
దోదూయమానమానసురాలై దిగ్గున బెగ్గడిల్లి, 76

సీ. జడ వేగ వదలించి ముడి పూలు విదలించి
యలజడిఁ గిల్గంటు సందగించి
జిగివల్వ సడలించి బిగిరైక నెడలించి
సగము మాసిన చీర సంఘటించి
తిలకంబు పెకలించి కలపముల్ దెరలించి
పచ్చికస్తురి తలపట్టు పెట్టి
కల సొమ్ము వెడలించి కాటుక నిరసించి
సొంపు వాసెనకట్టు సంఘటించి
యాసల నడంచి చెలులపై యాస డించి
చెఱఁగు మై నిండ ముసుఁగిడి చీకటింట
మేని వెత లార్చి కంకట మీఁదఁ జేర్చి
పొరలె మరులూరి చిలువరాపొలఁతిదారి. 77

చ. ఉలుకును వెచ్చ నూర్పుఁ గడు
నుస్సు రనుట్ దల యూచు లేచు లో
గలఁగఁబడున్ దిగుల్పడును
గానిపను ల్దలపోయు వేసరున్
గళవళ మంది కన్గొను వి
కావిక నవ్వు భయంబుఁ జెందుఁ గన్
గొలఁకుల నీరు నించు మదిఁ
గొంకు దలంకు వడంకు నెంతయున్. 78

ఉ. రా యను వింత పుట్టినది
రా యను వింతకు దట్టి గట్టినా
రా యను బాళియుంటెఁ గద
రా యను జాతువు గాని వేడ్కఁ లే
రా యను మేలువార్త విన
రా యను నా వల పింత చేసె నో
రా యను నిన్ను దూఱ నగ
రా యను హా యదుశేఖరా యనున్ 79

చ. అనుచును బ్రజ్వరిల్లు విర
హానలకీలల మేను గంద నా
వనరుహనేత్రి యోర్వకను
పాపిరి నేడ్చెఁ బికస్వరంబునన్
కనుఁగవ నిండి వెల్లుదికి
కాటుక తెప్పలఁ జిక్కి చెక్కులన్
మినమిన జాఱి గుబ్బచను
మిట్టల నశ్రులు జాలువాఱఁగన్. 80

శా. ఆవేళం జెలు లెల్లఁ గొల్లు మని హా
హాకారము ల్సేయుచున్
నీవే యిట్టులు ధైర్యము న్విడిచినన్
మే మెల్ల నె ట్లాదుమో
వ్రేపా రెల్లరు సిగ్గునం బొగులరో
వేమారు నీ వంత నీ
కావంతం బనిలేదు వచ్చె నిదిగోఁ
గంసారి కంజాననా. 81

సీ. అల జక్కవపిం పెక్కువల ద్రొక్కు చల మెక్కు
నిక్కు చన్గుబ్బలు సుద్రిక్కు నమ్మ
అనయమ్ము నునుదమ్ములను దమ్ముల నయమ్ము
గను కనుంగవ తెల్వి కలఁగు నమ్మ

తొంగవించు బిగి ముంచు తనుపొందు సొగసొందు
వదనారవిందంబు వాడు నమ్మ
తులకించు బలుమించు నలయించు కళనించు
నందంపు మైదీఁగ కందునమ్మ
♦తొగరు వాతెఱ మేలిమి తొఱఁగు నమ్మ ♦
చిన్ని చిహ్నారు ముంగురు లైచెదరు నమ్మ
యెల్లి యెల్లుంట నా యల్లు డిందు వచ్చుఁ
♦గుంద వలవదు నా యాన మందయాన 82

వ. అనిన విని 83

క. తను వెల్ల ఝల్లు మనఁగా
నునుమోవి చలింప లేచి నుదురు చెమర్పన్
ఘనకేశబంధ మూడఁగఁ
గనుఁదమ్ములు మోడ్చి వాలెఁ గామిని మూర్ఛన్. 84

వ. అంతట నయ్యిందువదన లందఱుం గూడుకొని 85

క. ఏ మంద మేమి సేయుద
మే మందున దీరుఁ దేరు నెటులో ర్తు మనో
యే మందయాన నడుగుద
మీ మంథరకుచ తెఱఁగు లిట్టివి యనుచున్. 86

క. అని పలుకుచు వెన నులుకుచు
గని తలఁకుచుఁ గనుల నశ్రుకణములు చిలుకన్
ఘనశోకమగ్న లగుచును
గనకాంగిని చుట్టు ముట్టి కాంతలు వేగన్ 87

ఉ. కోమలి సిబ్బెపు న్మెఱుఁగు
గుబ్బల జొబ్బిల నొప్పు కప్పురం
బా మరునగ్గి సోఁకి యది
యంతట భగ్గున మండ మన్మథ

---

♦ మెఱుఁగు వాతెఱ మేలిమి కందునమ్మ—తా. ప. ప్ర.

♦ అసల వలవదు నా యాన మందయాన—తా. ప. ప్ర.

స్వామికి భామలుం జమురు
వ త్తియు లేని నివాళిజోతు లో
సామజయానలార యని
సారెకుఁ జేతులు తట్టి యార్వఁగఁ 88

గీ. సారవంతం బగు పటీరప్రసారమునను
సేద దేర్చిన నొక్కింత సేద దేఱి
చెలులఁ గని రాధ వింటిరే చెలియలార
కలను గనుఁగొంటి శౌరి రాకల ననంగ. 89

సీ. తప్ప దీ మాట నా తనువు జు మ్మనిపించెఁ
జూడు జూడు మటంచుఁ జూపె నొకతె
రమణి యీ దిక్కు తోరణగాళి పలికెని
అదె యదె విను మంచు నాడె నొకతె
వెన్నుఁ డీడకు వచ్చియున్నట్టి కనుపించెఁ
గల నిక్క మానంచుఁ బలికె నొకతె
నెమ్మది యిపు డెంతో నెమ్మది యున్నది
యమ్మమ్మ యిది నిజం బనియె నొకతె
పడఁతి నీ వామనేత్రంబు పదరె నిదిగొ
కలికి నీ వామభుజము దాఁ గదలె నిదిగొ
అతివ నీ వామభాగంబు నదిరెనిదిగొ
దిగులు మాను మటంచు నా తెఱవ లనఁగ. 90

గీ. అంత నచ్చట నర్జునాహ్వయసఖునకుఁ
జెలులు రాధిక పంచిన చిలుక యలుకఁ
చెప్పకయపోయె నని పల్కఁ జి త్తగించి
కమలనేత్రుఁడు మనము ది గ్గనఁగ లేచి. 91

సీ. రాజాస్య కీలించు రవల పావలు మాని
ధవలాక్షి యిచ్చు కైదండ మాని
కాంచనాంగులు పట్టు కరదీపికలు మాని
పడఁతులు విసరు పావడలు మాని

భామలు కొనివచ్చు బారిపల్లకి మాని
మగువలు వీచు చామరలు మాని

గీ. మరుఁడు వెంటాడ రాధపై మరులు గూడ
దిట్టతన మూడ హృదయంబు కొట్టుకాడ
మేను నసియాడ సరిజోడు లేని ప్రోడ
సనియె సఖు తోడ శృంగారవనము జాడ. 92

సీ. తప్పక తను జూచి తెప్ప వేయక వచ్చు
జలజాక్షి పై దృష్టి సైత మిడక
మోహోపదేశత మోము చాచుక వచ్చు
సకియ మోమున ముద్దు సైత మిడక
ఒహారుదూరమున నుండి పైఁట విప్పక వచ్చు
చాన గుబ్బల గోరు సైత మిడక
బ్రమఁ బోఁకముడి సగ్గ బార వేసుక వచ్చు
చెలియ కౌఁగిట మేను సైత మిడక
జారుసిగ పీడ తెలి ముత్తెసరులు నాడ
పదట మెదమీఁజ బంగారు పటము జాఱ
యందెరవ ఒల్క మొలక ఘుర్మాంబు లొలుక
వచ్చె నీ దారి నా మురవైరి శౌరి. 93

సీ. ఆసతో నమబిల్వ మని యింతి యేమేమి
పలికి కీరంబును బంచె నొకొ
వచ్చి యచ్చట నాదు వర్తమానము జూచి
వేఁ బోయి శుక మేమి వినిచె నొకొ
యెలనాగ వినినంత నీనిన ఫ్లలి వోలెఁ
బదిరి భగ్గన మండి పడియె నొకొ
యది యొక్క నెపముగా సతివలు పగ చాటి
మించి యే మంచు బోధించి రొకొ

గీ. తోయజానన మది నేమి తోఁచె నోకొ
దైవ మేమేమి సేయంగఁ దలఁచె నోకొ
గ్రహగతుల క్రౌర్య మెట్టిదో కలికి నెడసి
యేల వచ్చితి చెలికాఁడ యోసి యీడ. 94

సీ. నిన్నుఁ బాసి నిముసంబు నిలువఁ జాల నటంచుఁ
గౌఁగిటఁ జేర్చుక గడియ సేపు
నీ వెంటనే వత్తు నేఁ దాళ లే నంచుఁ
గరములు పట్టుక గడియ సేపు
నను బిల్వఁ బంపు మీ నా యాన నీ కంచుఁ
గన్నీరు నించుక గడియ సేపు
దాని మాయలఁ జెంది దయ వీడకు మటంచుఁ
గలికి మోము గదించి గడియ సేపు
గాఁగ వగచుచు గద్గదకంఠ యగుచుఁ
బ్రేమ మీఱంగ దీవెనవీడె మిచ్చి
పనుపఁ జాలక పైనంబు పనిచి నట్టి
యువిద నెడఁబాసి యిందుండు టుచిత మగునె. 95

(ఇటఁ గొంత గ్రంథపాతము దోఁచెడిని)

సీ. (మగతేఁటి గఱులకు మగువ ముంగురులకు
నేనాటి నేస్తమో యెఱుఁగ రాదు)
♦అల మించు సోగకు నతివ మైతీఁగకు♦
నేమి చుట్టఱికమొ యెఱుఁగ రాదు

♦ ♦ ఈ గుర్తుల మధ్య నున్న పాదార్ధ మొక సర్దుబాటు.

పూర్ణసోమునకును బాలంతి మోమునకును
నెచ్చటి మచ్చికో యెఱుఁగ రాదు
కపురంపుఁ దావికిఁ గలికి కెమ్మోవికి
నే యనుబంధమో యెఱుఁగ రాదు
చెలియ జిగి చూపు నును నల్ల గల్వ తూపు
కొమ్మ పాలిండ్లు బంగారు నిమ్మ పండ్లు
చెలువ నూగారు నల్లని చీమ బారు
లొక్క చోటను బుట్టని దొక్క కొదవ. 96

గీ. ఇందుబింబాస్య నవ్వుల కెంచి చూడఁ
1. జంద్రకిరణవిలాసంబు సహజ మయ్యె
నింతి నునుగప్పు కొప్పున కెంచి చూడ
2. జంద్రకి రణవిలాసంబు సహజ మయ్యె. 97

సీ. శృంగారయావనక్షీరాబ్ధి నడుమను
దనరారు బంగారు తమ్మి యనఁగఁ
దళుకు మించును మించు తనుచంద్ర రేఖలోఁ
బఱఁఘవిల్లు కురంగపద మనంగఁ
గలదు లే దను నట్టి కౌనుదీవియ యందుఁ
జూచిన గెంటెన పు వ్వనంగ
నలువొందు నాభిపున్నాగంబు నను బుట్టి
ప్రవహించు జిగి తేనెవాక యనఁగఁ

గీ. జొక్కి మరులెక్కి[1] మొత్తలఁ జుట్టి చూడ[2]
నజుఁ డొనర్చిన మోహన యంత్ర మనఁగ
మరులు గొల్పెడు దొరసాని మరుని యిల్లు
కళలు కిరఁగంగ ముద్దాడి కలయు నెపుడు. 98

1. చంద్రకి = నెమలి (సూ. రా. ని.)
2. నేత్రలమ[illegible]యాడ — తా. ప. ప్ర

సీ. పంచబాణుని చేతఁ బ్రాణము లోర్వనీక
పరగెడు యమృతంపు బావియనఁగ
మారుని ఘోరజ్వరారుచు ల్దీర్పంగఁ
బరిఢవిల్లెడు తేనెవాక యనఁగ
దర్పకు కోపాగ్ని దాహంబు మాన్పంగ
నలరారు నెలనీటి కొల నన నంగఁ
దలిరాకు విలుకాని దాపంబు లణగింపఁ
జెలువొందు పన్నీటి చెఱు వనంగ
గీ. నాదు మన మను రాయంచ నటమటింప
చెఱకువిలుబోయ త్రవ్విన చెలమ యనఁగ
మరులు గొల్పెడు దొరసాని మరువి యిల్లు
కళలు కరగంగ ముద్దాడి కలయు టెపుడు. 99

వ. అంతట ననంతశయనుం డగు మురాంతకుండు మంతన నేసి సాత్రాజితిని పీడ్కొని యిళాదేవిం దోడితేరం దగు వారల న్నియమించి మంచి లగ్నంబున రథారోహణంబు చేసి వెంబడించి వచ్చు బంధుజాలంబుల నిలువకరం బమర్చి కదలి మనోవేగంబున గోకులంబున కరుదెంచి రథంబు డిగ్గి భృత్యామాత్యాదిబంధువర్గంబుల వారి వారి విడుదులకుఁ బొమ్మని నిజగృహంబునం బ్రవేశించి నందయశోదాదులకు నమస్కరించి వార లొనరించుదీవనలు గాంచియచటివృత్తాంతంబంతయు నెఱింగించి కొండొక తడ వందు వసియించి యచ్చటి యాప్తసఖులచే రాధికావృత్తాంతం బంతయు నాకర్ణించి యిందుల కేమి సేయువాఁడ నని చింతించి తానె పోక తీర దని నిశ్చయించి బెట్టునిట్టూర్పులు నిగుడించి మించిన దిగులునం బొగులుచు పగలు పగలాయె నంచు వేగించి యా రాత్రి జననయనచకోరంబులకుఁ బండుగై యుండు పండు వెన్నెల లోనఁ బయలుదేఱి మంద గమనంబున రాధామందిరంబు చేరంబోవు సమయంబున,

గీ. అపుడు నచ్చట రాధ కంసారి రాక
చిలుకచే విని తనయొద్ది చెలులఁ బిలిచి
వెన్నుఁ డిట కేగుదెంచిన విడువ వలదు
వాకిటనె నిల్పుఁడని చెప్పి పనిచె నంత 101

వ. వారలు దేవదేవుండైన గోపాలదేవుం గనుంగొని 102

చ. పొలఁతిరొ యేమి త్రోవ విడు
పోవలె నచ్చటి కింతి చెంతకే
తొలి రుచి వీడవో విడను
ద్రోతుము దొబ్బుదు పొమ్ము పొమ్ము మా
టల కెడ మాను గాని యిక
టానికిఁ జొచ్చితి వేను యెవ్వరో
బలిమి మిటారి ర మ్మదిగో
వచ్చితి, రాకల మానవో హరి 103

గీ. ఇటుల నాడిన మాటల కిముడఁ బలికి
రాజసము మీఱఁగా యదురాజమౌళి
బలిమి జులుముల సందడుల్ దొలఁగఁద్రోచి
చొరవ చేసుక లోపలఁ జొచ్చువేళ, 104

సీ. విడు విడు మని డాసి కడకన్ను లెఱఁజేసి
కమ్మ నెత్తమ్ముల గ్రమ్మె నొకతె
లేచి ముందఱఁ జంగఁ జాఁచి కోప మెసంగ
సన్నజాజుల చేతఁ జవిరె నొకతె
అడ్డంబుగా నిల్చి యవల కేగ నదల్చి
కమ్మ నెత్తమ్ముల గ్రిమ్మె నొకతె
నిలు నిలు మని పల్కి నీటు మీఱఁగఁ గుల్కి
విరజాజి విరులచే విసరె నొకతె

గీ. గుప్పుమని తావి పుప్పొడి గుప్పె నొకతె
చలువ పన్నీరు మై నిండఁ జల్లె నొకతె
దానవారిని జొరనీక తలుపు మూసి
యూనుఁ డని రాధ పై బలం బనుపఁ జెలఁగి. 105

గీ. కాంత లిట్టులు రానీక అంతు సేయ
నీటి చిమ్ముల కళుకక నిలుచు గంధ
సింధురం బన నిలఁబడి శ్రీధరుండు
పలికె వారలఁ గని నయభయము లమర 106

గీ. సుదతి యిసుమంత కడకంటఁ జూచినంత
నింత అంతు ఘటింతురా యింతులార
మీరు నా మాఱు పదముల మీఁద వ్రాలి
కలయఁ గలయించి సుకృతంబు గట్టుకొనరె 107

వ. అను శౌరి తోడ నా చెలు లిట్లనిరి. 108

సీ. ఈవైన మానాటి కెటు పోయెనో యని
చెప్పి కరమ్ములు విప్పు వారు
గలయఁ గల్పులు సేయఁగా రాదె యీ గుణా
ఢ్యుని నంచు నొదల లూఁచు వారు
నీ యతివినయంబు నీ యిళకె కొని పో
మ్మంచును బహు ధిక్కరించు వారు[1]
ప్రాలుమా లిటువలె బ్రదుక వచ్చునె యంచు
మెఱుఁగుఁ గెమ్మోవిని విఱచు వారు

గీ. మామగారింటిలో నున్న మందెమేల
మెందు దాఁగెనో యిపు డటం చెన్న వారు
బెళుకుఁ గొనలు బెళుకంగఁ గులుకు వారు
నగుచు నగుచున్న చెలుల కి ట్లనియె శౌరి. 109

క. ఇంత కోపము మదినున్నఁ జెంతఁ బిలువఁ
బంచి రాధిక నన్ను దండించ రాదె
వాకిటన లాకు నను జేయ వశమె వలదు
గౌరవము లాఘవము నెందుఁ గాంచవలదె[2] 110

1. కొంచు పొమ్మని బహు ధిక్కరించు వారు }
2. గాన సిరిలాఘవము నెందుఁ గాంచు ననిన } తా. ప. ప్ర. పాఠములు

క. అన విని రాధిక భావం
బున నించుక కోప మూర్తి ముసుఁగిడి తిరుగన్
గని కీరము చని వేగం
బున రమ్మని పిలువ శౌరి ముద మొదవంగన్ 111

ఉ. లోపలి కేఁగి గారుడవి
లోలశిలాగృహాసీమ శయ్యపైఁ
గోప మెసంగఁ గాఁ జిలువ
కోమలి చాడ్పున నున్న యింతి సం
తాపముఁ జూచి పుష్పశర
తాపము మీఱ మురారి చేరి బె
ట్టూపిరి తోడఁ బాదముల
యోరకు రాఁ గని లేచి దిగ్గునన్. 112

ఉ. ఎవ్వరు పిల్చి రిచ్చటికి
నెందుకు వచ్చితి వేమి కార్య మే
నెవ్వతె నీ వెవండ విఁక
నెవ్వరి కెవ్వరు కంటెఁ గంటి మీ
జవ్వని విన్న రవ్వ లిఁక
చాల్ తడ వాయెను వచ్చి లేచి పో
నవ్వెద రెల్లవారు గని
నన్నును నిన్నును గోపశేఖరా. 113

క. అనఁ జెలి పాదంబులపై
ఘనచింతారత్న ఘటితకనక కిరీటం
బును మోపి లేవకుండిన
వనజానన సిగ్గు వలపు వడ్డికిఁ బాఱన్. 114

క. దేవుఁడ వేలిన స్వామివి
పోవయ్యా నీవు నాకు మ్రొక్కఁగఁ దగునా
లేవు మని గుబ్బచనుమొన
లా విభు నెద సోఁక నెత్తె నంగన వేడ్కన్. 115

ఉ. ఎత్తిన పట్టు వీడక యు
పేందుఁడు తత్కుచ కుంభపాళిపై
నత్తమిఁ లేక్ దురంత విర
హార్ణవపూరము నీదు కై వడిన్
హత్తి రసాలసాలమున
నల్లెడు మల్లియ తీఁగ కై వడిన్
గుత్తపు గుబ్బలాఁడి చను
గుత్తులఁ దత్తను వొత్తి సొక్కుచున్. 116

వ. ఇట్లు మదనకదనారంభ సముజ్జృంభమాణ మనోభిలాషల
నా రాధామాధవు లమందానందకర చందనాదికస్తూరికా
పరిమళద్రవ్యంబులకు సొమ్మసిల్లి యుండిరప్పు డమ్మంద
యాన పురందరాదిబృందారక వందితపాదారవిందుం డగు
నా గోవిందునిఁ గలయు మోహావేశంబునఁ బట్టరాని గు
బ్బైనసి చిట్టాడు మట్టు మీఱి యతండు కౌఁగిటం జేర్చినం
జేర్పనీయక యబ్బురపు గబ్బిసిబ్బెంపు గుబ్బల నిబ్బరం
బున సోఁక సోఁకనీయక కటికచీఁకటి తప్పొలక్ గుప్పొనం
గప్పుగొప్ప కప్పు కొప్పు నిమిరినక్ నిమురనీయక మిక్కిలి
మెచ్చులైన చక్కని చెక్కు గీటినక్ గీటనీయక మధుర
సుధారసధారాధురంధరంబైన బింబాధరంబు గ్రోలినం
గ్రోలనీయక కుందనంపు టందంబు గెంటిన పువ్వను గంటు
పఱుచు తుంటవింటి పాదుశాహు దివాణంబు నంటిన

నంటనీయక మెం డొడ్డుకొన నాదరించి యొయ్యన శయ్యఁ
కుఁ జేర్చి లాగించి కౌఁగిలించి బాహాబాహిఁ గచాకచిం
బెనంగి యల్లందులకుం గమకించి చివురు సౌరు జవురు
తావి మోవి తేనెలం గ్రోలి పైకొని కోకిల చందంబున
గుబగుబం బలుకుచు మేలు భళా పసందు సెబాసు నా
సామి యదిరా యదిరా యని మెచ్చి యొక్కరొక్కరే
మేను లప్పళించి వింత వింత పిలుపులం బిలుచుచుఁ గెందా
మరలం బోలు కందామరల సరమోడ్పులు గావింపుచు
మన్మథబ్రహ్మానందంబునం దోలలాడుచు నుండి రని
చెప్పిన శుకుం డి ట్లనియె. 117

శా. కస్తూరీతిలకోజ్జ్వలస్మితముఖా !
కైవల్య లక్ష్మీసఖా !
హస్తోదంచితశంఖచక్రరుచిరా !
హాస్తీంద్ర రక్షాపరా !
అస్తోకామృత వర్ష వేణు నినదా !
యానందలీలాస్పదా !
త్రస్తానేకజనాభయప్రదకరా !
ధారాధర శ్రీధరా ! 118

క. సారఘనసార నవకా
శ్మీరపటీరాంగరాగ శీతలతట రా
ధా రమణీకుచదుర్గయు
గారోహావిహారలీల ! యదుకుల బాలా ! 119

మాలిని. దళిత విపులమాయా ! ద్రావిడామ్నాయగేయా !
జలరుహదళనేత్రా ! సవ్యసాచ్యాప్తమిత్రా !
బలివిభవవిరామా ! భానువంశాబ్ధిసోమా !
కలశజలధిశాయీ ! కామితార్థప్రదాయీ ! 120

గద్య. ఇది శ్రీమత్పాండ్యమండలాధీశ్వర శ్రీవిజయరంగ
చొక్కనాథ (మహీనాథ కరుణాకటాక్ష సంపాదిత గజతు
రంగమాందోళికా ప్రముఖ) నిఖిల సంపత్పారంపరస మేధ
మాన సముఖ మీనాక్షీనాయకతనూభవ మీనాక్షీ దేవీ
కటాక్షలబ్ధ కవితాసాంప్రదాయక వేంకటకృష్ణప్పనాయక
ప్రణీతం బైన శ్రీరాధికాసాంత్వనం బను చాటుప్రబంధంబు
సర్వంబును నేకాశ్వాసము.

వ్రాయసకాని మాట :—

క. ఈ కథఁ జదివినఁ వినినన్
బ్రాకటముగ వ్రాసినాను బహుసంపదలన్
జైకొనుఁ డనుచు న్వారికి
శ్రీకరముగ గోపశౌరి చెలువుగ నొసఁగున్.

శ్రీమచ్చెన్నపురవాస శ్రీ చెన్నకేశవ స్వామినేనమః.

కీలకనామసంవత్సర మార్గశిర బహుళషష్ఠి శుక్రవారము
నాఁడు బాగూరు రంగాశాయి కొమార్తె అమ్మిణికి తంజావూరు
కవి వేంకటస్వామి నాయఁడు స్వహస్తలిఖితముగా నిచ్చినది.

---

గమనిక: 117 వ సంఖ్య గల గద్యయు, గ్రంథాంతగద్యయు నక్క
డక్కడ అహల్యాసంక్రందనమును బట్టి సవరింపఁబడినవి.

# గ్రంథస్వీకారము.

ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము—గ్రంథకర్తలు కళాప్రపూర్ణ శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు, ఆంధ్రవిశ్వకళాపరిషత్ప్రకటితము. మొదటిసంపుటము వెల రు. 25-0-0, రెండవసంపుటము వెల రు. 25-0-0. మొత్తమునకీ రెండు సంపుటములందలి పుటలు 1794.

శ్రీ వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రులువారు రచియించిన 'ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము' అను నీ యుద్గ్రంథము, వారు చదువనేర్చిననాఁటినుండి సంగ్రహించిన ఆంధ్రభాషాపాండిత్య సర్వస్వము. శ్రీ శాస్త్రిగారు తమ జీవితమునందలి యమూల్యసమయము నంతను ఆంధ్రభాషాలక్షణ గ్రంథములందలి విషయములు సంగ్రహించుట, బోధించుట, విమర్శించుట యనువానికే వెచ్చఁబెట్టి లక్షణజ్ఞులుగా విశేషానుభవము నార్జించియున్నవారు. వారియనుభవము లన్నియు నీ గ్రంథరూపమును దాల్చి యీనాఁటికిఁ దెలుఁగువారి కందీయఁబడినవి. ఇంచుమించుగ నఱువదివత్సరములు తెలుఁగుభాషలో వారుచేసిన కృషి యంతయు నీ గ్రంథమునఁ బ్రతిఫలించినది.

సీతారామశాస్త్రిగారు మొదటినుండియు లక్షణవిషయములను గూర్చియే ప్రత్యేకముగఁ గృషిసల్పి లాక్షణికముగఁ గొన్నినూతన సిద్ధాంతముల నావిష్కరించి, యవి ప్రాచీనలాక్షణికసమ్మతము లని నిరూపించుచువచ్చిరి. అవి చింతామణి విషయపరిశోధనము, ఆంధ్ర వైయాకరణ పారిజాతము నను గ్రంథములుగా వెలువడినవి. వాని మీఁదఁ గొందఱు పండితులు తమ కనభిమతమైన విషయముల నుగ్గడించుచుఁ గొన్నిగ్రంథములను వ్యాసములను బ్రకటించిరి. అట్టివాని కన్నిటికి నీ సర్వస్వమున సమాధానము లిచ్చుచు శ్రీ శాస్త్రిగారు, నన్నయనాఁడు మొదలుకొని యీనాఁటివఱకు భాషలో వెలువడియున్న లక్షణగ్రంథములలోని విషయము లన్నియు, సంగ్రహించి, యుక్త్యుపపత్తులలో వివరింప మొదలిడి, ఖండన మండనములతోఁ గొనసాగించినారు. ఏయొక్కవిషయము నెత్తుకొనినను దానినిగూర్చిన ప్రాచీనార్వాచీనలాక్షణికులసమ్మతులను దెలిపి, యావిషయమునందమకుఁ

గల యభిప్రాయమును నొక్కి వక్కాణించుట శ్రీ శాస్త్రిగారికి మొదటి నుండియు నలవాటయిన విషయమే. ఈగ్రంథరచన యంతయు నాతీరు ననే నడిచినది.

ఈ విషయవిమర్శనపద్ధతిని బట్టి, సంస్కృతాంధ్రభాషా వ్యాకరణ పరిపాటి బాగుగ నెఱింగిన వారికే యీసర్వస్వములోని కోశము కొంచె మేనిచిక్కును. ఈగ్రంథమాంధ్రభాషాపండితులకు నాంధ్రలక్షణ సర్వస్వ మునందిచ్చుటకుఁ గూర్పఁబడినది. ఆంధ్రభాషా విషయమునఁ దలస్పర్శి యైన జ్ఞానము నపేక్షించువారికీ గ్రంథ మాముూలాగ్రము పఠనీయము. లక్షణము భాషాస్రవంతి కడ్డుతగులు నను నూహాగలవారి కిది దుష్ప్రేక్ష్యము. ఇందలిమహత్త్వము దురూహ్యము.

శ్రీ సీతారామశాస్త్రిగారివంటి యాంధ్రలక్షణశాస్త్రప్రపూర్ణుల నిట్టి మహత్తరగ్రంథరచనకుఁ బురికొల్పి శ్రీశాస్త్రిగారి జీవితసర్వమగు నీవ్యాకరణసర్వస్వము కన్నులారఁగాంచఁగల్గుభాగ్యము జతగూర్చిన కీ. శే. డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు, వారితరువాత దీని నాంధ్రలోకమున కందిచ్చిన యాంధ్రవిశ్వకళాపరిషదధికారులును నాంధ్రు లందఱకుఁ జిరస్మరణీయులు.

శ్రీ శాస్త్రి గారాంధ్రలోకమంతయు నెఱిఁగిన లాక్షణికులు. వారు సర్వేశ్వరుని కృపవలన మఱింత యాయుర్దార్ఢ్యము నంది యిట్టి నింకొకటి యాంధ్రుల కొసంగెదరుగాకయని యాశించువాఁడను.

ఇట్లు,

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

శ్రద్ధాంజలి:— రచయిత శ్రీరావు వేంకట శేషారావుగారు.

చిత్రాడ. పిఠాపురము పోస్టు. వెల రు. 1-0-0.

'శ్రద్ధాంజలి' యను నీ పద్యగ్రంథమును, శ్రీరావు వేంకట శేషారావు గారు, తమ యన్నకుమారులు కీ. శే. రావు వేంకట అచ్యుత రామారావుగారు బి. ఏ. బి. యిడి 'శ్రీనివాస' మను వారిపేరు చిర

స్థాయిగ సమరించుటకు సంగ్రథనము చేసియున్నారు. వాసము మీఁది శ్రద్ధచే నర్పించిన యీ యంజలిలోని రచనలు లలితమధురముగఁ గొనసాగినది.

పాఠశాలలోఁ జదువనేర్చు విద్యార్థుల కనుకూలమయిన శైలి యీకవితలో నమరియున్నది. బాలుర లలితహృదయములలో నిందలి భావములు నాఁటుకొనిన వారి పురోభివృద్ధి కవి యుపకరించుచుఁ బద్యములమీఁదఁనుత్సాహమును రేకెత్తించునవిగ నున్నవి. శ్రీశేషారావుగారి యీ కూర్పును పాఠశాలావిద్యార్థులకుఁ బాఠ్యముగా నిర్ణయించుటకు బాఠ్యగ్రంథనిర్ణయాధికారులు పూనుకొనిన నెంతయు సమంజసము. విద్యార్థిబృందమున కుపకారకారియు నగునని యీగ్రంథమును జదివిన వారి కనిపింపక తప్పదు. కావున విద్యావినోదులు దీనిని జదివి, శ్రీశేషారావుగారి యాశయమును నెఱవేర్చెదరుగాక యని యాశించుచున్నాఁడను.

చి॥ పాపయ్యశాస్త్రి.

హరిహరదేవాయ నమః

# అభిప్రాయము.

కుసుమకుంతల మను నీకావ్యమును గూర్చి వ్రాయుటకు మున్నె తద్గ్రంథకర్తను గూర్చికొలఁదిగఁ దెలుపదలఁచితిని.

చిలుకూరి చతుష్టయమనియు నప్పల్లపంచకమనియు, బొమ్మకంటి షట్కమనియు నంధ్రరాష్ట్రమున సుప్రసిద్ధశాస్త్రవేత్తలు గల రని విందుము. అందు చిలుకూరి సోదరులు నల్వురును వైయాకరణమూర్ధన్యులు, వెలనాటిశాఖకుఁ జెందినవారు. అప్పల్లసోదరులు వేవురును సాంగవేదవేదులు; ద్రావిడశాఖీయులు. బొమ్మకంటి సోదరు లార్వురును నైయాయిక శిరోమణులు, తెలగాణ్య శాఖ్యులు.

చిలుకూరివారిది పండితవంశము. బంగరునకుఁ దావి యబ్బిన టుల పాండితితోఁబాటుగఁ గవితయుఁ జిలుకూరివంశ్యులగు నీగ్రంథకర్త గారి కబ్బినది. ఈ కవిపుంగవుని యాస్తిక్యము, నాంధ్రదేశాభిమానము నీ గ్రంథమే చాటుచున్నది. అనువంశిక మగు పాండిత్యముతో నీ కృతిరచయిత శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయమునఁ గొంతకాలము భాషాసేవఁ గావించి ప్రస్తుతము శ్రీపీఠికాపుర మహారాజకశాశాలయం దాంధ్రపండితపదవి నలంకరించి యున్నారు. నేఁడచట చట నవీనముగఁ దలయెత్తి పుట్టలోఁబుట్టి మఖలో మాడుచున్న గ్రామ్యభావకవిత లుత్తమపండితు లగు వీరియుల్లము నాకర్షించి లోఁగొన లే దనుట కీగ్రంథమే నిదర్శనము. ఈపండితగ్రామణి శాంతచిత్తుఁడు. సదాచారవర్తనుఁడు నుత్తముఁడు నని స్వయంపరిచితి గలనేను నుడువు నుడులు స్వభావోక్తులేకాని యత్యుక్తులు గావు. ఇఁకఁ గవితావిషయ మించుక ప్రస్తావించెదను.

> "ఇందుశేఖరు నెదుటఁ బూర్ణేందువదన
> లెందలెందలొ నట్టువ లింపుమీఱ
> భక్తి తళుకొత్త నాట్యముల్ వఱడవింపఁ
> బిల్వలేశుఁడు హాయిగాఁ బవ్వళించు"

ఈపద్యయము ముద్దుగొలుపుచు శ్రీనాథకవి సార్వభౌముని కవితాఫక్కిక పట్ల నీ కవికిఁ గలగౌరవమును ననూనానుకరణాసక్తిని బాహిరించుచున్నది.

> "వందలయేండ్లు మేనువసి
> వాడఁ జరించు తపంబు మేనకా
> సుందరిపొందున న్మొడలు
> సొంపరఁజేసెను కౌశికుండు; నేఁ
> డెందఱొ వింత వారు తగు
> నిమ్ముల వ మ్మయిపోవ వేశ్యచా
> టిం దమ సొమ్ము వో నటమ
> టింతురుగాదె మునీంద్రుకై వడిన్"

ఈపద్యము కౌశికీ తీరవాసులును స్వైరవిహారధీరులును నగు నాధునిక యువకులఁగూర్చి సోల్లుంఠనముగా నుల్లేఖింపఁబడినది. కవికి వలయు భావనిశ్శంకప్రకటనము దోషదర్శనాకుతోభయత్వమును దీనఁ దెల్ల మగుచున్నది.

"వెలయాండ్రకుఁ బూజరులకుఁ
గలయిక దేవళములందుఁ గైవారములన్
వెలయుటయు నొంటిపాటున
మెలఁగుటయుం గలుగు దాన మిత్రత హాసఁగున్"

అని యేవంవైఖరిఁ బలుతావుల నీకవివరుఁడు రచనా చమత్కృతి జూపియున్నాఁడు.

ఈ కావ్య మాద్యంతము ద్రాక్షాపాకమున సరళసరళమగు చక్కనిశయ్యలో నడచినది.

"రైగప్పుట" "తట్టుకొనుట" "జెలిపించుట" మొదలగు వాడుక మాటల నచ్చటచ్చట సమయోచితముగాఁ జొప్పించుటయే కాక 'గంగ బొండ్లములు' "కర్పూరచక్కెరకేళి" మున్నగు మాండలిక పదములఁ గూడ నీ రచయిత ప్రయోగించి కోనసీమను, గన్నులకుఁగట్టినాఁడు.

రసము, పాత్రౌచితి, భావగాంభీర్యము మొదలగు నుత్తమకావ్య లక్షణముల నాహరించి యానందించు కార్యభారమును రసజ్ఞతయు, దోషజ్ఞతయు, భావజ్ఞతయుఁ గలిగిన పాఠకమహాశయులపైననే యుంచితిని.

కావ్యము శ్రితపక్షపాతియు, సుమామనోహరుఁడును నగు కోప్పలింగేశ్వరుని మహామహిమమును జాటునది. కవి పండితమండనుల కాకర. మగు చిలుకూరి పవిత్రవంశమునఁ బ్రభవించినవాఁడు. కావ్యరచన "దేశభాషలందుఁ దెనుఁగులెస్స" యని వినుతి గన్న యాంధ్రభాషలోఁ గొనసాగినది. తెలుఁగుతేఁడగు జళుక్యభీముఁడే యితివృత్తమునఁ బ్రభువు. భీమఖండమునకు మకుటాయమానమును నిరంతరసస్యశ్యామలమును సర్వసౌఖ్యాకరమును సకలపండితమండనమండితమును నగు కోనసీమ కథారంగము. ఇంతకంటె నింకేమి కావలయును.

నాఁటి తెనుఁగురాయఁడు నేఁడులేఁడు. బోడిలింగమునఁ గైశ్యముఁ జూపిన పూజరియును లేఁడు. కాని నేఁటికిని బలివెలగ్రామ మున్నది. అం దిందుకళాశేఖరుం డగు కొప్పులింగేశ్వరుఁడు సతీసహితుఁడై కాపురిం చుచునేయున్నాఁడు. ఆంధ్రభూజానిచేఁ బూజరికిఁ బారితోషికముగ నొసఁగబడిన పదిపుట్లభూమియు "జుత్తిగపా"డను పేరునఁ బరగుచు నేటికి నా పూజరివంశీయులకుఁజెందియేయున్నది. అత్యంతప్రత్యక్ష నిద ర్శనములుగల యీ సత్యచరిత్రమున కన్యథాత్వముఁ బుండలించు సాహ సిక్యముగల విమర్శకంమన్యుల కొక్క నమస్కృతి.

గ్రంథకర్త లగు శ్రీ పాపయ్యశాస్త్రిగారు నాకుఁ బ్రియమిత్రు లగుటచే నే నింతకంటె విశేషించి వ్రాయుట తగదు.

ఇట్టి కృతి నాంధ్ర విశ్వవిద్యాలయాధికారులు విద్యార్థులకుఁ బాఠ్యగ్రంథముగా నుంచుట యుక్తము.

మా హరిహరదేవుఁ డీవిద్వత్కవి నితోధికసుందర సరసకావ్య రచనాదక్షునిగ నొనరించుచు రక్షించుగాత.

తుల్యారామేశ్వరము }
విజయాషాఢ శుద్ధపంచమి }

కాకరపర్తి కృష్ణశాస్త్రి,

# గ్రంథ సమీక్ష

1. ఈశావాస్యోపనిషత్తు:—డెమ్మీ. పుటలు 168. వెల రు 2-8-0 (ప్రచురణకర్త:—శ్రీ రాపర్తి కన్నయ్యపంతులుగారు, విజినిగిరి, శృంగవరపుకోట తాలూకా.)

2. ఉమాసహస్రము (ప్రథమభాగము) డెమ్మీ. పుటలు 72. వెల 1-8-0 (ప్రకాశకులు:— శ్రీ వేదుల రామమూర్తిగారు, తగరంపూడి, అనకాపల్లి తాలూకా.)

ఆంధ్రీకృతికర్త:—సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ, కవిశేఖర, శ్రీ పంతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు, విజయనగర సంస్కృతకళాశాలాంధ్రపండితులు.

(గ్రంథప్రతులు కృతికర్త యొద్ద లభింపఁగలవు.)

1. శుక్లయజుర్వేదమందలి వాజసనేయసంహితాంతమం దుండుటచే వాజసనేయసంహితోపనిషత్తను నామాంతరము గలిగి, ప్రథమ శ్లోకము "ఈశా, వాస్యమ్" అను పదములతో నారంభమగుటచే "ఈశావాస్యోపనిషత్తు" అను వ్యవహారముగల యుపనిషత్తున కిది యాంధ్రీకరణము. ఈ జగమంతయు నీశ్వరునిచే నాచ్ఛాదితమైనదని ప్రప్రథముననే హెచ్చరించుచు, ఆత్మజ్ఞానస్వరూపమును బోధించి తదుప లబ్ధిగలవారికి మోక్షమును, లేనివారికిఁ గర్మోపాసనాదికాచరణము లను బ్రతిపాదించునట్టి యీ చిన్ని యుపనిషత్తు 18 మంత్రములతోఁ గూర్పఁబడియున్నది. ఉపనిషత్ప్రపంచములో ముఖ్యములుగ గణింపఁ బడిన దశోపనిషత్తులలో నిది మొదటిది. కావుననే బ్రస్థానత్రయమునఁ బ్రమతాచార్యులుగూడఁ దీనికి భాష్యముల రచించియున్నారు. ప్రస్తుత గ్రంథమునఁ గృతికర్తలు మూలమంత్రములకుఁ బదవిభాగ, ప్రతిపదార్థ, తాత్పర్యముల నచనమున వివరించుచుఁ దమ యాంధ్రీకరణపద్యముల నొసంగుటయేగాక, శంకర, వేదాంతదేశిక, మధ్వాచార్యుల భాష్యము లందలి ముఖ్యాంశములఁగూడఁ దెలుఁగున దేటతెల్లముగఁ దెలియఁ జేయుచు విశేషవివరణములఁ గూర్చుచు వానిపయి స్వాభిప్రాయా విష్కరణముగూడఁ గావించి చాలవఱకు శంకరమతమునే సమర్థించుచు

వచ్చిరి. వీరు బ్రహ్మీభూతులయిన శ్రీ భగవాన్ రమణమహర్షి శిష్యసంతతికిఁ జెందినవారు. ఉపయుక్తము లగు నిట్టి విశేషాంశములు హెచ్చుగాఁ జూర్పఁబడుటచేతనే 18మంత్రములుగల మూలగ్రంథము 168 పుటలలోఁ బ్రకటితమయి కృతికర్త యఖండపాండిత్యమునకే గాక యాధ్యాత్మికవైదుష్యమునకుఁ గూడ నాదర్శకముగ వెలయుచున్నది. ఉపనిషద్వాఙ్మయ మిట్టి ఫక్కిని శాస్త్రిగారివంటి సమర్థులచే నాంధ్రమునఁ బ్రకటితమైనయెడల నది యాంధ్రలోకమునకు మహోపకారకము కాఁగలదు. ఇట్లే కఠోపనిషత్తు, అధ్యాత్మోపనిషత్తు, అమృతనాదోపనిషత్తు నింతకుమున్నె వీ రాంధ్రీకరించి రని తెలియుచున్నది. ఆంధ్రసోదరులు వీరి సదుద్యమమునకుఁ దోడ్పడెదరుగాక! వేదమార్గపథికులగు వ్యక్తులను "(1) కేవల కర్మనిష్ఠుఁడు (2) (నిష్కామ) కర్మయోగి (3) కర్మోపాసన సముచ్చయకర్త (4) కర్మజ్ఞానసముచ్చయకర్త (5) వైరాగ్యసన్న్యాసి (6 వివిదిషాసన్న్యాసి (7) విద్వత్సన్న్యాసి (8) జీవన్ముక్తుఁడు" అని యెనిమిది తరగతులుగ విభజించి వారి 1. స్వరూప 2. ఆచరణ 3. గమన 4. ఫలములను నివేదించు పట్టికయు, ఉపనిషన్మత మనుసరించి జీవులకు గమ్యము లగు ధూమాదిమార్గముల వివరించు మఱియొక పట్టికయు గ్రంథాంతమునఁ జేర్పఁబడినవి. గ్రంథము శ్రీరామచంద్రమూర్తి కంకితము. అనువాదపద్యములు మూలాభిప్రాయమును లెస్సగ వ్యక్తీకరించుచు, ధారాళమగు నడకతో సాగినవి. మచ్చునకు రెండు.

ఈశావాస్యమిదగ్ంసర్వం । యత్కిఞ్చ జగత్యాం జగత్
తేన త్యక్తేన భుఞ్జీథా । మా గృధః కస్యస్విద్ధనమ్. 1

కం. "ఈశావాస్యము" జగమున
నా సకలజగమ్ము దానిఁ ◆ ద్యజియించి ధృతిన్
నీస్వరూపముఁ గైకొను
మా సఁగొనకు మెవనిధనము ◆ నందును సుమతీ!

యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతే
సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే. 6

కం. తనయందు నఖిలభూతము
లనఖిలభూతములఁ దన్ను ♦ లక్షించుమనుం
డును గావున నా విద్వ
న్మనుజుఁడు మాత్రము జుగుప్స ♦ మదిఁ గన డెపుడున్.

శ్రీ శివశంకరస్వామి పీఠిక, శ్రీ కుర్తాళస్వాములవారి యాశీః పూర్వకప్రశంస, మఱికొందఱు పండితవర్యుల యభిప్రాయములు గ్రంథారంభమునఁ గలవు.

2. సుప్రసిద్ధపండితులు, గీర్వాణ కవీశ్వరులు, శ్రీ రమణమహర్షి శిష్యవర్యులు నగు కీ॥ శే॥ శ్రీ కావ్యకంఠ గణపతిశాస్త్రిగారు "ఉమా సహస్రము" అను పేరితోఁ బరాశక్తి స్తుతిపూర్వకముగ రచించిన యుద్గ్రంథమున మొదటి నాలుగు స్తబకములందుఁగల ప్రథమశతకమున కిది యాంధ్రానువాదము. మూలగ్రంథము 1943 సంవత్సరములో (ఉత్తరకానరా) శిరసిపురమందలి నందినీముద్రణాలయమున నాగరలిపిలో గణపతిశాస్త్రివర్యుల శిష్యులు శ్రీ టి. వి. కపాలిశాస్త్రిగారు రచించిన "ప్రభా" నామకవ్యాఖ్యానమేతముగ ముద్రింపఁబడినది. ప్రకృత గ్రంథమున నాంధ్రీకర్తల యనువాదపద్యములే గాక మూలకృతి వ్యాఖ్యాతల వ్యాఖ్యానవిషయములు గూడ నాంధ్రమున వివరింపఁబడుటచేఁ గవి హృదయము పాఠకులకు బాగుగా నవగతమగుట కయి తెలుఁగుపద్యములతోఁ బాటు వివరణము గూడ సహాయకమగుచున్నది. సూర్యునియందుఁ బ్రభవలెను, చంద్రునియందుఁ జంద్రికచందమునను, పరమేశ్వరుఁడగు శివునియం దాతని తచ్ఛక్తి యభిన్నముగ నవినాభావముగ నంతర్గతమయి యున్నదనుట బహుతాత్త్వికసమ్మతమయిన సిద్ధాంతము. ఈ శక్తియే పరమేశ్వరుని లీలచే సృష్టిస్థితిలయ తిరోధానానుగ్రహరూపము లగు పంచకృత్యములకుఁ గారకమయి, ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులు, పరా పశ్యంతీ మధ్యమా వైఖరీ వాగ్రూపకశక్తులు, అవిద్య, మాయ, ప్రకృతి, (మనుష్యశరీరముల) కుండలినీశక్తి మున్నగు వేర్వేఱు నామములతో వ్యవహృతమై జగద్వ్యాపార మంతటికి మూలాధారమగుచున్నది. అందుచేతనే యామె జగజ్జనని యని, తదభిన్నుఁడు నధినాథుఁడు

నగు శివుఁడు జగత్పితయని వ్యవహరింపఁబడుచున్నారు. అప్రతిమానము నమేయమునగు శివశక్తితత్త్వము శ్రీ గణపతిశాస్త్రిగారు బహుముఖములుగ నుద్ఘాటించి యీ మూలగ్రంథరచనమును గురువర్యులగు శ్రీ రమణమహర్షి సన్నిధానముననే ముగించి వారి యనుగ్రహాశీర్వాదములకుఁ బాత్రమైరి. ఆంధ్రీకృతికర్తలుగూడఁ దమ ప్రకృతానువాదమును శ్రీ మహర్షివర్యుల జీవితకాలములో 1946 సంవత్సరములో వారి సముఖమునఁ జదివి వినిపించి వారి యామోదాశీర్వాదముల నందె దాని వారికే యంకిత మొసంగియున్నారు. ఇందలి "ఉమ" కేవల పరాశక్తియే గాని, పురాణములందును గావ్యములందును వర్ణితమైయున్న పరిమితశక్తి యగు హైమవతి గాదు. ఉమ=ఉ (పరమేశ్వరుని) మానశక్తి; హైమవతి=సౌవర్ణజ్యోతి (హేమము=సువర్ణము); పార్వతి=వైద్యుతజ్యోతి (వైదికపరిభాషలో పర్వతము=మేఘము) ఇత్యాదులిందలి నిర్వచనములు. ఇట్లే దక్ష, దాక్షాయణి, సతి, అదితి మున్నగు కొన్ని పదములకుఁ బౌరాణికగాథలకు విలక్షణములగు నర్థములు శ్రుత్యాధారములతో నిరూపింపఁబడినవి. కృతియంతయు గణపతి కవీంద్రుల యగణితవైదికవిజ్ఞానమునకు సర్వదర్శనకళావైదుష్యమునకు నాదర్శకమయి వెలయుచున్నదని చెప్పఁదగును. ఈ ప్రథమశతకమందలి ప్రథమ చతుర్థస్తబకము లార్యావృత్తములలోను, ద్వితీయస్తబకము పంచచామరములతోడను, తృతీయస్తబకము తనుమధ్యావృత్తములందును గూర్పఁబడినవి. అనువాదముగూడ నాంధ్రీకర్తల సామర్థ్యమున కనుగుణముగ నున్నది. క్రింది పద్యములు చూడనగును. గ్రంథమందలి తక్కిన భాగములు గూడఁ ద్వరలో వెలువడుటకయి యాంధ్రలోకము కృతికర్తకుఁ బ్రోద్బలమొసంగుఁగాక! గణపతిశాస్త్రిగారి జీవితసంగ్రహము గూడ గ్రంథారంభమునఁ గలదు.

శ్లో. పల్లవమృదువేదిగత। జ్వలనపవిత్రం మహార్ఘమణి కాన్తమ్
నవచంద్రఖండసౌమ్యం। శివసుదృశః తత్స్మరామి వపుః. (1-17)

చ. నవశశిఖండసౌమ్యము న ♦ నర్ఘమహామణికాంతియు క్తముల్
బ్రవిమలవేది మధ్యగత ♦ పావకపావనరూపశాలి, ప
ల్లవమృదులంబు, సుందర క ♦ ళాపరిపూర్ణ విచిత్రమూ ర్తి, నా
శివతరుణీశరీరమును ♦ జింతనముం బొనరింతు నిత్యముల్.

శ్లో. కరోతి యా బిభ ర్తి యా నిహ న్తి యా జగ త్త్రియమ్
సమ స్తతో విభాతి యా న దృశ్యతే క్వచిచ్చ యా
అతీవగు ప్తరూపిణీ గురూపదేశమంతరా
న శక్యతే బుద్ధైశ్చబోద్ధు మంధకారిసుందరీ॥ (2-3)

ఉ. ఎవ తె జగ త్త్రియంబు సృజి ♦ యించి భరించి హరించుచుండుఁ దా
నెవ తె సమ స్తమందును ర ♦ హించియు నెందును గానుపింప, దా
శివసతి గు ప్తరూపిణి ప్ర ♦ సిద్ధగురూ క్తి లభింపకుండినన్
వివృతనిజస్వరూపయగు ♦ నే భువినెంతటి బోధశాలికిన్.

శ్లో. మాతాపితరా యత్ । తా వేకశరీరా
చిత్రపత్రిథనార్థా । సాకాచనలీలా. (3-9)

ద్విరదగతిరగడ.

అతఁడు సంబికయు నే । కతనుసంగతు లౌట
అతిచిత్రకృతిజాల । అది యొకానొకలీల.

శ్లో. నృతనుషు విహరన్తీం త్వాం । ఉపాధివీణాకృ తేర్జగన్మాతః
సాదృశ్యాత్ కుండలినీం । పరోక్షవాదప్రియాః ప్రభాష న్తే.

కం. జనదేహవిహారిణి వగు
నిను వీణా కృత్యుపాధి ♦ నిం గుండలిఁ బో
లిన దానిఁ గుండలిని యని
యనియెదరు పరోక్ష వాగ్రి ♦ తాత్ములు జననీ !

బండారు తమ్మయ్య.

---

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమ సంపుటమును, 955 పుటలు గల రెండవ సంపుటమును, 980 పుటలుగల మూఁడవ సంపుటమును, 950 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమ సంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాదియందుఁగల సంస్కృతాంధ్రశబ్దము లన్నియుఁ గలవు. రెండవ సంపుటమున 'క' మొదలు 'జ' వఱకుఁగల శబ్దములును, తృతీయ సంపుటమున 'చ' మొదలు 'తృ' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' మొదలు 'న' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నివి సర్వవిధముల నుత్తమ మయినది. ఈ పుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు నను తలంపులో నీ క్రిందివెల నిర్ణయింపఁబడినది.

క్యాలికో బైండింగు ఒక్కొక్క వాల్యూము రూ 6 లు.

## పరిషత్ప్రచురణములు

| | | |
|---|---|---|
| 1. | ఆధునికాంధ్ర వాఙ్మయవికాసవైఖరి జయంతి రామయ్యపంతులుగారు | 1-8-0 |
| 2. | కాళింది కన్యాపరిణయము-అహోబలపతి ప్రథమ ద్వితీయభాగములు | 1-8-0 |
| 3. | చంద్రభానుచరిత్రము- తరిగొప్పుల మల్లనకవి | 1-0-0 |
| 4. | పరిషత్పుస్తక భాండాగారము | 1-0-0 |
| 5. | మన్నారు దాసవిలాసనాటకము - రంగాజమ్మ | 0-12-0 |
| 6. | రసార్ణవాలంకారము - ప్రకాశవర్షకవి | 0-8-0 |
| 7. | రఘునాథ రామాయణము (పథమభాగము) రఘునాథభూపాలుఁడు | 0-12-0 |
| 8. | రాధికా సాంత్వనము సముఖము వెంకటకృష్ణప్ప నాయకుఁడు. | 1-0-0 |

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

## ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారు సి. బి. ఇ., డి. లిట్. పిఠాపురం మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరు వారు.
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు)

## అధ్యక్షులు.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసమ్రాడిత్యాది బిరుదాంకితులగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు.

## కార్యదర్శులు:

శ్రీ సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ, చతుర్వేదుల సత్యనారాయణగారు, ఎం.ఏ, బి. ఓ. యల్.

శ్రీ ప్రతివాది భయంకర పార్థసారథిగారు, బి. ఏ. ఎల్. ఎల్. బి.

## కోశాధ్యక్షులు:

శ్రీ ప్రతివాది భయంకర పార్థసారథిగారు. బి.ఎ.,యల్.యల్.బి

శ్రీ వలేశ్వరపు వేంకటరమణ సుబ్బారావుగారు,బి.ఏ.,బి.యల్.,

## కార్యనిర్వాహకసభాసభ్యులు:

శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు.

శ్రీ రా. సా. మార్గిరెడ్డి సీతారామయ్య నాయఁడుగారు,బి.ఏ,బి.యల్.

శ్రీ కొమ్మిరెడ్డి కేశవరామమూర్తి నాయఁడుగారు,బి.ఏ.

శ్రీ వేమల రామచంద్రకీర్తిగారు,ఎం.ఏ (ఆనర్సు)బి.ఇడి.

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు,ఎం. ఏ.

శ్రీ ఎండమూరి వేంకటరమణగారు,ఎమ్. ఎ. బి. ఇడి.

శ్రీ వ్యాకరణ విద్యాప్రవీణ, విద్వాన్ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు

శ్రీ బండారు తమ్మయ్యగారు.

శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు,బి.ఏ.

శ్రీ పచూరి సీతారామారావుగారు,బి.ఎ.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక



దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స

సంపుటము ౪౨

సంచిక ౩

# సంపాదకవర్గము

ప్రధానసంపాదకుడు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. యల్.

సహాయ సంపాదకులు :

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు ఎం. ఏ.
శ్రీ విద్వాన్ వేదుల రామచంద్రశాస్త్రిగారు, ఎం. ఏ. ఆనర్సు., బి. ఇడి.
శ్రీ సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
శ్రీ బండారు తమ్మయ్యగారు.

# విషయసూచిక

శ్రీ

# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

కాకినాడ

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు.

సంపుటము ౪౨ { విజయ సంవత్సరము / మార్గశిర—పుష్యమాసములు } సంచిక ౫

ఆంధ్ర సాహిత్య పరిషత్తు

## నలువది రెండవ వార్షిక మహాసభ

దైవానుగ్రహమువలన 1954 జనవరి 30, 31 వ తేదీలలోఁ బరిషద్వార్షిక మహాసభలు చాల జయప్రదముగ జరిగినవి. వివిధమండలముల నుండి కవులును బండితులును విచ్చేసి తమకవితాకౌశలమును బాండితీవైభవమును బ్రకటించిరి.

30 వ తేదీ యుదయము 8 గంటలకు పుష్పతోరణాలంకృతమై పరిషద్భవనపురోభాగవర్తియైయున్న కాయమానముక్రిందఁ గవిపండిత సమావేశము జరిగినది. వేదగానముతోఁ బ్రార్థనలతోఁ బరిషద్వ్యావహారసభ ప్రారంభమయ్యెను. ఈవార్షిక సభకు స్వాగత సంఘాధ్యక్షులు శ్రీ దంటు సూర్యారావు గారు. పరిషదధ్యక్షులును మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణేత్యాది బిరుదాంకితులు, ఆస్థానకవులు నగు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిలవారు అధ్యక్షులు; సభాప్రారంభకులుసుప్రసిద్ధులగు ఉమర్ ఆలీషా కవిగారి పుత్రులగు జనాబ్ కబీర్ షా గారు.

సభాప్రారంభమునకు ముందు శ్రీ దంటు సూర్యారావుగారు తమ స్వాగతోపన్యాసమును జదివిరి. పిమ్మట జనాబ్ కబీర్ షా గారు సభాప్రారంభ మొనర్చుచు నాంధ్రభాషకు నాంధ్రసాహిత్యపరిషత్తు

గావించిన సేవ నుగ్గడించి జాతిమత విభేదములు లేక యాంధ్రు లందఱు, ఈ పరిషత్తును బోషింపవలెనని హెచ్చరించిరి.

అనంతరము పరిషత్కార్యదర్శులు శ్రీ చతుర్వేదుల సత్యనారాయణ గారు 1946 నుండి నేటివఱకుఁ బరిషత్తు గావించిన భాషాకృషిని సంగ్రహముగ వివరించి యాంధ్రదేశమునఁ గల నిఖిలపక్షముల వారు తమకుఁ గల స్వల్పాభిప్రాయభేదముల యెడఁ బట్టుదలలు చూపక పరిషత్తుతోఁ గలిసి పనిచేయుటకై యుద్బోధ మొనర్చిరి.

అంతఁ బరిషదధ్యక్షులు శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు తమ యధ్యక్షోపన్యాసమున నాంధ్రభాష నేఁ డెట్టి హీనస్థితిలో నున్నదో వివరించి యాంధ్రులందఱుఁ దమ భాషౌన్నత్యమునకై నడుము కట్టవలె నని యుద్బోధించిరి.

పిమ్మట అవధానిశేఖర శ్రీ గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి గారు పరిషత్ప్రశంసాత్మకమగు పద్యముల నుపహారమశేయముగాఁ బఠించిరి. విద్వాన్ శ్రీ దువ్వూరి సూర్యనారాయణ శాస్త్రిగారు పరిషదధ్యక్షులగు శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారి భాషాసేవ నుగ్గడించుచుఁ బద్యములఁ జదివిరి. ఇంతటితో నుదయము సభ ముగిసెను.

మరల మధ్యాహ్నము 2½ గంటలకు సారస్వత, భాషా-వ్యాకరణ, చరిత్ర-సంస్కృతి, శాఖలుగా త్రిధావిభక్తమైన యీమహాసభలను మన యాంధ్ర రాష్ట్రమున నార్థికామాత్యులగు శ్రీ తెన్నేటి విశ్వనాథము ఎమ్. ఎ. బి. ఎల్. గారు ప్రారంభించిరి. వారు తమ గంభీరోపన్యాసమున ఫ్రెంచి సాహిత్య పరిషత్తువంటి యధికారయుతమైన యొక మహాసంస్థ యాంధ్రరాష్ట్రమున కవసర మని వాక్రుచ్చిరి. ఆంధ్ర భాషకుఁ దగిన సంక్షిప్తలేఖన మవసర మనియు రోమను లిపిని ననుసరించినచో 'టైపు' చేయుటకు నెంతయు సుకరముగ నుండు ననియు నుడివిరి. నాఁటి సారస్వత మహాసభాధ్యక్షులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు. వారు తమ యధ్యక్షోపన్యాసమున మనకు స్వారాజ్యము లభించుటయు, ఆంధ్ర రాష్ట్ర మేర్పడుటయు, మరల నాంధ్రసాహిత్యపరిషత్తు పునరుజ్జీవిత మగుటయు ఆంధ్రజాతికి, ఆంధ్రభాషకు శుభోదయమును సూచించు

చున్నదని నుడివిరి. మొదటినుండియు మనవారు సారస్వతమునకంటె శాస్త్రమున కెక్కువ ప్రాధాన్య మొసంగుచున్నారనియు, ఒకజాతి నాగరికత పెంపొందవలె నన్న సారస్వతపోషణ మత్యవసర మనియుఁ దెల్పిరి.

ఆంధ్రవిశ్వకళా పరిషదాంధ్ర శాఖా ప్రధానాచార్యులు శ్రీ గంటి జోగిసోమయాజులుగారు పరిషత్తులను ప్రభుత్వము పోషింపవలసిన బాధ్యతలనుగుఱించి యుపన్యసించిరి. నరసాపురము కళాశాలాంధ్రభాషా ప్రధానోపన్యాసకులు శ్రీ దేవరకొండ వీరయ్య, ఎమ్. ఏ. గారు 'ఆముక్తమాల్యద-కథాశిల్పమును' గుఱించి తమ యుపన్యాసము పఠించిరి. విశాఖపట్టణమందలి ఎ.వి. యన్. కళాశాలాంధ్రభాషాప్రధానోపన్యాసకులు శ్రీ దివాకర్ల రామమూర్తిగారు "అవహేళన కావ్యములు" అను తమ యుపన్యాసమును పఠించిరి. కోనసీమ కళాశాలా ప్రధానాంధ్ర పండితులు శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు "ఆంధ్రభాషాప్రాశస్త్యమును" గుఱించి యుపన్యసించిరి. బందరు జాతీయ కళాశాలాధ్యక్షులు శ్రీ మత్తిరుమల గుదిమెళ్ళ వరదాచార్యులుగారు "నేఁటివిద్యావిధానమున సంస్కృతమున కీయవలసినస్థానము"నుగుఱించి యతిగంభీరముగ నుపన్యసించిరి. శ్రీ అనుముల వెంకటశేషకవిగారు (కర్నూలు) రామాయణమునందలి కొన్ని సంశయములనుగూర్చి వివరించిరి. శ్రీ బండా కొప్పులింగేశ్వరరావుగా రాంధ్రభాషాభివృద్ధికై ప్రభుత్వకర్తవ్యమునుగుఱించి యుపన్యసించిరి. శ్రీ శిష్టా వెంకటజోగారావుగారు "తిరుమలకవి గీతరఘువంశమును" గూర్చి వ్యాసముచదివిరి. శ్రీ భమిడి సత్యనారాయణశర్మగారు "రామాయణమునందలి హాస్యరసమును" గుఱించి వ్యాసమును పఠించిరి. శ్రీ మల్లాది శివరామ్‌గారు 'కవితాకండూతి' అను విషయమునుగూర్చి తమపద్యములు చదివిరి. శ్రీ కేశవరపు వెంకటరామకోటిశాస్త్రిగారు "దేవయాని పాత్రచిత్రణము"గూర్చి తమ యుపన్యాసమును పఠించిరి. అనివార్య కారణములచే నీసభకు రాఁజాలకుంటి మని తెలుపుచు శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు "ఆముక్తమాల్యద-రాయలవారి యాంతరభావములు" అను

విషయమునుగూర్చి వ్యాసమును బంపిరి. దీనితో ఆనాఁటిసభ రాత్రి 9 గంటలకు ముగిసెను.

31—1—54 నాఁటియుదయము సరిగా 8 గంటలకు భాషా-వ్యాకరణ మహాసభ ప్రారంభమయ్యెను. శ్రీ మత్తిరుమల గుదిమెళ్ళ వరదాచార్యులవారీసభను ప్రారంభించిరి. ఆంధ్రవిశ్వకళాపరిషదాంధ్రశాఖా ప్రధానాచార్యులు శ్రీ గంటి జోగిసోమయాజులుగా రధ్యక్షత వహించిరి. వీరు తమ యధ్యక్షోపన్యాసమున భాషాభివృద్ధికై ప్రభుత్వకర్తవ్యమును గుఱించియు, వ్యాకరణ రచనావిధానమునుగూర్చియు విపులముగాఁ జర్చించిరి. పిమ్మట విద్వాన్ శ్రీ రాంభొట్ల లక్ష్మీనారాయణగారు (ఎ. వి. యన్. కళాశాల, విశాఖపట్టణము.) "ఆంధ్రభాషయందలి వికృతి పదస్వరూప నిరూపణము" అను విషయమునుగూర్చి తమ వ్యాసము వినిపించిరి. రాజమహేంద్రవరము, అగ్ర్యసేవాసదనమున కుపాధ్యక్షులగు శ్రీ ఏటుకూరి మల్లికార్జునరావుగారు 'కావ్యభాష' గుఱించి తమ వ్యాసము పఠించిరి.

పిమ్మట "ఆంధ్రభాషకు సర్వసమ్మతము పర్యాప్తమునగు వ్యాకరణము" అనువిషయమును గుఱించి చర్చ ప్రారంభమయ్యెను. ఈచర్చను శ్రీ పీఠికాపురమహారాజులుంగారి కళాశాలా పండితులగు శ్రీ కోవల్లి శివకామేశ్వరరావుగారు ప్రారంభించిరి. వీరు ఆంధ్రభాషకు వ్యాకరణావశ్యకతను నిరూపించి తద్రచనావిధానమును విపులముగా విమర్శించిరి. పిమ్మట ఆంధ్రవిశ్వకళాపరిషత్తునందు ఆంధ్రభాషోపన్యాసకులగు శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారు "నేఁడు వ్యాకరణము నెట్లు సంస్కరింపవలెను" అను విషయమునుగుఱించి మృదుమధురముగా నుపన్యసించిరి. అధ్యక్షుని చరమోపన్యాసముతో నాపూఁటసభ ముగిసెను. ఆనాఁ డనకాపల్లిలో రైలు ప్రమాదవశమునఁ దాము సభకు రాఁజాలమని శ్రీ ఆకెళ్ళ అరుణాచలశాస్త్రిగారు, శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారు తంత్రీవార్త నంపిరి. వారి వ్యాసములు క్రమముగఁ బరిషత్సం

చికలోఁ బ్రచురింపఁ బడును. ఇంకను శ్రీ చిలుకు వెంకటరమణయ్యగారు శ్రీ కె.వి.ఎన్. అప్పారావుగారును (ప్రిన్సిపల్, కొవ్వూరు సంస్కృతకళాశాల) తమ వ్యాసములు పంపిరి.

మగల మధ్యాహ్నము 2½ గంటలకు చరిత్ర-సంస్కృతి మహాసభ సమావేశమయ్యెను. ప్రారంభకులు శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు. ఈసభకు అధ్యక్షులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు తమ ప్రారంభోపన్యాసమున, భాషకుఁ జరిత్రకు జీవితము ధారపోసిన శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారీ సభ కధ్యక్షత వహించుట మహాభాగ్య మనిరి.

సభాధ్యక్షులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమ యధ్యక్షోపన్యాసమునకు ముందు చిరకాలమునుండి సాంస్కృతిక చారిత్రిక విషయములలోఁ బరిశోధనలు గావించిన శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారి స్వర్గవాసమునకుఁ దమ సంతాపము వెలిఁబుచ్చిరి.పిదప నేఁడు సంస్కృతి పదప్రచారమును, తత్ప్రాచీనతావిశిష్టతలను జేర్కొని యీపైఁ దమ "చరిత్ర-సంస్కృతి"అను వ్యాసమును బఠించిరి.

శ్రీ నోరి నరసింహశాస్త్రి బి.ఎ.బి.ఎల్., గారు (రేపల్లె)"మోటుపల్లి"యను విషయమునుగూర్చి దమ వ్యాసమును జదివిరి. శ్రీ కందూరి యీశ్వరదత్తు బి.ఏ. గారు "ఆంధ్ర దేశమందలి చరిత్రకు భూగోళమునకుఁగల సంబంధము"అను విషయముగురించి తమ వ్యాసమును జదివిరి. అభినవవ్యాస శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు చరిత్ర సంస్కృతుల సంబంధమునుగూర్చి యుపన్యసించిరి. శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు త్రిధావిభక్తమైన పరిషద్వార్షిక మహాసభలు ప్రస్తుతసమావేశవిశిష్టతలను జాటుచున్నవనియు, దీనినిబట్టి భాషకు, వ్యాకరణమునకుఁ, జరిత్రకుఁగల త్రయను బంధసూత్రము గోచరించుచున్న దనియుఁ జెప్పి యిఁక ముందుగూడ నీశాఖలకుఁ జెందిన విద్వాంసులను

నిట్టే సమకూర్చి యాంధ్రసాహిత్య పరిషత్తు సర్వతోముఖమైన భాషా సేవచేయ నాశించు చున్నామనిరి.

శ్రీ ఓరుగంటి రామచంద్రయ్యగారు ఎం. ఏ, పి. హెచ్. డి. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారెంత చరిత్రపారంగతులో యంత కావ్య రసజ్ఞులు, నేను వారికి నేకలవ్యశిష్యుఁడనని చెప్పి మనచరిత్ర సంస్కృతుల నిలఁబెట్టినది సాహిత్యమేయని యుపన్యసించిరి.

ఇంతటితో చరిత్ర-సంస్కృతి మహాసభ ముగిసినది. సభాంతమున రాత్రి 8 గంటలకు శ్రీ గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రిగారు చాలరస వంతముగ, జయప్రదముగను నష్టావధానము సలిపిరి. శ్రీ మొసల కంటి తిరుమలరావుగారు శ్రీ గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి గారి యష్టావధాన సామర్థ్యమును బ్రశంసించుచు, నిట్టి సమావేశములు చేయించిన యాంధ్రసాహిత్యపరిషత్తునకుఁ బ్రభుత్వము ధనసాహాయ్య చేసి, యాంధ్ర భాషను బెంపొందింపవలెనని నుడివిరి. సభాంత మునఁ బరిషత్కార్యదర్శులు శ్రీ ప్రతివాద భయంకర పార్థసారథిగారు దూరదూరములనుండి పరిషద్వార్షిక మహాసభలకు విచ్చేసి విజయ వంతము కావించిన కవులకుఁ బండితులకు, రసజ్ఞులకుఁ దమకృతజ్ఞ తను వెలిఁబుచ్చిరి. ఈసభలకుఁ బెక్కువిధములఁ దోడ్పడిన పౌరులకు, అతిథి నివాసమునకుఁదమ యున్నత పాఠశాలాభవనము నొసంగిన శ్రీ పుర పాలక సంఘమువారికి, భోజనాది సౌకర్యములకుఁ దమభవనమంతయు నిచ్చి, పరివారసహితముగ నతిథి సత్కారమునఁ దోడ్పడిన శ్రీ భమి డిపాటి సత్యనారాయణ గారికిఁ దమకృతజ్ఞతను దెల్పిరి. అంత జయ జయనాదములు మిన్నుముట్ట సభలు సమాప్తమయ్యెను.

సభలలోఁ జదువఁబడిన వ్యాసములను, సభలలోఁ జదువుటకై పంపఁబడిన వ్యాసములను ప్రత్యేకసంచికగా త్వరలో వెలువరింతుము.

---

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

౧౯౫౮ సం॥ర జనవరి ౩౦-౩౧ వ తేదులలో జరిగిన వార్షిక మహాసభలలో ఆమోదింపబడిన **తీర్మానములు.**

౧. భారతీయ సంస్కృతికిని, అన్ని భారతీయ భాషలకు, ముఖ్యముగ తత్సమ పదబహుళ మగు నాంధ్రభాషకు, ప్రాణాధారమగు సంస్కృత భాషను ఉన్నత పాఠశాలలలోను, కళాశాలలలోను నందఱికి నవశ్య పఠనీయముగఁ జేయవలయు నని ప్రభుత్వము వారిని గోరుచు, ఈసభ వారు తీర్మానించుచున్నారు.

ప్రతిపాదకులు—శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు.
అనువాదకులు—శ్రీ దువ్వూరి వెంకటరమణశాస్త్రిగారు.

౨. ఆంధ్రభాషకు సాధ్యమైనంతవఱకు సర్వసమ్మతము, పర్యాప్తమైన వ్యాకరణ రచనమునకై కృషిచేయఁగల యొక సంఘము నేర్పఱచుటకు పరిషత్కార్య నిర్వాహకసంఘము వారిని, ఈసభ వారు కోరుచున్నారు.

ప్రతిపాదకులు—శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు.
అనువాదకులు—శ్రీ దివాకర్ల రామమూర్తిగారు.

౩. మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయమునందలి, తంజావూరు సరస్వతీ మహాలు నందలి, ఆంధ్రగ్రంథములను, ఆంధ్ర లిపియందు వ్రాయఁబడిన సంస్కృత గ్రంథములను, ఆంధ్రరాష్ట్రమునకుఁ జెందవలసిన యితర సంస్కృత గ్రంథ భాగమును, ఆంధ్రసాహిత్య పరిషత్తు, కాకినాడ యందుఁ జేర్పవలసినదని ప్రభుత్వము వారిని ఈ సభ వారు కోరుచున్నారు.

ప్రతిపాదకులు—శ్రీమత్తిరుమల గుడిమెళ్ళ వరదాచార్యులుగారు
అనువాదకులు—శ్రీ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారు.

౮. ప్రస్తుతమున్న ప్రజాస్వామిక ప్రభుత్వ పరిస్థితులలో జమీందారుల, సంస్థానాధీశుల సాహాయ్యమునకు నవకాశము లేక పోవుటచే బరిషత్పోషణమునకుఁ దగినంత సాహాయ్యమొసరింపఁ బ్రభుత్వము వారిని ఈ సభ వారు ప్రార్థించుచున్నారు.

ప్రతిపాదకులు—శ్రీమాన్ కిడాంబి రాఘవాచార్యులుగారు.
అనువాదకులు—శ్రీ యెండమూరి వెంకటరమణగారు.

౯. కేంద్రప్రభుత్వముచే స్థాపింపబడిన, అఖిలభారతి సాహిత్య పరిషత్తునకు, అనుబంధమగు ప్రాంతీయ సాహిత్యశాఖాసంస్థగా, ఆంధ్ర ప్రాంతమునకు నాంధ్రసాహిత్యపరిషత్తును గుర్తింపవలెనని, కేంద్రప్రభుత్వమువారిని ఈ సభ వారు ప్రార్థించుచున్నారు.

ప్రతిపాదకులు—శ్రీ కుందూరి యీశ్వరదత్తుగారు.
అనువాదకులు—శ్రీ చతుర్వేదుల సత్యనారాయణగారు.

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

శ్రీ పిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్ద నిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమసంపుటమును, 955 పుటలుగల రెండవ సంపుటమును, 980 పుటలుగల మూఁడవ సంపుటమును, 950 పుటలుగల చతుర్థసంపుటమును, ముద్రితములై విక్రయమునకు సిద్ధముగా నున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారము వఱకునుగల యచ్చులాదియందుఁగల సంస్కృతాంధ్ర శబ్దములన్నియుఁ గలవు. రెండవ సంపుటమున 'క' మొదలు 'జ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'త్ర' వఱకుఁగల శబ్దములును, చతుర్థసంపుటమున 'తె' 'న' వఱకుఁగల శబ్దములును గలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమ మయినది. ఈ పుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యము పట్టినను ధనవంతులకే గాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయు నను తలంపులో కింది వెల నిర్ణయింపఁబడినది.

క్యాలికో బైండింగు ఒక్కొక్క వాల్యూము రు 6-లు.



# ప్రబంధములు—వర్ణనలు.

కాకర్ల వెంకట రామనరసింహము, ఎం. ఏ. పి. హెచ్. డి.



పురాణములకును ప్రబంధములకును గల ముఖ్యభేదములలో వర్ణనావిషయ మొకటియై యున్నది. పురాణకవి, కథాకథనము నందే దృష్టిని నిల్పినవాఁడై వర్ణనావిషయమునం దంతగా శ్రద్ధను వహింపఁడు. ప్రబంధకవితకు వర్ణన యొక ముఖ్యాంగము. అష్టాదశవర్ణనాత్మకమై ప్రబంధ ముండవలయు నను నియమమే యీయంశమున కొక ప్రబల నిదర్శనముగా నున్నది. తుదకీ వర్ణనలే మితిమీఱి ప్రబంధ రచన కొక కళంకము నాపాదించినవి. కాని రాయల కాలమునందలి ప్రబంధములు మాత్రము చాలవఱకు యథోచితవర్ణనావిలసితములై యే యున్నవి. ఈ యుగమునం దావిర్భవించిన ప్రబంధముల వర్ణనౌచిత్యమును గూర్చి ప్రసంగించుటకు ముందు వర్ణనావిషయమునఁ గల కొన్ని నియమములను బరిశీలింతము.

వర్ణనలు కథాగతిని సూచించునవి యై యుండవలయును గాని, దానిని నిరోధించునవి యై యుండరాదు. ఇది వర్ణనలయెడఁ గవి పాటింపవలసిన మొదటి నియమము. వర్ణ్యమానవస్తువు స్ఫురణకు రాక, వర్ణనాపద్ధతిపై మనసు పోయినప్పు డా వర్ణనలు కావ్యసౌందర్యభంజకము లనియే తలంప నగును. అనఁగా వర్ణనలయందు ఝటితిస్ఫురణయు నక్లిష్టతయు నుండవలయునే కాని, యవి గూఢభావగర్భితములును శ్లేషార్థగుంభితములు నై యుండరాదు. వర్ణనలు స్వాభావికములై యుండవలయును. అనఁగా వర్ణనలయందు సాంకేతికము లైన నియమము లధికముగా నుండినచో నవి చమత్కారావహములై యున్నను, వర్ణింపఁబడిన వస్తువు స్వచ్ఛరూపమునఁ బఠితలకు సాక్షాత్కరింపదు. వర్ణనలను గవులు తమ పాండిత్యప్రకర్షకునై చేయరాదు. దృశ్యమును గన్నులకుఁ గట్టినట్లు చేయుటకును, కథాకథనము పేలవముగా నుండ

కుండ నూత్నచైతన్యము గలిగించుటకును, వర్ణన లావశ్యకములై యున్నవి. వర్ణనల వలనఁ గథావస్తువును, నందలి పాత్రలును దృగ్గోచరము లగుటకు బదులు, అవి దూరదూరముగఁ బోయి మసకమసకగాఁ గన్పట్టినచో నిఁక నా వర్ణనల వలనఁ బ్రయోజన మేమి? అందుచే వర్ణనలను కేవల పాండిత్యప్రకర్షకునై చేయరాదు. ఇఁక వర్ణనము చేయుచో నే యంగమున కా యంగమును వర్ణించుటకంటె నాకారమంతయు స్మృతిపథమునఁ బడునట్టుల వర్ణించుట మేలు. అనఁగా నా వర్ణనము వలనఁ గవి మన కా యాకారమునందలి యే ప్రధానాంశమును బ్రదర్శింప నెంచెనో, అది సుబోధక మగునట్లు గావించినఁ జాలును. తక్కినవి యప్రస్తుతములే యగును. ఇందులకుఁ దిక్కనార్యుని జమ్మివర్ణన మొక నిదర్శనము. ఇందుఁ గవి మనకుఁ జెప్పఁదలఁచినది తద్భయంకరాకారము. కవిబ్రహ్మ తనవర్ణనానైపుణ్యము నంతయుఁ దద్భయంకరత్వ ప్రదర్శనమునందే కేంద్రీకరించి యున్నాఁడు. ఇంతకును సకలాంగముల కూడికలోనే అంగిసౌందర్యము కలదు గాని, యే యంగమున కా యంగమును విడదీసిన నేమి సౌందర్యము కలదు.

ఇవి వర్ణనావిషయికము లైన కొన్ని నియమములు. ఇవి ముఖ్యముగాఁ బాటింపఁదగినవి. కాని యీ నియమము లన్నియు సూచనామాత్రములే యని గ్రహింప నగును. కవిలోకమునుగూర్చి యే విషయము మాటలాడినను "నిరంకుశాః కవయః" అను వాక్యమును మాత్రము మఱువరాదు. కవు లందఱు నొకే స్వభావము కలవారై యుండరు. కొందఱు బహువర్ణనాప్రియులై యుందురు. కొందఱకు స్వభావోక్తి యనిన నభిమానము. కొందఱకు నతిశయోక్తి యనినఁ బ్రీతి. కొందఱి కుత్ప్రేక్షయుఁ గొందఱి కుపమయుఁ బ్రాణములు. వారివారి వ్యక్తిత్వమును బట్టి వారివారి యభిరుచులు మాఱుచుండుటయు, భిన్నభిన్నమార్గములఁ బోవుచుండుటయుఁ గలుగును. ఎవరి కేది స్వభావసిద్ధమై యుండునో దానిని వా రెంతగాఁ బ్రయోగించినను విసువు జనింపదు. మఱియు నాహ్లాదకరముగా నుండును. కాని కవు లందఱును స్వతంత్రవ్యక్తిత్వము కలవారు కారు. అందు గతానుగతికుల సంఖ్యయే యధికము. వసుచరిత్ర కాఁగన్క

శ్లేషానుప్రాసాదులయందుఁ బ్రీతి మెండు. అవి యాతనికి స్వభావసిద్ధములై యున్నవి. అందుచే నాతని గ్రంథమునకు సంబంధించి యంతవఱకు నవి ప్రయోజనకరములే యగుచున్నవి. అవియునుగాక యతని కవితయం దితరములగు విశిష్టగుణము లనేకములు గలవు. ఇంకఁ బిల్లవసుచరిత్రములఁ జూతుఁడు. పులిని జూచి నక్క వాతలు పెట్టుకొనె నను నామెత వీనియందు సార్థక మగుచున్నది. వసుచరిత్రకారునకు శ్లేషానుప్రాసాదులయందుఁ గల ప్రజ్ఞ సహజసిద్ధము. వీరి కన్నదో యది బహుప్రయత్నసాధ్యము. అందుచేతనే కృత్రిమము. అస్వాభావికము లైన యీ రచనలందముకులుగా నుండి రసికులకు విసువు పుట్టించును. ఈ విషయమునకుఁ జేమకూర వేంకట కవి యొకయపవాదము (Exception). వసుచరిత్రకారునితోఁ బోటీకి నిలుచుటయే కాక, కొన్నిపట్టులలో నాతనిని గూడ వేంకటకవి మీఱెనాఁ డనుట సత్యదూరము కాదు. ఇంతకును జెప్పవలసిన దొక్కటే. కవి యేది వ్రాసినను నెట్లు వ్రాసినను నది యాతనికి స్వభావసిద్ధమై యుండవలయును. అస్వాభావిక మగు ననుకరణము కావ్యకళాసౌందర్యభంజక మగును.

స్వాభావిక మగు వర్ణనాప్రజ్ఞను బురాతన ప్రబంధకవులలోఁ బ్రప్రథమునిగాఁ జెప్పఁదగినవాఁ డల్లసాని పెద్దనార్యుఁడు. ఈతని వర్ణనలు స్వాభావికములై యుండుటే కాక, యయ్యాది కథాగతికి నద్భుతగులనివి కూడనై యున్నవి. పెంచి వర్ణించుటయు నీతని కిష్టమే. అయ్యు నయ్యది కడుంగడు హృద్యముగా నుండునట్లు వ్రాయఁగలఁడు. మార్కండేయపురాణమున రెండుపద్యములలో నున్న సిద్ధాగమనఘట్టము నీతఁ డించుమించుగా నొక యాశ్వాస మంతయు వ్రాసినాఁడు. ఇట్లే మార్కండేయపురాణమున స్వశ్వేశ్య యగు వరూథిని మారసమానుఁ డగు ప్రవరుని జూచినది' అని యతిసంక్షేపముగాఁ జెప్పఁబడిన భాగము నీతఁ డెన్నియో స్వకపోలకల్పనలు పెట్టి పెంచి వ్రాసినాఁడు. ఈ రెండును నీతని వర్ణనాప్రియత్వమునకుఁ బ్రబల దృష్టాంతములు. ఇట్టి వింకను నెన్నియేనియుఁ గలవు. గ్రంథవిస్తరభీతిచే నవి యిచట నుదాహరింపక విడిచినాఁడను.

ఇట్టి వర్ణనల వలనఁ బ్రబంధములకు 'ఫలద్వయము చేకూఱు చున్నది. ఒకటి వర్ణ్యమానవస్తువు ప్రత్యక్షముగా గోచరించుట, రెండు పాత్రల మనఃప్రవృత్తి విశద మగుట. ఈ రెంటను సాధించుటలో పెద్దనార్యుఁడు కృతకృత్యుఁ డైనాఁ డనవచ్చును.

మఱియుఁ బ్రబంధములపై నిక్కాలమున నొక యపప్రథ ప్రబలి యున్నది. ప్రబంధవర్ణనలు కథాగతికి సంబంధించి యుండవనియుఁ బ్రబంధకవు లనావశ్యక మైనను, శాస్త్రనియమోల్లంఘనమును గావింప లేక యప్రస్తావవర్ణనలతోఁ దమ కావ్యములను నింపుదు రనియు దాని సారము. ఈ యపప్రథ కేవల మాధారరహిత మనుటకు వీలు లేదు. క్షీణయుగములోని కొన్ని ప్రబంధములను బరిశీలించితి మేని యియ్యది సత్యమే యనిపించును. కాని మహాకవికృతములై వాఙ్మయాలంకారము లనఁదగిన ప్రబంధము లెన్నియో కలవు. వానిని గూడ నిట్లే దూషించుట యవివేక మనందగును. మనుచరిత్రాది మహాప్రబంధముల యందుఁ గల వర్ణనలు, కథాగతికి నెట్లు సాహాయ్యకము లగుచున్నవో యీ క్రింది దృష్టాంతములను బట్టి గ్రహింప నగును.

ప్రబంధకవులు ప్రకృతివర్ణనమును గావించి నప్పుడు కూడ నద్దానిని కథాగతితో నెట్లు మనోహరముగా మేళవింపఁగలరో చూడుఁడు. ప్రవరుఁడు వీతిహోత్రుని సాహాయ్యమున నిజగృహమును జేఱినాఁడు. విరహానలదందహ్యమానమానస యగు వరూథిని, పూచిన లతాగృహమునందుఁ జంద్రకాంత శిలాతలమున మేనుఁ జేర్చి బహువిధశాభేదములతో బాధపడుచుండెను. అట్టి సమయమున సాయంసమయాంధకార వర్ణములను గవి చేసినాఁడు సాయంసమయమున సూర్యుఁడు కషాయదీధితిని దాల్చినాఁ డని చెప్పుచు నద్దానిని బ్రకృతకథతోఁ గవి యెట్లు కలిపినాఁడో చూడుఁడు.

"తరుణి ననన్యకాంత, నతిదారుణ పుష్పశిలీముఖ వ్యథా
భరవివశాంగి, సంగభవుబారికి సగ్గము సేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చెఁ గషాయదీధితిన్"

సూర్యుం డస్తంగతుం డగునప్పు డరుణ దీధితిని బొందుట సహజమే యయ్యు నద్దానిని బ్రవర కృత వరూథినీ తిరస్కార జనిత రోషముగా నుత్ప్రేక్షించి కవి యీ వర్ణనకును గథకును నవినాభావసంబంధమును గల్పించినాఁడు.

మఱియుఁ గవి యిచ్చోటఁ గావించిన వర్ణనలు ముందు రాఁబోవు కథను సూచించునవి యై యున్నవి. ఈ క్రింది పద్యమును జూడుఁడు.

"ఉరుదరీకుహర సుప్తోత్థ శార్దూలముల్
ఘురవారి శోణిత శంకఁ ద్రావ
ననకుంజమధ్య శాద్వలచరన్మృగపంక్తి
దావపావకభీతిఁ దల్లడిల్ల
నాశ్రమాంతర భూరుహాగ్రముల్ మునికోటి
బద్ధకాషాయ విభ్రాంతిఁ జూడ
ఘనసాను శృంగ శృంకాటకంబులఁ గాంచి
యమరులు హేమాద్రి యనుచు వ్రాల
గాఁ బేశలరుచిఁ గింశుకప్రవాళ
ఘుస్పృణకిసలయ కంకేళికుసుమగుచ్ఛ
బంధుజీవ జపా రాగబాంధవంబు
లన్నగంబున జరఠారుణాతపములు."

ఈ పద్యములలోఁ గవి వర్ణించినది భ్రాంతి. సుప్తోత్థితము లైన పులులు సెలయేటి నీటిని రక్త మనుకొనుచున్నవి. జింకలు పొదరిండ్లను దవదహన మనుకొనుచున్నవి. మునులుకూడఁ దమ యాశ్రమవృక్షముల కొనలను జూచి తమ కావివస్త్రము లేమో యనుకొనుచున్నారు. ఎఱ్ఱని చఱియలను, శిఖరములను జముకములను గాంచి, దేవతలు మేరుపర్వత మేమో యనుకొనుచున్నారు. ఇది యంతయు భ్రాంతిమాత్రమే. ప్రకృతి యంతయు భ్రాంతిమయమై యున్నది జంతువులును మనుష్యులునే కాక దేవతలు కూడ భ్రాంతి కధీనులై యున్నారు. అట్టిచో, విరహముచేఁ గ్రాఁగి క్రాఁగి యున్న యెడంద గల వరూథిని, భ్రాంతికి లోనగుట యొక

యబ్బురమా ! మాయాప్రవరుని ప్రవరునిగా భావించి యామెయు భ్రాంతికి లోనైనది. ఈ పద్యమున నమరులను గూడఁ జేర్చుటయందలి కవిప్రతిభను రసికు లూహింతురుగాక! ఇట్లే ఆ సాయంసంధ్యాసమయమునఁ బ్రియు నెడబాసి, తదీయ విరహమునుచే నిర్వేదము నొందుచున్న నొక చక్రవాకికి వర్ణించి,కవి యప్పటి వరూధిని దురవస్థను సూచించినాఁడు చూడుఁడు.

"ఏ విహంగముఁ గన్న నెలుఁ గిచ్చుచును సాగి
 చను సైకతంబులఁ గూడఁ దాఁకు
దాఁకి కన్గొని యది తన జోడు గాకున్న
 మెడ యెత్తి కలయంగ మింట నరయు
నరసి కన్నీటితో మరలి తామర యెక్కి
 వదన మొండగఁ సరోవారి నద్దు
నద్ది త్రావఁగ నైప కట్టిట్టు గన్గొని
 ప్రతిబింబ మీక్షించి భ్రమసి యుఱుకు
నుఱికి యెఱకలు దడియ వే ఱొక్క తెమ్మ
కరుగు నఱిగి రవంబుతోఁ దిరుగు తేంట్ల
బొడుచు ముక్కున, మఱియును బోవు వెదక,
సంజఁ బ్రియుఁబాసి వగ నొక్క చక్రవాకి".

ప్రియవియోగము పక్షులకే దుస్సహమగుచుండఁగా నిఁక స్వార్థ్యోక్తి యగు వరూధిని విషయమున నది యెట్లుండునో చెప్పవలయునాయని కవి యాశయము. ప్రబంధములలో దీనికీడు గల ప్రకృతివర్ణనలు మృగ్యము లనుట యతిశయోక్తి కాదు. సూక్ష్మాతిసూక్ష్మము లగు ప్రకృతిధర్మములను జిత్రించుటలో పెద్దనకు సాటి యనఁదగిన యాంధ్రమహాకవు లెందఱో లేరు.

మెలమెల్లనఁ గటికిచీకటి దిశాస్తోమము నాక్రమించినది. వరూధినీ హృదయమునను నంధకారము ప్రవేశించినది. అంతటఁ జంద్రోదయమైనది, కాని యేమి ఫలము? చంద్రకాంతి విరహిణులకు సుఖాస్పదము

కాదు. అందులకే యీ క్రిందిపద్యమున వెన్నెలచిచ్చుతో సరిపోల్పఁ బడినది.

"జలజాగారపరంపరల్ మఘువ దాశా భిత్తిఁ దీండ్రించుచుఁ
దళమై వెన్నెలచిచ్చు లంటిన మిళద్భ్రాహ్యాచ్ఛదశ్యామికా
చ్ఛలనన్ గంది ముడుంగుచో సిమసిమచ్ఛబ్దంబుతోఁ బుట్టు న
గ్గలపుం గ్రొంబొగలో యనంగ వెడలెన్ గర్భస్వనద్భృంగముల్."

పద్మము లీఁట ముడుచుకొనినవి. వరూధినీ హృదయకమలమును ముడుచుకొనినది. ఇప్పటి యవస్థలోఁ జంద్రిక, కమలములకును వరూధినీ హృదయకమలమునకుఁ గూడ శత్రువే. వరూధినీ హృదయావేదము పద్మముఖనిర్యద్భృంగనాదముచే సూచింపఁబడినది. పిదపఁ జంద్రుని గామోద్రేకమునకై యుపయోగింపఁబడు సిద్ధౌషధముతో సరిపోల్చి వరూధినీ హృదయాంతరాళమున నంతకంత కతిశయించు మదన సంతాపమును నిరూపించినాఁడు. మఱియు నక్కడక్కడ ననేకపద్యములలో నొక్కొక్క వాక్యములోనే, అప్పటి వరూధిని యవస్థను జిత్రించి, ప్రకృతియు నామెయెడ నెట్టి సానుభూతిని జూపుచున్నదో కవి మన కెఱుక పఱచినాఁడు చూడుఁడు. తృ. ఆ. ప. 12

... ... ... దిశాస్తోమంబు శోభా దరిద్రాణం బయ్యెఁ,
సరోజషండములు నిద్రాణంబులయ్యెన్ గడున్.

దిక్కులకాంతి తఱిగిపోయినది. వరూధినీవదన శోభయుఁ దఱిగిపోయినది. సరోజషండములతోఁబాటు వరూధినీహృదయ కమలమును ముకుళించుకొనిపోయినది. లేక వరూధినీ హృదయకమలము ముకుళింపఁగనే, సరోజషండ నిమీలన మను నెపమునఁ బ్రకృతి సానుభూతి చూపినది. ఇట్లే చంద్రాస్తమయమును గూడ వరూధిని విరహావస్థతో సరిపోల్చి సిద్ధన వర్ణించినాఁడు.

"పాటన సేయమిన్ గుసులుపైఁబడి శీర్ణపటీరపంక లా
లాటికమై దరస్మితవిలాసపుఁ జంద్రిక సోఁకి వాడుటల్
దేటఁ బొఱంగి విన్న నగు నీ మొగమో యన మాపి చంద్రుఁడో
పాటలగంధి వ్రాలె నదె భానురుచిన్ దన కందు మాయఁగన్.

వరూథినిముఖమునందు గురులు జాతియున్నవి. చంద్రుని యందు గళంకమున్నది. భానురుచిచే జంద్రుని కాంతి మాసిపోయినది. వరూథిని ముఖమునను జిరునవ్వును కాంతి యంతరించినది. అర్ధపుబిళ్ళ వలె నున్న చంద్రుడు మంచిగంధ మంటగట్టిన పావట బొట్టువలె నున్న వరూథినిముఖముతో పరిపోల్పఁబడియున్నాఁడు. ఇట్లు పెద్దనార్యుని ప్రకృతివర్ణనలు పాత్రల యవస్థతో నైక్యమై యుండును గాని, వేని కవి విడివిడిగా నుండి కూర్చ్పఁబిగి పడలింపవు

పెద్దనాఁ ౘడు పశుపక్ష్యాదుల యింగితము నెఱింగినవారిలో మేటి. మానవస్వభావవర్ణనముకంటె పశుపక్ష్యాదుల స్వభావమును వర్ణించుట కష్టతరమై యుండును. ఇందులకు సూక్ష్మాతిసూక్ష్మమైన పరిశీలనయు, విపుల మగు లోకజ్ఞానమును, బ్రకృతితోడి నిరంతరపరిచయమును నావశ్యకములై యుండును. పెద్దనార్యుని యీ క్రింది పద్యములను బరిశీలించినవారికి యంశము విశదము కాకపోదు.

"పలుకులు నేర్చువేళఁ గలభాషిణి నీ వెటు లుండఁ బంజరం
బుల నరగన్ను వెట్టి ముఖముల్ చరణాగ్రనఖాళిఁ గోఁకుచున్
నిలుగుచు నావులింపుచు వనీవిహగోత్కర మెట్లు వల్కెనొ
ప్పలుకులు యట్టు లెత్తి విని పల్కెడు వింటివె కీరశారికల్".

"కొలఁకొలఁ గూయుఁ బై నొఱగుఁ గుత్తుకఁ గుత్తుక, జుట్టుఁ బొటుఁ జి
ల్లాలక్రియఁ గానరాని గతులన్ మయిమైఁ బెనుచున్, జనించు న
న్నుల జుత్తనొత్తు, సోలు నిలుచున్ విధిచాతురిఁ గూడియున్ రతిన్
దలఁపవు, కంటె పాసినవెతల్ దలఁపించుచుఁ గోక దంపతుల్".

వరూథిని యొక తోటలోఁ బ్రవేశించినది. అందే యామె మాయాప్రవరుని జూచును. దానిని సూచించువాఁడు వోలె కవి యీ క్రింది పద్యమును వ్రాసినాఁడు.

## ప్రబంధములు - వర్ణనలు

"ఉరగఫూత్కారధూమోగ్రగంధముఁ బాసి
పొలయుఁబో యీ తావి మలయ పవనుఁ
డనలాక్షు పెడబొబ్బ నలమిన గేలడిమ్ముఁ
బాయుఁబో యీ తేంట్లపాట మరుఁడు
ఘర్మసామీప్యసంకలితదాహస్ఫూర్తి
నాఁగుఁబో యీ నీడ నల్ల మధుఁడు
గరళసోదర్యాత్తకరసుధాకటుకత్వ
ముడుపుఁబో యీ తేనె నోషధీశుఁ

డనఁగఁ జంపక కురవక పనస తిలక
నిచుల వంజుల దాడిమీ విచికి లామ్ర
పాటలీ పూగ కేసర ప్రముఖతరుల
సొబగు మీఱు నుద్యానంబుఁ జొచ్చి యచట".

మలయపవనునకు, మదనునకు, మధునకు, విధునకుఁ గల లోపము లన్నియు నా యుద్యానవనమునందలి కమ్మనెత్తావివలనఁ దేటుల ఝుంకారమువలన, నీడలవలనఁ దేనియలవలన నశించినవి. అట్టిచోఁ దనకుఁ గల లోపముకూడఁ దీఱదా యని వేల్పుజవరాలియాస. ఇట్లు పెద్దనార్యుని వర్ణన లన్నియుఁ గథలో నైక్యమై యున్నవే కాని,యనావశ్యకముగా నదికి నట్లు లేవు. ప్రబంధమహాకవు లందఱు నిట్లే వర్ణించినారు. కాని ప్రబంధకవిత్వమునకు నిశితపరిశీలన మవసరము. పైపై చూపుల కయ్యది యందుబాటులో నుండదు. నిశితపరిశీలనమును ప్రౌఢసాహిత్యమును నుండినగాని, దఱి జేరరాని కవులలో నొకఁడు రామరాజభూషణుఁడు. ఈతఁడును బహువర్ణనాప్రియుఁ డనుమాట నిక్కువమే. ఈతని వసుచరిత్రము నందలి కథావస్తు వత్యల్ప మైనది. అత్యల్ప మైన యా యితివృత్తమును బెంచి ప్రౌఢప్రబంధముగా వ్రాసిన యి మ్మహాకవి వర్ణనాప్రతిభకు లోక మచ్చెరు వందినది. మనోజ్ఞము లగు నీతని వర్ణనములలో నొక్కటి ప్రథమాశ్వాసములోని చైత్రలక్ష్మీవర్ణనము. అందు హృద్యము లగు పద్యముల నిటఁ బొందుపఱచుచున్నాను.

"ఒనర హిమానీవకుంఠనము లూడ్చి తెమల్చిన పత్త్రభంగముల్
నన నసియాడుచున్ మొగడచన్నులు పల్లవపాణిఁ గప్పి నూ
తన లతికాలతాంగుల నుదారగతిం జలి వాపి నెయ్యపుం
బెనకువ నేర్పె దక్షిణసమీరణుఁ డొయ్యనఁ దావు లంటుచున్".

"అలరుం గైదువుజోదు కూర్మిసయిదో డై, మాధవ శ్రీతపః
ఫలమై యాడు మరుత్కుమారుఁ బ్రియ మొప్పం దేనె నీరార్చి పెం
దెలిపూజొంపపుఁబొత్తులం బొదివి ధాత్రీజాతముల్ జోలవా
డె లసత్పల్లవడోల నుంచి కలకంఠీనాద గీతంబులన్".

"అరిగాఁ బంచమ మేపగించి నవలా లవ్వేళ హిందోళ పై
ఖరి నూపం బికజాత మాత్సరవభంగ వ్యాకులంబై నసీ
ధర నాలంబిత పల్లవవ్రతవిధు ల్దాల్పం దదీయధ్వనిన్
సరిగాఁ గైకొనియెన్ వసంతము మహాసంపూర్ణ భావోన్నతిన్".

"చివురుం గైదువు వేల్పు చైత్రమున నక్షీణధ్వజోత్క్షేప నై
భవుఁ డై, తెమ్మెర తేరిపైఁ గదలి రాఁ బ్రత్యగ్ర సాలాగ్ర హా
ర్మ్యవిటంకంబులు ప్రాకి, వల్లి వనజాస్య ల్సల్లి రుత్ఫుల్ల ప
ల్లవహస్తంబుల భావిభావుకఫలోల్లాసంబుతోఁ గ్రొవ్విరుల్".

వసురాజు రథారూఢుఁడై యుద్యానవనమున కరిగి యందు విహరించు నప్పుడు కవి గావించిన వర్ణనము మనోజ్ఞమును నదృష్టపూర్వమును నై యున్నది చూడుఁడు.

"నృపమాళిభర సువర్ణ పరాగములు సువ
ర్ణపరాగములు నభిన్నత వహించెఁ
గమనీయ తపనీయ కదళికాపవనంబు
కదళికాపవనంబు కలసి మెలఁగె
లలితమాగధలోక కలకంఠ గానంబు
కలకంఠగానంబు నలమికొనియెఁ
దతవాదకసమీరహత కిన్నరీరుతుల్
కిన్నరీరుతులు నేకీభవించె

నపుడు సేరంగ వచ్చిన యవనిజాని
కవనిజానీక మచట సాష్టాంగ మెఱఁగెఁ
గేళివన బహిరంగణాక్షీణ మధుర
మధురస ఝురానుబింబ సంభావనమున".

"ఘనతరఫలానతాఖండ కదళికలును
గీరరాజీ కృత సజీవ తోరణములుఁ
బొంగు నెలమావికురుజు లభంగ నవ ఫ
లావళులుఁ గాంచె నృపుఁడు వనాగ్రసీమ".

ఈ పద్యములోఁ గవి, సహజములైన యలంకారములకును కృత్రిమము లైన యలంకారములకును నభిన్నసాజాత్యమును నిరూపించి యున్నాఁడు. తెఱచుగా నగరాలంకారములయందు ఖండితకదళికలు, నిర్జీవము లగు చివురులతోరణములు, త్రెంపిన ఫలములును నుపయోగింతురు. ఇఁట నటులఁగాక సజీవము లగు ననఁటులే యున్నవి. బాఱులుగఁ దిరుగు చిలుకలగుంపులు సజీవతోరణములుగ నున్నవి. పక్షిచంచూహతులచే భిన్నములు గాక యభంగములై తమ నెలవులనే యున్న ఫలావళులు రాజునకు నేత్రోత్సవమును గలిగించినవి. ఇట్లే మనోహరములై యున్న మఱికొన్ని పద్యములు.

"అల చైత్రాంచితసత్త్రిశాలికల నిష్టాహారతృప్తిం గుతూ
హలము ల్గాంచు ద్విజావళుల్, శ్రుతిహితావ్యాజానులాపంబుతో
నలఘు శ్రీకరశాఖికాంచల వినిర్యత్కేసరార్ద్రాక్షతం
బులు రాల్చన్ నరదేవరత్నముకుటీ భూషావిశేషంబుగన్.

"ఆదరణీయరామకథనాంక శుకోక్తులతోడఁ దీవ ము
త్తైదువచాలు, శోభనపు టారతు లెత్తె, సదాగతిం గిరి
క్షోదవినోదికిం, జిగురుజొంపపుఁ గెంపుల పళ్లెరంబులం
బ్రోదిఁ దనర్చు నగ్గలపు మొగ్గలు ముత్తెపుముగ్గు లీనఁగన్".

"అలరారఁ నెలతాలఁ గట్టిన మహీజావాలము ల్గొన్ని స
త్ఫలసాంద్రంబులు గొన్ని, పల్లవరుచిప్రాగ్భారపట్టాంబరో
జ్జ్వలము ల్గొన్ని సమగ్రశారద రజోజాలంబులై మాధవుం
డులుపా నించిన కాన్యపాత్రికలు నా నొప్పెఁ నృపాగ్రింబునఁ".

"జనపతి చారసిల్ల, నొక సంపఁగితావులకొమ్మ, రాగవ
ర్ధన సుమనోఽభిరామ యయి కాంక వహింపఁగఁబోలు, గానిచో
ననుపమపంచసాయక కరాంచల చంచల చాపశింజినీ
జనితకఠోరఝుంకృతులు సైఁపక యున్నె పరాగపాండువై".

"చిగురుకెంగేలు సాఁచె రసాలవల్లరి
తేఁటిచూపులఁ జూచెఁ దిలకలతిక
పిక గీతిఁ బాడి చూపెఁ బ్రియాళులత, పల్కెఁ
గీరభాషలఁ గర్ణికారశాఖ
ముఖరక్తినింపె నింపు గల సంపఁగికొమ్మ
వన్నెగా నగియె లేఁబొన్నతీఁగె
సురభిశ్వసనంబు నెరపె సింధుకవల్లి
కుఱ్ఱచ్చెఁదావులు సోఁక గోవిరెమ్మ
యాత్మ రుచిరోపచారంబు లధిప కల్ప
కంబునకుఁ దత్తదామోదగరిమఁ బెనుప
నంగనానిత్యకలితదోహదవిశేష
నన్నుతాచారముల నడిసన్నకతన".

ఈ పద్యములలోఁ గవి జడప్రకృతిపై మానవత్వము నారోపించి వర్ణించియున్నాఁడు. ఈ పద్యములం దొక్కటొక్కటియే, కవిభావనాశక్తికిఁ బ్రబలనిదర్శనములై యున్నవి. సమ్మాన్యార్హము లగు శక్తులలో భావనాశక్తియు నొక్కటి యనుట కెట్టివారును సందేహింపరు. తద్విజృంభణ మీతని కవితావిలాసమునకు వన్నెపెట్టుచున్నది. సంస్కృతమున నిట్టి కవితారీతులకు మార్గదర్శకుఁడు శ్రీహర్షుఁడు. నలుని యుద్యానవనవిహారసందర్భమున నాతఁ డిట్టి భావముల నెన్నియేనియు

బ్రదర్శించియున్నాఁడు. మఱియు విసువు గలిగించునంతగాఁ బెంచి వర్ణించుటయు శ్రీహర్షునకు మిక్కిలి యిష్టము. రామరాజభూషణుఁడు నైషధాదులయందు గురుభావము గలవాఁ డగుటం జేసి, తచ్ఛాయ లీతని వర్ణనములందును గాన నగును. అంతమాత్రమున నీ కవి స్వతంత్రుఁడు కాఁ డని చెప్పఁజాలము.

మహాకవి ధూర్జటియుఁ దన కాళహస్తి మాహాత్మ్యమున యథోచితములును హృద్యములును నగు వర్ణనలనే చేసెను. ఇమ్మహాకవి బహువర్ణనాప్రియుఁడు గాకున్నను, జేసిన యా కొలఁది వర్ణన లైనను మిక్కిలి స్వతంత్రములుగా నున్నవి. వర్ణనలయందుఁగూడ నీతఁడు తనకు సహజమైన శివభక్తిని బ్రదర్శించియున్నాఁడు. కాళహస్తి మాహాత్మ్యమునందంతట శైవతేజము పొంగిపొరలుచుండును. చంద్రోదయావసరమున నీ విశ్వ మంతయు నిమ్మహాభక్తునకు శివార్చనముగా గోచరించినది. ఈ క్రింది పద్యమును బరిశీలింపుఁడు.

"ఉదయగ్రావము పానవట్ట మభిషేకోద ప్రవాహంబు వా
ర్ధి, ధరధ్వాంతము ధూపధూమము, జ్వలద్దీప ప్రభారాజి కొ
ముది తారానివహంబు లర్పిత సుమంబుల్గాఁ దమోదూర సౌ
ఖ్యదమై శీతగభస్తిబింబశివలింగంబొప్పెఁ బ్రాచీదిశన్".

ఈ పద్య మెట్టి సమయమున వ్రాయఁబడినదో చూడుఁడు. శివపూజావిధానవిషయమున హస్తికినిఁ బాపఱేనికిని భేదభావ మేర్పడినది. కాని యొకరినొక రెఱుఁగరు. ఒకరినొకరు నాశనముచేయ సన్నద్ధులై యుండిరి. ఆ యాతురతను గవియే యీ తీరునఁ జెప్పినాఁడు.

"ఎపుడు పడమటికొండపై నెక్కు భానుఁడెప్పు డుదయించు నే
బోదు నెప్పు డనుచు" "అయ్యవసరంబున" అని కవిసూర్యాస్తమయ చంద్రోదయాదులను వర్ణించినాఁడు. ఈ వర్ణనలు కథాగతికిఁ బోషకములై యుండుటయేకాక, యందలి పాత్రల మనోవేదనా పటిమను గూడఁ బ్రత్యక్షము చేయుచున్నవి. సాధారణముగ సూర్యోదయమును జంద్రోదయమును నగుచున్నను మన మంతగా వానినిగూర్చి విచారిం

వము. కాని యేదేని యొక ముఖ్యమగు పని మనసులో నున్నచో వానిని బలుమాఱులు భావింతుము. అప్పుడు ప్రతినిమేషముఁ బ్రకృతిలో జరుగుచున్న మార్పు లన్నియు మనకుఁ బ్రత్యక్షములును, ననుభూతములును నగుచుండును. ఇచ్చటఁ గరికి సంప్రాప్తమైన కష్టము అనుభవైకవేద్యము. మఱియు మహాకవియు మహాభక్తుఁడు నగు ధూర్జటియే యద్దాని నూహింప సమర్థుఁడు. "వాఁడా, నేనా నొక జాడఁ బోయెదము లేదా జీవ మిం కేటికిఁ" అని హస్తి స్థిరనిశ్చయము చేసికొన్నది. హస్తియును నాగమును నిట్లా వేదనాపరితప్తములై యుండగాఁ గవి, సూర్యాస్తమయ చంద్రోదయాదులను వర్ణించుటలో, నాతనికిఁ గల భక్తిభావానుభవము వ్యక్తమగుచున్నది. మఱియు హస్తియుఁ గవియుఁగూడ మహాశైవులే. కావుననే చంద్రబింబ మిరువురకును నీశ్వరలింగముగాఁ గానవచ్చినది. పాము పాతాళమున వసించును గాన యిట హస్తిప్రశంస యొక్కటియే కవి చేసినాఁడు.

ఆటవిక జీవనమును వర్ణించుచో ధూర్జటి చూపిన నైపుణ్యమగణ్యము. మహానగరములందు నివసించు నీతఁ డీ యాటవిక జీవనము నింతటి సూక్ష్మాతి సూక్ష్మములైన వివరములతో నెట్లు వర్ణింపగలిగెనా యనునది యొక యాశ్చర్యకర మగు నంశము. కట్టుబట్టలు, తిను నాహారము, చేయుచేఁతలు, విందులు, వినోదములు, వే యేల, ఆ యాటవిక జీవితమునందలి యల్పాత్యల్ప విషయముకూడ ధూర్జటికవిచంద్రుని నిశితదృష్టి నాకర్షించియే యున్నది. ఆ వనాటులకు ముత్తియములు సిరికాయల పాటియు, రేగుపండుల సాటియుఁగావు. గంధసారాగురు ద్రుమకాష్ఠ ఖండచయమును వంట కట్టియలుగా వారు వాడుదురు. సంకు మదమును, పునుఁగును, జాదును బంకము గావించి, ప్రత్యహమును వారిండ్లలుకుదురు. ఇట్లు భోగభాగ్యములతోఁ దులతూగుచుండియు వారు కష్టజీవన మనిన జడియువారు కారు. పట్టుచీరలు కట్ట గల భాగ్యముండియు వారు పాఱుటాకులనే ధరింతురు. రాజాన్నభోజనములు గలిగియు, వన్యధాన్యముల కీసడించుకొనరు. మాణిక్యభూషలు గలిగి

యున్నను గురువిందపేరు వారికిఁ బ్రీతిదాయకములు. ఎంత సంపద కల్గినను వారు తమ కులాగతధర్మకర్మములను మాత్రము విడువరు. ఈ వర్ణనములో ధూర్జటి, కృత్రిమ మగు నాగరకజీవనమునకును, సహజమగు నాటవికజీవనమునకును గల తారతమ్యమును నిరూపించినాఁడు. ఆటవికులకు కృత్రిమము లగు వస్తువులకంటెఁ బ్రకృతిసిద్ధము లగు వస్తువులే గణనీయములు. అగురువృక్షఖండములతో వెఱబొమ్మలుచేసి, మృగనాభితో వానికి మసిబూసి, చామరమును వానికి ధమ్మిల్లముగాఁ జుట్టి, యేనుఁగు కుంభములలోని ముత్యములతో వానికి గనుగ్రుడ్లు చేసి, యాటవికులు తమ చేలు కాపు కాయుదురు. భిల్లబిసరుహాక్షు లాత్మనాయకులఁగూడి యడవిలో వేట లాడుదురు. కఱకుజుంజుఱువెండ్రుకల గాఢముగా నెమలిపింఛముతో బంధించుట, పునుఁగుమాని,లలాటమున జేగురుబొట్టుపెట్టుట, పాలుటాకులతోఁ గూర్చిన పైఁటఁదీర్చుట, జమలి యొడ్డాణంబునందునఁ బర్ణాంబరమును బదిలపఱచుట, కుఱుచగనుపుల వెదురువింటఁ జాఁగపుఁ దాల్చి వారిగా సంతరించుట మున్నగు చెంచెతల వేటవెసలు సింగారమును గవి మనసు దీఱ వర్ణించినాఁడు.

ప్రకృతి పరిశీలనావిషయమునను ధూర్జటి తన ప్రావీణ్యమును జూపియున్నాఁడు. ఈ క్రింది పద్యమును జూడుఁడు.

"ప్రాతఃకాలతుషారశీకరచయప్రాప్తిన్, లసన్మౌక్తికో
పేతాగారము లట్లు, చెల్వొనఁగు తద్బింబచ్ఛటాజాతఖ
ద్యోతచ్ఛాయలఁ గొంతసేపు, బహురత్నోదీర్ణగేహంబులై
లూతాకల్పిత తంతుసద్మములు వొల్చుం జెప్పఁ జిత్రంబులై".

శిల్పకళాప్రావీణ్యము మెఱయఁ జెలఁదిపురుగు శివలింగముపైఁ బట్టు వెట్టినది. ఆ పట్టుపై రేయి మంచు గుఱిసి బిందువు లేర్పడినవి. ఆ బిందువులపై సూర్యకిరణప్రసారము గల్గుటచే నది ముక్తాగారము లట్లును, నవరత్నఖచిత గృహంబు లట్లు భాసిల్లినది.

తిన్ననికథలో ని మ్మహాకవి చేసిన పానకేళివర్ణనమును బరిశీలించినవారికి, మదిరాపానము చేయుచు ననాగరకులు చేయు దుశ్చేష్ట

లన్నియు మనోనయనగోచరములు కాకపోవు. ఈ క్రింది పద్య మెంత స్వభావసిద్ధముగ నున్నదో చూడుఁడు.

"మాటలాడఁ దలంచి మఱచిపోయెడువారు
నడవఁబోవుచుఁ దొట్రుపడెడువారు
నూరకుండెద మని యుండనోపనివారు
లేచెద మని లేవలేనివారుఁ
బనిలేని పని బట్టబయలు దిట్టెడువారుఁ
బాడనేరకయును బాడువారు
నెదురైన వారికి నెల్ల మ్రొక్కెడువారుఁ
బ్రీడావిహీనులై యాడువారుఁ
జాలఁ ద్రావియు మగుడఁ జేసాఁచువారుఁ
దొడరి యుపదంశభాండము ల్గొడుకువారు
నైరి మృగయాధిదైవతయాత్రయందుఁ
బానములుచేసి శబరదంపతులు రతుల".

ఈతఁడు వర్ణించిన దుర్భిక్షవర్ణనమును జదివినచో, మహాకవియై రాజాధిరాజులచే ననూన సన్మానములఁ గనుచున్న యీ భాగ్యశాలికి, దుర్భిక్షమువలనఁ గలుగు బాధ లెట్లవగతము లయ్యెనా యను నాశ్చర్యము కలుగక దప్పదు. మచ్చున కొక పద్యము.

"తోలును నెమ్ములు న్మిగిలి, ద్రోసినఁ దొంబదిచోట్లఁ గూలువా
రాలిని బిడ్డల న్విడిచి యాఁకటిచిచ్చున వెచ్చపోవువా,
రేలికబంటు వాసి యొక యించుక లేక కృశించువారునై
తూలె జనంబు, మీనశనిదోషము దాఁకి నిరస్తసస్యమై".

ధూర్జటి కాళహస్తిమాహాత్మ్యమును వ్రాసి నట్లుగనే, తెనాలి రా. కృష్ణుఁడు పాండురంగమాహాత్మ్యమును వ్రాసినాఁడు. ఈతఁడును వర్ణనాప్రియుఁడు గా కున్నను, చేసినవర్ణనలుమాత్రము, రసవంతములును నుచితములై యున్నవి. అవకాశము కలిగి నపు డెల్ల నతిమనోహరము లగు ప్రకృతివర్ణనల నీతఁడు చేసినాఁడు. అవియుఁ గథాగతితోఁ బొంది పొసఁగి యున్నది. అగస్త్యుఁడు దక్షిణాపథమున కేతెంచుతఱి నీతఁడు చేసిన మధ్యాహ్నవర్ణనము మనోహరమై యున్నది. (సశేషము)

"పద్మినీ పత్రాంతపత్త్రంబు శిథిలప
త్త్రాగ్రమై రాయంచ యాశ్రయించెఁ
దాలు స్రవ ఫేన జాలంబుతో ఘోణి
పంచల రొంపి గలంచి యాడె
దూరోద్గమద్దావ ఘూమ ముంబుదబుద్ధి
నెమ్మి లో పొదనుండి నిక్కి చూచె
జఠరస్థజలము నాసానాళమునఁ బీల్చి
సామజం బిరుప్రక్కఁ జల్లుకొనియె
గీ. సరసిపై నీరు సలసల చెరలె, విపిన
సకలవీధులు నిర్మృగోచ్ఛ్రయము లయ్యె
మట్ట మధ్యాహ్న మిది సుధామధురవాణి
యర్హ మిచ్చోఁ బథశ్రమ మపనయింప".

"ఇవె యూపవృతశాఖు లివె లూనముఖదర్భ
సందర్భ వేశంత సైకతములు."

మాల్యవంతముపై నెక్కి యనతి దూరమున నున్న పంపా సరోవర ప్రాంతమును (హంపీక్షేత్రమును) బరిశీలించితి మేని నేఁడును నిట్టి దృశ్యమే పొడగట్టును. అగస్త్యుఁ డేతెంచు సరి కట రాజ్యస్థాపన యే లేదుకదా ! ఇఁక రామకృష్ణుని కాలమునకు విజయనగర సామ్రాజ్యము మహోచ్ఛదశయందున్నది. అట్టిచో నేఁడు గనుపట్టు నీ దృశ్యమును రామకృష్ణుఁ డానాఁ డెట్లు చూడఁగలిగెనా యను నది వింతలలో వింత. రవి గాననిచోఁ గవి గాంచుట యిట యథార్థ మయ్యె నన వచ్చును.

చతుర్థాశ్వాసమున రాధా తప స్సందర్భమున రామకృష్ణుఁ డాఱు ఋతువులను వర్ణించి యున్నాఁడు. ఇం దొక పద్యమునఁ దపో నిమగ్న యగు రాధను వర్ణించియు నిం కొక పద్యమున సంతాపగ్రస్తమై యున్న లోకమును వర్ణించియు నిట రామకృష్ణుఁడు ప్రకృతికిని పాత్రములకును గల సంబంధమునే కాక ప్రకృతికిని లోకమునకును గల సంబంధమును గూడ నిరూపించి యున్నాఁడు.

ఈ క్రింది పద్యములను దిలకింపుఁడు.

గీ. "పారదంబునఁ దోఁచిన పసిఁడి తీఁగ
పసిది రాజిల్లె రాధ చంపక సువర్ణ
వర్ణ మగు మేను కుముదధవళతుషార
పటలకంచుకవేల్లనఘటన కలిమి."

ఇది రాధావర్ణనము. ఇఁక లోకమును గూర్చి,

గీ. నవ్య కాలాగరూద్వర్తనముల సతుల
చన్నుఁగొండల నుష్ణాగ్ని సంభవించె
మతిసమగ్రులు ధూమానుమాన కలః
నగ్ని సాధింతు రచలంబు లందు నెపుడు"

ఈ పద్యములోఁ దర్కమును గూడఁ జొనిపినాఁడు.

గీ. "సురలు కళ లెల్లఁ గ్రోలిన సోము తనువు
కప్పురము గుమ్మరించిన గసక క్రోవి
పువ్వుఁదేనియ చనిన యంభోరుహంబొ
యనఁగ మం చింకి బ్రహ్మాండ మగలెఁ జలిని,'

క. "అగలుం గుంకుమపువ్వును
దొగరుం జేలలును సీతుఁ ద్రోపం గలవే
పొగ లేని ముర్మురంబులు
మగువల పాలిండ్లు భోగ మహనీయంబుల్."

మరల రాధ !

క. "పై నిగుడు మంచు తువ్వార
వానలచేఁ దడిసి కమలవనలక్ష్మిక్రి హరి
ధ్యాననిమీలితలోచన
యౌ నల రాధావధూటి కనఁగల సుమ్మీ"

మరలఁ బ్రకృతి.

గీ. "కాలుఁ గాలును గేలును గేలు మోవి
మోవియును దాఁకి భోగిసమూహ మచురై

నూహ సేయంగ భోగి సమూహమునకుఁ
బోసఁగ మనకంపుఁ బెనఁకువ లెసఁగుఁ గాదె".

క. "శ్యామలకాలాగురునవ
ధూమ మెదకు సుఖ మొనర్పఁ దోరపుఁ గన్నుల్
వే మొగుచు కరణి సౌధ
స్తోమ మమరెఁ గప్పఁ బడిన సోరణగండ్లన్!

రాధయు మధులక్ష్మియు,

ఉ. కెంజిగురాకు డాలు దులకించిన ధాతుపటంబు చాయఁ జే
యం జదూ కెక్కు పుష్పాదుల నంటిన తేటులు భూతిభృజ్జటా
పుంజముఁ బోలఁగా విపిన భూములలో మధులక్ష్మి పొల్చె నీ
లాంజనవర్ణుఁ గోరి తప మర్లొనరించు మృగాక్షి కైవడిన్.

ఇట్లే ఆఱు ఋతువులయందును వర్ణించియున్నాఁడు

ధూర్జటికి విశ్వమంతయుఁ జంద్రోద్రిదయావసరము శివార్చన
ముగాఁ గానవచ్చినట్లు, రామకృష్ణునకు వర్ష ఋతువున నీ విశ్వ మం
తయుఁ గృష్ణమయముగా గోచరించినది.

"ఇంద్రచాపంబు గా దిది మౌళితలమున
సవరించుబర్హిపింఛంబు గాని
భిదురఘోషంబు గా దిది పాంచజన్య సం
జాతగంభీర ఘోషంబు గాని
యాశ్రయించిన బలాకావళి గా దిది
హారి ముక్తాహార యష్టి గాని
యిది గోల మెఱుఁగు గా దుదిరి బంగారంపుఁ
బసిమి గ్రమ్మెడు పచ్చపట్టు గాని
వృష్టి గా దిది కరుణాంబు వృష్టి గాని
నీలమేఘంబు గా దిది నీలవర్ణుఁ
డౌర! నా మ్రోలఁ బ్రత్యక్ష మయ్యె ననుచు
హర్ష పులకిత తను వయ్యె నవ్వధూటి"

వర్ణనా విషయమున ముక్కుతిమ్మన యింకొక నూతన మార్గమును ద్రొక్కినాఁడు. సాధారణముగాఁ గవులకుఁ బ్రబంధ ప్రారంభమున నే పుర వర్ణనాదులను గావించుట యలవాటు. కాని తిమ్మన యట్లు గావింపక ప్రథమాశ్వాస మంతయుఁ బాత్ర స్వభావోన్మీలనమునందే గడిపినాఁడు. ప్రథమాశ్వాసమునఁ బుర వర్ణనాదుల ప్రసక్తి గల్గియు వీడినాఁడు. ఇఁక ద్వితీయాశ్వాస మంతయు వర్ణనా గర్భితము. ఇవి యైనను నతి సంగ్రహముగాఁ జేయఁబడి యున్నవి. ఇందు వర్ణింపఁ బడిన రాజోపచారాదు లన్నియు నానాఁడు రాజుల యంతఃపురములందు జరుగునవియే యై యున్నవి. ద్వితీయాశ్వాసము నందలి యంధకార నక్షత్ర చంద్ర చకోరాది వర్ణనములును, తృతీయాశ్వాసము నందలి నందనోద్యానాది వర్ణనములును, చతుర్థాశ్వాసము నందలి మధ్యాహ్న జలకేళి వర్ణనములును, పంచమాశ్వాసము నందలి యుద్ధాది వర్ణనములును ప్రకరణానుకూలముగ మనోహరముగఁ గావింపఁ బడి యున్నవి.

ఇఁకఁ బ్రబంధ కవులలోఁ గేవలవర్ణనాప్రియు లగు కవులును గలరు. అట్టి వారిలో సంకుసాల నృసింహకవి యొక్కఁడు. ఈతని గ్రంథమునందుఁ (కవికర్ణరసాయనము) మనోజ్ఞము లగు వర్ణనలనేకములు కలవు. ఇమ్మహాకవి కావ్యముఖమున గావించిన ప్రతిజ్ఞను జూడుఁడు.

"పరభుక్తము లైన యలం
కరణముల జుగుప్స లేక కైకొని పదవి
స్ఫురణంబు చూపు కుకవిత
పరికింపఁగ లజ్జ లేని బానిస గాదే".

ఈ ప్రతిజ్ఞ నీతఁ డెంత వఱకు నిర్వహించు కొనఁ గలిగినాఁడను నది యొక పెద్ద సమస్య. సామాన్యముగ నిట్టి ప్రతిజ్ఞలను గావ్యములందాద్యంతమును నిర్వహించుట కష్టతరము. ఉపయోగించిన యలంకారము లన్నియు స్వకపోల కల్పితములే యగుట సామాన్యముగ సంభవింపదు. ఈతఁడు చాల వఱకుఁ దన ప్రతిజ్ఞను సాధింపఁ గలిగినాఁడనియే చెప్ప వచ్చును. ఈతని పదసామగ్రి యెట్టిదైనను నభిప్రాయములు

మాత్రము నూతనము లనియే చెప్ప నొప్పును. ఈతని రెండవప్రతిజ్ఞయగు,

"యతి విటుఁడు గాక పోవు ఏ ట్లిస్మదీయ
కావ్య శృంగార వర్ణ నాకర్ణనముఁ
విటుఁడు యతి గాక పో రాదు వెస మదీయ
కావ్య వైరాగ్య వర్ణ నాకర్ణనమున"

అను దాని యందుఁ గూడఁ దన కావ్యము నందలి వర్ణనా ప్రాధాన్యమునే వక్కాణించి యున్నాఁడు.

ఈతని వలెఁ బం చేంద్రియ తర్పణము గావించు వర్ణనలఁ జేసిన యాంధ్ర కవి యిం కొకఁడు లేఁడు. ఈతని వర్ణనలలో నొక చైతన్య విశేషము కలదు. ఈతనికిఁ బ్రకృతి వివిధరూపముల సాక్షాత్కరించి నది. ఒకప్పుడు రోషకషాయితాక్షి యగు ఖండితనాయికారూప మున, నిం కొక తఱి బలాకకపాలమాలికాధారిణి యగు కాళిక విధ మున, నింకొక తఱి నొక భిషగ్వర రూపమున నిట్లు బహు రూపములఁ బ్రకృతి యీతనికిఁ బ్రత్యక్ష మైనది. సకల సుఖ కారి యగు వసం తాగమము పాంథలోకమున కెట్లు మహా ప్రలయ సదృశ మైనదో కవి యీ క్రింది పద్యమున వర్ణించినాఁడు.

సేల వెన్నెలలు పండ్రెండు సూర్యులు చూపు
బీ టెండ లై కాసి నీరసింప
దక్షిణానిలము లుద్ధతి నేడు తేఁటగుల
బెరిగెడు గాడ్పు లై పెల్లగింపఁ
గెంజాయ దిక్కులఁ బింజించు చిగురులు
కాలానలార్చు లై కాఁకఁ బెనుప
నలి శుక పిక గర్జ లడరఁ బూఁ దేనియ
ఘోరాంత్య వృష్టి యై కురిసి కలప
విరహ వేదన లెసఁగి యుద్వేల గతుల
నద్భుతముగ నే కార్ణవ మగుచు ముంప
సఖిల సుఖకారి యగు వసం తాగమంబు
పథిక లోకంబునకు మహాప్రళయ మయ్యె

ఈతఁ డొక పద్యమున నతి చమత్కారముగా వసంతర్తువు నందే సకల ఋతు సంపదను వర్ణించి యున్నాఁడు.

పరిసవ శర ప్రతాప శిఖిఁ బర్వఁగఁ జేయుటచే నిదాఘమై
కుసుమ రసాతి వర్షమునకుం గుదు రొటఁ బయోదకాలమై
రసిక మనోంబుజంబు లలరంగ శరత్తయి తాన శైశిరో
ల్లసనముఁ జూపి పాంథ సతులం వణకించె వసంత మత్తఱిన్"

పూర్వ కవులు వాడిన పదసామగ్రినే కైకొని యతఁడు నూతనము లగు వర్ణనలఁ గావించి యున్నాఁడు. కటికి చీకటిని మషీరస నవాంజ నాదులతో సరిపోల్చుట యశ్రుతపూర్వము గాదు. కాని యీ క్రింది పద్యమును బరిశీలించిన వారికి నరసింహకవికల్పనానైపుణ్యము గోచరించును.

కరఁచి చిప్పలఁ బట్టు కతఁ దెఱుంగము గాక
వ్రాయంగ నిది మషీ రసము గాదె
యిది గుణంబులు సేయు నిర వెఱుంగము గాక
నీలాల సరులుగా నింప రాదె
కరవటంబులఁ బెట్టు వెర వెఱుంగము గాక
వనితల కిది నవాంజనము కాదె
కడవలఁ గొని ముంచు గతి యెఱుంగము గాక
చేలల కిది మంచి నీలి గాదె

పోవఁడే నిది రవి నైనఁ బొదువుఁ గాదె
యంక మను పేర నురముపై నచ్చు దాల్చుఁ
గాక శశి నైన దిగ మ్రింగుఁ గాదె ? యనఁగఁ
బ్రబల మై గాఢతమ తమః పటలి పర్వె.

వర్ణనౌచిత్యమునకును బింగళి సూరనార్యుని జెప్పి మఱి యొక యాంధ్ర కవిని జెప్పఁ వలయును. ఈతఁడు ప్రార్థనలకై చేయు వర్ణనలయందు గూడఁ గథా గతిని సూచించునే యుండును. చూడుఁడు. కళా. పూ. పీఠిక.

అనయము ప్రేమ సంధిలఁగ నాస్య చతుష్టయ యోగ పద్య చుం
బన ఘన కాంక్షఁ బోలె నిగమంబులపేరిట నాల్గు రూపులం
దనరెడు భార్య మాట జవదాఁటక సృష్టి యొనర్చు వారిజా
ననుఁడు నృసింహ కృష్ణ విభుఁ జాలఁ జిరాయువుఁ జేయుఁ గావుతన్.

ఇందు సరస్వతీ చతుర్ముఖుల ప్రణయ లీల సూచింపఁ బడినది. చూడుఁడు. పంచ. ఆ. ప. 26

"వదనములు నాలుగింటికి వరుస గలియ
మెలపుతోఁ దన కంఠంబు మలఁచి మలఁచి
యొసఁగెఁ దదధర పాన మహోత్సవంబు
గళము కౌఁగిలితోఁ జెక్కులు నిమురుచు"

ఇట్లే చతుర్థాశ్వాసమునఁ జేసిన సముద్ర వర్ణనము నందును గథా గతిని సూచించి యున్నాఁడు.

"ఉగ్ర తిమి శిరో రంధ్ర నిష్ఠ్యూత మగుచు
నెగయు సలిలౌఘ మది యెందు మిగుల నొప్పె
నబ్ధి పేరిటి కుండలితాంగ భోగి
యుస్సు రనఁ దన పడగెత్తెనో యనంగ"

తిమి శిరో రంధ్ర నిష్ఠ్యూత మైన వారి ధార నెంత చమత్కారముగాఁ గథలో నిమిడ్చినాఁడో చూడుఁడు. నిరతాన్న దానవ్రతము నకై యజ్ఞశర్మ తన భార్యల బేహారికి నమ్మెను. అమ్మెను గాని యనంతర మార్తధ్వని గావించెను. ఆ ధ్వనిని విని యాతని భార్యలు నలువురును సముద్రమున నురికిరి. అట్లురికిన యువనితలు బలు మీనొక్కటి నోర సలిలం బెగఁ గ్రోలుచుండఁ దద్వదనములోని కా సలిల పూరము వెంట నేఁగిరి. అనంతర మది మరల తన శిరో రంధ్రము ద్వారా నీటిని పైకెగఁ జిమ్ము నపుడు, వారును బైకెగసి యొక దివ్య విమానముపైఁ బడిరి. మీఁది వర్ణనములో నీకథ యెంత చమత్కారముగా సూచింపఁ బడినదో చూడుఁడు. సూరనార్యుని వర్ణనల యందలి యంతరార్థములను జూపుచు శ్రీ దుర్భాక వేంకటరమణ శాస్త్రుల వా

రొక విపుల వ్యాసమును వ్రాసిరి. అం దీ విషయములు విపులముగాఁ జర్చింపఁ బడి యున్నవి.

సూరనార్యుని గ్రంథములను సామాన్యముగఁ జదువుకొని పోవు వారికి నాతని వర్ణనలలోని యంతరార్థము గోచరింపదు. ఇందులకు నిశిత మైన పరిశీలన మత్యావశ్యకము. ఈతని రూప చిత్రణమునం దొక విశిష్టత కలదు. "ప్రతియోగ సంఘటనముచే (By creating the contrast) నీతఁడు రూపమును భాసింపఁజేయును. వృద్ధురా లగు సుముఖాసత్తి రూప మొక పద్యమునను, బున ర్యౌవన ప్రాప్త యైన యామె రూప మిం కొక పద్యమునను, అలంకృత యగు సుగాత్రి రూప మొక పద్యమునను, నిరలంకృత యగు నామె రూప మిం కొక పద్యమునను, మణిస్తంభునిచేఁ జిక్కి చకిత యై యున్న కలభాషిణీ రూప మొక పద్యమునను, ఆతనిచేఁ జాఱవిడి నప్పటి యామె రూప మిం కొక పద్యమునను,—ఈ విధముగ నవస్థా భేదములను బట్టి యా యా రూపములందుఁ గలుగు మార్పులను గడు నిపుణముగా నీతఁడు చిత్రింపఁ గలఁడు" ఉదాహరణమున కై కొన్ని పద్యములు—వృద్ధ యగు సుగాత్రి రూపము :

పసిమి పో నెండిన కసవు బుట్టయుఁ బోలె
నర వెంట్రుకలు బర్వు శిరము వలన
నులి గొన్న చెలఁది పుర్వుల నూలి వల్లు నా
నమరెడు ముడుత క న్బొమల వలనఁ
గఱుఁ జిల్లి నట్టి బంగరు పూఁత పొక్కిళ్ల
వడువు చూపెడి మేని వళుల వలనఁ
జూనిసి వ్రేలెడు ప్రాఁకు తునుకలఁ దలపించు
బాహు వక్షోజ లంబనము వలన
ఘూక రవముల చాడ్పున ఘోర వృత్తిఁ
దవరు ఘనకాస కుహీ కుహీ ధ్వనుల వలన
భావజుఁడు వెళ్లి పోయిన పాడుమేడ
పగిదిఁ గాన్పించు ముసుసలి పడఁతి యొకతె.

పున ర్యౌవన ప్రాప్తి.

నిండు చందురు నవ్వు నెమ్మోము సిరి తోడ
నిరులు గ్రమ్మెడు వేణీభరము తోడ
నాకర్ణ లోలంబు లగు నేత్రముల తోడఁ
దళుకొత్తు చెక్కుటద్దముల తోడ
మిగుల మిటారించు బిగి చనుంగవ తోడ
లలితంపు బాహు వల్లరుల తోడ
నతి కృశత్వమున జవ్వాడు మధ్యము తోడ
నభినవం బైన నూఁగారు తోడ
వలువ మీఁదికిఁ దొలఁకు సువర్ణ పులిన
గురు నితంబ ప్రభా పరంపరల తోడ
మహిత సర్వాంగ లావణ్య మహిమ తోడ
సమరు ప్రాయంపు రూపు చిత్రముగఁ దాల్చె.

ఇట్లు స్థాణు రూపమును వర్ణించుటయే కాక, చల ద్రూపమును బ్రత్యక్షము చేయఁ గల శక్తియు సూరనార్యునకుఁ గలదు. ప్రద్యుమ్నుని వాహ్యాళితో నాతఁడు వర్ణించిన తురగవర్ణన మిందుల కొక ప్రబల దృష్టాంతము.

తోలుదో ల్త న ద్యేక తురగంబు మండల
గతిచారి యగుచు నిక్కంబు తోఁచె
నా వెనుకను సగూహాశ్వాలి చెదరక
చక్రాకృతిని బర్వు సరణి తోఁచె
నంతట ననతి స్ఫుటావయవంబుగా
నెనసి యేకాంగ వేష్టనత తోఁచెఁ
దాఁ దద్విభూషణ ద్యుతి రాజి మాత్రంబు
కొఱవి త్రిప్పిన రీతి మెఱసి తోఁచె

నంత కంతకు గతి వేగ మగ్గలింప
రాఁగ నాఁగె యెచ్చరిక పరాకు జియ్య
యను జనులు ఱిచ్చవడి తమ పని మఱవఁగఁ
బరగు నమ్మేటి నెఱరౌతు ప్రౌఢి కతన.

ఆంధ్ర మహా ప్రబంధములలోఁ గొన్నిఁటిని మాత్రమే యిఁట నుదాహరించి యున్నాను. ప్రబంధముల నన్నిఁటిని నుదాహరించుట యతి విస్తర మగుటయే కాక యనావశ్యకముఁగూడ నగును. క్షీణ యుగము నందలి యే కొలఁది మంది కవులలోఁ దప్ప తక్కిన యాంధ్ర ప్రబంధ కర్త లందఱును నౌచిత్యమును బాటించియే వర్ణనల గావించి యున్నారు. కాని మన మా గ్రంథములను బఠించు నప్పు డా గ్రంథములు పుట్టిన కాలమును దేశమును బరిస్థితులను మఱువరాదు. కొన్ని కొన్ని యెడల వారతి మాత్రముగ వర్ణించిన విషయములు మన కీ నాఁడు విసువు గలిగించునవి యై యుండును. అట్టి దానికిఁ గారణము దేశ కాల పరిస్థితుల యందలి మార్పే. మఱియు, నాయా కవుల వ్యక్తి స్వాతంత్ర్యములను బట్టియు నభిరుచులను బట్టియుఁ గూడఁ గవితా రీతులు మాఱుచుండును. కృష్ణరాయని యాముక్తమాల్యదయం దన్నియు వర్ణనలే. పెద్దన వేశ్యా వర్ణనము నొకటి రెండు గీత పాదములలో ముగింపగా, నీ రసికుని వేశ్యా వర్ణనమే రెండు సీసపద్యములకు బ్రింగినది. ఇది కవుల యభిరుచి భేదములకు నిదర్శనము. ప్రబంధ వర్ణనల యందలి రసౌచిత్యమును గ్రహింప వలయు నన్న నా గ్రంథముల నామూలాగ్రముగఁ బఠించుటయే యుత్తమమార్గము.

# వ్యక్తి వివేకము.

భాగవతుల కుటుంబరాయశాస్త్రి, ఎం. ఏ.

ఈ పై విషయమున గమ్యగమకములు సత్యములా? అసత్యములా? యను విచారణము. సహృదయు లగువారికి నిరుపయోగమైనది. అటులే కావ్యవిషయమునఁ గూడ వాచ్యవ్యంగ్యముల విషయమైన సత్యాసత్యత్వవిచారము నిరుపయోగమే యగుట ప్రమాణాన్తర పరీక్ష కేవల ముపహాసముకొఱకే యగును.

లోకమునం దకృత్రిమము లగు హేతువులనుండి,యకృత్రిమము లగు విషయములే ప్రతీయమానము లగును. అచటఁ బ్రతీయమానము లగు విషయములు కేవల మనుమేయములే యగును. వానియందు వ్యంగ్యత్వగంధము గూడ లేదు. కావ్యమునందు వ్యంగ్యత్వ ముండును. ఇదియే లోకమునందుకంటె కావ్యమునందుఁ గల విశేషము. అందుచే రత్యాదులు గమ్యము లగు నపు డవి వ్యంగ్యము లని యుపచారము (లక్షణావృత్తిని) నాశ్రయించి చెప్పుచున్నాము. ఇచట లక్షణను జెప్పుటవలనఁ బ్రయోజనము సుఖాస్వాదమే. ఇట్లు గమ్యము లగు రత్యాదులయందు వ్యంగ్యత్వోపచారము యుక్తియుక్తమే యగుచున్నది. ముఖ్యవృత్తి నాశ్రయించి యర్థ మనునది రెండు విధములుగనే యుండును. వాచ్యార్థము, గమ్యార్థము. ఉపచారమువలన వ్యంగ్యార్థ మనునది మూఁడవది గూడ నొకటి యున్న దని యిప్పటికిఁ దేలినది. ఇప్పటికిఁ దేలిన విషయము నంతను నీ సంగ్రహ శ్లోకము దెల్పును.

"వాచో గుణీకృతార్థస్యం న సంభవతి జాతుచిత్
తదర్థం తనుపాదానాత్ ఉదకార్థం దృతేరివ"

[తా॥ నీటినిఁ దెచ్చుటకై యుపయోగించు ఘటము నీటిని తన కుపసర్జనముగఁ జేసికొనదు. అటులే యర్థముఁ దెలుపుటకై ప్రయుక్త మగు శబ్ద మెప్పుడును దన యర్థము నుపసర్జనముగఁ జేసికొనదు]

వాచ్యప్రతీయమానార్థములకు ముఖ్యవృత్తి నాశ్రయించి వ్యంగ్యవ్యంజక భావము సంభవముకాదు "అభివ్యక్తి" యనుదానికి లక్షణము

కుదుర కుండుటచే, వాచ్యార్థమునకును, ప్రతీయమానార్థమునకును ముఖ్యావృత్తి నాశ్రయించియే వ్యంగ్యవ్యంజక భావ మున్న దనుట పొసఁగదు.

అభివ్యక్తియొక్క లక్షణము నిట్లు తెల్పుచున్నారు.

"సతోఽసత ఏవ వార్థస్య ప్రకాశమానస్య సమ్బన్ధస్మరణానపేక్షిణా ప్రకాశకేన సహైవ ప్రకాశవిషయతాపత్తిరభివ్యక్తిః"

ఒక యర్థము(లేక విషయము) సత్యమైనది కావచ్చును. అసత్యమైనది కావచ్చును. ఆ యర్థమును ప్రకాశింపఁజేయు (తెలియఁజేయు) శబ్దమునకును (వస్తువునకును) నా యర్థమునకునఁ గల సంబంధ స్మరణముతో నిమిత్తము లేకయే, ప్రకాశక మగు శబ్దముతోనే ప్రకాశ్య మగు వస్తువుకూడ నెచట భాసించునో యచట నభివ్యక్తి యున్న దనుచున్నాము. అనఁగా నే క్షణమునఁ బ్రకాశక మగు వస్తువుయొక్క జ్ఞానము గల్గునో, యా క్షణముననే ప్రకాశ్య వస్తుజ్ఞానముకూడఁ గలుగుచో నపు డచట నభివ్యక్తి యున్న దనుచున్నాము.

అందు, సద్భూతమైన (సత్యమైన) వస్తువుయొక్క యభివ్యక్తి మూఁడు విధములుగ నుండును 1. కారణమునందు కార్యము నిలీనమై కేవలము శక్తిరూపమున నుం డుండును. అట్టి కార్యము మన కింద్రియ గోచర మగునట్లు ప్రత్యక్ష మగుట యొక విధ మగు నభివ్యక్తి యగును. క్షీరదధిసంబంధ మట్టిది. క్షీరావస్థయందు పెరుగా క్షీరమునందు నిలీనమై శక్తిరూపమున నున్నఁ దనియుఁదరువాత నది దధిరూపముగ మనకు గోచరించిన దనియును దెలియవలెను. కార్యమే, కార్యమును బుట్టించు శక్తి రూపమునఁ గారణమునందుండి యావిర్భవించు నని తెలియని కొంద ఱీ యావిర్భావమునే యుత్పత్తి యనుచున్నారు. (2) ఆవిర్భవించియు నేదేని ప్రతిబన్ధమువలన భాసింపకయే యుండు ఘటాదివస్తువులు ప్రకాశక మగు దీపము మొదలగు వానితో నేకక్షణముననే ప్రకాశించుట రెండవ విధమగు నభివ్యక్తి యగును. ఇచటఁ బ్రకాశకము, ప్రకాశ్యమున కుపసర్జన మగును. దీపముచే ఘటము ప్రకాశించుట యిందుల కుదాహరణము. ఈ విషయమునే యీ శ్లోకము తెల్పుచున్నది.

♦ "స్వజ్ఞానేనాన్యధీహేతుః సిద్ధేఽర్థే వ్యంజకో మతః
యథా దీపోఽన్యథా భావే కో విశేషోఽస్య కారకాత్"

ఘటము మొదలగు వస్తువులు స్వరూపసిద్ధిం బొంది యున్నపుడు, తన విషయమైన జ్ఞానముతోనే, యేవస్తువు, వ్యంగ్యవిషయక మగు జ్ఞానమును గూడఁ గలుగఁజేయునో, యదియే వ్యంజక మగును. దీపజ్ఞానముతో సమకాలముననే ఘటజ్ఞానము కల్గుట యిందుల కుదాహరణము. ఇట్లు కాకున్నచోఁ గారక మను పేరుగల "హేతువు"నకును, వ్యంజకమునకును భేద మేమి యున్నది? హేతుకార్యముల జ్ఞానము సమకాలమునఁ గలుగ దనియు, వ్యంగ్యవ్యంజకముల జ్ఞానము సమకాలముననే కలుగు ననియుఁ దెలియవలయును.

ధ్వనికర్తయును "స్వరూపం ప్రకాశయన్నేవ పరార్థావభాసకో వ్యంజక ఇత్యుచ్యతే యథా ప్రదీపో ఘటాదేః" అను వాక్యమునందు "తన రూపమును ప్రకాశింపఁజేసికొనుచునే, యితరవస్తువులను బ్రకాశింపఁజేయునది వ్యంజక మగును. ఘటాది ప్రకాశనమున దీపము వ్యంజక మగుట యిందుకు దృష్టాంత మనియే తెల్పియున్నాడు. (3) ఇంతకుఁ బూర్వ మానిర్వచించిన వస్తువుచే నొకప్పుడు మనము తెలిసికొని యున్నాము. అందుచే నా వస్తువిషయ మగు జ్ఞానము, మన మనసున సంస్కారరూపముగ నుండును. ఆ వస్తువుతో నియతసాహచర్యము గల మఱియొక వస్తువుఁ జూచినపుడు గాని, యా వస్తువిశేషమును దెల్పు శబ్దమును విన్నప్పుడుగాని, యా పూర్వసంస్కారము ప్రబుద్ధ మగుట మూఁడవ రకము. ఇందు కుదాహరణము- ధూమమును జూచి నపు డగ్ని స్మృతికి వచ్చును. అట్లాతే గోవుయొక్క చిత్రరువును గాని బొమ్మను గాని, ప్రతి

---

♦ అర్థే సిద్ధే సతి = ఘటము మొదలగు వస్తువులు సిద్ధించి (రూపాంది) యుండఁగా. స్వజ్ఞానేన = వ్యంజక మగు తన విషయమగు జ్ఞానముతో. అన్యధీహేతుః = వ్యంగ్యవిషయకజ్ఞానమునకు హేతువైనది, వ్యంజకో మతః = వ్యంజక మనఁబడును- యథా దీపః = దీప ముదాహరణము - అన్యథా భావే = అట్లు కానిచో, అస్య = ఈ వ్యంజకమునకు, కారకాత్ = హేతువుకంటె. కో విశేషః = భేద మేమి?

బింబమునుగాని యనుకరణమునుగాని జూచినపుడు గోవు మనకు స్మృతికి వచ్చును. లేదా "అగ్ని" యను శబ్దమును గాని "గోవు" అను శబ్దమును గాని విన్నప్పుడుఁగూడ నగ్నిగోవుల విషయక మగు, మన మనసున నిలీనమైన సంస్కారము, ప్రబుద్ధమగును. ఇప్పటికి సద్వస్తువు మూఁడు రకములుగ నభివ్యక్తి నొందు నని తెలిసికొంటిమి. అసద్వస్తువున కొక విధమగు నభివ్యక్తియే గలదు. దాని కొకటికంటె నెక్కువ రకము లుండుట కుదురదు. సూర్యుని వెలుఁగునం దింద్రధను స్సభివ్యక్తి యగుట యే యిందు కుదాహరణము. ఇప్పటి కభివ్యక్తి లక్షణములను నుదాహరణములనుఁ దెలిసికొంటిమి.

పైఁ దెల్పిన యభివ్యక్తిలక్షణము ప్రస్తుతవిషయమున సమన్వయింపదు. ఎట్లన, సద్వస్తువుయొక్క యభివ్యక్తికిఁ దెల్పిన మొదటి రెండు లక్షణములలో మొదటి లక్షణమును బరిశీలించితిమేని, దధివలెఁ బ్రతీయమానార్థముఁగూడ నింద్రియ సాక్షాత్కారము గావలసియుండును. రెండవ లక్షణము ననుసరించి, దీపప్రకాశసమకాలముననే ఘటప్రకాశము కలిగినట్లే, వాచ్యార్థజ్ఞాన సమకాలముననే వ్యంగ్యార్థప్రతీతి కలుగవలసియున్నది. ఈ రెండు లక్షణములును వ్యంగ్యార్థమునందు లేవు. ప్రతీయమానార్థ స్వరూపమునుఁ గూడ స్పృశింపనిదే యివి దానికి లక్షణము లెట్లగును? అందుచే మొదటి రెండు లక్షణములలో నేదియు వ్యంగ్యార్థమును స్పృశింపలే దని తెలియుచున్నది.

ఇఁక మిగిలిన మూఁడవ లక్షణ మనుమానమునకే సరిపోవుచున్నది. అభివ్యక్తికి సరిపోదు. "త్రిరూపలింగాత్, యదనుమేయే జ్ఞానం తదనుమానం" మూఁడువిధము లగు లింగముల(హేతువుల)వలనఁ గలుగు ననుమేయవిషయజ్ఞానమే యనుమాన మని చెప్పితిమి గదా. అందుచే నభివ్యక్తి యనునది యనుమానమే యగును. ఒక యర్థమునుండి యర్థాన్తరప్రతీతి గల్గుట యనునది యనుమానముకంటె భిన్నమైన దగుటకు వీలు లేదు. ఉపమాదులుగూడ నీ యనుమానమునందే యన్తర్భావము నొందుటయే దీనికి హేతువు. ఈ విషయమునే యీ ప్రమాణవాక్యము తెల్పును" న చాన్యదర్శనే అన్యకల్పనాయుక్తాతిప్రసంగాత్

తస్యానాన్తరీయకతాయాం స్యాత్. నహి యథావిధసిద్ధః తథావిధసన్నిధానం సూచయతి-సామాన్యేనచ సమ్బన్ధినార్థప్రతిపత్తి రనుమానమితి ద్వేఏవ ప్రమాణే” దీని తాత్పర్య మిది - ఒక వస్తువును జూచినపుడు మఱియొక వస్తువును కల్పించుట యుక్తముకాదు. అది యుక్తమే యగుచో, ధూమదర్శనమువలన జలమును, ఘటదర్శనము వలన పటమును గూడఁ గల్పింపవలసి వచ్చును. ఇట్టి యనర్థకల్పనలు రాకుండుటకై, ఒక వస్తువును చూచినపుడు మఱియొక వస్తువును గల్పింపఁగూడదు. అగుచో ధూమదర్శనమున నగ్ని నెట్లూహించుచున్నా రని ప్రశ్నింపవచ్చును. కల్ప్యమాన మగు వస్తువు (ఊహింపఁబడు వస్తువు) నకును, కల్పకము వస్తువునకును, నవినాభావసంబంధ మున్నపు డర్థాన్తరకల్పనము యుక్తమే. ధూమమునకును, నగ్నికిని నట్టి సంబంధ మున్నది. అందుచే ధూమదర్శనమున, నగ్నికల్పనము యుక్తమే. పూర్వ మే సన్నివేశమునం దొక వస్తువును జూచినామో, యా వస్తు వా సన్నివేశమును సూచింపనపుడు, ఆ వస్తువుతో నియత సంబద్ధముగ నే వస్తువును మనము చూచినామో, యా వస్తువు నూహింతుము. పూర్వము ధూమాగ్నులను జూచినవారు, మఱియొకచో దూరమునుండి ధూమము నొకదానినే చూచినపుడు, ధూమముతో నియతసంబద్ధమైన యగ్ని నూహించుచున్నారు. కావున, “ఏకసంబంధిజ్ఞాన మపరసంబంధిస్మారకం” అను న్యాయము ననుసరించి, నియత సంబద్ధములై యుండు వస్తువులలో, నొక వస్తువు జ్ఞానము మఱియొక వస్తువు జ్ఞానమును గలుగఁజేయును. దీనినే యనుమాన మందుము. శబ్దప్రమాణము, నుపమానప్రమాణముఁ గూడ నిట్టివే. ఒక శబ్దమును వినినపు డా శబ్దమునకు నియతముగ బోధ్యమగు నర్థమును మనము స్మరింతుము. అటులే ఒక వస్తువును జూచినపుడు దానినిఁ బోలిన మఱియొక వస్తువును స్మరింతుము. అందుచే శబ్దోపమాన ప్రమాణములు కూడ ననుమానము నందే

య ప్రత్యభావము నందును. కావున బ్రత్యక్షానుమానములు రెండే ప్రమాణములు.

[సూచన:— ఈ వాక్యముల కర్థమును జెప్పుటయం దున్న వివిధ మతములను బ్రత్యేకముగ వివరింతును.]

వాచ్య మగు నర్థమునుండి మఱియొక యర్థము స్ఫురించునపుడా రెం డర్థములకును నవినాభావసంబంధ ముండవలయును. ఆ యవినాభావ సంబంధస్మరణము కల్గినపుడే వాచ్యార్థమునుండి యర్థాన్తర ప్రతీతి కలుగును. ఆ సంబంధస్మరణము లేనిచో నర్థాన్తర ప్రతీతి కలుగనే కలుగదు. సంబంధస్మరణము లేనపుడుఁగూడఁ గలుగుచో సంబంధము లేని మిగిలిన యర్థములును స్ఫురింపవలసియుండును. అందుచే వాచ్యప్రతీయమానార్థములకుఁగల యవినాభావసంబంధ స్మరణ మవశ్య ముండి తీరవలయును. ధూమజ్ఞానమునకును నగ్నిజ్ఞానమునకును నొక క్రమము భాసించు చున్నట్లే వాచ్యప్రతీతికిని వ్యంగ్యప్రతీతికినిఁగూడ నొక క్రమ మున్నదని తెలియుటచే, వాచ్యప్రతీయమానార్థవిషయకజ్ఞానములు సమకాలముననే కలుగుటలేదు. అందుచే "అసంభవ" మను లక్షణదోష మిచటఁ గల్గును.

అసంలక్ష్యక్రమధ్వని యగు రసాదిధ్వనియందు మాత్రము, వాచ్యవ్యంగ్యములు సమకాలముననే భాసించు నని యందురా? అపుడు తమ లక్షణమున నవ్యాప్తి యను దోషముపట్టును. వస్తుధ్వనియందును, నలంకారధ్వనియందును వాచ్యవ్యంగ్యములకుఁ గ్రమ మున్న దనివిూరే యంగీకరించుచున్నారుగదా! అపుడు ధ్వనియం దంతర్భూతములే యగు వస్త్వలంకారధ్వనుల కీ లక్షణము సరిపోదు. అందుచే నవ్యాప్తిదోష మభివ్యక్తిలక్షణమునకుఁ దప్పదు.

వాస్తవమున రసాదిధ్వనులయందైనను, విభావాదుల జ్ఞానము కలిగిన సమయముననే, రసజ్ఞానము కలుగు ననుట యుక్తియుక్త మైనది

గాదు. ఎట్లనఁ గృత్రిమము లగు కారణములచే మనము విభావాదు లని పిలుచుచున్నాము—రత్యాదులు వాస్తవమైన యునికి గలవి కావు. అవి ప్రతిబింబసదృశములు నసత్యములును. ఇట్టి రత్యాదులనే మనము స్థాయిభావము లని పిలుచుచున్నాము. వీనిని గవులు పాఠకులకు హృదయసంవాదవశమునఁ దన్మయము గలుగునట్లు వర్ణింతురు. అటులే, నటులును ప్రేక్షకులకుఁ దన్మయము గలుగునట్లభినయింతురు-అప్పుడాస్వాద్యమానములైన యీ రత్యాదులనే రసము లని పిలుతుము. విభావాదులు కారణము లనియు, రసములు కార్యము లనియు నివి ప్రతిబింబకల్పము లనియుఁ జెప్పితిమిగదా! ఇట్టి పరిస్థితులలోఁ గారణములును కార్యములు నొకే సమయమునఁ బ్రకాశించుట యెట్లు సంభవమగును? సమకాలభాస మీ రెంటికిని సంభవమగునేని వానికిఁగల కార్యకారణభావమే నశించును. ఇక నభివ్యక్తిలక్షణము సమన్వయించు ఘటప్రదీపములు కావ్యమే కాదు. అందుఁగా వ్యత్యాసమే లేనపుడు,త ద్విశేష మగు ధ్వనిత్వమె ట్లుండును.

ప్రకాశక మగు నర్థము రెండువిధములు. (1 ఉపాధిరూపము (2) స్వతస్త్రి—ఇందు, స్వరూపోపరంజనముచే నితరవస్తుప్రతీతికి హేతు వగునది యుపాధి యగును. జ్ఞానము, శబ్దము, ప్రదీపము, మణి, యనునవి యుపాధిరూప ప్రకాశకములయందంతర్భావము నొందును. "త్రయః ప్రకాశాః స్వపరప్రకాశాః" (స్వపరప్రకాశకము లగు ప్రకాశక వస్తువులు మూఁడు గలవు) అను వాక్య మీ విషయముఁ దెల్పును, ఇందు జ్ఞానము స్వప్రకాశము శబ్దముఁ బ్రదీపముఁ బరప్రకాశములు. జ్ఞానము జ్ఞేయవిషయమును దనలో నుంచుకొని "యీ విషయము తెలిసినది" యను రూపముగల జ్ఞానమునందే జ్ఞేయమునుగూడ ప్రకాశింపఁజేయును. అనఁగా జ్ఞానము స్వప్రకాశ మగుచునె జ్ఞేయమునుఁగూడ ప్రకాశింపఁజేయుచున్నది. ఇటులే శబ్దప్రదీపములుగూడ స్వరూపమును బ్రకాశింపఁజేసికొనుచునే, స్వవాచ్యమగు నర్థమును, ప్రకాశ్య మగు ఘటమును

ప్రకాశింపఁజేయుచున్నవి. ఇఁక స్వతస్సిద్ధరూప మగు ప్రకాశ మొక విధముగ నేయుండును. ధూమమే యిందులకు దృష్టాంతము.

అందులో నుపాధిరూపమగు ప్రకాశకమును మీరంగీకరింపరాదు. ఏలనఁ బైవానిలో జ్ఞానప్రదీపాదుల నంగీకరించుచో, వానిచేఁ బ్రకాశ్య మగునది ప్రత్యక్ష మగు నర్థ మగును. శబ్దమునంగీకరించుచో నభిధేయ మగు నర్థము ప్రకాశ్య మగును. అప్పుడు ప్రత్యక్ష మగు నర్థమునకును, నభిధేయ మగు నర్థమునకునుమాత్రమే కావ్యత్వము సిద్ధింపవలసియుండును. అది మీకును సమ్మతము గాదు. ఇఁక స్వతస్సిద్ధరూప మగు ధూమాదిప్రకాశములను గ్రహింతు మందురా, యప్పుడు దానికి ననుమానరచనయందుఁగన్పడు లింగత్వమే యుండును గాని, మీరనుకొనిన వ్యంజకత్వము సంభవింపదు. ధ్వనికర్తృమతమునందును, వస్త్వలంకారరసాత్మకము లగు మూఁడువిధము లగు వ్యంగ్యార్థములునుగూడ ప్రకాశక మగు వస్తువుతోఁగలిసి భాసింపవు. ఈ విషయమును ధ్వనికర్తయే యీ క్రిందివాక్యములయందుఁ దెల్పినాఁడు.

"నహి విభావానుభావవ్యభిచారిణ ఏవ రసాః ఇతి కస్యచిదవగమః, తత ఏవచ తత్ప్రతీత్యవినాభావినీ రసాదీనాం ప్రతీతిరితి తత్ప్రతీత్యోః కార్యకారణభావేనావస్థానాత్ క్రమోऽవశ్యంభావీ, స తు లాఘవాన్న లక్ష్యతే ఇత్యలక్ష్యక్రమా ఏవ సన్తో వ్యంగ్యా రసాదయః" (విభావానుభావ వ్యభిచారిభావములే రసము లని యెవరును దెల్పుట లేదు-ఆ విభావాది ప్రతీతికిని, రసాదిప్రతీతికిని, నవినాభావసంబంధ ముండుటచే, విభావాది ప్రతీతినుండి రసాదిప్రతీతి కలుగుచున్నది. అందుచే వానికిఁ గార్యకారణభావము నంగీకరింపవలయును. అప్పు డవశ్య మా కారణముల ప్రతీతియందు క్రమ ముండవలయును. అయినను నా క్రమము మనము గుర్తింపలేనంతటి వేగము గలదిగ నుండును. అందుచే రసాదు లలక్ష్యక్రమ వ్యంగ్య

ము లని తెల్పినాము"—ఇట్లు తెల్పుటచే నభివ్యక్తి యనునది యిచటఁ గూడ సమన్వయింపదు.

పూర్వపక్షము:—పై లక్షణమునందు. "ప్రకాశకేన సహైవ ప్రకాశవిషయతావ ర్తిః" (ప్రకాశమగు వస్తువుతోఁ గలిసియే ప్రకాశించుట) యను పదములను దీసివేయుదుము. అపుడు, మీరు చూపిన దోషములకుఁ దావుండదు.

సిద్ధాన్తము:—ఇపుడును మీరు చెప్పిన ధ్వనిలక్షణము దోషదుష్టమే యగును. ధూమాగ్ని దృష్టాన్తము నందుఁ గూడ ధూమము తానుపసర్జనమై యగ్నిని బ్రకాశింపఁ జేయుచునే యున్నది. అందుచే ధ్వనిలక్షణ మిచటఁ గూడ సమన్వయించుచున్నది. అపు డతివ్యాప్తి యను దోషము కలుగుచునే యున్నది.

పూర్వపక్షము :—అగుచో, "సతోఽసత ఏవవార్థస్య" అను పదములలో "అసత ఏవార్థస్య" అనియే యుంతుము. "సతః" అను పదమును దొలఁగింతుము. అపుడు, అసద్భూతము లగు వస్తువులు ప్రకాశ్యము లై నపుడే ధ్వనిలక్షణము సమన్వయించును. ప్రస్తుతము "అగ్ని" సద్రూపమే గాని,—యసద్రూపము గాదు. కావున మీరు చెప్పి నట్లతివ్యాప్తి దోషము రాదు.

సిద్ధాన్తి:—అపుడు ఘటప్రదీపముల విషయమున,ఘటము సద్రూపము. అందుచే మీ ధ్వని లక్షణము ఘటప్రదీప స్థలమునఁ గూడ వర్తింపదు. కాని మీ కచట ధ్వనిలక్షణము సమన్వయించుట యభీష్టము. ఇట్లభివ్యక్తికి లక్ష్యము లైన తావులలో, మీ లక్షణము సమన్వయింప కుండుటచే నిచట నవ్యాప్తియను దోషము వాటిల్లినది.

పూర్వపక్షము:-అసతః-(అసద్రూపమైన)యను పదమును లక్షణ మునుండి తొలఁగింతుము.

సిద్ధాన్తి:—సూర్యుని కిరణముల సంపర్కమువలనఁగన్పడు నింద్రచాప మసద్రూపమైనది. కాని యది యభివ్యక్తికి విషయమే యని తెల్పియుంటిమి. మీరు "అసతః" అను పదమును లక్షణమునుండి తీసి వేయుచో మీ లక్షణమునకీ యసద్రూపమైన యింద్రచాపము లక్ష్యము కాదు. అందుచే నవ్యాప్తియను దోషము మీ లక్షణమునకుఁ బట్టును.

పూర్వపక్షము:—"సతః అసతో వా" అను రెండు పదములను లక్షణమునుండి తీసివేయుదుము.

సిద్ధాన్తి:—"ప్రకాశకప్రకాశ్యములుకలిసియే భాసించుట" "సదస ద్రూపములైన" యను పదజాలమునంతెనుఁ దీసివేయుచో మిగిలిన యభివ్యక్తి లక్షణము మే మంగీకరించిన యనుమానమునకే సరిపోవును. అభివ్యక్తికి సరిపోదు. అది యిట్లగుట మా కిష్టమే. వాచ్యప్రదీయ మానములు సద్రూపము లనియు నవి క్రమముగనే భాసించు ననియు మేము నంగీకరింతము.

ఇప్పటికిని మేము తెల్పిన యసంభవదోష మట్లే యున్నది. మఱి యొక విషయమునుఁ గూడ గుర్తింపవలయును. విశేషణ మనునది విశేష్యమునకు నితరవస్తువులకుఁ గల భేదమును దెల్పి, విశేష్య మితర వస్తువులకంటె విభిన్నమైనదను విషయమును దెల్పును. కాని యిచట "ప్రకాశ్యమునకున్న" సదసద్రూపములలోనే "నేదియైన" యను విశేషణ ము ప్రకాశ్యవస్తువు నితరవస్తువులనుండి విభిన్నమైన దానిఁ జేయుట కుపకరింపదు. అనఁగా నీవిశేషణమువలన వ్యావర్తింపఁబడు (వారింపఁ

బడు) సద్రూపముగాని యసద్రూపముగాని, కాని వస్తువులు లేవు. అందుచే నీ విశేషణముగూడ ననుపపన్నమే.

అర్థశబ్దప్రయోజన విచారము:—"యత్రార్థః శబ్దో వా" అను ధ్వని లక్షణవాక్యమునందలి యర్థపదమున కర్థమేమి? వాచ్యమగు నర్థ మీ యర్థశబ్దమున కర్థ మగుచో, వాచ్యార్థముచే ననుమిత మగు (ధ్వని కర్త్రనుమతమున వ్యంగ్యమగు) నర్థము తిరిగి మఱియొక యర్థము నకు వ్యంజక మైనపు డీ వ్యంజకమగు నర్థము వాచ్యార్థము గాకుండుటచే నిచట వ్యంగ్యమునకుఁ గూడ ధ్వనిత్వము సంభవింపఁగూడదు. ఉదాహరణమునకు "ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వే పితు రధోముఖీ" అను శ్లోకమున, అధోముఖీ యను శబ్దమునకుఁ గల వాచ్యార్థమునుండి "లజ్జ" వ్యంగ్య మగుచున్నది. ఈ లజ్జ యను వ్యంగ్యార్థము పార్వతియం దున్న శివవిషయకమగు రతి యను భావమును వ్యంగ్యము చేయుచున్నది. ఇపు డీ శివవిషయకమగు రతి యను వ్యంగ్యార్థము వాచ్యార్థమునుండి కలిగి నది కాదు. "లజ్జ" యను వ్యంగ్యార్థమునుండి కలిగినది. అందుచే శివ విషయకరతి నిచట ధ్వని యని వ్యవహరించుటకు వీ లుండదు. కాని దానికిని ధ్వనిత్వము మీ కభీష్టమే. ఇట్లు నిజముగ ధ్వనికి లక్ష్యమే యగు నీ తావున మీరు చెప్పిన ధ్వనిలక్షణము సమన్వయింపకుండుట చే నా లక్షణమున కవ్యాప్తిదోషము పట్టినది.

ధ్వనివాది పూర్వపక్షము:—

"అర్థః సహృదయశ్లాఘ్యః కావ్యాత్మా యో వ్యవస్థితః
వాచ్యప్రతీయమానాఖ్యౌ తస్య భేదా వుభౌ స్మృతౌ"

అను శ్లోకమున, 'కావ్య మను శరీరమున కాత్మభూతమై సహృదయ శ్లాఘ్య మగు నే యర్థము గలదో, యది వాచ్య మనియుఁ బ్రతీయమాన మనియు రెండు విధములుగ నున్న దని' యిదివఱకే తెలిసియుంటిమి

గదా! అందుచే నిచట యర్థశబ్దముచే వాచ్యార్థమును వ్యంగ్యార్థమును గూడ గ్రహింతుము. అపుడు వాచ్యవ్యంగ్యమగు నర్థముగూడ ధ్వని యగుట కభ్యంతర మేమియు నుండదు

**అనుమితివాది సమాధానము:**—సత్యమే కాని "యత్రార్థశ్శబ్దో వా తమర్థ ముపసర్జనీ కృతస్వార్థౌ" అను లక్షణమున, "తమ్" అను తచ్ఛబ్దము దానితరువాత నున్న "యర్థ శబ్దమున కర్థమగు" ప్రతీయమానార్థమును తెల్పుచున్నది-అనఁగా నీ లక్షమునందలి, రెండవ "యర్థ" శబ్దము వ్యంగ్యార్థమునే తెల్పును. కాఁగా మొదటి "అర్థ" శబ్దము, వాచ్యార్థమునే తెలుపవలయును - ధ్వనికర్తయే స్వయముగ "అర్థో వాచ్య విశేషః" అని వివరించినాఁడు. అందుచే నిచట "యత్రార్థః" అనునప్పు డర్థశబ్దము వాచ్యార్థమునే తెలుపునుగాని, వాచ్యవ్యంగ్యము లగు రెండర్థములనుఁ దెలుపదు. అందుచే నింతకుఁ బూర్వము మేము తెల్పిన దోష మట్లే యున్నది.

పోనిండు. "యత్రార్థః" అనుచో నర్థశబ్దమునకు వాచ్యవంగ్యములు రెండును నర్థములే యని గ్రహించిననాఁడును, మీ లక్షణమున నతివ్యాప్తి దోష ముండనే యున్నది. ఒక వాచ్యార్థమునుండి, సాధ్యమగు మఱియొక వస్తువు ప్రతీయమాన మగుచున్నది. వాచ్యమునకును బ్రతీయమానమునకును మధ్య నొకటి, రెండు లేక మూఁడు వస్తువులు (విషయములు) వ్యవధానముగ నున్నవి. ఇట్టి స్థలములలోఁ గూడ మీ ధ్వనిలక్షణము సమన్వయించును. కావున నిచట సాధ్యమైన ప్రతీయమానార్థము గూడ ధ్వనియే కావలసి వచ్చుచున్నది. ధ్వనికి లక్ష్యము కాని దీనియందు లక్షణము సమన్వయించు చుండుటచే నతివ్యాప్తి దోషమువచ్చినది.

**ధ్వనివాది:**—ఇచటఁ బ్రతీయమానార్థము ధ్వని యగుట మాకిష్టమే. అందుచే నతివ్యాప్తి దోషములేదు.

## భీమేశ్వరపురాణము—కావ్యత్వము

చిలుకూరి పాపయ్యశాస్త్రి

ఉ. వేలుపుగిడ్డియుం బరుసవేదియుఁ గల్పకుజంబుఁ దోడ రా
లాలితపాదనూపురఝుళంఝుళనాదము లుల్లసిల్లఁ బైఁ
జేలచెఱంగు దూలఁగ విశృంఖలవృత్తిఁ జరించుచుండె నీ
లాలక యన్నపూర్ణ యమృతాన్నముఁ బెట్టుచు నన్నిపంక్తులన్.

౨.౧౪౯.

ఈ యన్నపూర్ణయే కరుణాకటాక్షముతో నీక్షించి, భీమనాథుని గొలిచి మోక్షమొందు మని యుపదేశించినది. ఆ యుపదేశమే వ్యాసుని భీమమండలికిఁ గొని తెచ్చినది. విశ్వనాథుని యాగ్రహమునకు లక్ష్యభూతుఁడైనను విశాలాక్షి యనుగ్రహమునకుఁ బాత్రుఁడైనందుననే యాతనిపాదరజఃస్పర్శచే భీమమండలి పవిత్రమగుట చేకూడి, శ్రీనాథునకు రసభరితమైన కావ్యవస్తువు సమకూడుటకు నదను చిక్కినది. వ్యాసునకు విశాలాక్షి యిట్లభయ మొసఁగినది.

చ. వెఱవకు మోకుమార! పదివేలవిధంబులనైన నిన్ను నే
మఱవ; మఱేడకుం జనుట మాని, సుఖంబున దక్షవాటికన్
దుఱఁగలి గొన్నసమ్మదముతో గమనింపుము; భీమనాయకుం
డఱగొఱలేని వేల్పు నిఖిలాభ్యుదయంబులు నీకు నయ్యెడున్.

భీమ. ౨. ౧౫౫.

ఈ విధముగ నీ ద్వితీయాశ్వాసమునందలి వర్ణనములు, ఇతివృత్తము, కథాకథనసౌష్ఠవము, రచనలోని పరిపాకము భీమేశ్వరపురాణమునకుఁ గావ్యత్వమును సమకూర్చినవి.

### హాలాహలభక్షణము.

భీమేశ్వరపురాణమునకుఁ గథానాయకుఁడు శ్రీభీమేశ్వరమహాదేవుఁడు. దేవహితమునకు సకలలోకరక్షార్థము నాతఁడు గావించిన మహత్తరకృత్యములలో ముఖ్యముగఁ బేర్కొనఁదగినవి అమృతావహా

ములు నైనవి రెండు. వానిలో మొదటిది హాలాహలభక్షణము; రెండ
వది త్రిపురాసురసంహారము. ఈ రెంటిని నితరదేవతల కేపాటియు
సాధ్యములు గాక, పరమేశ్వరుని నిగ్రహానుగ్రహపరత్వమున నిర్వహింపఁ
బడినవి గావున, పార్వతీపతి మహత్త్వమును గొనియాడఁగడఁగిన వేద
ములందు సైతము నీయితివృత్తములు వర్ణింపఁబడియున్నవి. హాలాహల
భక్షణమునకుఁ బూర్వరంగమైన క్షీరాబ్ధిమథనమునందుఁ గొంతవఱకు
విష్ణువునకుఁ బ్రాధాన్యము కలదు; కాని త్రిపురాసురసంహారముమాత్రము
కేవలము శివునియపదానమే. కావుననే శివభక్తు లందఱు పరమేశ్వరుని
మహిమ నుగ్గడించుపట్టులందు ముఖ్యముగ త్రిపురాసురసంహారమును
పేర్కొందురు.

కవికులగురువగు కాళిదాసు, మేఘసందేశమున హిమవత్పర్వ
తమునందలి హరచరణన్యాసమును వర్ణించుఘట్టములో, "శబ్దాయం తే
మధుర మనిలైః కీచకాః పూర్యమాణాః, సంరక్తాభి స్త్రిపురవిజయో
గీయతే కిన్నరీభిః" అని హిమత్పర్వతమునందు, కిన్నరస్త్రీలు మధురకంఠ
ముతో త్రిపురవిజయమును గానము చేయుచుందు రని తెలపినాఁడు.
ఇట్టి గేయమైన యితివృత్తమును శ్రీనాథుఁడు భీమనాథుని మహిమ
నుగ్గడించుటకై యీకావ్యమున సంతరించియున్నాఁడు. త్రిపురాసుర
సంహారము చేయవలసినయక్కఱ యేర్పడుటకుఁ గారణముగా క్షీర
సాగరమథనము జరిగూడినది. ఆమథనవేళ జన్మించిన హాలాహలమును
భక్షించుటచేఁ బరమేశ్వరునిమహత్త్వము పరిపుష్టమై, భీమనాథునకు
భీమేశ్వరనామధేయము సార్థకమైనది. ఈవిధముగఁ గార్యకారణభావ
సమన్వితములై యీరెండుకథలును చతుర్థాశ్వాసమునందుఁ గవగూడి
యీపురాణమునకుఁ గావ్యత్వము నాపాదించిపెట్టినవి.

కావ్యమునందు తప్పక యుండవలసినవి నాయకుఁడు ఇతివృ
త్తము రసము అను నీమూఁడును. ఈమూఁడిటికి సమపరిపుష్టి జరిగి
నపుడే యది యుత్తమకావ్య మగును. ఈమూఁడిటినిర్వహణమునందే
కవికిఁ గలప్రతిభ వ్యక్తమగును. ఈకావ్యమునకు నాయకుఁడు భీమనా

ఘుఁడు. అతనిమహిమను వ్యక్తముచేయు నితివృత్తములో రసవత్తర మైనది త్రిపురవిజయము. ఇచటి రసము వీరము. దానికిఁ బుష్టినిదెచ్చినది హాలాహలభక్షణము, నప్పటియద్భుతరసమును. ఈవిధముగ నీచతుర్థాశ్వాసము రసబంధురమై, తీర్థక్షేత్రమాహాత్మ్యముల నడుమ నవతరించి, కావ్యవస్తువై విలసిల్లినది.

దక్షారామమున మహర్షు లంకఱు నొకచోఁ జేరియుండగఁ "మంకణుఁడనుఁ" డనుమహర్షి భీమనాథుమహాత్మ్యంబు పెంపు వినఁగ వేడ్క యగుచుండు నాకు నానతీఁదగు మీలోన నొక్కరుండు" అని యడుగఁగా, కుంభసంభవునినియోగంబున వసిష్ఠమహర్షి యుపక్రమించి, పరమేశ్వరునకు దక్షారామవాసికి భీమేశ్వరనామము వెలసినవిధము నిట్లు ప్రస్తావించినాఁడు.

క. భీమమగు గరళకూటము
 భూమియు గగనమును దిశలఁ బొడచూపినచో
 భీమగతి మ్రింగెఁ; గావున
 భీమేశ్వరుఁ డయ్యె నితఁడు బిరుదాంకమునన్. భీమ. ౪. ౪.

భూమిని గగనమున దిశలఁ—అని యుండుట యుక్తముగాఁదోఁచెడిని.

భూమ్యాకాశములందు, దిక్కులన్నిటను నిండి మిక్కుటమైన భయము నొదవించిన కాలకూటవిషమును భయంకరమైనరీతిని మ్రింగినాఁడు గావున దక్షారామవాసియగు పరమేశ్వరునకు భీమేశ్వరుఁ డను పే రేర్పడిన దని నిర్వచనము. దేవతల నమరులఁ జేయుటకై యమృతము నుత్పాదించుయత్నమున శివకేశవుల కిరువురకునుసమప్రాధాన్య మేర్పడియున్నది. ఇరువురతోడ్పాటును లేకున్న నమృతము దేవతలకు లభించునది గాదు. కావున నీక్షీరసాగర మథనవృత్తాంతము శివవిష్ణుమహిమలఁ దెలుపు వృత్తాంతములందు రెండిటను గూడ ప్రసక్తము లే యగుచుండును.

కాలకూటోత్పత్తిప్రకారము హరవిలాసమునందును వర్ణితమైనది; కాని యచట దుర్వాసునిశాపమున నిందుఁడు కున్నయమృత

భాండాదివస్తుజాతము క్షీరాంభోనిధిని బడి, దేవతలకు దూరముకాఁగా వానిని మరల నుత్పాదించుటకై క్షీరాబ్ధిమథనము కావింపఁబడినది. ఇచట నట్టులుగాక దేవదానవు లొండొరులతోఁ గలహించుకొను నపుడు, దానవులను బరిమార్చుటకై, దేవేంద్రుఁడు విష్ణువుతో మంతనముచేసి రాజకీయతంత్రముగా నమృతోత్పాదనమున కారంభ మేర్పడును.

దేవదానవు లిరువురుఁ గూడినఁగాని మందరపర్వతమంథానమున క్షీరసాగరమథనము గావించుట వలనుపడదు. అట్టియదనున నొండొరు లపైఁ బగఁబూని యుద్ధసన్నద్ధులైన దేవదానవులకు సంధిని జతగూర్ప వలయును. దానికి సర్వవిధములఁ దగినవాఁడు జగన్నాటకసూత్రధారుఁ డగుశ్రీమన్నారాయణుఁడే. కావున నాతనితో మంతనముచేయుట కదను, క్షీరాబ్ధిశాయి నిద్ర మేల్కాంచిన సమయము. ఆతఁడు శేషతల్పమున నిద్రించియుండఁగా క్షీరసాగరమును మథించుట వలనుపడదు గదా! కావున నట్టియవకాశముఁ బరికించి, ఇంద్రుఁ డుపేంద్రునితో మంతనము చేసె నని తెలుపుటకు, శేషశాయి నిద్రమేల్కొన్నయప్పటి చిత్రరువు నీరీతిగఁ గవి యవతరింపఁజేసినాఁడు.

సీ. దివ్యాయుధము లైదు ధృతచేతనంబులై
శత్రుసంహారబు సంస్తుతింపఁ
బులుగుఱేఁడు కరాబ్జములు రెండు మొగిడించి
భ్రూలతాదేశంబు పొలుపు నరయ
సౌఖశాయనికులై సనకాదియోగీంద్రు
లనురాగవీక్షణం బభిలషింప
నూరురంభాస్తంభయుగళంబుపై నుంచి
లక్ష్మి శ్రీపాదపల్లవము లొత్తఁ
బన్నగాధీశభోగతల్పంబుమీఁదఁ
దత్ఫణారత్నదీప్తి మైతళుకుఁ జూపఁ
బాలమున్నీటిలో నిద్ర మేలుకొన్న
హరికిఁ బొడచూప నేతెంచె హరిహయుండు. ౪. ౪౫.

క్షీరాబ్ధితల్పమునుండి నిద్ర మేల్కాంచిన దివ్యవైభవ మీపద్యము నందు నందముగఁ జిత్రితమైనది. నిద్ర మేల్కాంచినతఱి నెవ్వనిమాననమైన ప్రసన్నముగ నుండును. ఇంద్రియములు బాహ్యప్రపంచ విషయములందుఁ బ్రవృత్త మగుటకుఁ దగిన యదను నదియే. కావున నట్టి యదను చూచుకొని యోగనిద్రనుండి మేల్కాంచి, జగదవన రక్షాప్రవణుఁడైన నారాయణునొద్దకు దేవేంద్రుఁ డొంటరిగ వచ్చి, రహస్యముగా హితకార్యచర్చ చేసి, ఆవిషయము రెండవచెవికిఁ దెలియకుండ సంకల్పసిద్ధిఁ బడసి తనశిబిరమునకు వెడలిపోవుట నిటఁ గవి సున్నితమైన తెలఁగునుడికారములోఁ దెలిపినాఁడు.

గీ. ఒంటి నేతెంచి మంతనం బుండి నిలిచి
చక్రధరుతోడ హితకార్యచర్చ చేసి
యేఁగె దేవేంద్రుఁ డిరుచెవి నెఱుఁగకుండ
సిద్ధసంకల్పుఁడై యాత్మశిబిరమునకు. ౪. ౫౦.

రాజకీయవ్యవహారములు చాల రహస్యముగా నాలోచింపఁదగినవి. అందును యుద్ధమునకు సంబంధించిన వ్యవహారములు మఱింత యేకాంతముగా జరుపవలయును. కావుననే దేవేంద్రుఁ డొంటిగా వచ్చి, దేవతాకార్యసిద్ధికై కేలఁ జక్రముఁ దాల్చిన శ్రీహరితో మంతనముండి, హితకార్యచర్చ చేసినాఁడు. తాము చర్చించినవిషయ మేపాటి పొక్కినను, వ్యవహార మంతయుఁ జెడిపోవుటయే గాక శత్రునిరోధ మసాధ్య మైపోవును. శ్రీహరితో మంతనముచేసినంతనే యింద్రుఁడు సిద్ధసంకల్పుఁడై తనకార్యపరిపాటి నిరుచెవినెఱుఁగకుండఁ దనశిబిరమునకుఁ దరలిపోయినాఁడు. ఇరుచెవి నెఱుఁగకుండఁ జేయవలయును గావుననే కవికూడ మన 'కాయిరువ్వురచర్చ నించుకైనను దెలుపకుండఁ దరువాతి కార్యమునకుఁ దిగినాఁడు.

వెంటనే శ్రీమన్నారాయణుఁడు, దేవదానవులనడుమ సంధి సేయ సమకట్టి యిట్లు లుద్బోధించెను.

క. ఓవెఱ్ఱులార! యేఁటికి
నీవెడఁగు విచారములు సహింపఁగ రాదా
యేవారికైన మేలా
చావు లతర్కితము లుగ్రసంగ్రామములన్?

గీ. కుడిచి కూర్చుండి మీరేల కొఱఁతయైన
కుమ్ములాడెద రో యన్నదమ్ములార!
గొఱ్ఱె ప్రొవ్వియు సెలగట్టెఁ గొఱికినట్లు
కట కటా! మీవివేకంబు గాడుపడఁగ.

ఈపద్య మంతయుఁ జక్కని తెలుఁగుజాతీయములతో నిండి సంధిపలుకులు సమన్వితములుగఁ గూడినది. కుడిచి కూర్చుండి కుమ్ములాడుట కుపమానముగ, గొఱ్ఱె ప్రొవ్వి సెలగట్టెఁ (బాణమును) గొఱికినట్లు న్నదనుట మఱింత చక్కఁగ పొసఁగినది. సంస్కృతసమాసాడంబరముతో నిండించెడి శ్రీనాథుఁ డచ్చతెలుఁగుపదముల కూర్పునందును నీడఁబోని రచన సాగింపఁగలుగుట కిది తార్కాణము. మఱియు వారితో—

"భద్రసువర్ణపీఠికలపైఁ గొలువుండి త్రిలోకరాజ్య మ
చ్ఛిద్రముగాఁగ నేలుట విశేషమొ చచ్చుట తా విశేషమో"

కావున సుధాపానంబున జరామరణంబు లుజ్జగించి సుఖం బనుభవింపుఁడు; క్షీరసముద్రమథనంబునం గాని సుధారసంబు సంభవింపదు; గావున ఆదికచ్ఛపము మూలాధారముగా, మందరపర్వతము మంథనదండంబుగాఁ, శేషుఁడు తఱిత్రాడుగా క్షీరసముద్రమును మథింపవలయు నని చెప్పివారి నొడఁబఱచినాఁడు. ఇంద్రోపేంద్రుల రహస్యకార్యాలోచన మిట్టియమృతమథనకార్యారంభమునకు దారి చూపినది. శౌరి పల్కులు విని సమ్మతించి సముద్రమథనమునకుఁ బూనుకొనినంతనే మురాంతకుఁడు బాహాస్తంభచతుష్టయంబున మందరమహీధరము నెత్తి శిఖరసందోహములు బ్రహ్మాండముఁ దాఁక నుద్ధతితోఁ దెచ్చి క్షీరసముద్రముఁ జేర్చెను.

మందరమంథానమునఁ గావించిన సముద్రమథనపద్ధతిని, మథనమునకు వలయు సామగ్రిని శ్రీనాథుఁ డొక్కసీసమునఁ జక్కఁగఁ బరిగ్రంచియున్నాఁడు. సంస్కృతమూలమున సంక్షేపముగ నుండిన యీ విషయమును విపులీకరించి చక్కనిదృశ్యమును సర్వాంగసౌష్ఠవముతోఁ జిత్రించినాఁడు.

సీ. కపటకచ్ఛప మైన కైటభాంతకుపీఁపు
కొమరు మీఱిన చుట్టకుదురు గాఁగ
నారసాతలమూల మైన మందరమహా
ధరణీధరంబు మంథానకముగ
దందశూకాన్వయాధ్యక్షుండు వాసుకి
తతపరిగ్రహణసూత్రంబు గాఁగ
నావహప్రవహాదు లగుమారుతంబులు
తగులఁగట్టిన యాఁకత్రాళ్లు గాఁగ

బలిపురోగమ దైత్యపరివృఢులును
దివిజనాయకుఁ డాదిగా దేవతలును
దరిచి రంభోధి ఘుమఘుమధ్వానరవము
భువనగోళంబు దిక్కులు చెవుడువడఁగ

ర. ౫౯.

ఆదికూర్మముపీఁపు చుట్టకుదురు. పాతాళము నంటినమూలము గల మందరాచలము కవ్వము. పాపఱేఁడగు వాసుకి తరిత్రాడు. ఆవహము ప్రవహము మున్నగు మారుతములు ఆఁకత్రాళ్లు. బలిముఖ్యదానవవీరులు దేవేంద్రాది దేవతలు కవ్వము త్రిప్పువారు. క్షీరాంభోధిని మథింపఁగాఁ జెలరేఁగిన ఘుమఘుమధ్వానము లోకములు దిక్కులు నన్నియుఁ జెవుడుపఱచినది. ఈమథనమునుండి ముందుగఁ బుట్టవలసినది సర్వలోకభయంకరమైన కాలకూటవిషము గావున, దానియాటోపము తోడనే హాలాహలోత్పత్తిప్రకారమును వర్ణించిన వచనరచనయుఁ గొనసాఁగినది.

ఈవచన మనుప్రాసబహుళమై బీభత్సరసమున కనునైనశైలిని గొనసాఁగినది. ఇరువదిపంక్తుల యీవచన మంతయు హెచ్చుతగ్గులు లేకుండ నేకరీతిగ నడిచినది. హాలాహలోద్భూతిచే లోకము లన్నియుఁ బరిభ్రమింపఁ జాలినయుద్ధతి చెలరేఁగినట్టులు చిత్రించినాఁడు కవి. ఈ రచనలో శబ్దచిత్ర మధికమే యైనను అర్థసౌష్ఠవమునకుఁ గొఱఁత మాత్రము లేదు. కొంత యుదాహరింతును.

వ. ఇవ్విధంబున సురాసురవ్యూహంబులు మదంబులు ముదంబులు శౌర్యంబులు ధైర్యంబులు క్రౌర్యంబులు వీర్యంబులు హంకారంబులు హుంకారంబు లుల్లాసంబులు పరిహాసంబులు బలంబులు చలంబులు ... బెంపులు గుంపులు పరువులు మురువులు గెఱయ మెఱయ, బాహావష్టంభసంరంభవిజృంభణంబునఁ దరతరంబ తెగువందరువం దరిత్రాడు పాపతేని యొడలిమలకలు పురులు విడి ... ధణద్ధణగ్గారవంబు ఘూర్ణమానం బయ్యె; నప్పుడు ... భృంగసంకాశంబును నీలజీమూత సన్నిభంబును గల్పాంతసమయవహ్నికల్పంబును గాలమృత్యుప్రతిమంబును యుగాంతాగ్నివర్ణంబును నైన...కోలాహలాభీలంబయి హాలాహలం బుద్భవింప—

నది చూచి విష్ణువుతోసైతము దేవత లందఱు వన్నె తఱిగి భయభీతులై పరమేశ్వరుని శరణుఁజొచ్చిరి. పరమేశ్వరుఁడు ను దనయ భయహస్తము సాచి, దేవతలతో మీరు వెఱవకుండుఁ డని తెలిపి, హుంకారముతోపాటు అట్టహాసము గావించి యా కాలకూటమును దనహస్తపద్మమునందు నిలిపినతీరును కవి రౌద్రమునకుఁ దగినయారభటిలో నడిపించినాఁడు.

మ. పటుహుంకారమహాట్టహాసకలసం ఛాతాళభూస్వర్గసం
కటసన్నాహసముద్భవంబయిన యాకాకోలకాలాగ్ని ధూ
ర్జటిహస్తాబ్జమునందుఁ గైకొనియె నాజ్వాలాకులజ్యోత్స్న మ
ప్పటివేళన్ మదభృంగ మయ్యె శశిభృత్పాణ్యబ్జమధ్యంబునన్.

ఆహాలాహల మావిర్భవించినపుడు తొలుత భృంగాకృతిలో బయలు దేఱెనను క్రమముగా బ్రహ్మాండమంతయు నిండిన కాలాగ్ని సన్నిభం బైనది. కాని యీశ్వరునిహుంకారముతోఁ గూడినయట్టహాసముచే మరల మదభృంగాకారమునకే వచ్చినది.

ఇచట నడుమ నొందినవృద్ధిని వచనములోఁ దెలిపినాఁడు గాని తగ్గుటలో మాత్రము క్రమపరిణామమును దెలుపలేదు. హరవిలాసములో హాలాహలోద్రేకము క్రమముగ తఱుగుటను సొగసుగఁ జిత్రించినాఁడు.

చ. జలధర మంతయై కరటిచందము గైకొని సూకరాకృతి
న్నిలిచి పికంబుతో దొరసి, నేరెడుపండుగబోలె నుండయై
కలశపయోధిమంథనముఖంబునఁ బుట్టిన యమ్మహాహలా
హలము క్రమంబునన్ శివునిహస్తసరోరుహ మెక్కెఁ జుక్కగన్.

హరవిలాసము.

ఈపద్యమునందలి వర్ణన మెంతయు సముచితముగ జతగూడినది. లోకమునంతయు నిండిన కాలకూటము పరమేశ్వరునిహుంకారముచే తొలుత మేఘమంతయై, ఆవెనుక నేనుఁగు వరాహము పికముల యాకృతితోఁ బోలినదియై క్రమముగ నేరెడుపండువలె నుండయై తుదకి నీశ్వరునిహస్తసరోరుహము నెక్కునరికి నొకచుక్కయాకృతి వహించినది. కావుననే శివుఁడు రససిద్ధుఁడు రసఘుటికను మ్రింగినట్లు విషమును గుటుకున మ్రింగె నఁట. ఈగరళభక్షణపద్ధతి రెండిట నొకే పద్యమున శ్రీనాథుఁ డిట్లు చిత్రించినాఁడు.

క. కటుక మగువిషము విషధర
కటకం బగు కేలఁ బూని కౌతూహలియై
ఘుటికాసంసిద్ధుఁడు రస
ఘుటికయునుం బోలె శివుఁడు గుటుకున మ్రింగెన్.

రససిద్ధిని సాధించిన యోగులు ద్రవరూపమయిన పాదరసమును ముద్దగాఁ జేసి, దానిని మ్రింగి, జరామరణవర్జితు లగుదురు. విషభక్షణముచేయుట యలవరించుకొనినవారికిని రససిద్ధి యేర్పడునని రసశా

త్రముసకు సంబంధించిన రహస్యము. నీలకంఠు నారాధించిన భక్తులకే, యీశ్వరవీర్యమగు పాదరసము నాస్వాదించి తన్మూలమున విలక్షణ సిద్ధులను బడయుట, విషధారణము చేయఁగలశక్తిఁ బడయుటయుఁ గలుగుచుండఁగా, సకలసిద్ధులను భక్తుల కొసఁగఁజాలిన యీశ్వరుఁడు కాలకూటమును మ్రింగుటలో నాశ్చర్య మేమియు లేదనుటను ధ్వనింపఁ జేయుచు శ్రీనాథుఁడు శివుఁడు విషము గుటుకున మ్రింగెన్ అనినాఁడు.

హాలాహలము పరమేశ్వరుని కంఠమునందే నిలిచిపోవుట కీసమయమున నొకవింతసన్నివేశము జతగూడినది. కాలకూటవిషము కంఠసీమఁ జేరుసరికి హిమాచలకన్యక, తనభర్తను కౌఁగిలించుకొనునెపమున తనబాహువులను జుట్టి యిట్లు వాకొనినది.

ఉ. చుట్టు బిగించి పట్టి, పురసూదన! యీగరళాగ్నిఁ గంధరా
ఘట్టమునందు నిల్పు; మదిగాక దిగంబడనిచ్చితేని లోఁ
బట్టున నున్నలోకముల భస్మము సేయు; వెలార్చితేని, వె
ల్పట్టున నున్నలోకముల భస్మము సేయు; నిజంబు చెప్పితిన్.

పరమేశ్వరుఁడు కుక్షిలో నిమిడినసమస్తభువనములు గలవాఁడు. సముద్రమథనమునఁ బుట్టి లోకములన్నియు దహింపఁజేయు హాలాహలమును బాహ్యప్రపంచము భస్మము కాకుండుటకై, లోకానుగ్రహార్థము మ్రింగ నుద్యమించినాఁ డీశ్వరుఁడు. అది గొంతు దిగెనేని కుక్షిలోనిభువనములన్నియు భస్మమగును. వెలుపలి కుమిసిన బాహ్యప్రపంచము భస్మమగును. కావున నిరుతెరఁగుల భువననాశము తప్పదు. అందుఁకై గరళమును గళసీమయందే నిలిపివేయు మని సర్వలోకజనని ప్రార్థించినది.

ఆజగజ్జననిప్రార్థన నంగీకరించి, సర్వలోకసుఖసంధాత యగు శంభుఁ డింద్రనీలమణిభూషానిక్షేపముగ రౌద్రమైన యాకాకోలవిషమును దనగళసీమయందే నిలిపినాఁడు. హాలాహల మతిరౌద్రము. దానిని భక్షించుటయుఁ గూడ నతిరౌద్రమైన కృత్యమే. అట్టిలోకకల్యాణకరమైన కృత్యమును రుద్రుఁడే చేసెనని యీక్రిందిపద్యమున రౌద్రరసభావాభివ్యక్తి యేర్పడునట్లుగు చిత్రించినాఁడు.

శా. శంభుం డంబికపల్కు గైకొని, జగత్సంరక్షణార్థంబు సం
స్తంభించెన్ నిజకంఠగోళమున విశ్వక్షోభ సంతాపసం
రంభారంభ విజృంభణోద్భటకళారాడ్బింబుఁ గాకోలముం
జంభారాతిమణిప్రకల్పితవిశేషానిద్విశేషంబుగన్. ౪. ౭౦.

నాఁటినుండియే పరమేశ్వరుఁడు నీలగ్రీవుఁడై వేదపురాణాము లందు నుతి కెక్కినాఁడు. కాలకూటవిషవిజృంభణము సమసిన వెనుక పునర్మథనమున నమృతకుంభాది దేవభోజ్యపదార్థములు పాల్కడలినుండి వెలువడఁగా, వాని నన్నిటి నొక్కటొక్కటిగ దేవతలు గైకొనిరి. ఆపుట్టిన సర్వమంగళాస్పదంబయిన వస్తువులలో కమలాలయయుత్పత్తి, యామె పుండరీకాక్షుని వరించుటయు ర్వాంగసౌష్ఠవముగఁ గొన సాగినవి.

సీ. సంపూర్ణపూర్ణిమా చంద్రబింబంబుతో
బుట్టెఁ దెల్లని తమ్మి మొగ్గ
విరిసె నొయ్యొయ్యన వేలావనీవాటి
పవమాన కోమలాస్ఫాలనమున
వాసించె నఖిలదిగ్వలయంబు మధురవి
స్ఫార కేసరధూళి సౌరభములు
నంభోజమధ్యంబునం దుద్భవంబొందె
మహితకాంతిచ్ఛటా మండలంబు
అందు మణికర్ణికాగ్ర సింహాసనమున
లక్ష్మి యుదయించి హస్తపల్లవమునందుఁ
బసిఁడిపూదండఁ బూజించెఁ బద్మనయను
నర్థి వరియించె లీలాస్వయంవరమున. ౪. ౭౧.

క్షీరసముద్రమును దనువంచరుచఁ గల్పవృక్ష కామధేను కౌస్తుభములు, ఉచ్చైశ్శ్రవైరావణాదులు పుణ్ణైనని సామాన్యముగఁ దెలిపి పద్మాలయయుత్పత్తి కాధారమైన పద్మము, నెంతయుఁ జిత్రముగఁ

జిత్రించినాఁడు. ఆ పద్మము ముందుగ ముకుళరూపమునఁ బొడసూపుచు, పూర్ణచంద్రునితోఁ పాటు పుట్టి, చంద్రుని పోలికఁ దెలుపు వహించినది. క్రమముగ నా ముకుళము సముద్రతీరవనమునుండి పొదలిన మందమారుతాస్ఫాలనమున మెల్లమెల్లఁగ వికసించినది. రేకులు విచ్చి కేసరములు బయల్పడినంతనే పరాగమునుండి పరిమళములు చెలరేఁగి దిక్కులన్నియు నలముకొనినవి. అట్టి పద్మమధ్యమునుండి మహితమైన కాంతిమండలపూర ముప్పతిల్లినది. ఆకాంతిమండలము నడుమ మాణిక్యకర్ణిక (మద్దు) యను సింహాసనమునందు లక్ష్మీదేవి యుద్భవించినది. ఆమె కరపల్లవమున బంగారుపూదండఁ దాల్చి, పుండరీకాక్షుని స్వయంవరమున వరించి, యా పూదండతోఁ బూజచేసినది. ఈ పద్యమునందు పై నాలుగుపాదములందు కావ్యమునకుఁ బ్రాణమైన మాధుర్యము వెల్లివిరిసినది. సౌకుమార్యము పద్మమునందే కాక, దానిని జిత్రించు తీరునందు మఱింత తొలఁకియాడినది. శ్రీనాథుని సీసముల కూర్పులోని శిల్పము సర్వాంగసుందరమై యవతరించినది. ఒక్కపద్మము వికసించిన తీరు నాలుగుసీసపాదములలోఁ జిత్రించుటలోనే కావ్యత్వ ముట్టిపడుచున్నది.

తుదిపాదములో "లక్ష్మి పద్మనయను నర్థి వరియించె లీలాస్వయంవరమున" అనినాఁడు. పద్మాలయ యగుటచేతనే పద్మనయనుని ప్రీతితో లీలాకల్పితమైన స్వయంవరమునందు వరియించినదఁట. ఈ స్వయంవరమును సంస్కృతకవి యొకఁ డిట్లు చమత్కరించియున్నాఁడు.

శ్లో. ఆఖ్యాతే హసితం పితామహ ఇతి త్రస్తం కపాలీతి చ
వ్యావృత్తం గురు రిత్యయం దహన ఇత్యావిష్కృతా భీరుతా
పౌలోమీపతి రిత్యసూయిత మథ వ్రీడావినమ్రశ్రియా
పాయాద్వః పురుషోత్తమోఽయమితి యోన్యస్త స్స పుష్పాంజలిః.

క్షీరసాగరకన్యక పద్మమధ్యమునుండి లేచి, సముద్రతీరమునందున్న దేవతాగణమును లక్షించి, పూలమాల చేతఁ బట్టుకొని, స్వయంవరమునకు బయలుదేఱినది. ముందుగ బ్రహ్మను జూపి 'ఈతఁడు పితా

మహాఘుఁడు' అనినంతనే నవ్వినది. యువతి తాతను బెండ్లాడుట కంగీకరించునా ? పిమ్మట నీశ్వరుని జూపి 'కపాలి' అనినంతనే వికృతమైన కపాలధారణమును విని భయపడినది. ఈతఁడు 'దేవగురువు' అనినంతనే మొగము త్రిప్పివేసినది. 'దహనుఁడు' (అగ్ని) యనినంతనే తన్నుఁగూడ దహింపఁజేయు నేమో యని భీతిల్లినది. ఇంద్రుని జూపి ఈతఁడు 'శచీపతి' అని యీతని వరింపు మనఁగా, అడుగు పెట్టినంతనే సవతిపోరు సంభవించు నని యసూయపడినది. తుదికి విష్ణునిఁ జూపి, ఈతఁడు 'పురుషోత్తముఁడు' అని తెలిపినంతనే సిగ్గుచేఁ దలవంచుకొని పద్మాలయ పద్మనయనునివక్షమునఁ బూలమాలిక వైచెనఁట. ఇట్టి లీలా స్వయంవరమును శ్రీనాథుఁ డీపద్యమున ధ్వనింపఁజేసినాఁడు. కమలాలయ వరింప ననువైన దేవతాసమితి యచటనే కూడియుండెను; గాన స్వయంవరమునకై యత్న మక్కఱలేకయే హేలగ నామె పురుషోత్తముని వరింపఁగల్గిన దనుట యిచట వ్యక్తమగుచున్నది.

కాలకూటోత్పత్తికి, దద్భక్షణమున జగదుపద్రవ నివారణచేఁ బరమేశ్వరుని మహత్త్వము వ్యక్తము. చేయుటకు మూలము అమృతోత్పత్తియే. ఆయమృత ముద్భవించుట, దానికై దేవాసురులు కలహించుట, శ్రీమన్నారాయణుఁడు జగన్మోహినీ రూపమున రాక్షసులను వంచించి, దేవతల కమృతము పంచిపెట్టుట యనువిషయములను రెండు పద్యములలో సూక్ష్మముగ నిరూపించినాఁడు.

ఉ. అంతులు మీఱి మిక్కిలిగ హాగతనంబున దొమ్మిచేసి, దు
ర్దాంత పరాక్రమోన్నతులు దానవదైత్యులు వేల్పువెజ్జు ధ
న్వంతరిచేతి దుగ్ధమయ వారిసుధారస పూర్ణకుంభమున్
సంతనకట్టి పుచ్చుకొని చయ్యన నేఁగిరి నిర్విశంకతన్.

వ. అప్పుడు—

క. నారాయణుండు మాయా
నారీరూపమునఁ గపటనాటక లీలా
పారాయణత హరించె సు
రారులచే నమృతకలశ మాసమయమునన్. ౪-౯౩, ౯౪.

ఈవిధముగ జగన్మోహినీ రూపమును దాల్చి యమృతమును, హరించి, దేవతలకుఁ బంచిపెట్టిన విష్ణుమాయను సూచనామాత్ర సారముగఁ దెలిసి, దానవు లిట్టు లమృతమును గోలుపోవుట త్రిపురాసుర సంహారమునకు నాందిగాఁ జిత్రించినాఁడు. భీమనాథుని లీలామాత్రమునే యిందు కవి వర్ణింపఁబూనినాఁడు గావున, మాయానారీరూప వర్ణనము కావ్యత్వమునకు ముఖ్యసామగ్రి యయినను దానిని వదలివేసి నడుమ నారదపాత్రను బ్రవేశపెట్టి, యాతనిచే నసురులహృదయములం దమృతము గోలుపోయినందులకు దేవతలపై ద్వేషమును రగులుకొల్పినాఁడు. అమృతమును గోలుపోవుట ద్వేషకారణమే యైనను, దానిని నారదముఖమున దానవులకుఁ జెప్పించి, వారికి నుద్రేకము హెచ్చ నీశ్వరోపాస్తి నుపాయముగ నిరూపించి, దానవసంహారము నీశ్వరునిచేఁ జేయింపనమకట్టి, వీరరసబీజమును నాఁటినాఁడు.

## త్రిపురాసుర సంహారము.

శంకరుఁడు లోకకంటకు లయిన త్రిపురాసురులఁ బరిమార్పుటకై మహోత్తరసంరంభముతో నుద్యమించినపుడు భూమి రథముగను, సూర్యచంద్రులు చక్రములుగను, బ్రహ్మ సారథిగను, నాల్గువేదములు గుఱ్ఱములుగను, ఓంకారము ప్రతోదముగను (కొరడాకఱ్ఱగ) నక్షత్రపంక్తి జండాగను, మేరుపర్వతము ధనుస్సుగను, ఆదిశేషుఁడు నారిగను, వాయువులు బాణమునకు ఱెక్కలుగను, ప్రళయకాలాగ్ని ములికిగను, విష్ణువు బాణముగను జతగూడఁగా, పట్టణములతోపాటు త్రిపురాసురులను సంహరించి, వారల కుపాస్యమైన లింగమును, పంచవిధములుగా విభజించి పంచారామములందును పంచలింగములుగా నెలయించుట యీత్రిపురాసుర సంహారమునందలి ప్రధానమైన యితివృత్తము. త్రిపురాసురసంహారమునకుఁ బరమేశ్వరుఁ డాయత్తపడుటకుఁ గారణము త్రిపురాసురు లుద్రేకించి లోకముల కుపద్రవము గలిగించుట. అట్టి యుద్రేకము వారికిఁ గలుగుటకు మూలము, నారదుఁడు వారిని బరమేశ్వరు నారాధింపుఁడని ప్రోత్సహించుట.

దేవాసురులు సముద్రమును మథింపఁగా వెలువడిన యమృతమును, విష్ణువు దేవతలకే పంచిపెట్టి వెడలిపోయిన వెనుక, నారదుఁడు దానవులకడ కేఁగి వారితో—

శా. రక్షోనాయకులార! నిర్జరవరవ్రాతంబుచేతన్ సుధా
భిక్షాపాత్రము వోయె నంచు మదిలో బెగ్గిల్లఁగా నేఁటికిన్
రక్షార్థంబు భజింపరాదె యభవున్ త్రైలోక్యకుక్షింభరున్
దక్షారామపురాధినాథుని సుధాధామార్ధచూడామణిన్.

అని యుపదేశము చేసినాఁడు. అమృతధామ మగుచంద్రఖండమును శిరోభూషణముగఁ దాల్చిన భీమనాథుని భజించిన మీ కమృతము కోలుపోతి మనువంత తీఱును. అతని కుక్షిలో త్రిలోకములు నిండి యున్నవి. ఆతని యనుగ్రహము మీపైఁ గలిగిన నమృతము లభించుట యెంతపనియని యనినట్లయినది. ఆతఁడు త్రైలోక్యమును గుక్షిలో నంతర్హితము చేయు ననుమాటకూడ నిందు ధ్వనించుచునే యున్నది. ఇచట నారదోక్తివలన నుత్సుకులై దానవులు త్రిపురాసురులతోఁ గూడి, దక్షారామమునకుఁ జేరి, పాశుపతవ్రతాచారముచేఁ బరమేశ్వరు నారాధించి రని తెలిపిన యీ ఘట్టములో షట్కాలములందు శంభుపూజావిధాన మెట్టు లుండునో యెఱుఁగవచ్చును.

సీ. అరుణోదయంబున నాకాశవాహినీ
హేమాంబుజంబుల నిందుధరుని
మిహిరోదయంబున మహిసాక్షిగుగ్గులు
ధూపధూమంబులఁ దురితహరుని
సంగవంబున గంధసారకుంకుమచంద్ర
జంబాలమునఁ బుష్పచాపమథను
మధ్యాహ్నమునఁ బక్వమధురాన్నపాయసా
పూపాజ్యదధిఫలంబులఁ ద్రినేత్రుఁ

బరమసంధ్యాగమంబునఁ బటహశంఖ
ఝల్లరీమడ్డుడమరు ఝర్ఝరులమ్రోఁత
నర్ధరాత్రములందు వీణారవముల
హరుని బూజింతు రతిభక్తి నసురవరులు.

అరుణోదయకాలమునకుఁ బరమేశ్వరున కంబుజములతోఁ బూజలు, సూర్యోదయకాలమున ధూపము, సంగవకాలమున (నాల్గు గడియలు ప్రొద్దెక్కినపుడు) చందనాదిసుగంధద్రవ్యములతో మైపూఁత, మధ్యాహ్నకాలమున మధురాన్నఫలాదినైవేద్యసమర్పణము, సాయంసంధ్యాసమయమున భేరీశంఖాదివాద్యములు మ్రోయించుట, అర్ధరాత్రిసమయమున వీణారవములు కూడునట్లు లర్చించుట పాశుపతవ్రతులకుఁ జేయవలయు ననువిషయము మన కీయసురపూజావిధి తెలుపుచున్నది. పరఁపుశైవులు కొంద ఱీవిధిని నేటికిని జరిగించుచునే యున్నారు. షట్కాలశంభుపూజ శివభక్తుల కవశ్యకర్తమగుట నీ కావ్యమున వ్యాసునిచే—"షట్కాలశంభుపూజావిధానములకుఁ బల్లవప్రసవదర్భలును గలవే?" యని యగస్త్యు నడిగించినాఁడు. షట్కాలశంభుపూజావిధానమున కీపద్యము వివరణము.

అంతటితోఁబోక యసురులు పరమేశ్వరునిప్రసాదమును బడయుటకు పంచప్రణవములతోడను షడంగములతోడను గూడిన ప్రాసాదపంచాక్షరీమంత్రముల నీశ్వరుని బిల్వపత్రములతోఁ బూజించుచు, వేదపురాణములచేఁ బ్రస్తుతించిరఁట. ఆతీరు నిట్లు వివరించినాఁడు శ్రీనాథుఁడు.

ఉ. పంచబ్రహ్మషడంగమంత్రములనుం బ్రాసాదపంచాక్షరిం
బంచాస్యుర్ బహుబిల్వపత్త్రముల నభ్యర్చింతు రవ్యగ్రత
న్మంచుంగొండయనుంగుఁబెండ్లికొడుకు న్వర్ణింతు రేకాగ్రతం
జంచద్వేదపురాణమంత్రముల నిష్ఠాయుక్తి నక్తంచరుల్. ౬. ౧౦౭.

శబ్దమువలన అనుభూతి, అనుభూతివలన నానందము కలుగును; కావుననే ప్రతిదినము క్రియానిర్వహణకాలము గడియయైనను మిగిలిన ఘటికలలో శాబ్దముగనే ఆనందము పొందును ప్రతిమనుజుఁడు.

ఈరీతిగఁ బ్రత్యక్ష మెట్టియనుభూతులను గలిగించునో శబ్ద మట్టి యనుభూతులను గల్గించును. కొన్నిశబ్దములవలనఁ గలుగునను భవము యథార్థ మగును. శబ్దమువలనఁ గలిగిన యనుభూతికంటె వాస్తవానుభూతి భిన్నముగ నుండును. అయినచోఁ గానిం డనియెదరు. శబ్ద ముచ్చరింపఁబడిన వెంటనే యొకజ్ఞానమును కలిగించును. ఒకవస్తువును గోచరింపఁజేయును. అయ్యది యథార్థమా యనునది వేఱువిషయము. అది వికల్పము, బాధాసహకృత మయిన నవుఁగాక అని యందురు యోగులు వైయాకరణులు. "శబ్దజ్ఞానానుపాతీ వస్తుశూన్యో వికల్పః" అని వారియభిప్రాయము.

ప్రత్యక్షములోఁగూడ ప్రత్యక్షానుభవ విషయములగు వస్త్వనుభూతు లన్నియు యథార్థ మగుట కానరాదు. కఱ్ఱముంగను జూచి పురుషుం డనుకొనినప్పుడు త్రాటినిజూచి పా మనుకొనినపుడు, అభ్రకపు రేకును జూచి రజత మనుకొనినపుడు, భ్రాంతాత్ముని వస్త్వనుభవము వేఱు. అభ్రాంతుని అనుభూతి వేఱు. ఒకదానిని జూచి మఱియొకటి యనుకొనుట మన పుట్టుకలోనే యున్నదని వేదాంతులు. ధూమశకటములోఁ బయనించువాఁడు చెట్లు పరువెట్టుచున్న వని యనుకొనుట, మేఘములు నింగిని బర్వులు వెట్టుచుండ చంద్రుఁడు పలాయనము చేయుచుండె ననుకొనుట యెట్టిదో మనము జననమరణములులేని యాత్మకు జననమరణములు కల్పించి, ఆభ్రాంతిని వీడక, అనేకజననమరణముల ననుభవించుచు నాఁటికిని నేఁటికి సాజాత్యము వీడక ఆభ్రాంతిని వీడక, విశుద్ధానుభూతివలన నగు నానందమే శాశ్వత మనుకొని జన్మకుఁ గారణభూత మగు చుంటి మని బ్రహ్మవివర్తవాదులు బ్రహ్మసత్యం జగన్మిథ్యా అని నిర్ణయించిన వేదాంతు లనియెదరు. మొత్తమునకు శబ్ద మయథార్థవిషయమును బోధించినను, ఒకవస్తువును సాక్షాత్కరింపఁజేసి అనుభూతిని గల్పించు ననుట తెల్లము.

శబ్దము కలిగించునటుల ఉపమకూడ నొకయనుభూతి గావించును. ప్రత్యక్షము పీడి మిగిలిన మూఁడిటివలనను గలిగిన యనుభూతి బాధా సహకృతము, యథార్థము నగును; గావుననే ఈప్రమాణముల వలనఁ గలుగు జ్ఞానము యథార్థమా కాదా? అని తేల్చుకొనుటకు మఱియొక ప్రమాణ ముండ వలయు నని "ప్రమాణానాం స్వతః ప్రామాణ్యం వా? పరతః ప్రామాణ్యంవా" అను విమర్శ చేసి, పరతః ప్రామాణ్య" మని నిర్ణయించిరి తార్కికులు. ఏప్రమాణమున కయినను ప్రమాణాంతర సహకార మక్కఱలేదనియు నటులఁ జెప్పిన "అభ్రకమును జూచి వెండి యనుకొనిన ప్రత్యక్షమునఁగూడ బాధ తప్ప దొకటి. అటుల ఒకప్రమాణము నాశ్రయించిన, దాని నిర్ణీతికి మఱియొక ప్రమాణాపేక్ష వలసి యుండును. ఈరీతిగ ననవస్థ ఘటిల్లునుగావున ప్రమాణానాం స్వతఃప్రామాణ్యం" అని ఒప్పిరి శ్రుతివాదులు.

ఇంతకు సదృశవస్తుదర్శనమువలన జనించు ననుభూతి మనస్సును మార్పఁ గలదు. నూతనోల్లాస మొనర్పఁగలదు. సదృశవస్తు దర్శనము మనోవినోదోపాయ మనివాఁడు మల్లినాథుఁడు. ఏ క్రియయైన నుత్తరక్షణములో నశించును. క్రియ యొకేరూపములో నిలువదు.

గుణభూతై రవయవైః సమూహః క్రమజన్మనాం
ఆశ్రితక్రమరూపత్వా త్సా క్రియే త్యభిధీయతే."

కనుక క్రియానందము కూడ సాదృశ్యాశ్రిత మనవలయును. సాదృశ్యము వలన మొదటి క్రియైకదేశము స్మృతమయి ఆనంద మిచ్చును. స్మృతికి సాదృశ్యము కారణము. ఈవిధముగ నుపమారాజ్యము లోకములోను కావ్యములోను నున్నయది. ఉండవలెను. ఈసాదృశ్యమును, అక్షరసాదృశ్యము, శబ్దసాదృశ్యము, వాక్యసాదృశ్యము,అర్థసాదృశ్యము, సాదృశ్యనిషేధము, అను నీవిధముగ విభాగముచేసి పంచివైచిన అలంకారము లన్నియు నిష్పన్నమగును. లోకములోనున్న సాదృశ్యము కావ్యకళకుఁగూడ నత్యంతోపయోగి, అవినాభావసంబంధము. కావున ఉపమాలంకారము కళ కొక ప్రధానాంగ మనినను తప్పులేదు.

ఉపమ కూడ నొకయంగమే కదా యని, అలంకారము లున్నవి కదా యని రసస్ఫూర్తి లేనివాక్యములను గావ్యములకుఁ జేర్చినచోఁ దలిశెట్టి రామారావుగారి ప్రబంధ స్త్రీ చిత్రమువలె నుండును. మనిషికిఁ గళ లావణ్యా మున్నచో నలంకారములు శోభను దెచ్చును. ఏవస్తువైనను శోభను దీసికొని రాఁగలదు. "కిమివ హి మధురాణాం మండనం నాకృతీనాం." లేనిచో నొక చీలకు భూషణము లుంచినటు లగును. అలంకార్యము లేనినాఁ డలంకారముల కలంకారత్వము లేదు. అలంకారములు లేదా యన్నిటికి శోభ తెచ్చిన నీక్రిందివాక్యము లన్నియు నలంకారములతో నిండి యుండవలసినదియే.

గోసదృశో గవయః:— ఉపమాలంకారము
స్థాణుర్వా పురుషోవా:— సందేహము
గౌర్వాహీకః:— రూపకము
ఇదం రజతం:— భ్రాంతి
నాయం సర్పః:—అపహ్నుతి
పీనో దేవదత్తో దివా నభుంక్తే:- పర్యాయము
పర్వతో వహ్నిమాన్—అనుమానము
స దేవదత్తః:—స్మరణము
తస్యస్థమిషాం తాంతంతామః:— యథాసంఖ్యము
పుత్రేణ సహాగతః పితా:— సహోక్తి
తేన వినాగతః పితా:—వినోక్తి
శ్వేతో ధావతి:— శ్లేషాలంకారము

కావలసివచ్చును. శరీర మందమయినది లభించిన ప్రదేయాలంకారము లలంకారధర్మమును నిర్వర్తించును. తమంతట తామే అలంకార్యమును జేరును.

కళ-భావన-ఆలోచన.

సాహితీకళ "ఆలోచనామృత మని పెద్దలనానుడి. ఆలోచించిన కొలఁది మంచిమంచివిషయములు, హృద్యము లయినభావములు నభివ్యక్తమగును. ఏశ్లోకమునకైనను, బద్యమునకైనను ఏకార్థప్రతిపాదక

మగు నభిధాశక్తివలన పరిమితమగు నర్థము వచ్చును గదా! అయ్యది యందఱకు స్ఫుటముగా గోచరించుచుండును గదా! ఇంక ఆలోచన యెందులకు అని ప్రశ్న వేయవచ్చును. ఒక్క పద్యమును గూర్చి అనుకొందము. పెద్దన్నగారి రసాభాసపద్యములో నగ్ర్యమైనది.

ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ! యొంటి చరించె దోటరీ
కివ్వనభూమి, భూసురుఁడ నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ దప్పితిం
గ్రొవ్వున నిన్నగాగ్రమునకుం జనుదెంచి పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ దెల్పఁగదవే! తెరు వెద్ది! శుభంబు నీకగున్.

ఈపద్యమునకు "వరూథినితోఁ బ్రవరుఁడు తెఱవా! నీవెవరవు భయములేక యీవనములో నొక్కతెవు సంచరించుచుంటివి? నేను బ్రాహ్మణుఁడను. ప్రవరుఁ డనువాఁడను. దారి తప్పిపోతిని. క్రొవ్వున నీపర్వతశిఖరాగ్రమునకు వచ్చితిని. పురము చేరుకొన నేమియు నుపాయము నాకుఁ గానరాదు. నాకు మార్గముఁ దెలుపుము. నీకు మేలగుఁ గాక" అనునర్థ మందఱకు గోచరించుట తెల్లమే. కాని యింతటితో మహాకవులు తత్రాపి ప్రబంధపితామహుల వాక్యములకు, "తత్రాపి చ చతుర్థోఽంకః తత్ర శ్లోకచతుష్టయం" అన్నట్లు, ప్రవరుని కథ యంతయు అతని వ్యక్తిత్వ మంతయు నిమిడియున్న. రసాభాసకు మూలమైన యీ పద్యమున కీయర్థమనందే విశ్రాంతియా? అని విమర్శించువారు పలువిధముల దీనియందలి సారము గ్రహింపఁ బ్రయత్నించెదరు.

"అస్తమేతి గభస్తిమాన్" అని ఒక వాక్యమును బ్రయోగించిన, దానింబట్టి - వణిజులు విక్రయవస్తువులను పొత్తుపఱుప వచ్చునని, కార్మికులు పనులను మానవచ్చుననియు, బ్రాహ్మణులు సాంధ్యకృత్యములఁ బ్రారంభింపవచ్చుననియు, పెద్దలు పిల్లలను దూరముగఁ బంపఁ గూడదనియు, గోవులు గోదోహనము చేయవచ్చుననియు, చెలియలు ప్రియుఁడు వచ్చుననియు, బాధితుల కిఁక బాధ లుండ నేరవనియు, పథికాంగనలు ప్రియుఁ డింకను రాలేదనియు, సాయంతన మగు చున్నది గుప్తముగా శత్రు వాక్రమింపవచ్చు నని శత్రువులును

అనుకొనియెదరు. ఒక్కవాక్య మిన్నివిధముల భావముల నావిష్కరింపఁ జేయును. ఈక్రిందిరీతిని పైపద్యమునకు—

వరూధుని ప్రవరునిఁ జూచినది. అతఁడు సౌందర్యవిజితత్రిలోకుఁడు. మనుజులలో నింతటి సౌందర్యమూర్తి లేకపోవుట సరిక దా దేవలోకములోఁగూడ లేఁడు. వరూధిని అనినమాటయే యిది. ఇతని యాకారేంగితచేష్టాదులు చూచిన బ్రాహ్మణుఁడే కాని ఇంత అందము నర, గరుడ, ఉరగ, ఖేచర, సిద్ధ, సాధ్య, చారణ, విద్యాధర, గంధర్వ కుమారులకు లేనేలేదు. వారిమాట అటులనుంచి దేవతలకు లేదు; వారిలోను చంద్రునకు, జయంతునకు, వసంతునకును లేదు. మన్మథునకును పాలికి, కనుక నే—

బ్రాహ్మణుఁడు దారి తెలియక, ఒకవ్యక్తి కనఁబడిన దారియడుగుటకయి కుప్పించుచుఁ గుప్పించుచు గానము వినిపింప మునియాశ్రమ మనుతహతహతో, ఇంటికి మరలుటకు దారి తెలియు నను తత్తరపాటుతోఁ గోనలోనికి దిగ, నచ్చట ఆఁడుదానివాసన కొట్టినది. అయినను బ్రతికితిని. ఆఁడుదయినను జన మనుచు కనఁబడిన దారి తెలిసికొని పోవచ్చునని ద్విజాతిభావమున; వరూధుని చల్లగా హాయిగ వీణ వాయించుకొనుచు, ఆలాపగతిలోఁ జొక్కి రతిపారవశ్యములో నలిగన్ను మోడ్చికొని యుండ, నాకస్మికముగఁ గంటఁ బడియెను. చాల అందగాఁడు. అతక్కాశముఁగ గోచరించెనేమో (ఆమె యేమయినదియో సాధ్యమగునంతలో నామెయాకారమును పెద్దన పదరేఖలతో నభివ్యక్తి చేసెను.) ఆమె కతని యెడ మదిలో మెప్పులు హెచ్చినవి. మదిలోఁ గోర్కెలు పెల్లుబికినవి. మై సంకురించినవి పులకలు. ఉత్కటమగు నావేగము, విస్మయము, బయలుదేఱినవి. ఝళంఝళత్కటక సూచిత వేగపదారవిందయై లేచినది. ఒడలంతయు సవరించుకొన్నది. ఎంతగంధర్వాంగనయైనను, వేశ్యాంగనయైనను, సంకోచము, మోదము, లోలత్వము, కోర్కెలు మెచ్చు, విస్మయము, ఆచ్చపాటు, ఇంకను కొన్ని భావములు చెలరేఁగి భావశబలత నొందినవి. రతిపారవశ్యములోనలి

మోడ్పుఁగన్నులు విస్ఫారితము లయినవి. చంచలము లయినవి. మోహ విభ్రాంతి హెచ్చినది. చెమ్మట అంకురించినది. ఒక్క నిమేషములో గంధర్వాంగనను మోహవారిధిలో ముంచెత్తివైచెను. సాహసించినది కాని లజ్జ అడ్డుపడినది. గలగలమని యందెలరవముతో సడ్డమువచ్చి నిలిచిపోయినది వరూధిని.

కాని యితఁడు యోగియిచ్చిన పాదరసపుఁబూఁత పాదముల నుండి కరఁగిపోవుటచేఁ బాసిలుసేరునుపాయ మేమున్నది? వెళ్లకపోయి నచోఁ గొంపలు మునిఁగి పోవునన్నంత సంభ్రాంతిలో నితఁడుండెను. దారిదొరకదనియు, ఇంటికిఁ జేరలేమనియు భయముతో నిండియున్నాఁ డితఁడు. తా నెట్లు భయభ్రాంతుఁడై యుండెనో యటులనే వరూధిని కూడ నన్న దనుకొనినాఁడు. అనుకొనుటకుఁ దగిన ట్లామె కంగారుగ లేచుట, ఒడలంతయు సవరించుకొనుట, స్విన్నగాత్రి యగుట, చంచలముగాఁ జూచుట, సహాయకారు లయినవి. ప్రవరుఁ డామెను అటుల ననుకొనుటయు స్వభావమే. సహజమే. "దోషితోహి స్వదోషానే వాన్యత్రి ఆరోపయంతి" తా మొకదోషము కలవారైనవారు, ఆదోష మెదిరి వారిలో లేకపోయినను నున్నట్లు భావింతురు. కనుకనే ప్రవరుఁడు వరూధునిని అన్యభావాక్రాంతురాలైనను భీతగా నూహించును.

నీవు నావలెనే కంగారు పడుచుంటివి. భయపడిన లేడివలెఁ జూచుచుంటివి. "నాకేమియు భయము లేదని నీ వనినను నీకన్నులే చెప్పుచున్నవి నీవు భీతవని. భయపడువారి నేత్రము లింతచంచలముగా నుండును. భయ మెందులకు వేయుదు. భయములేకుండఁగనే ఒక్కతెవు తిరుగుచుంటివా ? కాదు. భయము తప్పక వేయును. నేను జాల సమయమునుండి ఈ వనమంతయుఁ బరికించుచుంటిని. అమ్మయ్యో ! ఒక్క జనుఁడు కనఁబడఁడే. ఉద్దండగండకవేదండ వరాహవాహరిపుఖడ్గ వ్యాఘ్రసంఘము తప్ప. అందునను ఆఁడుదానివి. సహాయు లెవరును లేరు ఒక్కతెవు. ఈ యడవిలో నీమూల నొక్కతెవు ఇటుల తిరుగుచుంటివి? ఎవతె వీవు? నా యంతటివాఁడను, మగవాఁడను, బ్రాహ్మణుఁడను, సర్వము తెలిసినవాఁడను. నన్నుఁ జూచితివిగా ? ప్రవరుఁ డందురు నన్ను

అట్టి వాఁడను నేను ద్రోవఁదప్పి, ఈ పర్వత శిఖరాగ్రమునకు వచ్చి దారి తెలియక కొట్టుకొనుచుంటిని. నా రాక నూహించు మిచ్చటికి, ఈపర్వత శిఖరాగ్రమునకు. ఇట్టి పనులు క్రొవ్వెక్కినవా రొనర్తురు. క్రొవ్వు వలననే వచ్చితి ననుకొనుము. ఇంతకును మాయూరి దారి మఱచిపోయితిని. నాకు మా పురము చేరు నుపాయ మేమియుఁ దోఁచుటలేదు. సరే! నీవును నాకువలెనే దారి తప్పియే యుందువు. లేకపోయిన నిచ్చటికి సజీవుఁడు, జీవితాశకలవాఁడు చేరఁడు. కనుకనే యీ యేకాంతములోనుండి యుంటివి. నీ వెద్దియేని మా యూరి దారి యెఱిఁగియుండిన చెప్పుము. ఊరక చెప్ప నవసరము లేదు. నిన్ను ముందుగా నాశీర్వదించెదను. నీకు మేలు కలుగుఁగాక. నీకుఁ దెలిసియున్న చెప్పుము. నేను దీసికొని వెళ్లెదను. నీ వెవ్వతెవు?" అని సంభ్రమపరముగాఁ జెప్పుచుండెను. మనుజుని భావించుటచే మానుషత్వము వచ్చినది. ఎదుటివాఁ డెట్టివాఁడయ్యెనో యామె కూడ నట్టిదియే యయి యుండును. కావున నామెయు భీత యని యనుకొనినాఁ డేమొ?

లేదా! ప్రవరుఁడు బ్రాహ్మణుఁడు. తత్రాపి శ్రోత్రియుఁడు. తన కార్యమును సాధించుకొనుటకు "ప్రియవాక్యప్రదానేన సర్వే తుష్యంతి దేహినః" అని పొగడ్తవలనఁ దనకార్యము సాధ్య మగునని యెంచి వరూధునినిఁ బలుకరించును. ఎవతెవు నీవు? నీ కన్నులు చాలఁ జంచలములుగాను, విశాలములుగాను, అందముగను నున్నయవి. చాలఁ జురుకైన దానవు. నాగరకురాలవు. చాలఁ దెలివికలదానవువలెఁ గన్పట్టుచుంటివి? ఇంతటిదానవు నీవు కాకపోయిన ఈ యరణ్యములో నొక్కర్తెవు నిర్భీకస్వై యేకాంతముగా సంచరింపఁగలవా? అఁదుదానిమాట అటులుంచి మగవాఁ డంతటివాఁడు గూడ నీక్రూరమృగాకీర్ణమయిన యడవిలోఁ దిరుగలేఁడు నా కేమయినదో చెప్పుము. కంగారు అడలు నెత్తికదా! అఁదుదానివైనను నీ దగ్గఱకు వచ్చితిని. రాకూడకపోయినను ఏకాంతములో నున్న దానియొద్దకు వచ్చితిని. ఎందులకు మగవాఁడనే.

అందులోను కులమున కగ్రవర్ణసంజాతుఁడనే! బ్రాహ్మణుఁడను. పేరులోఁ గూడ శ్రేష్ఠార్థవాచకమే. ప్రవరుఁడని. దేవతను గూడను. నేతిబీఱ కాయ యన్నట్లు, మట్టి విగ్రహ మన్నట్లు "భూసురుఁడను" బ్రాహ్మణత్వ మమాయకత్వమునకుఁ బుట్టినిల్లు. భయమునకుఁ దావలము. స్వేచ్ఛకు భంజకము. నియమనిష్ఠలకు నిలయము. కనుకనే జాడ్యానికి మూలకందము. లేనిచో,

అకలంకౌషధిసత్త్వముం దెలియ మాయాద్వారకావంతికా
శికురుక్షేత్రగయాప్రయాగములు నే సేవింప కుద్దండగం
డక వేదండవరాహవాహరిపుఖడ్గవ్యాఘ్రము మిమ్మ్రంచుఁగొం
డకు రాఁ జెల్లునె! బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్.

నా పేరు చెప్పితినిగదా. గృహస్థులలోఁ గరడుకట్టిన నైషికుఁడను. బ్రాహ్మణులలోఁ బ్రవరుఁడను. శ్రోత్రియులలోఁ బ్రవరుఁడను. ఈ భూసురత్వము లేనిచోఁ గూపస్థమాండూక్యత వదలి స్వేచ్ఛగా దేశములు తిరిగియుందును. లౌకికత యుండి యుండెడిది. దానితప్పటయేయుండకపోవును. ఎవఁడేమిచెప్పిన నది నమ్మి, కనుబ్రామి పాదరసము పూసిన నదియు నమ్మి మోసపడి ఇక్కడకు వచ్చితిని. సైపూఁత లిటులనే యుండును. వచ్చుటలో నీపర్వతశిఖరముమీఁదకు వచ్చితిని. హిమాలయపర్వతశిఖరాగ్రమునకు వచ్చితి మని, పర్వతశిఖరాగ్ర మెక్కుచుంటి మన సంతోషములో దారి గుర్తుపట్టలేదు. ఎక్కడి యరుణాస్పదపుర మెక్కడి తుహినాద్రి ? ఇంతకుఁ జెప్పవలసినది దారి తప్పితిని. క్రొవ్వెక్కి వచ్చినవాని కిటులనే జరుగును. మా యూరు చేరుట కెద్దియేని యుపాయ మున్నదియా ? నా కేమియుఁ దెలియదు. నీకన్నిత్రోవలు తెలిసియే యుండును. నీకన్నులు, నీ సంభ్రమము, ఇవన్నియుఁ జూచిన నీకుఁ దెలియని విషయములుండి యుండవు. అనేకమార్గములు తెలిసికొనియే యుందువు. లేనిచో నింత యేకాంతములో నుండఁగలవా! నాకు మా యూరిదారి కొంచెమూహించితివేని నీకు శుభమగును. నన్ను బ్రతికించినదాన వగుదువు. అని కైవారము చేసినాఁ డనవచ్చును.

# ఉషాపరిణయము

## రంగాజమ్మ

### ప్రథమాశ్వాసము

గ్రంథావతారిక:-

ఉ. శ్రీవిజయాయురున్నతుల
చే నలరించెదఁ గొల్చు వారలన్
ధీవిభవంబు మీఱ నని
తెల్పుచు హేమవనిం జెలంగు రా
జీవదళాయతాక్షుఁ డగు
చెంగమలేశుఁడు మన్ననారు గో
త్రావిభుధేంద్రు నీ విజయ
రాఘవచంద్రునిఁ బ్రోచుఁగావుతన్ 1

శా. సారోదారకటాక్షవీక్షణ సుధా
సారంబు తోరంబుగా
భూరిక్షేమ మొసంగఁగా నెపుడు సం
భోజాత గర్భాదులన్
శ్రీ రంజిల్లఁగ జేయుచున్ జెలఁగు మా
చెంగమ్మ యిద్ధాత్రిపై
నారెన్ మన్నరుదాస భూవిభుని వా
త్సల్యంబునం బ్రోవుతన్. 2

సీ. సంతసం బమర ననంతునిఁ గొనియాడి
గరుడునిఁ బూజించి ఘనత మీఱ
సేనాధినాయకు సేవించి భక్తినిఁ
జన్నిద్దరాళ్వార్లఁ బ్రస్తుతించి

వేదాంత దేశికు వేడ్కతో భజియించి
వ్యాసవాల్మీకుల వరుసఁ బొగడి
చెలఁగి శఠకర్పితు శ్రీనివాసాభిఖ్య
తాతయాచార్యులఁ దలఁచి మదిని

గీ. వేదసంఘంబు మూర్తిభవించి నట్టు
లఖిల యాగంబు లొనరించి యవని యందు
చెలువు మీఱు శఠకర్పితు శ్రీనివాస
తాతగురువర్యునకును వందన మొనర్తు. 3

క. సకలసభామధ్యంబులఁ
బ్రకటంబుగ విబుధు లెల్ల భళి యనఁ దగు నా
సుకవుల సన్నుతి సేయుచుఁ
గుకవుల నిరసింతు మిగులఁ గుశలత మీఱన్. 4

వ. అని యిష్టదేవతానమస్కారంబును సుకవిపురస్కారంబునుం గుకవితిరస్కారంబునుం గావించి యే నొక్క మహాప్రబంధంబు రచియించెద నని తలంచు సమయంబున. 5

సీ. శ్రీ రాజగోపాలసేవామహిమ చేత
నేరాజు ధర యెల్ల నేలుచుండుఁ
బరమతంబుల నెల్ల నిరసించి యే మేటి
వైష్ణవమతమె శాశ్వతము చేసె
బాల్యంబు నందునె పగతుర నిర్జించి
యే నేత కీర్తుల నెసఁగఁ గాంచెఁ
బదియాఱు దానముల్ బ్రీతిఁ బొసఁగింప నే దాత
యవనిసురుల కిచ్చె నాదరించి

గీ. యాతఁ డచ్యుతభూపవంశాబ్ధిచంద్రుఁ
డధికగాంభీర్య ధైర్యశౌర్యాతి సాంద్రుఁ
డవనిఁ దంజాపురాధీశుఁ డనఁగఁ బరగు
విజయరాఘవ మేదినీవిభువరుండు. 6

వ. మఱియును సత్యభామాహరిశ్చంద్రుండును సత్కృపారామ చంద్రుండును సంగరరంగకిరీటియును సకల విద్యాచాతుర్య పేటియును దానరాధేయుండును ధరణీజనవినుతభాగధేయుండును రామానుజమతసిద్ధాంతస్థాపనాచార్యుండును రాజగోపాలనిత్యకైంకర్యధురంధర్యుండును జతుర్వేది శతక్రతు శ్రీనివాసాచార్య చరణసరసిజసేవానిష్ఠాగరిష్ఠుండును జతురుదధివేష్టిత సర్వంసహాపాలకశ్రేష్ఠుండును సామంత రాజమణికిరీటరంజితపాదాంభోజుండును సరససాహిత్య కళాభోజుండును రఘునాథనృపాలనందనుండును రచితకళావత్యంబికానయనానందుండును నగు న వ్విజయరాఘవ దేవేంద్రుండు రామణీయకవిరచితరాజరాజ సభావిజయం బగు రాజగోపాలవిజయంబు నందు నతులితవిలాసవతులైన కులసతులును విబుధసన్నుతచుతి యగు విజయ వెంకటపతియును మహితప్రభావుం డగు మన్నారు దేవుం డును దతయశోధనుం డగుతాతఘనుండును రంగద్గుణ విలాసుం డగు చెంగమలదాసుండును మొదలగు నిఖిలజన మిత్రులైన పుత్రులును నిరుపమపవిత్రచరిత్రలైన పౌత్రులును నిరవద్యరూపరేఖాకనకపుత్రికలైన పుత్రిక లును నింపువెలయఁ దామరతంపరై నిండి యుండఁ జెంగట శృంగారవతులు రంగురక్తులు మీఱ సంగీతమేళంబుఁగావింప నగ్రభాగంబున సాచార్యాగ్రేసరుం డగు శతక్రతు శ్రీనివా

సాచార్యుండు కృతమతిభంగం బగు హరివంశకథా ప్రసం
గంబుఁ గావింప నింపు మీఱ నేను శృంగార రసంబునఁ
జెన్ను మీఱు మన్నారుదాసవిలాసంబు వినిపించుచున్న
సమయంబున. 7

సీ. వేంకటేంద్రుని పుత్రి వినుతసద్గుణధాత్రి
ఘనయశోరాజి రంగాజి వినుము
మాధుర్యమున మించు మన్నారుదాసవి
లాసప్రబంధంబు లలితఫణితిఁ
గావించి మిగుల శృంగారంబు గన్పట్టఁ
బదములు మృదురసాస్పదము లగుచు
రాణింప రచియించి రామాయణంబును
భాగవతంబును భారతంబు

గీ. సంగ్రహంబుగ రచియించి సరసరీతి
మమ్ము మెప్పించితివి చాల నెమ్మి దనరఁ
బరగ హరివంశమున నుషాపరిణయకథఁ
దెనుఁగు గావింపు మిఁక నీవు తేటగాఁగ. 8

వ. అని సబహుమానంబుగాఁ దాంబూల జాంబూనదాంబ
రమాల్యాభరణంబు లొసంగిన నేనునుం బరమానందంబుఁ
జెందుచుఁ బతియునుం గతియునుం గులదైవంబును నైన
నీదు పాదారవిందంబులు డెందంబున సేవింపుచున్న తనకు
మీ రానతిచ్చు కథాసంవిధానంబు సర్వంబును నవగతం
బగుఁ గావున నట్లన రచియించెదఁ బంజరశుకంబు మంజు
వాగ్భణితి రంజిల్లం బలికినం దత్పోషకుండు సంతోషించు
తెఱంగున మదీయవచనకుసుమార్చనం బంగీకరించి నన్ను
గటాక్షింపుం డని విన్నవించిన లాలించి యాచార్యచర

ణారవిరదంబులకు వందనంబు గావించి య మ్మహామహుని యనుజ్ఞఁ గైకొ మ్మనుటయు నట్లన సేవించిన దీవించి గురు రాజపట్టభద్రుం డిట్లనియె. 9

క. నీ పతి మన్నరుదాసుఁడు
గోపాలుఁడు గనుక నితఁడు కోర్కెలు హెచ్చం
జేపట్టి మనుప నెలకొను
నా పలుకుల నెలఁత నీ ముఖాంబుజసీమన్. 10

వ. అని మఱియును. 11

సీ. తన రెడు మన్నరుదాసవిలాసంబు
నమర నీ వొనరించు నప్పు డేను
విజయరాఘవమహీవిభుని వంశావళి
వినఁపించితిమి గదా విశదముగను
కీర్తుల మీఱిన కృష్ణభూపాలుఁడు
నయశాలి యగు తిమ్మనాయకుండు
దివ్యతేజము గల తిమ్మప్పనాయఁడు
శ్రీనిధి యైనట్టి చెవ్వనృపతి
గీ. చెలఁగి శ్రీరంగమున రామసేతువునను
బాగడ బహువిధకైంకర్యముల నొనర్చి
యచ్చుతాళ్వారు లతఁ డన నవని వెలయు
నచ్యుతవిభుండు నలరిరి యతిశయమున. 12

క. అల యచ్యుతభూవిభునకు
నలఘుయశస్స్ఫూర్తి మూర్తిమాంబకు సుతుఁడై
వెలసెన్ రఘునాథమహీ
తలపతి రఘునాథుఁ డితఁడె తప్ప దనంగన్. 13

సీ. తనర నా రఘునాథ ధరణీశ్వరుఁడు చెంజి
లక్ష్మమ్మ యల్ల కళావతమ్మ
పట్టంపురాణులై ప్రబలి సేవ లొనర్పఁ
గుల మెల్ల వెలయించు కొడుకు వలసి
దానధర్మంబులు తపములు సలుపుచుఁ
గస్తూరి కృష్ణుని ఘనత వేఁడ
నల చెంజి లక్ష్మమ్మ కలలోనఁ గస్తూరి
కృష్ణుఁ డిట్లనెఁ బూర్వవృత్త మొకటి
గీ. నీవు తొల్తను దేవకీదేవి వరయ
సాటి లేని కళావతీసతి యశోద
యల్ల వసుదేవనందుల యాత్మ లిచట
నెగడె నచ్యుతరఘునాథనృపతి యనఁగ. 14

సీ. అల వసుదేవున కాత్మసంభవుఁడనై
మందలోఁ బెరుగంగ నందు నింటఁ
దపములు చేసి యేఁ దనయునిఁ గాంచితి
బాలలీల యశోద భాగ్య మయ్యె
నని తలఁపుచు నుంటి నటు గాన నిప్పు డే
నొగిఁ గళావత్యంబ యుదర మందు
నుదయింతు సంతోష మొదవంగ నీవును
ఘనతఁ బుత్రి స్వీకృతిని యొనర్చి
గీ. విజయరాఘవుఁ డను పేర వెలయఁజేసి
నన్నుఁ బోషించి యెపుడు నానంద మొందు
మనుచుఁ బల్కంగ మేల్కని హర్ష మంది
వెలయ లక్ష్మమ్మ విభునకు విన్నవించె. 15

వ. అట్లుదయించిన మహానుభావుండు గావున. 16

ఉ. నిస్తులసద్గుణావళుల
నిర్మలవాసన నిండ దిక్కులన్
స్వస్తి యొనర్చుచున్ సుజన
సంతతి కెల్లను మాటిమాటికిన్
గస్తురి కృష్ణుఁ డీతఁ డన
గౌరవ మందుచు ధాత్రి లోపలన్
బ్రస్తుతి కెక్క నీ విజయ
రాఘవచంద్రుని కిమ్ము నీ కృతిన్. 17

వ. అని యానతిచ్చి యాచార్యశేఖరుండు ప్రబంధారంభంబున
కనుజ్ఞ నిచ్చెం గావున. 18

## —: షష్ఠ్యంతములు

క. అమితకళాభోజునకును
గమలాప్తసమానబాహు ఘన తేజునకున్
సమరాగ్ర బిడౌజునకును
రమణీజనతామనోహరమనోజునకున్. 19

క. రంగమలావరకరుణా
పాంగవిలోకన సమాగతైశ్వర్యునకున్
సంగరరంగోద్ధత రిపు
భంగప్రథమానసీయ బలధుర్యునకున్. 20

క. దారుణ శాత్రవ మథనో
దారునకున్ శ్రీనివాస తాతగురుపదా
ధారునకు విశ్రుతయశో
ధారునకున్ సరసనత్కళాధారునకున్.

క. కనకతులాపూరుషముఖ
వినుతమహాదానకలితవిద్వత్తతికిఁ
ఘనశబ్దార్థనిగుంభన
జనితబుధానందసకలసన్నుత కృతికిఁ. 22

క. కనకక్షితిధరధృతికిని
జనకపదాంభోజభజనసంభృతమతికిఁ
ఘనవితరణరతికి బుధా
వనకృతికిఁ విజయరాఘవక్ష్మాపతికిన్. 23

వ. అంకితంబుగా నే నొనర్పం బూనిన యుషాపరిణయం బను మహాప్రబంధరాజంబునకుం గథాసంవిధానం బెట్టి దనిన. 24

# ఏకాదశ స్కంధము.

— హరిభట్టారకుఁడు —

క. మును ప్రహ్లాదకుమారుం
డును, శుక సనకాదిచారణులు యాదవులున్
అనవరత భక్తియోగం
బునఁ బొందరె మత్పదంబు భూసురవర్యా. 267

క. వినుతింప భక్తియోగం
బునకును సరిరావు, దానమును, దీర్ఘంబున్
ఘనమైన తపము యాగం
బును వ్రతనియమాదులైనఁ బుణ్యచరిత్రా. 268

సీ. గంధర్వయక్షనాగములు దైతేయులు
సిద్ధు లప్సరసలు సిద్ధపతులు
మృగములు గుహ్యకుల్ ఖగ యాదవాదులు
బాణుండు బలియుఁ గుబ్జయును, యజ్ఞ
పత్నులు, గోపికల్ పరికింప సుగ్రీవ
హనుమదాదులు, విభీషణుఁడు గృధ్రి
మయ మునీంద్రాదు లధ్యయనంబు వర్జించి
సవడి నిత్యోపవాసములు మాని

గీ. నిత్యకర్మాదివిధుల నసత్య మనుచు
సంతతాధ్వరమార్గంబు చక్కఁబోక
ముదముతోడుత సత్సంగమున మదీయ
లోకమందున వసియింతు రేకమతిని 269

ఉ. శీరకరుండు నేను నతిచిత్రరథంబుల నెక్కి వేడ్క న
క్రూరునితోడుతన్ మధురకున్ జనువేళ సమస్తగోపికల్
మారునిబారిఁ జిక్కువడి మమ్ములఁ బాసిన జాముఁ బుత్త్రరం
భోరుహజాతకల్పముగ భోజనభూషణవాంఛ జాఱ్చినన్. 270

క. ఆ రమణులు నిజపతులను
నారూపముగాఁ దలంచి నయమార్గములన్
వారలతోఁ గ్రీడించెద
రారయ మద్భ సహితలై విప్రవరా. 271

క. ఈ రీతిని గోపిక లవి
కారంబున భక్తియోగ కలితోద్యమలై
నేరుపున నన్నుఁ బొందిరి
యారయ నీక్షింప భక్తి కన్యము గలదే. 272

ఆ. సుతధనాదులందు సతులందు గృహమందు
దేహమందు మిగుల నీహ మాని
భక్తి కలిగి చిత్తభవనంబులోపల
శరణు వొందు నన్ను సంయమీంద్ర. 273

వ. ఈ విధమున నానతిచ్చిన వాసుదేవునకు మునివరుం డిట్లనియె. 274

క. శ్రీవల్లభ కమలాసన
బావాంబుజమధ్యనిలయ పావనచిత్తం
బే విధమున భ్రమియించును
దేవాధిప నాకు నానతీయఁగవలయున్. 275

వ. అని పలికిన ధరణీసురునకు శౌరి యిట్లనియె. మునీంద్రా, దారుమధ్య
మానం బగు ననలంబు సూక్ష్మరూపంబున జనియించి సమిత్సమేధితం
బగు క్రమంబున సూక్ష్మతరంబున మద్రూపంబు గుణవర్ధితంబై భూతం

బుల గ్రసియించు. జీవుండు సకలదేహాంతరగతుండై యచ్ఛేద్యుండై యదాహ్యుండై యశోష్యుండై వర్తించు. ఈ జీవుండు సంసారచక్ర పరిభ్రమితుండై జన్మావ్యయంబులఁ బొందుచుండు. అట్టి పురాతనం బైన సంసారమహీరుహంబు కర్మాత్మకంబై శతమూలసమేతంబై నాళత్రయంబు కలిగి పంచస్కంధవిశాలంబై పంచరస ప్రసూతి జనకంబై దశైకశాఖావిస్తృతంబై సుపర్ణద్వయసేవితంబై ఫలద్వయవిరాజితం బగు. అం దొకఫలంబును గ్రామచరులును మఱియు నొక్కఫలంబు నరణ్యవాసులును భుజియింతు రివ్విధంబున బహువిధంబై మాయారూపంబగు నీ సంసారమహీరుహంబును సద్గురుసేవామూలంబున సంభవించు విద్య యను కుఠారంబున మొదలు ముట్టం దునిమి యప్రమత్తుండవై యాత్మ నాత్మతోఁ గూర్చి కర్మంబుఁ బరిత్యజింపవలయు నని యశోదానందనుం డానతిచ్చిన మఱియు ని ట్లనియె. 276

సీ. సత్త్వరజస్తామసములు నాఁ బరగును
సద్గుణత్రయమందు సత్త్వగుణము
సుజ్ఞానజనకమై శుభదాయకం బగు
నది గాక సాత్త్వికం బైన యట్టి
సకలధర్మమ్ములఁ జరియింపవలయును
బహువిధంబుల మదర్పణము గాఁగ
నా రజోమూలమై నట్టి ధర్మంబులు
చర్చింపఁగాఁ బునర్జననహేతు

గీ. వందుఁ దామస ధర్మంబు లఖిలనరక
కారణంబులుగాన, నీ క్రమముఁ దెలిసి
నరుఁడు సాత్త్వికమూల మై నట్టి ధర్మ
మాచరింపంగవలయు విఖ్యాతితోడ. 227

వ. అని పలికిన సత్యభామావల్లభుఁ డి ట్లనియె. 278

క. సనకాదుల కే నూహం
బునఁ జెప్పితి నఖిల యోగమును దద్రూపం
బనఘ రమాధిప నాకును
వినుప వలయు మనములోన వేడ్కఁ దలిర్పన్. 278

చ. అని ముని పల్కి నంత విబుధాహితఖండనుఁ డాన తిచ్చె ని
ట్లనఘ మునీంద్రవర్య సనకాదులు పూర్వవిధాతమానసం
బున జనియించి తత్త్వము సమున్నతితో నెఱుఁగంగఁ గోరి, వా
రనుమతి బ్రహ్మఁ జే రడిగి రందఱు నొక్కెడఁ బ్రశ్నబీజముల్. 279

ఆ. కోరి చిత్తమందు గుణములు వర్తించుఁ
దద్గుణంబులందుఁ దనరుఁ జిత్త
మా యురంబులోన నన్యోన్య సంత్యాగ
మెట్లు సేయవచ్చు హేమగర్భ. 280

సీ. సనకాదు లీ విధంబునఁ బ్రశ్నఁ జేసిన
బ్రహ్మజ్ఞుఁ డైన యా పద్మభవుఁడు
పరువడిఁ దత్కృత ప్రశ్నబీజము గాన
లేకుంట యెఱిఁగి నే లోకభర్త
కీ ప్రశ్నబీజంబు నెఱుఁగ జెప్పఁగఁ బూని
హంసరూపముఁ దాల్చి యచట కరుగ
నా మునీంద్రులు నాకు నర్ఘ్య పాద్యము లిచ్చి
పాదాభివందనఁ బరగఁ జేసి

గీ. బ్రహ్మ మొదలైన సనకాది బ్రహ్మమునులు
తత్త్వ జిజ్ఞాసు లై నన్ను ♦ దగ్గ ఁడిగి
నంత వారల కేఁ జెప్పినట్టి యోగ
మంతయును నీకు నెఱిఁగింతు నాదినుండి. 281

♦ దగ్గఱి+అడిగినంత. క్త్వార్థక సంధి

వ. అది యెట్లనిన.

సీ. నానా మన శ్రోత్ర నయన యుగ్మముచేత
నెఱి గృహ్యమాన మై నిలుచు నెయ్య
దా పదార్థం బనిత్యంబుగా నెఱుఁగుఁడు
బ్రహ్మంబు జగ మని రమణఁ దెలియుఁ
డా బ్రహ్మ మఖిల భూతాంత ర్నివాసి యై
వర్తించు సాక్షి యై వానియందు
దేహి కర్మార్జిత దేహంబు ధరియించి
శాంతుఁ డై సంసార చింత మాని

గీ. మమత వర్జించి తుర్యాశ్రమస్థుఁ డగుచు
నిర్మల జ్ఞాన నియతుఁ డై నెమ్మితోడ
యోగ మార్గాధిరూఢుఁడై యుండె నేని
మ త్పదంబున ♦ వసియించు మాన్యుఁ డగును. 284

వ. మరియు దేహి స్వప్నగతుం డై పదార్థ దర్శనంబు సేసినట్లు జాగ్ర దవస్థం దోఁచిన యవి నిత్యంబులు గావు. యోగి లోకమందు మదిరాపానంబుఁ జేసి మదాంధుఁ డైనవాఁడు పరిధానాంశుక పాతనాపాతనంబుల నెఱుంగని చందంబున దైవకృత్యంబు లైన నిజ దేహ స్థితి నాశనంబుల నెఱుంగఁడు. కర్మానుభవ సమాప్తి పర్యంతంబు దేహంబు వర్తించు నని సనకాదులకు సాంఖ్య యోగం బుపదేశించి వారిచేఁ బూజితుండ నై పరమనిలయంబున కరిగితి నంత నీ యోగంబును విధాత యెఱింగి భృ గ్వాదులకును; బ్రహ్మ ఋషులకును జెప్పె. వారు దేవ దానవ గంధర్వుల కుపదేశించిరి. త న్మూలమున మర్త్య లోక వాసు లభ్యసించిరి. ఇ వ్విధంబునఁ

♦ వరించు. వ్రాఁత ప్రతి.

బరంపరానుగతం బగు సాంఖ్య యోగం బెఱింగి సమ్యగ్జ్ఞాన సమే
తుఁడవై పుణ్యదేశ నదీ వన పంచారంబు లాచరింపు మని యాద
వేంద్రుం డానతిచ్చిన నుద్ధవుం డి ట్లనియె. 285

క. పర కాంతా ధనముల పైఁ
దిరుగాడెడు చిత్త మెట్లు త్రిదశేశ్వర నీ
వర రూప మందు నిలుచును
దిరముగ నిది నాకు నానతీయఁగవలయున్. 286

వ. అని పలికిన ధరణీసుర సత్తమునకుఁ బద్మనాభుం డి ట్లనియె. 287

ఉ. కొందఱు ధర్మ మార్గములఁ గొందఱు సంపదఁ గొంద ఱర్థమున్
గొందఱు నిత్యదానములఁ గొందఱు కీర్తులఁ బుత్రదారలన్
గొందఱు సంతతాధ్వరముఁ గొందఱు తీవ్ర తపఃక్రియాదులన్
గొందఱు కామ యంత్రములఁ గోరుచునుందురు మోహితాత్ములై

క. శ్రీ రమణుం డగు నను మదిఁ
గోరి భజింపంగ లేక కుపథంబులపై
నేరుపు చెడి వర్తింపుదు
రీ రీతిని నరులు మోక్ష హిత విరహితులై. 289

ఆ. నీరసంబు లైన భూరుహంబుల నగ్ని
యేచి నీరుగా దహించు నట్లు
మాన్య మైన యట్టి మత్పాద యుగ భక్తి
పాపసమితిఁ జెఱచుఁ బంతముగను. 290

క. ఒకవంక నాఁగు నగు వే
ఱొకచో గానంబు సేయు నుబ్బిన వేడ్కన్
సకలంబు విష్ణుమయ మని
ప్రకటంబుగ మత్పదాబ్జ భక్తుఁడు దెలియున్. 291

సీ. హరిభక్తి గలవాని చరణరేణు చయంబు
సోఁకిన భూమెల్ల శుద్ధిఁ బొందు
హరిభక్తి గలవాని కన్నంబుఁ బెట్టిన
నరు నింట 1. వేడుకనారగింతు
హరిభక్తి సంపన్నుఁ డగువాని సేవింపఁ
బాప తూలాద్రులు భస్మమగును
హరిభక్తి సంయుక్తుఁ డగువాని వెనువెంట,
దిరుగు లాడుచు నుండుఁ దెలివి సెడక

గీ. వ్రతము లైనను సంతత క్రతువు లైన
ధర్మ మైనను బహువిధాధ్యయన మైన
నీడు జోడుగ మద్భక్తితోడ నెపుడు
2. సవతు రా నేర వెచ్చోట సంయమీంద్ర 292

గీ. భోగ వాంఛలతోడఁ బొదలెడి చిత్తంబు
భోగ్య వస్తు సమితి పొందుఁ గోరుఁ
దనివి లేక నన్నుఁ దలఁపుచు వర్తించు
మనము మత్పదాబ్జముననె నిలుచు.

శా. కాంతా సంగము మాని సంతతము నేకాంత ప్రదేశంబునన్
శాంతుండై ధన దార మోహ కలితేచ్ఛా వర్జితుండై రమా
కాంతుం డౌ నను నెప్డుఁ బ్రేమమున మోక్షప్రాప్తికై యోగి శు
ద్ధాంతః పద్మమునం దలంపవలయున్ హర్షోల్లసత్స్వాంతుఁడై.

మ. హరి యీ రీతిని నానతిచ్చిన మునీంద్రాగణ్యుఁ డా పంకజో
దరుతో నిట్లనియెన్ సమస్తజగదాధారప్రపన్నార్తినం
హర యెవ్వాని మనంబులోఁ దలఁచి యోగారూఢుఁ డింద్రాది దు
స్తర యుష్మత్పద నాసిక్తయె తనరుఁ దద్ధ్యానంబు వర్ణింపవే. 294

1. నె భోజనంబు సేతు వ్రాఁతప్రతి.

2. సమత కానేరవు. వ్రాఁతప్రతి.

వ. యివ్విధమ్మైన ధ్యాన యోగం బడిగిన ధరణీసురోత్తమునకు యదు పుంగవుం డిట్లనియె. 295

సీ. శాంతుఁడై నియతి నశ్రాంతంబు నేకాంత
మున సమాసీనుఁడై ముదముతోడ
హస్తంబు లూరు ద్వయంబునఁ గీలించి
నాసాగ్ర విన్యస్త నయనుఁ డగుచు
హృదయ నాళంబులో నుదయార్క సమకాంతి
కలిగిన పద్మ కుట్మలము మిగుల

గీ. వికసితంబైన దానిగా వీక్ష చేసి
కర్ణికా మధ్యమంబునఁ గ్రమముతోడ
విమల చంద్రాగ్నిరవి మండలముల నిలిపి
త ద్విభావసు మండల స్థానమందు. 296

వ. మఱియుఁ దప్త కాంచన సంకాశ దివ్య దేహుండును, కటిఘటిత రత్న ఘంటికా సమంచిత పీతాంబరాలంకృతుండును, కమలాయత కుండల ద్వయ దీప్తి శ్యామలిత కపోల ద్వయ విరాజమాన వదనుండును, చంపక ప్రసూన సమాన నాసా లంబిత మౌక్తిక ధవళితాధరుండును, కౌస్తుభ శ్రీవత్స వనమాలాలంకృతుండును, బహు విధ రత్న విచిత్ర భూషా సమేతుండును, రత్న కిరీట దేదీప్యమానుండును, బాహు చతుష్కోపశోభితుండును, శంఖ చక్ర, గదా నందనాద్యనేకాయుధ ధరుండును, మరకతమణి నూపుర ద్వితయ ద్యుతి పిశంగీకృత పాదాబ్జుండును, కరుణారస పరిపూర్ణుండును, మానాంక నివాస కమలాలోకన కుతూహల పరితుష్ట హృదయుండును, కనక సింహాసన సమాసీనుండును, నైన నన్ను భావించి సంతసంబున ధ్యానంబు సేయవలయును.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

## ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరు వారు సి. బి. ఇ డి. లిట్., పిఠాపురం మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజా వారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజా వారు.

## ఉద్ధారకులు.

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరు వారు.
(జమీందారు, ఉయ్యూరు యెస్టేటు)

## అధ్యక్షులు.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవి సమ్రాడిత్యాది బిరుదాంకితులగు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

## కార్యదర్శులు :

శ్రీ సాహిత్యశిరోమణి, ఉభయభాషాప్రవీణ, చతుర్వేదుల సత్యనారాయణగారు, ఎం. ఏ., బి. ఓ. యల్.

శ్రీ ప్రతివాద భయంకర పార్థసారథిగారు, బి. ఏ., యల్. యల్. బి,

## కోశాధ్యక్షులు :

శ్రీ ప్రతివాది భయంకర పార్థసారథిగారు, బి, ఎ, యల్. యల్. బి.

శ్రీ ఏలేశ్వరపు వేంకటరమణ సుబ్బారావుగారు, బి ఏ, బి. యల్.,

## కార్యనిర్వాహక సభాసభ్యులు :

శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు.

శ్రీ రా. సా. మాదిరెడ్డి సీతారామయ్య నాయుడుగారు, బి. ఏ, బి. యల్.

శ్రీ కొమ్మిరెడ్డి కేశవ రామమూర్తినాయుడుగారు, బి. ఏ.

శ్రీ వేమూల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం ఏ.

శ్రీ ఎంచమూరి వేంకటరమణగారు, ఎం. ఏ. బి. ఇడి

శ్రీ సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు

శ్రీ కొండావు తిమ్మయ్యగారు.

శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ.

శ్రీ ఏమూరి సీతారామారావుగారు, బి. ఏ.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక



దేశ భాష లందు తెలుగు లెస్స

సంపుటము ౪౨

సంచిక ౬

# సంపాదకవర్గము

ప్రధానసంపాదకుఁడు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. యల్.

సహాయ సంపాదకులు :

శ్రీ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులుగారు, ఎం. ఏ.
శ్రీ విద్వాన్ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. ఆనర్సు., బి. ఇడి.
శ్రీ సాహిత్యవిద్యా, భాషాప్రవీణ, చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.
శ్రీ బంగారు తమ్మయ్యగారు.

# విషయసూచిక

శ్రీ

# ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు.

సంపుటము ౪౨ { విజయ సంవత్సరము మాఘ, ఫాల్గుణ, మాసములు } సంచిక ౬

## ప్రాచ్యవిద్యావిధానమున మార్పులు

మన దేశమున నాంగ్లప్రభుత్వ మున్నంతవఱకు దేశభాషల కెట్టి గౌరవము లేక యడుగునఁ బడియుండుట యందఱికిఁ దెలిసినవిషయమే. ఆంగ్లప్రభుత్వావసానదినములలో జరిగిన యాందోళనమువలన విద్యాప్రణాళికలోఁ బ్రాచ్యభాషలకుఁ గొంత స్థానము కలిగెను. విశ్వవిద్యాలయము ప్రాచ్యవిద్యాపరీక్షల జరుపుటయు, అందు త్తీర్ణులైనవారికి 'డిప్లమా'ల నొసంగుటయు, ఉన్నత విద్యాశాలలలో, కళాశాలలలో వారి కుద్యోగములు లభించుటయు సంభవించెను. స్వరాజ్యము వచ్చిన తర్వాతఁ బ్రాచ్యవిద్యల కింకను గౌరవము, ప్రాచుర్యము నొసంగు ప్రయత్నములు జరిగెను. దేశములో నిదివఱ కాంగ్లభాషకుఁ గల ప్రాధాన్య మిఁక ముందు సంస్కృతాంధ్రములకుఁ గలుగవలె నను నాందోళనము బయలుదేఱెను. దీని ఫలమే ప్రాచ్యవిద్యావిధానమున నేఁడు జరుగుచున్న మార్పులు.

ఈ మార్పుల నగ్గడించుటకుఁ బూర్వముఁ విద్యావిధాన మెట్లున్నది కొంత పరికింతము. మదరాసు విశ్వవిద్యాలయమున 'విద్వాన్'

'శిరోమణి' అనియు, ఆంధ్రవిశ్వవిద్యాలయమున 'భాషాప్రవీణ, విద్యాప్రవీణ'అనియుఁ బరీక్షలు గలవు. ఈ పరీక్షలు జరుగుటకు ముందు అడ్వాన్సుడ్ పాఠశాలలలో నాల్గుసంవత్సరములు చదువవలెను. చివర సంవత్సరమునఁ బ్రవేశపరీక్ష జరుగును. అందుత్తీర్ణులైనచోఁ బ్రాచ్యవిద్యాకళాశాలలో మొదటి రెండు సంవత్సరములు ప్రిలిమినరీ పరీక్షకు, కడమ రెండు సంవత్సరములు ఫైనలు పరీక్షకు జదువవలెను. అందుత్తీర్ణుడైనచో విద్యార్థి 'ప్రవీణ'బిరుదమునకర్హుఁడగును. ఈవిద్యావిధాన మాంగ్లవిద్యావిధానము ననుకరించుచున్నది. అక్కడ ఎస్. ఎస్.ఎల్. సి లేక మెట్రిక్యులేషన్ పరీక్ష యిందలి ప్రవేశపరీక్షకు సమానము. ఎస్. ఎస్. ఎల్. సి యందుత్తీర్ణుఁడైనచో రెండు సంవత్సరములు 'ఇంటర్ మిడియట్' రెండు సంవత్సరములు బి.ఏ. చదువవలయును గదా. ప్రాచ్యవిద్యావిధానమునందలి ప్రిలిమనరీ ఫైనలు పరీక్షలు వీనికిఁ దుల్యములు.

ఈ విధముగా భాషాప్రవీణ, విద్యాప్రవీణ పరీక్షలు, బి. ఏ. పరీక్షలతో సమానమైన ప్రణాళిక గల వనుట కెట్టి సంశయము లేదు. బి. ఏ. యందుత్తీర్ణుఁడగుటకొక విద్యార్థి యెంత శ్రమపడవలెనో, వీనియందుత్తీర్ణుఁడగుటకుఁగూడ నంత శ్రమపడి తీరవలెను. స్థితిగతు లీవిధముగ నున్నను బి. ఏ. పరీక్షయందుత్తీర్ణుఁడైనవానికిఁ గల గౌరవము ప్రాచ్యవిద్యాభట్టభద్రునకు లభించుట లేదు. బి. ఏ. పట్టభద్రున కుద్యోగ ప్రారంభముననే డెబ్బదియైదు రూప్యముల వేతనము లభించుచుండఁ బ్రవీణపరీక్షయందుత్తీర్ణుఁడైనవానికి నుద్యోగారంభమునఁ గాని యది లభించుట లేదు. బి. ఏ. తో పాటితఁడు ఎస్. ఎస్. ఎల్. సి పరీక్షకుఁ బాఠము చెప్పుచున్నవాఁడే. బాధ్యత లన్నియు సమానమే. వేతనము మాత్ర మత్యల్పము. ఇతనిని బండితుఁడని పేర్కొందురు. పండితుఁడను పదము జీతము తగ్గించుటకుఁ జాల ననుకూలముగా

మున్నది. ఇందు ఆంగ్లవిద్యావంతులు ప్రాచ్యవిద్యలపైఁ జూపు నభిమానధోరణి వెల్లడియగుచున్నది. మన జాతికి స్వకీయ మైన దానియందు ద్వేషము, పరకీయమైన దానియం దాదరణము సహజ మగుటచే స్వభాషాపండితులకు జరుగుచున్న యవమానమును ప్రభుత్వము ప్రజలు కూడఁ జూచి సహించి యూరకున్నారు. మఱి యే దేశములోను స్వభాషా వేత్తల కిట్టి యవమానము జరుగదు.

కొంతకాలము క్రిందట పండితులు ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షయందు త్తీర్ణులై ట్రైనింగు పొందినచో, బి. ఏ. బి. ఇడి. లతో సమాన వేతనము పొందఁ గల రని ప్రభుత్వ మంగీకరించెను. ఈ సమాన గౌరవము కొంతమందికి మాత్రమే కలుగును. ఉత్తీర్ణులైన యందఱికిఁ గలుగదు. ఇందు ట్రైనింగు, బి. ఇ డి లకు బదులుగాను, ఎస్.ఎస్.ఎల్.సి. లోకజ్ఞానమునకు సరిసర మని వీరి యభిప్రాయము. ఎస్.ఎస్. ఎల్. సి. చదివిన వాని కెంత లోకజ్ఞాన ముండునని మనకుఁ దెలియును గదా! ప్రవీణులను ప్రాచ్యవిద్యలలో నేర్పైన సున్నతవిద్య గడింపుమనుటలో నర్థమున్నదిగాని నిరుపయుక్తమైన ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షయందు త్తీర్ణులు కమ్మనుటలో నర్థము కన్పించుటలేదు. ఇది యాంగ్లవిద్య చదివిన వాఁడు పెద్దలోకజ్ఞానము కలవాఁ డనియు, ప్రాచ్యవిద్యల నధిగమించిన వాఁడు మూఢుఁ డనియుఁ దత్సూత్రనిర్మాతల యభిప్రాయ మైనట్లు వెల్లడి యగుచున్నది.

రెండు మూఁడు సంవత్సరములక్రింద జరిగిన యాందోళనము వలనఁ బ్రాచ్యవిద్యావిధానమునఁ గొన్ని మార్పులు గావింపఁబడెను. అందును లోపములు లేకపోలేదు. కాని యది కొంత యాచరణయోగ్యముగా నున్నది. అడ్వాన్సుడ్ పాఠశాలలలో నిఁక ముం దాఱు తరగతు లుండును. అవి మొదటి ఫారమునుండి ఎస్ ఎస్. ఎల్. సి. తరగతివఱకుఁ గల యాఱు ఫారములఁ బోలియుండును. ఈ యాఱు సంవత్సరముల

చివర విద్యార్థి, ఓరియంటల్ ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షకుఁ గూర్చుండవచ్చును అందుత్తీర్ణుఁడైనచో సాధారణమైన ఎస్. ఎస్. ఎల్. సి. యందుత్తీర్ణుఁడైనవానికిఁ గల్గు లాభములు వీనికిని జేకూరును. ఇందుత్తీర్ణుఁడైనచోఁ బ్రాచ్యకళాశాలలలోఁ జేరి ప్రవీణాది పరీక్షలకుఁ జదువవచ్చును. ఆంగ్లకళాశాలలోఁ జేరి ఇంటర్మిడియట్ చదువవచ్చును. ఉద్యోగాభిలాషి యైనచో సర్వీస్కమీషన్ పరీక్షకుఁ గూర్చుండవచ్చును. సెకండరీగ్రేడ్ ట్రైనింగుకుఁ గూడ వెళ్ళవచ్చును. ఓరియంటల్ ఎస్. ఎస్. ఎల్. సి. తీసికొన్న విద్యార్థి కావలసినచో, ఇంగ్లీషు హైస్కూళ్ళలోఁ దత్తుల్యమైన కక్ష్యలలోఁ జేరవచ్చును.

ఈ ఓరియంటల్ ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షలో విద్యార్థి వారమునకుఁ బదునెనిమిది పిరీయడులు సంస్కృతాంధ్రములనే పఠించును. ఇంగ్లీషు, సాంఘికశాస్త్రము, రెండు ఎస్. ఎస్. ఎల్. సి. లకు సమానమే.

ఇందు సంస్కృతాంధ్రములు వారమునకుఁ బదునెనిమిది పిరీయడులు పఠించుటయే విశేషము. దీనివలన సంస్కృతాంధ్రములకుఁ గొంత ప్రాచుర్యము, గౌరవము కలుగఁగల దని భావింపఁబడుచున్నది.

ఈ విధానము ననుసరించి యింటర్మిడియేట్, బి. ఎ. తరగతులలోఁగూడ ప్రాచ్యవిద్యలకుఁ బ్రాధాన్య మొసంగుటకై యత్నములు జరుగుచుండుట ముదావహము.

---



# ప్రవరుఁడు - వరూధిని

శ్రీ చతుర్వేదుల సత్యనారాయణగారు, ఎం.ఏ., బి.ఓ.యల్.

ఆంధ్రప్రబంధములలో మనుచరిత్రకున్న పేరు మఱియొక దానికి లేదు. మనవారు భక్తికోసము భాగవతము నీతికోసము రామాయణము ధర్మముకోసము భారతము చదువుదురు. ఆనందము కోసము మనుచరిత్రను బఠింతురు. ఇది తెలుఁగుప్రబంధములలో మొట్ట మొదటిది. ఆంధ్ర పంచకావ్యములలో నగ్రగణ్య మైనది. "అల్లసాని వాని యల్లిక జిగిబిగి" కిది తారకాణ. అతని శిల్పకౌశలమున కిది యాటపట్టు. ఆంధ్రమునఁ గాక భరతదేశమున నితరప్రాంతములలో వరూధినీప్రవరు లన్న నెవరో యెవరికినిఁ దెలియదు. ఎవ్వరో కొంత మంది పౌరాణికులకుఁ దప్ప నితరుల కెవ్వరికిఁ దెలియుట కవకాశము లేని మాఱుమూల పాత్రలఁ గొని రామకృష్ణపాత్రల వలె ననుదిన స్మరణీయులఁ గావించిన యాంధ్రకవితాపితామహుని ప్రతిభావైశద్య మే మని పొగడఁగలము? వరూధినీప్రవరు లే దేశమువారో గాని పెద్ద నార్యుఁడు వారిని దెలుఁగువారిని గావించెను. వా రెట్లు తెలుఁగువారి హృదయరంగముల కెక్కినది మనము చూడఁగలము. ఎవని నైనఁ బర స్త్రీవిముఖుని మనవారు చూచినచో వెంటనే యితఁ డెవఁడో "ప్రవ రాఖ్యుని వలె నున్నాఁ"డని ప్రశంసింతురు. ఈ ప్రశంసలో రెండు విష యములు గమనింపఁదగినవి. మొదటిదీ నామము తెలుఁగువారి జిహ్వాగ్రమున నుండుట. రెండవది యీ పేరు ప్రవరుఁ డనియో ప్రవ రాఖ్యుఁ డనియో కూడ విమర్శింపక ప్రయోగించుట. కవి తన కావ్య మునఁ "బ్రవరాఖ్యుఁ డలేఖ్య తనూ విలాసుఁడై" అని చెప్పెను. తెలుఁ గు వా రందఱు నాతనిపేరు ప్రవరాఖ్యుఁ డనియే గ్రహించిరి. పే రేది యో స్పష్టముగాఁ దెలిసికొనుట కవకాశము లేని విధమున రసతన్మయు లై రని భావము. ఈ విధముగా మనుచరిత్రమునఁ బెద్దనార్యుని యీ పాత్రచిత్రణ మద్భుతముగా నున్నది. ఇట్టి హృద్యజీవ పాత్రల నిర్మించిన

యల్లసాని వారి పాత్రచిత్రణము బాగుగా లేదని కొందఱు విమర్శకు లాక్షేపించిరి. వారి యాక్షేపణలకు సమాధానము మఱి యొక సారి చూతము. వరూథినీ ప్రవర పాత్రలఁ జిత్రించుటయం దాతఁడు చూపిన కళాకౌశలమును నేఁడు పరికింతము.

వరూథినీ ప్రవరుల వృత్తాంతము మార్కండేయపురాణము చతుర్థాశ్వాసము చివరఁ గలదు. ఇందుఁ బ్రవరుఁడు హిమవత్పర్వతమునఁ జిక్కుపడువఱకు పదునేను పద్యములలో నున్నది. వరూథినీప్రవరుల సంవాదము నిరువది పద్యములలో వ్రాసెను. ఈ ముప్పదియైదు పద్యముల వృత్తాంతమును బెద్దనార్యుఁడు తన శిల్పచాతుర్యమును బ్రదర్శించుచు నూటపది పద్యములలోఁ జెప్పెను.

అందు నిందుఁ గల ప్రవరవర్ణనపద్యములఁ బరికించినచోఁ బెద్దనార్యుని ప్రతిభావిశేషము వ్యక్తము కాఁ గలదు. మార్కండేయ పురాణమున—

"అతులగుణోత్తరుఁడు గలఁ డొక్క ధరణీ
సురవరుఁ డశ్వినులకంటె సుందరుఁ డెందుఁ"

"అతిసుకుమారమూర్తి ప్రవరాఖ్యుఁ డుదాత్తుఁడు వేదపారగుం
డతిథి జనార్చనాభిరతుఁ డై చరియించుచు శైల కాననాం
చిత సకలావనీ తల విశేషము లెల్లను బ్రీతిఁ గన్గొనన్
మతిఁ గడుఁ గోరుచుండ నొక నాఁ డొక యౌషధసిద్ధుఁ డింటికిన్"

అని కలదు.

మనుచరిత్రలో—

ఆ పురిఁ బాయ కుండు మకరాంక శశాంక మనోజ్ఞ మూర్తి భా
షాపర శేషభోగి వివిధాధ్వర నిర్మల ధర్మకర్మ దీ
క్షాపరతంత్రుఁ డంబురుహ గర్భ కులాభరణం బనారతా
ధ్యాపన తత్పరుండు ప్రవరాఖ్యుఁ డలేఖ్య తనూ విలాసుఁడై.

ఈ పద్యమునఁ బరికింపఁదగిన విశేషము లెన్నియో కలవు. అందు,

1. ప్రయోగ వైచిత్రి;— మార్కండేయపురాణమున, అశ్వినులకంటె సుందరుఁ డని కలదు. ఇందు మకరాంక శశాంక మనోజ్ఞ

మూర్తి యని యున్నది. అశ్వినులు, మన్మథుఁడు, చంద్రుఁడు. వీ రం దఱు సౌందర్యమున కుపమాన భూతులు. కాని యశ్విను లిరువురు దేవతలు. ప్రవరుఁ డొక్కఁడు. ఒక్కని కిరువుర నుపమానముగా గ్రహించుట యుపమా దోషము గాఁ దలఁచి పెద్దనార్యుఁడు ప్రవరుని మన్మథునితోను, చంద్రునితోను విడిగాఁ బోల్చెను. మకరాంక శశాంక మనోజ్ఞ మూర్తి- ఇచట వృత్త్యనుప్రాస, ఛేకానుప్రాసలు శ్రుతిసుభగ ముగా నున్నవి. మారన ప్రవరుని ధరణీసురవరుఁ డని వర్ణించెను. పెద్దన "అంబురుహ గర్భ కులాభరణం"బని వర్ణించెను. ధరణీసురవరుఁ డనఁగా బ్రాహ్మణశ్రేష్ఠుఁ డని యర్థము. ఆ పదమున కంతకంటె నితర విశేష మేమియు స్ఫురింపదు. అంబురుహగర్భకులాభరణంబు - అను శబ్దమునకుఁ గూడ బ్రాహ్మణశ్రేష్ఠుఁడను నర్థమే యైనను, అందలి పద వ్యుత్పత్తి విశేషముచే నీటియందుఁ బుట్టిన, కమలముల నుండి పుట్టిన, బ్రహ్మయొక్క వంశమున కాభరణ మని యర్థము వచ్చుచున్నది. బ్రాహ్మణులు బ్రహ్మవలనఁ బుట్టిరి. బ్రహ్మ కమలమునుండి జనించెను. కమలములు నీటియం దుద్భవించెను. కారణగుణములు కార్యమందు సంక్రమించు నను న్యాయమున నీటియొక్క పవిత్రత్వము, పద్మముయొక్క సౌందర్యము, బ్రహ్మయొక్క ప్రజ్ఞావిశేషము గల జాతియం దగ్ర గణ్యుఁ డను నర్థము స్ఫురించుచున్నది. ఈ విధముగాఁ జెప్పుటచే నై గుణము లీతనికి సహజము లనియు ధ్వనించుచున్నది.

2. ఈ పద్యమునఁ బ్రవరునకు వేసిన విశేషణములచేఁగవి ముం దఱి కథా వస్తువునకు బీజావాపము చేసినాఁడు. ఈ విశేషణము లెట్లు సార్థకములో ముందుఁ దెలియఁ గలవు.

3. పెద్దన కవిత్వము ధ్వనిప్రధాన మైనది. దానికి నిదర్శనముగా నీ పద్యము చూడుఁడు.

మీ మాటలు మంత్రంబులు;
మీ మెట్టిన యెడ ప్రయాగ; మీ పాదపవి
త్రామల తోయము లఘు
దోఘ మార్గ ఘురాంబు పౌనరుక్త్యము లుర్విన్.

మీ మాటలు మంత్రముల వలె నూర్జస్వలములు; మీఁరడుగు పెట్టిన చోటు ప్రయాగవలెఁబుణ్యపదము; మీ కాళ్లు కడిగిన నీరు ఆకాశగంగ వలె పవిత్ర మైన దని వాచ్యార్థము. "అభ్యాగతః స్వయం విష్ణుః" అను నది యిందలి వ్యంగ్యార్థము. వేదములు విష్ణుని వాక్కులు. విష్ణువు ప్రయాగయందుఁ గలఁడు. ప్రయాగమాధవుఁ డని ప్రసిద్ధి గదా! ప్రయాగ యతఁడు మెట్టిన చోటు. విష్ణుపాదములనుండి గంగానది పుట్టెను. విష్ణుని యందలి యీ లక్షణము లభ్యాగతుని యం దారోపించి కవిపై లోకోక్తిని ధ్రువ మొనర్చెను. ఈ విధముగనే "ఆ పురి బాయకుండు" అను పద్యము కూడ ధ్వనిప్రధాన మైనది. ఈ పద్యమునఁ బ్రవరుఁడు లోకానుభవము లేనివాఁడు. దాన, స్వపర తారతమ్య వివేకరహితుఁడు. అందుచే నాత్మవిశ్వాసము లేనివాఁ డని చెప్పుటయే కవితాత్పర్యము. లోకానుభవము లేనివాఁ డని చెప్పుట కోసమే పద్యము మొదటనే "ఆ పురిఁబాయకుండు" అను విశేషణమును "బ్రయోగించి యతని శీల మున నది ప్రధానలక్షణ మని నిరూపించెను.

ఇఁకఁ బ్రవరుఁ డెట్లు లోకానుభవము లేనివాఁడో చూతము. అతఁడు పుట్టిన తరువాత నరుణాస్పదపురము నెన్నఁడు వదలి యెఱుఁగఁడు. అంతియే గాదు. గ్రామములోఁ బనియుండి యింటినైన వదలి యెఱుఁగఁడు. అతఁడు వివిధాధ్వర నిర్మలధర్మకర్మ దీక్షాపరతంత్రుఁడు.

"కిం త్వనుష్ఠాన నిత్యత్వం,స్వాతంత్ర్య మపకర్షతి
సంకటా హ్యాహితాగ్నీనాం, ప్రత్యవాయై ర్గృహస్థతా" అన్నట్లు,

కర్మపరతంత్రునకు స్వాతంత్ర్య మెక్కడిది? మాధ్యాహ్నికభోజనము వఱకు నిట్టి కర్మలతో సరిపోవును. భోజనానంతరము రాత్రి నిద్రించు నంతవఱకు "అనారతాధ్యాపన తత్పరుఁ"డై కాలము గడపుచుండెను.

ఈ విధముగాఁ బ్రవరున కొక్క క్షణమైనను దీఱిక లేదు. వీనికి బురములోనికిఁ గాని యూరి దాఁటి గాని పోవుట కవకాశము లేదు. కావున నీతని కెవరితోడను సంసర్గము లేదు. లోకముతో సంసర్గము లేనివానికి లోకానుభవ ముండదు. లోకానుభవము లేనివారికి స్వపర తారతమ్య వివేక ముండదు. అది యుండనివానికి నాత్మవిశ్వాసము కుదు

రదు. ఇట్లు పరంపరగాఁ బ్రవరునకు నాత్మవిశ్వాసము లే దను సంగతి ప్రథమ పద్యమునసే సూచించి మున్ముందు పద్యములలోఁ గవి దానిని విస్తరించెను.

ప్రవరుని దినచర్య చూచినచోఁ బై విషయము స్పష్ట మగును. అతఁడు తెల్లవాఱు జామున లేచి శిష్యులతోఁ గూడ వరణానది కేగి, యట స్నాన జపతపముల నిర్వర్తించుకొని, కొంత ప్రొద్దెక్కు నప్పటి కింటికిఁ దిరిగి వచ్చుచుండెను. ధర్మకర్మ తత్పరుఁ డగుటచే నప్పటినుండి మధ్యాహ్నము వఱకు నీ పనితో సరిపోవును. మధ్యాహ్న సమయమున నింటికి వచ్చిన యతిథులకు సపర్యఁ గావించి వారితోఁ గూడ భుజించును. భోజనానంతరము వారితోఁ దీర్థయాత్రలఁ గూర్చి ముచ్చటించును. అనంతరము శిష్యవత్సలుఁడు గావున విసుగు విరామము లేక యనారతాధ్యాపనతత్పరుం డగును.

ఎప్పుడును గర్మపరుఁడై యధ్యాపనతత్పరుఁ డగుచో వాని జీవిక యెట్లు? ఇలు దీర్చువా రెవరు? సంసార మెట్లు గడచును? వీని నిర్వహించుటకైన లోకముతో సంబంధము లేక యెట్లుండఁ గలఁడు? అను ప్రశ్నలు రా వచ్చును. ఈ ప్రశ్నలకుఁ దగిన సమాధానమును బెద్దన సూచించియే యున్నాఁడు ప్రవరుఁ డొకరిని యాసింపవలసిన యవసరము లేదు. అతఁడు ధనాఢ్యుఁడు. మాన్యక్షేత్రములు పెక్కుచందాలఁ బండుటచే నింటఁ బాడియుఁ బంటయుఁ దఱుగక యున్నవి. అందువలన నొకరి నాశ్రయింపవలసిన యవసరము లేదు. సమృద్ధిగాఁ దినుట కున్నను ధనతృష్ణ యితరుల నాశ్రయింపఁ జేయును. కాని ప్రవరున కా తృష్ణయు లేదు. ఇతని కులము శీలము గుణములు చూచి పాత్రుఁ డని యే భూపాలుఁడైనన్ను దాన మీయఁ దలఁచినచోఁ జివరకు నెట్టి దోషము లేని సాలగ్రామదానమైనఁ బట్టఁడు. కూరిమి సోమిదమ్మ సౌఖ్యావహమై భజించుచుండఁ దలిదండ్రులు సుఖులై దేవియు దేవర వోలె నిలు దీర్చుచుండగా నితని కాపురము లోప మేమియు లేక జరుగుచుండెను.

ప్రవరునకు లోకములో నెట్టి సంబంధము లేకున్నను జ్ఞానరహితుఁడైన మూఢుఁడు కాఁడు. ఇతఁడు వేదవేదాంగపారంగతుఁడు. అనారతాధ్యాపనతత్పరుః డగుటచే, ఆ సంస్కారము దృఢముగాఁ గలదు. ఇతడు భాషయం దపర శేష భోగి. తన యభిప్రాయము వివరించుటయందును, తన కిష్టములేని యితరుల మాటల ఖండించుటయందును సమర్థుఁడు. కాని పుస్తకజ్ఞాన మెంత యున్నను ప్రత్యక్షమునకు సాటి రాదు. ఒక విషయమును గూర్చి యెంత విన్నను జూచిన దానితో సమము గాదు గదా ?

ప్రవరుఁడు తరుణవయస్సునం దున్నాఁడు. తారుణ్యము నూత్నవస్తుదర్శనకుతూహలి. నిర్మలధర్మకర్మదీక్షాపరతంత్రుఁ డగుటచే ధర్మేతరము లైన కార్యములయం దాతనికి మనస్సు పోదు. తీర్థయాత్ర ధర్మకర్మయే యగుటచే నాతనికి వనధి పర్వత సరిత్తీర్థ సందర్శనాభిలాష మాత్ర ముప్పొంగుచుండెను. కాని యగ్నిహోత్రి యగుటచే "సంకటా హ్యాహితాగ్నీనాం ప్రత్యవాయై ర్గృహస్థతా" అన్నట్లు ప్రత్యవాయ బాహుళ్యమున నిల్లు విడిచిపోవుట కేమియు నవకాశము లేకుండెను. తరుణాగ్నిహోత్రి యను పదముచే వాని మనస్సునం దున్న యీ యారాటమును గవి వ్యక్త మొనర్చెను. ఇందువలనఁ గర్మలోపము లేకుండఁ దీర్థసందర్శనోపాయ మతఁడు కోరుచుండె నని కవి సూచించుచున్నాఁడు. కాని యది యెట్లును సిద్ధింప కుండుటచే,

"పోయి సేవింప లేకున్నఁ బుణ్యతీర్థ
మహిమ వినుటయు నఖిలకల్మషహరంబ"

అని తృప్తి చెంది తీర్థసంవాసుల రాక విని యెంత దూరమైన వారి కెదు రేగి యింటికిఁ దెచ్చి సద్భక్తితో నాతిథ్య మొసఁగి సంతృప్తులైన వారిఁ జేరఁ జని తీర్థమహాత్మ్యములఁ దెలియ నడుగుచుండెను. కర్మబాహుళ్యముచేఁ దాఁ బో లేక పోవుటకు వెచ్చ నూర్చుచుండెను.

ఇట్లుండఁగా నౌషధసిద్ధుఁ డొకఁడు వాని యింటి కతిథిగా వచ్చెను. ఆతని కెదు రేగి తెచ్చి పూజించి యిష్టమృష్టాన్నకలనసంతుష్టుఁ జేసెను. సుఖముగాఁ గూర్చున్న యాతని చెంతఁ జేరి తీర్థమాహాత్మ్యము లడుగ నారంభించెను. ఇంతవఱకుఁ బ్రవరునకు లోకానుభవము లేమిని దెలిపినాఁడు. ఇఁక లోకానుభవము లే కుండుటచే స్వపర తారతమ్య వివేకము, అందువలన నాత్మవిశ్వాసము లే దని యీ యౌషధసిద్ధుని తోడి సంభాషణమున వ్యక్త మొనర్చెను.

ప్రవర యోగ సిద్ధులలోఁ బ్రవరుఁడు మహాత్తరుఁ డు. ఇతఁడు వేద వేదాంగ పారంగతుఁడు. అనారతాధ్యాపనతత్పరుఁడు. వివిధాధ్వరకర్మ దీక్షాపరతంత్రుఁడు. భాషాపర శేషభోగి. అప్రతిగ్రహీత. అతిథిసపర్యాపరా యణుఁడు. అందువలననే కవి యీతని నంబురుహగర్భకులాభరణ మని ప్రశంసించెను. ఇఁక నోషధిసిద్ధుఁ డేవో కొన్ని యోషధుల శక్తు లెఱింగి తద్బలముచే సమస్తాశావకాశములఁ దిరుగ నేర్చెను. కవి యీతని బాహ్యాకారమును, దేశత్రిమ్మరితనమును వర్ణించెనే గాని యాతని గుణ విశేషమును గాని పాండిత్యవైభవమును గాని వర్ణింప లేదు. వర్ణింప కుండుటచే నాతని కీ లక్షణములు లే వని ధ్వనింపఁ జెను. ఈ విధముగా యోగసిద్ధుని కంటె నన్నిఁటఁ బ్రవరుఁ డధికుఁడు. కాని తన యౌన్నత్యము తా నెఱుంగఁడు. ఓషధిసిద్ధు నొక యోగిగాఁ దలంచెను. యోగుల శక్తుల నెఱింగిన వాఁ డగుటచే నీతని గూడ శ క్తిమంతుని గాఁ దలంచెను. గురూపసదనకాలమునుండి తన యందు జీర్ణించిన వినయవిధేయతల నీతని యెడఁ జూపసాగెను. తన యధికారమును బట్టి యోషధిసిద్ధుఁడు ప్రవరు నెడ వినయముతో మెలంగ వలెను. కాని యితఁడు దేశత్రిమ్మరి. దేశత్రిమ్మరుల కుండ వలసిన చొరవ యీ సిద్ధునకుఁ గూడఁ గలదు. ఇతఁ డతిశయమును బూపునే కాని ప్రవరు నెడ వినయవిధేయతలతో మెలంగఁడు.

వీరిరువురి సంభాషణములో నాలు గంతరములు గలవు.

1. మహిమోన్నతుఁ డయ్యును వినయమునఁ జేసి ప్రవరుఁడును, అల్పుఁ డయ్యును దేశద్రిమ్మరియగు సిద్ధుఁడును, సంభాషణారంభమున సమానస్కంధులుగా నుండిరి. ఇరువురు నొకరి నొకరు ప్రశంసించు కొనిరి. "మీ మాటలు..." అని ప్రవరుఁడు సిద్ధుని మహిమను సూచించుచు నుపచార వాక్యములు పలికెను. సిద్ధుఁడును మావంటి వారి కెల్ల గృహస్థులే గదా యాశ్రయ మని గార్హస్థ్యమును ప్రశంసించుచు నుపచార వాక్యములు పల్కెను. ఇట్లిరువురు సమానప్రతిపత్తితో సంభాషణము నుపక్రమించినను, పోనుపోను ప్రవరుఁడు వినయముచే వినమ్రుఁ డగుచుండెను. సిద్ధుఁడు స్వోత్కర్షచే నౌన్నత్య మొందుచుండెను.

2. ప్రవరుఁడు కౌతుకముతో "ఏయే దేశములం జరించితిరి... ఆ యా చోటులఁ గల్గు వింతలు మహాత్మా! నా కెఱింగింపవే?" అని వేఁడుకొనెను. సిద్ధుఁ డాదరాయత్తచిత్తుఁడై యతని కనియె. ఇపుడు సిద్ధుఁడు వక్త. ప్రవరుఁడు శ్రోత. వక్త యెక్కువ. శ్రోత తక్కువ. ఈ విషయము ప్రవరుఁడు "మహాత్మా!" అని సంబోధించుటచేతను, సిద్ధుఁ డాదరాయత్తచిత్తుఁడై యనుటచేతను ధ్రువపడుచున్నది. సిద్ధుని సంభాషణలో నాతని స్వోత్కర్ష బాగుగా వ్యక్తమగుచున్నది. నేను సమస్తాశావకాశములను జూచితిని. అచ్చటచ్చటం గల తీర్థవిశేషంబుల వర్ణింప నేరి తరము? అస్తంబునం గల మణిప్రస్తరంబుల విశ్రాంతిఁ జింతించిన మేనం బులక లిప్పుడు వొడమెడు, రజతశైలంబు నోలంబులం గాలగళు విహారప్రదేశంబులం గనిన సంసృతిక్లేశంబులు వాయవే? మేరుశిఖరంబుల సోయగంబులఁ గలయం గనుంగొనుట బహుజన్మకృత సుకృత పరిపాకంబునం గాక యేల చేకూర నేర్చు? యని చవులూరఁ జెప్పి 'ఏ నిట్టి మహాద్భుతంబు లీశ్వరానుగ్రహంబున నల్పకాలంబునఁ గనుఁగొంటి'నని యది విన్నవారికి సహజముగాఁ గల్గెడి సందేహమును వారించెను.—ఇది రెండవ యంతరము.

౩. సిద్ధుని తీర్థయాత్రావృత్తాంతమును శ్రద్ధతో నాలించి ప్రవరుఁ డాశ్చర్య చకితుఁ డయ్యెను. ఏదో జనసామాన్యమునకుఁ దెలి యని మహిమ యీతనియందుఁ గలదు. చూడఁగా నీతఁడు ప్రాయ పుఁజిఱుతవాఁడు. లెక్కలు గట్టుకొని యెగిరిపోయినను నీతఁడు వర్ణిం చిన తీర్థములఁ జూచుటకు మఱి యేండ్లునుబూండ్లును బట్టును. ఈశ్వ రానుగ్రహమువలనఁ దన కీ మహిమ గల్గె నని యీతఁడు చెప్పుచు న్నాఁడు గాని వారి మహిమలు వా రెఱుంగ వలసినదే గాని నా బోటి వాని కూహింప శక్యము గాదు. అట్టి మహిమాన్వితుని యనుగ్ర హము వలనఁ దాను దీఱని యీ తీర్థయాత్రావాంఛ నెందులకుఁ దీర్చుకొనఁ గూడదు? ఒకరికి వీ లైనది మఱి యొకరికి వీలుగా కుం డునా? అయినను వెఱపు లేక యీ సంగతి యడుగు టెట్లు? అని తలంచి కుతూహలాతిశయమున నెట్లో వినయభంగమున కైన నోర్చి సిద్ధునితో "వెఱచక మీ కొనర్తు నొక విన్నపము...మీ మహిమ లీర యెఱుంగుదు రేమి చెప్పుదురా" అని వినమ్రుఁ డై యడిగెను. అంత సిద్ధుఁడు తన యాధిక్యమును సూచించుచు "సందియము తెలియ నడుగుట తప్పా? ఇది పరమరహస్య మైనను దాపక చెప్పెదను. పాద లేప మను దివ్యౌషధము కలదు. దాని భూరి ప్రభావముచే మనోవేగ ముతోఁ జరించుచుందు" మని పల్కెను.

ఇపుడు ప్రవరుఁ డాతని ప్రభావమునకు వెఱఁ గందుచున్నాఁడు. సిద్ధుఁ డాతని కభయ మిచ్చుచున్నాఁడు — ఇది మూఁడవ యం తరము.

4. సిద్ధునకుఁ గల తీర్థాటన సామర్థ్యము తన కెట్లు కల్గునా యని శంకించుచున్న ప్రవరునకుఁ బాదలేప ప్రశంసచేఁ గుతూహలము కుత్తుకబంటి యయ్యెను- ధర్మకర్మములకు లోపము లేకుండఁ దీర్థాటనము సలుపఁ గల్గుట యెట్లను తీఱని కోరిక నేఁడు నెఱవేఱఁ గల దను నాస పొడమెను.

ప్రవరుఁ డంత ముందు మీ మహిమలు మీకే తెలియును నా కేమియుఁ దెలియవు; అయినను మీకొక విన్నపము చేసెద నని పల్కెను. ఇప్పుడు భక్తితో వచ్చిన యొగ్గి మీ దివ్యప్రభావము నెఱుఁగని నా ప్రల్లదములు సహింపుఁడు. కోపపడక దయతో నన్ను మీ శిష్యునిగా స్వీకరించి తీర్థయాత్రలవలన ధన్యాత్ముఁగా జేయుఁ డని వేఁడుకొనెను. చూడుఁడు. భాషాపరశేషభోగి యగు ప్రవరుఁడు తనకు లేని తీర్థయాత్రాసాధన మగు పాదలేపనము కల్గి నంతమాత్రన సిద్ధుని యెదుటఁ దా నాడిన మాటలు ప్రల్లదము లని వినయభరముచే నెంత క్రుంగిపోయినాఁడో! అంత సిద్ధుఁడు తన ప్రేఁపసజ్జ దంతపు బరిణె యం దున్న పాదలేపనమును దీసి యిది యది యని చెప్పక యాతని కాళ్లకుఁ బూసెను. లోకములో మంచి భేషజముగలట్టి వైద్యుఁ డొకఁడు మం దిచ్చు నపుడిది యది యని చెప్పఁడు. తా నిచ్చినది తీసికొన వలెను గాని యదే మని యడుగుటకు రోగి కర్హత లే దని యాతని యభిప్రాయము. వైద్యున కెక్కుడుఁ గోపము వచ్చునో యని, కోపము వచ్చినచో మం దెక్కడ నీయఁడో యని మందుపేరు తెలిసికొని మాత్రము నే నేమి చేయవలెను. కావలసినది రోగము కుదురుటకుఁ గదా యని, రోగి యా మందును స్వీకరించును. అట్లే ప్రవరుఁడు ప్రశ్నించినచో సిద్ధున కేమి కోపము వచ్చునో యనియు, తీర్థయాత్రా సామర్థ్యము కలిగిన చాలు ననియు మఱుమాట పలుకక పాదలేపమును గాలికిఁ బూయించుకొనెను. దీనితోఁ బ్రవరుని వినయము, సిద్ధుని స్వోత్కర్షయుఁ బరాకాష్ఠ వహించెను.

ఇటుఁ బ్రవరుఁడు లోకానుభవము లేమి స్వపరతారతమ్య మెఱుంగఁడు. ఉత్కృష్టుఁ డగు తన్నపకృష్టుని గాను, తా నెఱుంగని పాదలేపము కల్గినంత మాత్రానఁ దన కంటె నపకృష్టుఁ డగు సిద్ధుని మహిమాన్వితుని గాను దలంచి వినయభారముచేఁ గ్రుంగిపోయెను. ఇట్లు సకలగుణసంపూర్ణుఁ డైనను నాత్మవిశ్వాసము లేకపోవుట ప్రవరుని గొప్ప లోపము. ఈ లోపమును దీర్చి యాతని నాదర్శబ్రాహ్మణునిగాఁ గవి

చేయఁదలంచెను.

ప్రవరుఁడు పాదలేపప్రభావముచేఁ బుణ్యక్షేత్రముల కాలవాలము, దివ్యతీర్థములకు నిలయమును, ప్రకృతిసౌందర్యమునకుఁ దావలము నగు హిమగిరి కేఁగెను. అచట బదరీనారాయణాది పుణ్యక్షేత్రములఁ జూచెను. ఒక క్షేత్రమునుండి మఱియొక క్షేత్రమునకుఁ బోవుచు నడుమనున్న ప్రకృతివైచిత్రి కబ్బురమందెను. అంత మధ్యాహ్న మగుటచేఁ దత్కాలోచిత కృత్యములఁ దీర్చికొనుటకు నింటికిఁ బోవఁదలంచి—

"తలమే బ్రహ్మకునైన నిన్నగ మహత్త్వం బెన్న నే నియ్యెడం
గల చోద్యంబులు రేపు గన్గొనియెదం గాకేమి నేఁ డేగెదన్."

అనుచుఁ గ్రమ్మఱు వేళ మంచుతోఁ బెరసి పాదలేపము కరఁగిపోయెను. ఆ సంగతి పాప మాతఁ డెఱుంగఁడు. ఎగిరిపోవుటకుఁ గా లెప్పుడు రాలేదో యప్పు డాతని సంతాపమున కంతు లేదు—

ఇంటిపట్టుననుండి యిదివఱ కెన్నఁడు నూరు వెడలి యెఱుంగఁడు. ఇప్పుడు ఘోరవనప్రదేశమునఁ నొంటిఁ జిక్కుకొనెను. తా నెటు వచ్చినది తెలియదు. తన యూరి కెటు పోవలసినది త్రోవ చూపెడివారు కానిపించరు. ఇట్టి స్థితిలోఁగూడ వినయవంతుఁ డగుటచే "బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్" అని తన్ను దా నిందించుకొనఁ జొచ్చెను. తన యూరినుండి వెడలివచ్చినందులకుఁ గాని యొంటిగా నుంటి నని గాని బాధపడుట లేదు. నిత్యనైమిత్తికాదికర్మలకు లోపము కల్గెనే యని యాతని విచారము. ఎచ్చట హవ్యకవ్యములచే సంప్రీతుఁ డగు నగ్నిహోత్రుని స్తుతించి యింటికిఁ బోఁగల శక్తియాతని కప్పుడు లేకపోలేదు. కాని తన శక్తి తా నెఱుంగఁడు, అనఁగా నాత్మవిశ్వాసము లే దన్నమాట. అందువలన "నను నిలు సేర్చు నుపాయం బొనరింపఁగఁ జాలు సుకృతి యొకఁ డెదురఁడొకో" యని పరాపేక్షచేఁ జింతాసాగరమున మునింగెను. భయంబు గదురఁబోవుచు నెదుర గంధర్వ యక్షగాన ఘూర్ణితమగు నొక్కకోనఁ గనెను. కనుఁగొని యిది

ముని యాశ్రమ మని యూహించి యందలి ముని యనుగ్రహావశమునం దుర్తిటిలో నింటి కేఁగి కర్మలోపము లేకుండఁ జేసికొన వచ్చునని తలంచెను. అది మునియాశ్రమ మని తలంచుటలోఁ బ్రవరుని మనోవృత్తులఁ బెద్దన చక్కఁగా ధ్వనింపఁజేసెను. ఆ కోసలోనికిఁ బోయి పోయి యొక శృంగారసన్ని వేశమధ్యమున నున్న గారుడోత్కీర్ణ మైన భవనమును గాంచెను. మునియాశ్రమ మని యచ్చటి కరుదెంచిన ప్రవరుఁ డా భవనమును గాంచి యచ్చెరు వంది సమీపించుచుండఁగాఁ దాంబూల పరిమళముచే గుమగుమ లాడు నొక వాయువు వీచెను. ఇట్టి పరిమళమునకు నాలవాల మగు నా భవనము మునినిలయము కా దని యెఱింగియు జనాన్వితముగదా, యందలి వారి యనుగ్రహముచేఁ దన యూరు చేరలేక పోదునా యని తలంచి యా భవనము చేరఁబోయి లోకోత్తర సౌందర్యరాశి యగు మరున్నారీ శిరోరత్నమును గాంచెను. ఆమె స్త్రీ యని యాతఁడు సంకోచింప లేదు. ఆమె మాత్రము "ఇలు సేర్చునుపాయం బొనరింపఁగఁ జాలు సుకృతి కాఁగూడదా? యని సమీపించెను. ముందు కవి వరూధినిని శృంగారరసస్వరూపిణిఁ గావించెను.

ఆమె పుట్టినది పాలసముద్రము, చంద్రుని చెల్లె లైన చెలువ యామెతోఁబుట్టువు. సకలవిద్యాశాస్త్రవిచార మామెకు సహజమైన విద్య. జంత్రగాత్రముల రాణించు గాంధర్వము నేర్చుకొన్న విద్య. త్రిమూర్తుల సభలు విద్యాప్రదర్శనశాలలు. రంభా తిలోత్త మాదులు ప్రాణసఖులు. మేరుపర్వతమునందలి కల్పవృక్ష వాటికలు విహారసీమలు. అశ్వమేధ రాజసూయాదియాగములు సల్పినవారికే యామె లభింపఁగలదు. ఈ విధముగ నతిదుర్లభ మైన స్త్రీరత్నముగా వరూధిని చిత్రింపఁ బడెను.

అనంతరము తదనురూప మైన పరిసరముల నిట్లు వర్ణించెను. ఆమె యింటిముందు లేత మామిడిగున్న గలదు. దాని మొదట మణులు తాపిన యరుఁగు గలదు. చల్లనిగాలి కొట్టుచుండఁగా నామె దానిపైఁ గూర్చుండెను. ఆ సుందరి చంద్రికావి పావడగట్టి దానిపై నాణె మైన

రవసెల్లా చుట్టి పైఁట వేసికొని చంద్రకాంతమణులు పొదిగిన పీటపైఁ గూర్చుండెను. వ్రేళ్లతో మీటునపుడు తంత్రులవలనఁ బుట్టిన నాదముతో నవ్యక్తమధుర మైన సన్నని కంఠనాదము లయించి, ముద్దులొలుకుచుండ నాలాపగతిఁ జొక్కి యరమోడ్పుఁగను దోయి రతిపారవశ్యవిభ్రమము దెలుపఁగా, వీణపైఁ బలికించు గీతప్రబంధములకుఁ జేతియందలి రత్నకంకణఝుణఝుణధ్వనులు తాళమానములు గొల్పుచుండ, మనోహరముగా వీణ వాయింపుచుండెను. ఎట్టి విరాగి కైనను జిత్తము మెత్తఁజేయు శృంగారసన్నివేశ మిందుఁ గవి ప్రతిభానిబద్ధమయ్యెను. ప్రవరుని ధర్మప్రవణత్వమును నిరూపించుట కిదియే సరియైన నికషస్థానము కాఁదలంచి కవి యాతని నీ పరిసరములలోనికిఁ దెచ్చెను.

ఆమె శృంగారమూర్తి. యతఁడతిలోకసుకుమార సుందరాకారుఁడు. ఒంటిపాటునఁ దనయింటి కరుదెంచెను. "వరూధినికి వంటయింటిలోఁ గుందేలు చిక్కినట్లైనది." ఎట్లూరకుండఁగలదు? ప్రణయరసము పొంగఁజొచ్చెను. నయనాంబుజములు వికసింపఁగా, కన్నులనుండి నల్లని కాంతులు పొంగిపొరలఁగాఁ జన్గవ గగుర్పొడవఁగాఁ గోర్కెలు గుబ్బటిలఁగా, నామె ప్రవరుని దిలకించెను. అతని జూచినపిమ్మట నామెకీ లక్షణము లుదయింప లేదు. చూపుతో సమముగా నివి పొడసూపెను. ఈ వర్ణనమున నామె రతిని సామాన్యముగా నిరూపించి యనంతర మామెకుఁ గల్గిన రతివికారములఁ గవి వర్ణింపఁజొచ్చెను. "చూచి ఝుణంఝుణత్కటక- అను పద్యమున సంచారిభావములను, తరువాతి మూఁడు పద్యములలో నామెకుఁ గల్గిన సాత్త్వికభావములను వర్ణించెను. రతి యిట్లు క్రమముగాఁ బుష్టి చెందుచుండ "ఎలని బఁటుగా మరుండక్కఁ గొనంగరాదె యనటా! నను నీఁడు పరిగ్రహించినన్" అని తలంచెను.

ఇట్లు మన్మథబాణపీడిత యై యగ్గల మగు పెంపత్తరమున లజ్జపై పెత్తఁగా దారి కడ్డముగా నిలిచెను. అట్లడ్డముగా నిల్చిన వరూధినిని

జేరఁ జని ప్రవరుఁడు సంభాషింపఁ దొడంగెను. ఈ సంభాషణములో కూడ ఆత్మవిశ్వాస మగ్గలము. కాని పోనుపోను ప్రవరుఁడు గడుసువాఁడై యాత్మవిశ్వాసము బడయుచుండఁగా వరూథిని కది యంతరించి దీనురా లగుచుండెను.

1. ప్రవరుఁడు వరూథినిని జేరం జని "అమ్మా! భయము లేక యొంటిమై యి వ్వనభూమిలోఁ దిరుగుచున్నదానవే, నీ వెవ్వతెవు? నేను బ్రాహ్మణుఁడను. ప్రవరుఁ డను పేరివాఁడను. మున మొక్క యి న్నగాగ్రమునకు వచ్చి త్రోవఁ దప్పితిని. నా యూరి మార్గము తెల్పుము. నీకు శుభం బగు"నని పల్కెను.

ప్రవరుఁడు సరళ స్వభావుఁడు. తన యొంటరితనమునకు భయపడఁ జొచ్చెను. మహిమాన్విత కావున వరూథిని యొంటరిగా నుండె నని తలంచి యీమె యెడఁ గూడ భయభక్తులతో మెలంగి తన యూరి త్రోవ చూపు మని యడిగెను.

వరూథిని తన విలాసవిభ్రమములచే నాతని వలపింపఁ జూచుచుండెను. పరవశీకరణమున వేశ్యలు చూపెడి చాకచాక్యము నీమె యం దద్భుతముగాఁ బెద్దన చిత్రించినాఁడు. తన్నుఁ జూచినంతనే యాతఁడు వశంగతుఁ డగునని యామె విశ్వాసము. అతఁ డట్లు కాకుండుటచేఁ గనుంగవ మెఱుఁగు లుబ్బఁ దాటంకములు, చనుఁగవయు, నడుము నడంకఁగా సెలవివాఱ విలాసముగా నొక నవ్వు నవ్వెను. "స్త్రీణాం మాద్యం ప్రణయవచనం విభ్రమో హి ప్రియేషు" అన్నట్లు తన విభ్రమములనే ప్రణయవచనముగాఁ బచరించెను. ఇంకొకఁ డైనచో నా నవ్వును జూచి యామెకు పాదదాసుఁ డయ్యెడివాఁడే. ఇట్లొనర్చినను ప్రవరుఁడు మాత్రము చలింపలేదు. ఆ ఛాందసునకుఁ దన విలాసము లర్థము కా లేదని యామె పలుకరింపఁ గడంగి "భూసురేంద్ర! ఒంటరిగా నున్న నన్నుఁ బలుకరింపవలె నని కాని లేనిచోఁ జెంపకుఁ జేరెఁడు కన్నులున్న వే నీవు వచ్చినత్రోవ నీకుఁ దెలియుదా? భయములేక యిట్లు పలుకుటకు

మే మంత చులుకనైతినా?" యని సాభిప్రాయముగా నుడివెను. ఇప్ప టికిని బ్రవరునియం దెట్టి వికారము గన్పడలేదు. తన యభిప్రాయము గ్రహించెనో లేదో యీ గోలయని స్పష్టప్రతిపత్తికై తన వృత్తాంతము దెలియఁజేసి "ఈ మనోహర ప్రదేశము లన్నియు నా విహార ప్రదేశము లు. నీవు మా యింటి విందవైతివి. ఇచట నేద దేటి యాతిథ్యమును బడసి పొమ్ము," "అని యాతిథ్యవ్యాజమును బ్రకటించియు నతనిపై వలపు నాఁపుకొనఁజాలక "అయ్యో! కుందనమువంటి శరీరము నడియెండ కెంతగాఁ గందిపోయినదో! ముద్దులొలుకు నీ మొగ మెంతగా వాడినది విశ్రాంతికై మా యింటికి వచ్చి మమ్ముఁ బవిత్రులఁ జేయుమని కోరెను.

ఇందు వరూథిని కాతనిపైఁ గల వలపు వ్యక్త మయ్యెను. మాయ లచే నాతని వశము గావించుకొను తలంపు స్పష్ట మయ్యెను. తన మాయ లు భగ్నమైనకొలఁది మనమున నెట్లు సమాధానపడుచున్నది తెల్ల మయ్యెను.

2. ప్రవరునకు మొదట నామె మాయమాట లర్థము కాలేదు. నిజముగాఁ దనకు నాతిథ్య మొసంగఁదలంచుచున్న దనుకొని నిజగృహ గమనవ్యగ్రుఁడై యిట్లనెను-" ఓ యింతీ! నీవు చేయు నతిథిసపర్యలు మాకు వచ్చినవి. మీ యింటికి వచ్చి యొకటి, రాక మఱియొకటి యునా? ప్రేమయే చాలును. మా ధ్యాహ్నికములకై త్వరగా నింటికిఁ బోవలెను. మీ మహత్త్వములు దివ్యములు. తలఁచుకొన్నచో నొక్క నిముసములో నన్ను మా యూరు చేర్పఁగలరు. కావున నో తల్లీ! నన్ను ప్రజలతోఁ గూర్పు మని వేఁడుకొనెను.

మా ధ్యాహ్నిక కర్మలు చెడిపోవు నని విచారించుటచేఁ బ్రవరుని గృహ్యకర్మాసక్తి తెలియనున్నది. తన పొందువలనఁ గల్గుసుఖముచే నూహింపఁదలఁచి తన వలలోఁ బడక మాటిమాటికిఁ దనయూరి దారి నడుగు ప్రవరునితో వరూథిని యిట్లనెను. "ఏమయ్యా! నీకుఁగాలు నిలు వదా? ఊరక యూరికిఁ బోవలె నని పల్కెదవు. ఇక్కడి రత్నకందర ములు, చంపకవనములు, గాంగసైకతములు, లవలీనికుంజములు మీకు

టీర నిలయములకు సరిరాకపోయెనా!'' అని తన యభిప్రాయమును ధ్వనింపఁ జేసి "చల్లకు వచ్చి ముంత దాఁపనేల'' యని విస్పష్టముగా "బ్రాహ్మణోత్తమా! నా మనము నీపైఁ జిక్కెను. నన్ను మన్మథున కు నప్పగించెదవో, పూవుపొదరిండ్లను కౌఁగిట గారవించెదవో నీ యిష్టము'' అని పల్కెను.

ఇచట వరూధినికిఁ బరాజయము కల్గెను. కాని యామె కది గోచరింపలేదు. ఛాందసుఁ డగుటచే స్పష్టముగాఁ జెప్పినఁగాని తన యభిప్రాయము ప్రవరునకుఁ దెలియ దని తలంచెను.

3. మీ మహత్త్వములు దివ్యము లని వరూధినిని బ్రవరుఁడు మొదట గారవించెను. ఆమె తన్ను గామించుచున్నదని గ్రహించిన పిమ్మట నీరసభావముతో "వనజేక్షణా! విచారింపక వ్రతు లైన బ్రాహ్మణులఁ బ్రేమింపఁదగునా? నే నిక్కడ నున్నచో సురార్చన, విప్రసపర్య, జననీ జనక సేవ మొదలగు గృహ్యధర్మములు చెడుటయే గాదు. ఆహితాగ్ని ని గావున నా శ్రౌతధర్మములకుఁ గూడ భంగము కలుగును. శ్రౌతధర్మములకు భంగము కల్గినచోఁ బ్రాయశ్చిత్తము చేసికొనుట మొదలగు నగచా ట్లెన్ని యో పడవలసివచ్చు నని తాత్పర్యము. కావున నింటికిఁ బోవలెను. దారి తెల్పు మని వేఁడెను. ఇందుఁ బ్రవరుని గృహ్య శ్రౌతకర్మనిరూఢియు, దానివలనఁ గల్గిన యింద్రియనిగ్రహము వ్యక్త మగుచున్నది. ప్రవరుఁడు తన్ను తెలిసియే నిరాకరించుఁచున్నాఁడని వరూధినికి స్పష్ట మయ్యెను.

తా నొకరి నిరాకరించుటయే గాని నిరాకృతి యన్న నెట్టిదో యెన్నఁడు నెఱుంగనివరూధినీ సమ్మోహనశక్తి నేఁడు కుంఠితమయ్యెను. ఆత్మవిశ్వాసము కొంత సడలి యొక మెట్టు దిగి మోహమున విన్నబాటు గాన్పింపఁగాఁ బ్రవరుని బ్రబోధింపఁదొడంగి "మన్మథాకారా! లేఁ బ్రాయము వైదికధర్మములయందు వినియుక్త మగుచో నీ వింక భోగములఁ బొందుట యెప్పుడు?'' అని పలికి నాకు భోగములతోఁ బని లే దని యాతఁడు నిరాకరించునేమో యని తలంచి యాతని భోగపర్వ

తమును నిరూపించుచు ని ట్లనెను-"శ్రౌతధర్మము లగు యజ్ఞములు పలు పుట స్వర్గము కోసమేగదా! ఆ స్వర్గము మా కవుఁగిళ్ల సుఖించుటకోస మే గదా! పరలోకమున నెట్టి భోగముల కాసించి మీరు యజ్ఞములు చేయుచుంటిరో యవి యిచ్చటనే యప్రయత్నముగా సిద్ధించుచుండఁ గా నీ శ్రమ యేల? మా భవనములో భోగములకు లోపము లేదు. మృగమదము, జవాజి, పచ్చకప్పురము, పన్నీరు, కుసుమకదంబమును, ఇంకను గల్పవృక్షము లొసంగు సంపదలు గలవు. కావున భోగపరుఁ డవై నన్ను గూడి సుఖముగా రమింపుము. కోరికను లభింపని గంధ ర్వాంగనల పొందు కా దను కొఱగామి యుండునా? మిక్కుటమైన వల పుచేఁ దమ గాలి సోకినంతనే కరఁగిపోవు స్త్రీలను గౌఁగిటఁ జేర్చు భాగ్య ము పెక్కుజన్మము లెత్తినఁగాని లభింపదు."

ప్రవరుఁడు నిరాకరించుచున్నకొలఁది యీామెకు మోహ మగ్గల మగుచున్నది. తన విలాసవిభ్రమము లాతని కర్థము కా లే దనుకొని స్పష్టముగాఁ దన వల పెఱింగించినది. అతఁడు దానిని స్పష్టముగా నిరా కరించినాఁడు. ఇపుడు ప్రవరుని ప్రబోధించి తనమాట నేర్పరితనముచే నాతని వశ్యుని గావింపఁదలఁచినది. తన పొందువలని సౌఖ్య మాతఁ డొనర్చు వైదికకర్మల ఫలమే గాని మఱియొకటి కాదు. అందువలనఁ దన్ను వలచుటవలన నాతనికిఁ గల్గు ప్రతిభంగ మేమియు లేదని చెప్పెను.

4. "స్వర్గకామో యజేత"- స్వర్గమును గోరువాఁడు యజ్ఞము చేయవలె నని వేదము లుద్ఘోషించుచున్నవి. స్వర్గకాముఁడై యజ్ఞమొ నర్చువానికి స్వర్గము తద్భోగములు సిద్ధించుమాట నిజమే. కాని ఫలా పేక్ష లేక నిష్కామముగా యజ్ఞములు చేయువానికిఁ జిత్తశుద్ధి కలిగి స్వర్గసుఖముకంటె నెన్నో మడుంగు లధిక మగు బ్రహ్మానందపదవి లభించును. ఫలాపేక్షచేఁ గర్మ లాచరించు కాముకుఁ డగు బ్రాహ్మణుఁ డింద్రియవశంగతుఁడై మన్మథశరశరవ్యుఁడై నశించును. కావున నీవు చెప్పినట్లు యజ్ఞములకు ఫలము స్వర్గభోగము లనుభవించుటయేగాదు. నిజ మగు ఫలము బ్రహ్మానంద మనుభవించుట. నేను దానికై పాటుపడు చుంటిని గావున నన్ను నిర్బంధింపక యెఱిఁగితేని నగరమార్గమును

జూపి పుణ్యమునఁ బొమ్ము." అని వరూధిని మాటలకుఁ బ్రవరుఁడు సమాధాన మొసంగి యితరప్రసంగమును వారించెను.

ఇందుఁ బ్రవరుని ధర్మాచరణ మెట్లుండెనో తెలిపి యాతఁ డుత్తమ బ్రాహ్మణునిగా నిరూపించినాఁడు కవి. వరూధిని దన్ను వశ్యుని గావింపఁదలఁచినకొలఁది యాతఁడు త్రాడువాఱుచున్నాఁడు. ఇంత నీచముగాఁ బ్రవర్తించు నీమె యెట్టి దివ్యకాంత యని యామెను దివ్య కాంతగాఁ బరిగణింపక సాధారణ మైన స్త్రీ జనముగాఁ దలంచి నీకుఁ దెలిసినచో నగరమార్గమును దెల్పుము. తెలియ కున్నచో నూరకుండు ము. నాకు మాత్రము బోధింపకు మని పల్కెను, ఇప్పటికిఁ బ్రవరునకు స్వపరతారతమ్యము తెలిసెనేగాని యాత్మ విశ్వాస మింకను కుదురు కొనలేదు. ఇల్లు చేరుట కింకను వరూధినీ సాహాయ్య మర్థించుచుండెను.

తాను కాంక్షించుచున్నది బ్రహ్మానందపదవి గాని యిహపర లోకభోగములు కా వని ప్రవరుఁడు వరూధినీవాదమును ఖండింపఁగా నాతని పల్కుల కామె బెదరియు మన్మథసంతాప మధిక మగుచుండు టచే నెట్లైనను నతనిని వశ మొనర్చుకొనవలె నని తహతహ పడు చుండెను.

ప్రవరుఁ డొంటిపాటున నున్నాఁడు. గొంటుతనం బెఱుంగఁడు. కంటి కింపుగాఁ దంగేటిజుంటివలెఁ గుఱంగట నున్నాఁడు.

కల్పతరుమధ్య మానినకైపు, నవయౌవనమదము, అసమాన సౌందర్యగర్వము నామెను దట్టుముట్టాడి వివేకభ్రష్ట నొనర్చెను. ఎది ఱిని దన్నుఁ దెలియనేర దయ్యెను. తన వైదగ్ధ్యమును మెఱసి యతని నవయౌవనసౌందర్యములఁ జూఱఁగొనవచ్చునుగదా యని యోజించె ను. వెనుకటివలె విడివిడిగాఁ గాక తన విలాసవిభ్రమములను, మాట నేర్పును, యుక్తివైచిత్రి నొక్కసారి చూపి యాతని లోఁగొనఁదలం చెను." ముఖవికాసము గనిపింపఁగా, కొప్పు చెక్కుచు, గబ్బిగుబ్బల ముత్యాలహారములఁ దీరుపడంజేయుచు, కుసుమకేసరంబుల రాల్చు నెపంబునఁ బయ్యెద విడల్చి చక్క నవరించుచు, అంత బోడసూపు చెలులం దలసూపకుండఁ జూపు జంకెనల వారించుచుఁ బ్రవరుని జేరి

యిట్లనెను. "ఏ విషయములందు నింద్రియములు మనస్సు నేకాగ్రమై నానందమును జెందుచుండునో, ఆ యానందమునే పరబ్రహ్మ మందురు. 'ఆనందో బ్రహ్మ' యను నుపనిషద్వాక్యమున కదియే యర్థము. అట్టి యానందము నా తోడి సమాగమమున సిద్ధించుచుండఁగా నీకు నన్య విచారములతోఁ బని యేమి?" అని మాట విన్నాణ ముట్టిపడఁ దన వాద బలముచే నాతని నోడఁబఱుచుటకుఁ బ్రయత్నించెను.

నిరాకరింపఁబడిన కొలఁది వరూథినికి మోహ మగ్గల మగుచుండెను. అందువలనఁ దనకుఁ గల్గిన పరాభవ మామె గ్రహింపలేకపోయెను. తన శక్తియుక్తుల నొక్కుమ్మడిఁ జూపి ప్రవరుని లోఁగొనఁదలంచెను.

5. తన్నోడఁ బఱుచు వరూథిని తత్త్వమును జూచి ప్రవరునకు మనమున సిగ్గు నసహ్యము జనించెను. నిస్పృహతోఁ దెల్పు చిఱునవ్వు నవ్వి యామెతో నిట్లనెను. "ఆనందో బ్రహ్మ" యను వాక్యమునకు బాగుగా నర్థము చెప్పితివి. ఈ పాండిత్యము నీకుఁ దక్క మఱియెవ్వరికైనఁ గలదా! కామశాస్త్రోపాధ్యాయిని వలె నున్నావు. ఓహోహో! వేదధర్మములు పాపములా? రతి పుణ్యమా? ఉపనిషత్తులకు మీ సంప్రదాయార్థము లివేగదా? హవ్యవాహనుఁ డొసంగు సౌఖ్యముల నెఱుంగక యిట్లు మాటాడుచుంటివి. నీవు చెప్పెడివి తుచ్ఛసుఖములు. అవి మీసాలపై తేనియలు. నాకు సరణులు, దర్శలు, ప్రియములైనట్టు లన్యములు గావు." ఇచట కవి ఉత్తమ బ్రాహ్మణునకు వలయు జ్ఞాన వైరాగ్యములు ప్రవరునియందుఁ బ్రదర్శించెను. వరూథిని చేష్టలు, మాటలు నతని కసహ్య మనిపించి యీసారి తన యూరికిఁ ద్రోవఁ జూపు మని యడుగలేదు. పరాపేక్ష క్రమముగా సంతరించెను.

ఏమి చేసినను ప్రవరుఁడు లొంగకుండుటచేఁ దన వైదగ్ధ్యము వ్యర్థ మయ్యె నని వరూథినికి హృదయము జల్లు మనెను. కన్నులలో నీరు గిఱ్ఱునఁ దిరిగెను. అతనిఁ జురచురఁ జూచుచుఁ దల యూఁచి గద్గదికతోఁ "వనిత తనంతఁ దా వలచి వచ్చినఁ జుల్కన గాదె యేరికిన్" అని దైన్యమును వెళ్ళఁబోసియు మన్మథోద్రేకము పొంగిపొరలుటచే "నన్నింక

దుఃఖపెట్టకు" మని పల్కుచు, నీవీబంధ మూడఁగా, కొప్పు వీడఁగా, శరీరము పులక లెత్తఁగా, నిట్టూర్పులు నిగిడించుచు ననునయాలాప దీనాస్యయై యతని గౌఁగిలించి యధరం బాసించె.

వ్యసనాసక్తులకుఁ బ్రయత్నవైఫల్యము జ్ఞానకారణము కాదు. ప్రయత్నములు విఫలమగుకొలఁది యభినివేశము మఱింత యతిశయించుచుండును. అందువలనఁ దన వైదగ్ధ్య మంతయు వ్యర్థమైనను నామెకుఁ దెలివి రాలేదు. ప్రవరుఁడు గోల గావున మోమోటపడుచున్నాఁడేమో యని తలంచి తానే బలాత్కారముగాఁ గౌఁగిలించినచో నాతని హృదయము కరంగకుండునా యని యూహించి యామె యతనిపైఁ బడెను.

నిరాకరింపఁబడినకొలఁది వరూధిని ప్రేమ యెట్లుత్కటస్థితిఁ గాంచెనో తెలియుచున్నది. ఆమె కామించినకొలఁది ప్రవరునకు నింద్రియ నిగ్రహ మధికమై పరాపేక్ష తగ్గుచుండెను. వరూధినికిఁ దన వైదగ్ధ్యము నందలి విశ్వాసము తగ్గెను.

6. వరూధినిని గౌఁగిలింపఁగాఁ బ్రవరుఁడు "హా! శ్రీహరీ" యని యోర మోమిడి యామె యంసద్వయముఁ బట్టి పొమ్మని వైచెను.

ఇందుఁ బ్రవరుని ధర్మవీరత్వము పరాకాష్ఠ వహించినది. వైదిక కర్మానుష్ఠానముచే నాతని కింద్రియనిగ్రహము, చిత్తశుద్ధియుఁ గుదురుకొని యున్నవి. తాను యువకుఁడై మోహనమూర్తియై, యువతియై మోహనమూర్తియగు నప్సరఃకాంత తన్ను గౌఁగిలింపఁగా మెత్తపడుటకు మాఱుగా గడుసువాఁడై, ఆమె శరీరస్పర్శ పాపముగా దలంచెను. పాపపరిహారమునకై "హా శ్రీహరీ" యని భగవంతుని ధ్యానించెను. ఆమెను జూచుటయు పాపమే యని తలంచి యోరమోమిడి దూరముగాఁ ద్రోసివైచెను. వీరి యిద్దఱి సంఘర్షణములోఁ బ్రవరుఁ డెక్కడ వరూధినీవాగురలలోఁ జిక్కుకొనునో యని పాత్రిలచాటున నుండి పొంచి చూచుచు, ప్రవరుఁ డామెను ద్రోసివైచుటను జూచి, సంతో

షముతో "కలంచునే సతుల మాయల్ ధీర చిత్తంబులన్'' అని పెద్దన ధర్మపతాక నెత్తెను.

ప్రవరునిచేఁ ద్రోసివేయబడిన వరూథిని పరాజయపరాభవ మొందెను. కాని మోహాంధురాలగుటచే దానిని గాంచలేకుండెను. వ్యసనపరులకుఁ బరాభవములు గోచరింపవు గదా! కోపశోకములతో నాతనిని జురచురఁ జూచినది. గొంతు సవరించుకొని "ఓ దయావిహీనుఁడా! నీవు త్రోసినప్పుడు నీ గోరుచ్చోట, దగిలి యెంత బాధపెట్టెనో చూడు''మని చూపి వేదన నెపంబిడి కన్నీటి బిందువులు జాల్గొన దీనముగా నేడ్చెను. ఇతరోపాయములు భగ్నమైనప్పుడు స్త్రీల కేడ్పే గదా, ప్రబల మైన కార్యసాధనము.

తా నట్లేడ్చినచోఁ బ్రవరునకుఁ జాలిపుట్టి పశ్చాత్తప్తుఁడై తనపైఁ గరుణ వహించు నని యామె యభిప్రాయము. ప్రవరునకు వరూథిని మాయలమారి యని స్పష్టముగాఁ దెలిసెను. ఆమెతో మాటాడుట యనుచిత మని తలంచి, మాటాడక యూరకుండెను. ఎంతకు నతఁడు దయ చూడకుండుటను గాంచి యామె నయనిష్ఠురము లాడఁ జొచ్చెను. "భూసురవర్య! దయలేని నీ జపతపములవలన ఫల మేమి? పుణ్యము లన్నియుఁ జేసినవాని కెట్టి సద్గతులు కల్గునో దయార్ద్రబుద్ధికా సద్గతు లెల్ల కలుగును. చదివినందులకు ఫల మీ రహస్య మెఱుంగుటయే. నా యెడ దయఁ జూపని నీ చదువు వ్యర్థము సుమా! నీ కంటె చదువుకొన్నవారు సైతము- పరాశరుఁడు, విశ్వామిత్రుఁడు, మాందకర్ణి, ఇంద్రుఁడు మొదలైనవారు పరవనితాసక్తులే గదా! వారికంటె నీ గొప్పతన మేమి? నిజ మారసినచో నినుపకచ్ఛడా ల్గట్టికొనిన మునిముచ్చులెల్ల మా యిండ్ల ముందఱ బందగాండ్లే గదా!

7. ఇప్పు డామెతో మాటలాడుటగూడఁ బాపమే యని తలంచి యామె పలుకుచున్నను బ్రవరుఁడు సమాధాన మొసంగలేదు సరిగదా అనుచితకారణ మని యామె మేనిజవ్వాదిపస కదంబించు నొడలు

కడిగికొని యాచమన మొనర్చి శుచియై గార్హపత్యవహ్నిని స్తోత్రి మొనర్చెను. వహ్నియుఁ దనవలె నిత్యనిర్మలుఁడైన ప్రవరుని శీలమునకు ముగ్ధుఁడై యినుండు పశ్చిమాంభోనిధిలోనఁ గ్రుంకకయ మున్న మందిరము చేర్చెను.

పరాపేక్ష యున్నంతకాలము ప్రవరునకు మోక్షము లేకుండెను. "ఎవరి మోక్షమునకు వారే కర్తలు" అను జ్ఞాన మాతనికి నుదయించెను. పరాపేక్ష యాత్మవిముక్తికిఁ గారణము కాకుండుటయే గాక బంధహేతు వనికూడఁ దెలిసికొనెను. భక్తిమై నగ్నిహోత్రుని మెప్పించి తత్ప్రపాదమున నిల్లు చేరెను. "ధర్మో రక్షతి రక్షితః" అని గదా పెద్దలు చెప్పినారు.

ప్రవరుఁడు బ్రాహ్మణ శ్రేష్ఠుఁడు. కాని యాతని యందొక లోపము కలదు. అతనికి లోకజ్ఞానము లేదు. లోకజ్ఞానము లేనివారికి స్వపర తారతమ్య వివేక ముండదు. అది లేనివారికి నాత్మవిశ్వాసము కలుగదు. ఏకాకియై హిమవత్పర్వతమునఁ జిక్కుపడి తన కర్తవ్యము తాను జూచుకొనుటలో నతనికి లోకముతో సంబంధము కల్గెను. తన్ను వంచింపనెంచిన వరూథినితోడి సంభాషణమున స్వపరతారతమ్యవివేకము కల్గెను. దారి చూపు మని వరూథిని నడిగి లాభము లే దని తన శక్తిపై నాధారపడి యిల్లుచేరుట కాతని కాత్మవిశ్వాసము కలిగెను. ఆత్మవిశ్వాసములేనివారిని మాయావులు వంచింపఁ జూతురు. ప్రవరున కాత్మవిశ్వాసము కుదురుకొనుటచే వరూథినీవాగురలలోఁ జిక్కుకొనక తరింపగల్గెను. ఇట్లు ప్రవరునియందలి లోపము తీఱి యతఁ డాదర్శ బ్రాహ్మణుఁ డయ్యెను. వేదవేదాంగ విజ్ఞానమే గాక లోకజ్ఞానముగూడ బ్రాహ్మణున కవసరమని కవి యిందు నిరూపించెను.

వరూథినీ ప్రవరుల గుణవైపరీత్యమును పెద్దనార్యుఁ డిం దద్భుతముగాఁ బ్రదర్శించెను.

| ప్రవరుఁడు. | వరూధిని. |
|---|---|
| 1. ఇతఁడు అంబురుహగర్భకులాభరణము | 1. ఈమె మరున్నారీ శిరోరత్నము |
| 2. ఇతనికి ధర్మపురుషార్థము ప్రధానము | 2. కామపురుషార్థము ప్రధానము |
| 3. ధర్మవీరుఁడు | 3. శృంగారాధిదేవత |
| 4. ఆత్మవిశ్వాసములేక కార్యసిద్ధికై పరుల నాశ్రయింపఁ దలంచుచుండును | 4. ఆత్మవిశ్వాస మధికము. తన వైదగ్ధ్యముచే నెట్టివానినైన లోఁగొందు నను ధైర్యము కలదు |
| 5. వరూధిని తన్నులోఁ గొనఁ దలంచినకొలఁది గడుసువాఁడై స్వతంత్రుఁడగుచున్నాఁడు. | 5. ప్రవరుఁడు నిరాకరించిన కొలఁది మోహ మగ్గలమై పరతంత్ర యగుచుండును. |
| 6. గృహ్య, శ్రౌత, ఉపనిషద్ధర్మ భంగమును జెప్పి వరూధిని పొందు తప్పించుకొనఁ బ్రయత్నించెను | 6. విలాస విభ్రమములు, సూచ్యార్థ సూచనలు, స్పష్టోక్తులు, యుక్తి ప్రతియుక్తులు చూపి ప్రవరుని పొందుఁబడయ యత్నించెను. |
| 7. ఆమెతో మాటాడుటగూడ మానహాని యని మానము వహించెను. | 7. అతని వశ మొనర్చుకొనుటకై తన చూపిన వైదగ్ధ్యము నిష్ఫలముకాఁగా నీమెయాత్మవిశ్వాస మంతరించెను. దైన్య మధిక మయ్యెను. అతని బతిమాలెను. నిర్బంధించెను. ఏడ్చి జాలి పుట్టింపఁ జూచెను. నయనిష్ఠురము లాడి తన కనుకూలుని గావింపఁదలంచెను. |

| | |
|---|---|
| 8. ఆమె కామించినకొలఁది యతనికి నిగ్రహ మధిక మయ్యెను | 8. అతఁడు నిరాకరించినకొలఁది యామెకు మోహ మగ్గల మయ్యెను. |
| 9. తనకు స్వతంత్రుఁడై కష్టవిముక్తుఁ డయ్యెను | 9. పరతంత్రయై కష్టముల పా లయ్యెను. |
| 10. 'ధర్మోరక్షతి రక్షితః' అను న్యాయమునకు లక్ష్యభూతుఁ డయ్యెను | 10. "వంచికో వంచితః" అను న్యాయమునకు లక్ష్యభూతు రా లయ్యెను. |



# వ్యక్తివివేకము

భాగవతుల కుటుంబరాయశాస్త్రి, ఎం. ఏ.,

అనుమితవాది:—మీ వాదము సుసంగతము కాదు. పైన మేము చెప్పినట్లు వస్త్వస్తరిత మగుచోటఁ జారుత్వ ముండదు. అందుచే నచట ధ్వని యున్న దనుట పొసఁగదు. వాచ్యార్థమునకును, ప్రతీయమానార్థమునకును నెచట వ్యభిచారిభావముగాని, అలంకారముగాని మాత్రమే వ్యవధాయకములుగ నుండునో, యచటనే ధ్వని నంగీకరింపవలయును. వస్తువు వ్యవధాయకముగ నున్నప్పుడు చారుత్వము లేకుండుటచే ధ్వని నంగీకరింపరాదు. "ఇచటఁ జారుత్వ మున్నది. ఇచట లేదు"-అని నిశ్చయించు విషయములోఁ గావ్యతత్త్వవిదులే ప్రమాణము.

వాచ్యప్రతీయమానార్థముల కొక వస్తువు మాత్రమే వ్యవధాయకముగ నున్న పద్యమున కుదాహరణము.

శిఖిపించకర్ణపూరా వధూః వ్యాధస్య గర్విణీ భ్రమతి
ముక్తాఫలరచిత ప్రసాధనానాం, మధ్యే సపత్నీనామ్. ♦

తా॥ ఒక కిరాతున కింతకుఁ బూర్వమే కొందఱు భార్య లున్నారు. ఇప్పుడు మఱియొక కాంతను బెండ్లియాడినాఁడు. పూర్వపు భార్యలందఱును ముత్యములయలంకారములను ధరించినారు. ఈ క్రొత్త భార్య నెమిలికన్నులను మాత్రమే కంఠాభరణముగా ధరించినది. అయినను, నీమె వారిముందుఁ జాల గర్వముతోనే తిరుగుచున్నది. పూర్వపు భార్యలమీఁద కిరాతున కధిక ప్రేమ లేదు. అందుచే నతడు వారితో నంతగాఁ గ్రీడించెడివాఁడు గాఁడు. దూరపు టడవుల కేఁగి, యేనుగులనుఁ గూడఁ జంపి ముత్యములఁ దెచ్చెడివాఁడు. ప్రస్తుత మట్లు గాదు. ఈ నవ

♦ శిఖిపింఛకర్ణపూరా= నెమిలియొక్క పింఛము మాత్రమే కర్ణాభరణముగాఁ గలిగిన, వ్యాధస్య, వధూః = కిరాతునియొక్క భార్య, ముక్తాఫలరచితప్రసాధనానాం= ముత్యముల యాభరణములు గల, సపత్నీనాం మధ్యే=సవతుల మధ్య, గర్విణీ= గర్వము కలదియై, భ్రమతి తిరుగుచున్నది.

వధువునకు, నెమిలియీకలనుమాత్రమే తెచ్చి యీయఁగలుగుచున్నాఁడు. అయినను నామె సగర్వముగ సవతులమధ్య తిరుగుచున్నది. దీని భావ మిది. ఈ నవవధువునం దత్యంతము కామాసక్తుఁ డగుటచే వ్యాధుఁడు దుర్బలుఁడై వన్యగజములనుఁ జంపలేక, మయూరములను మాత్రమే చంపఁగలుగుచున్నాఁడు. "ఇట్టితర భార్యలకంటె నితఁడు నాయందే యధికముగ నాసక్తుఁ డగుటవల్ల, నే నాతని నాకర్షింపఁగలిగితిని. ఇతర భార్యలకు నా కున్న సౌభాగ్యాతిశయము లేదు. నేనే యీ విషయమున వారి నతిశయింతును" అను తలఁపుతో నామెకు గర్వము కలిగినది.

ఇచట, ముందు (తృతీయవిమర్శమునందు) వివరింపఁబోవు రీతిని, వ్యాధుని నూతనవధువునందు సవతులకంటెను నధికముగఁ గల సౌభాగ్యాతిశయ మనుమేయము. ప్రధానమగు నీ యనుమేయమునకును వాచ్యార్థమునకును మధ్య "అవిరతసంభోగసుఖాసంగనిస్పృహత" (ఎల్లప్పుడును స్త్రీసుఖములయం దాసక్తిచే దుర్బలుఁ డగుట) యను మఱియొక యనుమేయముగు నర్థము వ్యవధాయకముగ నున్నది.- ఈ యనుమేయార్థమునకు "మయూరమును మాత్రమే చంపఁగల్గియుండుట" యనునది సాధనము. వాచ్యప్రతీయమానములకుమధ్య రెండు వస్తువు లుండు పద్యమున కుదాహరణము.

"వాణిజక హస్తిదన్తాః కుతోఽస్మాకం వ్యాఘ్రకృత్తయ శ్చ
యావ ల్లులితాలకముఖీ గృహే పరిష్వక్కతే స్నుషా."

[వాణిజక=ఓ వర్తకుఁడా !-యావత్ =ఎంతకాలము, లులితాలకముఖీ=చెదరినముంగురు లున్న ముఖముగలదై స్నుషా=కోడలు, గృహే=యింటియందు, పరిష్వక్కతే=తిరుగునో- (తావత్ =అంతకాలము) హస్తిదన్తాః=ఏనుగు దన్తములు, వ్యాఘ్రకృత్తయః=పులిచర్మములు, అస్మాకం=మాకు, కుతః=ఎట్లు లభించును-] దీని భావ మిది-ఏనుఁగు దంతములను బులిచర్మములను గొనుటకు వచ్చిన వర్తకునకు వృద్ధవ్యాధుఁడు తెలుపుచున్నాఁడు.-"నా కోడ లెపుడును చెదరిన ముంగురుల

తోనే నా యింటఁ గన్పడుచున్నది. ఆమెతో నిరతమును నా కుమారుఁడు సుఖాసక్తుఁడగుటచేతనే యామె ముంగురులట్లున్నవి. ఇట్లు నిరత సుఖాసక్తిచే నా పుత్రుఁడు దుర్బలుఁడైనాఁడు. ఈపరిస్థితులలో నాతఁడు సింహములను, పులులను వేఁటాడి చంపుట యెట్లు కుదురును ? కావున నా కోడ లీ యాకారముతో నున్నంతవఱకును హస్తిదన్తాదులు లభింపవని తెలిసికొమ్ము."

ఇట్లు చెప్పుటతో వ్యాధుఁడు, "నాత్ర తుషారస్పర్శః ధూమాత్" "ఇచట పొగ యుండుటచేఁ దుషారస్పర్శ లేదు," అను విధమున వ్యాపకమునకు విరుద్ధ మగు కార్య ముండుటను దెల్పినాఁడు.

యత్ర తుషారస్పర్శః తత్ర, అగ్నేరభావః- ఎచ్చట తుషారస్పర్శ యుండునో యచ్చట నగ్న్యభావ ముండును.- అను వ్యాప్తిలో తుషారస్పర్శ వ్యాప్యము. అగ్నియొక్క యభావము వ్యాపకము. ఈ వ్యాపకమునకు విరుద్ధ మగ్ని. ఈ యగ్నినుండి పుట్టిన దగుటచే నగ్నియొక్క కార్యమే ధూమము - "ఇచట తుషారస్పర్శలేదు" అని తెల్పుటకై, వక్త, పై వ్యాప్తిలోని వ్యాపకమునకు విరుద్ధ మగు నగ్నియొక్క కార్య మగు ధూమము నున్నట్లు వర్ణించినాఁడు. ఇట్లు వ్యాపకవిరుద్ధకార్యోపలబ్ధిని వర్ణించి, తుషారస్పర్శాభావమును సాధించినాఁడు.

ధూమాత్=పొగయున్నందువలన - "అనుటతోడనే" యత్ర ధూమః తత్రాగ్నిః" అను వ్యాప్తి ననుసరించి, అగ్ని యున్నదని యనుమిత మగును. అగ్నియుండుటచేఁ దుషారస్పర్శ యుండదు" అను ననుమితి తరువాత నుదయించును.

అటులే సమర్థుఁ డగు సుతుఁడు హస్తివ్యాఘ్రాదివ్యాపాదనపరాయణుఁడైనపుడే హస్తిదన్తాదులు లభించును. ప్రస్తుతము వ్యాధసుతుఁడు హస్తివ్యాఘ్రాదివ్యాపాదనపరాయణుఁడు గాఁడు. అందుచే హస్తిదన్తాదులు లేవు. ఇవి యన్వయవ్యతిరేకములు. ఇచట హస్తిదన్తాలుండుట యనునది వ్యాప్యము. సమర్థసుతకర్తృక మగు హస్తిదన్తవ్యాఘ్రాది వ్యాపాదన పరత్వము వ్యాపకము. ఇఁక హస్తిదన్తాద్యభావ

మును దెల్పుటకై, వ్యాపకమునకు విరుద్ధ మగు "స్నుషా సౌభాగ్యాతిశయ ప్రియుక్తమును, సవిరతసంభోగసుఖాసంగజనితమును నగు స్వసుతునియొక్క నిస్పృహత్వమును వ్యక్తము సేయఁ దలఁచి, దానికిఁ గార్య మగు విలులితాలకముఖిత్వమును వాచ్యముగఁ జెప్పినాఁడు ఈ విధముగ హస్తిదన్తాద్యభావమును సాధించినాఁడు. [ఇచట విలులితాలకముఖిత్వము వ్యాపక విరుద్ధకార్యము. దీనినుండి కారణ మగు సుతనిస్పృహత్వము నూహించుచున్నాము-(1) ఈమె విలులితాలకముఖిత్వ, మాతని నిరత సంభోగాసక్తిని, తజ్జనిత మగు దౌర్బల్యమును సూచించును. సంభోగమువలననే ముంగురులు చెదరియుండు ననుభావ మిట గ్రాహ్యము. లేదా - (2) వ్యాధసుతుఁ డీమెతో రమించుచుండుచో నీమె ముంగురుల నలంకరించుకొనెడిది. అత్యస్త సుఖాసంగముచేఁగాని, లేక సహజ నిస్పృహత్వముచేఁగాని యాతఁ డిపు డీమెతో రమించుటలేదు. అందుచే నామె యకృత ప్రసాధనయై యున్నది. ఏమైనను, నామె విలులితాలకముఖి యగుట కాతని నిస్పృహత్వమే హేతువు.-]

ఇచటఁ గోడలు "విలులితాలకముఖి" యను నర్థము వాచ్యము. (ఇదియే వ్యాపకవిరుద్ధకార్యము) దీనినుండి వ్యాధసుతుని దౌర్బల్య మనుమిత మగుచున్నది. (ఇదియే వ్యాపకవిరుద్ధకారణము). దీనినుండి వ్యాధసుతుఁడు హస్త్యాదులను జంపుటలేదను విషయ మనుమిత మగును. అట్లనుటచే హస్తిదన్తాదులు లభించుటలేదను విషయము తుద కనుమేయమై సాధ్యసిద్ధి కలుగుచున్నది. ఇచట వాచ్యానుమేయార్థములకు మధ్య (1) వ్యాధసుతుని దౌర్బల్యము (2) వ్యాధసుతుఁడు హస్త్యాదులను జంపకుండుట" యను రెండర్థములు వ్యవధాయకములుగ నున్నవి.

వాచ్యానుమేయములకు మధ్య మూఁడు విషయము లున్న పద్యము

"విపరీతసురతసమయే బ్రహ్మాణం దృష్ట్వా నాభికమలే
హరే ర్దక్షిణనయనం చుమ్బతి హ్రియాకులా లక్ష్మీః"

[లక్ష్మ్యాః=లక్ష్మికి, విపరీతసురతసమయే=పురుషాయిత రతియందు, నాభికమలే=విష్ణువుయొక్క నాభికమలమునందు, బ్రహ్మాణం దృష్ట్వా=బ్రహ్మనుజూచి, హ్రియా=సిగ్గుతో ఆకులా=కలతం జెందినదై, హరేః=విష్ణువుయొక్క, దక్షిణనయనమ్=కుడికన్నును, చుమ్బతి=ముద్దిడుకొనుచున్నది.]

లక్ష్మి పురుషాయిత క్రీడయం దున్నప్పుడు, నాభికమలమున నున్న బ్రహ్మను జూచి సిగ్గిలినది. వెంటనే విష్ణువుయొక్క కుడికన్ను ముద్దిడుకొన్నది. సూర్యుడు విష్ణువునకు కుడికన్ను. ఆ కుడికన్నును లక్ష్మి ముద్దిడుకొనుట యనగ కన్నుమూసికొని పోయినది. అనఁగా సూర్యుడ స్తమించునన్లే. సూర్యాస్తమయ మగుటచే నాభికమలము కూడ ముకుళించుకొనినది. అపు డాకమలములోని బ్రహ్మ కేమియుఁ గన్పడదు. లక్ష్మికి బ్రహ్మయును గన్పడఁడు. అందుచే లక్ష్మికి సిగ్గు తొలఁగినది, అని దీని భావము.

ఇచట లక్ష్మీలజ్జానివృత్తి సాధ్యము, సూర్యరూప మగు విష్ణువుయొక్క దక్షిణనేత్రమును లక్ష్మి ముద్దిడుకొనుట సాధనము. ఈ సాధనమువలన, నేత్రతిరోధానలక్షణ మగు సూర్యాస్తమయ మనుమిత మగుచున్నది. ఈ యనుమేయమునుండి నాభినలినసంకోచ మనుమిత మగుచున్నది. దీనినుండి బ్రహ్మ కన్పడకుండుట లేక బ్రహ్మ తమ సురత క్రీడను జూడకుండుట యను విషయము సిద్ధించుచున్నది.-

ఇట్లు విష్ణు దక్షిణనేత్రమును లక్ష్మి ముద్దిడుకొనుట యను వాచ్యార్థమునకును, లక్ష్మీలజ్జానివృత్తి యను వ్యంగ్యార్థమునకును మధ్య, సూర్యాస్తమయ, కమలసంకోచ, బ్రహ్మాదర్శన వ్యవధానములను

---

పత్యుః శిరశ్చన్ద్రకలా మనేన స్పృశేతి సఖ్యా పరిహాసపూర్వమ్
సా రఞ్జయిత్వా చరణౌ కృతాశీః మాల్యేన తాం నిర్వచనం జఘాన॥

ఈ పద్యమునందు 45-46 పుటలలోఁ జెల్పినరీతిని-తాం నిర్వచనం జఘాన=పలుకకయే, ఆమెను పూలమాలతోఁ గొట్టెను- అను వాచ్యార్థమునకును, గౌరికి, శివునియం దాభిలాషికశృంగార మున్నదను ననుమేయార్థమునకును మధ్య కౌతుకౌత్సుక్యప్రహర్షలజ్జాది వ్యభిచారిభావము లనుమేయములై యున్నవి.

మూఁడు విషయము లున్నవి. ఇట్లీ యనుమేయార్థ పరంపరగల కావ్య నం దనుమేయార్థజ్ఞాన మిన్ని యుపాయముల నధిరోహింపఁగలిగియుం డదు. అందుచే రసాస్వాదమును సమీపింపనైన సమీపింపలేదు. ఇట్లగుటచే నిట్టి కావ్యములు ప్రహేళికలతోఁ దుల్యములే కాని ధ్వనికావ్యములు కా లేవు. కావున- "అర్థ"శబ్దము వాచ్యప్రతీయమానో భయార్థ విషయక మని చెప్పినను, ధ్వనిలక్ష్యములు కాని పద్యముల యందుఁగూడ నా లక్షణము సమన్వితమగుచుండుటచే ధ్వనికర్తలు చెప్పిన ధ్వని లక్షణమున కతివ్యాప్తి తప్పదు.-

వ్యభిచారిభావవ్యవహితమగు పద్యమున కుదాహరణము.

అలంకార వ్యవహితమైన కావ్యమున కుదాహరణము.

లావణ్యకాన్తి పరిపూరిత దిఙ్ముఖేఽస్మిన్
స్మేరేఽధునా తవ ముఖే తరలాయతాక్షి
క్షోభం య దేతి న మనాగపి తేన మన్యే
సువ్యక్త మేవ జడరాశి రయం పయోధిః"

హే తరలాయతాక్షి=చంచలములును విశాలములు నగు నేత్రములు కలదానా! లావణ్యకాన్తి పరిపూరిత దిఙ్ముఖే=లావణ్యముచేతను, కాన్తి చేతను నింపఁబడిన దిశాముఖములు గలిగినట్టియు, అధునా=ఇప్పుడు (కోపమువలనఁ గలిగిన యరుణిమ శాంతించినపిదప) స్మేరే=వికసించి (ప్రసన్నమై) యున్నట్టియు, తవ, ముఖే=నీ ముఖ ముండఁగా, (నీముఖమును జూచియు నని భావము) అయం పయోధిః-ఈ సముద్రము, మనాగపి=కొంచెమైనను, క్షోభం=కలఁతను (మన్మథవికారమును) లేక పొంగుటను, యత్=ఎందువలన, న ఏతి=పొందుటలేదో, తత్-అందు వలన, సువ్యక్త మేవ=స్పష్టముగనే, అయం=ఈ సముద్రము, జడరాశిః=జాడ్యసంచయ మని (మూఢుఁడని)-లేక జలరాశియని, మన్యే తలఁచుచున్నాను.

ఇచట ప్రసన్నమైన నాయికముఖమును జూచియు సముద్రము పొంగుట లే దనుటచే ముఖము పూర్ణచంద్రుఁడై యుండవలయు నను

భావ మనుమిత మగుచున్నది. ముఖము పూర్ణచంద్రుఁడే యను భావము కలుగుటకుముందు ముఖచంద్రుల కైక్యారోప మై యుండవలయును. ఉపమానోపమేయముల కైక్యారోపము రూపకాలంకారము. ఈ యలంకార మిచట ననుమితమే గాని వాచ్యము గాదు. కావునఁ జంద్రుఁడను ప్రతీయమానార్థమునకును, సముద్రము పొంగుట లేదే యను వాచ్యార్థమునకును మధ్య రూపకాలంకార మనుమిత మగుచున్నది. ఇచటఁ జంద్ర విషయకజ్ఞానమునే ధ్వనివిషయముగా నంగీకరింప వలయును గానీ, మిగిలినవానిని ధ్వనివిషయములుగ నంగీకరింపఁగూడదు.

ఆక్షేపము:—వస్తువు, వ్యభిచారిభావము, అలంకారము వీనిలో నేది యైనను వాచ్య ప్రతీయమానములకు మధ్య, వ్యవధాన మున్నట్లే గదా ! వ్యవధాన ముండుట యనువిషయమున విశేషము లేనప్పుడు, వ్యభిచార్యలంకారములు వ్యవధాయకము లైనపుడు చారుత్వ ముండు ననియు వస్తువు వ్యవధాయక మై నపుడు చారుత్వ ముండ దనియుఁ జెప్పుటలో నౌచిత్య మేమి ?

సమాధానము:—వస్తువు-అలంకార వ్యభిచారి భావములకంటె భిన్న మగు జాతికి సంబంధించినది. అగ్ని మొదలగువానికంటె ధూమము మొదలగు నవి యెట్లత్యన్తభిన్నములో,యట్లే,వస్తువనునది యనుమేయార్థ మగు రసముకంటె నత్యన్త విలక్షణస్వభావ మైనది. వ్యభిచారిభావాదు లన్ననో,యనుమేయార్థముయొక్క ఛాయ ననుసరించియుండును. అనుమేయార్థ మగు రసముచే నుపరక్తము లైనవివలెఁ దదాలింగితము లైనవివలె నుద్భాసించును. అందుచే ననుమేయార్థముకంటె నత్యంత విలక్షణము లైనవి కావు. అందుచే వ్యభిచారిభావ వ్యవధానము, వస్తువ్యవధానముకంటె భిన్నజాతీయము. అలంకారమునకును నలంకార్య మగు రసమునకును నాశ్రయాశ్రయిభావ ముండుటచే, నలంకార్య మగు రసముకంటె విభిన్నముగ నుండదు. అందుచే నలంకారవ్యవధానముకూడ వస్తువ్యవధానముకంటె భిన్న మైనదియే. ఇప్పటికిఁ దేలిన దే మన నర్థశబ్దమునకు, వాచ్యప్రతీయమానార్థములు రెండును నర్థములే యగుచో

వాచ్యానుమేయార్థములకు మధ్య రెండు లేక మూఁడు వస్తువులు వ్యవధాయకములుగ నున్నచోట ధ్వనిలక్షణమున కతివ్యాప్తి వాటిల్లును. అ దిచట నతివ్యాప్తి కాదనియు ధ్వనిలక్షణము పట్టవచ్చు ననియు సందురా? అగుచోఁ బ్రహేళికాదిరూపము లగు పద్యములుకూడ ధ్వని కావ్యములే, కావలసివచ్చును.

ధ్వని లక్షములో "అర్థ" శబ్దము ప్రయోగించుటవలన సంభవించిన దోషముల నిప్పటికి వ్యక్తివివేకకర్త చూపినాఁడు. ఇంతవఱకుఁ జెప్పిన విమర్శయొక్క సారము నీ సంగ్రహ శ్లోకములలో నిరూపించినాఁడు.

"య ద్యర్థ ఇతి వాచ్యోఽర్థోఽభిమతోఽవ్యాప్తిరేవ సా
మే నైవం వాదినీత్యాదా వర్థస్యార్థాన్తరా ద్గతిః
అథోభౌ, తర్హ్యతివ్యాప్తిః ద్విత్రివస్తువ్యవాయిని
ప్రహేళికాదిరూపేఽపి, కావ్యే ధ్వన్యాత్మతా యతః॥
(సంగ్రహశ్లోకములు.)

కేవల మిచ్చటనే వాచ్యవ్యంగ్యార్థము లుభయములును గావ్యాత్మ యగు నని చెప్పుట యుక్తియుక్తముగ లేదు. ప్రతీయమానార్థమే కావ్యమునకు జీవితభూతము. ప్రధానముగ నదియే, ధ్వని యగుట యభీష్టవిషయము. అందుచేఁ బ్రతీయమానార్థ మొకటియే యిచట నర్థశబ్దమున కర్థ మనుట యుక్త మగును. ధ్వనికర్తయే "కావ్యస్యాత్మా ధ్వని రితి", "కావ్యస్యాత్మా స ఏవార్థః ఇతి", "ప్రతీయమానాత్వన్యైవ భూషా లజ్జేవ యోషితః"- అను శ్లోకములలో నీ యభిప్రాయమునే తెల్పినాఁడు. కావున, మేము చూపిన దోషములు, ధ్వనిలక్షణములో నుండకుండుటకై, "అర్థఃసహృదయశ్లాఘ్యః కావ్యాత్మా, యో, వ్యవస్థితః" అను శ్లోకమున, "కావ్యాత్మా యో వ్యవస్థితః" అనుటకు బదులుగ "యః కావ్యస్య వ్యవస్థితః" అని పాఠ ముండుట యుచితము.

# భీమేశ్వర పురాణము - కావ్యత్వము

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

ఇచట సంస్కృతమూలములో,

"మంత్రైః పంచాననం పంచబ్రహ్మపంచాక్షరాదిభిః
పూజయంతి ప్రతిదినం భక్త్యా బిల్వదళై ర్నవైః
నిష్ఠాపరాః కీర్తయంతి వేదమంత్రై స్సురద్విషః
తథా పురాణమంత్రైశ్చ విశ్వైకస్తుత్య మీశ్వరమ్."

అని పంచప్రణవములతోఁ గూడిన పంచాక్షరీమంత్రములచేఁ బరమేశ్వరునిఁ బూజించి రని యుండఁగా, శ్రీనాథుఁ డా పంచాక్షరీమంత్రమును ప్రాసాదపంచాక్షరినిగా నిరూపించుటచే, శ్రీనాథుఁ డుపాసించిన మంత్రము ప్రాసాదపంచాక్షరి యని స్పష్టముగఁ దెలియవచ్చుచున్నది. ఈతఁడు ఆ ప్రాసాదపంచాక్షరితో మంచుంగొండయనుంగుఁబెండ్లికొడుకును బూజించినవాఁడు. గావుననే పరమేశ్వరుని యెడ నింతటిభక్తిభావము.

ఇట్టి భక్తితో దానవులు పరమేశ్వరు నారాధించి వరములు వడసి యుద్రేకించి, దేవతలను హింసింప మొదలుపెట్టఁగా వారు భీమనాథుని రక్షింపు మని వేడుకొనునవసరమున వారిచేఁ జేయించిన స్తుతి వేదాంతసారము. భక్తిరసభరితమును. ఇచట శ్రీనాథునకు వేదాంతశాస్త్రమునందుఁ గల పాండిత్యవిశేషము వ్యక్తమగుచున్నది.

దేవతల మొఱ విని పరమేశ్వరుఁడు దివ్యరూపమున నావిర్భవించిన రీతియు భక్తిభావభరితము; అతి విస్తృతము. కైలాసవాసి సర్వాంగశృంగార మొక్క విస్తృతమైన వచనమునందుఁ జిత్రితమైనది. అతని పారమేశ్వరరూపమున కొక ప్రతికృతి నిర్మితమైనది. ఆతరువాత భీమనాథుఁడు త్రిపురాసురసంహారమున కాయత్తపడినప్పుడు స్మరణమాత్రమున సమకూడిన సన్నాహము నిట్లు వివరించినాఁడు.

సీ. జలరాశిమేఖలావలయంబు రథ మయ్యె
రవియుఁ జందురుఁడుఁ జక్రంబు లైరి
శారదాజీవితేశ్వరుఁడు సారథి యయ్యె
శ్రుతులు నాలుగును వారువము లయ్యెఁ
బ్రణవమంత్రైకాక్షరము ప్రతోదం బయ్యెఁ
దారకావీథి పతాక యయ్యె
రత్నసాను ధరాధరము ధనుర్లత యయ్యె
నాగప్రధానుండు నారి యయ్యె
గంధవాహంబు లేడును గఱులు గాఁగ
విలయకాలానలజ్వాల ములికిగాఁగ
లచ్చిచనుదోయికుంకుమ పచ్చనయుగఁ
బాలమున్నీటియల్లుండు బాణ మయ్యె. ౪-౧౪౦

త్రిపురసంహారసమయమునందట్టిసామగ్రి సమకూడుటను మహిమ్నస్తవమునందును పుష్పదంతుఁ డీక్రిందిశ్లోకమునఁ దెలిపియే యున్నాఁడు.

శ్లో. రథః క్షోణీ యంతా శతధృతి రగేంద్రో ధను రథో
రథాంగే చంద్రార్కౌ రథచరణపాణిః శర ఇతి,
దిధక్షో స్తే కోఽయం త్రిపురతృణ మాడంబరవిధి
ర్విధేయైః క్రీడన్త్యో నఖలు పరతంత్రాః ప్రభుధియః.

త్రిపురాసురసంహారమున విష్ణువు బాణ మగుట వేదములందును బురాణములందును శివభక్తుల స్తవములందును నన్నిటను నేకరూపమున నుండిన విషయమే. శ్రీనాథుఁడు వర్ణించినపుడు మాత్రము "లక్ష్మీకుచకుంకుమాలిప్తుఁడైన క్షీరసముద్రజామాతయల్లుఁడు బాణ మగుట" విశేషము.

కావుననే శంకరుఁ డట్టహాసంబు సేసి యమ్మహాస్త్రంబు నేయఁగా నారాయణాస్త్రవహ్ని త్రిపురదైతేయుల యంతఃపురకాంతలందు వింతచేష్టలు గావించినది. ఈ చేష్ట లన్నియు శ్రీనాథుఁడు చేయించినవియే. పాలమున్నీటియల్లుఁడు గావుననే యాసిచే నిట్టి శృంగారచేష్టలం రావిరసము సహముఁ జేయించినాఁడు మన వాఁడు.

సీ. కరపల్లవంబులు కబళించుఁ గబళించి
ప్రబలనితంబభారముల వ్రాలుఁ
జెక్కుటద్దములపైఁ జెరలాడుఁ జెరలాడి
శ్రవణావతంసమంజరులు ముట్టు
వలిచన్నుఁగవలపైఁ బొలపాడుఁ బొలపాడి
నాభిరంధ్రములపై నటన సేయు
వేణీభరములపై విహరించు విహరించి
బింబాధరములపై బిత్తరించు
నభవుకరముక్త నారాయణాస్త్రవహ్ని
కాముకుని కోమలాంతసంగంబు పగిదిఁ
దెగువమీఱంగఁ ద్రిపురదైతేయరాజ
సదనశుద్ధాంతభామినీ జనములందు. ౪-౧౪౦.

భీమనాథుఁడు త్రిపురాసురసంహారము చేయుటకై దివ్యస్యందనం బెక్కి బయలుదేఱునపుడు యాత్రాసన్నాహము రాజవీథిలో నడిచినది. ముత్తైదువలు సేసలు చల్లుట, వేత్రహస్తులు బరాబరి సేయుట, అంతరిక్షమునుండి దుందుభిధ్వనులతోఁ బుష్పవృష్టి కురియుట, మునిబృందము జయజయధ్వనులు గావించుట మున్నగునవి వీరరససన్నాహమునకు సరిపడినట్లు నడిచినవి. ప్రబంధమునకు యాత్రావర్ణనము సమకూడవలెఁ గదా !

సీ. సరి బ్రాహ్మి మొదలైన సప్తమాతృకలు ద
గ్గూడ సేసలు చల్లె గోగులమ్మ
పసిఁడి వేత్రము పట్టి పాతాళభైరవుం
డందంద సందడి నపనయించె
దివ్యదుందుభినాద దీర్ఘగర్జితముతోఁ
గురిసె మిన్నున నుండి కుసుమవృష్టి
జయజయధ్వని దేవసంయమీశ్వరకోటి
సంఘటించెఁ గరాంబుజంబు నొసలఁ

త్రిపురసంహార మొనరింప దీక్షచేసి
భీమనాథేశ్వరేశ్వరస్వామి శివుఁడు
దక్షవాటీవిభుఁడు మేరుధనువు పట్టి
యేచి పంటవలంతి తే రెక్కనపుడు.

భూమి రథమై మేరువు ధనుస్సయిన దనిగదా యీ వర్ణనము. పర్వత రూపమైన ధనుస్సును బరమేశ్వరుఁ డెట్టు లెక్కుపెట్టెనా? యను సంశయ మెవ్వనికైనఁ బొడమక మానదు. కాని యట్టి సంశయ తీర్చినాఁడు కవి. అదియు సరిపడియే యున్నది.

క. ముక్కంటి మేరుచాపం
బెక్కిడి సారించెఁ బన్నగేంద్రగుణంబుల్
మక్కువ హిమగిరికన్యక
క్రిక్కిఱిసిన కుచము లలము కేలుందమ్మిన్. ౪-౧౩౧

పరమేశ్వరుడు గిరిరాజసుతయొక్క క్రిక్కిఱిసిన కుచములను సారించు హస్తపద్మముతో మేరుధనువు నెక్కిడఁ గల్గుట యాశ్చర్య మేమున్నది? పర్వతము లన్నిటికంటె మేటిగదా హిమవంతుఁడు. వాని కూఁతురగు పార్వతియాకృతి యామెకుచములు పర్వతప్రతిమములే యయి యుండును గదా! అవియును క్రిక్కిఱిసినవి. వానితో నిత్యము విహరించు నలవాటుగల కరముతో బంగారుకొండను వంచుటలో శ్రమ యంతగ నుండ దనుట యెంతయుఁ బొసగియున్నది. ఇట్టి కల్పనలోఁ గావ్యత్వ ముట్టిపడును గదా!

అట్టి ధనుస్సునకు నారియయిన శేషు నెక్కుపెట్టుటలోఁ గూడ నున్నితమైన భావసంపద, కల్పనాసమృద్ధి యేర్పడినది.

సీ. కమ్మనూకిన నూత్నకలధౌతమును బోలెఁ
జక్కంగ నిక్కి మైసొక్కు మాని
నంతరాంతరములం దస్థిబృందంబులు
పెళపెళ మనియెడు గిలుకు లెసఁగెఁ

బగిలి బీటలువాఱి తగడై త్తెఁ గుబుసంబు
తోరంపు వెల్లుల్లితునుక లట్లు
మహనీయతరఫణామండలంబులు లేఁత
చిగురుటాకుల ఛాయ జేగురించె
హాటకాద్రి ధనుర్దండ కూటకోటి
వంచి బాహావలేప దుర్వారలీలఁ
గాలకంఠుండు త్రిపురసంక్షయ మొనర్ప
నెక్కు వెట్టిన యపుడు భోగీశ్వరునకు. ౪. ౧౩౦.

కాలకంఠుఁడు మేరుధనుర్దండమునకు సరిపడిన పన్నగాధీశుని నారిగాఁ గొని, వింటిబద్దను వంచి యల్లెత్రాటిని ధనుర్దండమునకు ఎక్కువెట్టు నప్పుడు వాసుకిశరీరము కమ్మచ్చులాగిన క్రొత్తబంగారువలె శరీరము నందలి ముడుతలు పీడినది. నడుమ నడుమ నెముకలు పెళపెళమని విఱిగినవి. కుబుసము బీటలువాఱి వెల్లుల్లిరేకలవోని పొరలు రేఁగినది. వెడఁదయైన పడగలు లేఁతచిగుళ్ళవలె నెఱ్ఱవాఱినవి. ఈ వర్ణన మెంతయు సహజముగఁ గొనసాగినది. దృశ్యము సాక్షాత్కరించునట్టితీరు, దానితోపాటు కాలకంఠుని బాహావలేపము పాఠకులకుఁ బ్రత్యక్షమైనట్టు లున్నవి.

పరమేశ్వరుఁడు ధనుష్టంకారము చేసినప్పటి యాటోపము వీరరసోత్తేజకమై వెలసినది. రసానుగుణమైన శైలీపాటవముకూడ నీ క్రింది పద్యమునం దెసలారినది. వృత్తముకూడ సరిపడినట్లు నడచినది.

మ. గిరిశస్థూలభుజాపరీత విభవక్రీడా సమాస్ఫాలిత
స్థిరబాణాసన గూఢపాద్గుణలతా దీర్ఘోగ్రఘోషంబునన్
ధరణీచక్రము దద్దిరం దిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె నం
బరముం దిక్కులు వ్రయ్యలయ్యెఁ బగిలెన్ బ్రహ్మాండభాండంబులున్.

అట్టి యాటోపముతో నారాయణుని బాణముచేసి, పాశుపతాస్త్రంబు సమంత్రకంబుగా నభిమంత్రించి, ఫాలలోచనాగ్నిశిఖలతో జోడించి వేయఁగా నమ్మహాస్త్రపాతమున లోహమయమైన త్రిపురాసురుల

మూఁడునగరములు కరగిపోయి మూఁడుముద్దలుగఁ దయ్యారైనవి. పురములలోని భోగోపకరణము లన్నియు భస్మమైపోయినవి. ప్రాసాదములు కేళీదీర్ఘికలు బాహ్యాభ్యంతరకక్ష్యలు ఉపవనములు నన్నియు దగ్ధములై పోయినవి. కాని యచటి కాలాంతకలింగ మొక్కఁడుమాత్రము చెక్కుచెదరక యుండెను. ఆ త్రిపురాసురుల సర్వస్వము భస్మమైపోయినపుడు వారల కుపాస్యమైన పరమేశ్వరలింగము చెడకుండుట వింతగదా! అది శ్రీనాథుని నోట వింతలలో వింతగా వినవచ్చినది.

మ. అమరాధీశ సమర్పితంబులగు లీలారామకల్పద్రుమ
ప్రసవంబుల్ కసుగందవయ్యె; విలసత్పాటీరగోరోచనా
ఘుసృణాలేపన పంకిలాకలనమై గుంఫించె నారాయణా
స్త్రసముజ్జృంభణ భీమలింగమునకున్ దైత్యేయరాట్స్వామికిన్.

నారాయణాస్త్రసముజ్జృంభణమున త్రిపురాసురుల కుపాస్యమైనభీమలింగమునకు ఇంద్రుఁడర్పించిన కల్పసుమములు కసుగందనేలేదఁట. దైత్యకులాంగనలయెడఁ గాముకునిలీల వర్తించిన యా నారాయణాస్త్రము ఆ లింగమునకు చందనకర్పూర కస్తూరికాదిలేపన పరిపాటిని సమకూర్చిపెట్టినదఁట.

ఇట్టి యద్భుతము లావహిల్లఁగఁ గాలకంఠుఁడు త్రిపురాసుర సంహారము గావించి, జయలక్ష్మిని బరిగ్రహించి, యుద్ధసాధనము లన్నిటిని యథాస్థానమునకుఁ బంపివైచెను. గంధర్వాదులు మహాపదానమగు త్రిపురాసురసంహారము గానముచేయుచుండఁగ సంతోషాతిరేకమున—

శా. ఆడెం దాండవ మార్భటీపటహాలీలాటోపవిస్ఫూర్జిత
క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుండు జూటాటవీ
క్రీడాఘాతకఠోరకోటకరుటీ కోటీలుఠచ్ఛిందుభీ
చీడోలాపటలీ పరిస్ఫుటతర స్ఫీతధ్వనిప్రౌఢిమన్. ౪-౧౪౮.

ఈ శివతాండవములో శ్రీనాథుని కావ్యరచనయు మహార్భటితోఁ దాండవించినది. శైలిలో గంగాతరంగిణీతరంగధ్వనిప్రౌఢిమలు ప్రతిశబ్దించినవి. శివతాండవ మెదురుగ సాక్షాత్కరించినది. ఇట్లు శంకరాపదానము

లలో వీరరసపరిస్ఫూర్తితో వెలసిన యీ త్రిపురాసుర సంహారము,తదు పాస్యదైవతమైన లింగమే పంచారామములందు పంచలింగములై వెల యుటకు మూలమై, భీమేశ్వరపురాణమునకుఁ గావ్యత్వ మాపాదించు టలో నన్నివిషయములను మూలాధార మని తెలియవచ్చుచున్నది.

## సప్తగోదావరావతరణము

పరమేశ్వరుఁడు త్రిపురాసురసంహారానంతరము, వారల కుపాస్యమైన లింగమును పంచఖండములుగా ఖండించి, వానిని పంచారామములందు నిలిపి, తనకు మొదలిమామయగు దక్షప్రజాపతియునికి పట్టయిన యారామం బగుటచే దక్షారామంబున శివసన్నిధానంబై దానుండునట్టులుగఁ బ్రతిష్ఠితుఁ డయ్యెను, పరమేశ్వరుఁడు దక్షారామమునందుఁ బ్రతిష్ఠితుఁడై నప్పుడు భీమనాథునకు అర్ఘ్యపాద్యాచమనీయాద్యుపహారములు నెఱపుటకు గోదావరినదిని గొనివచ్చుటకై భరద్వాజాదిమహామునులు తలపెట్టిరి. వారానది నొక శుభముహూర్తమునకుఁ గొనివచ్చి, యీ పవిత్రజలములచే భీమనాథునకుఁ బ్రతిష్ఠచేయవలయు ననుకొని, దక్షారామమునుండి రాజమహేంద్రపురమునకు శిష్యసమేతముగ వచ్చిరి.

ఆ సప్తర్షులు గోదావరీనదిని కనులారఁ గాంచునరికి వారికి హృదయములం దెన్నియో పవిత్రభావము లుదయించినవి. "గౌతమీనదిలోని నీటిని ప్రీతితో త్రాగినమనుజులకు మఱి తల్లి చనుబాలు త్రాగవలసిన యక్కఱయుండదు. మహర్షులారా! కనుఁగొంటిరా! గౌతమీగంగ తరంగహస్తములతో ఘుమఘుమధ్వాన హుంకారఘోషములతో పాతకసమూహమును జంకించుచున్నది. ఈ గోదావరమ్మ పృథివియెల్లను రక్షించు పేరఁటాలు." ఇట్లు మెచ్చుకొని యీ యమ్మకు భక్తిభావము తులకింప స్తుతినమస్కారములు చేయ మొదలుపెట్టినారా మహర్షులు. ఈఘట్టమున శ్రీనాథుఁడు భక్తిభావముచేఁ బులకితుఁడై పాఠకులహృదయము పులకరించునట్టు లీ స్తుతినమస్కారములను నెఱపినాఁడు. గోదావరిమీఁది భక్తిభావాతిరేకమున గోదావరమ్మ, గంగమ్మ యనునట్టిచనవు శ్రీనాథునకే కానవచ్చును.

"తల్లీ ! గోదావరి ! గోదావరి ! గోదావరి ! అని ముమ్మాఱు నీ నామమును స్మరించువారికి నీవు సకలశుభములు సంపాదింతువు గదమ్మా ! నీ యంబువు లసితరుచులు; అమృతోపమరుచులు; అవి మా కభ్యుదయం బిచ్చుఁగావుత." ఇట్టులు ప్రార్థించి మహర్షులాయమ్మకు నమస్కారములు నెఱపిరి.

శా. ఆ పాతాళగభీరనీరకు సుధాహారామరచ్ఛాయకున్
 ద్వీపాలంకృతికిన్ మహేంద్రనగరీనిశ్రేణికాయష్టికిన్
 తాపోఽపాయవిధావిహర్త్రికి మహోదన్వద్దృఢాలింగన
 వ్యాపారప్రతిపన్నసౌఖ్యకును సాష్టాంగమ్ము గంగమ్మకున్.

గౌతమీనది కొన్నితావులందు నేఁటికిని అంతు తెలియని లోతు గలిగియే యుండును. కార్తికమాసమునందుఁ గలఁక దేఱిన నీటితో గోదావరి శ్రీనాథుఁడు తెలిపినట్టులు సుధాహారామలచ్ఛాయమై యుండును. జంబూద్వీపమునకు నడిమిభాగమునంతటను వ్యాపించి హారముపగిది నొప్పారుచుండును. స్వర్గలోకాధిరోహణమునకు నిశ్రేణిక యీపూతనది. నేఁటికి నీ నదీతీరమునఁ గల యగ్రహారములలో స్వర్గైకసాధనములయిన యజ్ఞయాగాదిక్రియాకలాపములు జరుగుచుండుట యిందులకుఁ దార్కాణము. పవిత్రమైన నదీజలము లెప్పుడును తాపము నపనయించునవియే యగును. ఈ పద్యమున శ్రీనాథుఁడు గంగమ్మకు ఋషులచే నమస్కారము చేయించుచు, నా యమ్మను మహాసౌఖ్యవతినిగాఁ జిత్రించినాఁడు. దానికిఁ గారణ మామె మహోదధియను భర్త నెల్లపుడు గట్టిగాఁ గౌఁగిలించుకొనియుండుట. భర్త నెల్లపుడు నెడఁబాయకుండఁ గౌఁగిలించుకొనియుండు సతి,మహాసౌఖ్యవతి యనుట సహజమే కదా ! అట్టి సుఖమును బడయుగంగమ్మసదకను మఱియొకవైపునకుఁ ద్రిప్పవలయును. ఈ విషయమును వ్యంగ్యముగ సూచించుటకై శ్రీనాథుఁడు "మహోదన్వద్దృఢాలింగన వ్యాపారప్రతిపన్నసౌఖ్యయగు గంగమ్మకు సాష్టాంగమ్మనిపించినాఁడు మహర్షులచేత. ఎంత గొప్పవా రయినను స్తుతిపూర్వకముగ నమస్కరించిన ప్రసన్నులగు

దురు కదా! అట్టి ప్రసన్నత గౌతమికిఁ గలుగుటకే యీస్తుతి నమ
స్కారములు.

శా. రంభోరూకరశాతకుంభ ఘటధారాపూరణప్రక్రియా
గంభీరక్వణసాంద్ర భిన్నకరిరాడ్గండూషనిర్భిన్నకున్
సంభావించి నమస్కరింతుము త్రిసంధ్యంబున్ ముదంబొప్ప నీ
కంభోజాసనకుండికాంబుజవనీహంసాభగోదావరీ!

దీనికి మూలమునం దీక్రిందిశ్లోకము గానవచ్చుచున్నది.

శ్లో. కాంతాకర స్వర్ణఘటాంబుపూర్తి
ధ్వనీభగండూష విభిన్నరూపే
అంభోజఖేలద్వరరాజహంసే
గంగే నతాస్మో భవతీం త్రిసంధ్యం.

ఈ శ్లోకమునందలి భావమును శ్రీనాథుఁ డొకకొంత పోడిగించి యున్నాఁడు. కాంతలను రంభోరువులనుగాఁ జేసి, వారు బంగారుకలశములలో నీరునించుటచే ధ్వని కొక గాంభీర్యమును జతగూర్చి యున్నాఁడు. దానికి గంధగజముల గండూషములరొదను జోడించి గోదావరి కొక ప్రత్యేకవిశేషము నాపాదించిపెట్టినాఁడు. వనితల కరచాలనములతోఁ గూడిన ఘటపూరణములచేతను గంధగజముల గండూషములచేతను బాయలుపాయలై నొప్పారు గోదావరికి త్రికాలములయందు నమస్కారముల నొనరింతు మని మహర్షులామె నగ్గించినారు. మూలములో గోదావరీనది పద్మముల నడుమ రాజహంసల విహారముచే దృష్టిప్రియ మైనదిమాత్రమే. దానికొక విశిష్టమైన పవిత్రత నాపాదించుటకై బ్రహ్మదేవుని కమండలువు నందలి పద్మవనమున విహరించు రాజహంసనుగాఁ జేసినాఁడు గోదావరిని. అట్టి గోదావరికి ముదమార నమస్కరించుటలో నొక విశేషము సమకూడునుగదా!

ఇట్లు నమస్కరించి స్తుతించి, యావెనుక నా యమ్మను దమ వెంట రమ్మని ప్రార్థించియున్నారు. ఈ ప్రార్థన గోదావరీప్రవాహము వలె సరసమధురముగను, భావగంభీరముగను నడచినది. ఈ స్తుతి

హృదయమును ద్రవింపఁజేయు మధురతరఘట్టము. గోదావరీనదీసౌంద
ర్యమునంతయు నీ పద్యమునందు కన్నులకుఁ గట్టినట్టులు చిత్రించి
నాఁడు. భీమేశ్వరపురాణమున కీ సీసము నాయకమణి యనవచ్చును.
కనుఁడు:—

సీ. విచ్చేయుమమ్మ శ్రీవృషభవాహన శిర
స్సామజ మదకటాసారధార !
పయనంబుగావమ్మ భర్గజటాటవీ
కుటజశాఖాశిఖాకోరకంబ !
రావమ్మ యాదిమబ్రహ్మదోః పల్లవ
స్థితకమండలు పుణ్యతీర్థజలమ !
లేవమ్మ విశ్వంభరా వధూటీకంఠ
తారమౌక్తిక హారదామకంబ !
తెరలతో వీచికలతోడఁ దరులతోడ
విమలడిండీరఖండతండములతోడ
మురువు ఠీవియు నామోదమును జవంబు
వడువు నొప్పంగ గంగమ్మ నడువవమ్మ. భీమ. ౪-౧౭౫.

ఈ యాహ్వానమునందు వినయము తొణికిసలాడుచున్నది. హరశిరస్సం
భూతయగు గంగనుగా గోదావరిని భావించి, పరమేశ్వరుని సామవేదో
ద్భవమగు మత్తగజముగను, నదీప్రవాహమును తన్మదధారగను నారో
పము చేసియున్నాఁడు. అట్టి గంగమ్మను దమవెంట విచ్చేయు మని
ప్రార్థించినా రామహర్షులు. పరమేశ్వరజటాజూట మనువనమునఁ బొడ
మిన కొండమల్లెమొగ్గయైన యాజనని పయనంబు గమ్మనినారు. ఆదిమ
బ్రహ్మ కరపల్లవమునఁ దాల్చిన కమండులువునందలి పుణ్యతీర్థోదక
మా ! రమ్మని యాహ్వానించినారు. భూరమణీకంఠదేశమునకు ముక్తా
హారమై వెలయుదానా ! లేవమ్మ యని వేగిరించినారు. వచ్చునప్పుడు
నీయొయ్యారపువడువు గానవచ్చునట్టులు చిన్నియలలు పెద్ద తరఁగలు

తెల్లనినురుగుముద్దలు వెంటఁగొనుచు మురువు లీని ఆమోదము జవము నొప్పఁగ నడుపు మని నివేదించియున్నారు.

ఈ విజయవత్సరమున నొక్కమాఱు గోదావరి యీ పద్యము నందలి యార్భటితో త్ర్యంబకాచలశిఖాగ్రమునుండియు బయలుదేఱి, రాజమహేంద్రవరము వఱకువచ్చి, యచటనుండి సప్తశాఖలు నేకమై తరంగహస్తములతో సముద్రుని గౌఁగిలించినది. ఇట్లాగౌతమిని వినయ ప్రణయములతో వేఁడుకొని మహర్షులు కర్తవ్యము నిట్టులు వెలిఁ బుచ్చినారు.

మ. అదె మాస్వామి సుధారసోద్భవుఁడు దక్షారామభీమేశుఁ డ
భ్యుదయం బంది ప్రతిష్ఠ గైకొనెడు నంభోరాశితీరంబునం
బదమా! షట్పదమాలికాపరిలసత్పాథోజసీసంపదా
స్పదనానా సలిలప్రవాహలహరీసంభార గోదావరీ ! ౪-౧౭౬

ఈ భీమేశ్వరపురాణమునందే మఱియొకతావున శ్రీనాథుఁడు గోదావరిని వర్ణించుచు గౌతమీగంగ సప్తసముద్రములకు వలపువనిత యైన మంగళోత్సంగ యనినాఁడు.

గీ. నీరుకడఁ గోళ్ళఁగూడి మున్నీటిఁ గవయు
మొగులుబడి వాహినుల కెట్లు మొరయవచ్చు
వార్ధులేడింటికి వలపు వనితయైన
మంగళోత్సంగ గౌతమీగంగ యెదుర.

ఈ ప్రసంగముననే గోదావరి నాసికసమీపమున నున్న త్ర్యంబకాచలమునుండి బయలుదేఱి క్రమముగా నార్యావర్తము మీఁదుగా తూర్పు సముద్రమునకుఁ జేరినతీరు నొక పద్యమున రేఖాచిత్రమును దీసినాఁడు.

సీ. త్ర్యంబకాచలశిఖాగ్రంబునం దుదయించి
పొదలి యార్యావర్తభూమి దఱిసి
మలఁగి దండకవనీమధ్యభాగమున నా
ప్రస్రవణాచలప్రస్థ మొఱసి

పట్టిస శ్రీవీరభద్రేశు సేవించి
తిలసోమనాథుమందిరము డాసి
ఏచి యనంతభోగేశ్వరస్థానంబు
రుద్రపాదములపైఁ ద్రోవసాఁగఁ
గోటిపల్లీశుకోమలాంఘ్రులకు మ్రొక్కి
కుండలాముఖతీర్థంబు గుస్తరించి
భీమమండలి డాపలఁ బెట్టికొనుచు
గౌతమీగంగ లవణాబ్ధిఁ గౌఁగిలించె. 3-౨౧

గౌతమినది త్ర్యంబకాచలశిఖరమునుండి బయలుదేఱి, ఆర్యావర్త భూమిని సమీపించి, దండకారణ్యమధ్యభాగమునుండి వచ్చుచు ప్రస్రవణాచలము నొరసికొనినది. ప్రస్రవణమనఁగా పాపిడి. ప్రస్రవణాచలమనఁగా పాపిడికొండ. దాని నీనాఁడు పాపికొండ యందురు. గౌతమీ ప్రవాహము దండకారణ్యమధ్యమునందు భద్రాచలము మీఁదుగా వచ్చుచుండ నడుమ నడ్డమువచ్చిన కొండ పాపిడిపెట్టుగాఁ జీలిపోయినది. దానినే పాపిడికొండ యనెడివారు. ఈనాడు 'డి'కి చ్యుతి యేర్పడి పాపికొండగా వ్యవహార మేర్పడినది. దానికి మఱికొంత క్రిందికి వచ్చునరికి పట్టిస శ్రీ వీరభద్రేశుఁడు. పట్టిసమునం దుండెడి వీరభద్రేశ్వరుఁడు. ఇది రాజమహేంద్రవరమున కాఱుక్రోసులదూరమునం దున్నది. అచట నెలకొనిన యీశ్వరుఁడు వీరభద్రేశ్వరుఁడు. ఈ స్వామి యాలయము గౌతమీ ప్రవాహమధ్యమునం దున్నది. ఈ పట్టిస వీరభద్రేశ్వరుఁడు నీ ప్రాంతమందు ప్రసిద్ధమైన పరమేశ్వరమూర్తులలో నొక్కఁడు. నేఁటికి నీ యీశుఁడు శివరాత్రినాఁడు నలుజాములు వేదవచనములు వినుచుండును. గోదావరి యీ పరమేశ్వరు నానాఁడు నీనాఁడును సేవించుచునే యుండును.

తిలసోమనాథుఁడు:— ఈ స్వామి పట్టిసమునకుఁ గ్రిందుగ రెండు క్రోసులదూరమునందున్న 'తాళ్ళపూడి' యను గ్రామమున నెలకొనియున్నాఁడు. ఈ పరమేశమందిరము గౌతమీనదీతీరమునందుఁ గలదు.

అనంతభోగేశ్వరము:- -అనంతభోగేశ్వరుఁడు నెలకొనిన స్థానము. శ్రీనాథుని కాలమునందు సైతమీ యీశ్వరుఁడు గౌతమీనదీ తీరమం దుండియుండును. ఈ నాఁ డనంతభోగేశ్వరుఁడు కుమారదేవ మనుగ్రామమునందు స్థిరపడినాఁడు. ఇంతకు ముందు నదీతీరమునం దాలయ ముండినట్టులు నదీపతితములైన శిథిలములు కొన్ని యీనాఁటికిని కానవచ్చును. నేఁటికిని గల్యాణమండపము నదిలోఁ గానవచ్చును. ఈ యనంత భోగేశ్వరస్థానము తిలసోమనాథుని మందిరమునకుఁ గ్రింద రెండు క్రోసులదూరమునఁ గలదు.

రుద్రపాదములు:——రాజమంహేంద్రవరమున నెలకొనిన మార్కండేయస్వామి చరణములు. గోదావరి యేపాటి పొంగినను నాటికి నేఁటికి నీ మార్కండేయస్వామి చరణములు సేవించుచునే యుండును. ఈపరమేశ్వరుఁడు భీమనాథున కిరుగు పొరుగులవారిలో నొకఁడై పశ్చిమ సీమయందు నెలకొనియున్నాఁడు. ఈ రుద్రపాదములను కృత్యాదిలో శ్రీనాథు డీతీరున వివరించియున్నాఁడు.

సీ. కమలాచలాగ్ర మార్కండేయ శివశిర
  శ్శశిచంద్రికాధౌత సౌధవీథి
గోదావరీపుణ్య కూలంకషాజల
  స్ఫారితశ్రీరుద్రపాదయుగళి
గీ...సాంద్రవిభవంబు రాజమహేంద్రవరము. ౧-౪౨

ఈ రాజమహేంద్రవరమున కెదురుగ నుండిన కొవ్వూరును గోపాద క్షేత్రమని యందురు. గౌతమమహర్షి గోవును జంపిన పాపము నివర్తించుటకై యీశ్వరునిగూర్చి తప మాచరించి, త్ర్యంబకాచలము నుండి గోదావరీనది నీ తావునకుఁ దెచ్చి గోవు నుత్తమలోకములకుఁ బంపుటచే నీ క్షేత్రమునకు 'గోపాదక్షేత్ర'మను పేరు వచ్చె నని గౌతమీ మాహాత్మ్యమునందలి యైతిహ్యము. రాజమహేంద్రవరమునకు దక్షిణముగ రెండు క్రోసులదూరమున ధవళగిరి (ధవళేశ్వరము) గలదు. దానిని 'రామపాదక్షేత్ర' మని యందురు. పలివెల కొప్పులింగేశ్వర

స్వామి యాలయమున నెలకొనియున్న అనితల్లి శాసనములో "గౌత మీ మహానదీతీరమందును మార్కండేశ్వర మృకండేశ్వరు రుద్రపాదాల సన్నిధిని" అని యున్నది. దీనినిబట్టి మార్కండేయస్వామి చరణములే రుద్రపాదములని తెలియవచ్చుచున్నది. ఈ స్థానమునుండియే గోదావరి సప్తశాఖలుగఁ జీలి సముద్రమునఁ గలిసినది. రాజమహేంద్రవరము వఱకు గోదావరిని అఖండగౌతమి యని యందురు.

శ్లో. తుల్యాత్రేయీ భరద్వాజీ గౌతమీ వృద్ధగౌతమీ
కౌశికీచ వసిష్ఠాచ సప్తశాఖాః ప్రకీర్తితాః.

తుల్యానది:—గౌతమీనది రాజమహేంద్రవరమునుండి దక్షిణముగాఁ బ్రవహించుచు ధవళేశ్వరమునుండి యొకశాఖ గౌతమి యనుపేరను, విజ్ఞేశ్వరమునుండి మఱియొకశాఖ వసిష్ఠానదిగను వేఱయినది. ఈగౌతమీ శాఖనుండియే విడువడి—తుల్య,ఆత్రేయి, భారద్వాజి, గౌతమి, వృద్ధగౌతమి,కౌశికి—యను నాలుశాఖ లేర్పడినవి. వీనిలో తుల్యానదీ శాఖ ధవళగిరికి ముందునుండి వెలువడినది. ఈ నాఁడా శాఖాముఖ మొక పాడుపడిన కాలువగా, రాజమండ్రీనుండి ధవళేశ్వరము పోవునపుడు గ్రామారంభమునఁ గానవచ్చును. ఈశాఖ ధవళేశ్వరమునుండి బయలుదేఱి కడియము అనపర్తి తాపేశ్వరము మావిడాడ వేళంగి మున్నగు గ్రామముల మీఁదుగఁ బ్రవహించి కాకినాడ సమీపమున చొల్లంగి యనుచోట సముద్రగామి యగుచున్నది. ఈ నదీసాగరసంగమ స్థానమున సోమేశ్వరుఁడు ప్రధానుఁడై నెలకొనియున్నాఁడు. ఇచటనే ఆంజనేయస్వామియుఁ గలఁడు. పుష్యబహుళ అమావాస్యనాఁడు అర్ధోదయ మహోద యాదిపర్వములందీ నదీసాగరసంగమమున స్నానదానాదులు మహాపుణ్యదము లని పెద్దలు వాకొందురు.

ఆత్రేయీనది:—గౌతమీశాఖనుండియే తుల్యానది విడువడిన ధవళేశ్వరమునకుఁ దరువాత కోటిఫలికి రెండుక్రోసులు క్రింద నొకశాఖ విడువడినది. దానిని ఆత్రేయి యందురు. ఇది యీ నదీతీరమున రామ

---

చూ. దక్షిణహిందుస్థాన శాసనసంపుటము Vol V No 114.

ఘట్టమున నా విర్భావము నంది, కోరంగి యొద్ద సాగరసంగత యైనది. ఈ సాగరసంగమస్థలమున కురంగేశ్వరుఁడు గలఁడు. శ్రీ రాముఁడు కురంగము నీచోటఁ జంపుటచే నిచట ప్రతిష్ఠితుఁడైన యీశ్వరునకుఁ గురంగేశ్వరుఁ డను పేరు వచ్చినదని యైతిహ్యము.

భరద్వాజీ- గౌతమి:— ఈ భారద్వాజియను శాఖ ఇప్పుడు "అక్విడెక్టు" కట్టిన 'అన్నంపల్లి' యను చోటునుండి విడువడి ఇంజరము వఱకుఁ గానవచ్చుచు గౌతమీశాఖలోఁ గలసి యానాము (ఫ్రెంచి నగరము) మీఁదుగా సముద్రమునఁ గలియుచున్నది. ఈ మధ్యభాగమున నీనదిని భారద్వాజ్యంతర్భూతగౌతమి యని వాకొందురు. ఈసాగర సంగమక్షేత్రమును 'తీర్థాలమొండి' యని యందురు. ఇచట గౌతమి భారద్వాజి రేవ అహల్య యను పంచతీర్థములు గూడిన వనియు కావున దీనికి తీర్థాలమొండి (మొగ) యను పేరు వచ్చినదని తెలుపుదురు. ఇచట నీశ్వరుఁడు భైరవేశ్వరుఁడు. ఇచట భైరవపాళెము అను బెస్తపల్లె యొకటి గలదు.

వృద్ధగౌతమి:— ఈ శాఖ గౌతమీనదికి పశ్చిమతీరమునుండి వెలువడినది. దీని యుత్పత్తి యెచ్చటనో స్పష్టముగఁ దెలియదు. కౌశికినది పుట్టినచోటనే పుట్టినదేమో? ముక్తేశ్వరము మొదలు శాన పిల్లంక శానేలంక గేదెల్లంక కుండలేశ్వరము అను గ్రామముల సమీపమునందున్న మురికికాలువను వృద్ధగౌతమి యందురు. ప్రభుత్వము నదీ ముఖములను గప్పివేసినను దీనిని "వృద్ధగౌతమీడ్రైను"అను పేరితోడనే నేఁడును వ్యవహరింతురు. ఇది సాగరమునఁ గలిసినచోట వృద్ధేశ్వరుఁ డుండెడివాఁ డని వినికి. ఈనాఁ డాలయమును లింగమును సముద్ర పతితములు. అచట బ్రహ్మేశ్వరుని లింగము గలదు. సంతానగోపాలేశ్వరస్వామి అరిష్టమ్మ యను నమ్మవారును గూడఁ గలరు. దీనికి బ్రహ్మసంవేద్యము అని పేరు. సంతానప్రాప్తికై సప్తసాగరయాత్ర చేయువారు ఈ స్వామియెదుట నిద్రింతురు. వారికి స్వప్నములు వచ్చుటయు, స్వప్నానుసారముగ సంతానఫలమును బడయుటను గలుగునని

చెప్పుకొందురు. ఈ క్షేత్రము నీనాఁడు 'బ్రహ్మసమేధ్యము' అని యందురు.

కౌశికినది:—గౌతమీనది పశ్చిమశాఖనుండి యీనది 'మందపల్లి' (అగస్త్యప్రతిష్ఠితుఁడగు మందేశ్వరుఁడు నెలకొనినచోటు) సమీపమునఁ గల 'సూర్యకుండము' అను చోటునుండి విడువడి అమలాపురము తాలూకాలోని గ్రామము లన్నియుఁ జుట్టుచు 'బెండమూర్లంక' యనుచోట సాగరమునఁ గలియుచున్నది. ఈ ప్రదేశమును విష్ణుసంవేద్యము' అని యందురు. ఇది బ్రహ్మసంవేద్యమునకు నాలుగుక్రోసుల దూరములో నున్నది. ఇచట రామలింగేశ్వరస్వామియును లక్ష్మణస్వామియును గలరు. ఈ కౌశికీనదికి కౌంతేయి యనుపేరును గలదు. 'పలివెల' కొప్పులింగేశ్వరుఁ డీనదీతరమునఁ గలఁడు. ఈ నది ప్రవహించిన చోటునంతను 'కోనసీమ' యని యందురు.

ఈ కౌశికినది పుట్టినచోటునకుఁ బశ్చిమముగ గౌతమీనదిలోనుండి యొకశాఖ విడువడి, యది యాత్రేయినది పుట్టినచోట మరల గౌతమిలోఁ గలిసినది. దీనిని కణ్వానది యందురు. ఈనాఁ డిది ప్రభుత్వము వారి లెక్కలలో 'టేకిడ్రైను' అని వ్యవహరింపఁబడుచున్నది. ఈ విజయసంవత్సరమున గోదావరి యుప్పొంగి వఱదలై ప్రవహించినపుడు ఈ నదీముఖములయొద్దనే గళ్లు పడినవి. తుల్యానదీముఖమున ధవళేశ్వరము దగ్గఱను, కౌశికీనదీముఖమున మందపల్లియొద్దను, కణ్వానదీముఖమున కపిళేశ్వరపురమునొద్దను, ఆత్రేయీనదీముఖమున పిల్లంకయొద్దను, భారద్వాజీనదీముఖమున పశువుల్లంకయొద్దను నదీశాఖాముఖములు తెలుచుకొని సప్తశాఖలు నేకమై తరంగహస్తములతో సముద్రుని కౌఁగిలించినది. గోదావరికి బడిన, గళ్ళన్నియు సరిగా నదీముఖములందే పడుట యొక యద్భుతవిషయము.

వసిష్ఠ:—ఇది కొవ్వూరునకు క్రోసుదూరముక్రింద విఘ్నేశ్వరమునొద్ద గౌతమినుండి విడువడి సరాసరిగాఁ బోయి అంతర్వేదియొద్ద సము

ద్రగామి యైనది. అచట నీలకంఠేశ్వరుఁడు నృసింహస్వామియుఁ గలరు. ఇది యొక గొప్ప పుణ్యక్షేత్రము. మాఘశుద్ధపాడ్యమినాఁడు చొల్లంగి నుండి బయలుదేఱి, సప్తగోదావరీశాఖాసంగములలో స్నానముచేయుచు మాఘశుద్ధ ఏకాదశినాఁటికి సప్తసాగరయాత్ర చేయువారి అంతర్వేదికిఁ జేరుదురు. అచట నా యేకాదశికి గొప్ప తీర్థము (తిరునాళ్లు) నేఁటికిని జరుగుచుండును.

ఈ విధముగ గోదావరి యేడుశాఖలై ప్రవహించి సముద్రగామి యైనను, భీమమండలి యీ సప్తశాఖలనడుమనే యున్నది. ఈ భీమమండలి నడుమనే భీమేశ్వరుఁడు పుండరీకమధ్యమునఁ రాజహంసమువలె ప్రతిష్ఠ నందినాఁడు. ఆ దృశ్యమును శ్రీనాథుఁ డెంతయు మధురముగఁ జిత్రించియున్నాఁడు.

సీ. ఆంధ్రభూభువనమధ్యము పుండరీకంబు
సప్తగోదావరజలము తేనె
బ్రహ్మసంవేద్యాది బహుతీర్థములు రేకు
లకరులు చారుదివ్యస్థలములు
నాళంబు లవణాబ్ధివేలావిభాగంబు
కల్యాణభోగమోక్షములు తావి
దక్షవాటీమహాస్థానంబు కర్ణిక
హంసంబు భీమనాయకుఁడు శివుఁడు
గౌతమీసింధు కౌంతేయకన్యనదులు
తుల్యభాగయు నేలేరు దుమ్మికోనలు
భువనసంభావ్యమైన యీ పుణ్యభూమి
యనఘ సంసారతాపశాంత్యౌషధంబు, భీమ. 3-౫౦

ఇట్టి పుణ్యనదీశాఖలు, తత్తీరముల దివ్యమూర్తులయిన యీశ్వరలింగములు నెలకొనియుండిన కారణముననే భారతదేశమంతటిలోను గోదా

వరీనదీతీరము పరమపావనమని యుత్తరదేశస్థుల నమ్మకము. ఇతరనదుల కంటె నీ గోదావరి విలక్షణముగ సప్తశాఖలతో సముద్రిని గౌఁగి లించినది గావున నీ నదీమహాత్మ్య మితరనదులకంటె ప్రశస్తతరమని శ్రీనాథుఁడే వివరించినాఁడు.

నీరుకడఁ గోళ్లఁగూడి మున్నీటిఁ గవయు
మొగులుబడివాహినులకెట్లు మొరయవచ్చు
వార్ధులేడింటికి నలపు వనితయైన
మంగళోత్సంగ గౌతమీగంగయెదుర. భీమ. 3-౨౨

ఈ తీరుగ శ్రీనాఁథుఁడు గౌతమీగంగను వార్ధులేడింటికిని నలపువనిత నుగాఁ జేసి మంగళోత్సంగను జేయుటయం దాతని కవితాశిల్పము ప ంచి పురాణమును రసబంధురకావ్యబంధముగా వెలయించినది.

ఓం శమ్

## కళాసమీక్ష

చిలుకూరి వీరభద్రశాస్త్రి

లేదా; ప్రవరుఁ డేమియు నెఱుఁగని విప్రుఁడు, శ్రోత్రియుఁడు. గృహముసందే యుండి, లోక మెఱుఁగక, ఏకపత్నీవ్రతస్థుఁడై, నియమనిష్ఠాగరిష్ఠుఁడై లోకవ్యవహార మెటు లుండునో, స్త్రీ, లెట్లుందురో, విశేషతః అందకత్తె లెటు లుందురో, ఎంతెంత వార లుందురో, విలాసవతు లెట్లుందురో, రాగిణు లెట్లుందురో, గంధర్వాంగ లనిన నెట్లుందురో? కూడఁ దెలియనంతటివాఁడు. అతనికిఁ బూర్వకార్యము లనినను, అతిథిసంతర్పణము లనినను, తీర్థసేవ లనినను మిక్కుటమగు వాంఛ. కావుననే యోగి తిఱిగిన దేశము లన్నియు వినినాఁడు. వింతలు విశేషములు కనుఁగొనినాఁడు. అతనిని బ్రీతిమాలెను. పాదరసలేపనముతో రావచ్చుటలోను హిమవత్పర్వతము మెట్టినాఁడు. మధ్యాహ్న మయినది. మాధ్యాహ్నిక కృత్యము లొనర్చుకొనుటకు నిలు సేర సంకల్పించెను. పాదలేపము కరఁగిపోయినది. అఱిగిన దా ప్రభావము. కంగారు హెచ్చినది. ఇలు సేరు నుపాయ మేమి యని యాందోళన బయలుదేరినది. అన్నియు నా దిగులులో జ్ఞాపకము వచ్చినవి. అగ్నులు నీఱు కప్పిపోయి యుండునని బొవురు మనినాఁడు. ఇటునటుఁ దిరిగినాఁడు ఏమియుఁ దెలియవు. తన యూరిదారి యేదియో యూహించుద మన్నను "ఎక్కడి యరుణాస్పదపుర మెక్కడి తుహినాద్రి!" అసాధ్య మయిన విషయము. సంకల్పోత్తరముననే చేరిపోయెనేమో యేదిక్కునకు వచ్చినాఁడో తెలియదు. ప్రాక్పశ్చిమములు తెలిసినను, దక్షిణోత్తరములు దెలియవు. ఇంతకు దెక్కలు తెలియనినాఁడు, దిక్కులు తెలియలేదు. తిరిగినాఁడు. ఒక పాట వినినాఁడు. మొదటవచ్చిన దపశకునము. ఆఁడువాసన తగలినది. పోనీ మనిషికదా! దా రడిగిపోవుద మని యింకను కొంచెము ముందునకు వచ్చినాఁడు.

ఒక మెఱుపువలె మెఱసినది దేహము. "ఇదియేమి" యని కంగారుపడినాఁడు. "ఎవరూ!" అని. కనులు కనిపించినవి ఆవిడవి. అవి ఆశ్చర్యజనకముగా నున్నవియఁట. శతపత్ర మంతటి విశాలముగా నున్నవి.

ఒక్కసారి చలించిన పద్మము వాయువునకుఁ జలించినట్లున్నది. కన్నులు వాసనచుట్టుచున్నవి దూరానికి. అంత శ్యామలత కురులకు నెచ్చటను జూడలేదు ఆ బ్రాహ్మణుఁడు. ముఖమో చంద్రుఁడో తెలియక భూమ్యాకాశములు తలక్రిందు లయినట్లు కంగారుపడినాఁడు. తుదికి మిగిలిన అవయవ సంఘటనముబట్టి ముఖము అనుకొనినాఁడు. నాభి గాంభీర్యము చూచి భయ మెత్తినది. అట్టి స్తనములు చూడలేదు. ఉల్లి పొరబట్టలోనుండి తొంగిచూచుచున్నవి కాఁబోలు. మొత్తముమీఁదఁ దా నెక్కడను, ఇట్టి స్త్రీని జూచియుండలేదు. దేవతా స్త్రీ యనికొనినాఁడు.

వరూధిని గంధర్వాంగన. భోగిని. విలాసిని. ప్రవరులు ఆమెకు వలసినవారు. ఇతఁడు ఏకాంతములో నుండఁగాఁ దనయొద్దకు వచ్చినారు. ఏకాంతవాసములో నొక యందగాఁడు దొరకిన అట్టి స్త్రీ మన్మథపరవశురా లగుట కబ్బురమా? అందులో నలకూబర సన్నిభుఁ డద్ధరామరుఁడు. మొదట స్త్రీజాతి కనుక కంగారుపడిలేచినది ఒడలు సవరించుకొనినది. తరువాతఁ జూచినది. నచ్చెను. అతనిపైఁ బ్రేమ యంకురించినది, పల్లవించినది, పుష్పించినది. లేచి యడ్డముగాఁ దొందరతో వచ్చి నిలచినది. ఇం కొకలిప్తలో, ఒకపదమాత్ర పదవ్యంతరములో నున్నదామె. "ఇంక నీ పయిం జిక్కె మనంబు"అని మీఁదఁబడుటకు. ఆఁడుదానిని అందమయినదానినిఁ జూడకపోవుట ఒకటి మీఁదికి వచ్చుట ఇదిచూచి దిగ్భ్రాంతియో? విభ్రాంతియో? మిథ్యామతియో? ఏదియో అయిపోయినాఁడు. అంటాఁడు.

ఏమీ యిది? ఎవతెవు నీవు? ఆ గ్రుడ్లు త్రిప్పుట యేమిటి. లేడిఁ (పశువు) గ్రుడ్లు త్రిప్పినట్లు త్రిప్పుచుంటివి? ఎక్కడనో యడవిజంతువు వలె నుంటివి? ఎందులఁకా కంగారు. మీఁదికి వచ్చుచుంటివిలే! పేర్రేగిపోయి భయ మేమియు లేక యెవరి సహాయములేకుండఁగ, ఎవరి అపేక్షయు లేకుండఁ దిరుగుచుంటివి? ఎవతెవు నీవు? ఈ ఘోరారణ్య మేమి? ఒక్కర్తెవు నుండుట యేమి? దేవతవా, దెయ్యానివా? ఎదుటివాఁడెవఁడో తెలియక మీఁదఁ బడున ట్టుంటివి? ఆఁగుమజీ నే నెవరనో?

కొంచెము తెలిసికొనుము. నేను భూసురుఁడను,ఎవరు కనిపించిన వారిని జెట్టపట్టుకులములోఁ బుట్టితి ననుకొంటివా ? నే బ్రాహ్మణుఁడను. 'నా కరణుల్ దర్భలు నగ్నులుల్ ప్రియములై నట్లన్యముల్ కావు'' "చెప్పకు మిట్టి తుచ్ఛ సుఖముల్ మీసాలపైఁ దేనియల్, "వ్రతులై దినములు గడపెదు విపులంగామింప మది విచారము వలదే'' బ్రాహ్మణులలోఁ గూడఁ బ్రవరుఁడను. శ్రేష్ఠుఁడను. అందుకే నా పేరు ప్రవరుఁ డందురు. దానజపాగ్నిహోత్రపరతంత్రుఁడను. తత్పదాంబుజధ్యానరతుండను పర దారధనాదుల కోరనివాఁడను. అందుకే భూదేవతను. ప్రవరుఁడను గూడ. స్త్రీ లనిన నంత విరాగి వెందులకు వచ్చితి వని యడుగవచ్చు, స్త్రీ లుందు రని యనికొని రాలేదు. నీ వంటివా రున్న మొదటే రాక పోయెడువాఁడనే. ఇక్కడఁ గాపుర ముండుటకును రాలేదు. వచ్చుటయే మానివేయకూడదా ? యనిన నిట్టి పనులను జేసినవారినే కొంప్రిహ్విక్కిన వా రని యందురు. కొంప్రిహ్విక్కినది కనుక నే యీ హిమాలయమునకు, ఈ శిఖరమునకు వచ్చితిని. తగినశాస్తి అయినది. కొంప్రిహ్విక్కి ఏ పని చేసినను తగినశాస్తి అయితీరును. ఎవరిదైనను నడఁతే మంచిదైన నపుడే మంచి. లేకపోయిన నా కయిన ట్లయి తీరును. చూడు. ఎక్కడినుండి యో యిక్కడకు వచ్చితిని. మా పురమార్గము మఱచిపోయితిని. తెలిసినదిగా దారి తప్పివచ్చితిని కాని నీవు మీఁదఁబడుదవని రాలేదు. కనుక మా యూరుదారి తెలిసినఁ జెప్పుము. నా కేమియు నుపాయము తోఁచుటలేదు. ఇంత ఏకాంతములోనున్న దాని కన్ని దారులు తెలిసియే యుండును. నాకు దారి తెలిసిన నీకు మేలగును. నీ కోర్కెలు సిద్ధించును. నేను బ్రాహ్మణుఁడనుగా ? బ్రాహ్మణాశీర్వాదము అమోఘము. అం తియే కాని మీఁదకుమాత్రము రాకుము. ఆఁగు మఱి. నీ వెవతెవు ?

కుముదాన్యేవ శశాంకః సవితా బోధయతి పంకజా న్యేవ
వశినాం హి పరపరిగ్రహసంశ్లేషపరాఙ్ముఖీ వృత్తిః

అని శుద్ధఛాందసముగా స్పష్టపఱచి ఆడిగినాఁడు అనవచ్చు.

లేదా: వరూధిని ప్రవరుని పద్యమున కేమి యర్థమును దీసికొని యుండునని యాలోచించిన "కామీ స్వతాం పశ్యతి" అని కాళి

దాసు అన్నట్లు వరూధిని ప్రవరుని చూచుటతోడనే ప్రేమించినది. మోహావిభ్రాంతిలో మునిఁగిపోయినది. అతఁడు దారి అడుగుటకు వచ్చినను, దారి యడిగినను, తన ప్రేమకు సరిపడున ట్లర్థముఁ దీసికొని యుండును. అటుల ననుకొన్నటుల నీక్రింది రెండు పద్యములు కొంతఁ దోడ్పడఁగలవు.

క. అని తనకథ నెఱిఁగించిన
దనకనుఁగవ మెఱుఁగు లుబ్బ దాటంకములన్
జనుగవయు నడుము వడఁకఁగ
వనిత సెలవివాఱ నవ్వి వానికి ననియెన్.

ఇంతలు గన్ను లుండఁ దెరువెవ్వరి వేఁడెదు భూసురేంద్ర! యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించు లా
గింతియకాక నీ వెఱుఁగవే! మునువచ్చిన త్రోవ చొప్పు నీ
కింత భయంబులే కనుగ నెల్లిదమైతిమె! మాటలేటికిన్.

అని నర్మగర్భంబుగాఁ బలికి......అని యున్నది.

ఓ భూదేవేంద్ర! దారి తెలియకపోవుటకుఁ గన్నులు లేవా? నిద్దురపోవుచుంటివా? ఇంతింత కన్నలున్నవి. రూపమేవాస్యైతన్మహిమానం వ్యాచష్టే అని కన్నులే తెలుపుచున్నవి నీవు తెలివిగలవాఁడవో? కాదో? కన్నులతో మాటాడువాఁరున్నారు లోకములో. నీ వందులో భూసురుఁడవు. ప్రవరుఁడవు కూడ నంటివి. భూసురప్రవరుఁడవు మార్గదర్శకుఁడ వగుదువు. నీకుఁ దెలియని మార్గములు లేవు. ఈ మార్గము, ఈ ఏకాంతప్రదేశము, ఈ నాయునికి నీ కెటులఁ దెలిసినదో యటులనే అన్నియుఁ దెలిసియే యుండును. దారి తెలియక నీవు వచ్చి యుండలేదు. యువతుల పొత్తుఁగోరి వారిని బల్కరించి వారి మాటలో మాట కలిపి మంచిమాట చేసికొనఁగోరువారి మాట లిటులనే యుండును. సరే! దానికేమి. నన్ను దారి యడిగున దేమిటికి? ఇదివఱలో నిటుల తప్పుదార్లు పట్టియుందువు దార్లు అన్నియు నెఱిఁగియు నుందువు? ఇదివఱలో నే దారిని నెడలుచుంటివో అదియే యిప్పుడును. ఏ దారియు నీవె

ఱుఁగనిచో మే మంతకంటె నెఱుఁగ మే దారియు. మే మాఁడువారము. మేమసలు మఱచిపోవుదుము వచ్చినదారి. ఆడువా రనిన నింతభయము లేకపోయినది మగవారికి. సరే ఆడువాళ్ళంటేయంత చులకనై పోయినది. ఏలాగునసైన నేకాంతప్రదేశముదాఁక వచ్చితివి కాన మాటలెందులకు. ఆఁడువారి కంతభయము లేదనుకున్నావా ? నోటితో నడుగుటకు. ఇప్పటికి నప్పటికి నెంత మగవారు చుల్కనగాఁ జూచిన చేష్టచే చూపుదురుగాని అంత సిగ్గులేనివారు కారు. "స్త్రీణా మాద్యం ప్రణయవచనం విభ్రమో హి ప్రియేషు" కాదా? క్రియాప్రధానముగాని మాటలెందుకయ్యా? బ్రాహ్మణోత్తమా! నీవు తెలియని శుంఠవుగావు కన్నులను వర్ణించిన నీవు. నీ కన్నులున్నట్లే నా కన్నులు నున్నయవి.

ఈ నర్మమునకు మర్మము "ఎవ్వతెవీవు" పద్యము కనుక ఆమె ప్రవరుని అమాయకునిగా నర్థముచేసికొనను లేదు. అతఁ డుగ్గడించిన పద్యమునకు వేఱుగా నర్థముచెసికొని యుండియుండును. కనుక మఱియొకరీతిగ దీని యర్థమును ఊహింపవచ్చును.

మే మప్పుడప్పుడు వినియున్నట్లు కలదు. అందమయినవార లప్సరసలు. వారి నేత్రములే చాల నందముగఁ జంచలములుగ నుండును. అవిదితలు. నా రెక్కడనో హిమాలయాదిపర్వతములఁ జరింతురు. అది నిజమయిన నీ వప్సరః స్త్రీవై యుండవలయును. ఎవ్వతెవీవు? భయముకొఱకు లేకుండఁగఁ దిరుగుచుంటివి? ఇంత నిర్జనారణ్యములోఁ దిరుగుటకు దిట్టతన మొక్క సురాంగనలకే యుండునుఁగాని మఱియెవ్వరికి నుండనేరదు. అందులో నేకాంతవాసిత కామిను లగు గంధర్వస్త్రీలకే యుండును. ఈపర్వతశిఖరములో నింతయేకాంతవాసినివి నీవు అప్సరసవే. నీ వెవ్వతెవు ? నీవు సురజాతి కెటులఁజెందితివో నేను నట్లే సురజాతికిఁ జెందినవాఁడనే. ఇంకొక వైశిష్ట్యముకూడ నున్నది. భూసురత్వముగాని అందునను బ్రవరుఁడను. వరుం డన్ననే "ప్రియతే ప్రియత్వేన స్వయం అంగీక్రియతే- కావ్యప్రకాశిక. యః కౌమారహరః సఏవహి వరః. శ్లోకవ్యాఖ్య - ఉద్యోతము. ఆఁడుదానిచేఁ జూడఁబడినవెంటనే వరింపఁబడు వ్యక్తిని, దానిలోఁగూడ వైశిష్ట్యమున్నది. ప్రవరుఁడను. లేకపోయిన

నీవంటి అందకత్తె నాయందు బద్ధానురాగవై యెటులగును? ఏమని యెదవు? నామీఁద నీకనురాగ ముద్భవింపలేదని యనియెదవనినను నీ చంచలదృగంచలనిరీక్షణము, నీమీనాంకానలసూచక ధూమాంకురములవలె నున్న పులకలు నీయంతరంగమును దెలుపుచున్నవి. నేను సన్మార్గగామితను వదలుకొంటిని. ఎన్నియేండ్లయినను ఒకే బాటలో నడచిన జడత రోఁతగలుగును. ఇటులఁ బను లొనర్చిన వారిని సజ్జనులో క్రొవ్వెక్కినవా రనియెదరు. ఒప్పుకొనలేదా బయలుదేరితిని. క్రొవ్వెక్కినదికనుక నే "నాదు రేఁగినఁ దల పోలమునఁగాని నిలువ" దనినట్లు ఈపర్వతాగ్రమునకుఁ జేరితిని. ఇఁక వెనుకదారిఁ బట్టను. నీయిష్టము తెలిసిన మీఁద నిక మా పురమునకు నేఁగను. వెనుకకు చూడను. ఇటుపైని నా కేమియు నుపాయము కానరాదు. ఏమిచేయుటకు. ఉపాయము నీవు చెప్పవలసియున్నది అన్నిదార్లు మెట్టినదానవీవు. దారెద్దియేని తెలుపుము. అది నీకు శుభశోభనములకుఁ బనికివచ్చునది అయ్యెడిది చూడుము దారి. దారి తప్పినవారికి దారిచూపు విధానము తెలిసి చూపుదాన వీవుకదా? అను నర్థము నూహింపవచ్చును.

లేదా; భీత! ఎవ్వతె వీవు? లేడి వనములో గుంపువీడి ఉండదు. ఏకాంతముగాఁ జరింపదు. దానికి విశేషకారణముండును. మరలనభీష్టులతోఁ జేరినపుడే భయము పోవును. ఒంటరిగా నున్నపుడు భయపడుచు నుండును. ఏకాకిగానుండి భయపడు లేడివోలెఁ జంచలనేత్రములతోఁ జూచుచుంటివి. నీ వెవరవు? భయమువేయకుండఁగనే ఈవనభూమిలో చరించుచుంటివా? కాదు. నీవు నా వలెనే భయమంది యుండవు. నీవును నేనును ఒక విధమైయినవారలమే యై యున్నాము. ఇద్దఱము కలిసిన ఒక దారితొక్కుటకు వీలుపడును. సరే, నే నెవర్తెనో చెప్పిన నీకుఁ గొంత తెలియఁగలదు. నేను బ్రాహ్మణుఁడను. నాకుఁ జాతుర్వర్ణ్యస్త్రీలతోఁ గలియుటకు నధికారమున్నది. నీవు సురస్త్రీనయిన మఱి బాగుగనే కుదురును. భూసురుఁడ నేను. ప్రవరుఁ డనువాఁడను. క్రొవ్వెక్కి యిక్కడికి వచ్చితిని. దారి తప్పితిని. ఇంతదూరము వచ్చిన

తరువాత వెనుకదారిఁ బట్టను. చేరుటకు నుపాయము కానరాదు. నీవు అట్టిదానవే అయి యుందువు. ఇద్దఱము మన మెందులకుఁ గలసితిమో? నష్టాశ్వదగ్ధరథన్యాయమున. ఆఁడుదానికి నీకు భయమే అను నాకెందు కింతభయము. ఆ భయములో నేమి యుపాయము తోఁచుటలేదు. నీకు శుభమగు మార్గమొకటి ఆలోచించిన నదియే నాకు శుభంభావు కము. ఒక దారిత్రొక్కి ఈ మార్గమునఁ బోవుదుమనిన నటులఁ జేయు దము. కనుక ముందు నీవు దారి తీయుము. అది యెటులైనను సరే. నేను దొరికితిని కావున నీకింక భయపడవలసినది లేదు. ఈపై నీయిష్ట ము. అని తన కథ నెఱింగించె ననవచ్చును.

లేదా; బ్రాహ్మణుఁడు యజ్ఞయాగాదులు చేసినవాఁడు. స్వర్గ సుఖములమాట తెలిసినవాఁడు. హిమవత్పర్వత శిఖరాగ్రమునీఁద మరున్నారీశిరోమణులు లుందురని తెలిసినవాఁడు. యజ్ఞఫలముచే సశరీరస్వర్గము వచ్చునని తెలిసినవాఁడు. కనుక నే అనేకదృశ్యములయిన వుండఁగా నన్నియు విడచి హిమవత్పర్వత శిఖరాగ్రమునకు వచ్చి నాఁడు. గంధర్వాంగన తారసిల్లినది. ఈవిడ గంధర్వాంగనయే అని రూపును బట్టి ఆనవాలు కట్టినాఁడు. కాని నిమేషిత, స్విన్నగాత్రము చూచి మనుష్యాంగనయేమో యని భ్రాంతిలోఁబడినాఁడు. అయినను పృచ్ఛించినఁదేలునని యనుకొని అనినాఁడు. ఈ పర్వతశిఖరాగ్రాన, ఈవన్యమృగాకీర్ణారణ్యములో, నొక్కతెవు సంచరించుచుంటివి నీ వెవ తెవు ? ఓ చంచలనేత్ర! నేను భూదేవుఁడను. ప్రవరుఁడను. భూసురత్వ సాధ్యమయ్యెడిది యున్నదా అని తిరుగుచు నీ ప్రాంతమునకుఁ జేరితిని. నీ వెవతెవో తెలిసిన నారాక తెలుపుదును. అయినను చెప్పివైచెదను. బ్రాహ్మణత్వముచే సంపాదింపవలయు బ్రహ్మత్వము వీడి. కర్మలదారి తప్పి, క్రొవ్వుచే నీ పర్వతశిఖరమునకుఁ జేరితిని. వచ్చివేసితినిగాన నింక మాయూరు చేరను.ఏమిచేయ నుపాయము తోఁచుట లేదు. బ్రాహ్మణు కున శరీరస్వర్గమున్నయెడల దాని ఫలితము మీ కవుఁగిళ్ళ సుఖించుట యైనచో, నీవు గంధర్వస్త్రీ వైన నీతోఁ జెప్పకపోవుట యేమి. ఏమియు

ఏమియు నాకు దోఁచుటలేదు. ఈ పైననేది యేనిదారి చూపుము. నీకే శోభన మగునులే? అటుల నొనర్తము. అని ఆమె ఎవరో! ఆమె ఆకూతమెట్టిదియో? తెలియఁగోరినాఁ డని యనుకొనవచ్చును. మనుష్యాంగనయా? గంధర్వాంగనయా యను భ్రాంతిలో.

ఈ రీతిని నింకను బలురీతుల నొక్క పద్యమున నర్థములు గోచరించుట కలదు. ఈ రీతిగఁ జమత్కృతిచేయు శక్తి ఆ పద్యమునఁగల పదములకుఁ గలదు. దానికొక పేరుపెట్టి పిలుచుటచే వ్యంజనాశక్తి యనిరి. స్ఫురించునర్థమునకు ధ్వనియని పేరిడిరి. ఇయ్యది కళకు అందునను సాహితీకళకు ముఖ్యమైనదనిరి.

పై రీతిని రసమునకు, (ధ్వనికి, వ్యంగ్యార్థమునకు తత్ర చర సప్రధాన ధ్వని) ఉద్దీపకములయిన అలంకారములు, సంఘటన, వృత్తులు, యమకాదులు, అభిధా మొదలగు శక్తులన్నియు నుఁటు ఆనందానుభూతి కాటంకము కలిగించకుండ నయథార్థవిషయములఁ దెల్పిననుసరే మైమఱపును కలిగింపఁజేయు కళానిర్మాత యుత్తమకళాస్రష్ట. పై రీతివాక్యమునంతను నిందించి నడిపించిన కళాకారున కగ్రస్థానమీయవలసినదే.

ప్రాచీనకాలమునఁ గళావిదులందఱు పై వర్గమునకుఁ జెందినవారే. వారు సమగ్రకావ్య నిర్మితిలో నుత్తమకళను రూపొందించిన రీతిగ నొక్కొక్క పద్యమునందే ముక్తకమునందే కళను రూపొందింపఁ గలరు,

శ్లో. తన్వీచారుపయోధరా సువదనా శ్యామా మనోహారిణీ
సీతా నిష్కరుణేన కేనచి దహో దేశాంతరా దాగతా
ఉత్పంగోచిత యూతయా రహితయా కిం జీవనాపేక్షయా
భిక్షో తే దయితాస్తి కిం నహి నహి ప్రాణప్రియా కుండికా.

శ్లో. ఆకృష్యాదావమందగ్రహ మలకభరం వక్త్రి మావర్జ్య వక్త్రే
కంఠే లగ్నః సుకంఠః పృథుని కుచతటే దత్తగాఢాంగసంగః
బద్ధాసక్తి ర్నితంబే పతతి చరణయో ర్యస్స తాదృక్ప్రియో మే
బాలే! లజ్జా నిరస్తా నహిసహి సరలే! చోలకః కిం ప్రవాకృత్.

రెండవ పద్యముమాట యటు లుంచి మొదటి పద్యము కరుణ,శృంగార, హాస్యముల కాలవాల మయి యున్నది. చేతశ్చమత్కృత్యాధాయకమై యున్నది ఇట్టి ముక్తకములలో సానందాభివ్యక్తి ఉన్నదని యెప్పిరి. అమరుక మిట్టి ముక్తములతో నిండియున్నయవి. తెలుఁగులో శ్రీనాథుఁ డిట్టి ముక్తరచనములో నాఱితేరినవాఁడు.

"ముద్దులగుమ్మ" "మీనవిలోచనంబులును" ఇటువంటి పద్యము సిట్టివే.

నాటకకళ — ఉపదేశకత

శ్రవ్యకావ్యముల మాట అటులుంచి దృశ్యకావ్యములలోనికి వచ్చిన ఈ కళకు నీతి, ఉపదేశకత యున్నపుడే సొంపుండును. సమాజము ఒప్పుకొనును. దృశ్యకావ్య మనినను నాటకకళ యనినను ఒక్కటియె. ఈ కళ కన్నికళలకంటెఁ బ్రాధాన్య మున్నయది. ప్రాధాన్యముండుటకుఁ గూడ నీ కళలో ననేక కళాసమ్మిశ్రణ ముండును. గీతము, నృత్యము, వాద్యము, నాట్యము, ఆలేఖ్యము, చిత్రకళ, ఇంచుమించు చతుష్షష్టి కళలలోనే కొన్నిటికో తక్క చాలవానికిఁ బ్రవేశ ముండియుండును. ఇన్ని కళలతో నిండియున్నది కావుననే ప్రేక్షకుని మనస్సు చట్టున నాకృష్టమయిపోవును. ఈ నాటక కళాద్వారా ఆవిష్కృత మగు విషయము మనుజుని వెంటనే మార్చివేయును. ప్రేక్షకుని మనస్సున ఈ కళలోఁ బ్రదర్శింపఁబడు విషయములు సంస్కారరూపముగ మాఱిపోవును. వానికిఁ గొన్ని జీవితాదర్శముల నేర్పాటుచేయును. నాటకము లింతగా మార్చివేయును మనుజుని. మాట మాఱును. భాషమాఱును. ఆచారవ్యవహారములు మాఱును. హావభావములు మాఱును. దుస్తులు మాఱును. చేష్టలు మాఱును, ఈ రీతిగా, గుణములో, క్రియలోఁ తుదికి జాతిలో మార్పువచ్చును. విగళితవేద్యాంతరమగుటకు, తన్మయతకు నీ కళ ప్రధానసాధనము.

ఈ యుగమునఁ బరీక్షచేసి చూచిన, చిన్నలు, పెద్దలు, యువకులు, యువతులు, అందఱు చలనచిత్రములను (సినీమాలను) జూచి మాఱిపోవుచుండిరి. మాటలో, పాటలో, దుస్తులలో, చేష్టలో, నడకలో, నడఁతలో, ఇవియు నవియు నేమి అన్ని విషయములలో మాఱిపోవు చుండిరి. ఎక్కడ విమర్శయైనను వీనినిగూర్చియే. ఏపత్రికనైనను జలన చిత్రవిమర్శనలతో నిండినవే. ఏ సమాజములలోఁ జూచినను, ఏసంఘములలోఁ జూచినను చలనచిత్ర సామ్యములే. పండిత పామరగోష్ఠియు సిద్ధానిని గూర్చియే. ఇంత తమ యాధిపత్యమును చలనచిత్రములు ఆబాలగోపాలమునకు సంపాదించిన వనినచో నాఁడు నేఁడు నాటక కళాప్రభావ మట్టిదే! వెనుకటి యీకళ, నీతి, ధర్మ సహకృతమై వానికిఁ బ్రాధాన్యము హెచ్చునిచ్చి, వాని యుపదేశము మానవ సౌభాగ్యమునకు, జగత్కల్యాణమునకుఁ దోడ్పడవలె నని సృజింపఁబడెడిది. అటులఁ దమ విధ్యుక్తమును నెఱవేర్చుకొనెడిది. ఈ యుగములో నీకళ సమాజోద్ధారమునకయి బయలుదేఱుచు, వెఱ్ఱితలలు పెట్టుకొని, తన యభివ్యక్తికిఁ బనికివచ్చు అంగవిషయకప్రాధాన్యమునే హెచ్చు చేసికొని, చెప్పనెంచిన ప్రధానవిషయము మఱగి, మ్రగ్గిపోవునంతటి యేమఱిపాటుతో వెలువడుచున్నది.

వెనుకటి కళాస్రష్టలు సమాజము మనల నెంతవఱకుఁ బరీక్షించి నిలువనీయఁగలదనియు, మన కెట్టిస్థానమిచ్చెదరో యనియు, నా కళా ప్రతిపాద్యాంశ మెంత జగత్కల్యాణదాయి యగు ననియు, ఆ సమాజము త్తమ సమాజము కావలె ననియు, నిరీక్షించి, పరీక్షించి, తమ కళను వెలువఱచుట కలదు. కాళిదా సనును,

శ్లో. ఆ పరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానం
బలవదపి శిక్షితానాం ఆత్మ న్యప్రత్యయం చేతః.

అని, ఈ రీతిగ ననేకులు సమాజోపయోగమునకుఁ దాము కళ సృజించి, సమాజములో నుత్తమకళాకారు లనిపించుకొనవలె నని ప్రయత్నించెడి వారు. తానాద్యకళాస్రష్టయయినను తెలుఁగురీతికి. "సత్సభాంతరసరసీవనంబున ముదంబొదరం గొనియాడి వేడుకకా" అను నన్నయకుఁగూడ

నదే భయము. సమాజమునకుఁ గళకు సంబంధ మనిన జీవితమునకుఁ గళకు సంబంధ మనినను దప్పు లేదు. జీవితము యుగయుగములనుండి క్రమవికాస మెట్లు పొందినదో యాజీవితలక్ష్యములను, జీవితానందమును దెలుపుచు కళకూడ మారుచు వచ్చినది.

కళ—జీవితవికాసము.

ఆదియుగములో (దీనికంటె ఐతిహాసికులే వేసుకొనియెదరు) సంఘజీవనము వారి లక్ష్యము. వారి యానందము. వారిసంఘము నొక యంకనముచే నంకితము గావించి వ్యవహరించుటయే. దానికయి వారు మృగ, సింహ, కరి, అశ్వాది చిహ్నములలో నేదియో యొకటి తమదిగాఁ జేసుకొని దానిని దమ కత్తులందుగాని, బాణములందుఁ గాని, ఇండ్లయందుఁ గాని ముద్రింపఁజేసి తమ నా గుర్తుచే నేర్పాటుచేసుకొనుటయే.

రెండవ యుగమువారు రాతిమీఁదఁ దమ మనస్సు నుపయోగించి, వానికిఁ గొన్ని మార్పులు రావించి, వానినిఁ దమ వానినిగా నొనర్చుకొని, వాని చిత్రణము (వానిని చెక్కడము) వలనవచ్చు ఆనందమునే కళానందముగా సంతోషించెడివారు. ఇయ్యది రాతియుగములోని కళ. లోహయుగము దాఁక నిట్లే వచ్చినది. రాతిమీఁద వచ్చిన మార్పు లన్నియు నీకళకుఁ దార్కాణములు.

మూఁడవ యుగములోఁ గొలఁది పరిశ్రమలమీఁదికి దృష్టి పడినది. వృత్తికళ ఉత్పత్తి అయినది. నేత మొదలయిన కొన్ని జీవితోపయోగ మగు, కళ ఉద్భవించినది. అజ్ఞాతావస్థలో నున్న కళకు, అవ్యక్తముగా నున్నకళకుఁ గొంచెము తల వాడసూపినది.

తరువాతి యుగములో వీరులు బయలుదేరిరి. వీరులను సుందరులనుగాఁ జేయుట, వారిని యుద్ధములోఁ గుశలులనుగాఁ జేయుటకయి యుపయోగపడు సాధనముల నిర్మించు వృత్తికళలలోనే ఈ యుగము కూడ నడచినది. ఇక్కడికి వచ్చునప్పటికి వ్యవహారోపయుక్తముగాఁ గళ విస్తృతిఁజెందినది యనవచ్చు. ఈ కళ తా నొనర్చు పనులలో

"నేర్పు" అను నిర్వచనములో సాగిపోయినవి. అంకనములో నేర్పు, రాతి చెక్కడములో నేర్పు లోహవస్తు నిర్మితిలో నేర్పు, వస్త్రనిర్మితిలో నేర్పు, యుద్ధములో నేర్పు, అను రీతిలోఁ గళ సాగినది.

మానవసమాజము తరువాత కల్పనాత్మకకళను నేర్చుకొనినది. పంచభూతములలో నొకదానిని దేవతగా భావించి వారిమీఁద శ్రద్ధా భక్తులనుంచి, ఫలదాత లగు దేవతలగా భావించి, సేవించి, ఆనంద మొందుచుండెడిది సమాజము. కళ విస్తృతి చెందినది. సంప్రదాయ ములు సంప్రదాయవిభేదములు, తాము దేవునిగా నారాధించు దారు మూర్తిని నిర్మించుట (చిత్రకళ- మూర్తికళ-) వారిని ప్రశంసించుట (గానకళ- సాహిత్యకళ-) జరిగి ఆయా కళల కుజ్జలోదాహరణములు దొరకినవి. ఈ యుగములో భక్తులు, ఉపాసకులు, నగు కళాకారులు బయలుదేరి తమ కల్పితవస్తువునకు రూప మిచ్చి, వారికి శక్తి నిచ్చి, వారివలన లాభములను బొందుచు నానందించు జీవితలక్ష్యములోనికి వచ్చిరి.

ఈ యుగమునకుఁ జెందియే ఋషులు దేవతలు, ఈవాలు వారి పైగంబరులు, బుద్ధుఁడు వారి క్షపణకులు, మొదలగు భేదములు వచ్చినవి. అనేక మతస్థులు లేచిరి. చీనావారి బుద్ధమూర్తి ఒకరీతి, ఏశియావారి బుద్ధమూర్తి ఒకలాగునఁ దయారయినవి. ఈ యుగము లో భావనా సహకృతకళ విస్తరించినది. పురాణము లీయుగమునకుఁ జెందినవి. ఖురాను వచ్చినది. దమ్మపదములు వ్యాపించినవి. ఈ యుగ ములో సృష్టమయిన కళ సంఘమును జాల మాన్పులోనికిఁ దీసుకొని రాఁగలిగినది. సంఘమునకుఁ జైతన్యము పోయినది. ఈ యుగమున లలితకళలు పూర్ణరూపు పొందినవి.

పై యుగములన్నిటిని గప్పి "Realistic Art" వెలువజుచు చుంటిమని ప్రకృతివాదులగు కళాకారులు కళాస్థానమును ఆక్రమించిరి. నక్షత్రరత్నములు పొదివిన నీభావిదానము కలిగి, శుభ్రజ్యోత్స్న పటావృత మయి, శుచితర సూర్యరశ్మిపాతము గల విశ్వవిస్తృత రంగ

మంచము, వివిధములగు రంగులతో నిండిన సహస్రపరిమితదృశ్యవిరాజమాన శైలశిఖరములు, సముద్రతరంగమృదంగ ఘోషము, అరణ్యశిరస్సులమీఁద నీడ మెండలఁ గలిగించు కేయింబవళ్ళు, పక్షమొక్కటి లేచుట, రెండవది పడిపోవుట; ఋతువొకటి యుద్భవము, ఒకటి లయము, అనెడి వింతవింతలు విలక్షణము లయిన తెఱలు కలిగి, గొప్ప ఇంద్రజాలికశక్తితోఁ గూడి, పూలతో వికసించుచు, కేసరపరాగములతో మేపూఁతఁ బూసికొని, విచిత్రరంజకద్రవ్యరంజిత ఘనావృతదిశావస్త్రములుఁ గూర్చుకొని, దిక్కులలో నుండి వంగితొంగి చూచుచు, సెలయేళ్లలోఁ బాడుచు, అంధకారములో నంతర్ధానము నందుచు, దినరశ్మిలో బయటపడుచు. హాస్యము- రోదనము; సంయోగము- వియోగము; మానము- ఈక్షణము కలిగి, సర్వద్వంద్వాశ్రితమై; నవరసములనాశ్రయించి, మధురభీషణకల రవములఁ జేయుచు, జీవజంతుస్వభావాభినయముల నొనర్చుచున్న ఈ ప్రకృతి, ఈ విశ్వము, ఒక ఈశ్వరీయ యథార్థసాహిత్యము. సరససాహిత్యము, వాస్తవనాటకము. ఇది ఒక సంపూర్ణకళ. వీనివి ఉన్నవి ఉన్నట్లు చిత్రించువాఁ డుత్తమకళాకారుఁ డనిపించుకొనును. ఇతఁడు "Initatiue Art" "కనుకరణకళ"ను సృజింపవలసినవాఁడు కాఁడు. వీరు లేని దానిని గల్పించరు. వీరు కళాసృష్టికయి ప్రకృతిని ప్రేమింతురు. ఉపాసింతురు. ప్రకృతిధ్యానములో, ప్రకృతిసమాలోచనలో నిమగ్నులయి ఉన్నది ఉన్నట్లు చెప్పికొనుచు, చిత్రించుచు నానందించెదరు. వారికిఁ బ్రకృతి నిరీక్షణమువలననె, బకృతిచిత్రణమువలననే, ఆనందించు శక్తి ఈశ్వరుఁ డిచ్చినాఁడు. పకృతివస్తువును ధ్యానించుచు, ఆకృతికిఁ జెందిన ప్రకృతి గతమగు ననేక వస్తువుల సామ్యమును ఆస్థలమునకుఁ దెచ్చుకొని ఆనంద మందెదరు.

పుష్పకములో నుండి రాముఁడు సీతకుఁ బ్రకృతిరామణీయకత నిర్దేశించి చూపును. ఒక్క గంగను అనేక విధములుగాఁ జూడ మనెను.

శ్లో. క్వచి ప్రభాలేపిభి రింద్రనీలై ర్ముక్తామయీ యష్టి రివానువిద్ధా
అన్యత్ర మాలాసితపంకజానాం ఇందీవరై రుత్ఖచితాంతరేవ

క్వచి త్ఖగానాం ప్రియ మానసానాం కాదంబసంసర్గవతీవ పంక్తిః
అన్యత్ర కారాగురుదత్తపత్రా భక్తి ర్భువ శ్చందనకల్పితేవ.
క్వచి త్ప్రభా చాంద్రమసీ తమోభిః ఛాయావిలీనైః శబలీకృతేవ
అన్యత్ర శుభ్రా శరదభ్రలేఖా రంధ్రే ష్వివాలక్ష్య నభః ప్రదేశా
క్వచి చ్చ కృష్ణోరగభూషణేవ భస్మాంగరాగా తను రీశ్వరస్య
పశ్యానవద్యాంగి! విభాతిగంగా భిన్నప్రవాహా యమునాతరంగైః
రఘు, 13 సర్గ.

ఇదియొకరీతి ప్రకృతిచిత్రణము. ఇంకొకరీతిగ.

శ్లో. సుభగసలిలావగాహాః పాటల సంసర్గ సురభివనవాతాః
ప్రచ్ఛాయసులభనిద్రాః దివసాః పరిణామరమణీయాః। శాకుంతళం

అనినాఁడు కాళిదాసు. ఇటువంటిదే కళాపూర్ణోదయమున,

ఉ. అందముగాఁగ నంతట ఘనాగమకాలము చాల నొప్పె ని
ర్నిందిత గంధబంధనవనీపవనీ కమనీభవన్నిజేం
దిందిర బృందము క్తనలినీ మలినీభవనాగతా రసా
స్పందజుగుప్సతద్ఘనయశాయితయాయిమరాళజాలమై.

షడృతువర్ణనము ఇట్టిదే. ఈ క్రింది పద్యములు కల్పనతో నిండిన ప్రకృతిచిత్రణము.

చ. ఒనర హిమావగుంఠనము లూడ్చి తెమల్చిన పత్రభంగముల్
చన నసియాడుచుం మొగడ చన్నులు పల్లవపాణిఁ గప్పు నూ
తనలతికాలతాంగుల నుదారగతిం జలివాపి నెయ్యపుం
బెనకువ నేర్పె దక్షిణసమీరణుఁడొయ్యనఁ దావు లంటుచున్.

చ. చలితలతాంతకాంతి యను చందురుకావి చెఱంగుదాఁటి స
మ్మిళిత పయోవిలాసముల మీఁటిన విచ్చు ఫలస్తనాగ్రముల్
వెలువడఁగప్పెఁ దత్క్షణమ వేల్లిత దోహదధూపధూమకం,
తలములు విప్పి దాడిమలతాలలితాంగి చెంగటన్. వసు. చ.

ప్రకృతికళకివి మూర్ధాభిషిక్తోదాహరణములు కాకపోవచ్చును గాని ప్రకృతి రామణీయకతకుఁ జెందిన వనుకొనియెదను.

వీరు తమ కళ నగ్నముగా ఆ విషకృత మయినను మాకు హాని యేమియు లే దనియెదరు. సమాజము పతన మయినను వృద్ధ చెందినను మా కవసరము లే దనియెదరు. మావలె మీరుకూడ నానందించ మని యెదరు.

ఈ యుగమునకుఁ జెందిన కళ లటులుండ కళ ఆదర్శ, మయి యుండవలె నను వారు భయలు దేరిరి. ఈయుగములు రెండు నొకదాని నొకటి తప్పించవలయు నని యున్నవి. ఈయుగపరివర్తనము ముందుకు నడచునో వెనుకకు వెడలునో యనునది యనిర్వాచనీయము. ఈ కాల ము రచనాత్మక కాలము. ఈ రచనాత్మక కళాకాలములోనే మానవుఁడు పూర్ణ వ్యక్తిత్వముకొఱకుఁ బ్రయత్నించుచున్నాఁడు. ఈ కళాకారుఁడు తన వ్యక్తిత్వములోఁ బరిపూర్ణత నంది సమాజమును ముందుకు నడి పింతమని చూచుచున్నాఁడు. ఈకాలములోఁ గళాకారుఁడు సమాజము నకుఁ దనకు, తన జీవితమునకు సమాజమునకు ఈ రెంటికినిఁ గళకు ఘనిష్ఠసంబంధ మున్నది యని గ్రహించి తాను సృష్టించుకళ సమాజోప యోగి యనవలెనని, వేధపడుచున్నాఁడు, తన రచనకు సమాజముద్ర పడవలెనని యున్నాఁడు. కాని ఈయుగములో కళ ఎంత కన్నులు తెఱ చినదో, ఎంత ఉన్నతికి రావలెననుకునుచున్నదో, అంత అంధకార ములో మునిఁగిపోవుచున్నది. అంత అధఃపతిత మయిపోవుచున్నది.

## కళ—శృంగారరసము.

ఇప్పుడు సృష్టమగు కళ శృంగారరసప్రధాన మయినది. (బా హ్యేంద్రియాకర్ష కము. తుచ్ఛభోగేచ్ఛావివర్ధకము) అనఁగా మను జుని అన్నిరీతుల విరసునిగా నొనరించుచున్నది. వెనుకటి ప్రసిద్ధకళా కారుల కళలో శృంగారరస మత్యంత ముత్కృష్టమయినదని యనుట లేదు. కళ శృంగారరసముతో నుండుట మంచిదే. శృంగారరసముతో నున్న కావుననే మనుజుఁడు తొందరగా నాకర్షింపఁబడుచున్నాఁడు. ఆకృష్టికి, అభిముఖీకృతికి శృంగారరసము అవసర మనినాఁడు ధ్వనికర్త ఆనందవర్ధనుఁడు.

శ్లో. వినేయా నున్ముఖీ కర్తుం కావ్యశోభార్థ మేవ వా
తద్విరుద్ధరసస్పర్శః తదంగానాం న దుష్యతి.

శృంగారము నియతానుభూతివిషయ మందటకు, అది విరుద్ధరసములలో ను నింపవచ్చును. వానితోఁగూడిన నాటకాదులు తమ ముఖ్యోద్దేశ్య మగు నీతిని బోధించునవి కావచ్చును. శృంగార ముండిన ప్రతిపాద్యము సరసముగా నుండును.

శృంగారచే త్కవిః కావ్యే సర్వం రసమయం జగత్
స ఏవ వీతరాగశ్చే న్నీరసం పరివర్తతే.

అని కదా ఆనందవర్ధనుఁడు శృంగారమును హెచ్చుగా వర్ణించిన కళా స్రష్ట హెచ్చునీతిని బోధించి శృంగారమును మఱచిపోయి ఉపదిష్ట మయిన నీతి నాశ్రయించి మనజుని సదాచారిగా మార్చఁగలిగినంతటి శక్తి ఉండినపుడే కళలో శృంగారము ఉంచవలె నని పై నంటున్నాఁడు. ఇంకొక విధమును శృంగారరసము ఉంచుట కలదు. చేతకానివాఁడు కావ్యకళను శృంగారరసముతోనే నింపును. అంతేయు శృంగారరసము తో నింపి సృజింపఁబడిన కళ సత్పథములోనికి దింపుటకు బదులు దుష్ప థములోనికి మార్చును. అటుల మార్చినది కళకాదేమో.

శృంగారమును వర్ణింపని మహాకవులు లేకపోలేదు. కళాకారు లున్నారు. వారుత్తమతరగతికిఁ జెందియున్నారు. వారు సాహితీ రంగములోఁ బ్రవేశించి కళ కట్టించిరి. వారు తమ కావ్యమునకు స్థాయి భావముగా శోకమును (ఏడ్పును, రోదనమును) స్థాయిభావముగాఁ దీసుకొనినను, ఏడుపు తా మేడ్చినను, సామాజికులును ఏడ్పులోఁగూడ నేడుచుచుంటి మను మనోవేదన లేకుండ, పైకది ఏడుపైనను దానిలో నానందము ననుభవింపఁజేసిరి. ఏడుపే అన్ని రసముల కాలవాలమైన దన్నంత వెఱ్ఱులెత్తించిరి ఆ ఆనందానుభూతిలో. కరుణలో అనుభూతి విషయ మానంద మనిరి. తత్తచ్చేష్టానుగుణా స్మరణము లుద్దీపములు. పైకి దుఃఖమయినను, కొంతదుఃఖ మనుభూతివిషయమయినను శీతకాల ములో కర్పూరమిశ్రితచందనరాగమువలె అనందానుభవమే ఉత్కటు

# ఏకాదశ స్కంధము

## హరిభట్టారకుఁడు

క. ధారుణిఁ బెక్కగు నాయువ
తారంబులు గలవు నరుఁడు దన చిత్తములో
నే రూపమంద రుచి గల
దా రూపము దలఁప వలయు నభ్యాసమునన్.

ఆ. పరమ యోగివరులు పరతత్త్వ మైనట్టి
నన్ను విమల చిత్తనలినమందుఁ
దనివి లేక యేకతంబుగాఁ దలఁచినఁ
బొందరెచట జన్మముల మునీంద్ర !

వ. మరియు యోగంబునకు నష్టాదశధారణావిశేషంబులు గలవు. అం దెనిమిది మత్ప్రధానంబులై గుణహేతువు లగు, అణిమయు, మహిమయు, లఘిమయు, నింద్రియప్రాప్తియు, శ్రుతదృష్టంబులయందుఁ బ్రకాశమగు శక్తియుఁ బ్రేరణంబు నీశత్వంబు ననాఁబరగు నీ యెనిమిదియును యోగసిద్ధకారణంబు లని యోగశాస్త్రజ్ఞులు చెప్పుదురు. ఇంద్రియంబుల స్వేచ్ఛావిహారంబు మాన్చి, మనంబునం గూర్చి, మనంబు నాత్మయందుఁ దగులం జేసి యాత్మ నాత్మతోఁ గూర్చి బ్రహ్మమార్గంబున శరీరత్యాగంబు సేయవలయు. యోగసిద్ధిపారగుఁ డైన మానవోత్తమునకు నితర ధర్మానుసంధానంబు వలదు. తొల్లి కురుపాండవ యుద్ధానంతరమున భీష్ముండు శరతల్పగతుం డై యోగధారణారూపం బడిగిన నతనికి నేఁజెప్పిన రూపలక్షణంబు చెప్పెద. చరాచరరూపంబైన జగంబులందుఁ దదాకారంబు దాల్చి భూతంబులయం దాధారభూతం బై సూక్ష్మంబులయందు జీవుండును, దుర్జయంబులయందు మనువును, దేవర్షులయందు నారదుండును, ధేనుగణంబులయందుఁ గామధేనువును, సిద్ధులయందుఁ గపిలుండును, పతగంబులయందు సుపర్ణుండును, బ్రహ్మలయందు దక్షుండును, పితృగణంబులయం దర్యముండును,

దైత్యులయందుఁ బ్రహ్లాదుండును, నక్షత్రౌషధులయందుఁ గళానిధియును, గజంబులయం దైరావతంబును, దురంగంబులయం దుచ్చైశ్శ్రవంబును, దర్వీకరంబులయందు వాసుకియును, మృగంబులయందు సింహంబును, నాశ్రమంబులయందు యత్యాశ్రమంబును, వర్ణంబులయం దకారంబును, నదులయందు గంగయు, సాగరంబులయందు క్షీరసాగరంబును, ఆయుధంబులయందు ధనువును, గిరులయందు మేరుశైలంబును, వనస్పతులయం దశ్వత్థంబును, నోషధులయందు యవధాన్యంబును, యజ్ఞంబులయందు బ్రహ్మయజ్ఞంబును, వ్రతంబులయం దహింసయు, యోగంబులం దాత్మసంరోధంబును, స్త్రీలయందు శతరూపయు, మునులయందు నారాయణుండును, యుగములందుఁ గృతయుగంబును, సిద్ధులయందు దేవళుండును, ధర్మంబులయందు సన్న్యాసంబును, గోప్యంబులయందు సత్యంబును ఋతువులయందు వసంతంబును, మాసంబులయందు మార్గశీర్షమాసంబును, నక్షత్రంబులయం దభిజిన్నక్షత్రమును, భగవదాకారంబులయందు వాసుదేవుండును, గింపురుషులయం దాంజనేయుండును, జయశీలంబు లగు నాయుధములయందు సుదర్శనంబును, రత్నంబులయందుఁ బద్మరాగంబును, దానంబులయం దన్నదానంబును, తిథులయం దేకాదశియును, నీతులయందు వైష్ణవుండును నైవర్తింతు. ఇవి మద్విభూతులుగా నెఱుంగుము. మరియు, నింక జగంబులయందు నే వస్తువులం దెయ్యవి మించు చూపు నవి మద్రూపంబులుగా నెఱుంగవలె నని పుండరీకాక్షుం డానతిచ్చిన విప్రవరుం డిట్లనియె.

క. అర్ణవరశనానాయక
వర్ణితసుగుణాభిరామ వైభవ! నాకుఁ
వర్ణాశ్రమ ధర్మంబులు
నిర్ణయముగ నానతిమ్ము నిత్యచరిత్రా!

వ. అని పలికిన సర్వంసహా సురేంద్రునకు నారాయణుం డిట్లనియె.

సీ. కృతయుగంబందు సత్కృతుఁడనై
హంసరూపంబున నలరియుందు
ఆ యుగంబున ధర్మ మంతయు వృషరూప
మున వృద్ధిఁబొందును దినదినంబు
త్రేతాయుగంబునఁ జాతురి నా ధర్మ
మంతయుఁ బాదత్రయమునఁ దనరు
ద్వాపరంబందుఁ బాదద్వయంబున నడి
వర్తించు నెచ్చోట వరుసచెడక.

గీ. బలిమి నొందక కలియుగంబందుఁ బాద
మాత్రమున నుండి యదియును మాసిపోవు
నీ విధంబున ధర్మంబు నేపు దప్పి
యుగయుగంబున వర్తించు నుర్విమీఁద.

సీ. ఆరయ వక్త్రిబాహూరుపాదములందు
రమణ విప్రాది వర్ణములు పుట్టె
యజ్ఞంబు సత్య మధ్యయనంబు శమమును
విప్రధర్మంబులై వెలయుచుండు
దానమాస్తిక్యంబు దయయును శౌర్యంబు
క్షత్రిధర్మంబులై జరుగుచుండు
నియమంబు శాంతి వాణిజ్య గోరక్షణా
దులు వైశ్యధర్మముల్ తెలిసిచూడ.

గీ. విప్రసేవయు దానంబు విష్ణుభక్తి
స్వామికార్యంబు మాయఁగాఁ జరుపకుంట
జయము చేఁగొంట శత్రులసమయఁజేయు
టరయ నివి శూద్రధర్మంబు లన్నిదిశల.

ఆ. హింసచేయకుంట హితవాచరించుట
దానగుణము శాంతదయయుఁ గలుగు
టనృతమాడకుంట హర్షంబునొందుట
వరుస నివియ సర్వవర్ణసమము.

వ. మరియు నందు బ్రహ్మవర్ణంబుల బ్రహ్మచారి గృహి వానప్రస్థయత్యాశ్రమభేదంబుల నాల్గువిధంబు లయ్యె. నా యాశ్రమంబులయందు యథాకాలవిహితోపనయనాది సంస్కారసంస్కృతత్వంబును, మౌంజీకృష్ణాజినోపవీతదండకమండలుధారణంబును, నింద్రియజయంబును, గురుశుశ్రూషణంబును, నిత్యశుచిత్వంబును, భిక్షాచరణంబును, స్వాధ్యాయపఠనంబును, సర్వసమత్వంబును, నాఁ దగు నివి బ్రహ్మచారి ధర్మంబులు. పుణ్యతీర్థస్నానంబును, భూతదయయును, బ్రహ్మయజ్ఞంబును, దేవర్షిపితృతర్పణంబును, నగ్నిహోత్రంబును, దర్శపౌర్ణమాసియు, నౌపాసనవైశ్వదేవాది నిత్యక్రియాచరణంబును, శ్రాద్ధనియమంబును, దేవతారాధనంబును, స్వభార్యయందు ఋతుకాలగమనంబును, దానంబును, బ్రతిగ్రహంబును, నతిథిపూజనంబును, నివి గృహస్థధర్మంబులై పర్యవసించు. శిలోంఛధాన్య సంగ్రహంబును, జటావల్కల ధారణంబును, నిత్యనైమిత్తిక కర్మాచరణంబును, కామ్యనిషిద్ధ కర్మ పరిత్యాగంబును, భూతదయయును, సుఖదుఃఖ సమత్వంబును, మదీయ సేవా నియమంబును, వానప్రస్థధర్మంబు లనాఁబరగు. కౌపీనాజిన దండకమండలుధారణంబును భిక్షాచరణంబును, బ్రహ్మజ్ఞానంబును, బ్రహ్మచర్యంబును, బరమాత్మదర్శనంబును, బుత్రదారాదిస్నేహ విసర్జనంబును, రిపుషడ్వర్గజయంబును, బుణ్యతీర్థాశ్రమ పర్యటనంబును, మన్నామస్మరణంబును, మదాకృతి ధ్యానంబును, సర్వకర్మ పరిత్యాగంబును నివి యతి ధర్మంబు లనాఁబరగు. నీ యాశ్రమముల యందుఁ జతుర్థాశ్రమంబు నా స్వరూపంబుగా నెఱుంగుము. అట్టి యత్యాశ్రమస్థుండు పుత్రదారధనాదులతోడి సంగమంబు పరిత్యజించి గ్రీష్మకాలంబునం బంచాగ్ని

మధ్యంబందును, వర్షాకాలంబున వర్షంబుల యందును, శిశిరంబునఁ గంఠదఘ్నసలిలంబులయందును దపము సేయుచుఁ జాతుర్మాస్యాదులయందుఁ గాలపక్వపదార్థంబు లనుభవించుచు నాత్మారోపితాగ్ని సమేతుండై నఖచ్ఛేదనంబు పరిత్యజించి యనిందిత గృహంబుల యందు భిక్షాటనంబు సేయుచు,దృష్టిపూతం బగు మార్గంబున గమనం బాచరింపుచు, వస్త్రపూత జలపానంబు సేయుచు, సత్యపూతం బగు వచనంబులు పల్కుచు,రిపుషడ్వర్గ జయంబు గల్గి, విరక్తుండై, యేకాంతసమాసీనుండై, మదాకృతిధ్యానసుఖం బెఱింగి, యెఱుక గలిగియును బాలుని చందంబునఁ గ్రీడించుచు, కుశలుండయ్యును జడునిమాడ్కి సంచరించుచు,జ్ఞానంబు గల్గియు నున్మత్తుని రీతిఁ బ్రవర్తించుచుఁ బాషండ సంగమంబు పరిత్యజించి, పశువు క్రియంబునఁ బరులయందు వైరంబు సేయక ప్రాణధారణ మాత్రంబు నీరసాహారంబు భుజయింపుచు, దుఃఖోదకంబులైన కామంబుల యందు సంజాత వైరాగ్యుండై, గురుసేవాపరిజ్ఞాన తత్త్వసారుండై, మద్భక్తి సంయుక్తుండై మోక్షమార్గంబు చింతించుచు న౦పవలయు.

క. ఆ యతివరుఁ డీ జగమును
మాయారూపం బటంచు మదిఁ దలఁచుచు న
న్యాయంబు విడిచి దేహ మ
పాయం బని యెఱుఁగవలయు బ్రహ్మవిధిజ్ఞా.

క. జ్ఞానం బెక్కువ నరునకు
జ్ఞానంబున ముక్తి గలుగు జ్ఞానముచే దు
ర్జ్ఞానంబు మాసిపోవును
జ్ఞానంబునఁ గీడు గలదె జగములలోనన్.

గీ. ఆత్మ యను పేరఁ దనరుచున్నట్టి యనల
మందు నధ్యాత్మ యను నాజ్య మమర వేల్చి
జ్ఞానయజ్ఞంబు చేసిన జనుల కెల్ల
కలుగు మోక్షంబు నిక్క మీ కథ మునీంద్ర.

చ. సమరములోన బాంధవుని
జక్కఁగఁజేసి యమాత్మజుండు చి
త్తమున విరక్తి కల్గి పరి
తాపము నొందుచు నన్ను మోక్ష ధ
ర్మములను భక్తితో నడుగఁ
గ్రమ్మఱఁ జెప్పినయట్టి మోక్ష ధ
ర్మములను నీకుఁ జెప్పెద ధ
రామర వీనులు హర్ష మందఁగన్

క. అజ్ఞాన ముడిగి కేవల
సుజ్ఞానము బొడము దాక సువిధిజ్ఞుండై
యజ్ఞాదికర్మసమితి మ
దాజ్ఞను జరుపంగవలయు నఫలాశుండై.

శా. ఆ యజ్ఞాదులు చేసి తత్ఫలముపై
నాసక్తి వర్జించి మ
న్మాయామోహితమైన యీ జగములో
మధ్యస్థుఁడై కర్మ మా
ర్గాయాసంబు పరిత్యజించి నరుఁ
డత్యంతాత్మ యోగంబునన్
గాయం బేర్పడకుండఁ దన్నవలయున్
సంసార బాహ్యస్థుఁడై.

గీ. స్నాన యాగ దాన తర్పణంబులు మాని
పుత్రదారవిత్తబుద్ధి మాని
గర్వ ముడిగి సర్వకర్మముల్ జరుపక
తలఁపులోన నన్ను దలఁపవలయు.

వ. అని, యివ్విధంబునం జక్రి నిర్వక్రి సమ్యగ్జ్ఞానప్రకాశకరంబు లైన వచనంబులు పల్కిన ధరామరముఖ్యుండు సంతసించి యి ట్లనియె.

క. తెలియనివి గొన్నిమాటలు
గల వడిగెద భువనవంద్య కళ్యాణనము
జ్జ్వల రూప నాకుఁ గ్రమ్మఱఁ
దెలుపుము చిత్తంబులోనఁ దెలివి తలిర్పన్.

సీ. యమ మెన్నివిధములు శమ మన నెయ్యది
దమ మేది ధృతి యేది దాన మేది
తప మే విధంబు సత్యత్యాగ ధన యజ్ఞ
దక్షిణావిద్యలుఁ దనర నెవ్వి
లక్ష్మియు సుఖ దుఃఖ లజ్జ లనా నెవ్వి
పండితమూర్ఖు లే పగిదివారు
మార్గోత్పథంబుల మహిమ లే విధములు
స్వర్గనారకముల జాడ లెవ్వి.

గీ. బంధు లెవ్వారు గృహమేధి పరగ నాఢ్యుఁ
డనఁగ నెవ్వఁడు ఘన దరిద్రాంధకార
సహితుఁ డెవ్వఁడు నాథుఁ డే జాడవాఁడు
దీనమందార యివి నాకు నానతిమ్ము.

వ. అనిన విప్రవరునకు గోపికావల్లభుం డి ట్లనియె.

క. నీ వడిగిన యీ ప్రశ్నల
కే వంకను నవతు లేద యీ భావము నీ
భావంబున కొడఁబడ సం
భావన నెఱిఁగింతు నీకుఁ బటువాక్ప్రౌఢిన్.

వ. ఆకర్ణింపు మది యె ట్లనిన నహింసయు, సత్యంబును, కార్యరాహిత్యంబును, అసంగమంబును, అసంచయంబును, ఆస్తిక్యంబును, బ్రహ్మచర్యంబును, మౌనంబును, స్థైర్యంబును, క్షమాభయంబు

లును, శౌచంబును, జపంబును, తపంబును, హోమంబును, అతిథి సత్కారంబును, మదర్చనంబును, తీర్థస్నానంబును, పరమయోజన కర్తృత్వంబును, తుష్టియు, ఆచార్యసేవనంబును నివి యమం బనం బరగు. సర్వేంద్రియనిగ్రహంబు శమంబు. శత్రుమిత్రాదుల యందు మాధ్యస్థ్యంబు భజియించుట దమంబు. జిహ్వోపస్థ జయంబు ధృతి. మూఢమతులకు జ్ఞానోపదేశంబు చేయుట దానంబు. కామత్యాగంబు తపంబు. సమదర్శనత్వము సత్యంబు, కర్మాసంగ మంబు త్యాగంబు, వైష్ణవధర్మార్జనం బిష్టధనంబు, మల్లక్షణం బెఱుంగుట యజ్ఞంబు, సూక్ష్మజ్ఞానం బడుగుట దక్షిణ, ప్రాణా యామంబును, నిశ్చలభక్తి, విద్యలనఁ దనరు శమాది గుణంబులు లక్ష్మి, ఆశారాహిత్యంబు సుఖంబు, కామసుఖాపేక్ష నిశ్చయం బగు దుఃఖము, బోధను వికర్మమంబులయందు ప్రవర్తనంబు మాన్పుట లజ్జ, బంధమోక్షణమార్గజ్ఞుండు పండితుండు, దేహాదుల యం దహంకారంబు బొందినవాఁడు మూర్ఖుఁడు, మద్భక్తిమార్గంబు చిత్త విక్షేపం బుత్పథంబు, సత్త్వగుణోదయంబు స్వర్గంబు, తమో గుణోదయంబు నరకంబు, గురువు బంధువుం డనాఁ బరగు, నిజ శరీ రంబు గృహంబు, గుణాఢ్యుం డాఢ్యుండు, తుష్టిలేని యతండు దరిద్రుండు, సర్వసంగ విరక్తుం డీశ్వరుండు, అని ప్రశ్నోత్తరంబు లిచ్చి వాసుదేవుండు మరియు నిట్లనియె.

---

# ఆంధ్రసాహిత్యపరిషత్తు